# విషయసూచిక

## అయోధ్యాకాండము

| సర్గము. | | పుట. |
|---|---|---|

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర

# వచనరామాయణము

## అయోధ్యాకాండము

### 1-వ సర్గము

శ్రీరాముని గుణముల వర్ణనము

శ్లో. గచ్ఛతా మాతులకులం భరతేన తదాఽనఘః,
శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నో నీతః ప్రీతి పురస్కృతః.

భరతుఁడు మేనమామ యింటికిఁ బోవుచుఁ దాను తన మేనమామ యింట సౌఖ్యముల నన్నింటి ననుభవించినను, తనకుఁ బ్రియుఁడగు శత్రుఘ్నుఁడు తనతోపాటు లేనియెడల నవి తనకిష్టముగా నుండవని తలఁచి శత్రుఘ్నుని రమ్మని పిలువఁగా, శత్రుఘ్నుఁడు తల్లిదండ్రులను విడిచి యుండవలెనన్న వ్యసనములేనివాఁడై, భరతునందలి ప్రేమచేతను, భక్తిచేతను నతని నెడఁబాసి యుండఁజాలక యతనిని వెంబడించి పోయెను. భరతుఁడు శత్రుఘ్నునితోఁగూడఁ దన మేనమామయూరికిఁ బోయి, లెక్కలేని గుణములుగల తన మేనమామచేఁ బుత్రస్నేహముతో, బుజ్జగింపఁబడుచు, సకలోపచారముల నొందుచు నచ్చట నుండెను. ఆ శూరులయిన భరతశత్రుఘ్నుల కచ్చట నేమియుఁ గొఱఁతలేక సమస్త వస్తువులతోఁ దృప్తిపఱచుచున్నను వారు ముదుసలియైన తమ తండ్రిని విడిచివచ్చితిమే యని సర్వదా తమ తండ్రినీ తలఁచుచుండిరి. అట్లే పరాక్రమశాలియగు దశరథమహారాజును రామలక్ష్మణులు తనకడనున్నను, ఇంద్రుని, వరుణునింబోలు తన పుత్రులగు భరతశత్రుఘ్నులు దేశాం

తరమునకుఁ బోయియున్నందున, అచ్చట వారెట్లున్నారో యను చింత గలిగి యుండెను. ఆ దశరథునికిఁ బురుషశ్రేష్ఠులగు నలువురు కుమారు లును, తనశరీరమునుండి బయలువెడలిన నాలుగుబాహువులవలె మిక్కిలి ప్రియులై యుండిరి. అట్లున్నను, సకల భూతములలోపలను విశేష గుణములుగల బ్రహ్మదేవుఁడు విష్ణువునకుఁ బ్రియుఁడైన యట్లు, ఆ నల్వురిలోపలను శ్రేష్ఠములగు సకలగుణములుగల రాముఁ డమ్మహారాజు నకు మిక్కిలి సంతసము గొల్పువాఁడుగ నుండెను. అతఁడు లోకకంటకుం డైన రావణుని వధింపఁగోరి, దేవతలు ప్రార్థింపఁగా భూలోకమున నవత రించిన పురాణపురుషుఁడగు విష్ణుమూర్తియేగదా! అట్టి యమితతేజ శ్శాలియగు నాకుమారునిచే కౌసల్య వజ్రపాణియైన దేవేంద్రునిచే నదితి వలె మిక్కిలి విరాజిల్లెను.

ఆ రాముఁడు సౌందర్యముతోఁ గూడినవాఁడును, పరాక్రమ శాలియు, అసూయలేనివాఁడును, గుణములచేత దశరథునిఁ బోలు వాఁడునునై, పుడమియం దిట్టి సుపుత్త్రుఁడు మఱొక్కఁడు లేఁడనిపించు కొన్నవాఁడయ్యెను. మఱియు, అతఁడు తిన్నని స్వభావముగలవాఁడు. ఎప్పుడు నెమ్మదిగా మాటాడువాఁడు. ఎవరైనను తన్నుఁగూర్చి నిష్ఠు రపుమాట లాడినను, బదులు సెప్పువాఁడుగాఁడు. ఎవరైనను దనకుఁ గొంచె ముపకారము చేసినను, దానినే గొప్పగఁదలఁచి సంతసించు వాఁడు. తాను మనోనిగ్రహము గలవాఁ డగుటచే నొరులు తనకు నూఱుపకారములు చేసినను, వానిని మనంబునఁదలఁపఁడు. ఆ రాముఁడు నడతయందు వృద్ధులయినవారితోను, జ్ఞానమునందు వృద్ధులగువారి తోను, వయస్సునందు వృద్ధులగువారితోను దాను విలువిద్దె నేర్చుకొను నప్పుడు సైతము శాస్త్రరహస్యములను ముచ్చటించుచుండెడివాఁడు. అతఁడు విశేషబుద్ధి గలవాఁడు. ఇంపుగా మాటాడువాఁడు. ఒకరు మాట్లాడింపకమునుపే యల్పులతోనైని తాను ముందుగా మాట్లాడు వాఁడు. ప్రియభాషి. మగఁటిమి గలవాఁడు; అట్లు మగఁటిమి గలిగి యున్నను దా నందఱికంటెను బరాక్రమశాలియని గర్వపడువాఁడు గాఁడు. అసత్య మాడనివాఁడు. విద్వాంసుఁడు. పెద్దలను బూజించు వాఁడు. ప్రజలచేఁ గోరఁబడువాఁడు. తానును ప్రజల ననురాగముతోఁ

జూచువాఁడు; దయాళువు; కోపము నణంచుకొన్నవాఁడు; బ్రాహ్మణభక్తి
గలవాఁడు; దీనులను గరుణించువాఁడు; సకలధర్మముల నెఱింగినవాఁడు;
సర్వకాలములందు నియమంబుఁ దప్పనివాఁడు; నిత్యపరిశుద్ధుఁడు; తన
క్షత్రియకులమునకుఁ దగిన బుద్ధి గలవాఁడు; క్షత్రియజాతి ధర్మమునే
తనకు ముఖ్యముగా నెంచువాఁడు; గొప్పకీర్తి నార్జించి దానితో మహ
త్తరమైన స్వర్గఫలముగల్గునని తలఁచువాఁడు. అతఁడు కీడుపనులలో
మనస్సు జొరనీయఁడు, న్యాయవిరుద్ధమైన ముచ్చటలలోఁ బ్రవే
శింపఁడు; బృహస్పతివలెఁ బైపైన యుక్తులు చెప్పువాఁడు; ఆరోగ్యము
గలవాఁడు; ప్రాయపువాఁడు; యుక్తియుక్తముగ మాటాడువాఁడు;
పుష్టిగలవాఁడు; దేశకాలముల నెఱిఁగి, దగినట్లు పనులు చేయఁగల
వాఁడు; చూచినంతమాత్రముననే పురుషులబలమును దెలిసికొను
వాఁడు; అపకారులకైనను నుపకారముచేయు సజ్జనుఁడు; ఆరాజ
పుత్రుఁడు మేటిగుణంబులతోఁగూడి, జనులయొక్క వెలుపటి ప్రాణమో
యనఁదగినట్లు తనగుణములచేఁ బ్రియుఁడైయుండువాఁడు; సకలవిద్యల
నభ్యసించి, పూర్తియయిన పిదప స్నాతకవ్రతములను జరిపినవాఁడు;
వేదవేదాంగవేత్త; విలువిద్దెయందుఁ దండ్రికంటె మేలైనవాఁడు;
సమస్తశుభములకు జన్మభూమి; సాధువు; చలింపని ధైర్యముగలవాఁడు;
సత్యసంధుఁడు; త్రికరణశుద్ధి గలవాఁడు; ధర్మార్థములను దెలిసిన బ్రాహ్మ
ణులయొద్దను, పెద్దలయొద్దను శుశ్రూషచేసి, సకలవిద్యలను, సకలధర్మ
ములను నెఱింగినవాఁడు; ధర్మము, కామము, అర్థము అను పురుషార్థ
ములస్వరూపము లిట్టివని యెఱింగినవాఁడు; జ్ఞాపకశక్తియు, మంచిప్రతి
భయుఁగలవాఁడు; లోకమర్యాదలను జక్కఁగాఁ దెలిసి, యట్లు నడచు
కొనువాఁడు; మితిమీఱిన తెలివితేటలు గలవాఁడు; ఎంత యాపద
వచ్చినను చలింపనివాఁడు; తన యాకారము నొరులకుఁ దెలియనీయని
వాఁడు; రహస్యమును వెలిపుచ్చనివాఁడు; సహాయసంపదగలవాఁడు;
సఫలమైన కోప, సంతోషములు గలవాఁడు; సత్పాత్రదానమునకును,
న్యాయముగా ద్రవ్యమునార్జించుటకును దగినకాలము నెఱిఁగినవాఁడు;
స్థిరప్రజ్ఞగలవాఁడు; గురువులందు దృఢభక్తిగలవాఁడు; చెడ్డవారిని
దాపునఁగూడఁ జేర్పనివాఁడు; పరుషముగ మాట లాడనివాఁడు;

అలసత్వము లేనివాఁడు; అప్రమత్తుఁడు; తన లోపములను బరుల లోపములను నెఱుఁగువాఁడు; శాస్త్రములను జదివినవాఁడు; పరులమేలు మఱువనివాఁడు; పురుషుల తారతమ్యమును గనిపెట్టఁగల పండితుఁడు; మిత్రులు మొదలగువారిని చేకూర్చుకొనుటలోను, నాచేకూర్చుకొనిన వారిని న్యాయము తప్పకుండ మర్యాదగాఁ బరిపాలించుటలోను గడు సమర్థుఁడు; యోగ్యులను దాపునఁ జేర్చుకొనుటయందును, వారిని పాలించుటయందును, దుష్టులను బాఱఁదోలుటయందును, వారిని శిక్షించుటయందును మిక్కిలి నేర్పరి; ద్రవ్యము సంపాదించుటయందలి యుపాయములనెల్లను దెలిసినవాఁడు; తానుగ నెఱింగి వ్యయము చేయువాఁడు; తర్కము, వ్యాకరణము మొదలగు శాస్త్రములందును, సంస్కృతము, ప్రాకృతము మొదలగుభాషలయందును గట్టివాఁడని పేరెన్నికగన్నవాఁడు; ధర్మార్థములకు లోపము వాటిల్లకుండునట్లు కామముల ననుభవించువాఁడు; సోమరితనము లేనివాఁడు; సంగీతము మొదలగు వేడుకరైన విద్యలనెల్ల బాగుగ నెఱింగినవాఁడు; ధర్మము, కీర్తి లోకసంబంధపుఁ బనులు, తాను, తన బంధువులు వీరికిఁ దగినట్లు ధనమును బంచిపెట్టుటకు శక్తిగలవాఁడు; గుఱ్ఱములను, ఏనుఁగులను, ఎక్కుటకును, వానిని లోఁబఱచుకొనుటకును దెలిసినవాఁడు; లోకమున విలువిద్దనేర్చినవారిలో మేటియైనవాఁడు; అతిరథులచే మర్యాద పడసినవాఁడు; శత్రువుల నెదుర్కొనువాఁడు; వారిని సంహరించువాఁడు; సేనలను నడిపించు శక్తిగలవాఁడు; యుద్ధమునఁ గోపముతో నెత్తివచ్చిన దేవతలకైనను, నసురులకైనను లోఁబడనివాఁడు; పరుల కలిమి కోర్వలేనితనము లేనివాఁడు; కోపమును, గర్వమును గెల్చినవాఁడు; ఒరులశుభములను జూచి ద్వేషించుస్వభావము లేనివాఁడు; ఏప్రాణినైన నవమానింపనివాఁడు; ఆయాసమయములకుఁ దగినట్లుపోక, యేది న్యాయమో అట్లే నడుచుకొనువాఁడు. రాజకుమారుఁడగురాముఁ డిట్టిసుగుణగణములతోఁగూడి, ముల్లోకములవారిచే గౌరవింపఁబడుచుఁ దాలిమియందు భూమిని, బుద్ధియందు బృహస్పతిని, పరాక్రమమునం దింద్రునిఁ బోలి, సకలజనులకు నొప్పినవియుఁ, దండ్రికిఁ బ్రీతిని గల్గించు నవియు నైన సుగుణములు గలిగి, కిరణములచే వెలిఁగెడి సూర్యుని

మూడిక్కుఁ దేజరిల్లుచుండెను. ఇట్టి సుగుణములతోఁడంగూడి, శత్రువులకు గెల్వరాని పరాక్రమంబు గలవాఁడై, యింద్రునిబోలిన యారాముని భూదేవి తన భర్తనుగాఁ గోరెను.

ఇట్టి సాటిలేని యనేక సుగుణంబులతోఁగూడియున్న తన పెద్ద కుమారునింగూర్చి దశరథుఁ డిట్లు మనసునఁ జింతించెను: "నేను ముసలివాఁడను, నేను బ్రతికియుండఁగనే రాముఁ డెప్పుడు రాజ్యమునకు వచ్చు నని నేను సర్వదా కోరుచున్నాను. ఎప్పుడు నేను మన కుమారుఁడగు రాముని సింహాసనముమీఁదఁ గూర్చుండఁబెట్టి పట్టాభిషేకముచేసి, యతఁడు సింహాసనంబునఁ గూర్చుండియుండ చూడఁ బోయెదను" అను మిక్కుటముయిన యాశయే యా దశరథుని మనస్సునందు కొట్టులాడుచుండెను.

మఱియు దశరథుఁడు తన మనమున నిట్లు తలపోయఁ జొచ్చెను: "ఈ మన రాముఁడు ప్రజల మేలుఁ గోరెడివాఁడు; జంతువులయెడ జాలి గల్గినవాఁడు; వర్షము వర్షించు నింద్రునివలె నాకంటెను జనులకందఱికిఁ బ్రియమైనవాఁడు; పరాక్రమమున నింద్రుని యముని, బుద్ధియందు బృహస్పతిని, ధైర్యమునఁ బర్వతమును బోలినవాఁడు; నా కంటె నెన్నిమడుగులో యెక్కువ గుణములు గలవాఁడు. రాముఁడు సింహాసన మెక్కి యీ భూమండలమెల్ల నేలుచుండఁగా నీ వయస్సునన్నైనను చూచి నేనెట్లు స్వర్గము నొందుదును?" అని యీ విధమునఁ దశరథుఁడు తలపోసి, యితరరాజులకుఁ బొందనలవికానివియు, లెక్కపెట్టుటకు సాధ్యపడనివియు, లోకోత్తరములయినవియు నైన అమోఘమంచి గుణములతోను, ఇంకను ననేకములయిన సుగుణములతోను నిండియున్న యా రాముని జూచి, తన మంత్రులతోడ నాలోచించి, యీ రాముని యువరాజునుగ నిశ్చయించెను. అంతట బుద్ధిసూక్ష్మత గల దశరథుఁడు మంత్రులం జూచి, "మంత్రులారా! భూమియందును, నాకసమునందును, స్వర్గమునందును నవశకునములు గలుగుచున్నవి. నాకును ముసలితనము నానాఁటికి హెచ్చుచున్నది. కావున రామునకుఁ ద్వరలోఁ బట్టము గట్టవలయును" అని చెప్పి, రాముఁడు బుద్ధిమంతుఁడు; పున్నమచందురునిబోలు మోమువాఁడు; దుఃఖలేశము లేనివాఁడు.

ఇట్టి రామునకుఁ బట్టాభిషేకము చేయుటలో జనులందఱు నొప్పి
యున్నారని తెలిసికొనెను.

తనయొక్కయు, జనులయొక్కయు మేలుకొఱకును, ప్రీతికొఱ
కును దశరథుఁడు రామునకుఁ బట్టాభిషేకమును దగిన సుముహూర్త
మునఁ జేయుటకుఁ దొందరపడి, యాలోచన చేయుటకై సకల పురము
లలో నుండువారిని, పల్లెటూళ్లలోనివారిని, భూమండలమందు గొప్ప
వారైన రాజుల నందఱును బిలిపించెనుగాని, దూరదేశములం దుండుటం
బట్టి కేకయమహారాజును జనకమహారాజును బిమ్మట నీ శుభవార్తను
విందురుగాక, యిప్పుడు కడుదూరమున నుండునట్టివారిం బిలిపించుట
కాలస్య మగు నని, వారి నిరువురినిఁ బిలిపింపఁడయ్యెను. దశ
రథుని యానతిమెయి వచ్చిన రాజులనందఱిని వారివారి యంతస్తులకుఁ
దగినట్లు మర్యాదలుచేసి, తానును సకల భూషణాలంకృతుఁడై కొల్వు
కూటమున కేతెంచి, బ్రహ్మదేవుఁడు ప్రజలనుబోలెఁ దన యానతిచే
వచ్చిన రాజుల నందఱిని జూచెను. అంత శత్రుసేనలఁ బీడించునట్టి దశ
రథనృపాలుఁడు సింహాసనంబునఁ గూర్చుండినంత తక్కిన నృపతు లందఱు
లోపలికిఁ జొచ్చి, తమకై యమర్పఁబడియుండెడి యాసనంబులందు
రాజున కెదుట నియమంబుతోఁ గూర్చుండిరి.

అట్లు మర్యాదలంబొంది, యడఁకువతోఁగూడి దాపుననే యాస
నంబులఁ గూర్చుండియున్న రాజులచేతను, తన దేశమునందలి పట్టణ
వాసులగు జనులచేతను, పల్లెలలో నుండు జనులచేతను పరివేష్టింపఁబడి
యున్న యా దశరథనృపాలుఁడు సకల దేవతలచేఁ బరివేష్టింపఁబడి
యున్న వేయికన్నులవేల్పుమాడ్కి వెలయుచుండెను.

## 2-వ సర్గము

సభ్యులందఱు రాముని పట్టాభిషేకంబునకు సమ్మతించుట

అంతట దశరథమహీపాలుఁడు దుందుభివాద్యముయొక్కయు,
మేఘగర్జనముయొక్కయు మ్రోఁతవంటి మ్రోఁతగలదియు, గంభీరమైన
దియు, రాజలక్షణములతోఁ గూడినదియు, వినువారి కింపొదవించు
నదియు, సాటిలేనిదియు, ప్రేమగలదియు నైన కంఠస్వరముతో, సభ
వారి నందఱిం జూచి, జనులకెల్ల మేలొదవునదియు, విశేష సంతో

షము గావించునదియు, నాదరింపఁ దగినదియు నైన మాటఁ జెప్పెను. "ఓ నృపాలులారా! సకలజనులారా! నేను పరిపాలించెడి యీయుత్తమ రాజ్యపు జనులను నాకు ముందటివారయిన రాజులందఱు తమపుత్రులతో సమానముగఁ దలఁచి రాజ్యమును బరిపాలించుచుండిరి గదా. నేనును ఇక్ష్వాకువంశమునఁ బుట్టిన రాజులందఱిచేతను బాలింపఁబడిన యీ జగత్తున కంతయు మే లొదవింపఁ గోరుచున్నాఁడను. నేనును నా పెద్దలదారి నవలంబించి జాగ్రత్తగలిగి, యెల్లప్పుడు సోమరితనము మాని, జనులను బాలించితిని. నేను జనులందఱికి మేలు చేయుచు, శత్రువులను బాఱఁద్రోలి, తెల్లని గొడుగుయొక్క నీడలో నుండ, నాకు ముసలితనము వచ్చెను. నేను పెక్కు (నలుబది) వేల సంవత్సరములు జీవించి, రాజ్యపరిపాలనము చేసితిని. నేను ముదుసలి నైతిని. ఇఁక రాజ్యపాలనము సేయఁజాలను. అలుపుఁ దీర్చుకొనఁ గోరుచున్నాను. రాజగుణములచేఁ బొందఁబడినదియు, ఇంద్రియముల నణఁపని వారిచే మోయ నలవిగానిదియునైన యీ లోకముయొక్క న్యాయపరిపాలన మనెడు బరువు మోసి మిక్కిలి బడలితిని. కావున బ్రాహ్మణశ్రేష్ఠులయిన వసిష్ఠుఁడు మొదలగువారియొక్కయు, ఇచ్చటఁ జేరియున్న రాజులయొక్కయు, సకలజనములయొక్కయు నిష్టము గైకొని ప్రజల మేలు గోరెడు నా పుత్రుని రాముని రాజునుగా నేర్పఱచి, నేను విశ్రాంతి నొందఁగోరియున్నాను. నా పెద్దకుమారుఁడగు రాముఁడు పరాక్రమమున నింద్రునిఁ బోలువాఁడు; శత్రుపురములను గెల్చువాఁడు; సకలగుణములందును నన్నుఁ బోలినవాఁడు. పుష్యమీనక్షత్రముతోఁ గూడిన చంద్రునిమాడ్కి వెలుఁగుచుండువాఁడును, ధర్మవేత్తలగు పురుషుల లోపల శ్రేష్ఠుఁడును నైన యీ రామునికి యువరాజపట్టముఁగట్టఁ దలఁచితిని. కాంతిగల లక్ష్మణుని యన్నయగు రాముఁడు మన రాజ్యమునకుఁ దగిన నృపాలుఁడు. ఆ రాముఁడు ప్రభువయినయెడల మూఁడులోకముల వారును రాజు గలవా రగుదురు. నేనును ఈ భూమండలం బెల్లను నా పెద్ద కుమారుఁడైన యీ రామునియం దుంచి, రాజ్యమునకీ మేలు గావించి, శ్రమ దీర్చుకొనఁగోరెదను. ముదుసలినైన నేను రాజ్యము నా కొమరుని కొప్పగించుటకుఁ దగినదనియు, నే నాలోచించిన

యోజన మంచి దనియు మీకుఁ దోఁచెనేని, మీరు సయిత మంగీకరింప వలయును. నే నొక్కఁడను మాత్ర మొప్పుకొని మీరందఱు సమ్మతింప రేని, మీ యనుమతిలేక నే నెట్లు ఈకార్యంబుఁ జేయఁగలను? రాము నికిఁ బట్టాభిషేకముచేయుట నాకు సమ్మతముగాఁ దోఁచినను, మీకంద ఱకు వేఱొక మేలైనమార్గముఁ దోఁచునేని యాలోచించి చెప్పుఁడు. పక్షపాతములేని మధ్యస్థులతోడి యాలోచించుట తా నొంటరిగఁ గూర్చుండి యాలోచించుటకంటె యుక్తి ప్రతియుక్తులచే నెచ్చు మేలు గలిగించునుగదా!"

ఇట్లు దశరథుఁడు పలికిన మాటల నన్నిటిని విని, వాన గురియు చుండు మేఘమును జూచి నెమళులు సంతస మొందునట్లు, రాజులును, జను లందఱును సంతసించి దశరథమహారాజును గొనియాడిరి. అచ్చట నున్న జనులందఱు సంతోషభరితులై, "మహారాజా! తమ యాలోచన మిక్కిలి బాగుగా నున్నది; అదియే తగినది" యని ఘోషించిరి. ఘోషించునప్పుడు గలిగిన ధ్వని మిక్కిలి దట్టమయి, మాఱుమ్రోఁగి, యచ్చటి విమానము గదలునట్లు చేసెను. ధర్మార్థముల నెఱింగిన యాదశ రథ నరపాలుని యభిప్రాయము నంతయుఁ దెలిసికొని, యచ్చటనున్న ఋషులును, బ్రాహ్మణులును, దేశములనుండి వచ్చిన రాజులును పట్టణ ములలోను, పల్లెలలోను నుండు జనులందఱును గూడి యాలోచించి, యొకటె యభిప్రాయమునకువచ్చి, దశరథుని ముసలితనమును మనమునఁ దలపోసి, యా నృపాలునితో నిట్లనిరి: "మహారాజా! తమరు పండు ముదుసలివారలు. మీ రనేకవేలసంవత్సరముల వయస్సుచెల్లినవారలు. కావున రాముని యువరాజుగఁ జేయు విషయమై మా కేమియు నాటంకములేదు. పొడవు చేతులవాఁడును, గొప్ప శూరుఁడును, రఘువంశమునఁ బుట్టినవారిలో నెల్ల శూరుఁడును నగు రాముఁడు పట్టాభిషిక్తుఁడై పట్టంపుటేనుఁగు నెక్కి, తెల్లనిగొడుగు పట్టికొని వీథులం దూరేఁగుచుండ మేము చూడఁగోరుచున్నాము" అని సభలో నున్నవా రందఱు దశరథునితోఁ జెప్పిరి.

ఇట్లు జనులందఱు తన మనస్సున కిష్టముగాఁ జెప్పినమాటను విని, దశరథుఁ డన్నిసంగతు లెఱింగియుండియుఁ దెలియనివాఁడువలె జనుల

నడిగి తెలిసికొనఁగోరి "ఓ జనులారా ? నేను చెప్పినమాట వినినంతనే "రాముఁడు రా జగుట మా కందఱకు సమ్మత" మంటిరే! ఏల యిట్లు చెప్పితిరి ? ఇప్పుడు నేను న్యాయముగాఁ బరిపాలన జరుపుచున్నను, మీ రీలాగున రాముఁడు యువరాజుగాఁ గావలె నని గోరుటకుఁ గారణమేమి ? ఈ నా సంశయము పోఁగొట్టవలయు" నని జనుల నడిగెను.

అప్పుడు సకలదేశములందలి పట్టణములనుండి పల్లెలనుండి వచ్చిన వారందఱు రాజులును బ్రాహ్మణులును గూడి మహారాజుం జూచి, "నరపాలా! నీ కొమరునికి లెక్కలేని మంచి గుణము లున్నవి. ఓ ప్రభూ! దేవతలం బోలువాఁడును, బుద్ధిమంతుఁడును, సుగుణవంతుఁడు నైన యీ రామునియొక్క యానందకరములైన గుణములను జెప్పెదము. మహారాజా! మేము వర్ణించునట్టి యాతని గుణములను వినుఁడు: రాముఁడు తన మేలైన గుణములచే నింద్రునితో నెనవచ్చువాఁడు. ఓటమి నొందని పరాక్రమముగలవాఁడు. ఇక్ష్వాకువంశస్థులగు రాజులందఱికంటెను మించినవాఁడు. రాముఁడు సత్యమునెడి ధర్మమును దప్పని సత్పురుషుఁడు; రామునినుండియే న్యాయము, కలిమియుఁ గలిగిన వని చెప్పవచ్చును. మఱియు నతఁడు జనుల మనస్సునకు సంతోషం బొదవించుటయందుఁ జంద్రుని, ఓర్పునందు భూమిని, బుద్ధియందు బృహస్పతిని, శౌర్యమునందు దేవేంద్రునిఁ బోలినవాఁడు; సకల ధర్మముల నెఱింగినవాఁడు; ప్రతిన తప్పనివాఁడు; ఆచారవంతుఁడు; అసూయలేనివాఁడు; ఓర్పుగలవాఁడు; జనుల నోదార్చువాఁడు; తిన్ననివాఁడు; చేసిన మేలు మఱువనివాఁడు; ఇంద్రియములను గెలిచినవాఁడు; మెత్తనివాఁడు, అయినను గదలని మనస్సుగలవాఁడు; ఎల్లప్పుడు మంచిపనులే చేయువాఁడు; ఇతరుల కిష్టముగ మాట్లాడువాఁడు; సత్యము పల్కువాఁడు; చక్కఁగా జదివిన పెద్దలను బ్రాహ్మణులను గొల్చునట్టి వాఁడు. అట్లతఁడు సకల గుణగణములతోఁ గూడినవాఁడగుటంజేసి యతనియొక్క సాటిలేని కీర్తియు, ప్రతాపమును, కాంతియు దినదినమునకు వర్ధిల్లుచున్నది.

దేవతలు, అసురులు, మనుష్యులు వీరిలోపల రాముఁడు సకలాస్త్రముల నెఱింగినవాఁడు; సకల విద్యలను జదివి సమావర్తనవ్రతము చేసిన వాఁడు; వేదములను, వేదాంగములను బూర్తిగాఁ జదివినవాఁడు; గాన విద్యయందు రామునికి సాటివచ్చువాఁడు మఱొక్కఁడు లేఁడు. గొప్ప వంశమునఁ బుట్టినవాఁడు; ధైర్యస్వభావము గలవాఁడు; విశేష బుద్ధి కలవాఁడు; ధర్మములను, అర్థములను జక్కఁగా నెఱుఁగఁగల మేటి విప్రులకడ విద్యాభ్యాసము చేసినవాఁడు; పట్టణములలోని వారి నిమిత్తమైనను, తన దేశమునందలి గ్రామములలోని వారి నిమిత్తమైనను లక్ష్మణుని వెంటఁదీసికొని యుద్ధమునకుఁ బోయిన, నెప్పుడును శత్రువులను గెలువక మఱలిరాఁడు. అట్లు శత్రువులను గెల్చి, రథముపైనఁ గూర్చుండి కాని, యేనుఁగు నెక్కి కాని మఱలివచ్చి, పురవాసులగు జనుల నందఱిని దన బంధువులను వలెనే సేమ మరయుచుండును. పుత్రులందును, అగ్నులందును, భార్యయందును, పనివారియందును, శిష్యులందును, నొకటేతీరునను, వరుసగాను, దండ్రి తన యౌరసపుత్రులను విచారించునట్లు, మిక్కిలి ప్రేమతోఁ విచారించుచుండువాఁడు. మఱియు, పురుషవ్యాఘ్రుఁడయిన రాముఁడు ఋషులమగు మమ్ముఁ జూచునేని 'గురువులారా! మీ శిష్యులు చెప్పినపని చేయుచు, మిక్కిలి శ్రద్ధతో శుశ్రూషచేయుచున్నారా' యని మమ్ము నెల్లప్పు డడుగు చుండువాఁడు.

మఱియు రాముఁడు మనుష్యుల కాపదలు సంభవించినప్పుడు తనవారు, పొరుగు వారని తలంపక తాను మిక్కిలి దుఃఖపడును. అట్లే, వారి కుత్సవములు సంభవించునపుడును దండ్రి తన కొడుకుల కుత్సవములు సంభవించినప్పుడు సంతోషించురీతిని తాను సంతోషించును. ఆ రాముఁడు, సత్యమే పలుకువాఁడు; గొప్ప విలుకాఁడు; పెద్దలకు శుశ్రూష చేయువాఁడు; ఇంద్రియములను గెల్చినవాఁడు; చిఱునవ్వుతోఁప మాటాడువాఁడు; ఎన్నికష్టములు వచ్చినను న్యాయమార్గముఁ దప్పనివాఁడు; జనులకు మేలగు పనులనే లెస్సగాఁ జేయువాఁడు; వదరుఁబోతులతోనుఁ మొండికట్టెలతోను, మాటాడుటయందుఁ బ్రేమలేని వాఁడు; బృహస్పతివలెఁ బై పైని యుక్తులను జెప్పువాఁడు; సొగసు

కనుబొమలును, వెడల్పైన యెఱ్ఱని కన్నులుగలవాఁడు; లోకముల కెల్లఁ బ్రియుఁడయిన యీరాముఁడు మగటిమి, ధైర్యము, పరాక్రమము అను మూఁటిచే విష్ణుమూర్తి తానే పుడమియం దవతరించెనో యనఁదగు వాఁడు; జనులయొక్క పాలన రీతిని బాగుగా నెఱిఁగినవాఁడు; ఆశలకు లోఁబడని యింద్రియములుగలవాఁడు; ఈరామునికిఁ గోపము వచ్చి నను, లేక, సంతసము గలిగినను నెప్పటికి నవి వ్యర్థముగాఁబోవు; దండింపఁ దగినవారిని చట్టములరీతిని దండించువాఁడు; దండింపఁదగనివారిపైఁ గోపముంచనివాఁడు; రాముఁ డెవరిమీఁదఁ బ్రేమయుంచునో, అతనికి సకలవిధములగు కోరికల నొసఁగును. అట్లు రాముఁడు సకల జనులచేతఁ గోరఁదగినవియు, జనులందఱ కొప్పినవియు, నెమ్మదిగలవియు నైన సుగుణ ములతోఁ గూడి, వేఁడి వెలుఁగులచేఁ దేజరిల్లుచుండు సూర్యునిమాడ్కిఁ బ్రకాశించుచుండును. ఈ రాముఁడు ముల్లోకములను బరిపాలింపఁ జాలినవాఁ డనఁదగియుండ నీ భూలోకమును మాత్ర మేలు విషయ మున నేమి సంశయ మున్నది?

రఘువంశమునఁ బుట్టిన యో దశరథనృపాలా? యిట్టి సర్వ సుగుణములతోఁ గూడియున్నవాఁడును, అమిత పరాక్రమశాలియు, లోకపాలురను బోలినవాఁడును నైన రాముని భూదేవి తానే భర్తనుగా వరించెను. మహారాజా! పుత్రులకుండవలసిన గుణములతో నిండిన కాశ్యపుఁడు మరీచునికి జన్మించినట్లు, ఈ రాముఁడు నీభాగ్యవశము ననే నీకు జనించినవాఁడు; జ్ఞానవంతుఁడైన యీ రాముఁడు దేవతలు, గంధర్వులు, పన్నగులు, అసురులు, మనుష్యులు మొదలగువారికంటె నెక్కువయిన బలము, ఆరోగ్యము దీర్ఘాయువును గలిగినవాఁడు. ఇట్టి రామునికిఁ బట్టాభిషేకంబు జరుగవలెను నని మన దేశములోని పట్టణ ములో నుండు స్త్రీలు, ముదుసలులు, జవరాండ్రు మిక్కిలి శ్రద్ధగలవారై ప్రాతస్సాయంకాలములందు రెంటియందును సకల దేవతలను బ్రార్థించు చున్నారు. మహారాజా! నీయనుగ్రహమునం జేసి, వారి కోరిక నెఱ వేరునుగాక! నల్లకలువలవంటి దేహచ్ఛాయగలుగువాఁడును శత్రువుల నందఱిం బరిమార్పువాఁడును, రాజాధిరాజులలో నుత్తముఁడును నైన నీపెద్దకొడుకగు రాముఁ డిప్పుడు యువరాజయి యున్నాఁడు. జనుల

కోర్కెల నొసఁగునట్టి మహారాజా! దేవదేవునికి సాటివచ్చువాఁడును, జనులందఱి మేలు గోరువాఁడును, గొప్పవారిచేఁ గొల్వఁబడు చుండు వాఁడునైన రామునికి వేగిరంబుగఁ బ్రేమతోఁ బట్టాభిషేకంబొనర్చి, మాకు మేలొసఁగుదువుగాక!" యని వచ్చిన రాజులు, మహర్షులు, పురగ్రామవాసులగు జనులు నందఱు నొకటే యభిప్రాయమును దశరథనృపాలునితోఁ దెల్పిరి.

## 3-వ సర్గము

{దశరథుఁడు రాముని బిలిపించి యతనితోఁ బట్టాభిషేకము చేయుదునని చెప్పుట}

"రాజులు, ఋషులు, జనులందఱు చేతులు జోడించి చెప్పిన మాటలను విని, దశరథమహారాజు వారి కిష్టము లయిన పలుకుల నిట్లనియె:

ఓ జనులారా! యాహా! మీరు నాయభిప్రాయము నామోదించి నందులకై నేను గడుసంతసము నొందితిని. మీరు నా జ్యేష్ఠకుమారుఁడగు రాముని యువరాజునుగఁ జేయ సమ్మతించితిరి. నా ప్రభావము సాటి లేని దనవచ్చును" నని చెప్పి, వారికిఁ దగు మర్యాదలఁ జేసి, యా వచ్చిన జనులందఱు వినుచుండ వసిష్ఠవామదేవ మహర్షులం జూచి, "మునీంద్రులారా, యీ చైత్రమాసము మిక్కిలి శుభప్రదమైనది. శుభకర్మములను జేయ యోగ్యమైనది. ప్రతివనంబునను వృక్షములు చిగిరించి పూలతోను గాయలతోను నిండియున్నవి. కావున శ్రీరాముని యువరాజ పట్టాభిషేకమునకుఁ దగు ప్రయత్నముఁ గావింపుఁడు" అని చెప్పెను. ఆ మాట చెప్పి దశరథుఁడు నిలుపఁగానే, యామోద సూచకముగా జనులహర్షధ్వనులు చెలరేఁగినవి. ఆనందడి యాఁగినంతనే, జననాథుఁడు మునీంద్రుఁడగు వసిష్ఠునిఁగూర్చి: "ఓపూజ్యుఁడా! రాముని పట్టాభిషేకమునకయి కావలసిన సామగ్రులనెల్ల నెలవిండని చెప్పెను.

బ్రాహ్మణ శ్రేష్ఠుఁడగు వసిష్ఠుఁడు దశరథనరపాలుని వాక్యమును విని, చేతులు జోడించుకొని రాజుముందట నిలఁబడియున్న పనివారిం జూచి, "యపుడె సాలెవారిచే నేయించి తెచ్చిన యంచులుగల వస్త్రములను, బంగారును, సకలవిధములగు రత్నములను, బలులను, ఓషధుల

సన్నిటిని, తెల్లని పూవులదండలను, రథములను, సకలాయుధములను, చతురంగబలమును, శుభలక్షణములుగల పట్టంపుటేనుఁగును, తెల్లని చామరములను, వింజామరలను, గొడుగులను, టెక్కెమును, అగ్నిహోత్రునివలె వెలుఁగుచుండు బంగారు పూర్ణకలశములను, బంగరు కొమ్ములుగల యెద్దును, గొప్ప పులితోలును, మఱియుఁ గావలసిన యన్నివస్తువులను దెల్లవాఱునప్పటికి రాజుగారి యగ్నిహోత్రశాలకుఁ జేర్పుఁడు. అంతఃపురద్వారములను, బట్టణద్వారములనన్నింటిని గంధము పూసి పూవులదండలచే నలంకరించి, సువాసనగల ధూపములు వేయుఁడు. లక్షణలకొలఁదిగ బ్రాహ్మణులు భుజించుటకుఁ జాలిన, షడ్రసోపేతమగుచు, పాలు పెరుగులతోఁగూడిన శ్రేష్ఠమయిన యన్నము వండింపుఁడు. రేపటి యుదయమున బ్రాహ్మణుల నెల్లరఁ జక్కఁగా గారవించి, వారికి నేయి, పెరుగు, పేలాలును, విస్తారమైన దక్షిణలును నిప్పింపవలయు. రేపు సూర్యోదయమగు నప్పటికే బుణ్యాహవాచనకార్యము ప్రక్రమింపఁబడును. కనుక బ్రాహ్మణుల నందఱిని బిలిచివచ్చి, వారికిఁ దగిన యాసనంబుల నేర్పఱుపుఁడు. టెక్కెములఁ గట్టుఁడు; రాజవీథులలో దుమ్ము రేఁగకుండులాగున నీరు చల్లింపుఁడు. వేశ్యలును, నట్టువగాండ్రును సకల భూషణాలంకృతులై, రాచనగరుయొక్క రెండవ వాజారమున నుందురుగాక! దేవాలయములందును, నాలుగుదారులు గలియుచోట్లను గొంద ఱన్నమును, గొందఱు భక్ష్యములను, మఱి కొందఱు పూవులదండలను వేర్వేఱుగాఁ గైకొని వచ్చు బ్రాహ్మణుల కెల్ల నిప్పింపుఁడు. భటులందఱు పొడుగుకత్తులను దాల్చి, కవచములను దొడగి, చక్కని యుడుపులను ధరించి రాచనగరు వాఁకిట సిద్ధముగా నుండునట్లానతిండు" అని భృత్యుల కానతిచ్చిన, తక్కిన పనుల నన్నింటిని రాజునకు దెల్పుచు, ఆయనయనుమతి వడసి వసిష్ఠవామదేవులు సిద్ధపఱిచిరి. ఇట్లు బ్రాహ్మణోత్తములగు నావసిష్ఠవామదేవులు సంతసముచేఁ బులకలెత్తిన మేనితోఁగూడి "మహారాజా! అన్నియు సిద్ధము చేయఁబడినవి" యని పుడమితేఁడగు దశరథ నృపాలుని కెఱింగించిరి.

అంతటఁ గాంతిమంతుఁడయిన దశరథుఁడు సుమంత్రునిఁ బిలిచి, "బుద్ధిమంతుఁడయిన రాముని వేగిరముగఁ దోడ్కొనిరమ్ము"ని యాన తిచ్చెను. సుమంత్రుఁడును "చిత్త" మని సెలవుఁ దీసికొనిపోయి, రథి కులలో శ్రేష్ఠుఁడైన రాముని రథముపైఁ గూర్చుండఁబెట్టికొని వచ్చు చుండెను. అపుడు తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము ననెడి నాలుగు దెసలనుండి వచ్చిన రాజులు, మ్లేచ్ఛరాజులు; మఱియు, కొండ ప్రదేశములందుండు రాజులు, అడవులందుండు రాజులు నేతెంచి దేవత లందఱు దేవేంద్రునింబోలె నృపాలునిఁ గొల్చుచుండిరి. దేవతలచేఁ జుట్టఁబడిన దేవేంద్రునిమాడ్కి, రాజు లందఱిచేఁ జుట్టఁబడిన దశర థుఁడు ప్రకాశించుచు మేడపైనుండి, రథముపైఁ గూర్చుండివచ్చుచున్న తన కుమారుని రామునిం జూచెను. గంధర్వరాజుం బోలువాఁడును, పరాక్రమశాలి యని ప్రసిద్ధికెక్కినవాఁడును, పొడవు చేతులవాఁడును, ఎక్కువ బలిమిగలవాఁడును, మదపుటేనుఁగుచందమున నడచువాఁడును, చంద్రునివలె మనోహరమగు మోముగలవాఁడును, మిక్కిలి యిష్ట ముతోఁ జూడఁదగినవాఁడును, తన సౌందర్య దాక్షిణ్య గాంభీర్యాది గుణములచేఁ బురుషులయొక్క చూపులను, మనస్సును, జూఱకొను వాఁడును నైన యీ వచ్చుచున్న రాముని నెండవేఁడిమిచే బడలికపడి యున్న ప్రజలు వర్షించుచున్న మేఘమునుఁబోలెఁ జూచియు దశరథుఁడు దనివినొందకుండెను. సుమంత్రుఁడు రాచనగరుకడ కేతెంచి, రాముని రథంబునుండి దించి, చేతులు జోడించుకొని తన తండ్రికడ కేఁగుచుండు రాముని వెంబడించిపోయెను.

ఆరాముఁడును దనవెంబడి వచ్చుచున్న సుమంత్రునితోఁగూడఁ దండ్రినిజూచుటకై కైలాసశిఖరముంబోలు మేడ యెక్కెను. అతఁడు మేడపై కెక్కి చేతులు జోడించి వినయసమ్రుఁడై వచ్చి, తండ్రికడ నిలఁ బడి, తనపేరు చెప్పుచుఁ దండ్రిపాదములకు మ్రొక్కెను. ఇట్లు నమస్క రించి, చేతులుజోడించుకొని యడఁకువతో నిండియున్న తనదు ముద్దులకొడుకగు రామునిం జూచి, యంజలినిబట్టి దగ్గఱకుఁ జేరఁదీసి కౌఁగిటఁబట్టి, యెత్తయినదియు, లెస్సగా రత్నములు చెక్కినదియునైన యొక బంగారుమయమయిన యాసనముపయిఁ గూర్చుండ నియమించెను.

అతఁ డాయాసనమునఁ గూర్చుండి నిర్మలుఁడైన సూర్యుఁడు తన కిరణ
ములచే మేరుపర్వతమును వెలుఁగఁజేయుమాడ్కిఁ దాను గూర్చుండిన
యాసనశ్రేష్ఠమును దనకాంతిచేతనే ప్రకాశింపఁజేయుచుండెను. మబ్బులు
వర్షించి తెల్లవాఱుటచే నిర్మలములై యుండు నక్షత్రములతోడను
గ్రహములతోడను గూడిన యాకాశము చందురునిచే వెలుఁగునట్లు
మిక్కిలి ప్రకాశించుచుండు రామునిచే నాసభ యంతయు వెలుఁగు
చుండెను. అట్లు తనయెదుట నాసనంబునఁ గూర్చుండియున్న తన ప్రియ
కుమారుఁడైన రామునిజూచి, సకలభూషణములచే నలంకరింపఁబడి,
యద్దమునందుఁ గనఁబడుచున్న తన ప్రతిరూపమునుగాఁ దలఁచి మిక్కిలి
సంతోషము నొందెను. కాశ్యపుఁడు దేవేంద్రునింబోలెఁ బుత్రవంతు
లలో శ్రేష్ఠుఁడైన యా దశరథుఁడు తనకుమారునిఁజూచి, క్షేమమడిగి,
చిరునవ్వుతోఁ బలుకరించి యిట్లనియె. "ఓరామా! నీవు నా కన్నివిష
యములందుఁ దగియున్న నా జ్యేష్ఠభార్యయగు కౌసల్యయందు నాకుఁ
దగిన కుమారుఁడవు? సకలగుణములచే నొప్పినవాఁడవు; నీయొక్క
సద్గుణములను జూచి, యీ మనదేశపు జనులందఱు నీవు రాజవు గావలె
నని కోరుచున్నారు. కావున నీవు పుష్యమీనక్షత్రయుక్తమయిన శుభ
దివసమున యువరాజపట్టము నొందుము. ఓరీ నాయనా! నీవు స్వాభావిక
ముగానే వినయముతోఁ గూడినవాఁడవు; గుణవంతుఁడవు; అయినను
నీయందలి ప్రేమచేఁ గొన్ని హితవాక్యము లుపదేశించెదను; వినుము.
"పెద్దల కడఁగియుండి, యెల్లప్పుడు ఇంద్రియములను లోఁబఱచుకొని
యుండుము. కామమువలనను, క్రోధమువలనను బుట్టిన వ్యసనములను
మానుము. పరోక్షముగా వేఁగులవలనఁ బరరాజ్యములసంగతి విచా
రించుటచేతను, ప్రత్యక్షమునఁ దన రాజ్యముయొక్కయుఁ బరరాజ్యము
యొక్కయు సంగతులు విచారించుటచేతను మంత్రులు మొదలగు సకల
జనులను సంతోషపఱుపుము. ధాన్యపుఁ గొట్టులను, బొక్కసములను
నేర్పఱచి, సకలవస్తువులను ధనమును జేర్చిపెట్టి, జనులు సంతుష్టులు
ననురక్తులునయియుండునట్లు, వారిని బ్రేమతోఁ బోషించుచు నెవఁడు
భూమిపాలనము సేయుచున్నాఁడో, యారాజును బొందిన మిత్రు
లమృతముదొఱకిన దేవతలచందమున సంతతమునొందుదురు; కావున

నీవును మనస్సును జయించి యీప్రకారముగఁ జేయుము" అని రాము నకు దశరథుఁడు హితమును బోధించెను. అప్పుడు తమయిష్టములఁ జేయు రామునియొక్క స్నేహితులు సంబరముతో కౌసల్యకడకు వేగ నేఁగి యీసంగతిని దెలిపిరి. స్త్రీలలో నుత్తమురాలగు నా కౌసల్య విశేషమయిన బంగారమును, గోవులను, రత్నముల ననేకము లను వారికిప్పించెను. అంతట రాముఁడు రాజునకు నమస్కరించి, యరద మెక్కి, జనుల సమూహముచే గారవింపఁబడి, కాంతితో వెలుఁగు తన నగరునకుఁ జేరెను. పురజనులందఱు దశరథు ననుమతిని బడసి తాము గొప్పలాభమునుబొందినట్లు సంతసించి, తమయిండ్లకుబోయి, మహానంద ముతోఁగూడి దేవతలను బూజించిరి.

## 4 - వ స ర్గ ము.

{ దశరథుఁడు రామునికిఁ దన దుస్స్వప్నములను ఫలముఁజెప్పి పట్టాభిషేకము త్వరలో జరుపవలయు నని తెల్పుట }

అంతట రాజులందఱును, దేశమునుండి వచ్చిన జనులందఱును, తమతమ యిరవులకుఁబోయి చేరినంతటనే దశరథుఁడు తానుగ నన్ని సంగతులను నిర్ణయింపఁగలవాఁడయ్యును, తన మంత్రులతోడ నాలో చించి నిర్ణయముచేసి మంత్రులంజూచి "రేఁపటిదినము పుష్యమీనక్ష త్రము; కావునఁ గమలాక్షుఁడగు రామునికి యువరాజ పట్టాభిషేకము రేఁపే జరిపింపవలయును." అనిచెప్పి, లోపలియింటికిఁ జొచ్చి, యప్పుడు రామునిఁ దోడ్కొనిరమ్మని సారథితోఁజెప్పెను. ఆ సారథి యానతిని శిరసావహించి, రామునిఁ బిలుచుకొనివచ్చుటకై రాముని నగరునకు వేగముగ బోయెను.

అప్పుడు ద్వారపాలకులు లోపలికిఁజని, "మహారాజా! తమరిని దోడ్కొనిరమ్మని తమతండ్రిగారు చెప్పిపంపఁగా, సారథివచ్చి కాచి యున్నాఁడు." అని విన్నవించెను: రాముఁడు సారథి వచ్చియున్నాఁడని ద్వారపాలకునిమాట విన్నవాఁడై; "ఇప్పుడే నే నచ్చటినుండి వచ్చితిని. ఇంతలోనె నన్ను మఱలఁ బిలువనంపుటకుఁ గారణమేమి" యని సంశయ పడినవాఁడై, యతనిని లోపలికిరప్పించి "ఓసారథీ! నీవు మఱల వచ్చుట కేమి కారణము? విస్తరించి చెప్పు" మని యడిగెను. సూతుఁ

డును రామునివాక్యమును విని, "రామా! తమతండ్రి తమ్ముఁ జూడఁ గోరినాఁడు. మహారాజుగారి సన్నిధికి వచ్చుటకైనను రాకుండుటకైనను దమచిత్త" మని విన్నవించెను. ఇట్లు సూతుఁడు పలికిన మాట విని రాముఁడు తత్తరపాటుతోఁగూడి దశరథనృపాలుని జూచుటకై మరల రాచనగరు సొచ్చెను. దశరథుఁడును దూతవలన రాముని రాకను విని యెక్కువ యిష్టమయిన సంగతిఁ జెప్పఁగోరి, లోపలికిఁ బిలిపించెను. సౌందర్యవంతుఁ డయిన రాముఁడు రాచనగరు సొచ్చుచునే చేతులు జోడించి దవ్వుననే తండ్రిని దర్శించెను. దశరథుఁడు అట్లు నమస్క-రించుచున్న రాముని లేవనెత్తి, కౌఁగిటం జేర్చి, యతనికి శ్రేష్ఠమగు నాసనమిచ్చి యిట్లనియె :

"చిరంజీవివగు రామా! నేను ముసలివాఁడ నయితిని. సకల సుఖముల ననుభవించితిని. విస్తారమయిన దక్షిణలతోను, అన్నప్రదానముతోను ననేక యాగములం జేసితిని. భూలోకమున సాటిలేని సుగుణములుగల ప్రియుఁడవగు నీవనెడి కొమరుని గంటిని. పురుషశ్రేష్ఠుఁడా! సకలదానము లొసఁగితిని. సకల దేవతలను బూజించితిని. సకల వేదములను, వేదాంగములను జదివితిని. శూరుఁడా! నేను గోరిన సుఖములనెల్ల ననుభవించితిని. దేవ, ఋషి, పితృ, బ్రాహ్మణఋణములను, స్వకీయ ఋణములను దీర్చుకొంటిని. ఇప్పుడు నీకుఁ బట్టాభిషేకము చేయుట కంటె నాకుఁ గావలసిన దేదియు లేదు. కావున నే నిప్పుడు చెప్పుపనిని నీవుచేయుము. ఇప్పుడు జనులందఱు నిన్ను రాజునుగాఁ గోరుచున్నారు. కావున ఓ నాయనా! నీకు యువరాజపట్టముఁ గట్టెదను. అంతియకాక, యీ దినము నేను భయంకరములగు కీడులఁ దెల్పు కలలను గంటిని. పిడుగులును, కొఱవులును గొప్ప ధ్వనులతోఁగూడ నింగినుండి పడుచున్నవి. నాజన్మనక్షత్రమునఁ గ్రూరగ్రహంబులగు సూర్యాంగారక రాహువులు చేరియున్నారని జోస్యులు చెప్పుచున్నారు. తఱచుగా నిట్టి దుస్స్వప్నములు గలిగినప్పుడు భూపాలుఁడు మరణమునైన, లేనిచో భయంకరమైన యాపదనైన నొందును. కావున నా యూపిరి యీ దేహమునుండి వెడలకమునుపే పట్టము కట్టుకొనుము. మానవులకు బుద్ధి చంచలము గనుక నొకప్పు డుండిన బుద్ధి మఱొక్కప్పు

డుండదు. ఈ దినమునఁ జంద్రుఁడు పుష్యమీనక్షత్రమునకు ముందటి
దైన పునర్వసూనక్షత్రమున నున్నాఁడు. రేపటి దినమునఁ బుష్యమీ
నక్షత్రము. పుష్యమీనక్షత్రము సకలశుభకర్మములను జేయఁ దగినది
యని జోస్యులు పలుకుదురు. కావున నీ వీ పుష్యమీనక్షత్రమున
పట్టము కట్టుకొనుము. నా మనస్సు నన్నుఁ దొందరపెట్టుచున్నట్లున్నది.
శత్రువుల సంహరించు ఓ రామమూర్తీ! రేపటిదినము నిన్ను యువరాజ
పట్టంబున నభిషేకము చేసెదను. కాఁబట్టి నీవు భార్యతోడఁ బరిశుద్ధుఁ
డవై దర్భలపాన్పుమీఁదఁ బరుండి యీ రాత్రి యుపవాసము సలుప
వలయును. నీమేలు గోరెడి చెలులందఱు జాగ్రత్తగలవారలై, నీ
చుట్టును గూర్చుండి కావలి కాయుదురుగాక. ఇట్టి కార్యములు చేయ
వలయు నని పూనినప్పుడు, వాని కనేకము లయిన యాటంకములు గలు
గుట సహజమేకదా! మన పట్టణమునుండి మేనమామయింటికిఁ బోయి
యున్న భరతుఁడు మఱలివచ్చునంతలోపలనే నీకుఁ బట్టాభిషేకంబు
జరిపి ముగించుట తగినది యని నేఁ దలపోసెదను. నీ తమ్ముఁడగు భర
తుఁడును నీ యభిషేకవార్తను విన్నను, నతఁడు దీనికి సమ్మతింపకపోఁడు.
అతఁ డెల్లప్పుడు పెద్దలమార్గముననే పోవువాఁడు. తనయన్నల ననుసరించి
పోవువాఁడు. ధర్మములను నడపుటయే స్వభావముగఁ గలవాఁడు.
భూతములయందు దయగలవాఁడు. ఇంద్రియములను గెల్చినవాఁడు.
అయినను, మానవుల మనసులు చంచలము లని నాయభిప్రాయము.
ధర్మమునడపుటె ప్రధానంబుగఁగల సత్పురుషుల మనస్సు లొండొరుల
యుపకారములచే మెఱయుచుండును" అని దశరథుఁడు మఱుసటి దిన
మున జరుగు నభిషేకమునుగూర్చి చెప్పి, "యిఁకఁ బోయి ర"మ్మని యాన
తీయఁగా, రాముఁడు సెలవు గైకొని, తండ్రికి నమస్కరించి, తన నగరు
నకు మఱలెను.

అట్లు మఱలి, రాముఁడు రాజుగా రుద్దేశించిన పట్టాభిషేకంబు
నిమిత్తము మాటలాడుటకై తన తల్లియగు కౌసల్యతో మాటాడఁ
గోరి, యామె యంతఃపురంబునకుఁ బోయెను. అంతఃపురంబులోని
దేవళములోపలఁ బట్టుచీరఁగట్టి మౌనముతో రాజ్యలక్ష్మిని ధ్యానము
చేయుచుఁ బ్రార్థించుచున్న కౌసల్యను జూచెను. రాముని పట్టాభిషేక

ప్రయత్న వార్త విని, సుమిత్రయు లక్ష్మణుండును ముందే సీతను బిలిచికొని వచ్చిరి. అప్పుడు కౌసల్య తనకుమారునికి మఱుసటిదినంబునఁ బుష్యమీ నక్షత్రమునాఁడు యువరాజ పట్టాభిషేకము జరుగఁగలదని యెఱిఁగి వ్రతై, సుమిత్రయు, సీతాలక్ష్మణులును గొల్చుచుండఁ బ్రాణములను బిగఁబట్టి, యందఱి మనసులలోపల వెలుఁగుచున్న భగవంతుఁడగు నారాయణునిఁ గన్నులు మూసికొని ధ్యానించుచుండెను. అట్టి పరిశుద్ధ కాలగు తల్లికడ కేతెంచి, రాముఁడు నమస్కరించి, యామె మనసునకు సంతసము హెచ్చునట్లు "అమ్మా! మాతండ్రి నన్నుఁ బ్రజలఁ బాలించుటకు నియమించెను. రేపటి పుష్యమినాఁడు నాకు యువరాజపట్టాభిషేకము కాఁగలదు. ఈ రాత్రికి నేనును సీతయు నుపవాసము సలుపవలయునని వారు, ఋత్విజులు, నుపాధ్యాయులును జెప్పిరి. రేపటి పట్టాభిషేకమునకే యే యలంకారములు ముఖ్యములో, వాని నెల్ల నాకును సీతకును జేయింపవలయును" అని తన తల్లితోఁ జెప్పెను. కౌసల్య తాను చాలయేండ్లుగాఁ గోరియున్న యీ కోరిక నేఁటి కీడేఱిన మాట విని, మిక్కిలి యుప్పొంగి, యానందముచేఁగలిగిన డగ్గుత్తికతోడ రామునితో నిట్లనెను.

"ఓ నాయనా! రాముఁడా! చిరంజీవివిగ నుండుము. నీ శత్రువులందఱు నశించిరి. నీవు యువరాజ పట్టంబుఁ బొంది రాజ్యలక్ష్మితోఁ గూడి, నాయొక్కయు సుమిత్రయొక్కయు బంధువులను సంతోషపఱుపుము. నీవు మంగళకరమగు పునర్వసూనక్షత్రమున జన్మించితివి. నీవు నీ గుణములచే నీ తండ్రిని సంతోషపఱచితివి. కమలములం బోలు కన్నులుగల నారాయణమూర్తిని గూర్చి నే ననేక వ్రతములు, నుపవాసములును సల్పితిని. అవియెల్ల నిప్పుడు సిద్ధించినవి. కావున నిక్ష్వాకు వంశమువారి రాజ్యలక్ష్మి నిన్నుఁ జేరఁగలదు" అని కౌసల్య రామునితోఁ జెప్పెను. రాముఁడు తల్లిపలుకులు విని, చేతులుజోడించి, యడఁకువతోఁ గూర్చుండియున్న లక్ష్మణుంగూర్చి, "లక్ష్మణా! నీవును నాతోడ నుండి యీ పుడమినెల్ల నేలుము. నీవు నాయొక్క వెలుపటి ప్రాణము వంటివాఁడవు. ని న్నీ రాజ్యలక్ష్మి పొందనున్నది. ఓ సుమిత్రయొక్క పుత్రుఁడా! నీవును రాజ్యము నొంది, రాజ్యమును బాలించుచు,

సాత్రోడఁగూడి సకల సౌఖ్యముల ననుభవింపుము. నీ నిమిత్తమే నేను భూలోకమునఁ బ్రాణములను, రాజ్యమును గోరుచున్నాఁడ" నని చెప్పి, తల్లికడ సెలవుదీసికొని, సీతకును దనతల్లులయుత్తరు విప్పించి, తన నగరునకుఁ బోయి చేరెను.

## ౫-వ సర్గము

వసిష్ఠుఁడు రాముని నగరునకు వెళ్లి యుపవాస ముండుమని చెప్పుట

పుడమిఱేఁడును మరుసటిదినంబున జరుగఁబోవు పట్టాభిషేకంబు విషయమయి రాముఁ డుండవలసిన తీరెల్లఁ జెప్పి యతనినిఁ బంపించి, వెంటనే తమపురోహితుఁడగు వసిష్ఠునిఁ బిలువ నంపించి, "మహామునీ! తపోధనా! (తపస్సే ధనముగాఁ గలవాఁడా!) తమరు రాముని నగరున కేఁగి కలిమిని, కీర్తిని, రాజ్యమును బడయునిమిత్తమై రామునిచేతను సీతచేతను నుపవాసవ్రతము చేయింపుఁడు" అని చెప్పెను.

వేదవేదార్థములను, మంత్రార్థములను దెలిసినవారిలో నుత్తముఁడును, నియమముఁ దప్పనివాఁడును, త్రికాలజ్ఞానము గలవాఁడును నయిన వసిష్ఠమహాముని 'యట్లే' యని రాజుతోఁ జెప్పి, వేదమంత్రములందుఁ జెప్పిన తెఱఁగున రామునిచే నుపవాసము చేయించుటకై, గుఱ్ఱములు పూన్చినట్టియు బ్రాహ్మణు లెక్కఁదగినట్టియు రథమునఁ గూర్చుండి, శరదృతువునందలి మేఘమువలెఁ దెల్లని కాంతి గలిగియున్న రాముని నగరు సొచ్చి, రథముమీఁదఁ గూర్చుండియే మూఁడు వాకిళ్లను దాఁటి, లోపలికిఁ జొచ్చెను. వచ్చిన వసిష్ఠుని జూచి, రాముఁడు తొందర పడుచు సంబరముతో లేచి, మర్యాద సేయఁదగినవాఁడగు వసిష్ఠమునిని బూజింపఁగలవాఁడై తన నగరునుండి వెడలి, మహాముని కెదు రేఁగి, మునీంద్రుని రథముకడకు వచ్చి, తానే మహాముని చేయి పట్టుకొని రథమునుండి దింపెను. పురోహితుఁడగు నా వసిష్ఠమునియు మేలు సమకూర్పఁదగినట్టి వినయసమ్పన్నుఁడగు రామునితో ముచ్చటలాడి, వేడుకపుట్టించి, సంతోషము నెసఁగఁజేయుచు నిట్లనియె.

"ఓరామా! నీయెడ నీతండ్రి మిక్కిలి ప్రీతిగలిగి యున్నాఁడు. నీవు యువరాజపట్టము నొందఁగలవు. నీవు సీతతోఁగూడ నేఁటిరాత్రి కుపవాస ముండవలయును. తెల్లవాఱఁగనే నహుషుండు యయాతికి

రాజ్యాభిషేకము చేసిన చందమున, నీ తండ్రియగు దశరథమహారాజు నీకును యువరాజపట్టాభిషేకము సేయఁగలఁడు." అని వసిష్ఠమునీంద్రుఁడు రామునితోఁ జెప్పి నియమవంతుఁడయిన రామునిచేతను, సీత చేతను నుపవాసవ్రతము యథావిధిగాఁ జేయించెను. పిమ్మట రాముఁడు గురువగు వసిష్ఠమునిని భక్తితో శాస్త్రరీతిఁ దప్పక పూజింపఁగా నవ్వసిష్ఠ మహాముని యా పూజలనెల్ల స్వీకరించి, యాతని వీడ్కొని, యా రాముని నగరునుండి పయన మాయెను. అచటఁ దనమేలు గోరుచు నిష్టములే పలుకునట్టి స్నేహితులతోఁ గూర్చుండియున్న రాముఁడును, వారిని వీడ్కొని, వారిని తమతమ నెలవులకుఁ బోవ నాజ్ఞయొసఁగి, తాను లోపలికిఁ జనియెను. అప్పుడు సంతోషముచే నిండిన మనంబుగల స్త్రీపురుషులచే నిండిన యా రాముని నగరు మదించిన రాయంచలు మున్నగు నీటిపక్షులతోఁగూడి, పూఁచిన తామరపూవులచే వెలయు చున్న కొలనిచందమునఁ బ్రకాశించుచుండెను. అంతట వసిష్ఠుఁడు రాజగృహమువలె వెలుఁగుచున్న యా రాముని నగరునుండి వెడలి, వెలుపలికి వచ్చి, జనులచేఁ గ్రిక్కిరిసియున్న మార్గమును జూచెను. అయోధ్యా పట్టణమునందలి వీథులన్నియు రాముని పట్టాభిషేక సంభ్రమముతో నొప్పి గుంపులు గుంపులుగఁ గూడిన జనులచేఁ గ్రిక్కిరిసి యుండినవి. జనుల గుంపు లనెడి యలలయొక్క యొఱయికవలనను, సంతోషమువలనను గలిగిన చప్పుడును గల్గియుండు నా యయోధ్యా పురరాజమార్గము అలలతోడను వాని ధ్వనులతోడను గూడిన సముద్రమో యనఁదగి యుండెను. అయోధ్యా పట్టణమం దెల్ల ప్రదేశము లందును వీథులన్నియు నీళ్లుచల్లి, యప్పుడే పూఁచిన పూలదండలచే నలంకరింపఁబడినవై, యింటింటను గట్టిన యెత్తయిన ధ్వజములతోఁ గూడినవై వెలయుచుండెను. అయోధ్యాపురమునందలి జనులందఱును స్త్రీలతోడను, బాలురతోడను, వృద్ధులతోడను, గూడినవారయి సూర్యోదయము నెదురుచూచు నట్లా రాముని పట్టాభిషేకము నెదురు చూచుచుండిరి. జనులకు నలంకారమైనదియు, సంతోషప్రదమై నదియు నైన యా యయోధ్యాపురియందలి రాముని పట్టాభిషేక మహోత్సవమును జూడవలె నని జనులందఱు కోరిక గల్గియుండిరి.

మహామునియు నిట్లు జనులచేఁ గిక్కిఱిసియున్న రాజమార్గమునఁ బ్రవేశించి, జనుల గుంపులనెల్ల వరుసలు వరుసలుగ నిల్పువాఁడువోలెఁ గనఁబడుచు మెల్లగా రాజనగరు ప్రవేశించెను. అట్లు వసిష్ఠుఁడు రాచనగరు సొచ్చి, తెల్లని మేఘముతోఁగూడిన కొండకొనతో సమానముఁగ వెలుఁగుచున్న మేడ యెక్కి, బృహస్పతి దేవేంద్రునియొద్దకుఁ బోవునట్లు దశరథనృపాలునికడకుఁ బోయిచేరెను. దశరథుఁడును వసిష్ఠునిరాకం జూచి తా నాసనమునుండి లేచి, "తమరు పోయిన పని చేయించివచ్చితిరిగదా!" యని యడుగఁగా, మునీంద్రుఁడును "మహారాజా! రామునిచే నుపవాసము చేయించి వచ్చితిని" అని రాజునకుఁ దెలియఁబఱచెను. దశరథమహారాజు లేచినంతటనే యతనితోఁ గూర్చుండిన సభ్యులందఱు పురోహితులవారిం గారవించుటకై తమతమ యాసనములనుండి లేచిరి. దశరథనృపాలుఁడు వసిష్ఠుని వాక్యమును విని యతనికి మర్యాదలు సల్పి, యా మహామునివలన సెలవు గైకొని, జనసమూహమును దమ తమ స్థానములకుఁ బోవ సెలవొసంగి, సింహము కొండ గుహలోనికిఁ బోవునట్లు తానును అంతఃపురమునకుఁ బోయెను. చక్కఁగా నలంకరించుకొనిన జవరాండ్రతో నొప్పుచు, దేవేంద్రుని భవనమునుబోలి ప్రకాశించుచున్న యాయంతిపురమును దశరథుఁడు నక్షత్రగణములతో విరాజిల్లు నాకాశమును చంద్రునివలెఁ బ్రవేశించెను.

## 6-వ సర్గము.

{ రాముఁ డుపవాసము గావించుట, పురజనులందఱు పట్టాభిషేకముఁ జూడవచ్చుట }

పురోహితుఁడు పయనమై పోయిన పదంపడి రాముఁడు స్నానము చేసి కదలని మనంబుగలవాఁడై, స్నాతయై పరిశుద్ధురాలయియున్న విశాలములయిన కన్నులుగల పత్నితోడంగూడి, శ్రీమన్నారాయణుని సన్నిధానమున కేఁగి, హవిగపాత్రమును శిరమున నిడుకొని యథావిధిగ నమ్మహాదేవుని సమక్షమున జ్వలించుచున్న యగ్నిహోత్రమున హోమంబు నేసి, తనకు హోమశిష్టమగు నన్నమును భుజించి, ఇష్టార్థసిద్ధిని నారాయణమూర్తిని ధ్యానించుచుఁ జక్కఁగాఁ బఱపఁబడిన దర్భాసనమునఁ

గూర్చుండి మౌనముతోడ, జితేంద్రియుఁడై, సీతతోఁగూడ నాభగవంతుని దేవాలయమున శయనించెను. యొకజాము నట్లుశయనించి, ప్రొద్దుండఁగనే లేచి నగరున కంతయు నలంకారమును బూర్తిగాఁ జేయించెను. అంతట రాముఁడు సూతవందిమాగధు లింపుగఁ బాడెడు మేల్కొలుపు, వంశావళులు, బిరుదులు మొదలగువానిని వినుచు నుదయకాలసంధ్యావందనమాచరించి, నిశ్చలమనస్సుగలవాఁడై గాయత్రీజపముచేసి, మధుసూదనునికి సాష్టాంగముగాఁ బ్రణమిల్లి యాదేవదేవుని స్తోత్రములు చేసి, మఱల స్నానముచేసి తెల్లని పట్టుబట్టం గట్టుకొని, బ్రాహ్మణులచేఁ బుణ్యాహవాచనము నేయించుకొనెను. అప్పుడా బ్రాహ్మణోత్తములచేఁ జేయఁబడు పుణ్యాహవాచనమంత్రములఘోషము గంభీరమును మధురమును నయిన మంగళవాద్యముల ధ్వనులతో మిళితములయి యయోధ్యాపురము నంతయు మాఱుమ్రోగునట్లు చేసెను.

రాముఁడు సీతతోడ నుపవాసవ్రత మొనర్చి ముగించె నన్న వార్తను విని, యయోధ్యయందలి జనులందఱు మిక్కిలి సంతోషము నొందిరి. మఱి పురజనులందఱు నాఁడు రామునిపట్టాభిషేకవార్తను విని, రాత్రిగడచి తూర్పు తెల్లవాఱుచుండుట నెఱింగి, పట్టణమెల్ల నలంకరింపఁ దొడఁగిరి. వెండికొండయొక్క కొనలవలె నెత్తయిన దేవాలయములందును, నాలుగుబాటలు గలియుచోటులందును, రాజవీథులందును, యజ్ఞశాలలందును, కోటబురుజులందును, సకలవిధములయిన విక్రయవస్తువులు నిండుగనున్న వర్తకుల యంగళ్లయందును, గృహస్థులయొక్క కాంతిమంతములైన సకల సంపదలతో నిండిన యిండ్లయందును, సభలయం దన్నిటియందును, అన్ని దెసలకుఁ గనఁబడు రచ్చపట్టులచెట్లయందును, మిక్కిలి యెత్తయిన టెక్కెములును, పలువన్నెలుగల టెక్కెపు గుడ్డలును గట్టఁబడి విరాజిల్లుచుండినవి. మఱియుఁ బట్టణమునందు జనులంద అచ్చటచ్చట గుంపులుతోడి, యభినయము చేయువారియొక్క యభినయములను, నాట్యమాడువారియొక్క నాట్యంపునేర్పులను, పాటలు పాడువారి పాటలను, మనస్సునకును చెవులకును నింపయిన మాటలను వేడుకతో వినుచుండిరి. మఱియు రాముని పట్టాభిషేకవార్త వినరాఁగానే జనులందఱు ముంగిళ్లలోను,

ఇండ్లలోను రాముని పట్టాభిషేకమునకు సంబంధించిన మాటలనే మాట లాడుచుండిరి. అయోధ్యాపురమునందలి బాలురందఱు తమతమ యిండ్ల వాకిళ్లయందుఁగూడి యాడుకొనుచు, "ఈదినమున రామునికి పట్టాభిషేకమహోత్సవము జరుగఁబోవుచున్నది. నేను మా తల్లిదండ్రులతోఁ గూడి వేడుకఁ జూడఁబోయెద" నని తమలోఁ దాము చెప్పుకొనుచుండిరి. రాముని పట్టాభిషేకమహోత్సవదినమునఁ బురజనులందఱు రాజవీథులందుఁ జక్కఁగా నీళ్లుచల్లి శుద్ధిచేసి, పూవులు వెదచల్లి, యగురు మొదలగు సుగంధద్రవ్యములతో ధూపములువేసి, గంధము చిలుకరించి, ప్రకాశింపఁజేసి రాత్రులందుఁ జీకటిలేక వెలుతురు బాగుగఁ దెలియుటకై యన్ని రాజవీథులయందంతటను వృక్షములవంటి దీపస్తంభములు నాటఁబడినవి.

ఆ పురమునసుండు జనులందఱు పట్టణము నిత్తెఱఁగున నలంకరించి, రాముని యువరాజ పట్టాభిషేకమహోత్సవముఁ జూడఁగోరినవారలై ముంగిళ్లయందును సభలందును గుంపులుగూడి పరస్పరము ముచ్చటించుకొనుచు దశరథనృపాలునిఁ గూర్చి యీ క్రిందివిధమునఁ గొనియాడిరి. "ఈ యిక్ష్వాకువంశమునకు సంతోషదాయకుఁడయిన మహాత్ముఁడగు దశరథమహారాజు తాను ముసలివాఁడనియు తనకు రాజ్యభారము మోయుట కష్టమనియు నెఱిఁగి రామునికిఁ బట్టాభిషేకము చేయఁ గోరెను. ఆహా! యేమి యీ దశరథుని బుద్ధిశాలితనము! లోకమున నెచ్చుతక్కువ లెఱిఁగినవాఁ డయిన రాముని మనకు రక్షకునిగా దశరథుఁ డేర్పఱచుట మనపైఁ బరమేశ్వరునికిఁ గల యనుగ్రహము వెల్లడియయ్యెను. రాముఁడు నెమ్మదిగలవాఁడు. గర్వములేనివాఁడు. సకల విషయముల నెఱింగిన పండితుఁడు. స్వధర్మములను దప్పనివాఁడు. ఇట్టి సకలగుణములతోఁ గూడిన రాముఁడు పక్షపాతము మాని తన తమ్ములం దెంతప్రేమయో యంత ప్రేమ మనయందు నుంచినవాఁడు. ఇఁక దశరథనృపాలుఁడు విచారము మాని చిరకాలము జీవించునుగాక! ఆయన యనుగ్రహముచేత రామునికిఁ బట్టాభిషేకము జరుగఁగా మనము చూడఁ గలము." అని యిట్లు జనులు తమలోఁ దాము దశరథునిఁ గొనియాడు చుండిరి. ఇట్లు పురజను లందఱొండొరులు మాటాడికొనుచుండఁగా,

దేశములోని జనులును బట్టాభిషేకవార్తను విన్నవారలై, రాముని పట్టాభిషేకమహోత్సవము చూచుటకై దిక్కుదిక్కులనుండి వచ్చి, యయోధ్యాపురియందు దిసుక చల్లినను రాలనట్లు గ్రిక్కిరిసి యుండిరి. అయోధ్యాపట్టణమున కట్లు నలుదెసలనుండి వచ్చెడు జనుల గుంపులు చేయు కలకలధ్వనులు పున్నమ మొదలగు పర్వకాలములందుఁ బొంగెడు సముద్రముయొక్క రొదవలె వినఁబడుచుండెను. అప్పుడు రాముని పట్టాభిషేకముయొక్క వేడుకను జూడఁగోరి దిక్కుదిక్కులనుండి వచ్చిన జనులుచేయు రొదలతో నిండినదై దేవేంద్రభవనముంబోలిన యయోధ్యాపట్టణము నీటిజంతువులచేఁ గలఁతపెట్టఁబడుచున్న సముద్రజలమువలె వెలయుచుండెను.

## 7-వ స ర్గ ము

మంథర యయోధ్యాపట్టణవైభవముచూచి కైకేయికిదుర్బోధనచేయుట

ఎచ్చటనో పుట్టి, కైకేయికిఁ బుట్టింటివారిచే నరణముగా నీయఁబడి యామెతోడ వచ్చియున్న మంథర యను నొక దాసి హఠాత్తుగాఁ జంద్రునిఁబోలు మేడయెక్కి, దుమ్మురేఁగకుండుటకై నీళ్లు చల్లఁబడిన రాజవీథులు గలదియు, వీథులందెల్లెడలను వెదచల్లబడిన పూవులరాసులు గలదియు నైన యయోధ్యాపురమును జూచెను. మఱియు నాయయోధ్యాపుర మా మంథర కంటఁ బడినపుడు మేలయిన టెక్కెములతోడను, గుఱుతులుగల టెక్కెములతోడను నలంకరింపఁబడినదియు, స్వేచ్ఛగాఁ రాకపోకల కనుకూలములయిన చిన్నవీథులుగలదియు, మంగళస్నానము చేసియున్న జనులతోఁగూడినదియుఁ, బుష్పమాలలను, భక్ష్యములను జేతఁ దాల్చిన బ్రాహ్మణులయొక్క సంతోష సూచకములయిన ధ్వనులతోఁ గూడినదియు, సున్నపుఁ బూఁతలచేఁ దెల్లనైన దేవాలయముల ద్వారములు గలదియు, సకలవిధములయిన వాద్యముల ధ్వనులతో నిండినదియుఁ, గడువేడుకతోఁగూడి గగురుపాటు చెందిన యొడళ్లుగల జనులచే నంతటఁ బఱవఁబడియుండునదియు, బ్రాహ్మణులయొక్క వేదఘోషములతో నంతట నిండినదియు, నుత్సాహవంతములయిన యేనుఁగులు గుఱ్ఱములుఁ గలదియు, గొప్పఱంకెలు వేయుచున్న యావులతోను, ఎద్దులతోను నిండినదియు, సంతోషముచేఁ గలిగిన రోమాంచము గలిగిన

వారగు పురజనులచే నెత్తఁబడియుండు ధ్వజములతోఁ గూడినదియునై వెలయుచున్న పట్టణముయొక్క వైభవముఁజూచి, యెక్కువ యాశ్చర్య మొందినదై, తెల్ల పట్టుచీరగట్టి, సంతసముచే బాగుగఁ గన్నులను విప్పు కొని తనకు దాపున నిలఁబడియున్న దాదిని జూచి, "ఏమి యీ వేడుక? రాముని తల్లియగు కౌసల్య యేదియో కోర్కె మనసునఁ దలఁచి యది నెఱవేఱుటకై యెక్కువ యానందముతోఁ గూడి జనులకు విశేషధనము నొసఁగుచున్నదా? ఏమి యీ జనుల యెక్కువ సంబరమునకుఁ గార ణము? లేక దశరథనృపాలుఁ డేమియైన నుత్సవమును జరిపింపఁ బోవు చున్నాఁడా?" యని యడిగెను. దాది యన్ననో, దీనికపటంపుఁ దలంపెఱుఁ గక, కడుపు పగిలిపోవునంత యెక్కువ సంతసమతోఁ గూడినదై, యా గూనిదగు మంథరకు రామునియొక్క యెక్కువ వైభవంబుఁ దెల్పఁ బూని, "మంథరా! రేపటిదినము తెల్లవాఱఁగనే దశరథమహారాజు దోషరహితుఁడగు రామునికి యువరాజపట్టాభిషేకము చేయనున్నాఁడు" అని చెప్పెను. ఆ గూనిదగు మంథర దాదిచెప్పిన మాటవిని యా మాట కోర్వలేనిదై, కైలాస శిఖరముంబోలు మేడనుండి దిగి, పాపపుఁ బనుల మీఁదనే తలంపుగలదై కోపముచేఁ గాల్పఁబడుచు, లోపలఁ బరుండి యుండు కైకేయికడ కేతెంచి యిట్లని చెప్పఁదొడఁగెను. "ఓ తెలివి మాలినదానా! లే లెమ్ము. ఏల పరుండియున్నావు? ఆపద నిన్నెదుర్కొని వచ్చుచున్నది. దుఃఖముల గుంపనెడు సముద్రములో మునిఁగిపోవు చున్న నిన్ను నీవు దెలిసికొనఁజాలకున్నావు. అదృష్టవంతురాలవుగఁ గనఁబడునట్టి యదృష్టహీనురాలా! "నామగఁడు నాయందెక్కువ ప్రేమ గల్గియుండుననియు, నే నేది చెప్పినను జేయువాఁడనియు, నేను భాగ్య వంతురాల ననియు నీ వెల్లప్పుడు డంబము లాడుచుందువు. నీ భాగ్య మెల్లను, వేసవియందలి నదీప్రవాహముమాడ్కిఁ జంచలమైనది. అది స్థిరముగాఁ నిలువదు" అని యిట్టు చెడుతలంపుగలదై పాపపుఁబనులనే వెదకు గూనిదగు మంథర చెప్పిన పలుకులు విని, కైకేయి యెక్కువ చింతనొందినదై, "ఓ మంథరా! నీమోముఁ జూడ నేదియో విచారము నొందియున్నట్లు తెలియుచున్నది. అందఱికిఁ గుశలమే కదా" యని యడిగెను.

ఆ మంథర కైకేయి యింపయిన పలుకులతో నడిగిన మాట విని, కోపముతోఁ గూడినదై, తాను మాటలలోఁ జమత్కారము గలదిగాన మఱింత దుఃఖమును మోహమునఁ గనఁబఱచుచు నా కైకేయి మేలు కోరినదై యా కైకేయికి వ్యసనమును గల్గించుచు రామునిమీఁది ప్రేమను విఱిచివేయుచు నిట్లనియె. "ఓ కైకేయీ! యెన్నటికిఁ దీరని యొక చేటు నీకు వాటిల్లినది. దశరథనృపాలుఁడు రామునికిఁ బట్టాభి షేకమును రేపటిదినము జరిపింపఁ బోవుచున్నాఁడు. నేను మఱలఁ బైకిఁ దలయెత్తుదు నన్న యాశలేక భయమున మునిఁగి, దుఃఖముతోను విచారముతోను నిండినదాన నైతిని. మంటలోఁబడి యొడలు కాల్చు కొన్నదానను బోలె నై నీమేలుగోరి యిక్కడి కతివేగముగ నేతెంచితిని. నీవు కష్టము ననుభవించుచుండఁగా, నాకు మఱింత కష్టమేకదా కలుగును. నీ వైశ్వర్యము గలిగియున్నఁగదా నేను నైశ్వర్యవంతురాలనుగ నుందును. దీన నేమి సంశయము లేదు. నీవు క్షత్రియకులమునఁ బుట్టి తివి. పుడమిఱేనికి రాణివైతివి. రాజుల నడతలు భయంకరము లని యేల తెలియఁజాలకున్నావు? నీభర్తయగు దశరథుఁడు ధర్మములు పలుకు వాఁడేకాని, మోసగాఁడు. తియ్యనిమాటలు మాటాడువాఁడేకాని, క్రూరుఁడు. అతఁడు నీయెడఁ జూపు మర్యాదలన్నియు వాస్తవము లనియే నీవు బేలవై నమ్మియున్నావు. నీ భర్త నీ కడకు వచ్చినప్పుడు మోహావేశముచే నీతో సమయానుసారములైన కొన్ని పనికిమాలిన యిచ్చకపుమాటలు చెప్పి నిన్ను మోసపుచ్చుచు నిప్పుడు ప్రయోజన మంతయుఁ గౌసల్య కిచ్చివేయనున్నాఁడు. చెడుతలంపు గలవాఁడగు దశరథుఁడు నీ కొమరుఁడగు భరతుని నీ పుట్టింటికిఁ బంపించి, యతఁడు లేనప్పుడు రామునికి శత్రువుల బాధలేని రాజ్యమునఁ బట్టాభిషేకము జరిగింపఁ బోవుచున్నాఁడు. రాఁబోవు చెఱుపును దెలియని యో మూఢురాలా! నీవు దశరథుని నీ ప్రియుఁ డని తలఁచి నీతొడపైననే యుంచుకొనెదవు. అతఁడు పామువంటివాఁడు. పామును బోషించెడు నొకతె యా పామునెత్తి తనతొడమీఁదఁ బెట్టికొనునట్లు, నీవు నీ మగనిని విడువక తొడమీఁద నుంచుకొని యున్నావు. తొడమీఁద నుంచుకొన్నను పాము కఱవక విడుచునా? తన తొడమీఁద నిడుకొని

బుజ్జగింపఁబడుచున్న యా పాము దన్నెత్తుకొన్నదాని నెట్లు కఱచునో, అట్లే యీ దశరథుఁడు నీచేఁ బ్రేమతోఁ జూడఁబడుచున్నను, నీ కపకారంబు సేయనున్నాఁడు. శత్రువునుగాని, పామునుగాని యుపేక్ష చేసినచో మనకు హానిగలుగును. ఇప్పుడు దశరథుఁడు నిన్నును నీ పుత్రుని వంచించి రామునకుఁ బట్టాభిషేకము చేసి, నిన్ను, నీ కొమారుని నీ పరివారములతోఁగూడ నన్యాయముపాలుచేయ నున్నాఁడు. ఓ కైకేయీ! యిప్పటి కింక నేమియు మించిపోలేదు, నీవు వేగిరమే నీకు మేలు గలుగఁ జేసికొనుము. ఆశ్చర్యపడినట్లు కానవచ్చుచున్నదానా! నిన్నును, నీ కొమరుని, నీ యాశ్రితురాలనగు నన్నును గాపాడుము." అని మంథర చేసిన దుర్బోధనెల్ల విని, కైకేయి చిఱునవ్వు మోముగలదై, సంతోషముతోఁ బాన్పునుండి లేచి కూర్చుండి శరదృతువునందలి చంద్రరేఖవలె విరాజిల్లుచుఁ దన సంతోషమునకు సూచనగా నా గూనిమంథరకు మేలైన యొక భూషణము నొసఁగెను. అట్లు కైకేయి గూనిమంథర కొక్క భూషణ మొసఁగి, వెండియు దానితో నిట్లనియె. "ఓ మంథరా! నీవు నా కిప్పుడు ప్రియమైన వార్తను దెల్పితివి. ఇట్టి సంతోషవార్తను దెలిపిన నీ కింకను బ్రియమేమి చేసెదను. రాముఁడును, భరతుఁడును నా కొకటె. నాకుఁ బక్షపాతము లేదు. కావున రామునిపట్టాభిషేక వార్త విని మిక్కిలి సంతోషము నొందితిని. నీ విప్పుడు చెప్పిన యెక్కువ సంతసపు మాటకంటె నెక్కువ సంతసమొదవుమాట యేమి చెప్పెదవు? నీవు నా కిట్టి ప్రియవాక్యము చెప్పితివిగాన నీ కింకను నే నేమివరము నీయవలెనో చెప్పు"మని కైకేయి మంథర నడిగెను.

## ౮-వ సర్గము.

### కైకేయి మంథర దుర్బోధలకు లోఁబడుట

మంథర కైకేయియొక్క తీరును జూచి, నిట్టూర్పు నిగిడించి, తన హిత వాక్యమును వినలేదన్న కోపమును, తన యజమానురాలికిఁ గష్టములు రాఁబోవుచున్నవనెడు దుఃఖమును గలిగినదై కైకేయిం జూచి, "ఓసీ మూఢురాలా! దుఃఖమనెడు సముద్రముయొక్క నడుమ నున్న నిన్ను నీవు తెలిసికొనక యున్నావు. ఓ దేవీ! విచారపడవలసిన విషయమున సంతసము నొందితివి. ఇంత గొప్ప యాపద వచ్చినపు

డేమియు నగవకున్నావుగాని నేను మఱింత దుఃఖపడుచున్నాను. నీ తెల్విలేనితనమునకై నేను నగుచున్నాను. తెల్విగలిగిన యొకతె యిట్టి యిడుమ వచ్చినప్పుడు సంతోషమొందునా? సవతిబిడ్డనికిఁ గలిగిన మృత్యుదేవతరాకవంటి మేలును జూచి యెవతె నీ బోఁటిది సంతోషము ననుభవించును? భరతునివలన మాత్రమే రామునికి భయము గలదు. ఏల యనిన? రామునితో సమానముగా రాజ్యమునొందుటకు భరతుఁడు తగినవాఁడు. ఎవఁ డెవ్వనివలన భయపడునో, యతనికి వాని వలన భయంబు ముఖ్యముగాఁ గల్గును. మనుష్యులం జూచి పాములు మొదలగునవి భయపడునుగాన, వానివలన మనుష్యులకు భయము విశేషముగఁ గలుగును. కనుక భరతునివలన రామునికిఁ గలగిన భీతిం గూర్చి నేను మిక్కిలి విచారము నొందినదాన నైతిని. - అంతియకాక, గొప్ప విలుకాఁడగు లక్ష్మణుఁడు సర్వవిధములచేతను రాము ననుసరించి యుండును, లక్ష్మణుఁడు రాము ననుసరించి యుండునట్లు శత్రుఘ్నుఁడును భరతు ననుసరించి యుండును. పుట్టిన వరుసప్రకారము చూచినను, రాజ్యము భరతునికేకాని చిన్నవారయిన లక్ష్మణ శత్రుఘ్నులకు దొరకఁజాలదు. అన్నిశాస్త్రములను జదివిన పండితుఁడును, రాజనీతుల నెల్లఁ జక్కఁగాఁ బరిశీలించినవాఁడును, సమయమునకుఁ దగిన పని చేయువాఁడు నైన రామునివలన నీ కుమారుఁడగు భరతునకు గొప్ప యాపద వచ్చె నని తలఁచినపుడెల్ల నా మనస్సు తల్లడిల్లుచున్నది. నీసవతియగు కౌసల్య యదృష్టవంతురాలుగదా! రేపటి పుష్యమీ నక్షత్రమునాఁడు బ్రాహ్మణోత్తము లందఱు చేరి యా కౌసల్యకుమారుఁడయిన రామునికి గౌరవింపఁదగిన పట్టాభిషేకము జరుపఁబోవుచున్నారు. అట్లు తన కొడుకగు రామునికిఁ బట్టాభిషేకంబు సేయుటచే నెక్కుడయిన సంతసముఁ బొంది, లోకమందుఁ బ్రసిద్ధిఁ గాంచి, సవతులు మొదలగు శత్రువుల నెల్ల నడంచి, వెలయుచున్న కౌసల్యకు నీవు చేతులు జోడించికొని పనికత్తెవలె నామె చెప్పిన పనుల నెల్లఁ జేయుచుండవలసినది. నీవు కౌసల్యకు మాతోఁగూడఁ బరిచారిక వగుదువేని, భరతుఁడును రామునికి బంటగును. అప్పుడు రాముని యంతఃపురస్త్రీలు సకలసంపదలు గలవారు గనుక మహాసంతోషముతో నుందురు. నీ కోడం డ్రన్ననో,

భరతుని లేమిడిదకెనుబట్టి సంతసము మాని విచారగ్రస్తులై యుందురు" అని మంథర కైకేయితోఁ జెప్పెను.

అట్లు మహాప్రేమతోఁ దియ్యని మాటలు పలుకుచున్న మంథరం జూచి, "రాముఁడు పట్టాభిషేకమునకుఁ దగిన యన్ని గుణములు గలఁ వాఁడే కదా! అతనికిఁ బట్టాభిషేకము జరుపుట కాక్షేప మేమి? రాముఁడు ధర్మముల నన్నిటిని నెఱిఁగినవాఁడు. గురువులవద్ద విద్యలు నేర్చికొని యింద్రియముల నడఁగించినవాఁడు. చేసినమేలు మఱువని వాఁడు, సత్యము పలుకువాఁడు, పరిశుద్ధుఁడు. రాముఁ డిట్టి సుగుణ గణంబులు గలిగియుండుటయే కాక, రాజునకుఁ బెద్దకుమారుఁడు, కావున నతఁడు యువరాజపట్టము నొందుట కర్హుఁడు. అతఁడు పట్టాభి షిక్తుఁడయి, దీర్ఘాయువు గలిగి తన తమ్ములను, పనివారినిఁ దండ్రివలెనే కాపాడఁ గలఁడు. ఓ గూనిదానా! రాముని పట్టాభిషేకవార్తను విని నూతేం డ్లయినపిదప వంశ పారంపర్యముగా వచ్చు రాజ్యమును బాలింపఁబోవుచున్నాఁడు. ఓ మంథరా! యిప్పుడు రాముని పట్టాభిషేక రూపంబయిన శుభంబు జరుగుచుండఁగా, భరతుని పట్టాభిషేక రూపం బగు మంగళ మీఁకమీఁద జరుగఁబోవుచుండఁగా, నీ వేల యిట్లు కుందు చున్నావు. అంతియకాక, నాకు భరతుఁ డెట్టులో యట్టులు రాముఁడు మర్యాద సేయఁదగినవాఁడు. ఆ రాముఁడును దన సొంతతల్లియగు కౌసల్యకంటె న న్నెక్కువగా గారవించి నాకు శుశ్రూషలు సల్పు చుండును. రామునకు రాజ్యము వచ్చినను భరతునికిని వచ్చినట్లే, రాముఁడు త న్నెట్లు చూచుకొనునో యట్లే తన తమ్ములను జూచు కొనుచు భేదము లేక యుండును గాన వారిలో నెవరికి రాజ్యము వచ్చినను నా కొక్కటియె" యని కైకేయి మంథరతోఁ జెప్పెను.

ఇట్లు కైకేయిచెప్పఁగా విని మంథర మిగుల వగచి వేఁడినిట్టూర్పు పుచ్చి కైకేయిం జూచి యిట్లనియె: "ఓకైకేయి! మంచిచెడ్డ లెఱు గనిదానవై, నీకు రాఁబోవు వ్యసనము నెఱుఁగకున్నావు. భరతునకు రాజ్యము లేకపోవుట, రామునికిఁ బట్టముగట్టుట యను రెండుదుఃఖము లతోఁ గూడిన కౌసల్యదాసి వై యుండుట యను సముద్రమున మునుఁగు

చున్న నిన్ను నీవు దెలియఁజాలకున్నావు. 'రాముఁడు పెద్దవాఁడు గాన
నిప్పుడు పెద్దవానికిఁ బట్టాభిషేకము జరుగును. వానికిఁ బిదప భరతునికిఁ
పట్టాభిషేకము జరుగగలదు' అని చెప్పితివి. ఓసీ వెఱ్ఱిదానా! అట్టి
వాడుక యెక్కడనైనఁగలదా? రాముఁ డిప్పుడు రాజు కాఁగలఁడు.
వానికిఁ బిదప వాని కొమరుఁడు రా జగునుగాని, భరతుఁడు రాజు
గానేరఁడు. కావున, కైకేయీ! భరతుఁడు రాజవంశమునుండి తొలఁ
గింపఁబడును. పిదప నాతనియొక్క పేరుగాని యూరుగాని యుండదు.
ఓ భామినీ! (కోపముగలదానా!) ఒకరాజున కెందఱు కొడుకులు పుట్టు
దురో, వారికందఱికిని రాజ్యంబు రానేరదు. అట్లందఱు రాజ్యము
నందు రాజులుగాఁ జేయఁబడిరేని, యట్టి రాజ్యమునందుఁ గడు గొప్ప
యన్యాయములు జరుగును. ఒచ్చెములు లేని యంగములుగలదాన!
కాఁబట్టి పుడమియేలికలు తమ చిన్నకుమారులు పెద్దవానికంటె గుణ
వంతులుగ నున్నను, పెద్దవానికే రాచకార్యముల నప్పగింతురు.
ఓ కైకేయీ! నీవు బిడ్డలపైఁ బ్రేమగలదానవు. అయినను నీ పుత్త్రుని
స్థితినిగూర్చి యాలోచింపుము. రాముఁడు రా జగునేని, నీ కొడుకగు
భరతుఁ డధికారము లేమిచేత ననాథునివలె సకల సుఖములు లేనివాఁ
డగును. రాజవంశమున నితని పేరే లెక్కకు రాకపోవును.

కావున నేను మేడపై కెక్కి రాముని పట్టాభిషేక మహోత్సవ
ప్రయత్నమెల్లఁ జూచి, యయ్యో! మనకైకేయిదశ హీనమాయెఁ
గదా యని యెంచి, యతిత్వరగ దిగివచ్చి నీకు మేలు గోరి యింత
దూరము చెప్పితిని. నీకు నే నెంత మంచిమాట చెప్పినను, నామాట
నెఱుఁగకున్నావు. అటు గానిచో సవతికి మేలు గలుగుచుండఁగా, నీవు
నా కీ హారమును బహుమతి యియ్యవచ్చితివే! ఏ వెఱ్ఱులైన నిట్లు
చేయుదురఁటవే! నీ కెక్కువ యదృష్టము పట్టవలెను. అప్పుడు నీ వేది
యిచ్చినను నేను దీసికొనవచ్చును. నీదశ తగ్గుస్థితికి వచ్చుచుండఁగా,
నీ వీ భూషణమిచ్చుట యేల? నీ వట్లొసఁగినను నేను దీనిని గైకొం
దునే? నా కిది యక్కఱలేదు. నీవు బాగున్నఁ జాలును. రాముఁడు
శత్త్రురహితమయిన రాజ్యమునకు వచ్చెనేని, భరతుని దేశాంతరము
నైనను, కాదేని, లోకాంతరమునైనను (పరలోకమునైనను) బొందిం

చును. ఈ సంగతి నిజము. భరతుఁడు పసివాఁడుగ నుండునప్పుడే, వానిని మేనమామ యింటికిఁ బంపితివి. కదలక మెదలక యొక్కచోటనే యుండు స్థావరములందుఁగూడ దాపున నుండుట వలనఁ బ్రేమ గలుగుచున్నది. అట్లుండఁగా, భరతుఁడు తండ్రికడనే యుండి యతఁడు చెప్పిన పని చేయుచుండినపక్షమున, భరతునిపైఁ బ్రేమగలిగి, భరతునికే దశరథుఁడు రాజ్యం బిచ్చియుండునుగదా! అది నీవే పోఁగొట్టుకొంటివి. శత్రుఘ్నుఁడును భరతుని యధీనతలో నుండువాఁడు గాన, రాముని లక్ష్మణుఁడు వెంబడించునట్లు భరతుని వెంబడించిపోయెను. శత్రుఘ్నుఁ డున్నను, రామునిఁ బట్టాభిషిక్తుఁజేయ నాటంకపఱచి, భరతుని విషయమై కొంత ప్రేరణసేసియుండును. లక్ష్మణుఁడు రాముని ననుసరించియున్నవాఁడు గావున నాతనికి రాముని పట్టాభిషేకంబు సమ్మతమే యయియున్నది. ఇదియెల్ల భరతుఁడు దగ్గఱ లేని దోషముగాని మఱొక్కటిగాదు. తొల్లి యడవిలోఁ గట్టెలు నఱుకువా రొక చెట్టును నఱుకరాఁగా, దాపుననున్న ముండ్లదుబ్బలా చెట్టును జెలిమిచే నఱుకనీయక, దానికిఁ గలిగిన భయంబును బోఁగొట్టినవని నీవు వినలేదా? అట్లే భరతుఁడు తండ్రిదాపుననే యున్న పక్షమున భరతునిపైఁ బ్రేమయుంచి, రాజ్యంబు భరతుని కిచ్చి యుండును. లక్ష్మణుఁడు రామునికిఁ గాఁపుదల. వా రన్నదమ్ము లిరువు రశ్వినీదేవతల చందమున మిక్కిలి యొద్దికగలిగియుందు రని లోకప్రసిద్ధి కావున లక్ష్మణుని విషయమున రాముఁ డెట్టిహానియుఁ దలఁపఁడు. భరతునికిఁ గీడు తలఁచు నను విషయముఁ గొంచెమైనను సందియము లేదు. కావున నో కైకేయీ! నీకొడుకు మేనమామ యింటినుండి యా మార్గమునసే యడవికిఁ జనుట మేలు. ఇదియే నీకును మిక్కిలి మేలయినది. యని నాకుఁ దోఁచుచున్నది. రాముని పట్టాభిషేకమునకుఁ బిదప భరతుఁడిక్కడికి వచ్చెనేని, రాముఁడు వానిని దఱుమును, లేనిచోఁ బ్రాణమును దీయును. దానిచే నీ కేకపుత్రశోకము వాటిల్లును. కావున భరతుఁ డచ్చటినుండియే యడవికిఁబోయిన నూఁపిరితో నుండి నీకుఁ గొడుకుగా నుండును. నీకును బుత్రశోకంబు గలుగదు. భరతుఁడు న్యాయ్యముగాఁ దన తండ్రిదయిన రాజ్యమును బొందునేని, నీ బంధు

వుల కంటెటికి మేలు గలుగును, కైకేయీ! "ఏల రాముఁడు తమ్ముఁడయిన భరతునిమాత్రము చంపును, లక్ష్మణుని నేమియుఁ జేయక ప్రేమతోఁ జూచుచుండఁగా, నితనిని మాత్ర మట్లు చూడఁడా?" యని యందువేమో? ఓ కైకేయీ! సుఖము లనుభవింపఁదగిన మన పిల్లవాఁడు (భరతుఁడు) రామునకి సహజశత్రువు. "అయిననేమి? భరతుఁడు లక్ష్మణుని వలెనే యన్న ననుసరించియుండిన, రాముఁడు లక్ష్మణునివలె భరతునిఁ గూడఁ బ్రేమతోఁ జూడఁడా?" యని యందువేమో కైకేయీ! లోకమున సొమ్ము పోఁగొట్టుకొన్న వాఁడు తన సొమ్ములాగుకొన్న వాని వశమున నుండ మన సొప్పునా? కావున భరతుఁ డేదియో యొక్క మాట యనవలసి యుండును. దానిచే రాముఁడు కనలి భరతునిఁ దన యాగ్రహమునకుఁ బాత్రునిఁగాఁ జేయును. కావున నడవియం దొక సింహముచే వెంబడించి తఱుమఁబడిన యేనుఁగులమేటి గుంపును గాపాడెడి యేనుఁగునువలె రామునిచే నాక్రమింపఁ బడఁబోవు నీ కొడుకగు భరతుని గాపాడు కొనుము. మునుపు నీవు "నా భర్త నాపై మిక్కిలి యనురాగము గలిగి యున్నాఁడుగదా. ఇఁక నాకేమి కొదవయున్న?" దని గర్వించి, రాముని తల్లియు, నీ సవతియునగు కౌసల్యను నిరాకరించి మాటాడితివి. ఇప్పు డామెకొడుకు రాజైనయెడల నామె తన పగను దీర్చుకొనకయుండునా? ఓ భామినీ! అనేకములయిన గనులతోడ వెలయుచున్న యీ భూమండలమును రాముఁడు పరిపాలింప నారంభించినంతటనే, నీవును దీనురాలవై, చెఱుపును, అవమానమును బొందుదువు. భరతునకును లేని యాపదను, ఓటమిని గలిగింతువు. రామునకు భూపాలనము వచ్చెనేని, భరతుని మాట నీవు మఱచిపోవవలసినదే. కావున భరతునికి రాజ్యము వచ్చు విధమును, ఎదుటివాఁ డడవికిఁబోవు నుపాయంబును నాలోచింపుము" అని మంథర కైకేయికిఁ బలుమాఱు దుర్బోధనఁ జేసెను.

## 9-వ సర్గము

మంథర కైకేయికి మునుపటివరంబుల జ్ఞాపకపఱచుట

ఇట్లు మంథరచేసిన దుర్బోధనలచే జనించినదై, కైకేయి కోపముచే మండుచున్న మోముగలదై, వేఁడి నిట్టూర్పులు నిగిడించి, యా మంథరతో నిట్లనియె.

ఓమంథరా! యిప్పుడే రాముని వేగిరముగ వనంబు కేగించె దను. భరతునకు నిప్పుడే పట్టాభిషేకము జరిపించెదను. ఓ మంథరా! యే యుపాయమున్నను భరతునకుఁ బట్టాభిషేకము జరుగును? రామున కది యెవ్విధమున జరుగకయుండును? అట్టి యుపాయము బాగుగా నాలోచించి చెప్పు" మని మంథరను కైకేయి యడిగెను. పాపపుఁ బనులు సేయునట్టి యా మంథర రాముని కార్యమును జెఱుపఁ గోరి నదై కైకేయితో నిట్లనెను. "ఓ కైకేయీ! యాహా! యిదిగో చెప్పె దను! ఇదొక గొప్ప క్రమమా! నేఁ జెప్పుమాటను వినుము. నామాట ప్రకారము నడచుకొందువేని, భరతుఁ డీ రాజ్యము నంతయు బొందును. ఓ కైకేయీ! నీకు జ్ఞప్తిలేదా? నీకు జ్ఞప్తియుండియు, దానిని నీవు మఱుఁగుపఱచెదవా? లేక నేను జెప్పెడి మాటను విన వలయునని కోరెదవా? ఓ సొగసులాడీ! అట్లు నేను జెప్పఁగా వినవలె నని నీకుఁ గోరిక గలదేని, చెప్పెదను వినుము. అట్లు వినినను, నీవు 'ఇది తగునా తగదా' యని యాలోచింపుము." అని మంథర చెప్పఁగాఁ, గైకేయి బాగుగాఁ బఱచిన పాన్పుమీఁదనుండి కొంచెము లేచి కూర్చుండి, "ఓయీ మంథరా! రాముఁడు రాజ్యము నొందకుండుట కును, భరతునకు రాజ్యము వచ్చుటకును నే యుపాయంబు చేయ వలెను? అట్టి యుపాయమును నాకుఁ జెప్పుము" అని యడుగఁగా, గూనిదగు మంథర క్రూరపుఁ బనులందుఁ దలంపుగలది యగుటం జేసి రాముని పట్టాభిషేక కార్యమును జెఱుపఁగోరి కైకేయితో నిట్లనియె.

"కైకేయీ? తొల్లి యొకప్పుడు నీ ప్రియుఁడు దేవాసురయుద్ధ మున దేవేంద్రునికి సాయము సేయఁగోరి నిన్నుఁ గూడఁ దీసికొని, రాజ ఋషులతోఁడ గూడి దక్షిణదిక్కున దండకారణ్యములందు మత్స్యధ్వజుం డేలునట్టి వైజయంత మనెడిపురంబున కేఁగెనుగదా! అచ్చట శంబరుఁ డని ప్రసిద్ధిఁ గాంచిన యొక గొప్ప యసురుఁడు నూఱులకొలఁది మాయలు గలవాఁడని ప్రసిద్ధి కెక్కియుండెను. అతఁడు దేవాసురులచే జయింపఁబడనివాఁడై యింద్రునితో సమరంబు సేయఁబూనెను. ఆ గొప్ప యుద్ధమున గాయములు దగిలి క్రిందఁబడి, రాత్రులందు నిద్రించుచున్న దేవతల సేనల నెల్ల రాక్షసులు వేగముగ వచ్చి-

యుండఁగని జంపుచుండిరి. అప్పుడు దీర్ఘబాహువులుగల నీ మగఁడు తాను బాణములచేఁ దూట్లు చేయఁబడియున్నను, ఆ యసురులతో గొప్ప పోరు చేసెను. ఆ పోరునందు రాక్షసులు బాగుగా శస్త్రములతోఁ గొట్టుటచే నీ మగఁడు మూర్ఛిల్లెను. అప్పుడు స్మృతితప్పి పడియున్న నీ మగనిని నీవు యుద్ధరంగమునుండి యావలికిఁ గొనిపోయి, శీతలోపచారములు చేసి, శత్రువులబారినుండి తప్పించి కాపాడితివి. అప్పుడు రాజు మఱలఁ గొంతసేపటికిఁ దెప్పిఱిల్లి సంతసించి, ఓ శుభదర్శనా! రెండువరములను నీకొసంగెను గదా? అప్పుడు నీవేమి బదులు చెప్పితివో జ్ఞాపక మున్నదా? అప్పుడు నీవు "నాథా! నే నెప్పుడీ రెండువరములఁ గోరుదునో, యప్పుడు నా కీ"మ్మని చెప్పితివిగదా. ఆ మాటల కా మహాత్ముఁడు సమ్మతించెనుగదా. నా కీ సంగతి యెట్లు తెలియును? నీవే కదా నాతో నీ సంగతిఁ దెల్పితివి. నీపైఁ బ్రేమచే నే నింక నాకథను మఱచిపోక జ్ఞప్తియం దుంచియున్నాను. ఇప్పుడు దశరథుని రాముని యభిషేక ప్రయత్నమునుండి నిలిపి, యారెండు వరముల నిప్పు డడుగుము. వానిలో నొక్కటి భరతునికిఁ బట్టము గట్టుట, రెండవది రాముని బదునాలుగేం డ్లడవికిఁ బంపుట. ఈరెండు వరములఁ గోరుము. ఈ రెండువరముల నతఁడు తప్పక నీ కొసఁగును. రాముఁడు పదునాలుగేండ్లు వనవాసంబుసేసి మఱలివచ్చినను, నీ కుమారుం డింతలోపల జనుల యనురాగమునకుఁ దగినవాఁడై, శత్రువులచేఁ గదలింప నలవిగానివాఁ డగును.

ఓ యశ్వపతి కూఁతురా! కోపగృహమునకుఁ బోయి, సొమ్ముల నెల్లఁదీసిపాఱవైచి, చింపిపేలిక యొకటిఁజుట్టుకొని, కటికినేలపైఁ గోపగించినదానివలెఁ బరుండియుండుము. నీభర్త యచ్చటికి వచ్చునేని, యతనిని తలయెత్తిచూడకుము. అతనిని హెచ్చరింపకుము. మఱియుఁ జింతతోఁ గూడి యాతనినిఁ జూచి యేడ్చి కన్నీరు విడుచుచుఁ దలవంచి నేలపైఁ బరుండియుండుము. నీవు నీ మగనికి నెల్లప్పుడు ముద్దులుగుల్కు కాంతవు. నీ నిమిత్తమై యతఁ డగ్నియందైనను జొరఁబడును. ఈ విషయము నేను దృఢముగాఁ జెప్పఁగలను. ఆ దశరథుఁడు నీకుఁ గోపము పుట్టింపఁజాలఁడు. నీవు కోపగించుకొన్నయెడలఁ గోపముతోనున్న

నిన్నుఁ జూడనైనను జూడఁ జాలఁడు. నీకుఁ బ్రియముఁ గావించుటకై యమ్మహారాజు తన ప్రాణములనైనను విడువనోపును. ఆ పుడమిఱేఁడు నీ మాటను దాఁటిపోఁజాలఁడు. తిన్నని స్వభావముగలదానా! నీకుఁగల సౌభాగ్యబలమును (=తాను చెప్పిన చొప్పున మగఁడు నడచుకొనుట యనెడి బలమును) దెలిసికొనుము. నీవు కోపముతోఁ గోపగృహమునం దుండునప్పుడు నిన్ను బుజ్జగించుటకై మణులను, ముత్యాలను, బంగారమును, నవవిధ రత్నములను, నీ కీవచ్చును. వానియం దెల్ల మనసుంపకుము. నీకు నీపతి మున్ను దేవాసురయుద్ధమున నొసఁగిన రెండువరంబుల నిప్పు డిమ్మని యడుగుము. ఓ మహాభాగ్యవంతురాలా! ఆ సంగతి మఱచిపోకుము. ఎప్పుడు దశరథుఁడు తానుగ నిన్ను లేపి కూర్చుండఁబెట్టికొని వరము లిచ్చెద నని చెప్పునో, నీవు నీ మగని నొత్తియొత్తి యడిగి, యిచ్చెద నన్నమాట గట్టిచేసికొని, రామునిఁ బదునాలుగేం డ్లరణ్యమునకుఁ బంపుము. రాజశ్రేష్ఠుఁడయిన భరతునిఁ బుడమియేలికగాఁ జేయుము. రాముఁడు పదునాలుగేం డ్లరణ్యవాసము సేసి మరలి వచ్చునంతలో భరతుఁడు నాఁటుకొని వేళ్లుపాఱి, తక్కిన యేండ్లు స్థిరముగా నుండును.

"ఓ దేవీ! రెండవ వరమును రామునిఁ బదునాలుగేం డ్లడవికిఁ బంపునట్లు కోరుము. అట్లయినచో నీ పుత్రుని కార్యము లన్నియు నెఱవేఱఁగలవు. ఇట్లు వనవాసమునకుఁ బంపఁబడిన రాముఁడు పదునాలుగేండ్లకుఁ బిదప వచ్చినను, జను లతనియందుఁ బ్రేమఁగలిగియుండఁ జాలరు. నీ పుత్రుఁడగు భరతుఁడు శత్రుల నందఱిని రూపుమాపి, రాజు కాఁగలఁడు. రాముఁడు వనవాసము పూర్తిగావించి వచ్చునంత లోపల భరతుఁడు బాగుగ వేళ్లుపాఱినచెట్టువలెఁ గుదుటఁబడినవాఁడయి, సేనల నెల్ల సేకరించుకొని, తనమేలు గోరు చెలికాండ్రతోఁ గూడి, ధైర్యము గలవాఁడయి యుండును. రాముఁడు వనవాసమునుండి మఱలివచ్చినను, సహాయసంపద లేమిచే భరతుని నేమియుఁ జేయఁ జాలఁడు. కావున ఓ కైకేయీ! యిపుడు నీవు మహారాజును బట్టాభిషేక ప్రయత్నము చేయనీక నిలుపుటయే తగుపని" యని చెప్పెను.

కైకేయి తాను స్వాభావికముగా మంచి తలంపు గలదైనను, ఆ గూనిదానియొక్క మాటల కెక్కువ యచ్చెరువొంది, బెదరి దారితప్పి పోయిన పెంటిగుఱ్ఱపుఁ బిల్లవలెఁ జెడ్డదారిలోఁ బ్రవేశించినదై, సంతసముతోను, పులకలతోను గూడి యామంథరతో నిట్లనియె. "ఓ గూనిదానా! నీ వింత మంచి యుక్తులఁ దెల్పుదాన వనియుఁ, బూజ్యురాల వనియు నే నింతదనుక నెఱుఁగ నైతిని. లోకమునఁ గూనివాండ్ర కెక్కువ యాలోచనశక్తిగలదండ్రు. నీవు వారినందఱిని మించినదానవుగా నున్నావు. ఆహా! నీవిప్పు డెంత మంచి యాలోచన చెప్పితివి! నీ వొక్కతెవె యెల్లప్పుడు నా పనులందు శ్రద్ధగలిగి, నామేలు గోరుచుందువు. ఓ గూనిదానా! నీ విపుడు విప్పి చెప్పునంతవఱకును రాజుగారి తలం పిట్టి దని నే నెఱుఁగలే నైతిని.

లోకంబున నెందఱో గూనివాండ్రున్నారు. వార లెచ్చుతక్కువయయిన యంగములు గలవారలై మహా భయంకరులుగా నుందురు. నీ వందఱు గూనివాండ్రవలెఁగాక, వాయువుచేఁ గదలింపఁబడిన కమలమువలె ముందుకు వంగి చూపఱకుఁ జూడఁదగియుందువు. నీ ఱొమ్ము మిక్కిలి పట్టుగలిగినదై మూఁపులవఱకు నెత్తైయున్నది. నీ బొజ్జయుఁ జక్కని బొడ్డుగలదై, "నాతోఁగూడనుండు ఱొమ్మంత పొడవుగలిగి యుండునదిగదా. నే నంత పొడవుగల్గియుండుటకు వీలు లేకపోయెఁగదా" యని సిగ్గుపడి క్రిందికిఁ బోయి సన్నగించియున్నది. స్తనములు బలిసియున్నవి. మంథరా! నీ మోము నిర్మలమైన పున్నమచందురునిబోలి వెలుఁగుచున్నది. నీ మొల గల్లుగల్లుమని మ్రోఁగెడి గజ్జెల యొడ్డాణముచే విలసిల్లుచున్నది. నీ పిక్కలు మిక్కిలి సొంపుగా నున్నవి. నీపాదములు రెండును మిక్కిలి పొడవుగా నున్నవి. నీవు వెడల్పయిన తొడలతోఁగూడి తెల్లని పట్టుచీరఁగట్టి నాకు ముందటఁ బోవుచుండఁగా, నాఁడురాయంచవలె నొప్పియుందువు. అసురులకెల్ల ఱేఁడగు శంబరాసురునికడ నుండిన వేయితంత్రములు నీకడ నున్నవి. అవి మాత్రమే కాక యింక నెన్నియో తంత్రములు వేలకొలఁదిగా నీకడ నున్నవి. రథములోని యొక యంగమగు ముక్కుపలె నుండెడి యీనీగూనునందు నీకుఁగల బుద్ధులు, క్షత్త్రియ విద్యలు, తంత్రములు

నున్నవి. ఓ గూనిదానా! భరతునికి బట్టాభిషేకంబయి, రాముఁడు వనంబునకుఁ బోయినపక్షమున నీగూనునం దీ బంగారుహారము నుంచెదను. మంథరా! నాకార్యము నెఱవేఱి నాకు సంతసము గలుగునేని, నేను నీ గూనును జక్కఁగాఁ బుటము వేయఁబడిన మంచి బంగారునీరు పూయించెదను. నీ మోమునందు స్వర్ణమయమయిన యందమగు బొట్టు పెట్టించెదను. ఓ గూనిదానా! నీకు మేలయిన యాభరణముల నొసఁగెదను. నీవు నే నొసఁగు చీరఁగట్టి కంచుకముఁ దొడిగి పైఁటవేసి కొని యప్సరసవలె వెలుఁగుచుఁ దిరుగుచుందువు. నీవు చంద్రుని జగడమునకుఁ బిల్చుమోముచే వెలుఁగుచు శత్రువులనెల్లరఁ జూచి గర్వించుచు మేలయిన నడకతో నడచిపోవుచుందువు. ఓ గూనిదానా! నీవెట్లు నిరంతరము నా పాదములఁ గొల్చుచుందువో, అట్లే సకల భూషణములఁదాల్చిన పలువురు గూనివాండ్రు నీకాళ్లకు మ్రొక్కుచుఁ దిరుగుచుందురు." అని చెప్పి కైకేయి మంథరను బొగడెను.

ఇట్లు మంథర కైకేయిచేఁ గొనియాడఁబడుచుఁ దెల్లనైన పాన్పునందుఁ బరుండి, వేదికయందలి యగ్నిజ్వాలవలె వెలుఁగుచున్న కైకేయిని జూచి "ఓ యందకత్తెయగుదానా! నీ రంతయుఁ బాఱిపోయిన పిదప జెలువునకుఁ గట్టగట్టుటచే నుపయోగములేదు. రాముని పట్టాభిషేకంబయిన పిదప రాజును నీవు వరంబు లడిగినను నేమియు నుపయోగంబు లేదుగదా. లెమ్ము. కోపగృహంబునకుఁ బోయి, నేఁ జెప్పినతీరుగా వేసముఁ దాల్చి, రాజుగారి రాక నెదురు చూచుచుండుము" అని చెప్పెను.

అట్లు మంథర చెప్పిన మాట విని కైకేయి పాన్పునుండి లేచి, మంథరతోఁ గూడఁ గోపగృహము చేరి, తా నెట్లు చెప్పినను దన మగండు వినఁగలఁడని గర్వించినదై, తాను దాల్చియుండిన లక్షవరహాలు వెలగల ముత్యాలహారములను, మేలయిన యుత్తమభూషణంబులను దేహము నుండి యొలిచి, తాను బంగారువంటి చాయగలదైనను, గూనిదాని యొక్క మాటలకు లోఁబడినదై నేలబరుండి మంథరతో నిట్లనియె.

"ఓ గూనిదానా! నీవు నే నిచట మృతినొందితినని మాతండ్రియగు కేకయరాజునకుఁ దెలుపుదువు. అట్లు కాదేని, రాముఁ డడవికిఁ

బోఁగా భరతుఁడు భూమినైనను బొందఁగలఁడు. ఈ రెంటిలో నేది యైన నొక్కటి జరుగుట నిజము. నాకు రాజు బంగారుభూషణము లొసఁగినను, నా కవి యక్కఱలేదు, రత్నము లిచ్చినను నేను గైకొనను. సకల భూషణము లొసఁగినను నేను గోరను. రామునికే పట్టాభిషేకంబు జరిగెనేని, యీ ప్రాణములు వదలుటయే నిజము."

అంతట గూనిదియగు మంథర నృపాలుని దేవియు, భరతునితల్లియు నైన కైకేయిఁగూర్చి యామెకు మేలుగూర్చునట్లును, రాముని విషయమునఁ గీడు గలుగునట్లును నెక్కువ పరాక్రమముతోడఁ గూడిన పలుకులతో నిట్లనియె.

"ఓ కల్యాణీ! రాముఁడే యీరాజ్యమును బొందెనేని, నీవు నీ కొమరునితోఁగూడఁ గీడు చెందుట నిజము. కావున నీ కొమరుఁడగు భరతునకుఁ బట్టాభిషేకమగు ప్రయత్నము చేయుము" అని యీ ప్రకారంబుగ గూనిదగు మంథరచే మాటిమాటికిఁ బ్రయోగింపఁబడిన మాటలనెడు బాణములచే బాగుగఁ గొట్టఁబడి, మిక్కిలి నొచ్చినదై, తొమ్మునఁ జేతు లప్పళించుకొని, మాటిమాటికి నాగ్రహముఁ దెచ్చుకొనుచు గూనిదానిఁ గొనియాడి, దానింగూర్చి, "యోగూనిదానా! నేను గోపగృహంబునుండి యమునిపురికేఁగితి నని నీవే కేకయమహారాజున కెఱింగింపవలయును. కాదేని, రాముఁడు బహుకాల మడవిలో నుండునట్లు తటస్థపడి యడవి కేఁగఁగా, భరతుఁడు కోర్కులతో నిండిన వాఁడై పట్టాభిషిక్తుండు గావలయును. ఈ రెంటిలో నొక్కటి కావలసినదే కాని నేను, పఱుపులను గోరను. పూలదండలను గోరను. గంధము పూసికొనను. కాటుక దీర్పను. నీరు ద్రావను. ఆహారము గుడుపను. ఏదియుఁ గోరను. వేయిమాటలేల? రాజు రాముని నయోధ్యనుండి యడవికిఁ బంపఁడేని, నేను బ్రాణములనే కోరను." అని యివ్విధంబున మిగులఁ గఠినమైన మాటలు సెప్పి, సకలాభరణములను దీసివైచి, స్వర్గమునుండి క్రిందఁబడిన కిన్నరాంగనవలె నేలమీఁదఁ బరుండెను. అట్లు కోపాతిశయముచేఁ గలిగిన యజ్ఞానముతోఁ గూడినదై, యట్లే సకల భూషణములను, బుష్పమాలికలను దీసివైచి నేలమీఁదఁ బరుండి

యున్న యా నృపాలుని దేవి, నక్షత్రము లస్తమించిన పిదపఁ జీకటిచేఁ గ్రమ్మఁబడిన యాకాశముమాడ్కి వెలుఁగకుండెను.

## 10-వ సర్గము

దశరథుఁడు కైకేయి యంతఃపురమునకుఁ బోవుట

సమర్థురాలయిన కైకేయి, మిక్కిలి చెడుతలంపుగలదైన మంథర యొక్క చెడుబోధనలచేఁ జెడుదారి కీడ్వఁబడినదై, విషముపూసిన బాణముచేఁ గొట్టఁబడిన కిన్నరకాంతవలె నేలపైఁబరుండి, మిక్కిలి కోపము గలదై, మంథర మాటకు బేలుపోయి, యది తనకు ముందు చెప్పిన చొప్పెల్ల మువ్వార్తకాల మాలోచించి, సంతసముఁ దప్పినదై, మంథరను జూచి, "ఓ మంథరా! నీవు చెప్పిన యాలోచనయెల్ల బాగుగ నున్నది. నే నట్ల చేసెదను" అని మంథరతోఁ జెప్పి, తనకు మేలు గావించు పద్ధతింగూర్చి మువ్వార్తకాల మాలోచించెను.

కైకేయివిషయమున మంచి మనస్సుగలదియు, నామెకు లాభము గలుగవలెనని కోరుచుండునదియునైన యా మంథర కైకేయి బాగుగా నిర్ణయించి చెప్పినమాటలను విని, తా నింతదనుకఁ జెప్పిన మాటల నా కైకేయి విని నందుచేతఁ గార్యము సిద్ధించినట్లే తలఁచి యెక్కువ సంతోషము నొందిన దాయెను.

అంతట నా దశరథుని దేవేరియగు కైకేయి కోపముతో మంథర తనకు బోధించిన తీరెల్ల మనంబునఁ దలపోసి, కనుబొమ్మలు ముడివెట్టి, తాను వేసికొనియున్న సొమ్ములను హారముల నొలిచి, మైలబట్టఁగట్టి, యొంటిజడను వెంటి చుట్టినట్లు చుట్టి, నిర్జీవురాలై క్రిందఁబడిన కిన్నరకామినివలెఁ గోపగృహంబునఁ బడియుండెను. అప్పుడు కైకేయిచే నొలువఁబడి నేలమీఁద నుంచఁబడిన చిత్రములయిన హారములును, మేలయిన భూషణంబులును నక్షత్రము లాకసమును వెలుఁగఁజేయునట్లు భూమిని వెలిఁగించినవి.

మిక్కిలి యెక్కువ కీర్తిగలవాఁడగు దశరథుఁడు రాముని పట్టాభిషేకముంగూర్చిన యేర్పాటు గావించునట్లు మంత్రుల కానతిచ్చి, సభ్యులనందఱి నడిగి సెలవుగైకొని తన నగరు సొచ్చి, తాను జితేంద్రియుఁ డయ్యును, కైకేయిం దలఁచికొని, యా దినముననే రాముని

పట్టాభిషేకదినమని యంత తెజేఁగినను, దాను కైకేయితోఁ జెప్పలేదు
గదా యని తలఁచి, ప్రియముచేయుటకుఁ దగిన యా కైకేయితో నీ
ప్రియవాక్యముఁ దెలుపఁగోరినవాఁడై, తెల్లని మబ్బులుగలిగి, రాహు
వుతోఁగూడియున్న యాకసమును జంద్రుఁడు ప్రవేశించుమాడ్కి దశర
థుఁడు కైకేయియున్న కోపగృహమును బ్రవేశించెను. చిలుకలయు,
నెమళులయు, నంచలయుఁ, గొక్కెరలయుఁ గూఁతలతోను, వాద్య
ధ్వనులతోను నిండినదియు, గూనివాండ్రతోను పొట్టివాండ్రతోను
గూడినదియు, తీఁగెల యిండ్లతోను, సంపంగులచేతను నశోకములచేతను
నందముగనున్న చిత్రములైన యిండ్లతోను, దంతము, వెండి, బంగారు
నను వీనితో నిర్మింపఁబడిన తిన్నెలతోను గూడినదియు, నిరంతరము
పుష్పములు పండ్లు గలచెట్లతోను, నడబావులతోను, దంతములు
వెండి బంగారునను వీనితోఁజేసిన గొప్పయాసనములతోను శోభిల్లు
చుండునదియు, నానావిధములగు భక్ష్యములతోఁ గూడిన యన్నపాన
ములతో నిండినదియు, సకల భూషణములను దాల్చియున్న సుందరాం
గనలతోఁ గూడినదియునై స్వర్గలోకము మాడ్కిఁ దేజరిల్లుచున్న తన
ప్రియురాలగు కైకేయియొక్క యుత్తమమగు శయనగృహముచేరి,
సెజ్జపై నా కైకేయిం జూడఁడయ్యె. ఆ దశరథనృపాలుఁడు మన్మథ
బాణముల పోటులకుఁ దాళఁజాలక, రతి సలుపఁ గోరి వచ్చియుఁ బడక
టింటియం దా కైకేయిం గానక, "కైకేయీ! యెక్కడనున్నా" వని
పిలిచియు, బదులు రామిచేఁ గడు వ్యసనము నొందెను. ఇంతకు
మున్నెపు డామె మహారాజుగారు వచ్చెడి యా వేళ కింటనుండక
పోయినది లేదు; రాజుగారును కైకేయిలేని యంతఃపురము నొకప్పుడు
ప్రవేశించినది లేదు.

అంతట దశరథనృపాలుఁడు "కైకేయి ముంపువలెఁ గాక యిట్లు
తెల్విమాలినదై, తనకార్యమును సాధింపఁగోరియున్న" దని తెలియని
వాఁడై, యంతిపురము ద్వారముకడకు వచ్చి, ద్వారపాలికనుం జూచి,
"కైకేయి యెక్కడ" నని యడిగెను. ఆ ద్వారపాలకురాలును మిక్కిలి
భీతినిబొంది, చేతులు జోడించి, "ప్రభూ! దేవేరి మిక్కిలి కోపముతోఁ
గూడి క్రోధగృహంబుఁ జేరియున్న" దని విన్నవించెను. కైకేయి కనఁబడ

నందులకై విచారపడుచున్న దశరథనృపాలుఁడు ద్వారపాలకురాలి మాట విని మఱింత యెక్కువయిన వ్యసనమును బొంది, మిక్కిలి కలవర పడిన యింద్రియములు గలవాఁ డయ్యెను. అట్లు పుడమిఱేఁడు వ్యసన పడి కోపగృహమునకుఁ జని యచ్చట నేలపైఁ బరుండియున్నదియు, నట్లు నేలపైఁ బరుండుటకు దగనిదియు నైన కైకేయింజూచి మిక్కిలి నొచ్చిన వాఁ డయ్యెను.

ముసలివాఁడగు దశరథుఁడు దాను గపటంపుఁ దలఁపులేనివాఁడై, యట్లు చెడుతలంపుతో భూమిమీఁదఁ బరుండి, త్రుంచివేయఁగాఁ బడి వాడియున్న తీఁగెమాడ్కి శాపాదులవలనఁ బుడమినిఁబడిన దేవతాంగన వలె యక్షలోకమునుండి త్రోయఁబడిన కిన్నరాంగనవలెను, స్వర్గలోకము నుండి భ్రష్టురాలయిన యప్సరసవలెను, క్రిందికిఁ బడద్రోయఁబడిన మాయాదేవివలెను, కట్టివేయఁబడిన యాఁడులేఁడివలెను, వేఁటకానిచే విషముపూసిన బాణముతోఁ గొట్టఁబడిన యాఁడేనుగు చందమునను బడియున్న తన ప్రాణములకంటె నెక్కువయిన తన ప్రియపత్నియగు కైకేయిని జూచి మోహముచే మదించిన యాఁడేనుఁగు మదపుటేనుఁగు వలె దాఁకి, తన చేతులతో బాగుగ నొడ లంతయుఁ దడవి మనస్సునం దెక్కువ సంతాపమునొంది కమలలోచనయగు కైకేయితో నిట్లనియె.

"ఓ మంచిమనస్సుగలదానా! నీ కిపుడు కోపము వచ్చుట కేమి కారణము? ఎవఁడు నిన్నుఁ దిట్టెను? ఎవఁడు ని న్నవమానపఱచెను? నేను నీయెడ మంచి మనస్సు గలవాఁడనై నీకోర్కు లీడేర్చుచుండఁగా, నీవేల దయ్యముపట్టినదానివలె నా మనమున కెక్కువ చింతను బుట్టించు చున్నావు? నా కడ నెందఱో ఘనులగు వైద్యులు సకల సౌఖ్యములం బొందుచున్నారు. నీ వ్యాధి యేదియో చెప్పుము. వారు నిన్ను స్వస్థ పఱుపఁగలరు. నీ వెవరికైనఁ బ్రియకార్యము చేయఁ దలఁచితివా? లేక యెవఁడైన నీ కప్రియము చేసెనా? ఎవని కిప్పుడు ప్రియమును జేయ వలెను. ఎవని కిప్పుడు కీడు గల్గింపవలయును? దేవీ! నీ వేడువకుము. శరీరశోషణమును జేసికొనకుము. దండింపఁదగనివాని నెవనిని వధింప వలయును? వధింపఁదగినవాని నెవనిని విడిచిపెట్టవలయును? ఏ దరిద్రుని ధనికునిఁ జేయవలయును? ఏ ధనవంతుని ధనమును లాగికొని దరిద్రునిఁ

జేయవలయును ? నీ వెవనిని జంపుమనిన, వాఁడు నిర్దోషియైనను, వానిని సంహారించెదను, నీవెవనిని విడువుమన్న, వాఁ డపరాధియైనను, వానిని విడుదల చేసెదను. నీవు ఏ దరిద్రునికి ధనమిమ్మనినను నిచ్చి, వానిని భాగ్యవంతునిఁ జేసెదను. నీవే ధనవంతుని దరిద్రునిఁ జేయుమన్న నా ధనవంతుని ధనంబంతయు లాగుకొని దరిద్రుని జేసెదను. ఓ కైకేయీ! నేనును, నావారందఱు నీకు లోఁబడి నీవు చెప్పిన చొప్పున వినువారము. నేను నీ రవంత కోరికనైనను దీర్పకుండ నుండఁజాలను. నీవు దేనిని గోరుదువో, దానిని నా ప్రాణమును విడిచియైనను సాధించి యిచ్చెదను. నాకు నీయెడఁగల ప్రేమను దలఁచి, నీవు సంశయంపక నీ కోర్కెని దెల్పుము. నేను జేసిన పుణ్యములనైన నొట్టుపెట్టికొని చెప్పెదను. నేను నీ యిష్టము నెఱవేర్చెదను.

ఓ కైకేయీ! యీ సూర్యమండల మేది మొద లెంతవఱకు వ్యాపించియున్నదో, యంతవఱకుఁగల పుడమియెల్ల నాది. సకల సంపదలచే నిండిన తూర్పుదేశములును, సింధు సౌవీర సౌరాష్ట్ర దేశములును, దక్షిణదిశయందుండు దేశములును, అంగ వంగ మగధ మత్స్య కాశి కోసలదేశములును నావి. అచ్చట విస్తారముగనుండు ధనధాన్యరాసులును, గొఱ్ఱెలయు, మేఁకలయు మందలును నావి. వీనిలో నేమి గోరుదువో యదియెల్లఁ దప్పక యొసఁగెదను. ఓభీరూ! యేల యిట్లు నేల మీఁదఁ బరుండి దేహము నొప్పింతువు? ఓ సుందరీ! లే లెమ్ము. కైకేయీ! నీకేల యింతభయము గలిగినదో చెప్పుము. సూర్యుఁడు మంచును బోకార్చునట్లు, నీకుఁ గలిగిన భయమును నేను బాపెదను." అని దశరథుఁడు కైకేయిని బలుతెఱఁగుల నూఱడించెను.

అట్లు కైకేయి తన భర్తచేఁ బలుతెఱంగుల నూఱడింపఁబడినదై, తన భర్తకు మఱింత వ్యసనము గల్గించుటకై తన మనస్సున నున్న కోర్కెని దెలుపుటకుఁ బూనెను.

## 11-వ స ర్గ ము

**కైకేయి రెండువరంబుల నడుగుట**

మన్మథుని బాణములు నాటుటచే నా మన్మథుని బారింబడియున్న పుడమిఱేనిం గూర్చి కైకేయి యతి క్రూరములగు మాటలతో "ఓ

నాథా! నా కెవ్వఁడు నపకారము సేయలేదు, న న్నెవ్వఁడు నవ మానింపను లేదు. నా కొక కోరికయున్నది. అది తమరు చేయుదు రని కోరుచున్నాను. మీరు నాకోరికను నెఱవేర్తు నని ప్రమాణము చేసితి రేని, నేను నా మనోరథము దెలిపెదను" అని చెప్పెను.

కాముకుఁడును, విశేషకాంతిగలవాఁడును నగు దశరథుఁడు చిఱునవ్వు నవ్వినవాఁడై, చిఱునవ్వు నవ్వుచుండు నా కైకేయిని దల వెండ్రుకలు చేతితో దువ్వుచు నిట్లనియె. గర్వితురాలా! నీకంటెఁ బ్రియురాలు మఱొక్కతె లేదనియుఁ, బురుషశ్రేష్ఠుఁడయిన రాముఁడు తక్క ప్రియుఁడు మఱొక్కఁడు లేఁడనియు నీకుఁ దెలియదా? జయింప నలవికానివాఁడును, రఘువంశస్థులలో ముఖ్యుఁడును, గొప్ప బుద్ధి శాలియు, దీర్ఘాయువు గలవాఁడునైన రాముఁడు సాక్షిగా శపథము చేసెదను. నీ కోరికయెద్దియో చెప్పుము. ఏ రామునిఁ జూడక క్షణ కాలమైనను జీవింపనో, యా రాముఁడు సాక్షిగా నీ మాట యొనర్చెద నని ప్రతిజ్ఞ చేసెదను. నన్నుఁగాని, భరతుఁడు మొదలుగాఁ గల కుమారులనుగాని, ఇతర బంధువులనుగాని వదలిపెట్టి యైనను నెవ్వానిని బ్రేమించుచున్నానో యట్టి రాముఁడు సాక్షిగా నీ కోర్కె చెల్లించెదను. ఓ మంగళకరురాలా! నీవు దేనిని గోరెదవో చేయుదు నని నా ప్రాణములకంటె మిన్నయైన రాముఁడు సాక్షిగాఁ జేసెద నని ప్రతిజ్ఞ చేయునంత నీ మీఁది మోహముగల నా మనస్సును గనిపెట్టి యైనను, నీ కోరికను దెలిపి నన్నుఁ గడతేర్చుము. నే నిప్పుడు చేసిన శపథంబు బాగుగఁ బరికించి, నీవు దేనిని గోరుచున్నావో దానిని జెప్పుము. నాయొక్క బలిమిని గుర్తెఱుఁగుదానవే కావున, నీ కార్యంబు చేయఁగలనో, లేనో యని సంశయింపక చెప్పుము. నే నొనర్చిన పుణ్య కార్యముల సాక్షిగాఁ జెప్పెదను. తప్పక నీ కోరిక నెఱవేర్చెదను" అని దశరథనృపాలుఁడు కైకేయిని బతిమాలుకొనెను.

కైకేయి యా మాటలచే సంతసించినదై, తాను దలఁచిన యభి ప్రాయము నంగీకరించిన దశరథునిఁ గూర్చి రాము నడవికిఁ బంపుట, భరతునికిఁ బట్టాభిషేకం బొనర్చుట యను మంథర యుపదేశించిన యా రెంటియందే మనసుంచి యున్నదగుటచే, భరతుని యందలి

పక్షపాతమువలనను, దశరథుఁడు తన కనుకూలుఁ డయ్యెనను సంతో షమువలనను జెప్పుటకు నోరురానిమాట చెప్ప నారంభించెను :

"ఓ నృపాలా! నీవు నిన్నును, నీపుత్రులను, సాక్ష్యముగా శపథంబు సేసితివి. అట్లు నీవు చేసిన ప్రతిజ్ఞను నగ్నిహోత్రుఁడు మొదలగు ముప్పదిమూఁడుకోట్ల దేవతలును విందురుగాక! సూర్యచంద్రులును, నాకసంబును, నవగ్రహంబులును, రేలుం బవళ్లును, దిక్కులును, లోకమును, భూమియు, గంధర్వులును, రాక్షసులును, రాత్రులందుఁ దిరుగుచుండు భూతములు, మఱియు నచ్చటచ్చటనుండు భూతము లెల్లఁ దమ ప్రతిజ్ఞను వినుచుండునుగాక. చేసిన ప్రతిజ్ఞను తప్పనివాఁడును, ఎక్కువ ప్రతాపముగలవాఁడును, ధర్మములనెల్ల నెఱింగినవాఁడును, మిక్కిలి జాగ్రత్తగలవాఁడునైన దశరథనృపాలుఁడు నాకు వరముల నొసంగుచున్నాఁడు. దేవత లందఱు సాక్షులుగా నుందురుగాక!" యని చెప్పి, కైకేయి గొప్ప విలుకాఁడైన దశరథనృపాలుని చేయిపట్టుకొని, తన ప్రార్థన నొప్పుకొనునట్లు చేసి, ముఖస్తుతులచే నుబ్బించి, కామాతురుఁడై యేది యడిగినను నిచ్చుటకు సిద్ధుఁడైయున్న దశరథునిఁ గూర్చి యిట్లనియె.

"మహారాజా! మ న్నొకప్పుడు దేవాసురులకు నడిచిన యుద్ధమున నేమి జరిగినదో జ్ఞప్తికిఁ దెచ్చికొనుఁడు. ఆ యుద్ధమున శత్రువు తమ ప్రాణముఁ దక్కఁ దక్కినది యెల్లను బడఁద్రోసెనుగదా! అప్పుడొకనాటిరేయి యుద్ధము నడుమ నా శంబరాసురుఁడు దమరిని మూర్ఛనొందించెను గదా! అప్పుడు నేను తమరి నావలికిఁ దెచ్చి, శీతలోపచారములుచేసి దమ్ముఁ గాపాడితిని. అప్పుడు తాము తెప్పిఱిల్లి, తెల్విఁదెచ్చుకొని నాయొక్క యూడిగములకు మెచ్చి నాకు రెండువరముల నొసంగితిరి. మహారాజా! నే నప్పుడా వరములను రెంటిని నడిగి నప్పుడిమ్మని తమరితోఁ జెప్పి యొప్పించితిని. నాథా! అప్పుడు తమకడ దాఁచిపెట్టిన యా రెండువరములనే నే నిప్పు డిమ్మని యడుగుచున్నాను. సత్యమయిన ప్రతిజ్ఞగల యో మహీపాలా! యిచ్చెదనని మొదటఁ బ్రతిజ్ఞ సేసి, న్యాయముగా నా వరంబులను దమ రిప్పింపరేని, తమరు చేసిన యవమానంబునకై నా ప్రాణముల నిక్కడనే వదలిపెట్టుదును.

ఇది నిజము. నమ్ముఁడు" అని కైకేయి తన భర్తను నిర్బంధించెను. బోయవాఁడు వలపన్ని, గానముచేయుచుండఁగా నా పాటయొక్క యింపునకు లోఁబడి జింక వలలోఁ దగులుకొన్న చందమున, దశరథుఁడు కైకేయి తన్ను మున్నడిగిన వరముల నడిగినప్పు డిచ్చెదనని ప్రతిజ్ఞచేసి యున్నందునఁ దనమాటచేఁ దన చెఱుపునకై తానే ధర్మపాశంబునకుఁ గట్టువడెను. అప్పుడు కైకేయి మహీపాలునిం జూచి, "మహారాజా! తమ రే వరముల నొసఁగితిరో, యావరముల నిప్పుడే కోరెదను, నామాట వినుఁడు.

మహారాజా! ఆ వరంబులలో నొక్కటి యేది యనిన; 'ఇప్పుడు రాముని పట్టాభిషేకమునకై తాము చేసిన ప్రయత్నముతో నాపుత్రుఁడగు భరతునకుఁ బట్టాభిషేకంబు సేయింపవలయు.' ఇదిగో నేను గోరు మొదటివరము.

నాథా! మునుపు దేవాసురయుద్ధమున సంతోషపూర్వకముగాఁ దా మొసఁగిన రెండవవరంబున కిప్పుడు సమయము వచ్చినది. అది యేది యనిన;

'రాముఁడు నారబట్టలను గట్టుకొని, కృష్ణాజినము గప్పికొని, జడలుదాల్చి, మునివేషము ధరించి, పదునాలుగేండ్లు దండకారణ్యమునఁ ద్రిమ్మరుచుండును గాక.' ఇది రెండవవరము.

నాథా! భరతుఁడు నిష్కంటకమైన యువరాజపట్టాభిషేకము నిప్పుడే పొందునుగాక! ఇప్పుడే రాముఁడు నడవికిఁ బోవునపుడు నేను జూడఁగోరెదను. మహారాజా! నే నిప్పుడు క్రొత్తవరముల నడుగలేదు. తమరు మున్ను ప్రేమతోఁ దాముగా నొసంగిన వరములనే యిప్పు డడిగితిని.

మహారాజా! చెప్పినప్రతిజ్ఞ నెఱవేర్చి సత్యసంధులరని పేరు వడసిన రాజాధిరాజుల రగుఁడు. తమరు పుట్టినది యిక్ష్వాకువంశము. ఇక్ష్వాకువంశస్థుల పేరు చెఱుపకుఁడు. ఇన్ని యేండ్లు గంభీరస్వభావంబు గలవారని ప్రసిద్ధిఁ జెంది యిప్పు డా నడతను బోఁగొట్టుకొనకుఁడు. తమ రే వంశమునఁ బుట్టితిరో, యది జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. మానవులకు సత్యముఁ దప్పకుండుటయే యిహలోక సౌఖ్యమునకు సాధకమనియు,

నట్టి సత్యసంధులు పరలోకమున నుత్తమగతి నొందుదు రనియు మునీంద్రులు పలుకుదురు. కావున మహారాజా! యాడినమాట తప్పకుము" డని కైకేయి దశరథనృపాలుని మాఱుమాట పలుకకుండునట్లు చేసెను.

## 12-వ స ర్గ ము.

దశరథుఁడు కైకేయివరంబులఁ దలఁచి చింతించుట

అంతట దశరథమహారాజు కైకేయియొక్క వెఱపుఁ బుట్టించునట్టి మాటలను విని, విచారమునొంది క్షణకాలము మూర్ఛిల్లి మఱలఁ దెప్పిఱిల్లి "ఏమి యిదియొక కలయా? లేక, మనోభ్రమయా? లేక, జన్మాంతర వాసనయా? లేక, మనోవికారమా" యని చింతించుచు నప్పుడు సుఖముఁ దప్పియుండెను. దశరథుఁడు కైకేయియొక్క పలుకు లనెడు బాణములచే నాఁటఁబడి, మై మఱచి, చాల సేపటికిఁ దెప్పిఱిల్లి, వెంటి పులిం జూచిన జింకవలె మనమునందలి దుఃఖముచేఁ జేతులు కాళ్లు విలవిల దన్నుకొను చుండెను. అట్లు దశరథనృపాలుఁడును నేలపైఁ గూలఁబడి, నిట్టూర్పులను విడుచుచు, మంత్రములచేఁ గట్టఁబడి వలయమునందు నిలిచి బుస కొట్టుచున్న విషసర్పమువలెఁ గొంతతడ వేమియుఁ దోచక చింతించు చుండెను. పిమ్మట నరాధిపుఁడు రోషముతోఁ గూడినవాఁడై, "యాహా! యిది యేమి యన్యాయము. ఛీ! ఛీ!" యని చెప్పి, గుబులుగుబులుమని వెల్లగించుకొని వచ్చుచున్న దుఃఖమువలన స్మృతి దప్పినవాఁడై, మూర్ఛనొందెను. పిమ్మటఁ జాలసేపటికి మఱలఁ దెప్పిఱిల్లి, స్మృతిని బొంది, కడు దుఃఖమునొంది, కోప దృష్టిచేఁ గైకేయిని గాల్చువానిచందమునఁ జూచుచుఱఁజూచుచు నా కైకేయితో నిట్లనియె.

"ఓసీ గొంతుకోయుదానా! ఓసీ చెడునడతగలదానా! ఓసీ మా వంశమును జెఱుపుదానా! పాపాత్మురాలా! నీకు రాముఁ డేమి యపకారముఁ జేసెను? నేనేమి యపకారముఁ జేసితిని? రాముఁడు నిన్నుఁ దల్లితో సమానురాలినిగాఁ దలఁచి, నీయెడ మిక్కిలి గౌరవము చూపుచున్నాఁడు గదా? అట్టిరామునికే యేల యింత యపకారము నీవు సేయఁదలఁచితివి? దీనికేమి కారణము? నీ వోర్వ్వరానివిషము గ్రక్కెడి యాఁడుపాము వంటిదానవు. అది తెలియక నీవు రాజపుత్రివనియెంచి నిన్ను నా రాచ నగరులోఁ బ్రవేశపెట్టితిని. అట్లప్పుడు తెలియకచేయుటచేత నాకుఁ

జేటు నేనే తెచ్చుకొంటిని. జనులందఱు రాముఁడు గుణవంతుఁడని
యాతని గుణంబులఁ బొగడుచుందురు. అట్టి ప్రియసుతుఁడగు రామునిపై
నే నేమి తప్పుపెట్టి యతనిని విడిచివేయుదును. కౌసల్యనైనను విడుతును;
సుమిత్రనైనను విడుతును; రాజ్యలక్ష్మినైనను విడుతును. తుదకు నాప్రాణ
ములనైనను వదలుదును గాని, తల్లిదండ్రులయందుఁ బ్రేమతో నడుచు
కొనుచుండు రాముని నేను విడువనే విడువఁజాలను. నా పెద్దకొడుకగు
రామునిఁ జూచినంతట నా కెక్కువ ప్రేమ గలుగుచున్నది. ఆ రామునిఁ
జూడకుండిన నాకుఁ బ్రాణమే పోవును. జగత్తు సూర్యరశ్మి లేకయైన
నుండవచ్చును. పైరులు నీరు లేకయైనఁ బెరుగవచ్చును. కాని రామునిఁ
బాసి, నా దేహమునఁ బ్రాణము లుండనోపవు. ఓసీ, చెడుతలంపుగల
దానా! యీ తలంపువలదు. విడిచిపెట్టుము. నీ పాదములనైనను
నా నెత్తినిఁ బెట్టికొందును, నాపైఁ గరుణించి యీ వరమును మానుము.
ఓసీ కటికిదానా! ఏమని యింత భయంకరమైన కోరికను గోరితివి? లేక,
భరతునిపై నాకుఁ బ్రేమయున్నదో లేదో యని తెలియగోరితివా? అట్లు
భరతునిపైఁగల యిష్టానిష్టములనే తెలియగోరిన దానవే యగుదువు
గాక! తొల్లి రామునివిషయమై నాతో 'నీ పెద్దకుమారుఁడు సౌందర్య
వంతుఁడనియు, ధర్మజ్ఞులలో నెల్లఁ బెద్దవాఁ' డనియుఁ బలుమాఱు నీవు
చెప్పియుంటివే. ఆమాటలెల్ల నేను నీయందుఁ బ్రేమగల్గియుండవలె నని
కాని, నా మనస్సును సరతోషపఱచుటకుఁ గాని, రామునిచే శుశ్రూషలు
సేయించుకొనుటకుఁగాని చెప్పితివి కాఁబోలును. నీవు మనఃపూర్తిగా
నా మాటలు పలికినదానవు గావు. ఆరాముని పట్టాభిషేకవార్తను విని,
దుఃఖపీడితరాలవై, నన్నిట్లు మిక్కిలి బాధించుచున్నావు. నీ వెవరి
దుర్బోధనలకు లోఁబడి యీ శూన్యమగు కోపగృహమున కేతెంచితివి?
ఓ కైకేయీ! నీవు మున్ను న్యాయంబుఁ దప్పకయుంటివి. నీ కెప్పు డిట్టి
విపరీతబుద్ధి పుట్టెనో, యప్పుడే యీ యిక్ష్వాకువంశమున కొక గొప్ప
చేటు సంభవించినది. ఓవిరివికన్నులదానా, నీ వింతకు మున్నెప్పుడు
న్యాయవిరుద్ధముగను, నా మనస్సున కప్రియముగను ఒక మాటనైనను
జెప్పినది లేదు. అట్టి యొక్క పనినైనను జేసినదిలేదు గదా! అట్టి
నీ విప్పుడు రెండు క్రూరములగు వరముల నడుగుట చూడఁగా నీవు

పరితాపమును కలుగుచున్నాదని తలఁచుచున్నాను. ఓసీ, నీకు భరతునితో మహాబుద్ధిశాలియగు రాముఁడు సమానుఁడు గాఁడా? ఓసీ, చిన్నదానా, నీవు పసిదానవుగ నుండునపుడు పలుమారులు "నాకు రాముఁడు భరతుఁడు నొక్కటే" యని యెన్నియో కథలు చెప్పు చుంటివిగదా! అవి యెల్ల నిప్పుడు మఱచితివా? అట్టి ధర్మాత్ముఁడు, కీర్తి మంతుఁడునగు రాముని పదునాలుగేం డ్లడవికిఁ బంపఁగోరితివే! ఈ మాటయడుగ నీ కెట్లు నోరాడెను?

ఓ కఠుఁగ్రూరురాలా! మిక్కిలి సుకుమారుఁడును (అరణ్య వాసమువలని శ్రమకోర్వలేనివాఁడును), న్యాయమునందే దృష్టి యుంచి యుండువాఁడును నైన యా రాముఁ డడవిలో నుండుటకు నీమనసె ట్లిష్టపడినది? సొంపయిన కన్నులుగలదానా, సకలజనుల యిష్టమునకుఁ దగినవాఁడును, నీకు శుశ్రూష సల్పువాఁడును నైన రాముని నెందుల కడవికిఁ బంపవలయును? రాముఁడు నీకు శుశ్రూష సేయుచున్నాఁ డనెడు నెనరుగూడ నీవు పెట్టవైతివిగదా? రాముఁడు భరతునికంటె ని న్నెల్లప్పుడు కొలుచుచుండును. ఆ రామునికంటె భరతుఁడు నీ కెక్కువ యనుట కేమియు దృష్టాంతము గనఁబడలేదు. శుశ్రూష, మర్యాద గనఁబఱచుట, నమ్మకము, చెప్పినమాట వినుట యను వీనిని నీయెడఁ గనబరచువాఁడు రామునికంటె మఱొక్కఁ డెవ్వఁడున్నాఁడు? ఓకైకేయీ? యిచ్చట వేలకొలఁది స్త్రీ లున్నారు. వేలకొలఁది పనివా రున్నారు. రామునియెడ నొక యపకీర్తికాని, నిందగాని యున్నదో, వారి నందఱి నడుగుము. పురుషశ్రేష్ఠుఁడైన రాముఁడు పక్షపాతము లేని మనసుతో సకల జంతువులను బుజ్జగించుచు, తన దేశములోని జనులను వారి కిష్టములైన పనులు చేయుటచే నాకర్షించియున్నాఁడు. శూరుఁడయిన రఘువంశోద్భవుఁడగు రాముఁడు లోకములను సత్యము చేతను, పేదలను ద్రవ్యమొసఁగుటచేతను, పెద్దలను శుశ్రూష సల్పుట చేతను, శత్రువులను యుద్ధమునందు ధనస్సుచేతను జయించి లోఁబఱచుకొనుచున్నాఁడు. మఱియు, నిజముపలుకుట, దానము చేయుట, తపమొనర్చుట, త్యాగము, చెలిమి, ఆచారము, మోసము లేకుండుట, విద్య, పెద్దలకు శుశ్రూషసేయుట మున్నగు సుగుణము

లన్నియు నా పెద్దకుమారుఁడగు రామునియందు నెలకొనియున్నవి. అట్లు తిన్నని స్వభావముగలవాఁడును, దేవతలపరాక్రమముతో సాటియగు పరాక్రమము, మహర్షుల తేజస్సువంటి తేజస్సు గలవాఁడునునగు నా రామునివిషయమున నేల యిట్టిచెఱుపుచేయఁగోరితివి? జనులందఱు రాముని పట్టాభిషేకవిషయమయి యిష్టములయిన మాటలనే చెప్పిరి గాని యొక్కఁడును నది తనకిష్టము గాదని చెప్పలేదు. అట్లుండ నీకొకతె కిష్టముగను, జనులకందఱి కనిష్టముగను నుండు నీ మాట చెప్పుటకు నాకెట్లు నోరాడును? ఓర్పు, ఇంద్రియము, దానముచేయుట, నిజము పలుకుట, నెనరుగల్గియుండుట, స్వధర్మముల నడుపుట, సకల జంతువులను నొప్పింపకుండుట యను సద్గుణంబులెల్ల నా రామునియందే యున్నవి. అట్టిరాముని విడిచిన నాకెవరు దిక్కు? కాఁబట్టి, కైకేయీ! నన్నుఁ జూచి కొంచెము కరుణింపుము. నేనో ముసలివాఁడను. అవసానకాలము నేడో రేపో రాఁబోవుచున్నది. దుఃఖముచే నామనస్సు నొచ్చియున్నది. నేను మిగులఁ బరితాపముతో నిన్ను వేఁడుకొనెదను, నాలుగుసముద్రములచేతను జుట్టఁబడియుండు నీ భూమండలమున నాకు నెంత ధనము లభించుచున్నదో, యదియంతయు నిదిగో నీ కొసఁగెదను. రాముని విషయమయిన కోపము నీవు విడిచిపెట్టుము, ఓ కైకేయీ! నీకుఁ జేతులు జోడించి మ్రొక్కెదను. నీ కాళ్లమీఁదనైనను బడియెదను. రామునికి శరణుకమ్ము. జనులు నన్నధర్మపరుఁడని చెప్పునట్లు చేయకుము" అని దశరథుఁడు కైకేయిని బహువిధముల వేఁడుకొనెను.

## కైకేయి మొండితనము

అవ్విధంబున దుఃఖముచేతఁ బరితపించుచును, నేడ్చుచును, స్మరణదప్పి క్రిందఁబడి పొరలింతలు పెట్టుచును, దుఃఖమనెడి సముద్రమున మునిఁగి, తన్ను నే విధంబుననైనను శోకసాగరము దరిఁ జేర్పుమని మాటి మాటికిఁ బ్రార్థించుచుండు దశరథుని జూచి, కైకేయి మిక్కిలి యుగ్రరూపము దాల్చినదై, "ఓ రాజా! రెండువరముల నిచ్చి, యవి యిమ్మని యడిగిన నిట్లు త్రొక్కటపడుచున్నావే, ఓ శూరుఁడా! తమరు 'నేను ధర్మములఁ జేయువాఁడ' నని యెట్టు లోకులతోఁ జెప్పు

గొందురు. ఓ మహారాజా! యనేకులు రాజశ్రేష్ఠులందఱు తమతోఁ గలిసి, 'కైకేయికి వరముల నిచ్చితివా!' యని యడిగిరేని, ఓ ధర్మజ్ఞుఁడా! అప్పుడు తమరు వారికేమి బదులు చెప్పుదురు.

'ఏ కైకేయియొక్క యనుగ్రహముచే నేను బ్రదికియున్నానో, యేకైకేయి నన్నుఁ బ్రాణాపదనుండి తప్పించినదో, యా కైకేయికి రెండు వరముల నే నిచ్చెదనని మొదట వాగ్దత్తము చేసి, యట్లు జరిపింపక, నే నా కైకేయిని మోసపుచ్చితిని' అని తెగించి చెప్పుదురు కాఁబోలును. మహారాజా! తమరు నృపాలురుగ నుండియు, మొదటవరములిచ్చి యప్పుడే వేఱువిధములగు పలుకులు పలుకుదురేని, నృపాలా! 'రాజులెల్ల నిట్టివారే కదా' యని యందఱు రాజులకు నపకీర్తిఁ దెత్తురు. తమరే ముందుగ నిచ్చెదనని చెప్పి, పిదప నే నడిగిన స్వల్పవరము కిట్లు మీనమేషము లెంచుచున్నారు. తొల్లింటి రాజుల చరిత్రము వినియుందురు గదా! ఒక డేగయుఁ బావురమును జగడమాడి, డేగ పావురమును జంపఁబూనఁగా, నది శిబిచక్రవర్తిని శరణుఁబొందగా నపు డా శిబిచక్రవర్తియు డేగకుఁ బావురమునకు బదులుగాఁ దనమాంసము నిచ్చెనుగదా! అలర్కుఁ డనువాఁడు తన కన్నుల నొసఁగి యుత్తమగతిఁ బొందెనుగదా! సముద్రుఁడు చెలియలికట్ట దాఁట నని ప్రతిజ్ఞ నేసి యిప్పటికి నట్లు చేయుచున్నాఁడుగదా. మహారాజా! తొల్లింటి రాజులచరిత్రములనెల్లఁ బరికించి, చేసిన ప్రతిజ్ఞ కల్లయగునట్లు చేయకుఁడు. చెడుతలంపుగల యో నృపాలా, తమరు చెప్పినమాట మీఱి, న్యాయమార్గముఁ దప్పి, రామునికిఁ బట్టాభిషేకము జరిపించి, కౌసల్యతోఁగూడి యెల్లప్పుడు రమింపఁగోరుచున్నారు. అది యన్యాయ్యమైనను, న్యాయ్యమయినను, నిజమైనను, కల్లయైనను సరే యేవి నాకుఁ దా మొసఁగునట్లు చెప్పితిరో, యావరములకు రెంటికిఁ దిరుగుపాటులేదు. రామునకే తాము పట్టాభిషేకము సేయుదురేని, నే నిప్పుడే తమ ముందటనే యెక్కువగ విషముఁ ద్రాగి, తమరు చూచుచుండఁగనే మరణము నొందెదను. రామునికిఁ బట్టాభిషేకమయిన పిమ్మట రాముని తల్లి యెదుటఁ జేతులు కట్టుకొని యొక దినమైనను నామెకుఁ గొల్వు గొల్చుచు నామెను జూచుచుండుటకంటె నాకు మరణమే మేలుగదా! మను

కేంద్రా! నన్నును, భరతుని పాతములనుగాఁ బెట్టి యొట్టు పెట్టుకొనెదను, రాముని నడవికిఁ బంపక, తమ రిఁక నేది యిచ్చినను నేను తనివినొందను, ఇది నిశ్చయము” అని చెప్పి యూరకుండెను. ఆమె పలవించుచుండు రాజును గూడఁ బలుకరింపదాయెను. అంతట రాజును కైకేయి తన్నడిగినట్టివగు రాముని యరణ్యవాసము, భరతుని పట్టాభిషేకము ననెడి కడుఁ గ్రూరములగు రెండువరముల నాకర్ణించి, యింద్రియముల స్వాస్థ్యముఁ దప్పినవాఁడై కొంచెముసే పూరకుండి, కైకేయిని హెచ్చరించుకొనక, తనకుఁ బ్రియకాంతయయ్యు నప్రియములు పలుకుచుండు కైకేయిని రెప్పవాల్పక చూచుచుండెను. ఆనృపాలుఁడు తన మనస్సున కసమ్మతమును, దిగులు విచారము అను రెంటితో నిండినదియుఁ, బిడుగుపాటు వలె దారుణమయినదియు నగు కైకేయి మాటను విని నెమ్మదిదప్పి యల్లాడుచుండెను. అట్లు కొంత తడవుండి యతఁడు కైకేయియొక్క మొఱకుఁదనమును, నామె పెట్టిన భయంకరమైన యొట్టును దలఁచి, యది చేయక తప్పదని యొఱఁగి, “హా! రామా!” యని నిట్టూర్పు విడిచి, మొదలు దెగిన మ్రానువలెఁ గ్రిందఁబడెను. అప్పుడు దశరథుఁడు కలవరపడిన మనంబుగల వెఱ్ఱివాఁడువోలెను, నెమ్మదిలేని రోగివలెను, మంత్రపుఁ గట్టుచేఁ బొగరు తగ్గిన పామువలెను నయి డగ్గుత్తికతోఁ గైకేయిం జూచి యిట్లు చెప్పఁ దొడఁగెను.

“ఓ కైకేయీ! మంచిదానివలెఁ దోఁచు నీ చెడ్డతలంపును నీ కెవతె బోధించె? దయ్యముపట్టినదానివలె నాతో నీ పలుకు పలుకుచున్న నీకుఁ గొంచెమయినను సిగ్గుదోఁపకున్నదే. నీ బుద్ధి యిట్లు చెడిపోవునని నేను మున్నెఱుఁగ నయితిని. నీవు చిన్నదానవుగ నున్నప్పుడుండిన బుద్ధి కిప్పటిబుద్ధి విపరీతముగా నేర్పడినది. నీ కెవరివలన భయము దోఁచెను? భరతుఁడు సింహాసనమున నుండఁగాను, రాముఁడు వనంబున నుండఁగాను జూడవలె నని నీ వేల కోరితివి? నీ మగనికిని, జనులకును, భరతునికినిఁ బ్రియంబుసేయవలె నని నీవు తలంతువేని, నీ కసత్య దోషము వచ్చినను లోపము లేదు. ఈతలంపు మానుము. ఓ దయమాలినదానా! చెడుతలంపుగలదానా! నీచబుద్ధి గలదానా! పాపంపుఁ బనులు సేయుదానా! నేనుగాని, రాముఁడుగాని నిన్నేమి

దుఃఖపెట్టితిమి? ఏమి యప్రియమొనర్చితిమి? భరతుఁడు రాముని విడిచి తాను రాజ్యమేలుటకు నొకప్పుడు నొప్పఁడు. ఏల యనిన భరతుఁడు రాముని కంటె మిక్కిలి ధర్మముసందుఁ దలంపుగలవాఁడు.

ఓకైకేయీ! నేను రాముని జూచి, "రాముఁడా! నీ వడవికిఁ బొమ్ము" అని చెప్పిన, రాహు కేతువులచేఁ గ్రమ్మఁబడిన చంద్రుని మాడ్కిఁ గళఁదప్పిన యా రాముని మోము నెట్లు చూతును? నా మేలుగోరు పెద్దలతోను మంత్రులతోను గూడి చక్కఁగా నాలోచించి చేసిన నా తలంపు తలక్రిందగుచుండఁగా, శత్రువులచేఁ గొట్టఁబడిన సైన్యమునుబోలె నే నెట్లు చూడఁగలను? రాముని యభిషేకమునకై నేఁ బిలిపింపఁగా వచ్చిన రాజులు నన్నుఁ జూచి యేమి పలుకుదురు? "ఆహా, బాలుఁడయిన యిక్ష్వాకువంశస్థుఁడగు రాముఁడు చిరకాలము రాజ్యము చేసెనుగదా." యని వారు నన్ను హేళనము చేయుదురు. ఎప్పుడైనను సుగుణములు గలవారును, శాస్త్రములనెల్లఁ జదివిన పండితులును, పెద్దలగు వా రనేకులును వచ్చి "రాముఁ డెక్కడ," అని యడిగినచో, నేను వారి కప్పు డేమి చెప్పుదును? అప్పుడు నేను వారిం జూచి 'కైకేయియొక్క నిర్బంధమునకుఁ దాళఁజాలక రాముని నడవికిఁ బంపితిని' అని యీ నిజమయిన సంగతిఁ జెప్పితినేని, ముందు వారి యెదుట సభలో 'రామునికి రేపు పట్టాభిషేకము జరిపించెదను' అని చెప్పినమాట కల్లయగునుగాదా? అదిపోనీ, రాముఁ డడవికిఁ బయనము కాఁగాఁ, గౌసల్య న న్నేమి చెప్పును. ఇట్టి కౌసల్య కిష్టముగాని పనిచేసి యాపెతో నే నేమి బదులు చెప్పుదును? ఓ దేవీ! కౌసల్య యెల్లప్పుడు నా యిష్టమునే చేయఁగోరుచు, రామునిఁ బ్రీతితోఁ బెంచుచు, నా కిష్టములైన పలుకులనే పలుకుచుఁ బనులందుఁ బనికత్తెవలెఁ బరిచర్య చేయుచు, నాటలందుఁ జెలికత్తెవలె నన్ను సంతసపఱచుచు, ధర్మకార్యంబులు నడుపుటయందు భార్యవలెఁ దోడ్పడుచు, మఱియొక భార్యను బెండ్లాడునప్పుడు నాతోఁబుట్టినదానివలె లాలననేయుచుఁ,దల్లివలెఁ బోషణము సేయుచు నన్నుఁ గొల్చుచున్నది. మన్ననచేయఁదగినదైనను గౌసల్యను నీ కెక్కడఁ గోపము వచ్చునో యని యెంచి మర్యాదసేయకుంటిని. ఓసీ కైకేయీ! నేను నీ కెప్పు డెప్పు డేమి యేమి మేలు నేసి

తినో, యదియెల్లను, పథ్యముగాని సాధకములతోడ భుజించిన యన్నము రోగిని బాధించినట్లు, నన్నిప్పుడు బాధించుచున్నది. రామునికిఁ బట్టాభిషేకము సేసెద నని చెప్పి యది చేయకపోవుట, యడవికిఁ బంపుట యీ రెంటిని జూచి సుమిత్ర యింక నన్నెట్లు నమ్మును? ఇతని మాటలు నీళ్ల మూటలవంటివి యని తలంపఁదటవే. సీతయున్ననో, 'నేను మరణము నొందితి' ననియు, 'రాముఁ డడవికిఁబోయె' ననియు నీ రెండు వార్తల నేకకాలంబుననె మిక్కిలి దిగులుతో వినఁగలదు. అయ్యో! పాపము! నే నేమి చేయఁగలను? సీతయు రాము నెడఁబాసి, నాకెత్తిన ప్రీతిగా విలపించుచు, హిమవంతముయొక్క పార్శ్వమున మగని నెడఁబాసిన కిన్నరాంగనవలె, దుఃఖించుచుఁ బ్రాణములఁ దొఱఁగఁబోవు చున్నది. భయంకరారణ్యంబున నుండు రామునిఁ దలఁచియు, విలపించుచున్న సీతను జూచుచును నేను దీర్ఘకాలము జీవింపఁగోరను. కావున నీవు మగనిఁ బోఁగొట్టుకొని నీ కొడుకుచే రాజ్యపరిపాలనంబు చేయించుచుందువు. రాముని నడవికిఁ బంపి నే నొక్క క్షణమయినను జీవింపఁగోరను. ఓ కైకేయీ! నీవు సొగసుఁదనముగలిగి పైకి మంచిదానవుగ నగపడుచుంటివి. నరుఁడు మద్యముయొక్క రూపముం జూచి మోహించి, విషముతోఁ గూడిన యామద్యముఁ ద్రాగి దాని చెడు గుణము నెఱుఁగునట్లు నేనును నీ రూపముఁ జూచి, మోహించి, నీకడఁ జేరి, నీ దుష్టస్వభావం బిట్టి దని యిపు డనుభవముచేఁ దెలిసికొంటిని. నీవు కపటముతోఁ గూడిన యిచ్చకపు మాటలు మాటాడి, నన్ను లాలన చేయుదానివలె నభినయించితివి. వ్యాఘ్రుఁడు తన పాటయొక్క నాదముచే మృగమును వంచించి, దాపునకుఁ జేరినతర్వాత దాని నెట్లు చంపునో, యట్లు నీవు నీ మాటలు వాస్తవము లని నమ్మి నీకడఁ జేరిన నన్నుఁ జంపితివి. యోగ్యు లెవ్వరైనను నన్ను రాజవీథులందుఁ జూచి రేని, 'ఈ దశరథుఁడు యోగ్యుఁడుగాఁడు. రామునికిఁ బట్టాభిషేకంబు జరిపించెద నని చెప్పి, పిదప నతనిని కేవలము స్త్రీ సుఖము నిమిత్త మడవికిఁ బంపించినాఁ' డనుచుఁ గల్లుద్రావిన బ్రాహ్మణునిఁ దిరస్కరించునట్లు నన్నుఁ దిరస్కరింతురుగదా! అయ్యో! నా కెంత వ్యసనము! ఎంత శ్రమ వచ్చినది! 'రాము నడవికిఁ బంపుము' అని నీ వడిగిన మాట విని

మోర్చి యున్నానుగదా. జన్మాంతరమందుఁ జేయఁబడిన దుష్టకర్మ మీ జన్మమున ననుభవమునకు వచ్చిన ట్లీదుఃఖము నాకు నిష్కారణముగఁ బ్రాప్తించినది.

ఓసీ క్రూరురాలా! పాపాత్ముఁడ నయిన నేను నిన్నుఁ జాలదినము లుగాఁ దెలియక మెడకుఁ దగులుకొన్న యురిత్రాటినివలెఁ గాపాడితిని. ఆ యురిత్రా డామనుష్యుని జంపునట్లు నీవు నన్నుఁ జంపనైతివి. నేనును నీతో రమించుచు, నీవు నాపాలిటి మృత్యుదేవత వని యెఱుఁగనైతిని. తెలివిమాలినవాఁడనై, యేకతంబున బాలుఁడు తెలివిమాలి నల్ల త్రాఁచును దాఁకినట్లు నిన్నుఁ దాఁకితిని. కాని యాకృష్ణసర్ప మాబాలుని చేయి గఱచి మరణము నొందించినట్లు, నీవు నీ మాట లనెడు విష ముచే నన్నుఁ జంపఁబూనితివి. దురాత్ముఁడనయిన నావలన నమ్మహాత్ముఁ డగు రాముఁడు దండ్రి లేనిబిడ్డఁ డయ్యెనుగా! రామునికిఁ దండ్రి చేయు పని యేదియుఁ జేయకపోవుటచేఁ దండ్రియైన నే నుండియు లేన ట్లయ్యెనుగదా! 'దశరథనరేంద్రుఁ డొక స్త్రీనిమిత్తము దన ముద్దులకుమా రుని నడవికిఁ బంపుచున్నాఁడు. ఇతఁడు తెలివిలేనివాఁడు; కామాతు రుఁడు' నని నన్ను సకలవిధంబులుగ జనులందఱుఁ దప్పక దూషింతురు.

రాముఁడు వ్రతములచేతను, బ్రహ్మచర్యాధర్మముల నడుపుట చేతను, గురుశుశ్రూషచేతను జిక్కిపోవునట్లు చేయఁబడెను. ఆ కష్టము లన్నియును దీఱి సుఖానుభవకాలమున మఱల గొప్పకష్టమునే యనుభ వింపవలసివచ్చినది. నా పుత్రుఁడగు రాముఁ డెప్పుడును నా మాటకు రెండవమాట చెప్పఁడు. నేను రాముని బిలిపించి: 'నాయనా! నీ వడ వికిఁ బొమ్ము' అని చెప్పినఁజాలును, వెంటనే రాముఁడు 'అట్లే పోయివచ్చెదను' అని చెప్పి బయలువెడలును. రాముని నే నడవికిఁ బొమ్మని చెప్పినప్పుడు, రాముఁడు 'నేను బోఁజాల' నని నాకుఁ దిరుగఁబడి చెప్పెనేని, యది నా కిష్టముగానే యుండును. అతఁ డట్లు చెప్పఁడు. రాముఁడు కపటములేనివాఁడు గనుక, నా చెడుతలంపు నెఱుఁగక, 'నే నడవికిఁ బొమ్మంటి' నేని 'సరే' యనియె చెప్పును. రాముఁ డడవికిఁ బయనము కాఁగానే, పురగ్రామవాసులగు జను లందఱు నన్ను 'ఛీ! ఛీ!' యని తిట్టుదురు. ఇట్లు జనులందఱు తిట్టుటయె

కాక మృత్యుదేవత పాపాత్ముఁడ నగుటచేత నోర్వరాని నన్ను యమ
పురికిఁ గొనిపోవును. నేను మరణమొందఁగా, నరశ్రేష్ఠుఁడగు రాముం
డడవికిఁ బోఁగా, మిగిలియున్న కౌసల్య మొదలగు నాయిష్ట బంధువుల
కెల్ల నీ వేమి కీడుసేయ నెంచియున్నావో? ఓకైకేయీ! నీవు నన్నుఁ
గౌసల్యను, రాముని, లక్ష్మణ శత్రుఘ్నులను విడిచివేయుదువేని,
సుమిత్రయు దుఃఖములను సైరింపఁజాలక నాతోడనే సహగమనము
సేయును. రాముఁ నడవికిఁ బంపి నే బ్రతుకను. నేను మృతినొందినచో
నా వియోగదుఃఖమును, బుత్రవియోగదుఃఖమును సైరింపఁజాలక
కౌసల్య మృతి నొందును. అంత రామునియందుఁ బ్రేమగల లక్ష్మణుఁడు
ప్రాణములను దొఱఁగును. శత్రుఘ్నుఁ డీ వృత్తాంతమును విని యచ్చ
టనే మృతినొందును. తన పుత్రులు నిర్వురిని, భర్తను బోఁగొట్టుకొని
సుమిత్రయు నాతో ననుగమనము సేయును, ఇట్లు కౌసల్యను, సుమి
త్రను, నన్ను, మువ్వురు పుత్రులతోఁగూడ దుఃఖమునఁ బడఁద్రోసి నీవు
మాత్రము సుఖమునొందుము. సుగుణములు గలిగినదియని ప్రసిద్ధికెక్కి,
యొక్కరికిని గదలింప నలవికానిదై శాశ్వతమయియుండు నిక్ష్వాకువంశ
మును నేనును, రాముఁడును బోయినవెనుకఁ గలవరపడిన దానిని జేసి
పాలింపఁబోవుచున్నావు. రాము నడవికిఁ బంపుట భరతునకు సమ్మత
ముగా నుండునేని; రాముని యరణ్యవాసమునకు వెంబడినె మృతి
నొందిన నాకు భరతుం డుత్తరక్రియలు సలుపకుండునుగాక? అయ్యో!
పాపాత్మురాలా! నా పాలిటి శత్రువైనదానా! నీ కోరికల నన్నిటినిఁ
బడయుము. నేను గతింపఁగఁ, బురుషోత్తముఁడయిన రాముఁ డరణ్య
మున కేఁగఁగ, నీ వనాథవై పుత్రునింగూడి రాజ్యంబుఁ బాలింపఁగలవు.
నీవు రాజపుత్రి వనెడు నెపముతో నాయింట నుంటివి. నీవు నిజముగా
రాజపుత్రివిగావు. లోకంబున సాటిలేని యపకీర్తియు, శాశ్వతమయిన
యవమానమును, సకల జంతువులయెదుట నీచత్వమును జన్మాంతర పాప
కర్మము మాడ్కి నీ రూపముతో మా యింటనున్నవి కాఁబోలును!
ముందు రథములమీఁదను, నేనుఁగులమీఁదను, గుఱ్ఱములమీఁదను మాటి
మాటికిఁ బోవుచుండిన పిల్లవాఁడగు రాముఁ డిపు డెట్లు పాదములతో
భయంకరమయిన యడవియందుఁ దిరుగఁగలఁడు? ఎవ్వఁడు భోజనము సేయు

నపుడు పోఁగులను దాల్చిన వంటలవారు "నేను వంటచేసి వడ్డించెదను. నేను వంటచేసి వడ్డించెద" నని ప్రదసములతో నిండిన మధురములగు పానములను, భోజనములను నమర్తురో, యట్టి రాముఁడు వనంబునఁ జేఁదు, ఒగరు, కారము గలయాహారపదార్థంబులఁ దినుచు నేవిధమునఁ గాలము గడపఁగలఁడు ? మఱియు మిక్కిలి వెలగల పట్టువస్త్రములను గట్టికొని, సుఖముగా నుండిన రాముఁ డిప్పుడు కాషాయవస్త్రమునుఁ గట్టికొని యెట్లు నేలపయి వసింపఁగలడు ? రాముని నడవికిం బంపుట, భరతునికిఁ బట్టాభిషేకంబు సేయుట యను రెండు క్రూరములగు వరములఁ గోరుమని యెవఁడు నీ కాలోచనలేకుండ బోధించెను. ఇది నీ స్వబుద్ధిచేఁ గలిగిన యాలోచనకాదు. ఎవఁడో దుర్బోధన సేసెను. ఇది నిజము. ఛీ! ఆఁడువారు మొండిపట్టుగలవారు. మేలుకీళ్లరయక యేపని యెట్లు పోయినను తమ పనియే కావలెనని యెల్లప్పుడు కోరుచుందురు. అయినను, అందఱు స్త్రీ లట్లుందురని నేఁ జెప్పను. ఎందఱో గుణవతులగు స్త్రీ లున్నారు. భరతుని తల్లియె మొండిదియనియుఁ దన పనినె చూచుకొనునది యనియుఁ జెప్పుచున్నాను.

చెఱుపునందే తలంపుగలదానా! స్వకార్య ధురంధరురాలా! క్రూరురాలా! నాకు వ్యసనము గలిగింపవలెనని కంకణము కట్టుకొన్నదానా! నాయందుఁగాని, యెప్పుడును లోకంబునకు మేలుచేయఁగోరుచుండు రామునియందుఁగాని యేమి యప్రియమును గంటివి. లోకమున నెంత యనురాగముగలవారయినను, దండ్రులు కొడుకులను విడుతురు. ఆండ్రు మగలనైనను విడుతురు. నేను రాముఁ నడవికిఁ బొమ్మనిన, దుఃఖపడుచుండు రామునిఁ జూచినంతమాత్రముననే లోకమంతయుఁ గోపముతోఁ గూడినదగును. నేనన్ననో, స్వాభావికముగా దేవతలపుత్రులంబోలు రూపముతోఁ జక్కఁగా నలంకరించుకొని వచ్చుచున్న రాముని జూచిన చూపుననే సంతసపడి, నేను మిక్కిలి ముసలివాఁడయినను బ్రాయమున నున్న వానివలె దేహబలము, నుత్సాహముఁ గలవాఁడ నయ్యెదను. సూర్యుఁ డుదయము కాకున్నను పనులు జరుగును. ఇంద్రుఁడు వాన గురిపింపక క్షామము సంభవించినను జను లాకలములు దిని జీవింతురు. రాముఁ డిక్కడినుండి యడవికిఁబోవునప్పుడు చూచి, యొక్కఁ డయినను జీవించి

యుండఁజాలఁడని నేను దలంచెదను. నాకుఁ జెడుగును గోరుదానవును, నా మేలు గోరనిదానవును, నాకు శత్రువువంటిదానవునైన నిన్ను నాపాలిటి మృత్యుదేవత నుంచుకొన్న ట్లుంచుకొంటిని. ఓర్వ్యరాని విషవేగముగల పామువంటి దానవయిన నిన్ను బహుకాలము నా తొడపై గూర్చుండఁ బెట్టికొంటిని. అది తెలియక చేయుటచే నిపుడు నీచేఁ జంపఁ బడితిని. నన్ను రాముని లక్ష్మణుని బోఁగొట్టుకొని భరతుండు నీ తోడ్పాటుగల్గి, బంధువుల నందఱిం జంపి, యయోధ్యా పట్టణమును, దేశమునంతయు నేలునుగాక! నీవును నాకుఁ గీడురోయు శత్రువులకు సంతోషము గలిగించుచుండుము. ఓక్రూరమయిన నడతగల దానా! ఆపదలందు మఱింతకష్టపెట్టుదానా! బలాత్కరించి, నాచేత మాట నొప్పించికొని యిప్పు డిట్టి మాటలు పలుకుచున్నావే! ఇట్టి నీ నోటినుండి వేయి వ్రయ్యలయి పండ్లు జల్లున నేల నేలయందు రాల కున్నవి? రాముఁ డింతవఱకు నొరులకుఁ జెఱుపుఁ జేయునవిగాని, యిష్టములుగానివి కాని పలుకులు పలికినదిలేదు. రాముఁడు పరుసని మాటల నాడుటయె యెఱుఁగఁడు. సుగుణవంతుఁడని యందఱిచేఁ బొగడఁబడుచు, నందఱికి సమ్మతములయిన పలుకులే పలుకుచుండు రామునివిషయమున నరణ్యమునం దుండవలసినంత తప్పిదముల నేమి కనిపెట్టితివి? చెప్పుము. కేకయవంశమునకుఁ జెఱపన చేటయైనదానా! నీ వేమవ్రము, మంటలోఁబడి మండిపొమ్ము, నాశమైపోవుము, కొండ కొనపై కెక్కి యచ్చటనుండి పడి తుత్తునియలయి పొమ్ము. నీ వేవిధ ముగా నష్టమైనను సరే, మిక్కిలి క్రూరమైనదియు, నాకుఁ గీడు దెచ్చు నదియునైన యీ పనిని నేను జేయను. మంగలకత్తివలె గొంతు కోయుదానవును, సదా బూటకంపుఁ బ్రేమతోడి మాటలాడుదానవును, కడుక్రూరంపుఁ దలఁపుగలదానవును, మా యిక్ష్వాకువంశమును ధ్వంసముచేయఁబూనినదానవును, మనస్సునను భీతిని గలిగించుదానవును, ప్రాణములతోఁగూడ మనస్సును దహింపఁగోరుదానవునైన నీవు బ్రతికియుండుటను నేను సహింపఁజాలను. ఇట్టి క్రూరురాలవయిన నీవు బ్రతికియుండుటకంటెఁ జచ్చుట మేలుగదా? రాముఁ డడవికిఁబోయిన నా ప్రాణం బుండదు. ఇఁక నాకేల సౌఖ్యము? పుత్రుని నరణ్యమునకుఁ

బంపి ప్రాణములు దాల్చియున్న నాకు సంతోష మెక్కడిది? నీవు నేను ఆలుమగలము. నాకు నీవు చెఱుపుచేయుట తగదు. నీ కాళ్లయినను బట్టుకొనెదను. నాపైఁ గరుణింపుము. రాము నడవికిఁ బంపుట యను వరంబుఁ గోరకుము." అని కైకేయితోఁ జెప్పియు, వేఁడుకొనియు స్త్రీమర్యాద మీఱియున్న కైకేయి కఠినమగు మనసుగలవాఁడై, దిక్కు లేనివానివలె నేడ్చుచుఁ, గైకేయి తన రెండుకాళ్లు భర్త దాఁకునని యెంచి యాతనికిఁ జిక్కనీయక తన కాళ్ళను మఱొక ప్రక్కకుఁ జాఁపుటచే, దానినిఁ దాఁకకయె, రోగియగువాఁడు హాఠాత్తుగాఁ గ్రిందఁబడునట్లు, దుఃఖముచే నొడలు తెలియక క్రిందఁబడెను.

## 13-వ స ర్గ ము

### దశరథుఁడు మఱల కైకేయిని వేఁడుకొనుట

అట్లు దుఃఖపడుటకుఁ దగనివాఁడును, నేలపైఁ బరుండియున్న వాఁడును, నా ప్రకారముగా నుండుటకుఁ దగనివాఁడు నైనందునఁ బుణ్యమంతయు ముగిసిన పిదప దేవలోకమునుండి త్రోయఁబడి క్రిందఁ బడిన యయాతిని బోలువాఁడును నైన దశరథమహారాజుం జూచి, చెఱుపే యాకారముగాఁ గలదియుఁ, గార్యసిద్ధిని బొందనిదియునైన కైకేయి యెురు లేమనుకొందురో యన్న భీతిలేనిదై, రాజునకు వెఱపుఁ జూపుచు, మఱల నావరములనే యిమ్మని కోరుచు, "ఓ మహారాజా! తమరు సత్యముఁ జెప్పువారనియు నియమముఁ దప్పనివారనియు నూరక తమ్ముఁ దాము బొగడుకొనుచుందురు. అట్లుండఁగా దమ రేల నా కిచ్చెదనన్న వరము నిచ్చుట కిచ్చగింపక యున్నవారలు" అని యడిగెను.

కైకేయి యడిగిన యా మాట విని, దశరథమహారాజు మిక్కిలి యలిగినవాఁడై, కొంతతడ వంగముల స్వాధీనత తప్పినవాఁడువోలె నుండి, మఱల స్మృతిఁ దెచ్చుకొని కైకేయిం జూచి, "ఓ చెడ్డదానా! నాపాలిటి శత్రువయినదానా! నరశ్రేష్ఠుఁడగు రాముఁ డడవి కేఁగి, నేను స్వర్గమున కేఁగిన పదంపడి, నీవు కోరిక లన్నిటిని బడసి, సుఖములు గలిగి యుండుము. అహా! యేమి నీ కటికితనము? నేను మరణంబు నొందినను నాకు సౌఖ్యము లేకున్నది! స్వర్గలోకమునకు దేవతలు రాముని

క్షేమముఁ గూర్చి, తిరస్కారముతోఁ జెప్పు మాటలను నే నెట్లు విందును? ఆహా! నాకెంత కష్టము ప్రాప్తించెను. నన్ను రాముని క్షేమ వార్తను గూర్చి వేల్పు లడిగినప్పుడు, 'వేల్పులారా! నేను నా ప్రియురాలగు కైకేయి కిష్టము నెఱవేర్పఁగోరి, రాముని నరణ్యమునకుఁ బంపితిని' అని యథార్థమును దెల్పితినేని, మున్ను రాజసభలోఁ బలువురు రాజర్షుల యెదుటను, మునీంద్రుల సముఖమునను 'రేపు రామునికిఁ బట్టాభిషేకము జరిపించెద' నన్న మాట యసత్య మగును. నేను చాలయేండ్లు బిడ్డలు లేక వ్రతములు, నుపవాసములు మొదలగు కష్టము లనుభవించి, యీ యాజానుబాహువగు సుపుత్త్రుఁడైన రామునిఁ బడసితిని. ఈరాముని నే నెట్లు విడుతును? ఈ రాముఁడు ధైర్యవంతుఁడు; విద్యలన్ని నేర్చినవాఁడు; క్రోధము నడఁగించినవాఁడు; ఓర్పె ముఖ్యగుణముగాఁ గలవాఁడు; తామరపూవుల రేకులంబోలు కన్నులు గలవాఁడు. అట్టి యీ రాము నెట్లడవికిఁ బంప నోపుదును? నల్లకలువల వంటి మేని చాయ గలవాఁడును, పొడవు చేతులవాఁడును, మిగుల బలశాలియు, సౌందర్యవంతుఁడు నైన రాముని నే నెట్లు దండకారణ్యములకుఁ బంప నోపుదును? సుఖములే యనుభవింపఁ దగినవాఁడును, దుఃఖములనుభవింపఁ దగనివాఁడును, బుద్ధిమంతుఁడునైన రామునికి దుఃఖమును నే నెట్లు కలిగించెదను? ఆ రాముఁడు కష్టము లనుభవింపుచుండఁగా నేనెట్లు చూచుచుండఁగలను? ఓ క్రూరురాలా! చెడ్డకోరికలు గలదానా! విడువని పరాక్రమంబు గలవాఁడును, నాకు ముద్దులు గులుకువాఁడునైన రామునికి నీ వేల చెఱుపుఁ గావింప నెంచెదవు? నీ కతఁ డేమి యపకారము చేసెను? ఇప్పుడు నేను నీ కోరికప్రకారము నడచుకొందునేని, నాకు లోకమున సాటిలేని యపకీర్తియు, శాశ్వతమైన యవమానమును గలుగును" అని చెప్పుచుఁ, గుదుటపడని మనస్సుగలవాఁడై, కన్నీరు విడువసాగెను. ఇంతలో సూర్యుఁడు పడమటిదెసఁ గ్రుంకెను; రాత్రియయ్యెను. ఆరాత్రి పండువెన్నెలతోఁ గూడినదై వెలయుచున్నను, అవ్విధమున వ్యసనమున మునిఁగి పలవించుచున్న, యీ దశరథ నృపాలునికిఁ గొంచెమయినను సంతసముఁ గావింపకుండెను. ముదుసలియగు దశరథనృపుఁ డట్లు వేఁడి నిట్టూర్పు

విడిచి, యాకసంబు వైపునఁ దన చూడ్కులు నిగిడించి, యాపద నొందినవానికై వడిఁ జూపులకు వ్యసనము గలిగించుచు విలపించుచుండెను. అట్లు కొంత తడవు పలవించి, "నక్షత్రములే భూషణములుగాఁగల యో రాత్రీ, నీవు నాపైఁ గరుణించి, తెల్లవాఱకయుండుము. అట్లు కాదేని, యో రాత్రిదేవీ! నీవు త్వరగాఁ గడచిపొమ్ము. ఎందువలన ననఁగా నే కైకేయివలన నే నింత దుఃఖము నొందితినో, యా దయమాలిన పాపాత్మురాలిని జూచుట నాకెంతయు సమ్మతముగాదు" అని రాత్రి దేవిని బ్రార్థించి, చేతులు జోడించికొని, మఱలఁ గైకేయిం బతిమాలి కొని యామె నుద్దేశించి, " ఓ పట్టంపుదేవీ! నేను మంచి నడత గలవాఁడను; నొచ్చియున్నవాఁడను; నీయందే ప్రేమగలవాఁడను; జీవితము యొక్క కడపటి దశలో నున్నవాఁడను. ఇవన్నియుఁ గాక రాజను. ఈ కారణములంబట్టి నాపైఁ గరుణింపుము. ఓ కాంతామణీ! నేను ముందు వెనుక లాలోచింపక యీ మాట యంటిని. నీవు నాకు నెచ్చెలివిగదా! కావున. బాగుగా నాలోచించి నాపైఁ గరుణింపుము. ఓ కైకేయీ! నీ వనుగ్రహించి, రామునకు రాజ్యం బొసఁగుము. నీవు దయయుంచి యొసఁగిన రాజ్యము నతఁడు ప్రీతితో నేలఁగలఁడు. నీవు సాటిలేని కీర్తినిఁ బొందుదువు. ఓసుముఖి! నీ వాప్రకారంబుగ రాజ్యంబు నొసఁగుట నాకును, రామునికిని, జనులకును, పెద్దలకును, భరతునికిని మిక్కిలి ప్రియమైయుండును. ఈ పనిచేయుము." అని యాపెను బలుతెఱఁగుల వేఁడెను. చెడ్డతలంపుగలదియైన కఠినురాలగు నాకైకేయి, కపటములేక కన్నీరు విడుచుచు వేఁడుకొనుచుండు నెఱ్ఱని కన్నులుగల దశరథుని వింతయైన దిక్కుమాలిన యేడ్పును విని, యాతని మాటలఁ బెడచెవిఁబెట్టి యాప్రకారంబుగఁ జేయని దయ్యెను. అంతట నానృపాలుఁడు కడుదుష్టురాలును, నెదురాడుచుండునదియు నైన కైకేయిం జూచి, తన కొడుకు నరణ్యమునకుఁ బంపవలసి వచ్చినందుకై, మిక్కిలి వగచి, నిశ్చేష్టితుఁడై క్రిందఁబడెను.

ఇట్టి మంచి మనస్సుగల దశరథుఁడు వేఁడి నిట్టూర్పు విడుచుచుండఁగా రాత్రి గడచినది. అంతటఁ దెల్లవాఱఁగా, స్తుతిపాఠకులు రాజుగారిని నిద్ర లేపుటకయి మేలుకొలుపులఁ బాడుచుండఁగా, రాజ

శ్రేష్ఠుఁడగు దశరథుఁడు వారిని మేలుకొలుపులు పాడవలదని యాజ్ఞా పించెను,

## 14-వ సర్గము

### కైకేయి దశరథుల సంవాదము

పుత్రుని నెడఁబాయుటను గూర్చిన వ్యసనముచే నొచ్చినవాఁడై తెలివితప్పి, నేలమీఁదఁబడి పొరలుచుండు దశరథమహారాజును జూచి పాపాత్మురాలగు కైకేయి, "ఓ రాజా! నీవు మొదట వరంబుల నొసంగెద నని ప్రతిజ్ఞ చేసి, యా ప్రతిజ్ఞ దప్పుట యను పాపకార్యము చేసియు, నెందుల కిట్లు దుఃఖముతోఁగూడి నేలమీఁదఁ బరుండు చున్నాఁడవు? మహారాజా! యిది నీకుఁ దగదు. నీవు సత్యముఁ దప్పకుండుటయను మర్యాదను మీఱుట యోగ్యముగాదు. సత్యముఁ దప్పకుండుము. సత్యము తప్పకుండుటయే గొప్ప ధర్మమని ధర్మవేత్త లగుపెద్దలు పలుకుదురుగదా! నీ వాడినమాటను దప్పవని యెంచియే, నేను నిన్నీవరంబుల రెండింటిని నిమ్మని యడిగితిని. తొల్లి మీ వంశములోనివాఁడయిన శైబ్యుఁడను రాజు పావురమును రక్షించుటకై డేగకుఁ దనదేహమును గోసి యిచ్చెద నని చెప్పి, యట్లు చేసి యుత్తమ లోకము నొందెను. ఓ మహారాజా! అతఁడొక్కఁడే కాఁడు. విశేష ప్రభావముగల యలర్కుఁడు దన్ను వేదవేదాంగములను దుదముట్టఁ జదివిన యొక గ్రుడ్డిబ్రాహ్మణుఁడు కన్నులిమ్మని యాచింపఁగాఁ గొంచెముకూడ వెనుదీయక, సంతోసముతోఁ దన కన్నులఁ బెల్లగించి యిచ్చెనుగదా! సముద్రుఁడును సత్యముఁ దప్పరాదని యెంచియె, తనయొక్క చిన్న కట్టనుగూడ దాఁటి రాకున్నాఁడుగదా! సత్యమే పరబ్రహ్మమునకు ముఖ్యస్థానము. సత్యమునందే యన్నిధర్మములు నిలిచియున్నవి. సత్యమే సమస్తవేదములును. సత్యము చేతనే మోక్షము లభించుచున్నది. ఓరాజశ్రేష్ఠుఁడా, నీవు ధర్మమును బరిపాలింపవలసియున్నది గనుకను, అందునిమిత్తమై నేను బ్రేరేపించు చున్నాను గాఁబట్టియు నీకు ధర్మమునం దుత్సాహము గలదేని సత్యము ననుసరింపుము. నాకిచ్చిన రెండువరంబులు ఫలించుఁగాక. నీవు వరదుఁడవు గదా! నీ కుమారుఁడగు రాముఁ నడవికిఁ బంపుము. ముమ్మా

టికిఁ జెప్పుచున్నాను. గొప్ప కులమున జనించిన యో నృపాలా! యీ
నా వరంబులను రెండింటిని నెఱవేర్పవేని, నీవు చూచుచుండఁగనే
నా ప్రాణములఁ దొఱఁగెదను" అని మొగమోటమిలేని మాటలను
జెప్పెను.

అప్పుడు దశరథుఁడా కైకేయి తెగఁబడి చెప్పిన పలుకులు విని,
బలి యింద్రునిచేఁ బ్రయోగింపఁబడిన పాశమును ద్రెంపఁజాలనట్లు, ధర్మ
పాశమునుండి విడుదల నొందఁజాలనివాఁ డయ్యెను. మఱియు నా దశ
రథుఁడు కైకేయి కొసంగిన వరము నొసంగుటకును, రాము నడవికిఁ
బంపుటకును జాలక, బండికాఁడికిని చక్రమునకును నడుమనున్న యెద్దు
వెనుకకుఁ బోయినఁ గాళ్ళకుఁ జక్రము దగులునని భయపడుచు, ముందుకుఁ
బోయినఁ గాఁడి యత్తు తాఁకు నని వెఱచుచు నెట్లు పోవను జాలక
యుండునో యట్లు రాముని నిష్కారణముగాఁ నడవికి బంపఁజాలకయుఁ,
గైకేయివరముల నొసంగకున్న నసత్యదోషంబు వచ్చునని వెఱచుచును,
మోహమునఁ గళదప్పి, వెఱ్ఱిపట్టినవానివలె నుండెను. ఇట్లు పుడమిఱేఁడు
పరవశములయిన కన్నులచేఁ గైకేయిని బాగుగఁ జూడకయే, యెట్ట
కేలకు దిటవు పూని, యాకైకేయిం జూచి, "ఓ పాపాత్మురాలా! యగ్ని
హోత్రుని సముఖమున మంత్రములచేఁ బరిశుద్ధమయిన యే నీ చేతిం బట్టి
తినో, యా చేతిని, నీతోఁ బాటు నాకుఁ బుట్టినవాఁడైనను, నీయందు జనిం
చుటం జేసి, యా భరతుని వదలిపెట్టుచున్నాను. ఓరాణీ! రాత్రి గడ
చినది. ప్రొద్దుపొడువఁ బోవుచున్నది. పురోహితులు మొదలగువారు
రాముని యభిషేకము నిమిత్తము సకల వస్తువులను దెప్పించి, సిద్ధ
పఱచి, నన్నుఁ దొందఱపఱతురు. ఓసీ! నేను చనిపోయినతర్వాత,
నాకు రామునిచేఁ నుత్తరక్రియలు నడిపింపవలయునే కాని, నీవు
రాముని పట్టాభిషేకంబు చెడఁగొట్టఁ బూనితివేని, నీవు నీ కొమారుని
చేత నుత్తరక్రియలు చేయింప నక్కఱలేదు. రామునికిఁ బట్టాభిషేకము
జరుగఁబోవుచున్నదని యప్పుడట్లానందముతో నొప్పుచుండిన యిప్పు
డానందములేక విచారముతో వెలవెల వోవుచున్నను తలలువంచు
కొనియున్న జనులను మఱల నెట్లు చూడఁగలుగుదును ?"
అని కైకేయితో మాటాడుచుండునప్పుడె చంద్రునితోను,

నక్షత్రములతోను గూడిన యా పావనమయిన రాత్రి గడచి బాగుగఁ దెల్లవాఱెను.

అంతటఁ బాపంపు నడవడులుగలదియు, మిక్కిలి నేర్పుతో మాటలాడ నేర్చినదియునైన కైకేయి రోషముచే నోడలు దెలియనిదై, రాజును జూచి, "మహారాజా! ఏమి మాట్లాడుచున్నావు? విషము ద్రాగుటచేఁ బుట్టిన వ్యాధివలెఁ బేగులను బెల్లగించెడి మాట లనుచున్నావు? క్లేశపడకుండ నీవు రాముని నిక్కడికిఁ బిలిపింపుము. తర్వాత నా కొమరునికిఁ బట్టముగట్టి, రాముని నడవికిఁ బంపి, నన్ను శత్రుపక్షము లేనిదానినిగాఁ జేసి నీవు కృతకృత్యుఁడవు కాఁగలవు." అని పరుషములయిన మాటలఁ జెప్పెను.

ఆ దశరథుఁడు కైకేయి యివ్విధంబునఁ జెప్పిన పలుకులు విని చుఱుకైన చౌకుతోఁ గొట్టఁబడిన మేటిగుఱ్ఱమువలెఁ గడు వేగముగఁ బ్రేరణ సేయఁబడినవాఁడై, కైకేయిం జూచి, "ఛీఛీ, నేను ధర్మమను త్రాటిచేఁ గట్టఁబడి యున్నాఁడను. నా బుద్ధియు నాశనమై పోయినది. ధర్మమునందుఁ బుట్టుదలగల నా ముద్దులరాముని నేను జూడగోరుచున్నాను" అని కైకేయితోఁ జెప్పెను.

అంతట నారాత్రి గడచి తెల్లవాఱఁగనే, దయాదాక్షిణ్యాది గుణములతోఁ గూడినవాఁడైన వసిష్ఠమునీంద్రుఁడు శిష్యులతోఁగూడి, యప్పుడు, సామగ్రులనెల్లను గైకొని శ్రేష్ఠమగు నగరము లోపలికిఁ బ్రవేశించెను. అట్లు నగరములోపలికిఁ బ్రవేశించి, నీళ్లుచల్లి చక్కఁగా నూడ్చిన వీథులుగలదియు, నచ్చటచ్చటఁ గట్టఁబడియుండు టెక్కెములతోఁ బ్రకాశించుచుండునదియు, రాముని పట్టాభిషేకం బెప్పుడు జరుగనున్నదో, యెప్పుడు మన మా వేడుకను జూడఁగలమో యనెడి తహతహతోఁగూడిన జనులచే నిండినదియు, విచిత్రములైన పువ్వులు చల్లుటచే నొప్పుచున్నదియు, లెక్కలేని పూవులదండలచే వెలుఁగుచున్నదియు, సంతోషముతో నిండిన మనుష్యులతోఁ గూడినదియు, సకల వస్తువులతో నిండిన యంగళ్లుగలదియుఁ జందనము, నగరువు మొదలగు సుగంధద్రవ్యములచే నంతటఁ బొగ వేయఁబడినదియునై, స్వర్గలోకముతో సాటివచ్చునదియును, బ్రాహ్మణులచేఁ నంతటశోభిల్లు

చుండునదియు, నగుపట్టణమును దాటి శ్రౌతవిధానము నెఱింగిన సభ్యులగు బ్రాహ్మణోత్తములతోఁ బరిపూర్ణమైనదియుఁ, బట్టణవాసులు, గ్రామవాసులు నగు జనులచే వ్యాప్తమయినదియు నైన యందమగు నంతఃపురంబుఁ జొచ్చి, యచ్చటి జనుల నందఱిని గడచి, కడుప్రేమతోఁ గూడినవాఁడై, లోపలికిఁ బ్రవేశించి, రాజశ్రేష్ఠుఁడగు దశరథుని యంతఃపురంబు వాకిట నిలిచి లోపలినుండి వచ్చెడు సుమంత్రుఁడను మంత్రిని జూచెను. ఎక్కువ తపోమహిమ గల వసిష్ఠుఁడు నేర్పరియైన సూతపుత్రునిఁ జూచి, "యో సుమంత్రుఁడా! నే నిచ్చటికి వచ్చియున్నానని రాజుగారి కెఱింగింపుము. ఇవిగో! గంగనదినుండియు, సముద్రములనుండియుఁ దేఁబడిన నీటితో బంగారు కలశములు పట్టాభిషేకమునకై, యత్తికొయ్యతోఁ జేయబడిన శుభాసనము సిద్ధము చేయఁబడినది. నవధాన్యములును, పరిమళద్రవ్యములన్నియు, నానావిధములయిన రత్నములు, తేనె, పాలు, పెరుగు, నెయ్యి, పేలాలు, దర్భలు, పుష్పములు తేఁబడినవి. సొగసుకత్తెలగు నెనమండ్రు పడుచులు వచ్చిరి. మదించిన మేటి యేనుఁగును, నాలుగు గుఱ్ఱములు పూన్చిన రథమును, తళతళ మెఱయు కత్తియు, మేటి విల్లును, మనుష్యులు మోయునట్టి పల్లకియుఁ, జంద్రునివలె వెలుఁగుచుండు తెల్లని గొడుగును, వింజామరలును, బంగరుగిండియును, బసిఁడి త్రాళ్లతోఁ గట్టిన యెత్తు మూఁపురముగల తెల్లనియెద్దును, బలముగలదియు, నాలుగు కోఱలు గలదియు, జూలు గలదియు నైన మేటి గుఱ్ఱమును, సింహాసనమును, పులితోలును, చక్కఁగా జ్వలించునట్లు చేయఁబడిన యగ్నిహోత్రమును, సకల వాద్యములును సిద్ధముచేయఁబడియున్నవి. సొగసుచేసికొన్న స్త్రీలు, వేశ్యలు, ఆచార్యులు, బ్రాహ్మణులు వచ్చియున్నారు. పరిశుద్ధములైన మృగములును, బక్షులును వేచియున్నవి. పట్టణములలోను బల్లెలలోను నుండువారును దమతమ పరివారముతోఁ గూడి వచ్చియున్నారు. వీరు మాత్రమే కాక యనేకులు జనులు వచ్చి, సరసపుంబలుకులు పలుకుచు, మిక్కిలి సంతసము ననుభవించుచు, రాజులతోడ వచ్చి, రాముని పట్టాభిషేకమహోత్సవముఁ జూచుటకై కాచియున్నారు. మహారా జింకను కానరాఁడు. సూర్యో

దయమయినది, ఓ సారథీ! నీవు లోపలికిఁ బోయి, సకల శుభగ్రహంబుల తోను, శుభనక్షత్రయోగకరణములతోను గూడిన శుభదినమున, శుభముహూర్తమున రాముని రాజ్యాభిషేకము జరుగునట్లు మహారాజును వేగిరపడుపుము." అని సారథితోఁ జెప్పెను. వెంటనే సుమంత్రుఁడు మహాత్ముఁడైన వసిష్ఠమునీంద్రుని మాటలను విని, రాజ శ్రేష్ఠుఁడగు దశరథుని గొనియాడుచు లోపలికిఁ బ్రవేశించెను. సుమంత్రుఁడు ముసలివాఁడును, రాజునకు నెచ్చెలియు నైనందునను, నట్టి సుమంత్రుని లోపలికిఁ బోవుటకుఁ గాని, వచ్చుటకుఁగాని యాటంకము చేయఁగూడదని తమ కుత్తరు వయినందునను, మహారాజునకుఁ బ్రియ మాచరించు ద్వారపాలకులు సుమంత్రుని నడ్డగింపఁజాలరైరి. సుమంత్రుఁడును ద్వారపాలుర యాటంకములేక లోపలికిఁజొచ్చి, దశరథమహా రాజు చేరువను నిలువఁబడి, యా నృపాలుని యట్టి వ్యసనావస్థ నెఱుఁగనివాఁడై, యెక్కువ ప్రేమతోఁ గూడిన మాటలచే రాజును బొగడ దలఁచి చేతులు జోడించి, రాజగృహంబునందుఁ గాలానుగుణముగ నివ్వేధంబునఁ బడమితేనిని స్తోత్రముచేయఁ దొడఁగెను. "ఓ నృపాలా! చంద్రోదయంబగుడు, కాంతిగల సముద్రము ప్పొంగినట్లు, తాము మిక్కిలి సంతసముచే నుప్పొంగుచుఁ బ్రేమాతిశయముతోఁ గూడిన మనస్సుతో మమ్ము సంతోషపఱుపుఁడు. ఈ వేళయందే దేవేంద్రుని నతనిసారథియగు మాతలి స్తోత్రముచేసెను. కావున నింద్రుఁడు సకల దానవులను జయించెను. అట్లే మహారాజా! తాము శత్రువులను గెలుతురు గాక యని నే నిప్పుడు తమ్ము మేలుకొలుపుచున్నాను. సూర్యుఁడు చంద్రునితోఁ గూడినవాఁడై, సకల భూతములను ధరించియున్న మంగళకరురాలగు భూదేవిని మేల్కొలుపునట్లు నేను దమరిని మేల్కొలుపుచున్నాను. వేదము లంగములతోఁగూడినవై బ్రహ్మను లేపునట్లు నేను దమ్ము లేపుచున్నాను. మహారాజా! మేరుపర్వతము నుండి సూర్యుఁ డుదయించునట్లు సెజ్జనుండి లెండు. లేచి, మంగళ కరములైన కార్యంబులు నెఱవేర్చికొని, సభకు రండు. కకుత్స్థవంశమునఁ బుట్టిన యో నృపాలా, సూర్య చంద్రులు, ఇంద్ర, అగ్ని, యమ, వరుణ, కుబేరులు తమకు మేలు నేయుదురుగాక. పూజ్యమగు రాత్రి

గడచినది. తెల్లవాఱవచ్చినది. తాము ప్రాతఃకాహ్నికములెల్లఁ దీర్చవలయునుగదా! రాజశ్రేష్ఠా! మేల్కొనుఁడు. ఆ వెంబడి చేయవలసిన పనుల నెల్ల జరిగింపుఁడు.

రాముని పట్టాభిషేకమునకుఁ గావలసిన వస్తువు లెల్ల సిద్ధముగఁ దేఁబడియున్నవి. పురములో నుండువారు, పల్లెలలో నుండువారు, దేశదేశములలో నుండువారు వచ్చి చేతులు జోడించికొని యుండఁ బూజ్యుఁడగు వసిష్ఠమునీంద్రుఁడు బ్రాహ్మణులతోడం గూడి, తామె వచ్చియున్నారు. రాజేంద్రా! రామునకుఁ బట్టాభిషేకము జరుప వేగిరంబుగా నానతీయవలయును. కాఁపరిలేని పశువులవలెను, నాయకుఁడులేని సేనవలెను, చంద్రుఁడులేని రాత్రివలెను, నాఁబోతులేని యావులవలెను రాజులేక రాజ్యము ప్రకాశింపదుగదా" అని సుమంత్రుఁడు దశరథనృపాలునిఁ బొగడెను.

అంతటఁ బుడమితేఁడు వేఁడికోలుతోఁ గూడినదియు, నర్థముతోఁ గూడినదియునైన సుమంత్రుని మాటలను విని, మఱల శోకముచేఁ గలవరపడి కన్నీరు విడుచుటం జేసి యెఱ్ఱనైన కన్నులు గలవాఁడయ్యెను. ఇట్లు ధర్మముల నాచరించువాఁడయిన కాంతిమంతుఁడగు దశరథుఁడు కొంతసేపు చింతించి, కొమరునింగూర్చిన సంతసము మానినవాఁడై, సుమంత్రుని జూచి, "ఓయీ, నీవు మఱల మాట లను సూదులతో నా మర్మములను బొడిచెదవు" అనెను. సుమంత్రుఁ డప్పలుకులు విని, దశరథుఁడు సంతసముఁ దప్పి శోకముతో నుండుటను జూచి, తాను చేతులు జోడించికొని యచ్చటినుండి కొంచె మావలికిఁ బోయెను. అట్లు రాజు దుఃఖముచేఁ దాను సుమంత్రునితో నొక్కమాటయైనఁ, జెప్పఁజాలకపోవఁగా, వెంటనే యుపాయముల నెఱింగినదగు కైకేయి తానే సుమంత్రునిం గూర్చి "ఓ సూతుఁడా! నృపాలుఁడు రాత్రియెల్ల రాముని పట్టాభిషేకముఁ గూర్చిన సంతసముఁ దలపోయుచు మేల్కొనియుండి, యిప్పుడే మంచి నిద్రలో నుండువాఁడు. కావున, సారథీ! నీవు వేగ మేఁగి, కీర్తిమంతుఁడగు రాముని బిలుచుకొనిరమ్ము. నీకు మేలగు. రాజుగా రానతీలేదే యని యీ విషయమున నాలోచింపఁబనిలేదు" అని చెప్పెను.

అట్లు కైకేయి నిలువనీయక మిక్కిలి వేగిరపఱుపఁగా, సుమంత్రుఁడు "రాముఁడు పట్టాభిషేకమునిమిత్తమై యిక్కడికి రాఁబోవుచున్నాఁ"డని మనంబునఁ దలపోసి, యెక్కువ సంతోషముతోఁ గూడినవాఁడై, నిడివిచేతులుగలవాఁడగు రాముని జూడఁగోరి, సముద్రమండలి మడుగుం బోలిన సొగసయిన యంతఃపురమునుండి వెలుపలికి వచ్చి, ముందట జనులు క్రిక్కిరిసియున్న ద్వారమును బొంది, ద్వారము ముందట నిలిచి, నానాదేశములనుండి యెక్కువధనమును, కానుకలను గైకొనివచ్చి నిలఁబడియున్న రాజులను, పురవాసులగు జనులను జూచెను.

## 15-వ సర్గము

### సుమంత్రుఁడు రామునిఁ దోడ్కొని రాఁబోవుట

వేదములఁ దుదముట్టఁ జదివినవారలైన బ్రాహ్మణులందఱు ఆ రాత్రిగడపి, రాజపురోహితుఁడగు వసిష్ఠునితోఁ గూడి, సభకు వచ్చి చేరిరి. మంత్రులలో ముఖ్యులును, సేనానాయకులును, పట్టణము లోపలి పెద్దలును ముదము నందినవారలై రాముని పట్టాభిషేకమును జూడ నచ్చటఁ జేరిరి. సూర్యోదయమయిన పిమ్మటఁ బుష్యమీనక్షత్రమునందు రామునియొక్క జన్మలగ్నమగు కటకమునందు బ్రాహ్మణోత్తములు రాముని పట్టాభిషేకంబు జరుపుటకుఁ గావలసిన వస్తువులఁ దెచ్చి సిద్ధపఱచిరి. నీళ్లతో నిండిన బంగారు బిందెలును, చక్కఁగా నలంకరింపఁబడిన సింహాసనంబును, మెఱయుచుండు పులితోలు లెస్సగాఁ బఱచిన రథమును బ్రకాశింపుచుండినవి. గంగానదియు, యమునానదియు సంగమించు పుణ్యస్థలమునుండియు, మఱియుఁ బావనములైన నదులనుండియు, మడువులనుండియు, బావులనుండియుఁ దేఁబడిన జలములతో నిండిన కలశములు సిద్ధమయి వెలయుచుండినవి. తూర్పువైపునకుఁ బాఱునవియుఁ, బైకిఁ బాఱునవియు, నడ్డముగాఁ బాఱునవియు నైన నదుల నన్నింటినుండియు, సముద్రము లన్నిటినుండియుఁ దేఁబడిన జలమచ్చట వెలయుచుండెను. లాజలతోఁ గూడినవి, పాలుగల రావియాకులచేఁ గప్పఁబడినవియునైన బంగరువెండిమయములైన కలశములు పావనజలముతో నిండినవై, తామరలతోను గలువలతోను గూడి

ప్రకాశించుచుండినవి. మఱియు నచ్చటఁ దేనె, పాలు, పెరుగు, నెయ్యి, లాజలు, పుష్పములు సిద్ధముచేయఁబడి యుండినది. సొంపగు నడకగల వేశ్యలును సకలభూషణముల నలంకరించుకొని యా సభలో నుండిరి. చందురునికాంతివలె మిక్కిలి తెల్లనైనదియు, రత్నములు చెక్కిన బంగారుపిడి గలదియు నైన రామునియొక్క మేటి చామరము సిద్ధముగా నుంచఁబడినవి. చంద్రమండలము మాడ్కిఁ దెల్లని కాంతిగలదియు, ధరించువారికిఁ గాంతిని గలుగఁజేయునదియు నైనగొడుగు పట్టాభిషేకము నిమిత్తము ముందట సిద్ధముగా నుంచఁబడియుండెను. తెల్లనియెద్దును, తెల్లనిగుఱ్ఱమును దెప్పింపఁబడియుండినవి. మదజలము గార్చుచున్నదియుఁ, గాంతిగలదియు, రాజు లెక్కఁదగినదియు నైన యేనుఁగును సిద్ధముగాఁ దెప్పింపఁబడియుండెను. మంగళకార్యములఁ జేయుటకుఁ దగినవారును, సకలభూషణములచే నలంకరింపఁబడిన వారు నైన యెనమండుగురు పడుచులు రాముని పట్టాభిషేకము నిమిత్తమువచ్చి కాచియుండిరి. సకలవిధములయిన వాద్యములును సిద్ధపఱుపఁబడినవి. స్తుతిపాఠకులును, మఱియు ననేకులు రాముని పట్టాభిషేకము నెదురు చూచుచుండిరి. దశరథుని యానతిఁగొనిన రాజు లందఱును, ఇక్ష్వాకువంశస్థులగు రాజులకుఁ బట్టాభిషేకమునకై వారల యాచారము చొప్పునఁ గావలసిన మంచి మంచి వస్తువుల నెట్లు చేర్పవలయునో, యట్లు రాముని పట్టాభిషేకమునకుఁ గావలసిన వస్తువులనెల్లను జేర్చి యుంచి, యా సభాద్వారమునందుఁ గలిసినవారలై, దశరథమహారాజును గానక, "మన మిక్కడ నున్నామని రాజున కెవ రెఱిఁగింతురు? రాజును గానకున్నాము. ప్రొద్దుపొడిచినది. రాముని పట్టాభిషేకమునకుఁ గావలసిన సామగ్రులన్నియు సిద్ధముచేయఁబడినవి" అని తమలోఁ దామనుకొనుచుండఁగా, రాజుగారి మన్నన జెందిన సుమంత్రుఁడు భూమండలమెల్ల నేలెడు చక్రవర్తులం జూచి, "నృపాలురారా, రాజుగారి యానతిఁగొని వేగిరంబుగ రామునిఁ దోడ్కొనిపోవ వచ్చితిని. తాము దశరథునిచేతను, విశేషముగా రామునిచేతను బూజసేయఁ దగిన వారలుగదా! దీర్ఘాయుస్సుగల మీరు సుఖముగా వచ్చిన సంగతిని రాజుగారితో నే నిదిగో మనవిచేసెదను" అని చెప్పి వెనుకకు మఱ

లెను. రాజుల పూర్వికుల చరిత్రముల నెఱింగిన సుమంత్రుఁడు వారితో నిట్లు పలికి, రాజుగారి యంతిపురంబు వాఁకిటికిఁబోయి, తలఁచి నప్పుడు లోపలికిఁబోవ వీలగు రాజు నగరులోనఁ జొచ్చి, యపుడు పుడమిఱేఁడగు దశరథమహారాజుగారి వంశావళిని బొగడెను. అట్లు పొగడుచు, దశరథనృపాలుని పడకగది చేరువకుఁబోయి యచ్చటనిలిచెను. ఆ సుమంత్రుఁడు పడకగదిని నడుమ తెఱలేకుండునంత దాపునకుఁ జేరి, సుగుణములతోఁ గూడిన దశరథుని దీవనలు దీవించి, యివ్విధంబునఁ బొగడెను. "ఓ కకుత్థ్సవంశమందుఁ బుట్టిన దశరథమహారాజా! సూర్య చంద్రులును, ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, వరుణుఁడు, కుబేరుఁడు, ఈశానుఁడును తమకు విజయముఁ గలిగింతురుగాక! రేయి గడచినది. తమ రీ రేయి చేయవలసిన పనులనెల్లఁ జేసి ముగించితిరిగదా. నృప శ్రేష్ఠా! మేలుకొని చేయవలసిన పనిని జేయుఁడు. నృపాలా! బ్రాహ్మణు లును, సేనాధిపతులును, పట్టణములోని పెద్ద లందఱును వచ్చి తమరాక కెదురు చూచుచున్నారు. రఘునందనా! మేలుకొనుఁడు" అని యాలో చనలో నేర్పరియైన సారథియగు సుమంత్రుఁడు స్తోత్రము చేయుచుం డఁగా, దశరథనృపాలుఁడు మేలుకొని సుమంత్రునిఁగూర్చి "ఓ సారథీ! రాముని దోడ్కొని రమ్మని యాకైకేయి నీతోఁ జెప్పినదిగదా. ఆ యాజ్ఞ నాయాజ్ఞయేకదా. ఏల యా ప్రకారము చేయవయితివి? ఇట్లు కైకేయి యాజ్ఞను మీఱుటకుఁ గారణమేమి? నేను నిద్దుర చెందలేదు. నేను మేల్కొనియె యున్నాను. రాముని వెంటనే తోడ్కొనిరమ్ము" అని తానే యుత్తరు విచ్చి పంపెను.

అంత సుమంత్రుఁడు రాజుగారి యానతిని శిరసావహించి, యా దశరథనృపాలునికి నమస్కరించి, యేమియో గొప్పమేలు గలుగఁబో నున్నది యని తలఁచుచు, రాజుగారి యింటనుండి వెడలి, మీఱిన ముదంబుతోను, చింతలేకయుఁ, బులకలు చెందినవాఁడయి, రాజమార్గం బునఁ బోవుచు, జనులందఱు సంతోష రోమాంచములతోడఁ గూడి రాముని పట్టాభిషేకమును గూర్చి చెప్పుకొనుచున్న కథలను వినుచు, కైలాసశిఖరమంత యెత్తుగలదై యింద్రుని భవనముయొక్కయందము వంటి యందముఁగలిగియున్న రాముని నగరు చూచెను. ఆ రాముని

గృహము గొప్పతలుపులు గలదియు, నూఱుల కొలఁది తిన్నెలుగల దియు, బంగారు ప్రతిమలు చెక్కిన ముఖ్యములయిన కొనలుగలదియు, రత్నములు, పగడములు గూర్చిన తోరణములు గట్టినదియు, శరదృతువు నందలి, తెల్లని మేఘముల కాంతివంటి కాంతిగలదియు, వెలుతురు గలదియు, మేరుపర్వతంపు గుహను బోలినదియు, శ్రేష్ఠములయిన మణుల హారములచేత నలంకరింపఁబడినదియు, ముత్యములచేఁ బఱుపఁబడినదియుఁ, జందనము, నగరు వీనిచే ధూపము వేయఁబడినదియు, దర్దరపర్వతము యొక్క శిఖరమువలె మనంబుల నాకర్షించు సువాసనలను విరజిమ్ము చున్నదియు, విశేషముగాఁ గూయుచున్న బెగ్గురుపక్షులయొక్కయు, నెమళ్లయొక్కయుఁ గూఁతలచేఁ బ్రకాశించుచున్నదియు, లెస్సఁగాఁ దీర్పఁ బడిన తోడేళ్ల ప్రతిమలతోను, వడ్రంగులచేఁ జేయఁబడిన సూక్ష్మము లగు చిత్రపుఁ బనులతోను నంతటఁ గూడినదియు, చుఱుకగు కాంతిచే జంతువులయొక్క మనస్సును గన్నులను నీడ్చునదియు, సూర్యచంద్రులం బోలె వెలుఁగుచుండునదియుఁ, గుబేరుని నగరుం బోలినదియు, దేవేంద్రుని గృహమున కీడయినదియుఁ, బక్షులగుంపు లనేకములతోఁ గూడినదియు, మేరుశిఖరముం బోలునదియుఁ, జేతులు గట్టికొని చేరువను నిలఁబడియున్న జనులతోను, కానుకలను గైకొని, పల్లెలలోనుండివచ్చి పట్టణమంతయుఁ గ్రమ్ముకొని, రాముని పట్టాభిషేకవార్తను వినుటచే నెక్కువ సంతసమును బొంది మోరలెత్తి చూచుచున్న జనులతోను వెలుఁగుచున్నదియు, గొప్ప మేఘంబుయొక్క యాకృతినిబోలు నాకృతి గలదియు, మిక్కిలి యెత్తయినదియు, చక్కఁగ నలంకరింపఁబడి యుండు నదియు, నానావిధంబులగు రత్నములు చెక్కినదియు, గూనివాండ్ర తోను, సన్ననిరూపు గలవారితోను గూడినదియునై యుండెను. సుమం త్రుఁడు జనులచే నిండియున్న రాముని నగరు చూచుచుఁ, బైకప్పుగల దియు, గుఱ్ఱములు పూన్చినదియు నైన రథంబును రాముని నగరునకుఁ దోలుకొనిపోవుచు నా పట్టణంబునందలి జనుల హృదయములను సంతోషపఱచెను. సారథియగు ఆసుమంత్రుఁ డెక్కువ వైభవంబుతోఁ గూడినదియు, నెమళ్లయొక్కయు, జింకలయొక్కయు, గుంపులతో నిండి నదియునై శచీపతియగు నింద్రుని గృహంబుం బోలియున్న రాముని

నగరులోపలఁ జొచ్చి, యావేడుకను జూచి, మేనఁ బులకలు గలవాఁడై కైలాసమ్ముం బోలినవియై, స్వర్గమును బురుడించునట్టి యలంకృతములైన ద్వారములు దాఁటి, రాముని యిష్టమును నెఱవేర్చుచు నతని సన్నిధానంబున నున్నవారి నందఱిని వెనుకకుఁ ద్రోచి, యంతిపురము చేరువకుఁ జేరెను. అచ్చట జను లందఱు సంతోషభరితులై, రాముని పట్టాభిషేకములను గూర్చియుఁ, దమకందఱికి మేలు గలుగుటను గూర్చియు నాడుకొనుచున్న మాటలను విని, యట్లు కొంతదవ్వేఁగి, పక్షులతోను మృగములతోను గూడినదియు, మేరుశిఖరంబువలె నున్నతమైనదియు, దేవేంద్రుని నగరుమాడ్కి వెలుఁగుచున్నదియు, తన కాంతిచే వెలుఁగుచుఁ జూచువారి మనసు నీడ్చిపట్టునదియుఁ, గానుకలను గైకొని పల్లెల నుండి కోట్లకొలఁదిగ బండ్లమీఁదను గుఱ్ఱములమీఁదను నెక్కివచ్చి, వాని నక్కడనుండి నగరుముందటఁ జేతులు గట్టికొని నిలఁబడియున్న జనులచే నిండినదియునైన ద్వారంబుఁ జూచెను. ఆ వెంబడే గొప్పమేఘమును, గొండను బోలినదియు, మదించి, యంకుశమునకు లోఁబడనిదై దొరులచేఁ బట్టుట కలవికానిదియు, గొప్పదేహముగలదియు, రమ్యమయినదియు నైన శత్రుంజయమను పేరుగల రాముఁ డెక్కెడి యేనుఁగునుజూచెను. మఱియు రాముని యంతఃపురము చుట్టును గుఱ్ఱములు, ఏనుఁగులు, రథములును జక్కఁగ నలంకరింపఁబడి యచ్చటఁ గట్టఁబడి యుండినవి. మఱియు సేనలు, మంత్రులును, జనులు నంతటఁ గూడి, పోవుటకు సందులేక నిలఁబడియుండిరి. అప్పుడు సారథియగు సుమంత్రుఁడు వారినందఱిని తొలఁగఁద్రోసికొనుచు, సకలసంపదలతో నిండియున్నదియుఁ, బర్వతశిఖరముతోను, కదలని మేఘంబుతోను సాటియైనదియు, గొప్ప యేడంతస్తుల మేడలతోఁ గూడినదియునైన రాముని నగరులోపల, రత్నములతో నిండిన సముద్రమునందు మొసలి ప్రవేశించినట్లు ప్రవేశించెను.

## 16-వ సర్గము

### సుమంత్రుఁడు రాముని దోడ్కొనివచ్చుట

పురాతన రాజచరిత్రములనెల్ల నెఱింగిన యా సుమంత్రుఁడు జనులు నిండియున్న యా యంతఃపురంబు వాకిలి దాఁటి, బల్లెములను

బిండ్లను దాల్చినవారలై, మేలయిన కుండలములు వేసికొని యేమఱు
పాటులేక, యదే మనస్సు పెట్టి కావలి కాచుచున్న వారును, రాముని
యందు మిక్కిలి ప్రేమగలవారునగు యౌవన పురుషు లుండునట్టి
యేకాంతమైన తొట్టికట్టును జేరెను. అట్లు చేరి యచ్చటఁ గావిరంగు
గల బట్టలుదాల్చి, బెత్తములను జేతఁ బూని, చక్కని దుస్తులను
దొడిగికొని, మిక్కిలి జాగ్రత్తతో ద్వారమునఁ గావలియున్న ముసలి
వాండ్రగు నంతఃపురంపుఁ గావలివారిని జూచెను. ఆ కావలివాండ్రును,
ఆసుమంత్రునిఁ జూచినంతటనే, తాము రామునికి మేలుచేయఁగోరు
వారు గావున నందరును దత్తరపాటుతోఁ గూడి తమతమ యాసన
ములనుండి లేచి నిలఁబడిరి. సరసుఁడయిన యా సుమంత్రుఁడు వాకిట
నిలఁబడియున్న యా రక్షకుల నుద్దేశించి "ఓ ద్వారపాలురా ! మీరు
లోపలికిఁ జని, "సుమంత్రుఁడు వచ్చి వాకిటనున్నాఁడు" అని రామునికి
వేగిరము తెల్పుఁ"డని చెప్పిపంపెను. వారును రామునికి మేలుగోరు
చుండువారగుటం జేసి, రాముని సన్నిధికిఁ జని, యా రాముఁడు
సీతయు నుండఁగా, వారితో నీ సంగతిని వెంటనే తెలిపిరి. అట్లు
"సుమంత్రుఁడు వచ్చియున్నాఁడు" అని చెప్పినంతటనే రాముఁడు తన
తండ్రియొక్క యాంతరంగిక ప్రియుఁడయిన యా సుమంత్రుని దన
తండ్రి కిష్టముగావింపఁగోరి లోపలికి రమ్మని యానతిచ్చి పిలిపించెను.
ఆ సుమంత్రుఁడు ద్వారపాలుర యనుమతిని గొని, లోపలికిఁ జని,
చక్కని బట్టలు పఱచిన పసిఁడి మయంబైన మంచముపైఁ గూర్చుండి,
యడవిపందులరక్తము రీతిని నెఱ్ఱనైనదియు, సువాసనకలదియునైన
మంచి గంధముఁ బూసికొన్నవాఁడై, ప్రక్కన నిల్చుండి, చామర
ములు వేయుచున్న సీతతోఁగూడి చిత్రానక్షత్రముతోఁ గూడిన
చంద్రునిమాడ్కిఁ బ్రకాశించువాఁడును, చక్కని భూషణములను
దాల్చినవాఁడును, గుబేరునితో సాటియైనవాఁడు నగు రాముని
జూచెను. అట్లు చూచి, యడఁకువ యిట్టిదని యెఱింగినవాఁడయిన
వందియగు సుమంత్రుఁ డడఁకువతోఁ గూడి, తనకాంతిచే సూర్యుని
మాడ్కి వెలుఁగుచున్నవాఁడై వరంబుల నొసంగునట్టి రామునికి
మ్రొక్కులిడి, రామునిచే మర్యాద నొందినవాఁడై, చేతులు జోడించి

కొని, రామునింగూర్చి, "నృపాలపుత్రా! నీవు సుఖంబుగా విహరించుచుఁ బరుండుచుఁ గూర్చుండుచున్నావు గదా" యని రాముని క్షేమం బరసెను. అట్లు రాముని కుశలమడిగి "కౌసల్యానందనుఁడవగు రామచంద్రా! తండ్రిగారు దేవేరియగు కైకేయి యంతఃపురమున నున్నారు. వారిరువురు నిన్నుఁ జూడఁగోరియున్నారు" అని సుమంత్రుఁడు రామునితోఁ జెప్పెను. ఇట్లు సుమంత్రుఁడు చెప్పిన మాటలు విని, మిక్కిలి తేజస్వియగు పురుషశ్రేష్ఠుఁడు నయిన రాముఁడు మిక్కిలి యానందమునొంది, పులకలుగలవాఁడయి, యా సుమంత్రుని మర్యాద చేసి, సీతను జూచి "దేవీ! రాజును రాణియు నాపట్టాభిషేకముంగూర్చి యేదియో యాలోచించుచున్న ట్లున్నది. కాంతా! యామె కడు నేర్పు కత్తె యగుటం జేసి, రాజున కిష్టమగు కార్యమును జేయఁగోరినదై, రాజుగారి యభిప్రాయంబు గమనించి పట్టాభిషేకముం గూర్చి రాజును బ్రేరేపించుచున్నట్లున్నది. కేకయరాజకుమారియగు కైకేయి సవతితల్లి యైనను దల్లియనియే చెప్పవచ్చును. ఆమె నాకు సర్వదా మేలునే కోరుచుండునది. ఆమె యందఱితోను గలసి మెలసి యుండునది. కావున నా పట్టాభిషేకవార్తను వినినంతటనే, మిగుల నానందముఁ జెంది, మహారాజును ద్వరపెట్టె నేమో! మహారాజును దేవేరియగు కైకేయియు నాకు సంపదలను గోరికలను గలుగఁ జేయునట్టి సుమంత్రునిఁ బంపుట నాయొక్క యదృష్టమే కదా! అచ్చట నెట్టివారు గూడి యున్నారో, అట్టి మంత్రియె యిక్కడి కేతెంచెను. ఇది నిజము. ఇప్పుడే మహారాజు నాకుఁ బట్టాభిషేకంబు జరుపును. ఆహా! వేగిరంబుగ నిచ్చటి నుండి తరలి రాజుగారిని దర్శించెదను! నీవు చెలికత్తెలతోఁగూడి సుఖముగ విహరించుచుండుము" అని చెప్పెను.

ఇట్లు రామునిచే గారవింపఁబడినదై, సీత తన భర్తకు మేలు గలుగవలె నని కోరుచు వాకిలిదాఁకను వెంబడించిపోయి, "బ్రహ్మదేవేంద్రునికి స్వర్గరాజ్యము నొసంగినట్లు, రాజుగారు యాగంబు చేయ నర్హత గలిగించునట్టి బ్రాహ్మణులను ముందిడికొని రాజ్యమును తమవశంబున నుంచఁదగుదురు. దీక్షవహించి, నియమముతోఁ గూడి, మేలయిన కృష్ణాజినంబు ధరించి, జింకకొమ్ము చేతఁ దాల్చియున్న

మిమ్ముఁ జూచుచు సేవించుచున్నాను. తమకు ముందట నింద్రుఁడును, కుడిప్రక్కను యముఁడును, వెనుకప్రక్కను వరుణుఁడును, నెడమ ప్రక్కను గుబేరుఁడును రక్షింతురు గాక!" అని భగవంతుని ధ్యానించెను. అంతట రాముఁడు సీతను లోపలికిఁ బొమ్మని యానతిచ్చి, తాను పట్టాభిషేకమునకుఁ గావలసిన యలంకారములను దాల్చిన వాఁడై సుమంత్రునితోడఁ దన నగరునుండి బయలుదేరెను. పర్వతము యొక్క గుహాలోఁ బరుండియున్న సింహము పర్వతమునుండి వెడలు నట్లు, రాముఁడు తన మేడనుండి బయలువెడలి, వెలుపలికి వచ్చి వాకిట నడఁకువతోఁ జేతులు గట్టి నిలఁబడియున్న లక్ష్మణునిఁ జూచెను. అచ్చటి నుండి నడికట్టునకు వచ్చి చెలికాండ్ర నందఱిం గూడి, పట్టాభిషేకంబు చూడఁగోరి వచ్చి యచ్చటనున్న వారి నందఱిం జూచి, వారితోఁ గలిసి కొని, వారి యందఱి క్షేమములను విచారించి వెండియు, వ్యాఘ్ర చర్మము పఱచినదియు, బంగారు మయమునునై వెలుఁగుచుండుటంజేసి, యగ్నిహోత్రునిం బోలియున్న యరదం బెక్కెను. అట్లు రాముఁడును, ఉఱుమువంటి చప్పుడుగలదియు, విశాలమయినదియు, రత్నములచేతను, బంగారముచేతను నలంకరింపఁబడినదియు, సూర్యుని కాంతింబోలు కాంతి గలదై, తన కాంతిచేఁ గన్నులు మిఱుమిట్లు గొల్పునదియు, నేనుఁగు గున్నలంబోలు గొప్ప గుఱ్ఱములం బూన్చినదియును నైన యరదమును, దేవేంద్రుఁడు వేగముగఁ బోవఁగల గుఱ్ఱములఁ బూన్చిన యరద మెక్కినట్లుగా నెక్కి, శౌరుచే వెలుఁగుచు వేగఁ బయనమాయెను. ప్రకాశమానుఁడగు రాముఁడు చదల మ్రోగుచున్న మేఘమువాడ్కి దిక్కులన్నియు మ్రోగించుచు, మహేంద్రపర్వతమునుండి చంద్రుఁ డుదయించునట్లు తన నగరునుండి బయలు వెడలెను. లక్ష్మణుఁడును రాముని వెనుకగా నరదంబునఁ గూర్చుండి, గొడుగుపట్టుచుఁ జామరము వీచుచు నన్నను గాచుచుండెను. అట్లు రాముఁడు నగరునుండి వెడలినంతనే జనులందఱు వెంబడించి వచ్చుచు, గొప్ప రొదపుట్టించిరి. ఆ రాముని వెంబడిని, కొందఱు రౌతులును మేటిగుఱ్ఱముల నెక్కియుఁ, గొందఱు భటులు కొండలకు సరివచ్చు గొప్ప యేనుఁగుల నెక్కియు, నప్పుడు నూఱులకొలఁదిగను, వేలకొలదిగను పోయిరి,

ఆ రామునికి ముందఱ గవచములఁ దొడగినవారును, చందనము అగరు
గంధము పూసికొన్నవారును, కత్తులను విండ్లను దాల్చినవారైన
శూరులగు రామునిమేలుగోరు భటులు కొందఱు నడచిపోయిరి,
అప్పుడు దారిలో వాద్యముల ధ్వనులను, బట్టులయొక్క పొగడ్తల
శబ్దములును, శూరులయొక్క సింహనాదంబులును వినవచ్చుచుండెను,
శత్రుసంహారియగు రాముఁడు మార్గమున వచ్చునప్పు డచ్చటికాంత
లెల్ల సొమ్ములు దాల్చి, యలంకారములఁ జేసికొని మేడమీఁది కిటికీలలోఁ
గూర్చుండి, పువ్వులరాసులు మీఁదఁజల్లఁగా వానిని గైకొనుచుఁ
బోవుచుండెను. మఱియుఁ, జక్కనైన యంగములుగల చెలులందఱు
రాముని సంతోషపఱుపఁగోరి, కొందఱు మేడలమీఁదను, కొందఱు
క్రిందను నుండి తీయని బలుకులతో నీక్రింది విధంబునఁ బొగడ్తలఁ
జేసిరి. "తల్లికి సంతసము గలిగించువాఁడా! నీ తల్లియగు కౌసల్య నిన్నుఁ
జూచి కడు సంతసము నొందుచున్నది. నీవు పోవు పని యగునుగాక!
నీవు వంశపరంపరగా వచ్చెడు తండ్రిరాజ్యము నొందినవాఁడవై
యుండఁగా, నిన్ను జనులు చూడ నున్నారు" అని రాముని పౌర
కాంతలు పొగడుచుండిరి, మఱియు నా మగువలు రాముని కాంత
యగు సీతను మగువ లందఱికంటె నుత్తమురాలినిగాఁ దలఁచి, ఆ సీతా
దేవి, పూర్వజన్మంబున నిజముగా గొప్ప తపంబుజేసి యుండవలెను.
అటు గాకున్న, రోహిణి చంద్రునితోడవలె, త్రిలోకపూజ్యుఁడగు
రామునితోడఁ గూడిక యీ సీత కబ్బునే" అని తమలోఁ దాము చెప్పు
కొనుచుండిరి. నరశ్రేష్ఠుఁడయిన రాముఁడు రాజవీథిం జనుచు, మేడల
కొనలపైఁ గూర్చుండిన జవరాండ్రు చెప్పెడి యింపులయిన మాటలను
వినెను. "ఓ చెలులారా! ఇదిగో రాముఁడు నేఁడు దశరథుని యను
గ్రహంబువలనఁ బుడమిని బొందగలవాఁడై రాజ్యలక్ష్మిచే వెలుఁగు
చున్నాఁడు. సకల సుగుణ సంపన్నుఁడయిన యీ రాముఁడు మనకు
రాజుగాఁగలఁడు గాన మన కోర్కులన్నియు నీడేరినట్లు తలంపుఁడు.
మన కే కొఱతయు లేదు. రాముఁడు రాజ్యంబునొంది చిరకాలము
పరిపాలించుచుండుట యీ జనుల కొక్క గొప్ప లాభమే కదా.
రాముఁడు రాజ్యంబునకు వచ్చెనేని, జనులలో నొక్కఁడును నెప్పుడును

గొంచెమయినను గీడు నొందఁడు. దుఃఖమును గాంచఁడు" అని దేశ దేశములనుండి వచ్చియుండు జనులును, మహాసంతోషముఁ జెందియున్న పురజనులు దన్నుఁ గూర్చి చెప్పుకొనుచున్న పలుతెఱఁగులగు మాటలను రాముండు వినెను.

ఇట్లు రాముఁడు ధ్వనులుచేయుచున్న గుఱ్ఱములతోను సేనుఁగులతోను గూడి, ముందుపోవుచుండు స్వస్తికులు, సూతులు, మాగధులు ననెడి వారిచేఁ బొగడఁబడుచు, శ్రేష్ఠములగు వాద్యములధ్వనుల నాలించుచుఁ గుబేరునిమాడ్కిఁ దేజరిల్లుచుఁ బోయి, యాఁడేనుఁగులు, ఏనుంగులు, గుఱ్ఱములు, రథంబులు క్రిక్కిరిసియుండునదియు, జనులచే ముంగలి ప్రదేశములు గలదియు, విస్తారములయిన రత్నములును, నానావిధములగు విక్రయింపఁదగిన వస్తువులును గలిగినదియునై, కన్నులపండువు గావించుచుండు గొప్ప రాజమార్గము జూచెను.

## 17-వ స ర్గ ము

{ రాముఁడు సుమంత్రునితోడఁ గైకేయి యంతఃపురమున దశరథునిఁ జూడఁబోవుట }

ఎక్కువ శోభగలవాఁడై యుండు రాముఁడు తనమేలు గోరెడి హితుల నందఱను సంతోషపఱచుచు, నరదమెక్కి, టెక్కెములతోఁ గూడినదియు, మేలైన యగురుచే ధూపము వేయఁబడినదియుఁ, బట్టాభిషేకము నిమిత్తము వచ్చియుండు జనులచేఁ గ్రిక్కిరిసి యుండునదియు నైన యయోధ్యాపురముఁ జూచి, యందు శరత్కాల మేఘముల మాడ్కిఁ దెల్లనైన మేడలతో నొప్పారుచుండునదియు, గంధపుఁ జెక్కలు, మేటి యగురుచెక్కలు, తక్కిన సువాసనగల ద్రవ్యములు, తెల్లని పట్టుబట్టలు, ఇతరములగు పట్టుబట్టలు, బెజ్జమువేయని ముత్తెములు, నొచ్చెములేని మేటి స్ఫటికములు, ననేకవిధంబులగు భక్ష్యములు, పలుదెఱంగులగు విక్రయవస్తువులును గలదై వెలుఁగుచు నాకాశమునఁ గల స్వర్గలోకమును బోలియున్నదియు, పెరుఁగు, పాలు, అక్షతలు, నెయ్యి, లాజలు, అగురుచెక్కలయుఁ, జందనపుఁ జెక్కలయు పొగలు, సకల విధములైన పుష్పమాలికలు మున్నగువానిచే నెల్లపుడు

నలంకరింపఁబడిన నడిమి ప్రదేశములు గలదియు నయిన రాజవీథి బయలు దేఱెను.

అట్లు రాముఁడు రాజమార్గమునఁ దనమేలు గోరెడి మంచి మనస్సుగల పెద్దలు సేసెడి యనేకములగు నాశీర్వాదములను వినుచు, వారికిఁ దగినట్లు ప్రతిమర్యాదలు సేయుచు, నందఱ జనులను బలుకరించుచుఁ బోయెను. అప్పుడు జనులందఱు గుంపుగూడి, రాముని గూర్చి, "ఓ నృపాలసూనుఁడా! మీ తాతలు, ముత్తాతలు నెట్లు రాజ్యముచేసిరో, యట్లె నీవును నిప్పుడా రాజులమార్గముల నాదరించి, యాదారియం దున్నవాఁడవై మమ్ముఁ బాలింపుము. మీ తండ్రియు, మీతొల్లింటి తాత ముత్తాతలును మమ్ము నెట్లు సంతసపఱచిరో, అట్లే నీవును న్యాయపరిపాలనము జేయుచు మమ్ము సంతోషపఱుపుము. మా కిప్పుడు భోజన మక్కఱలేదు, మాకు స్వర్గము మొదలగు సుఖము లక్కఱలేదు, రాముఁడు పట్టాభిషేకము చేసికొని వచ్చుచుండఁగా మేము చూడఁ గోరి యున్నాము. పరాక్రమశాలియగు రామునికి నడువఁబోవు పట్టాభిషేకంబు చూచుటకంటె మాకుఁ బ్రియమైనది యొక్కటియు లేదు" అని తమలోఁ దామనుకొనుచుండిరి. ఇట్లు రాముఁడు తన్నుఁ గూర్చి పొగడుచుండు మాటలను, మఱి యనేకములయిన మాటలను మౌనముతో వినుచు నాపొగడ్తల కుబ్బక, రాజమార్గమునఁ బోవుచుండెను. పురుషశ్రేష్ఠుఁడయిన యా రాముని దెసనుండి యే మనుష్యుఁడును దన మనస్సునుగాని, కన్నులనుగాని మఱలింపఁజాలఁడయ్యె. అంతియకాక, వీథియం దా రాముఁడు దాఁటిపోయినను, నొక్కఁడయినను తన దృష్టిని మఱలింపఁ జాలకుండెను. ఎవఁడు రాముని జూడ లేదో, రాముఁ డెవనిని జూడలేదో, అట్టి పురుషుని జను లెప్పుడు నిందింతురు. ఒక రన నేల? అట్టివాఁడు తనకుఁ దానే "ఛీ! యీ నాజన్మ మేల? నేను రాముని జూడనయితినిగదా" యని తలంచుచుండును. ధర్మములను నడపించు స్వభావముగల యా రాముఁడు బ్రాహ్మణాదులగు నాలుగు వర్ణములయందు దయ యుంచును. కావున బాల్యము, ప్రాయము, కౌమారము, ముదిమియను నాలుగవస్థలలో నుండువారును నా రాము ననుసరించియే యుందురు. ఇవ్విధమున రాముఁడు జనుల

ప్రేమకుఁ బాత్రుఁ డగుచు, నాలుగుదారులు కలియుచోట్లను, దేవళంపు దారులను, రచ్చపట్టుల సభా మంటపములను ప్రదక్షిణముగాఁ జుట్టికొని, మేఘముల గుంపువలెను, కైలాసశిఖరమువలెను దెల్లఁగఁ బ్రకాశించుచుండునవియుఁ, దెల్లని విమానముల మాడ్కి నాకారమును గప్పుకొని యున్నవియునైన నెత్తయిన మేడలతోడను, రత్నములచే నలంకరింపఁబడిన వర్ధమానము లనెడి గృహములతోడను గూడినదై, లోకమందలి రాచనగళ్ళలోపల మిక్కిలి శ్రేష్ఠమైనది గనుకనే దేవేంద్రుని గృహమును బురుడించుచుండు తండ్రిగారి నగరు సొచ్చి, మూఁడు తొట్టికట్లు రథమునఁ గూర్చుండియే, రౌతులు, విలుకాండ్రుఁ జుట్టును గావలి యుండఁగా దాఁటి, తక్కిన రెండు తొట్టికట్టులందును రథమునుండి దిగి, కాలినడకమీఁదనే పోయెను. అట్లు శ్రీరాముఁడన్ని తొట్టికట్లను దాఁటి, తనవెంబడి వచ్చినవారిని వెనుకకుఁ బంపి, తా నొక్కఁడే యంతఃపురమును బ్రవేశించెను. రామునిచే వారి యిండ్లకుఁ బంపఁబడిన జనులందఱు "రాముఁడు పట్టాభిషేకము నొందినవాఁడై, యెప్పుడు మఱలివచ్చునా" అని, సముద్రము చంద్రోదయంబును కోరునట్లు, రాముని రాక కెదురుచూచుండిరి.

## 18-వ సర్గము

### కైకేయి రాముని నడవికిఁ బోవలసినదని చెప్పుట

ఆ రాముఁడు లోపలికిఁ జొచ్చి, యందమగు నాసనంబునందుఁ గైకేయితోఁ గూర్చుండి, వాడువాఱిన మోముతో వ్యసనపడుచున్న తండ్రిని జూచి, వినయనమ్రుఁడై మిక్కిలి మెలకువతోఁ మొదటఁ దండ్రిగారి పాదముల కెఱఁగి యా పిమ్మట తల్లియగు కైకేయియొక్క పాదములకును నమస్కరించెను. రాముఁడు నమస్కరించినంతటనే దశరథుఁడు రామునిం గూర్చి "రామా!" యని పిలిచి, యంతలోపలనే కన్నీటిచేఁ జెదరిన చూపుగలవాఁడై, పై మాటదోఁచక, గోడు చెంది, కన్నులు దెఱచి చూచుటకైనను, మాటలాడుటకైనను జాలనివాఁ డయ్యెను.

రాముఁ డిట్టి వింత దైనదియు, దిగులుపుట్టించునదియు నయిన రూపముగలవాఁడును, దుఃఖముచేఁ గలిగినకాఁకచేఁ జిక్కినవాఁడును, సత్త్వములేమిచేఁ మూసికొనిపోవుచుండెడి యింద్రియములుగలవాఁడును,

రాముని నడవికిఁ బంపవలసి వచ్చెఁగదా యను మనోదుఃఖముచే నిట్టి ట్టయియుండు డెందముతోఁ గూడినవాఁడును నయి వేఁడి నిట్టూర్పులు విడుచుచుండుటం జేసి కలియఁబెట్ట నలవి కానిదైనను, గొప్ప యలలచే నల్లకల్లోలమైయుండు సముద్రమువలెను, గ్రహణకాలమునందు రాహువుచే మ్రింగఁబడిన సూర్యుని మాడ్కియుఁ, గల్లలాడిన మహర్షి వలెను గళదప్పియున్న నృపాలుని జూచి, రాముఁడును పాదముతోఁ బామును ద్రొక్కినవాఁడువోలె మిక్కిలి భీతినిఁ జెందెను.

అట్లు రాముఁడు దిగులుపడి, తన తండ్రికిఁ గలిగిన దుఃఖమున కేది కారణముగ నుండవచ్చునని చాలదూరము విచారించియు నిర్ధారణ చేయఁజాలక, పున్నమనాఁటికి కడలి తెఱఁగున మిక్కిలి కలవరపడి, తాను దండ్రికి హితవగు పనులుసేయుటయందే తలఁపుగలవాఁ డగుటం జేసి, యప్పుడు తన మనంబున "ఏమి యిది? ఇప్పుడు మాత్రము రాజు నన్నుఁ బలుకరింపకున్నాఁడు. తక్కిన సమయములందు మఱెవ్వరిమీఁద నైనఁ గోపము గలిగియున్నను, నన్నుఁ జూచినంతట నాకోపముమాని సంతసమునొందును. అట్లుండఁగా నిప్పు డేల నన్నుఁ జూచియుఁ బలుకరింపకున్నాఁడు? ఏమి కోపము వచ్చెనో తెలియకున్నది?" అని చింతించి, దుఃఖముతోఁ గూడినవాఁడై, ధైర్యము విడిచి, మోమునఁ గళలేక, కైకేయికి నమస్కరించి, వెంటనే యామెతో నిట్లనియెను. "ఓ తల్లీ, నే నేదైనను దెలియక తప్పు చేయలేదుగదా! ఏల నాతోఁ దండ్రి మాటాడకున్నాఁడు? నీవైనను నానిమిత్త మాకోపము దీర్పుము. ఎల్లప్పుడు నాపైఁ బ్రేమగలిగియుండు మా తండ్రి యేల మనసున సంతసము మాని మొగమునఁ గళదప్పినవాఁడై, వ్యసనపడుచు నాతోఁ బలుకరింపకున్నాఁడు? ఇదేల? ఇతనిని దేహసంబంధమగు వ్యాధిగాని, లేక మనస్సంబంధమగు వ్యాధిగాని బాధింపదుగదా! మనుజునకు నెల్లప్పుడు సుఖంబు గలుగుట యరుదుగదా! చూడఁ బ్రియముఁ గొలుపు కుమారుఁడయిన భరతునకుఁగాని, బలవంతుఁడగు శత్రుఘ్ను నకుఁగాని నేనైనను, తల్లులైనను నేమియు నపకారంబు సేయలేదు గదా! తండ్రి కోపంబుతో నుండునపుడు, తండ్రిగారి మాట వినక, యాయనను సంతోషపఱపక నే నొకక్షణమైనను జీవింపఁ గోరను.

మానవుఁ డేతండ్రివలన జన్మించుచున్నాఁడో, అట్టి ప్రత్యక్షదైవమగు తండ్రికి లోఁబడక యుండఁదగదు. నా తండ్రిని నీ వేదియైన నభిమానముతోఁ బరుసని పలుకులుగాని లేక, కోపముతో నాతని మనస్సు గలఁతఁ జెందునట్లుగాని పలికితివా? ఓ దేవీ! నృపాలుఁ డేల యిట్లు కలవరపడియున్నాఁడు? ఇట్టి కలవరపాటున కేమికారణము? ఇంతకు మున్నెప్పు డిట్లుండినదిలేదే! నేను మిక్కిలి యాతురముతో నడుగుచున్నాను. నాకు నిజముఁ దెల్పు" మని యడిగెను.

ఇట్లు ధీరుఁడగు రాముఁ డడుగఁగాఁ గైకేయి మిక్కిలి సిగ్గుమాలినదై, జంకులేక తనకు మాత్రము మేలుగావించెడి మాట యిట్లనెను: "ఓ రామా! రాజున కేమియు నాగ్రహము లేదు; ఏమియు వ్యసనమును లేదు. ఇతనికి మనంబున నొక్క కోరిక యున్నది. నీ వేమందువో యని వెఱచి నోఁట దెఱువకున్నాఁడు. నీవు ప్రియుఁడవగుటం జేసి, యిష్టముగాని మాట పలుకుటకు నోరాడకున్నది. ఇతఁడు నాకొకవరము వాగ్దత్తము చేసెను. దానిని నీవు తప్పక నెఱవేర్పవలయును. మున్నొకప్పు డితఁడు నాకు వరము లొసఁగి వాని నట్లె యిచ్చెదనని పలికి, నన్ను గారవించియు, నిప్పుడు నీచుఁడు మాట తప్పు మాడ్కి నిచ్చెద నన్నవరము నీయక, యొందు కిచ్చెదనంటి నని తపించుచున్నాఁడు. ఈ నృపాలుఁడు నాకు వరము నిచ్చెద నని మొదట మాట యిచ్చి, పిమ్మట నిష్ప్రయోజనముగా నీరంతయుఁ బాఱిపోయినపిదపఁ జెఱువునకుఁ గట్టఁ గట్టఁబూనుచున్నాఁడు. రామా! యీ ప్రపంచమున కంతయు ధర్మమే ప్రధాన మని పెద్దల కందఱకుఁ దెలిసినదియ కదా! దశరథుఁడు నీకు వెఱచి, యా సత్యముఁ దప్పకుండునట్లు నీవు చేయవలయును. రాజు చెప్పఁబోవునది మంచిదియైనఁగాని, చెడ్డదియైనఁగాని, నీవు చేసెద నని చెప్పుదువేని, నేనిదియంతయుఁ జెప్పెదను. రాజుగారు చెప్పఁదలఁచిన మాట నీయెడ విఫలముగాదేని, యా మాటను నేనే చెప్పెదను. ఏల యనిన, ఇతఁడు నీతో నాసంగతిఁ జెప్పఁబోఁడు" అని చెప్పెను.

రాముఁడు కైకేయిచెప్పిన మాటను విని, మనమునఁ జింత నొందినవాఁడై, నృపాలుని యెదుటనే యా కైకేయిం జూచి, "ఓ దేవీ!

అబ్బబ్బా! ఛీ! ఛీ! నన్నుఁగూర్చి యిట్టిమాట చెప్పుటతగునే? ఏల యన, నృపాలుఁ డానతిచ్చునేని, నే నగ్నిలోనైనఁ బడెదను. తీవ్ర విషము నైనను మ్రింగెదను. సముద్రములోనైనను మునిఁగెదను. దశరథుఁడు నాకు గురుఁడు; తండ్రి; రాజు; నా మేలుగోరెడి యాప్తుఁడు. సకల విధంబులచేతను నే నాతఁడు చెప్పెడిమాట వినవలయు. కావున నృపాలుని కోరికయేదియో దానిని దెలుపుము, చేసెద నని ప్రతిజ్ఞ చేసెదను. రాముఁ డెప్పుడును రెండువిధంబులుగఁ బలుకువాఁడు కాఁడు" అని కపటములేక చెప్పెను.

ఇట్లు నిష్కపటముగాఁ జెప్పినట్టి సత్యవాదియగు రామునిఁ జూచి, కైకేయి మిగుల భయంకరమయిన మాటలతో "ఓ రామా! తొల్లి దేవతలకును, రాక్షసులకును యుద్ధము సంభవించినప్పుడు, మీ తండ్రి కషాయము తటస్థపడఁగా, నతనిని నే నామహారణమున నపా యమునుండి తప్పించి కాపాడితిని. అప్పుడు మీ తండ్రి సంతసించి, నాకు రెండువరముల నొసంగెను. ఆ రెండువరములలో నొకటి భరతునికిఁ బట్టాభిషేకము సేయుట, మఱియొకటి నీ విప్పుడే దండకారణ్యమునకుఁ బోవుటయు నని యడిగితిని. నీవు తండ్రిని యథార్థవాదినిగాఁ జేయఁ దలఁచితివేని, నీవును దండ్రిమాటఁ దప్పనని చెప్పినట్లు నడచుకొనఁ గోరితివేని, నేను చెప్పిన యీ మాట వినుము. నీవు నీతండ్రియాజ్ఞకు లోఁబడి నడుచుకొనఁ గోరితి వేని, యాతఁడు వాగ్దత్తము చేసిన ప్రకా రము నీవు పదునాలుగేం డ్లరణ్యమునకుఁ బోవలయును. రామా! నీ పట్టాభిషేకమునిమిత్తమై సిద్ధపఱచియుండు వస్తుసంభారముతో భరతు నకుఁ బట్టాభిషేకంబు నడపవలయును. నీవు పట్టాభిషేకము మాని, జడ లను దాల్చి నారబట్టలను గట్టినవాఁడవై, దండకారణ్యమునకుఁ బోయి యచ్చట నుండుము. భరతుఁ డయోధ్యయందుండి, సకల సంపదలతో నిండినదై, చతురంగబలముతోఁ గూడియున్న యీ పుడమి నేలును గాక! ఈ నృపాలుఁడు దయార్ద్రహృదయుఁడుగాన, నిన్ను వనంబునకుఁ బంపవలసివచ్చెనే యనెడు వ్యసనముచే మోము వంచికొని, నిన్నుఁ జూడఁజాలకున్నాఁడు. రఘునందనా! నృపాలుని మాటప్రకారము భర తునకుఁ బట్టాభిషేకము జరుగునట్లు నీవు నీ పట్టాభిషేకము మాని యర

ణ్యమునఁ బదునాలుగేండ్లుండుము. రామా! నృపాలుని గొప్పదైన సత్యమును తెప్పచేతఁ దరింపఁజేయుము" అని చెప్పెను.

ఇట్లు కైకేయి పరుసని మాటలు పల్కుచుండఁగా, రాముని మనస్సున వ్యసనము కలుగలేదు. అయినను ఎక్కువ సామర్థ్యము గల్గి యున్న, దశరథుఁ డన్నరో, పుత్త్రు నడవికిఁ బంపవలసివచ్చెనే యన్న వ్యసనముచేఁ దపించుచు, మనసున విచారము నొందెను.

## 19-వ సర్గము

### కైకేయి రాముని వనవాసమునకై తొందరపఱుచుట

శత్త్రువులను సంహరించువాఁ డయిన రాముఁడు తన మనసున కిష్టముగానిదియుఁ, జావువంటిదియునైన కైకేయి చెప్పినమాటను వినిన తర్వాత మనమునఁ గొంచెమైనను వ్యసనము నొందఁ డయ్యె. ఇంతటి క్రూరమయిన మాటఁ జెప్పిన దీని మోము జూచి మాటాడుట యెట్లని యైనను దలఁపక యామెతో నిట్లనియెను.

"ఓ తల్లీ! అట్లె కానిమ్ము. నృపాలుని ప్రతిజ్ఞను నెఱవేర్చుచు, జడలను, నారబట్టలను దాల్చినవాఁడనై, యరణ్యవాసము చేయఁబోయె దను. అది సరే. శత్త్రువులకు లొంగక శత్త్రువులను సంహరింపఁజేయు నృపాలుఁడు మునుపటివలె నాతో నేలమాటాడ కున్నాఁడు; ఏల నన్నుఁ జేరఁదీయకున్నాఁడు. దీనికిఁ గారణమేమో తెలియఁగోరెదను. ఓ దేవీ! నీవు నాపైఁ గోపము చేయకుము. నామాట వినుము. నేను నీ యెదు టనె జడలను నారబట్టలను ధరించి యడవికిఁ బోయెదను. నీ యిష్టము నెఱవేరుటంజేసి సంతోషము పడయుము. దశరథమహారాజు నాకు మేలు గోరువాఁడు; గురువు; తండ్రి; నేను గొంచెముపని చేసినను దానిని మరువక జ్ఞప్తియం దుంచియుండువాఁడు. అదియుఁగాక రాజు హితుఁడు చెప్పుపని చేయవలయు. గురువు చెప్పునది చేయవలెను. తండ్రి చెప్పునది చేయవలయును. కృతజ్ఞుఁడు చెప్పునది చేయవలెను. రాజు చెప్పునది చేయవలెను. ఇట్లొక్కగుణము గలవారు చెప్పినపనినే చేయవలసియున్నప్పుడు, అన్నిగుణములుగలిగిన దశరథనృపాలుఁడు చెప్పుపనిని, భక్తి విశ్వాసము లుంచి చేయకుండుటకు వీలగునా? ఏది చెప్పినను జేయవలసినదే. అయినను, నృపాలుఁడు తానే "భరతు

నీకిఁ బట్టాభిషేకము చేయఁదలఁచినాను" అను మాట నాతోఁ జెప్పక దాఁచియుండుట నా మనమును దహించుచున్నది. నేనే యెవ్వరు ప్రేరణ చేయకున్నను, సంతోషపూర్వకముగా సీతను, రాజ్యమును, నా కిష్టములగు ప్రాణములను, ధనములను నైతము నొసఁగుదును. అట్లుండఁగా, నృపాలుఁడగు తండ్రి తానై యడిగినందునను, నీయొక్క యిష్టార్థము నెఱవేరుటకును నేను రాజ్యము భరతున కీయకుందునే? కావున నీవు నృపాలుని నోదార్పుము. ఈ పుడమిఱేఁడు తలవంచి, మెల్లఁగాఁ గన్నీళ్లను వదలుచున్నాఁడు. దీనికేమి కారణము? ఇప్పుడు రాజు నానతి వడసి, మేనమామయింటినుండి భరతునిఁ దోడ్కొనివచ్చుటకై, దూతలు వేగముగఁ బోవు గుఱ్ఱములపై నెక్కి కేకయదేశముల కేఁగుదురుగాక! తండ్రి చెప్పినది న్యాయ్యమా? యన్యాయ్యమా? యని కొంచెమయిన నాలోచింపక, పదునాలుగేం డ్లరణ్యవాసము చేయుటకై వేగిరముగా నిప్పుడే యిక్కడినుండియే పోయెదను" అని రాముఁడు కైకేయితోఁ జెప్పెను.

రాముఁడు చెప్పినమాటలను విని, కైకేయి యానందము నొంది, రాముని నడవికిఁ బంపుటయందు మిక్కిలి పట్టుదలగలదై, రాముని వేగిరపఱచుచు, "రామా! అట్లే కానిమ్ము. భరతునిఁ బిలుచుకొనిరా వేగముగఁ బోవు గుఱ్ఱముల నొసఁగి దూతలను బంపెదను. నీవును వనమునకుఁ బోవుటకు నిష్టపడితివి గావున నీ విఁక జాగు చేయుట యుక్తముగాదు. నీ విచ్చటనుండియె తామసింపక యరణ్యమునకుఁ బయనము కావలయును. నృపాలుఁడు లజ్జతోఁగూడి, నీ కీ సంగతి చెప్పుట యెట్లని యెంచి, తలవాంచి మౌనముతో నున్నాఁడు. నరశ్రేష్ఠుఁడా! దీనికిఁ గారణంబిదియె కాని, మఱియేదియుఁ గాదు, "మనము చెప్పెడుమాట విని, రాముఁడు మన ప్రతిజ్ఞ నెఱవేర్చునో నెఱవేర్పఁడో" యని దిగులుపడియున్నాఁడు. ఆ దిగులు దీర్పుము. నీ వెంతవఱకు నీ పురంబునుండి వేగిరంబుగ నడవికి బయలుదేఱవో, అంతవఱకు రామా, నీ తండ్రి మజ్జన మాడఁడు. ఆహారంబు గుడువఁడు" అని రామునితోఁ జెప్పెను.

దశరథుఁడు కైకేయి చెప్పిన పలుకులు విని దుఃఖసాగరంబున మునింగినవాఁడై, "ఛీ! నా బ్రతుకేల? అయ్యో! నా కెంత యాపద వచ్చెను?" అనుచు నిట్టూర్పు నిగిడించి, స్మృతి దప్పి, బంగారు తాపఁ బడిన మంచముపై వెనుకకుఁ బడెను.

అపుడు రాముఁడు రాజును లేవనెత్తి కూర్చుండఁబెట్టి, కైకేయి తొందరపెట్టుటచేఁ, జాఁకుచేఁ గొట్టఁబడిన గుఱ్ఱమువలె నడవికిఁ బోవుటకుఁ ద్వరపడినవాఁడై, పరమనీచురాలయిన కైకేయి తనకుఁ జెలుపుఁ దలఁచి చెప్పినమాట వినినను, "ఈమె మనల నిట్లడవికిఁ బొమ్మనుచున్నది గదా" యను వ్యసనము లేశమైనను లేనివాఁడై, కైకేయింజూచి, "ఓ దేవీ! నేను పేరాస పట్టినవాఁడ నని తలంచితివేమో! నేను ధనమును గోరను. రాజ్యమును గోరను. జనుల నందఱిని లోఁబఱచికొని యేల వలయు నని యుఁ గోరను. నన్ను సర్వసంగపరిత్యాగముచేసి యాశ లెల్ల జయించియున్న జితేంద్రియులగు ఋషులతో సమానునిగను, నొక్క ధర్మమునందే ఆసక్తిగల వానినిగను దలంపుము. నీవు చేయఁ జాలని పని యేదియేని యున్నఁ జెప్పుము. నాప్రాణములనైనను బోఁగొట్టుకొని యా పని సాధించి యిచ్చెదను. తండ్రికి శుశ్రూష చేయుట, ఆతనిమాట వినుటయును నీ రెండింటికంటె నుత్తమమగు ధర్మమేదియున్నది? పూజ్యుఁడగు తండ్రి నాతో నీమాట చెప్పకపోయినను లోపములేదు, నీవు చెప్పినదే చాలును. నీ మాటప్రకారమె జన సంచారములేని యరణ్యమునఁ బదునాలుగేండ్లు నివాసము చేసెదను. ఓ కైకేయీ, నీవు నాకు త్తరువు చేయఁదగినదానవుగ నుండియు, నేను నీ వెట్లు చెప్పినను జేయుటకు సిద్ధుఁడ నై యుండఁగా, నీ ప్రకారము చేయు మని నాతో నాజ్ఞాపింపక, మహారాజును "రాముని నరణ్యము నకుం బంపుము, భరతునికిఁ బట్టము గట్టుము" అని వరములనుగ నడిగితివే. ఇది కొండను ద్రవ్వి యెలుకను బట్టినట్లాయెఁగదా. ఇదిగో, నేను నాతల్లిని వీడ్కొని, సీతను నా వియోగమునకు దుఃఖపడకు మని యోదార్చి వెంటనే, యిప్పుడే దండకారణ్యములకుఁ బోయెదను. భరతుఁడు రాజ్యమును న్యాయ్యముగాఁ బాలించునట్లును, వృద్ధుఁడగు తండ్రికి శుశ్రూష చేయునట్లును, నీవు భరతుని కేర్పాటుచేయవలసినది.

న్యాయ్యముగా రాజ్యపరిపాలనము సేయుటయు, వృద్ధుఁడగు తండ్రికి శుశ్రూషసేయుటయుఁగదా సనాతనధర్మములు" అని కైకేయితోఁ జెప్పెను.

అప్పుడు తండ్రి తనపుత్త్రుఁడు చెప్పిన పలుకులు విని, శోకముచేఁ గొట్టఁబడి, దుఃఖాతిశయముచేఁ గన్నీటి నాఁపుకొనఁజాలక బిగ్గఱగా గొంతెత్తి యేడ్చెను. అట్లు యేడ్చి సంజ్ఞతప్పి పడియున్న తండ్రిపాదములకును, నికృష్టురాలయిన కైకేయియొక్క పాదములకును మ్రొక్కి, రాముఁడు "తనకుఁ బట్టాభిషేకము గాకపోవుటయేకాక యడవులపాలు కూడఁ గావలసివచ్చెఁగదా?" యనెడు వ్యసనము మానినవాఁడై, మహామోదముతో వెడలి, తండ్రికిని, తల్లియగు కైకేయికిని బ్రదక్షిణము గావించి, కైకేయి యంతఃపురమునుండి వెలువడి బయటికివచ్చి, తనమేలరయుచుండు చెలికాండ్ర నందఱినిఁ జూచెను. లక్ష్మణుఁడు కన్నుల నిండఁ గన్నీరు నించుకొని యతికోపముతోఁ దన యన్నను వెంబడించెను. రాముఁడు తన పట్టాభిషేకము నిమిత్తము సిద్ధపఱుపఁబడియున్న సామగ్రులకెల్ల మ్రొక్కి, ప్రదక్షిణముమాత్రము గావించి, దశరథుని యాజ్ఞను నెఱవేర్చుటయందే యపేక్షకలవాఁ డగుటంజేసి, యా సంభారములను గంటితోనైనను జూడక, మెల్లగాఁ బయనమై వెలువడెను. స్వభావముచేతనే సొబగుగలవాఁ డగుటచే జనులందఱి మనస్సులకొప్పినవాఁడయిన రామునియొక్క యెక్కువశోభను చల్లనికిరణములు గల చంద్రునియొక్క శోభను రాత్రి తగ్గింపఁజాలనట్లు, రాజ్యములేకపోవుట యనునది తగ్గింపజాలనిదాయెను. తా నేలవలసిన పుడమిని బాసి కానల కేఁగుచున్న యా రామునియొక్క మనోవృత్తి, సకల లోకముల నతిక్రమించిన యోగియొక్క మనోవృత్తివలెఁ జలింపక యుండెను. వెంటనే ధైర్యవంతుఁడగు రాముఁడు సొగసయిన తెల్లని గొడుగును బట్టవలదనియుఁ, జక్కఁగా సింగారింపఁబడియున్న చామరములు వేయవలదనియు నానతి యొసంగి, బంధువులను, బురజనులను రథంబును నచ్చటనే విడిచి, దుఃఖమును మనసునందే యాఁపుకొని, యింద్రియములను జయించి, తల్లియగు కౌసల్యతో వినసింపుగాని యీ మాటఁ దెలుపుటకై తల్లియొక్క నగరునకుఁ బోయెను. రాముని పట్టాభి

షేకమునకై సింగారించికొని వచ్చియున్న జను లందఱు నెప్పటివలెఁ
గాంతిగలిగి యుండువాఁడును, చేసిన ప్రతిజ్ఞఁ దప్పఁగూడదను నియమ
మొక్కటిమాత్రము గలవాఁడు నునైన రామునియొక్క మోమున నెట్టి
వికారమును గనరైరి. శరత్కాలమందలి చంద్రుఁడు తనకు స్వాభావి
కముగానున్న కాంతిని బాయనట్లు తన కెల్లప్పుడు నుండునట్టి సంత
సమును దీర్ఘబాహువగు రాముఁడు విడువఁ డయ్యెను. కీర్తిమంతుఁ
డును, ధీరుఁడును నైన రాముఁ డట్లు చిఱునవ్వుతోఁ గూడి, జనుల
నందఱను నింపుగులుకు మాటలతో గారవించి, లక్ష్మణునిఁ
దోడ్కొని తల్లిసమీపమును జేరఁబోయెను. విస్తారమగు పరాక్రమము
గలవాఁడును, గుణములలోఁ దన యన్న కీడగువాఁడునునైన లక్ష్మ
ణుఁడును తన దుఃఖముఁ దనలోపలనే యిముడ్చుకొని, యాతనిని
వెంబడించి పోయెను. రాముఁడు తల్లి యంతఃపురంబు నొచ్చి తనకుఁ
బట్టాభిషేకము జరుగఁగల దని మిక్కిలి సంతసపడుచున్న జను లీ సంగతిఁ
దెలిసిన నెక్కడఁ బ్రాణహాని చెందుదురో యని వెఱచి, యా వన
వాసము మిక్కిలి దైన్యముఁ గల్గించుచున్నను, దానిని లోపలనే
యడఁచుకొని, మోమున విన్నఁదనముఁ జూపకుండెను.

## 20-వ సర్గము

కౌసల్య రాముని వనవాసమునకై దుఃఖపడుట

పురుషులలో నుత్తముఁడగు రాముఁడు చేతులు జోడించుకొని
పయనము కాఁగా, నప్పు డంతఃపురమునందలి స్త్రీలు "ఏ రాముఁడు తమ
తండ్రి చెప్పకున్నను, నంతఃపురమున నున్న మనకందఱకు దిక్కయి
రక్షకుఁడుగా నుండెనో, ఆ రాముఁ డిప్పు డరణ్యమున వాసము చేయఁ
బోవుచున్నాఁడు. రాముఁడు తన తల్లియగు కౌసల్యయెడ నెట్లు ప్రేమ
గలిగి నడచుకొనుచుండువాఁడో, యట్లే మనయందును బుట్టినది మొద
లుగ నుండువాఁడు. ఈ రాముఁడు కోపగింపఁదగిన పనులను జేయక,
కోపవంతుల కోపమును మంచిమాటలచే శాంతపఱచుచుఁ దన్నెవరు
తిట్టినను కోపగించుకొనక యుండువాఁడు. అట్టి రాముఁ డిప్పుడు మన
లను విడిచి యరణ్యమునకుఁ బోవుచున్నాఁడు. మనరాజు తెలివిమాలిన
వాఁడు. అట్లు కానిచో, సకలలోకములకు గతియైన రాముని నడవికిఁ

బంపునా? అయ్యో! మన కిప్పుడెంత కష్టమువచ్చెను" అని బిగ్గరగా నేడ్చిరి. అట్లు రామునింగూర్చి దుఃఖించి, యా యంతఃపురంబున నున్న యంగన లందఱు దూడలఁ బాసిన యావులమాడ్కి మిక్కిలి వ్యసన పడుచుఁ దమ భర్తను నిందించుచు గొల్లున నేడ్చిరి. ఆ నృపాలుఁడు నతఃపురంబునందలి భయంకరమైన యేడ్పు ధ్వనిని విని, పుత్రు నెడఁ బాయుటవలన వ్యసనముతోఁ గూడినవాఁడై, యాసనముపై నొఱఁ గెను.

ఇంద్రియముల గెల్చినవాఁడగు రాముఁడు వ్యసనపడి, తమ్మునితోఁ గూడఁ దల్లియొక్క యంతఃపురమునకుఁ బోయెను. అట్లు పోయి, యా రాముఁడు తల్లియొక్క యంతఃపురము వాకిటఁ గూర్చుండియున్న మిగుల మున్నవడసిన ముసలివానిని, యచ్చటనె నిల్చియున్న యితరుల ననేకు లను జూచెను. అపుడు ద్వారమున నున్నవా రందఱును రామునిఁ జూచి వంతటనే వేగముగ లేచి, జయశీలురలో శ్రేష్ఠుఁడగు రామునిం జూచి, "రాజపుత్రా! జయముగలుగుఁగాక జయముగలుగుఁగాక" అని దీవనలు సల్పిరి. రాముఁడు మొదటి తొట్టికట్టుదాఁటి, రెండవ తొట్టికట్టునందు వేదవేదాంగసంపన్నులును, మహారాజు మన్ననలఁ బడసినవారును నగు ముదుసలి బ్రాహ్మణులను జూచెను. రాముఁ డా వృద్ధబ్రాహ్మణోత్తముల కెల్ల మ్రొక్కులిడి, మూఁడవతొట్టికట్టు సొచ్చి, యచ్చట వాకిటఁ గావలి కాచుటయె ముఖ్యమైనపనిగాఁ జూచుచుండు చిన్నపెద్దలగు మగు వలను జూచెను. ఆ మగువ లందఱు రామునికి జయంబుగలుగవలె నని దీవించి, త్వరగా లోపలికిఁ బోయి, యప్పుడే రాముని తల్లితో, "ఓ దేవీ నీ కొమరుఁడు తమ్మునితోఁగూడ. నిచ్చటికి వచ్చుచున్నాఁ"డని తెలిపిరి. కౌసల్యయు నప్పుడు నిశ్చలమయిన భక్తితో రాత్రియంతయు నుండి, తన కొడుకునకు మేలుగోరినదై, యుదయముననే విష్ణుపూజను జేసి ముగించెను. ఆ కౌసల్య పట్టుచీరగట్టి, యలంకారము చేసికొని రాముని పట్టాభిషేకవార్తను విన్నదై, సంతసముతోఁ గూడి, యెల్లప్పుడు నోములు నోచుటయందే విడువని పట్టుదలగలవగుచు, మంత్ర పూర్వకముగ నగ్నియందు హోమము చేయుచుండెను. అపుడు రాముఁడు తల్లియొక్క సొగసయిన యంతఃపురములోపలఁ బ్రవేశించి, యగ్ని

హోత్రునియందు హోమముచేయుచున్న తల్లిని జూచెను. మఱియు నచ్చట దేవతల పూజనిమిత్తము సిద్ధముచేయఁబడియున్న పెరుఁగు, పాలు, నెయ్యి, యక్షతలు, భక్ష్యములు, హవిస్సులు, లాజలు, తెల్లని పువ్వులమాలికలు, క్షీరాన్నము, చిమ్మిలియుంటలు, సమిధలు, పూర్ణకుంభములు మొదలగు ద్రవ్యములు జూచెను. అప్పుడు రాముఁడు మఱింత దగ్గఱకుఁ జని, తెల్లని పట్టుచీరగట్టుకొన్నదియు, నుపవాసములుండి నోములు నోచుచుండుటచేఁ గడుఁ జిక్కినదియు, విష్ణుమూర్తి కర్ఘ్యము నొసంగుచున్నదియు, దేవతలకు సాటియగు రూపసంపదగలదియునైన తల్లిని జూచెను. కౌసల్యయుఁ దనకు సంతసము గావించెడు వచ్చుచున్న కొడుకును జూచి, సంతోషపరవశయై, పెంటిగుఱ్ఱము గుఱ్ఱపుఁబిల్లను జూచినంతనే సకిలింతలు చేయుచు నెదుర్కొనునట్లు, తాను రాముని నెదుర్కొనెను. అట్లు తన్నెదురుకొని వచ్చుచున్న తనతల్లిని జూచి, రాముఁడు సాగిలఁబడి మ్రొక్కెను. వెంటనే కౌసల్య తన కొడుకును లేవఁదీసి, తన రెండుచేతులతో గట్టిగాఁ గౌఁగిలించుకొని, శిరంబున ముద్దాడెను. అంత, కౌసల్య శత్రులకు లొంగనివాఁడయిన తన పుత్రునిఁ గూర్చి, వాత్సల్యముతో నతని కిష్టములను, మేలు గావించునవియు నైన మాటల నిట్లనెను.

"ఓ రామా! పెద్దలును, ధర్మమునడుపుటయే స్వభావముగాఁ గలవారును, విశేషధైర్యశాలులు నగు రాజర్షులయొక్క యాయుస్సును, కీర్తిని, స్వజాతిధర్మమును బొందుము. రామా! నీ తండ్రియొక్క మాటతప్పని స్వభావముఁ జూచితివా? ధర్మస్వభావుఁడగు నీ తండ్రి నీ కిప్పుడె పట్టాభిషేకంబు సేయఁబోవుచున్నాఁడు" అని కౌసల్య రామునితోఁ జెప్పి, యాసనంబు నొసఁగి, "నాయనా! బువ్వతిందువు రమ్మ"ని పిలిచెను. వెంటనే రాముఁడు "తల్లికి జరిగిన సంగతిఁ దెలియక పోయెఁగదా" యనియు, "తా నడవికిఁబోనున్నవార్తను తల్లి కెట్లు తెలుపుదు"నని గొంచెము సిగ్గుపడి, చేతులు జోడించికొని, దా నందఱి యెడలను స్వాభావికముగా వినయము గలవాఁడు గావున, తల్లియందలి మర్యాదచే మఱింత వినయముతో, దండకారణ్యముల కేఁగుటకుఁ బయనమ్మై, తల్లియొక్క యుత్తరువు వడయఁగోరి యిట్లు చెప్పఁ దొడఁగెను.

“ఓ తల్లీ ! నీకు నిజముగాఁ దెలియదు ? గొప్పవిపరీతము పుట్టినది ! గొప్ప యాపద సంభవించినది ! ఈ విషయమును విన్నంతట నీకును, సీతకును, లక్ష్మణునకును విస్తారమయిన వ్యసనముగలుగును. తల్లీ, నేను దండ కారణ్యంబునకేఁగెదను, నాకేల యీసింహాసనము ! ఇరువదియైదు దర్భలు పఱచిన విష్టరమును నాసనముగఁగూర్చుండుటకుఁ దగినకాలమె యిప్పుడు నాకు వచ్చినది. మునీంద్రునివలె మాంసమును వర్జించి తేనె, గడ్డలు, దుంపలు, పండ్లు తిని నా జీవితము గడపుచుఁ బదునాలుగేండ్లు జనసంచారము లేని వనమున నివసింపఁబోవుచున్నాను. నృపాలుఁడు తన రాజ్యమును భరతున కొసఁగ నున్నాఁడు. నన్నన్నో మునివేషముతో దండకారణ్యమునకుఁ బంప నున్నాఁడు. కావున నేను పదునాలుగుసంవత్సరములు కానలలో నుండు పండ్లచేతను, దుంపలచేతను బ్రాణంబుఁ గాపాడుచు నేకతమున వాసముచేసెద”ను నని కౌసల్యతో రాముఁడు చెప్పెను.

ఆ కౌసల్య యా మాటలు విని గొడ్డటితో నఱుకఁబడిన యడవి యందలి చెట్టుకొమ్మవలెను, స్వర్గమునుండి జాఱిపడిన దేవాంగనవలెను గ్రిందఁబడి మూర్ఛనొందెను. అట్టిదుఃఖములకుఁ దగనిదై, నఱుకఁబడిన యరఁటిచెట్టువలెఁ గ్రిందఁబడి, మూర్ఛనొందియున్న తల్లిని రాముఁడు లేవనెత్తెను. నేలమీఁదఁ బొరలి, లేచి, దుఃఖపడుచుండునదియు, విశేషముగ బరువువేసి మోయించిన యాఁడుగుఱ్ఱమువలె డస్సినదియు నేలమీఁదఁ బడి పొరలుటచే నొడలంతయు దుమ్ముంటుకొన్నదియు నైన తన తల్లియగు కౌసల్యను రాముఁడు లేవనెత్తి కూర్చుండఁబెట్టి, యొడలి దుమ్మంతయుఁ దుడిచెను. అట్లు దుఃఖముచే నొచ్చినదియు, సుఖములకుఁ దగినదియు నైన యా కౌసల్య పురుషశ్రేష్ఠుఁడగు రామునితో లక్ష్మణుఁడు దగ్గఱ నిలుచుండి వినుచుండగా నిట్లనియెను.

“ఓ నాయనా! నీవు నాకు దుఃఖములకై పుట్టినావు కాఁబోలు. నీవు పుట్టకున్న “నేను గొడ్రాలను” అను వ్యసనముదప్ప మఱే వ్యసనమును నాకు లేదుగదా! లోకంబున గొడ్డురాలికి “నాకు బిడ్డలు లేకపోయిరే” అను వ్యసన మొక్కటి మనసులోఁ గలుగుచున్నదికాని; మఱియొక్క వ్యసనము లేదుగదా. నా పెనిమిటి వయస్సున నుండఁగా,

నే నొక్క సౌఖ్యమునుగాని, మేలునుగాని పొందినదానను గాను. అయినను, నీకాలములోనైనను సుఖపడుదు నని కొండంతయాశ పెట్టుకొనియుంటిని. నేను నీ తండ్రియొక్క పత్నులలోఁ బెద్దదాన నయినను, చిన్నవారగు నా సవతులు హృదయము గ్రుచ్చుకొనునట్లు చెప్పిన వ్యసనకరములయిన యెన్నియో మాటలను సైరించితిని. ఆఁడువారికి సవతులచేఁ బడు పోడుపు మాటలకంటె దుఃఖకరమయినది యేది యున్నది? నాఁటివ్యసనమును, నేడ్పును నెట్టిదో కాని, యీ వ్యసనమునకు, నాయేడ్పునకును ముగింపే లేదు. ఓరీ నాయనా, నీ వెదుటనున్నప్పుడే నే నొక మూలలోఁ ద్రోయఁబడితిని. ఇఁక నీ వడవుల కేఁగిన, నాకు మరణమే. అది నిశ్చయము. నా కెల్లప్పుడు స్వాతంత్ర్యము లేదు. ఎల్లప్పుడు నా పెనిమిటి నన్ను బొత్తిగా లక్ష్యపెట్టఁడాయెను. నే నిప్పుడు కైకేయియొక్క పనికత్తెలతో, సాటియైనదాన నయితిని. బాగుగా నాలోచించి చూడ, వారికంటె నీచురాల ననియె చెప్పవలెను. ఎవ్వఁడైన నొకఁడు నన్ని దివఱకుఁ గొల్చుచున్నను, చెప్పినమాట వినుచుండినను, ఇఁకమీఁదఁ గైకేయియొక్క పుత్త్రుఁడగు భరతునిఁ జూచినపిమ్మట, భయపడి నాతో మాటాడనుగూడ మాటాడఁడు. ఆ కైకేయి నాతో నెడతెగని వైరము గలదిగాన, నది యనెడు పోడుపుడు మాటలను నీచురాలనయి నే నెటులోర్చి యుండఁగలను. నీవు పుట్టిననాఁటినుండియు నీ పదునేడు సంవత్సరములు, “నీవు యౌవరాజ్యమునకు వచ్చినయెడల నా కష్టములన్నియుఁ బాయు” నని యీకష్టములనెల్ల నోర్చియుంటిని. నేను బెద్దదాన నయినను, నా సవతులు చేసెడు చెఱుపులను, వా రనెడి యోర్వరాని మాటలను, ఎన్నటికిని దీఱని గొప్ప దుఃఖమును నేను చిరకాల మోర్వఁజాలను. పున్నమచందురునిఁబోలు నీ మోమును జూడక, యెల్లప్పుడు దుఃఖపడుచునే నెట్లెట్టి యధమమగు బ్రతుకు బ్రతికెదను. నిర్భాగ్యురాలయిన నే నొక్క ప్రొద్దు లుండి, నోములు నోచి, యనేకములగు పడరాని పాటులెల్లఁ బడి, నిన్నుఁ బెంచిన దంతయు నాకు దుఃఖమునకుఁ గారణమాయెనుగదా! వానకాలమందుఁ బ్రవాహము రాఁగానే కొట్టుకపడని గొప్ప యేటిగట్టువలె నా హృదయ మింత మాట విన్నను బ్రద్దలు కాకున్నదిగాన, నా మనసు ఱాయికంటె

గట్టినని తలఁచెదను. నిజముగా నాకుఁ జావే లేదు. యమపట్టణమున నాకుఁ దావు లేనట్లున్నది. అట్లు గాకున్న, దుఃఖపడుచున్న, యాఁడు జింకను సింహ మీడ్చుకొనిపోవునట్లు, యముఁడు న న్నిప్పుడే తనపురికిఁ గొనిపోవకుండునా? భూలోకమున, నా కింతటి వ్యసనము వచ్చినను, నా దేహము క్షీణింపకున్నది; ముక్కలుగాకయున్నది; చీలకయున్నది; కనుక నా హృదయ ముక్కుతోఁ జేయఁబడినదేమో! లోకంబునఁ గోరినప్పుడు చావు రాదు. ఎప్పుడు దానికి వేళయో, అప్పుడే యది వచ్చును. నే నిన్నియేండ్లు బిడ్డలకై నోచిన నోములు, దానములు, నియమములు, తపస్సులు సర్వమును చవిటిచేనియందు నాఁటఁబడిన విత్తనములువలె నిష్ఫలము లాయెఁగదా. ఈ దుఃఖమునకంటె మించిన దుఃఖ మేమియున్నది? వేళవచ్చినప్పుడు కాక, తన యిష్టముచొప్పున నొకఁ డోర్వరాని వ్యసనముచేఁ జిక్కి, మరణమునొందఁ గలుగునేని, నేనును దూడను విడిచిన యావువలె నిపుడే యమపురికిఁ బోయి యుందును. చందురునింబోలు మోముచాయ గలవాఁడా! నిన్నుఁ బాసి, పిదప నేను ప్రాణములు దాల్చియుండుట నిష్ఫలము. కావున నేను బలహీనురాలనయినను, దూడను ఆవు వెంబడించునట్లు నీపై ప్రేమచే నిన్ను వెంబడించి వచ్చెదను" అని కౌసల్య యప్పుడు తన వ్యసనము సైరింపఁజాలనిదై, వేఁటకాండ్రచే వేయఁబడిన కొమారునిఁ జూచి వ్యసనమునొందిన కిన్నరాంగనవలె వ్యసనమునొంది, విశేషముగాఁ బలవించెను.

## 21-వ సర్గము

### లక్ష్మణుఁడు కౌసల్యను, రాముని నోదార్చుట

ఆ ప్రకారముగానే దుఃఖపడుచుండు రాముని తల్లియగు నా కౌసల్యను లక్ష్మణుఁడు చూచి, తానును మిక్కిలి చింతించి, యా సమయమునకుఁ దగినమాట యిట్లనెను:—

"ఓ తల్లీ! రాముఁడు కేవల మాఁడుదాని మాటలకు లోఁబడి, రాజ్యలక్ష్మిని వదలిపెట్టి, యడవికేఁగుట యనునది నాకును సమ్మతముగాఁ దోఁపలేదు. దశరథుఁడు మనస్సున నిలుకడలేనివాఁడు, ముసలివాఁడు, నింద్రియములకు లోఁబడినవాఁడు, మన్మథుని బాణములచేఁ బీడింపఁ

బడినవాఁడు; మన్మథుఁడు లోపలఁ జేరి ప్రేరణచేయుచుండఁగా, నట్టి చెడ్డ యవస్థలుగల దశరథుఁ డేపనినిఁజేయఁడు? మోహముచే నెట్టిమాట పలుకఁడు. రాజ్యభ్రష్టునిఁ జేసి యడవికిఁ బంపవలసినంత తప్పిదముగాని, పాపముగాని రామునియందు నాకుఁ గనఁబడలేదు. రామునికి జన్మశత్రువైనవాఁడొండె, రామునివలన నవమానింపబడినవాఁడొండె యెవ్వఁడైనను రాముని మఱుఁగుననైనను నతనిపై దోషము సెప్పువాఁ డీ లోకమున నాకుఁ గాన్పింపఁడు. దేవతలతో సమానుఁడును, చక్కనివాఁడును, నోర్పుగలవాఁడును, బగతురనైనను బ్రేమించువాఁడునునైన పుత్రుని ధర్మజ్ఞుఁడగు తండ్రి యెవఁడు నిష్కారణముగా విడుచును? కావున ముసలి వాఁ డగుటంజేసియుఁ, గామపరవశుఁ డగుటంజేసియు బసివానివలె మంచిచెడ్డ లరయఁజాలనట్టి నృపాలుఁ డేది చెప్పినను వినవలయు నని విధి యున్నదే? ఆతఁ డొక సమయమున నన్యాయ్యముగాఁ జెప్పినదానిని రాజధర్మంబుల నెఱింగిన పుత్రుఁడు వినవలయునే? అట్టి మాటలను బుత్రుఁడు మనసునందే యుంచరాదు. ఓ యన్నా! రాజు నిన్ను వనమునకుఁ బొమ్మనిన సంగతి యందఱకుఁ దెలియకముందే, నా తోడ్పాటున రాజ్యమునంతయు స్వాధీనపఱచికొనుము. నేను విల్లు చేతఁబట్టి నీప్రక్కన నిలఁబడి కాఁచుచుండ, యమునివలె నున్న నిన్నెవఁడు మీఱఁజాలును? నరశ్రేష్ఠుఁడా! యయోధ్యానగరమునందు నీకెవఁడయిన నెదురు తిరుగఁబడునేని, వానిపైఁ గఱకుటమ్ములం బ్రయోగించి, యీ యయోధ్యనెల్ల నిర్మానుష్యముగాఁ జేసెదను. అటుగాక, భరతునియొక్క హితులైనను, చెలికాండ్రయినను యుద్ధమునకు వత్తురేని, వారి నందఱిని నుగ్గునేసెదను. మెత్తని వాఁ డన్నిచోట్ల నవమానమొందునుగదా! కావున మన మిప్పుడు మెత్తదనము గలిగియుండరాదు. చెడుతలంపుగలవాఁడగు మనతండ్రి కైకేయియొక్క దుర్బోధనచే నిట్టి మార్పునొందెను. కావున మన కతఁడు పగతుఁడు. అట్టివానిపైఁ బ్రేమ యుంపక వధింపను వచ్చును. కాలుసేతులు విఱిచికట్టను వచ్చును.

మదించినవాఁడై, లేక కామపరవశుండై, యిది చేయఁదగినది యిది చేయఁదగనిది యని తెలిసికొనక, చెడుదారియందుఁ బోవువాఁడు గురువైనను, వానిని దండింపవచ్చును. ఓపురుషశ్రేష్ఠుఁడా! నీవు మాయందఱి

లోపలఁ బెద్దవాఁడవు. కావున నీకి రాజ్యము న్యాయప్రకారమున లభ్య
పడినది. ఇట్టి నీరాజ్యమును దశరథుఁ డేమి బలిమిని, ఏమి కారణమును
బట్టి కైకేయి కిచ్చుటకుఁ గోరినాఁడు? ఈ దశరథుఁడు నన్ను గెల్చునంత
బలిమిగలవాఁడే? నీ రాజ్యమును గైకేయి కిచ్చుటకుఁ దగినంత కారణ
మున్నదే? రెండును లేవని నేఁ దలఁచెదను. ఓ శత్రుసంహారీ! నీతో
డను గొప్ప వైరముపూని, భరతునకు రాజ్యం బొసఁగునంత
శక్తి యీ దశరథున కున్నదే?" అని రామునితోఁ జెప్పి, తల్లివంకఁ
జూచి, "తల్లీ! నేను జెప్పెడి సత్యమును, నేను బట్టినవింటిని, నేను జేసిన
దానములను, నే నొనరించిన యాగములను సాక్షులనుగాఁ బెట్టి యొట్టు
పెట్టుకొనెదను. నేను నామనోవాక్కాయంబులచే మా యన్నయందుఁ
బ్రేమగలిగియుందును. ఇది నిక్కువము. నన్ను దాయాదునిఁగాఁ దలంప
కుము. ఓదేవీ! రాముఁడు మండుచున్న నిప్పునుగాని, అడవినిగాని ప్రవే
శింపఁ బోవునేని, నన్నంతకు ముందె యచ్చటఁ బ్రవేశించియున్నవానినిగా
నెఱుంగుము. సూర్యుఁ డుదయించి, చీకటిని బోఁగొట్టునట్లు నేను నా
బలిమిచే నీవ్యసనమును బోఁగొట్టెదను. దేవీ, నీవును, రాముఁడును
నా మగటిమిఁ జూతురుగాక" అని లక్ష్మణుఁడు కౌసల్యతోను రాముని
తోను జెప్పెను.

ఇట్లు ధైర్యశాలియగు లక్ష్మణుఁడు చెప్పిన పలుకులువిని కౌసల్య
కన్నీరు విడుచుచు, దుఃఖముచే నెవ రెట్లు చెప్పిన నట్లు చేసినయెడలఁ
దన దుఃఖ ముపశమించు నని తలఁచి, రామునిం గూర్చి "ఓ నాయనా!
నీతమ్ముఁడు చెప్పిన పలుకులు వింటివి గదా! ఇప్పు డవి నీకు సమ్మతము
లగునేని, యాప్రకారము చేయుము. నీ సవతితల్లి చెప్పిన ధర్మవిరుద్ధ
మైన మాట నొప్పికొనిన ని న్నెడఁబాయఁజాలక, కుందుచుండు నన్నుఁ
బాసి, నీ విచ్చటనుండి కానలకేఁగుటకు నే నెంతమాత్రము సమ్మతింపఁ
జాలను. ధర్మముల నెఱింగినవాఁడా! నీవు ధర్మమునందే పట్టుదలగల్గి
ధర్మమును నడపుటయందే కోరికగలవాఁడ వగుదువేని, యిచ్చటనే
యుండి, నాకు శుశ్రూషలు సల్పుచుండుము. ఉత్తమ ధర్మ మేదియో
దానిం జేయుము. తల్లికి శుశ్రూషసేయుటకంటె మించిన ధర్మంబు లోకం
బునఁ గలదే? తల్లికంటె మించిన దైవంబు లేదుగావున నీవు తక్కిన ధర్మ

ములను వదలియైనను దల్లికి శుశ్రూష సల్పుచుండుము. తొల్లి కాశ్య
పుఁడు తల్లికి శుశ్రూషలు సల్పుచుఁ దన యింటియందే జితేంద్రియుఁడై
యుండి, యధిక తపస్సుచేసి స్వర్గలోకము నొందెను. నృపాలుఁ డెట్లు
నీకుఁ బూజ్యుఁడో నేనును నట్లేకదా! లోకంబునఁ గొమరునికిఁ దల్లి
దండ్రులొక్కటియే. వారిలో నతఁ డెవరిని హెచ్చుగాను, నెవరిని
దక్కువగాను జూడవచ్చును? కావున నీవు వనంబుల కేఁగుటకు నేను
సమ్మతింపను. నీవు పట్టణము విడిచి యెక్కడికిఁ బోఁగూడదు, అట్లు
కాదని నీవు నన్ను విడిచిపోతివేని, యిఁక నా కీ జన్మముతో నేమి
యుపయోగము? ఏ సుఖము ననుభవించియు నేమి యుపయోగము?
నీ వడవికిఁ బోయిన, నిన్నుఁబాసి యిక్కడ సుఖంబుల ననుభవించుట
కంటె, నీతోడ నడవులలో దిరుగుచు గడ్డి దినుచునైనను జీవించి యుం
డుట మేలు. దుఃఖముచేఁ జపలురాలనై యున్న నన్ను విడిచి నీవు కానల
కేఁగితివేని, నేను తప్పక నిరశనవ్రతము (ఆహారము లేకుండుట) పూని
ప్రాణములను దొఱఁగెదను. ఇది నిజము. నమ్ముము. నిన్ను విడిచి నే నర
నిముసమైనను బ్రాణములతో నుండఁజాలను. నేను నీ నిమిత్తము ప్రాణం
బులఁ దొఱఁగుటం జేసి, నదులకు మగఁడగు సముద్రుఁ డన్యాయముచే
బ్రహ్మహత్యాదోషమును బొందినట్లు, నీవు శాశ్వతమయిన యపకీర్తి
నొందఁగలవు" అని కౌసల్య దుఃఖపడుచు రామునితోఁ జెప్పెను.

ధర్మము నడపుటయందే పూనికిగల రాముఁడట్లు కడుదిగులుతోఁ
గూడి పలవించుచున్న తల్లియగు కౌసల్యనుజూచి ధర్మమునకు విరుద్ధము
గాకుండున ట్లిట్లనియెను.—"ఓ తల్లీ! తండ్రిమాట మీఱుటకు నాకు
శక్తిలేదు, నేను నిన్నుఁ జాగిలఁబడి మ్రొక్కెదను. నే నడవికిఁ బోఁగోరు
చున్నాఁడను. తొల్లి దివ్యజ్ఞానముగలవాఁ డయినను, బ్రహ్మచర్యాది
వ్రతముల నొనరించువాఁ డయినను, ధర్మములను దెలిసినవాఁడయి
నను విద్వాంసుఁడయినను కండువను మహాముని తండ్రిమాట దాఁటఁ
జాలక గోవును జంపెను. అవన్నియేల? తొల్లి మావంశస్థుఁడయిన సగ
రునియొక్క కొడుకు లఱువదివేలమంది భూమిని ద్రవ్వుచుఁ బోయి,
పాతాళమున నన్యాయముగా నందఱు మడిసిరి. అట్లు వారు తండ్రి
మాటకై తమప్రాణములనుగూడఁ గోల్పోయిరి. అట్లుండ నేను బదునాలు

గేం డ్లడవియం దుండుటకు వెనుదీయవచ్చునే? తొల్లి జమదగ్ని పుత్రుం డగు పరశురాముం డడవియందుండునపుడు, ఆతనితండ్రి తల్లిని జంపు మనిచెప్పంగాం, దండ్రిమాటం జేయంగోరి యతఁడట్లె గొడ్డటితో నామెను నఱకివైచెను. ఓదేవీ? దేవతలవంటి వారెందఱో యిట్టి యనేకకార్యములనుజేసిరి. అట్లుండఁగా నేను మాత్రము నాతండ్రి కిష్టమయిన యీ కార్యము చేయక యతనిమాటను వ్యర్థపఱుపవచ్చునే? నే నతనిమాట యసత్యపఱుపఁజాలను. నే నొక్కఁడనే తండ్రియానతిని జేయ నంగీకరింపలేదు. పూర్వమెందఱో నేనుజెప్పిన రాజులంద ఱట్లు చేసినవారలెకదా! నీకుఁ బ్రతికూలముగా నడచుకొనఁగోరి యీ యన్యాయమార్గము నవలంబింపలేదు. తొల్లింటి పెద్ద లిష్టముతోఁ బోయినమార్గముననే నేనును బోఁదలఁచి యున్నాను. కాఁబట్టి, తండ్రి చెప్పినపని చేసి తీరవలసినదియే. పుడమియందుఁ దండ్రి గొప్ప ప్రత్యక్షదైవముగాన నతనిమాట మీఱరాదు. తండ్రి చెప్పినమాటను జేయు మానవుఁ డెప్పటికిని జెడఁడు గదా?" అని తల్లితోఁ జెప్పి, మాటలాడువారిలో నేర్పరియు, విలుకాండ్రలో మేటియునగు రాముఁడు తమ్మునింజూచి, యిట్లనెను:

"ఓ లక్ష్మణా! నీకు నాయందుండు నెక్కువచెలిమిని, నీపరాక్రమమును, బలమును, పరులకోర్వరానిదైన ప్రతాపమును నే నెఱుఁగుదును. నాతల్లియు సత్యమిట్టిదనియు, నో ర్విట్టిదనియుఁ దెలియక యపార దుఃఖము నొందుచున్నది.

లోకమున ధర్మమేకదా గొప్పది. అట్టి ధర్మమునందే సత్యము నిలిచియున్నది. తండ్రిమాట ప్రకారము నడచుకొనుట యనునదియు నట్టి ధర్మములలో నొక్కటియై యున్నది.

ధర్మమార్గావలంబి యగువాఁడు తల్లిదండ్రులకుఁ గాని, బ్రాహ్మణునికిఁ గాని యొకపని చేసెద నని మాట చెప్పి పిమ్మట తప్పుట యెంత మాత్రము తగదు. కావునఁ దండ్రియాజ్ఞను మీఱుటకు నేను గొంచెమైన నిష్టపడను. తండ్రి నీ కానతియ్యలేదే; తల్లియే కదా యానతి యొసంగెనందువేమో. ఓశూరా, తండ్రిమాటవలనేకదా కైకేయి నన్ను గానలకేఁగునట్లు ప్రేరణసేసెను. కావున నో లక్ష్మణా! క్షత్రియధర్మము నాశ్రయించిన యీచెడ్డతలంపు మానుము. న్యాయమార్గము నవలం

భింపుము గాని, కటికితనము మానుము. నా బుద్ధియెట్టిదో, యట్టి బుద్ధినే నీవు నాశ్రయింపుము." లక్ష్మణుని యన్నయగు రాముఁడు చెలిమిచేఁ దమ్ముఁడగు లక్ష్మణునితో నిట్లు పలికి, తల్లికి మఱల సాష్టాంగముగాఁ బ్రణమిల్లి, యామెతో నిట్లనియె.

"ఓ దేవీ! యిచ్చటనుండి యరణ్యమునకుఁ బోవ ననుజ్ఞయిమ్ము. నా ప్రాణములమీఁద నొట్టుపెట్టుకొని చెప్పెదను. నాకుఁ గీడు గలుగకుండులాగున మంగళకరములైన దీవనలు సల్పుము. తొల్లి యయాతి యను రాజర్షి స్వర్గలోకమును వదలి మఱలఁ బుడమిఁజెందిన చాడ్పున నేనును బదునాలుగేండ్లరణ్యవాసముచేసి, ప్రతిజ్ఞ నెఱవేర్చికొన్నవాఁడనై, మఱల నయోధ్యకు వచ్చిచేరెదను. ఓతల్లీ! శోకమును బాగుగా మనముననే యాపుకొనుము. వ్యసనపడకుము. నేను వనవాసము ముగించి, తండ్రిమాట చెల్లించి, మఱలఁ బురమున కేతెంచెదను.

నీవును, నేనును, సీతయు, లక్ష్మణుఁడును, సుమిత్రయుఁ దండ్రి చెప్పినచొప్పున నడచుకొనవలయు. ఇదిసనాతన ధర్మము. అమ్మా! యీ యభిషేకమునకుఁ దెచ్చిన సామగ్రులను నిలిపి యుంచి, దుఃఖమును మనస్సులోపల నాపికొని, వనవాసము చేయునిమిత్తము నే నాలోచించిన న్యాయవిరుద్ధముగాని బుద్ధి ననుసరించి నా కనుజ్ఞయొసఁగవలయును." అని రాముఁడు తల్లిని వేఁడెను.

పట్టపురాణియు, రాముని తల్లియునగు కౌసల్య తన కుమారుఁడు న్యాయమునకు విరుద్ధము గాకయు, వ్యసనము లేకయుఁ, గలవరపాటు విడిచియుఁ జెప్పిన పలుకులను విని, మృతినొందిన దానివలెఁ గ్రిందఁబడి, మఱలఁ దెలివి నొంది, రాముని జూచి యిట్లనియె.

"ఓ నాయనా! నీకు నీతండ్రియెట్లో నేను నట్లే, స్నేహముచేతను, దల్లిదండ్రులకు లోఁబడుట యనుస్వధర్మముచేతను గురువునైన దాననే. కడు దిగులుపడి శోకమునొందుచున్న నన్ను నిట్లు విడిచిపోవుటకు నేను సమ్మతించి యుత్తరు వీయను. లేక లేక కనిన నిన్నుఁ బాసి, నే నీ లోకమునఁ బ్రాణములతో నున్న నేమి? లేకున్న నేమి? ఈ రాజ్యముతో నేమి? పితృదేవతలకు నిచ్చు స్వధతోఁగాని యమృతముతోఁగాని యేమి యుపయోగము? ఈ కనఁబడుచుండు జీవరాసు లందఱికంటె నరగడియ

రైనను నీమోము నందముఁ జూచుచుంట, నీయెదుట నుండుట నాకు మిక్కిలి మేలని తోఁచెడిని.” అని రామునితోఁ గౌసల్య చెప్పెను. కట్లు వదలించుకొని, మనుష్యులు కొఱవికట్టెలతోఁ బొడుచుచుండఁగా, బాఱిఁబడి పోవుచున్న యేనుఁగు పరితపించునట్లు, రాముఁడు తన తల్లి యిట్లు దీనముగాఁ జెప్పిన మాటను విని, మిక్కిలి వగచి, మూర్ఛనొంది పడియున్న యా తల్లిని, దిగులువలని సంతాపముతోఁ గూడియున్న లక్ష్మణుని జూచి తాను ధర్మముననే యుండువాఁడును ధర్మమునే మాటాడఁగలవాఁడును గావున లక్ష్మణునితో నిట్లనియె.

“ఓ లక్ష్మణా! నే నెల్లప్పుడు నీయొక్క ప్రేమను, మఁగటిమిని నెఱిఁగియున్నాను. నాయొక్క యభిప్రాయము నెఱుంగక తల్లితోఁగూడి నన్ను మిక్కిలి పీడింపుచున్నావు.

ఓరీ నాయనా! లోకమున ధర్మము నాచరించువారికి ధర్మార్థ కామములు మూఁడును గలుగునుగదా. ఎట్లన, చెప్పినట్లు వినెడి భార్య భర్తకు స్వాధీనురాలై ధర్మము గలిగించును; భర్తయొక్క మనసున కొప్పినదై, కామమును గలిగించును; గుణవంతుఁడగు పుత్త్రునిఁగని ధనమును గలిగించును. ఆ యొక్క భార్యయె పైమూఁడింటిని గలుగఁ జేసిన చొప్పున ధర్మము నడపుకొనువారికి ధర్మార్థకామములు మూఁడును గలుగును. ఏకార్యమునందు ధర్మ, అర్థ, కామములు మూఁడును గలుగవో యట్టి కార్యమును మానవుఁ డుపక్రమింపరాదు. ఎవఁడు కేవలము అర్థమునందే యాసక్తి గలిగియుండునో వానిపై నందఱును బగ గొందురు. కామమే ముఖ్యముగా నుండువానిని. జనులు మన్ననచేయరు. ధర్మార్థకామములకు మూఁడింటికి నాధారమైన ధర్మమునే చేయవలయును. దశరథుఁడు గురువును, తండ్రియు, ముదుసలియు. అతఁడు కోపముతోఁ జెప్పినను, సంతసముతోఁ జెప్పినను, మోహముతోఁ జెప్పినను తండ్రిమాట నతిక్రమింపరాదను న్యాయమును గమనించి, యాపని చేయవలసినది. క్రూరస్వభావము లేనివాఁ డెవ్వఁడేని తండ్రిమాటను జవదాఁటునే? అందఱును దానిని జేయుదురు. కావున నే నది యెఱిఁగియుండి తండ్రి ప్రతిజ్ఞను నతని మనోరథము ప్రకారము పూర్తిచేయకుండఁజాలను. ఓరీ నాయనా! దశరథనృపాలుఁడు నీకును

నాకును గురుఁడు, దేవియగు కౌసల్యకు నతఁడే భర్త; అతఁడే దిక్కు; అతని శుశ్రూషయే యామెకు గొప్ప ధర్మము. ధర్మపరిపాలకుఁడయిన యా దశరథుఁడు స్వధర్మముఁ దప్పక రాజ్యము పాలించుచు జీవించియుండ, పెనిమిటిలేని యంగనవలె నన్ను వెంబడించి యామె వచ్చుట తగునా? ఇది గొప్పకులము వారికి మర్యాదగాదు. కావున తల్లీ! నీవు ముసలివాఁడగు దశరథునిఁ జూచుకొనుచుండుము. నా కడవి కేఁగ సెలవిమ్ము. వనవాసంబు ముగిసిన పిదప స్వర్గలోకమునుండి దిగివచ్చిన యయాతివలె వచ్చి చేరునట్లు నాకు మంగళాశీర్వాదములను జేయుము. ఓతల్లీ! కీర్తి నానాఁట వృద్ధి నొందునది. ఈదేహము కొంతకాలము మాత్ర ముండునది. ఇది యెంతవఱ కుండునో, ఎప్పుడు పోవునో తెలిసినదికాదు. అట్లు అస్థిరమై, స్వల్ప కాలము సుఖంబు నొసంగు శరీరము నిమిత్తము రాజ్యముఁ గోరుదునే? అది యన్యాయముగదా!" అని నరశ్రేష్ఠుఁడయిన రాముఁడు కౌసల్యతోఁ దండ్రి నోదార్పుమని చెప్పి, శౌర్యముగలిగి, దండకారణ్యమునకుం బోవలెనని కోరినవాఁడై, తమ్ముని మిక్కిలి యోదార్చి, తనతల్లికిఁ గడు శుశ్రూష చేయుమని చెప్పి, యాతల్లికి మనసునందే ప్రదక్షిణంబుచేసెను.

## 22-వ సర్గము

### రాముఁడు దైవబలము గొప్పదని లక్ష్మణునితో జెప్పుట

అట్లు అట్లు శోకముచే దిగులుపడి, యెక్కువ రోషముగలవాఁడై, కన్నులు గిరగిరఁ ద్రిప్పుచు నాగుఁబామువలె బుసకొట్టుచుండువాఁడును, మంచి మనసుగలవాఁడును, అనుఁగుదమ్ముఁడునునైన లక్ష్మణుని దాపునఁ జేరి, బుద్ధిమంతుఁడైన రాముఁడు దన మనోవికారము నణఁచుకొని "ఓ లక్ష్మణా! తండ్రి యిట్టి యానతి నేసెనే యనెడి కోపమును, మన యన్న కిట్టి యవస్థ వచ్చెనే యనెడి విన్నదనమును మాని, ధైర్య మొక్కటిమాత్రము పూని, యిపుడు నా పట్టాభిషేక ప్రయత్నము మాని, దాని నిమిత్తము చేర్చిన వస్తువులనెల్ల విడిచి, నిర్దోషమయిన కార్యమును జేయుము. సౌమిత్రీ! నా యభిషేకమునకై వస్తువులను జేర్ప నీకెంత యుత్సాహముండెనో, అంతటి యుత్సాహము పట్టాభిషేక నివృత్తికై యగునుగాక! నాపట్టాభిషేకము మాటవిన్నదైన యే కైకేయి మనస్సు పరితపించుచున్నదో, యట్టి యా తల్లియొక్క మనమునఁ గల

పరితాపము లేకుండునట్లు చేయుము. ఆ కైకేయియొక్క మనంబునఁ బుట్టిన భయముతో నిండిన దుఃఖమును నే నుపేక్ష చేయఁజాలను. నేను తెలిసియుఁ దెలియకయు నొకప్పుడైనను తల్లులకుఁగాని, తండ్రికిఁగాని గొంచెమయినను విరోధంబు సేసియున్నట్లెఱుఁగను. నిజము పలుకు వాఁడును, ప్రతిజ్ఞ దప్పనివాఁడును, ఎల్లప్పుడు విడువని పరాక్రమము గలవాఁడునునైన నా తండ్రి "నేను జేసిన ప్రతిజ్ఞ దప్పునేమో" యని పరలోకమునకు వెఱచియున్నాఁడు. ఆతని వెఱపును దొలఁగునుగాక! ఈ పట్టాభిషేకము నిలుపక జరుగునేని, "నే నాడినమాట తప్పిపోయితిని గదా" యని మన తండ్రియు మనంబున నొచ్చుకొనును. ఆ నొచ్చి కోలు నన్నును నొవ్వఁజేయును. కావున లక్ష్మణా! యభిషేకప్రయత్న మును మాని, యిప్పుడె యిచ్చటనుండియె యరణ్యమునకుఁ బోయెదను. ఇప్పుడు న న్నడవికిఁ బంపుటచే రాజపుత్రియగు కైకేయి తన కోరికను నెఱవేర్చికొన్నదై, వెంబడె, తన కొడుకగు భరతునకు దిగులు లేకుండఁ బట్టాభిషేకము జరిపించుకొనును. నేను నారబట్టలను గట్టి జింకతోలు గప్పుకొని జడలఁదాల్చి యరణ్యంబునకుఁ బోయితినేని, కైకేయి మనస్సు నకు సంతసము గలుగును. కావున నేను నిలువక వనమునకుఁ బోవ వలయును. దశరథుఁడు తన సత్యవాక్యపరిపాలనమునకై యిట్టి యోజనచేసి, న న్నడవికిఁ బంపుటకు మనసు తాయి చేసికొనెను. కావున నట్టి నృపాలునిమాట మీఱి, యాతని మనస్సు నొవ్వఁ జేయఁ జాలను. నేను శీఘ్రముగా వనమున కేఁగెదను. లక్ష్మణా! న న్నడవికిఁ బంపుటకుఁగాని, యిచ్చిన రాజ్యంబుఁ గైకొనుటకుఁగాని దైవమె కారణముగాని కైకేయి గారణము గాదు. నే నడవికిఁ బోవుట యను నట్టి తలంపు దేవునికి లేదేని, యీ కైకేయియొక్క యభిప్రాయంబు న న్నెట్లు నొప్పింపఁజాలును? ఇదివఱ కెప్పుడును నేను దల్లులందుఁ దారతమ్యము లేకయుండుటయు, నట్లె యిదివఱకుఁ గైకేయి యెల్ల ప్పుడు నన్నును, భరతునిని నేకరీతిగాఁ జూచుచుండుటయు నీకుఁ దెలిసినదేకదా! అట్టి కైకేయి కిప్పు డిట్టి తలంపు దైవప్రాతికూల్యము లేనిచోఁ బుట్టునా? భరతునియందును నాయందును నొకతీరున నున్న కైకేయి యిప్పుడు నన్నుఁ జూచి, "పట్టాభిషేకంబు నీవు సేసికొన

వలదు, పదునాలుగేండ్లడవియందుండవలయును" అని చెవుల కింపుగాని కఠోరపుఁ బలుకులు పలుకుట దైవ వైపరీత్యముగాని, మఱొక్కటిగాదు. అట్లు దైవము నాకు విరుద్ధముగా నుండ దేని, యిన్నిదినములు నాయందుఁ బుత్రవాత్సల్యము గల్గియున్న యామె కిప్పు డేల యిట్టి దుర్బుద్ధిపుట్టును? కావున నిది దైవముయొక్క ప్రేరణయె గాని వేఱొక్కటి కాదు. ఇది దైవప్రేరణకానిచో, నా కైకేయి రాజ వంశమునఁ బుట్టినదయ్యును, సుగుణములు గలదయ్యును, సుస్వభావము గలదైనను, నాయందుఁ బుత్రవాత్సల్యము గలదైనను, పెనిమిటి యెదుట సిగ్గుమాలి భయము విడిచి, నీచురాలివలె నిర్వ్యాధంబున నాకు నొప్పి గల్గించు మాటలఁ జెప్పునా? కావున దైవబలముచేతనే యీ కైకేయి కిట్టి యభిప్రాయము గలిగియుండవచ్చును. దైవం బిట్టిదని యోచించి తెలిసికొనఁదగినది కాదు. ఆ దైవంబున కన్నిభూతము లడ్డమురావు, ఇది నిస్సంశయము. ఈ విపరీతంబు నా విషయమునను, కైకేయి విషయమునను సిద్ధముగ నేర్పడినది. సకల రాజులతోను, ఋషులతోను గూడి తండ్రి యాలోచించి నిశ్చయించిన పట్టాభిషేకంబు నిలిచిపోయెను, నాపైఁ బుత్రవాత్సల్యము గలిగియున్న కైకేయి కీ నాఁటికి నన్నుఁ గానలకుఁ బంపునంత కటికితనము గలిగినది. కావున దైవమున కెచ్చట నాటంకము లేదు. లక్ష్మణా! దైవ మున్నదనుట కేమి గుఱుతు? అటు లున్నను దైవమును మన ప్రయత్నముచే గెల్వఁ గూడదా? యని యందువేమో! దైవము మన కంటి కగుపడదు, అయినను దాని కార్యముచే నది యున్న దని యూహింపఁబడుచున్నది. కొందఱు బహు ప్రయాసతోఁ జేయు కార్యములు సిద్ధింపవు. కొందఱు ప్రయత్నపడకయే కార్యసిద్ధి నొందుదురు. ప్రయత్నపడి చేసినపని కాకపోవుటయుఁ, బ్రయత్నపడకయున్న పని తనంతట సిద్ధించుటయుఁ జూడ దైవ మున్నదని మనకు రూఢిగాఁ దెలియుచున్నది. అది యేల నివార్యముగాఁ గూడ దనిన, కార్య మగుపడనిది కారణ మిట్టి దని తెలియదు. కార్యమయిపోయిన తర్వాతఁ దనకు దైవంబు ప్రతికూలముగ లేక యనుకూలముగ నున్నదో యను విచారము చేసి యుపయోగములేదు. కార్యము చెడకముందు కారణ మిట్టిదని తెలిసిన,

దానిని సవరించుకొనవచ్చును. కార్య మగునంతవఱకుఁ గారణమగు దైవముయొక్క యభిప్రాయ మిట్టి దని తెలియదు కావునఁ గార్యము మించిన తరువాత నా విచారము చేసి యుపయోగము లేదు. అది యనుభవించి తీఱవలసినదిగాని, దానికిఁ జికిత్స లేదు. భయంకరమగు తపస్సు చేయుచున్నవారయినను, ఋషులు దైవమాయకు లోఁబడి, కామమోహములచేతను తమ కఠిన నియమములను విడిచి, చెడిపోవు చున్నారు. సుఖదుఃఖములు, భయక్రోధములు, కలిమిలేములు, చావు పుట్టుకలు మొదలగు కార్యములన్నియు దైవకార్యములె కాని పురుషుని ప్రయత్నముచే నగునవికావు. మన మారంభించిన కార్యము కాకపోవుటయు, మన మనుకొనని కార్య మగుటయు దైవమాయగదా! కావున నేనును "మన ప్రయత్నములో నొక్కటియు లేదు. అన్నియు దైవమాయవలనఁ గలుగుచున్నవి" యనెడు యథార్థమయిన సంగతిని దెలిసికొని, మనసు నణఁచి, నా పట్టాభిషేకము నిలిచినను విచారము మానియున్నాఁడను. కావున నీవును నావలె మనమున విచారము మాని, పట్టాభిషేకమునకు సంబంధించిన ప్రయత్నము నిలుపుము. లక్ష్మణా! పట్టాభిషేకము నిమిత్తము తేఁబడిన తీర్థోదకములు నాయొక్క వనవాస వ్రతసంకల్పము నిమిత్తము చేయు స్నానమునకుఁ బనికివచ్చును. అట్లు రాజద్రవ్యమయిన తీర్థోదకములచేత స్నానముచేయుట కైకేయికి సమ్మతము కాదేమో! నేను స్వయముగాఁ దెచ్చిన యుదకముచేతనే వనవాస వ్రతసంకల్పమునకై స్నానముచేసెదను. లక్ష్మణా! 'రాజ్యలక్ష్మి లభింపకపోయెఁగదా' యను వ్యసనము మానుము. నాకు రాజ్యమయిన నొక్కటియే; వనవాసమయిన నొక్కటియే. రాజ్యమునఁ బ్రజల రక్షించుట యను ధర్మంబు లభించును. వనంబున నున్నఁ దపస్సు మొదలగు పుణ్యములు లభించును. యోజించిచూడఁగా, వనవాసంబునఁ బ్రజల న్యాయాన్యాయముల విచారణ లేమిం జేసియుఁ, దండ్రి పనుపుసేయుట యను ధర్మంబు లభించుట బట్టియు వనవాసమే మేలని తలఁచెదను. లక్ష్మణా! పట్టాభిషేకమునకు విఘ్నము వచ్చెఁగదా యని యెంచకుము. దీని నిమిత్తమై, సవతితల్లియగు కైకేయి విషయమున సందియముఁ బాయుము. ఆమె యేమి చేయును? దైవయోగము

చేతనే యీమె యట్టి యప్రియ వాక్యములఁ బలుకుచున్నది. దైవశక్తి యెవరికిని గెల్వరానిదిగదా! కావునఁ గైకేయి నా పట్టాభిషేకమునకు విఘ్నము చేసినదియని తలఁపకుము. విఘ్నముచేసినది దైవమని తలంపుము" అని చెప్పెను.

## 23-వ సర్గము

లక్ష్మణుఁడు రాముని వనవాసము మానుకొనఁ బురిగొల్పుట

రాముఁ డిట్లు పలుకఁగా, నరశ్రేష్ఠుఁడగు లక్ష్మణుఁడు రాముని పలుకు లాలకించి, తలవంచి, చాలసేపు చింతించి, యన్నకుఁ బట్టము గట్టుట నిలిచిపోయె ననెడి వ్యసనంబును, దానితోఁగూడ, రాముఁడు తన కిష్టముగాని పనులఁగూడ జేయ నొప్పుకొనెనుగదా యనెడి సంతసము గలవాఁడై, కొంతసేపు దుఃఖపడుచుఁ గొంతసేపు సంతసపడుచు, గనుబొమ్మలు ముడివెట్టిఁ చూపఱకు దిగులుపుట్టునట్లు, పుట్టయందుండు పామువలె బుసకొట్టుచుండెను. అట్టి కోపవంతుఁడైన లక్ష్మణుని మోము రేఁగిన సింహముయొక్క మోమువలె భయంకరముగాఁ దోఁచెను. ఏనుఁగు తన తొండమును విదలించునట్లు లక్ష్మణుఁడు తన ముంజేతిని విదలించుచుఁ, దలను గ్రిందికి మీఁదికిఁ బ్రక్కలకుఁ ద్రిప్పుచుఁ గ్రీఁగంటి చూపుతోఁ దన యన్నను జూచి యిట్లనియె.

"అన్నా! నీవు ధర్మములనెల్ల నెఱిఁగినవాఁడవు గావునఁ దండ్రి మాట మీఱినచో దోషమువచ్చు ననియు, ధర్మముఁ బాసినయెడల లోకులు నిందింతు రనియు నింత తొందరపడుచున్నావు. శూరుఁడవగు క్షత్రియశ్రేష్ఠుఁడా! దుర్బలమైన దైవమును గొప్పదానినిగ నెంచితివి. నీవు భ్రమపడి చెప్పుచున్నావు కాఁబోలును! అట్లు భ్రమపడి యిట్లు పలుకుట తగదు. దుర్బలమగు హీనమైన దైవము నెక్కువగాఁ బొగడు చున్నావు. ఆ దశరథ కైకేయులు పాపాత్ములు. పాపాత్ములగు దశరథ కైకేయులయెడ నీ కేమియుఁ దప్పిదము తోఁపలేదుగదా. వారు చెడు తలంపు గలవారు గావున వారిమాటలను మీఱినను దోషములేదు. ఓ ధర్మిష్ఠుఁడా, బూటకపు ధర్మాత్ములు కొంద ఱితరులకుఁ జెవుల కింపుగా మాటలాడుచుందురు. వారివలెనే యీ దశరథ కైకేయు లిద్దఱు నీపైఁ బూటకంపుఁబ్రేమఁ గనఁబఱచుచు, నీ కెగ్గుతలఁచి తమ పనిని సాధించి

కొన నెంచియున్నారు. ఇట్టి వీరిమాట వినకపోయినను బాధలేదు. వీరి చెడ్డతలంపు నీకుఁ దెలియదయ్యెఁగదా. రఘువంశమునఁబుట్టిన యో నృపాలా! దశరథుఁడు కైకేయికి వరము లొసఁగినది యిప్పుడు గాదు. ఆ వరము లొసంగుట వాస్తవమైనచో దానిని నింతవఱకు దశరథుఁ డీయకుండునా? కైకేయి యడుగకయుండునా? ఇంతవఱ కాప్రస్తాపమే లేక యిప్పు డీ వరముల నడుగుట కిదియే తరుణమా? ఇప్పుడు కైకేయి యడిగినవరంబుల నాలోచించుచుండఁగా, వీ రిద్దఱు ముందుగా నిట్లు చేయుదమని యాలోచించి చేసిన ట్లున్నది. అట్లు వారు ముందుగా నాలోచింపనియెడల, దశరథుఁ డెన్నఁడో యిచ్చినవరంబును గైకేయి యడుగకయుండదు. ధర్మజ్ఞుఁడగు దశరథుఁ డీయకయుండఁడు. గావున నిప్పుడు కైకేయి యడిగిన వరంబులఁ జూడ నిది వీ రిద్దఱు గలిసి చేసిన కృత్రిమ మని తోఁచుచున్నది. ఓ శూరుఁడా, నీకుఁ గాక మఱియొక్క నికిఁ బట్టాభిషేకముసేయుట లోకసమ్మతము గాదు. అట్టి కార్యము దశరథ కైకేయులు చేయఁబూనుదురేని, నే నెంతమాత్రము దానికి సమ్మతింపను. ఆ విషయమునమాత్రము నీవు నన్ను మన్నింపవలయును. ఎక్కువ బుద్ధిగలవాఁడా నీవు తండ్రిమాట దాఁటరా దను నొకధర్మము నవలంబించితివి. ఆ ధర్మముచేతనే మునుపు పట్టాభిషేకము చేసికొనవలె నని యున్న బుద్ధి నీకు మాఱినది. ఆ ధర్మముచేతనే నీవు తండ్రిమాట వినకున్నఁ బ్రత్యవాయము గలుగు నని మోహము నొందియున్నావు. ఆ ధర్మము నాకెంతయు సమ్మతముగా నుండలేదు. నీవు కార్యములందు నేర్పరివి. తండ్రి యాఁడుదియగు కైకేయి వలలోఁ జిక్కి చెప్పినమాట యది. ఆ మాట న్యాయమార్గము దప్పినది. జనులచే మిక్కిలి దూషితమైనది. అట్టి మాటను విని యా ప్రకారము నడచుకొనుటకుఁ బూనుచున్నావు. నీ వామాటను లక్ష్యముసేయక నీ పరాక్రమముఁ జూపవలెనుగాని, నీవు రాజ్యము విడిచి యడవికిఁ జనుట యుక్తముకాదు. నీ పట్టాభిషేకమును నిలిపి, భరతునికిఁ బట్టాభిషేకంబు జరుపవలయు ననియు, నిన్నుఁ గానలకుఁ బంపవలయు ననియు వారు చేసిన కృత్రిమమును నీ వెఱుఁగక యా ప్రకారంబు నడచుకొందువేని, నాకు వ్యసనము గలుగును. ధర్మలోపమును వాటిల్లును. కాముకులై, నీ కెప్పుడు గీడు

రోయుచుండు తల్లిదండ్రు లనుపేరుగల యీ శత్రువులు కోరిన కోరి
కను నీవు మనసుననైన నెట్లు తలంపవచ్చును. వారికి నీ విషయమున
నిట్టి తలంపు గలుగుట దైవాధీనమని నీ వుపేక్షయున్నను, నా కిది సమ్మ
తముగాఁ దోఁపలేదు. ధైర్య శౌర్యములు లేనివాఁడు, దైవసాహాయ్య
మున్నయెడల బను లనుకూలించునని దైవముం గూర్చి తల్లడిల్లుచుండును.
చక్కని యాలోచనగల శూరులు తమ ప్రయత్నములచేఁ గార్యములను
సాధింతురుగాని, దైవమును నమ్మియుండరు. ఎవఁడు తన పురుష ప్రయ
త్నముచే దైవమును బడఁగొట్టఁ జాలఁడో, వాఁడు దైవమును నమ్మి తన
కార్యముఁ జెఱచుకొని నశింపఁడు. జనులందఱిప్పుడు కూడి దైవబల
మెక్కువయో, పురుషప్రయత్నము గొప్పదో చూడఁగలరు. దైవబల
మానుషప్రయత్నములయొక్క తారతమ్య మిప్పుడు వెల్లడిగాఁగలదు.
ఏ దైవమిప్పుడు నీ పట్టాభిషేకంబుఁ జెఱచినదో, యీ దైవమును నా
ప్రయత్నముచేఁ బడఁగొట్టెదను. లోకులు చూతురుగాక. అంకుశము
నకు లోఁబడనిదియు, గొలుసు త్రెంచుకొన్నదియు, మదముచేఁ గలిగిన
బలిమిచే గర్వించియుండునదియు నైన యేనుఁగును మావటీఁడువోలె
నడ్డులేక పాఱుచుండు దైవమును నేను బురుషప్రత్నముచే మఱ
లించెదను. లోకపాలు రందఱు గూడివచ్చినను నీపట్టాభిషేకమును నిలుప
జాలరు. ముల్లోకములవారు గూడి వచ్చినను దీనిని బడఁగొట్టఁజాలరు,
అట్లుండ ముసలివాఁడగు తండ్రియొక్కఁడు మాత్ర మెట్లు నిలుపఁ
జాలును? నృపాలా! యెవ రేకతమునఁ గూడి నీ కరణ్యవాసము నిశ్చ
యించిరో, వారందఱు నా ప్రతాపమునకు వెఱచి యడవులందుఁ బదు
నాలుగేండ్లు నివసింపఁగలరు. తన వాక్యము చెల్లింపవలె ననెడి తండ్రి
యొక్క యాశను, నీయొక్క పట్టాభిషేకంబును నిలిపి, తన కొడుకగు
భరతునకుఁ బట్టము గట్టుకొనవలెనని యున్న కైకేయి దురాశను జెడఁ
గొట్టెదను. దైవానుకూల్య మున్నప్పుడు నీవు వారినేమి చేయుదు
వందువేమో! నాతోఁ బగగొన్నవానికి దైవబల మనుకూలముగ
నున్నను, నా బలిమిచే దుఃఖము గలిగించునదియును, నా పౌరుష మెంత
బలిమిగలదో, దైవంబంత బలిమిగలది గాదు. నీవు వేయిసంవత్సరములు
రాజ్యముఁ బాలించి, యరణ్యమున కేఁగుదువేని, పిదప నీ పుత్రులు

రాజ్యపరిపాలనము సేయఁగలరు కాని భరతునకు రాజ్యము రానేరదు. తొల్లి రాజర్షులందఱు తమకు శక్తి యున్నంతవఱకు రాజ్యపరిపాలనము గావించి, తమకు బలిమి యుడిగినప్పుడు, కొడుకులను బిలిచి, "కొడుకులారా! మీరు మీ కొడుకులనుబోలె రాజ్యమందలి జనులను బ్రేమతోఁ బోషింపుఁడీ" యని వారితోఁ జెప్పి, పిదప నరణ్యములకుఁ జనిరి. ధర్మస్వరూపుండవగు రాజేంద్రా! నృపాలుఁడు ముసలివాఁడు గనుక మనసు దప్పియున్నాఁడు గావున ఓశూరుఁడా! నీవు రాజ్యమునందుఁ గలహములు పుట్టునని యెంచి రాజ్యమును నీవశము చేసికొన నొల్లవేని, శూరుఁడనైన నేను నీకు బాసటనైయుండుదును, నీకే భయమును గలుగదు. అట్లు నీ రాజ్యాధిపత్యమునకు భంగము గలుగునేని, "నేను వీరలోకంబులఁ బొందను" అని పంతము చేసెదను. అట్లు రాజ్యము నీ స్వాధీనంబు సేయుటయే కాక, పిమ్మటఁ గూడఁ జెలియలికట్ట సముద్రముఁ గాపాడునట్లు నీ రాజ్యమును గాపాడుచుందును. కావున నీ రాజ్యంబున నెట్టి యల్లకల్లోలములుం బుట్టవు. నీవు వసిష్ఠుఁడు మొదలగు ఋషులమూలమునఁ బట్టాభిషేకంబును జేయించికొని, రాజ్యపాలనమునం దాసక్తిగలిగియుండుము. నే నొక్కఁడనే నీ పైకి వచ్చెడి రాజులనందఱను నా బలిమిచే నడ్డగింపఁజాలుదును. ఈ నా చేతులు రెండును, విల్లును నాకు వేడుకకై యున్నవి గావు. నేను శత్రువులపై బాణములఁ బ్రయోగించు నిమిత్తమే చేతులను, బాణములను సంధించుటకు విల్లు పూనియున్నాను. కత్తి శత్రుశిరముల నఱకుటకే కాని, నడుమునకుఁ గట్టుకొనుటకుఁగాదు. అట్లే బాణములును శత్రువుల మీఁద నేయుటకేకాని, గుంజలవలె నిలఁబెట్టియుండుటకుఁగాదు. నాకుఁ జేతులు, ధనుస్సు, బాణములు, ఖడ్గము నను నాలుగు గలిగియుండుట శత్రువినాశము నిమిత్తమేకాని వేఱొక పని నిమిత్తముగాదు. ఎవఁడు నాకు శత్రువో, వానిపైఁ గడుఁ గోపము గలిగియుందును. పదునైన యంచులుగలిగి, మెఱుపువలె మెఱయుచుండాలు గల బాకును దూసి చేతఁ బట్టి వజ్రాయుధముఁ దాల్చిన యింద్రునైనను లక్ష్యపెట్టక సంహరింతును. శత్రువులు సైన్యములతోఁ గూడివచ్చి న న్నడ్డగింతురేని, పుడమి యెల్ల ఖడ్గముచేఁ దుత్తునియలు సేయఁబడిన యేనుఁగులయు, గుఱ్ఱము

లయు, మనుష్యులయుఁ జేతులు కాళ్లు మొండెములు మొదలగు వానితో నిండినవై, చీకట్లు గ్రమ్మి, యడుగిడుటకుఁగూడ దావు లేకుండు నట్లు చేయుదును. మఱియు, నేనుఁగులును నా కత్తిచేఁ బొడుపఁబడినవై, వెలుఁగుచున్న పర్వతములంబోలిన వగుచు, మెఱపులతోఁగూడిన మబ్బులమాడ్కి నేలపైఁ బడఁగలవు. నేను వ్రేళ్లకు రక్షకమగు నుడుము తోలుకవచమును దొడిగి, విల్లు చేతఁబట్టి, ముందునిలిచినయెడల, నేను మగవాఁడనని యెవఁడు దిగులు లేకుండ ముందుకు వచ్చి నిలఁబడఁ గలఁడు. అందఱు వెఱచి పరుగిడుదురుగాని యొక్కఁడును నిలువఁ జాలఁడు. బలవంతుని ననేక బాణంబులనేసి పడఁగొట్టుచు, సామాన్యులను బలువుర నొక్క బాణముచేతనే పడవేయుచు, భటులయు, గుఱ్ఱము లయు, నేనుఁగులయు మర్మస్థలంబులఁ గొట్టుచు, యుద్ధవిహారము నేసె దను. ప్రభువగు రాముఁడా! దశరథుని రాజ్యమునుండి తొలఁగించు టకును, నీకు రాజ్యము నొసఁగుటకును నా యస్త్రముల సామర్థ్యము జూపెదను. రామా! ఈ నా బాహువులు గంధము పూసికొనుటకును, బాహుపురులు దాల్చుటకును, ధనములను యాచకుల కొసఁగుటకును, స్నేహితులను గాపాడుటకును నేర్పడినవి. ఇట్టి నా బాహువు లిప్పుడు నీ పట్టాభిషేకమునకు విఘ్నమును జేయువారలను నివారింపఁజాలును. ఓరామా! నీకు మేలుగోరని శత్రు వెవ్వఁడో? వాని ప్రాణములను, కీర్తిని, చుట్టాలను, స్నేహితులను గూడఁ బరిమార్చెదను. ఓ రామా! యీ భూమండలమెల్ల నీ యధీన మెటులగునో యా ప్రకారము చేయ నానతిమ్ము. నేను నీకు దాసుఁడనుగాని, మఱొక్కఁడనుగాను” అని లక్ష్మణుం డతికోపముతో రామునిఁగూర్చి చెప్పెను.

రాముఁడు లక్ష్మణుఁడు వ్యసనముతోఁ జెప్పిన పలుకులు విని, యాతని కన్నీరుదుడిచి, పలుమా ఱూరడించి, “లక్ష్మణా! నీ నెమ్మదిని నెఱుఁగుదును. నీవదేల యింత యాగ్రహము నొందితివి. నీ వెన్ని చెప్పినను సరే నేను తండ్రిమాట మీఱఁజాల” నని దృఢముగా నెఱుఁ గుము. మానవులకుఁ దండ్రిమాట మీఱకుండుటయె యుత్తమ మార్గ మని తెలియు” మని చెప్పెను.

## 24-వ సర్గము

### కౌసల్యాదేవి రాముని వనవాసంబు నంగీకరించుట

రాముఁడు తండ్రియొక్క యానతిని నెఱవేర్చుటయందే పట్టుదల గలిగియుండుటను జూచి, కౌసల్య కన్నీరు గ్రుక్కుకొని గద్గదస్వరముతో ధర్మయుక్తమగు నీ మాటఁ జెప్పెను.

“ఓ రామా! దశరథమహీపాలునివలనఁ బట్టంపుదేవియగు నాయందుఁ బుట్టితివి. నీవు పుట్టినది మొదలు గష్టమెట్టిదో యెఱుఁగకుంటివి. నీవును ధర్మము దప్పని స్వభావముగలవాఁడవు. సకలజంతువులకును బ్రియంబులగు పలుకులు పలుకువాఁడవు. ఇట్టి రాముఁ డెట్లు నేలమీఁద రాలిన ధాన్యపుగింజలను నొక్కటొక్కటిగా నేరుకొని తన జీవనముఁ గడుపఁగలఁడు. తన బంటులును, పరిచారకులును సకలవిధసాధకములతోఁ గూడిన యన్నమును దినుచుండఁగా నీ రాముఁ డడవులలో దిక్కుమాలినవాఁడువోలె గడ్డలను పండ్లును నెట్లు దినుచుండఁగలఁడు? సకల గుణములుగలవాఁడగు ప్రియసుతుఁడైన రాముని నృపాలుఁ డడవులకుఁ బంపుచున్నాఁడనిన నెవ్వరైనను నమ్ముదురా? అట్లు నమ్మినతర్వాత నెవనికి గుండె దడ పుట్టకుండును? రామా! నీవు జనులకుఁ గోరఁదగినవాఁడవయినను, నే దైవము వలన నడవికిఁ బోవఁ దటస్థపడెనో, యా దైవము జనులనందఱిని ‘నీ విట్లు చేయు’ మని యానతిచ్చునది కావున నది మిక్కిలి బలిమిగలది. ఇది నిస్సంశయము. నిన్నుఁ జూడమిచేఁ నా దేహమునఁ బుట్టి, నిన్నుఁ జూడకుండుట యనెడు గాలిచే రాఁజి, యేడ్పు, దిగులు ననెడు సమిధలు, యేడ్పువలని కన్నీ రనెడి యాహుతులు చింతాబాష్పమనెడు విశేషమైన పొగయుఁ గలిగి, నిట్టూర్పులచే వృద్ధినొందు దుఃఖమనెడు నగ్ని వేసవియం దగ్నిహోత్రుఁడు పొదయందుఁ బ్రవేశించి, దహించునట్లు నిన్నుఁ బాసి యిచ్చట నొంటరిగానున్న నన్నుఁ గాల్చివేయఁగలదు. నాయనా! దూడపోవుచుండఁగా నావు దనదూడను వెంబడింపకుండునా? కావున నేను నిన్ను వెంబడించి వచ్చెద” నని కౌసల్య వ్యసనముతోఁ బలికిన పలుకులు విని, పురుషశ్రేష్ఠుఁడైన రాముఁడు కడుఁ జింతనొందియున్న తల్లినిజూచి “ఓ తల్లీ, నృపాలుఁడు కైకేయిచే మోస

పుచ్చఁబడినవాఁడు. నేనును నడవికిఁబోయి, నీవును నతనిని విడిచివత్తు వేని, యతఁడు చాలా కాలము జీవింపఁడు. మగని నెడఁబాసియుండుట మగువలకు దగని యకార్యము, కావున మనసునందైనను దలఁపఁగూడని యీ కార్యము నీవు చేయరాదు. లోకాధిపుఁడయిన నా తండ్రి బ్రతికి యున్నంతదనుక నీవు శుశ్రూష సల్పుచుండుము. అదియె మగువలకు శాశ్వతమైన ధర్మము" అని చెప్పెను.

మంగళకరమైన దర్శనముగల కౌసల్య రాముని వాక్యమును విని సంతసించి, యొరులకు సుఖమ్ముఁగలిగించు రామునిఁజూచి, "నాయనా నీవు చెప్పిన చొప్పుననే నడచుకొందు" నని చెప్పెను. ధర్మమును బోషించు వారిలో నుత్తముఁడగు రాముఁడు మఱల మిక్కిలి వగలపాలయిన కౌస ల్యనుజూచి, "తల్లీ! తండ్రి చెప్పెడు మాట నేనుమాత్రమే కాదు; నీవు నాలకింపవలసినదే. దశరథుఁడు జనులనందరిం బోషించువాఁడు; గురువు; ఉత్తముఁడు; అందరికిఁ బ్రభువు; సకల కార్యనిర్వాహకుఁడు. ఈ పదు నాలుగేండ్లు అడవులందు దిరిగి పితృవాక్యపరిపాలనగాఁ గడు తనివి నొంది, మఱలివచ్చి నీ యిష్టప్రకార ముండెదను" అని కౌసల్యతోఁ జెప్పెను.

రాముని పలుకులు విని పుత్రవాత్సల్యముగలదై, కన్నీరు విడుచుచు మనమున మిగుల వగచి, తన ముద్దుల కొడుకును జూచి "రామా! నేను సవతులనడుమ నుండఁజాలను గావున నన్నుఁగూడ నీ వెంటఁ దీసికొనిపొమ్ము. కాకుత్స్థా! తండ్రి మాటయందలి గౌరవమునం జేసి నీ వడవికిఁ బోవఁ దలంచితివేని వనంబునఁ బుట్టిన యాఁడుజింకనువలె నన్నును బిలిచికొనిపొమ్ము. నేను నడవులందు హరిణాంగనవోలె సంత సముతోఁ దిరుగుచు నీ కే శ్రమయుఁ గలిగింప కుండెదను" అని చెప్పి గొల్లున నేడ్చుచున్న తల్లినిగని, రాముఁడు తానును నేడ్చుచు "తల్లీ! యాఁడుదానికి బ్రతికియున్నంతదనుకను భర్తయే దైవము, భర్తయే రక్ష కుఁడు. కావున మఱొక్కని నాశ్రయింపఁజనదు. ఇప్పుడు దశరథనృపా లుఁడు నాకును నీకును బ్రభువు. కావున నతని యాజ్ఞకులోఁబడి మనము నడచుకొనవలయును. లోకములకెల్లఁ బ్రభువయి బుద్ధిచాతుర్యము గల దశరథనృపాలుఁడు మనకుఁ గాపుదలయై యుండ మనము దిక్కులేని

వారముగాముగదా! నీవు నాథుఁడు లేనిదానవుగావుగదా. నీ వనాథ
వలె నేల భయపడెదవు? నీకు సవతులవలని భయమును లేదు. భరతుఁ
డును ధర్మస్వభావముగలవాఁడు, సకల భూతములందును బ్రేమగలిగి
వారి కిష్టములగుమాటలఁ జెప్పువాఁడు. కావున నతఁడు నీపైఁ
బ్రేమయు భక్తియుఁగలిగి, యెల్లప్పుడు నిన్నుఁ గొల్చుచుండును. అతఁ
డొక్కరి దుర్బోధనలకు లోఁబడి యపకారము చేయువాఁడుకాఁడు.
అతఁడు సర్వదా ధర్మమం దాస్థగలవాఁడు గావున, ని న్ననుసరించి
యుండును. నే నడవికిఁ బోయిన పిదప దశరథుఁడు పుత్రు నెడఁ
బాయుటవలన దుఃఖముచేత నాయాసము నొందకుండునట్లు కొంచె
మయినను నేమఱుపాటులేక మంచిమాటలఁ జెప్పుచు నుపచారము
సల్పుచుండుము. ఈయోర్వరాని పుత్రవియోగశోకముచే దశర
థుఁడు వినాశముఁనొందకుండునట్లు, నీ వెల్లప్పుడు జాగరూకురాలవై
యాతనికి మేలగు పనులను జేయుచుండుము. ఆఁడుది సకల సుగుణ
ములుగలదై, యెల్లప్పుడు నోములు నోచుచు నుపవాసములు సల్పుచు
నున్నను, భర్తృశుశ్రూష సేయకుండినయెడల, నరకములం బడునే
కాని, యుత్తమలోకముల నొందఁజాలదు. పెద్దలకు మ్రొక్కక, దేవ
పూజలు చేయక యున్నను పెనిమిటికి శుశ్రూషచేయుచున్న యాఁడుది
యుత్తమలోకమును బొందును. కావున యాఁడుది యెల్లప్పుడు పెనిమిటికి
శుశ్రూషసేయుచుఁ బెనిమిటి మనస్సున కిష్టమయినవియు, మేలుగావించు
నవియునైన పనులను జేయుచుండవలెను. ఈధర్మమే లోకమునందు
వాడుకయైయున్నది; వేదములందును జెప్పఁబడియున్నది. ధర్మశాస్త్రము
లును వేదముల కనుకూలముగనే వాక్రుచ్చుచున్నవి. ఓ తల్లీ! నేను
వచ్చునంత దనుకను నా మేలుకై యగ్నిహోత్రములందు హోమములు
చేయుచుండవలయు; దేవతలకు బుష్పములతోఁ బూజలు సల్పుచుండ
వలయు, నియమముఁగల బ్రాహ్మణోత్తములను దానములతో సంతోష
పఱచుచుండవలయు. ఇవ్విధమున నీవు నాయొక్క రాకను
నెదురు చూచుచు మనసు నణఁచుకొని, మద్యమాంసాదులను
వర్జించి, శాకములతోఁగూడిన యాహారముఁ గుడుచుచు,

భర్తృశుశ్రూషయందే యాసక్తి కలిగియుండుము. నేనును వన వాసము పూర్తిచేసి వచ్చునప్పటికి, ధర్మపోషకులలో నుత్తముఁడగు దశరథనృపాలుఁడు బ్రతికియుండునేని, నీవు కోరిన కోరికల నొందఁ గలవు" అని తల్లికి నోదార్పుమాటలఁ జెప్పెను. కౌసల్యయు రాముఁ డివ్విధమునఁ జెప్పిన పలుకులు విని కన్నీటిచే నిండినచూపులుగలదై, పుత్రు నెడఁబాటునకు మనమున వగచి, రామునింజూచి, "శూరీ నా బిడ్డఁడా! నీ వడవి కేఁగవలసినది' యని యొకటె పట్టు పట్టినావు. నీవు పట్టినపట్టు నేను మార్పఁజాలను. విధి యెవరికిని దప్పింపఁ దరము గాదు. ఓ శూరుఁడా! యెవని కేవేళ నేదివచ్చిన, వాఁడా వేళలో దాని ననుభవించి తీరవలసినది. ఇది నిజము. ఓ కుమారా! నీవు స్థిరుఁడవై యడవికిఁబొమ్ము. ఓ సమర్థుఁడా! నీ కెల్లప్పుడు మేలుగలుగునుగాక! నీవు మఱలి వచ్చినపిదప నా కష్టములన్నియుఁ బాయును. మహాసమర్థుఁడ వయిన నీవు తండ్రి మాటప్రకారముగ వనవాసవ్రతము ముగించి, కృతార్థుఁడవై వచ్చి, తండ్రి ఋణంబుఁ దీర్చుకొనినవాఁడవు కాఁగానే నధిక సౌఖ్యము నొందఁగలను. నే నింతదూరము చెప్పినను నామాటను గాలదన్ని పోవుచున్నావు. ఇదివఱ కెన్నఁడయిన నిట్లు నడచికొని యుందువా? ఇప్పుడు నీ విట్లు నామాట వినకపోవుటకుఁ గారణము దైవ బలమే కాని వేఱొక్కటి కాదు. ఆదైవముయొక్క పోకడ యిట్టిదని యెవ్వరికి నెప్పటికిని దెలియదు. పొడవు చేతులవాఁడా! నీ విప్పుడు వనమున కేఁగి మఱల క్షేమముతో నేతెంచి మనోహరములగు మంచి మాటలతో నన్ను సంతోషపఱపఁగలవు. ఓ నాయనా! జడలనుదాల్చి నారబట్టలను గట్టుకొని వనవాసమునుండి మఱలివచ్చిన నిన్నుఁ జూతునో లేదో! ఆకాల మిప్పుడేవచ్చిన నాకు సంతోషప్రదముగా నుండును" అని వనవాసమునందు మనస్సును దృఢపఱచికొనియుండు రామునిఁ గౌసల్య మంచి మనస్సుతోఁ జూచి, సర్వలక్షణములతోఁ గూడిన యా రామునితో నిట్లు పలికి, యాతనికి మంగళాశీర్వాదములు సేయఁగోరిన దాయెను.

## 25-వ సర్గము

### కౌసల్య రామునకు మంగళాశీర్వాదములు చేయుట

గొప్ప మనస్సుగలదగు కౌసల్య పుత్రు నెడఁబాయుటవలనఁ గలుగఁబోవు దుఃఖమువిడిచి, కన్నీరువిడుచుటవలని మైలఁ దొలఁగించుకొనుటకై యాచమనము చేసి, పరిశుద్ధురాలై యీ క్రిందివిధమున మంగళాశీర్వాదములను జేసెను.

“రఘువంశమునఁ బుట్టిన నృపాలురలో శ్రేష్ఠుఁడా! నే నెంత చెప్పినను నిన్నరణ్యమునకుఁ బోవకుండఁ జేయఁజాల నైతిని. నీ యిష్టము చొప్పున నిప్పుడు వనమునకుఁ బోయిరమ్ము. అచ్చట నుండవలసినంత కాలముండి, యా సమయము తీరినవెంటనే బయలుదేఱిరమ్ము. సత్పురుషుల మార్గముననే యుండుము. రఘువంశస్థులలో శ్రేష్ఠుఁడా! నీవు సంతసము గలిగినవాఁడవై, నియమముతో నే ధర్మమును గొంచెము కూడఁ దప్పక పాలించుచున్నావో, ఆ ధర్మము నిన్నుఁ గాపాడునుగాక! ఓ పుత్రుఁడా! నాలుగు దారులు గలియుచోట్లను, దేవళములందును నే యే దేవతలకును, వనంబులందుండు నే యే మునులకును మ్రొక్కుచున్నావో! ఆయా దేవతలును, మునులును నిన్నుఁ గాపాడుదురు గాక! బ్రహ్మజ్ఞానియగు విశ్వామిత్ర మునీంద్రుఁడు నీ కుపదేశించిన యన్ని యస్త్రములు సుగుణ సంపన్నుఁడ వయిన నిన్నెల్లప్పుడు కాపాడుచుండునుగాక! ఓ పొడవు చేతులుగల నాయనా! తల్లిదండ్రులకొనర్చిన శుశ్రూషయు, సత్యవాక్య పరిపాలనమును నిన్నన్ని యాపదల నుండి కాపాడునుగాక! సాధ్యులు, విశ్వదేవులు మరుత్తులు, మహర్షులు నీకు మేలుసేయుదురు గాక! పురుషశ్రేష్ఠుఁడవైన రాముఁడా, నీ వేఁగెడి యడవులందలి యాశ్రమములందుండు సమిధలు, కుశలు, పవిత్రములు, జన్నంపు వేదికలు, కోవెలలు, వింతలైన దేవపూజ సేయు చోట్లు, కొండలు, చెట్లు, మ్రాఁకులు, మడువులు, పక్షులు, సర్పములు, సింహములు నిన్నుఁ గాపాడునుగాక! సమస్త ప్రపంచమున కాధారభూతుఁడయిన విరాట్పురుషుఁడును, సృష్టికర్తయగు బ్రహ్మయు, పన్నిద్దఱు సూర్యులలోఁ జేరిన పూష, భగుఁడు, నర్యమ యనువారును నీకు మేలుచేయుదురుగాక! దేవేంద్రుఁడు మొదలగు లోకపాలు లందఱు

నీకు మేలుచేయుదురుగాక! వసంతము మొదలగు నాఱు ఋతువులు, శుక్లపక్ష కృష్ణపక్షములు, నెలలు, సంవత్సరములు, రాత్రులు, పగళ్లు, ముహూర్తములు మొదలగు కాలభేదము లెల్ల నెల్లప్పుడు నిన్ను రక్షించునుగాక! స్మృతి, ధృతి, ధర్మములు కష్టములేకుండ నీకు నిరంతరము రక్షణమొసఁగునుగాక! దేవసేనాధిపతియగు కుమారస్వామియుఁ, జంద్రుఁడును, బృహస్పతియు, సప్తర్షులును, నారదమునీంద్రుఁడును నన్ని కష్టములనుండి నిన్ను రక్షింతురుగాక! అన్ని విషయములందును గొఱఁత లేని యట్టి దిక్కులును, దిక్పాలురను, నాచేయు వేఁడికోలులచే సంతసించినవారలై వనవాసము చేయుచున్న నిన్నెప్పుడును గాపాడుచుందురుగాక! పర్వతము లన్నియు, సముద్రము లన్నియు, జలాధిపతి యగు వరుణుఁడును, స్వర్గము, ఆకాశము, భూమి, నదు లన్నియు, నక్షత్రములన్నియు, గ్రహములు, గ్రహదేవతలు, రాత్రియుఁ బగలును, ప్రాతస్సాయంసంధ్యాకాలములును వనవాసముననున్న నిన్ను రక్షించునుగాక! మహారణ్యమునందు మునివేసముతో నున్న జ్ఞానివైన నీకు దేవతలు, దైత్యులు నెల్లప్పుడు సౌఖ్యము నిచ్చువార లగుదురుగాక! ఓ నాయనా! ఘాతుకకార్యములఁ జేయునట్టి భీకరులైన రాక్షసులవలనను, పిశాచములవలనను, మాంసమును దినునట్టి క్రూరమృగములవలనను నీకు భయములేకుండును గాక! వానరములు, తేళ్లు, అడవి యీఁగలు, దోమలు, పాములు, పురుగులు మొదలగు విషజంతువులు నీవు సంచరించెడి యరణ్యములందు లేకుండునుగాక. ఉన్నను నీకు హానిచేయునవి గాకుండునుగాక! గొప్ప యేనుఁగులు, సింగములు, పులులు, ఎలుఁగుబంట్లు మొదలగు కోఱలుగల మృగములు, గొప్ప కొమ్ములుగల భయంకరములగు నడవి దున్నలు నీకు ద్రోహము సేయకుండును గాక! మఱియు మానవుల మాంసముఁ దినునట్టి యనేకములగు నితర ప్రాణు లిచ్చుటనే నొనర్చు పూజలఁగొని నీ జోలికి రాకుండును గాక! రామా నీకు దారులు శుభము లొసఁగునుగాక! నీ పరాక్రమము సాటిలేనిదై వెలయుచుండునుగాక! ఓ చిన్నకొడుకా! సకల సంపదలకై నీవు సేమముతో నడవికిఁ బోయి వత్తువుగాక! నీకు ఆకాశమందుఁ దిరుగు దేవతలును, పుడమియందుఁ దిరుగు దేవతలును, శత్రువులయినను

తెలియుచు నీకు మేలుసేయుదురుగాక! రామా! దండకారణ్యమున నున్నట్టి నిన్ను గురువు, చంద్రుఁడు, సూర్యుఁడు, కుబేరుఁడు, యముఁడును వారియొక్క పూజలను గొనుచు రక్షింతురుగాక!

రఘునందనా! అగ్ని, వాయువు, అగ్నిహోత్ర ధూమము (పొగ), ఋషుల నోటినుండి వచ్చిన మంత్రములును నీవు నదులలో స్నానము సేయునప్పుడు నిన్ను రక్షించునుగాక! సకల లోకాధిపతియు, సకల జంతువులను పోషించువాఁడును నగు బ్రహ్మయును, ఋషులందఱును తక్కిన దేవతలును వనవాసము చేయుచుండు నిన్ను రక్షింతురుగాక!" ఇట్లు రాముని దీవించి, కీర్తిమంతురాలును, విరివికన్నులుగలదియునైన కౌసల్య గంధ పుష్పాదులచే దేవతలందఱిని బూజించి, ఉచితములయిన స్తోత్రములతోఁ గొనియాడెను. మఱియు నగ్నిం బ్రణయించి, రాముని మంగళముకొఱకు మహాత్ముఁడగు బ్రాహ్మణునిచే శాస్త్రప్రకారముగా హోమము చేయించెను. ఉత్తమకాంతయగు కౌసల్య హోమము నిమిత్తము నేతిని, తెల్లని పూవులను, సమిధలను, తెల్లని యావాలను దెప్పించెను. అంతట నుపాధ్యాయుఁడు సకలరోగనివారణార్థమయి యగ్నిహోత్రునియందు హోమము చేయఁగా మిగిలిన హావిస్సుతో వెలుపల బలిం గావించెను. అంతట నుపాధ్యాయుఁడు తేనె, పెరుఁగు, అక్షతలు, నేయి మొదలగువానిని బ్రాహ్మణులకొసఁగి, స్వస్తి వాచనము చేయించెను. అంతటఁ గీర్తిమంతురాలయిన రాముని తల్లి యగు కౌసల్య యుపాధ్యాయుఁడగు నా బ్రాహ్మణోత్తమునకుఁ గోరిన దక్షిణయొసఁగి, రామునిఁజూచి "రామా! వృత్రాసురసంహారమప్పుడు, సకలదేవతలచే నమస్కరింపఁబడిన దేవేంద్రునికిఁ గలిగిన మంగళముఁవంటి మంగళము నీకుఁగలుగునుగాక! పూర్వము గరుత్మంతుఁడు తన తల్లియొక్క దాస్యము దొలఁగుటకై యమృతముఁ దెచ్చుటకు స్వర్గమునకుఁ బోవునప్పుడు తల్లియగు వినత చేసిన మంగళము నీకుఁ గలుగునుగాక! సముద్రము చిలుకునప్పుడు దైత్యులను సంహరించిన వజ్రాయుధపాణియగు దేవేంద్రునకు నదితిదేవి యొసఁగిన మంగళము నీకుఁ గలుగునుగాక! తొల్లి వామనరూపుండై బలిచక్రవర్తిని మూఁడడుగుల భూమిని యాచించి మూఁడడుగులచే ముల్లోకముల నాక్రమించిన మహాను

ఖాపుఁడగు విష్ణువునకుఁ గలిగిన మంగళము నీకుఁ గలుగుఁనుగాక! గొప్ప చేతులుగల యోరామా! మిక్కిలి మంగళకరములయిన ఋతువులు, సముద్రములు, ద్వీపములు, నాలుగు వేదములు, ముల్లోకములు, ఎనిమిది దిక్కులును మంగళముల ననేకముల నొసఁగుఁనుగాక! విశాల నేత్ర యగు కౌసల్య పుత్రున కిట్లనేకవిధములగు దీవనలుసల్పి శిరమున మంత్రాక్షతలు చల్లి, గంధముపూసి, తప్పక కార్యసిద్ధిని గలిగించు విశల్యకరణియను మూలికను (దేహమునఁ గ్రుచ్చుకొన్న బాణముల వేదనను పోఁగొట్టునట్టి మూలికను) రాముని హస్తమున రక్షకట్టి మంత్ర ములచే నభిమంత్రించెను. ఆ కౌసల్య దుఃఖములకుఁబాలయి, మనం బునఁగాక, నోటమాత్రము సంతోషపడిన దానివలెనయి, రాముని దలమూర్కొని, కౌఁగిటఁ జేర్చి, డగ్గుత్తికతోఁ గూడిన పలుకులతో రామునిఁగూర్చి, "రామా! వనమున నీకార్యమును నెఱవేర్చుకొన్న వాఁడవై, క్షేమముగా వచ్చి చేరుము. ఓ బిడ్డఁడా! నీవు ఆరోగ్య వంతుఁడవయి యున్నికార్యములు నెఱవేర్చుకొని, మఱలి యయోధ్యకు సుఖముగా నేతెంచి, రాజమార్గమయిన పట్టాభిషేకము నొంది జనపరి పాలనము సేయుచున్న నిన్నుఁ జూడఁ గోరుచున్నాను.

నీ రాక విన్నంతటనే పాఱిపోయిన దుఃఖములుగలదానను, సంత సముచే మెఱయుచున్న మోముగలదాననగుచు, ఉదయించిన పున్నమచందురునిమాడ్కి వనమునుండి యేతెంచిన నిన్నుఁ జూడఁగల దానను. రామా! వనవాసము ముగించి, తండ్రియొక్క యానతిని నెఱ వేర్చి యయోధ్య కేతెంచి, సింహాసనమున నున్న నిన్నుఁ జూడఁగలను. రామా! సకల శుభములతోఁ నీ వడవినుండి యేతెంచి, వెలయుచు నా యొక్కయు, నా కోడలియొక్కయుఁ గోరికలను బెంపొందింపుము. పోయిరమ్ము. రామా! దిక్కులు, పర్వతములు, ఈశ్వరుఁడు మొదలగు వేల్పులును, మహర్షులును నే నిప్పుడు చేయుపూజలకుఁ దనివినొంది, బహుకాలము వనవాసముసేయఁ బోవు నీకు మేలుగావింతురుగాక" అని కన్నీటితో నిండినకన్నులు గలదై, శాస్త్రవిధిచొప్పున దీవనలుసల్పి, ప్రదక్షిణముచేసి పలుమాఱు గట్టిగ నాలింగనము చేసికొనెను. అట్లు తల్లియగు కౌసల్య రక్షకొఱకుఁ బ్రదక్షిణము సేసిన పిదపఁ గీర్తివంతుఁ

డగు రాముఁడు పలుమారు తల్లిపాదములనుబట్టి మ్రొక్కి స్వకీయమైన కాంతితో వెలుఁగుచుఁ దన కాంతయగు సీతయొక్క యంతఃపురమునకుఁ బోయెను.

## 26-వ సర్గము

### సీత రాముని విన్నదనమునకుఁ గారణము నడుగుట

రాజపుత్త్రుఁడగు రాముఁడు కౌసల్య యెన్ని చెప్పినను దన తండ్రి యానతి మీఱరా దనియెడు నొక గొప్ప ధర్మమునందే యున్నవాఁడగుటంజేసి తల్లికి నమస్కరించి యడవికిఁ బయనమాయెను. కౌసల్యయు రామునియొక్క దృఢనిశ్చయమును జూచి యిఁకఁ దన పలుకులు పనికిరావని యెంచి యతని యభిప్రాయమున కియ్యకొని, యాతని కరణ్యవాసమున నేయపాయమును గలుగకుండునట్లు దీవనలు సల్పెను. అట్లు రాముఁడు కౌసల్య యనుమతివడసి జను లందఱిచేఁ గ్రిక్కిరిసి యున్న రాజమార్గమును దనకాంతిచేఁ వెలుఁగఁజేయుచు వచ్చుచుండెను. అప్పుడు రామునిసుగుణములనుగూర్చి జనులందఱు దమహృదయములం దానందము నొందుచుండిరి. పట్టాభిషేకము నిమిత్తము నియమముపూని యున్న సీతయు రాముని యరణ్యవాసమును, భరతుని పట్టాభిషేకము గూర్చిన సంగతిని యెఱుఁగకుండెను, గావున నామె తన కాంతుని యువరాజపట్టాభిషేకంబును గూర్చియె మనమునఁ దలపోయుచుండెను. అట్లు పట్టాభిషేకముంగూర్చి మనమునఁ దలపోయుచు, సీత తానే దేవపూజలు సల్పి, పట్టమహిషి చేయవలసిన కార్యముల నెల్ల నెఱింగినదియు, సంతోషభరితమగు మనస్సుగలదియు, రాజధర్మముల నెఱింగినదియు నైనందున, రాజపుత్త్రుఁడగు రాముని రాక కెదురుచూచుచుండెను. అప్పుడు రాముఁడు నే నీ సంగతి నెట్లు సీతతోఁ దెల్పుదునని సిగ్గుచేఁ దలవంచుకొన్నవాఁడై, సంతోషముతోఁ గలకలలాడుచుండుజనులు గలదియు పట్టాభిషేకమునిమిత్తము చక్కఁగా సింగారింపఁబడినదియు నైన తననగరు సొచ్చెను. అంతట సీతాదేవి తటాలున లేచి, గడగడవణఁకుచు, దుఃఖముచే నొచ్చి యింద్రియ విషయములందుఁ గలవరపడియున్న తన మగనిని జూచెను. అంత ధర్మమార్గము దప్పనివాఁడగు రాముఁడు తన ప్రియకాంతను జూచినంతటనే తన మనస్సుననున్న చింత నణఁచుకోఁజాలక, యా

దుఃఖమును బయలుపఱచెను. అప్పుడు సీత కళదప్పి, జోఱుచెమటలు గార్చుచు, దుఃఖము నాపుకొనఁజాలనివాఁడై యున్న తన కాంతుని జూచి, తానును మిక్కిలి వ్యసనమునొంది, "నాథా! యిప్పు డిది యేమి? ఓ రఘువంశోద్భవా! ఈ దినమేకదా బృహస్పతి దేవతగాఁగల సంపదలతోఁ గూడిన పుష్యమీనక్షత్రము. వేదవేదాంగపారంగతులగు పండితు లీ పుష్యమీనక్షత్రము మంచిదని తెలిపిరిగదా! అట్లుండఁగా నీవేల యిట్లు వ్యసనపడుచున్నావు? ఓ నాథా! నూఱు కమ్ములుగలిగి, నుఱుగుతో సమానమైయున్న తెల్లని ఛత్రముచే నీ యందమైన మోమును గప్పుకొనకున్నా వదేమి? చంద్రునివలెను, హంసవలెను దెల్లనై యున్న సొగసయిన చామరములతో నీ మోము విసరఁబడకున్న దేల? నేర్పరులైన వంది, సూత, మాగధులు సంతోషభరితులై శుభవచనములచే నిన్నుఁ బొగడ్తలు సేయకున్నారేల? నీకుఁ బట్టాభిషేకమప్పుడు వేదములఁ దుదముట్టఁ జదివిన బ్రాహ్మణోత్తములు పరిశుద్ధుఁడవయిన నీయొక్క శిరస్సునందు యథావిధిగాఁ దేనెను పెరుఁగును నుంచలేదు, దీని కేమి కారణము? మంత్రులందఱును వీథులలో ముఖ్యులయినవారును, పట్టణవాసులును, గ్రామవాసులును, సొగసుచేసికొని నీవెంట రాలేదే? కారణమేమి? బంగారు భూషణములచే నలంకరింపఁబడిన నాలుగు వడిగల గుఱ్ఱములు పూన్చిన శ్రేష్ఠమయిన పుష్యరథంబు నీముందుఁ బోవకున్న దేల? ఓ శూరుఁడా! శుభలక్షణములుగలదై, నల్లని మేఘమువలెను, నల్లని పర్వతము చాడ్పునను వెలుఁగుచున్న యందమైన యేనుఁగు నీ ముందటఁ గనఁబడకున్న దేమి? చూచువారి కింపుగొలుపు నో రాముఁడా! బంగారుతాపి నాశ్చర్యకరముగనున్న సింహాసనమును ముందుగ నిడుకొని జనులు నీ కుత్సవము జరుపరేల? పట్టాభిషేకమున నుండవలసినంత మోము నందము గనఁబడదు! సంతసమును లేకున్నట్లున్నది. ఏమి కారణము?" అని యనేకవిధములుగ నడిగి విలాపము చేయఁదొడఁగెను.

అట్లు విలపించుచుండు సీతనుజూచి, రాముఁ డిట్లనియె. "ఓ సీతా! మా తండ్రిగారు నన్నుఁ గానలకుఁ బొమ్మనుచున్నవారు. గొప్ప కులమునఁబుట్టి, ధర్మముల నెఱిఁగి, యా ధర్మముల ప్రకారము నడుచు కొనుదానా, జనకమహారాజు కూఁతురా, నా కీ వనవాసము ప్రాప్త

మగుటకుఁ గారణము చెప్పెద నాలకింపుము. తండ్రియగు దశరథుఁడు ఆడినమాట దప్పఁగూడదు అను నియమముగలవాఁడుగదా! అట్టి నరపతి నా తల్లియగు కైకేయికిఁ బూర్వ మొకప్పుడు రెండు గొప్పవరముల నొసఁగెను. ఇప్పుడు తండ్రియానతివలనఁ బట్టాభిషేకప్రయత్నము సాగుచుండఁగాఁ గైకేయి తనకు ముందొసఁగిన రెండువరముల నిప్పు డీయుమని యడిగెను. తండ్రి ముందు వరములఁ దానొసఁగినదానింబట్టి, యామెకు వరము లొసఁగుటకు లోఁబడెను. ఆమె నన్నుఁ బదునాలుగేం డ్లరణ్యవాసమునకుఁ బంపుటకును, భరతునికి యువరాజపట్టాభిషేకము జరిపించుటకును గోరెను. కావున నేను నిర్మానుష్యమైన యరణ్యమునకుఁ బోవ వెడలి నిన్నుఁ జూచిపోవ వచ్చితిని. నీవు నే నడవులకుఁ బోయిన పిదప భరతునికడ నివసించుచు, నెప్పటికిని నా గుణములను బొగడకుము. శ్రీమంతులగు పురుషులు పరుల పొగడ్తల నోర్వరు. కావున నీ వెప్పుడును భరతుని ముందట నా గుణములఁ బొగడకుము. నిన్ను బంధు మర్యాదగా నతఁడు పోషింపవలసినదియె కాని యవశ్యముగాఁ బోషింప వలసినదిలేదు. కావున నీ వతని ననుసరించియుండిననే నీ విచ్చట జీవితము గడపవచ్చును. దశరథుఁడు శాశ్వతమయిన యౌవరాజ్యపట్టము నా భరతున కొసఁగెను. నీవు భరతునకును, ముఖ్యముగా నృపాలునికిని మనస్సంతోషమును గలిగింపుచుండుము. నేనును దండ్రియాజ్ఞను నెరవేర్ప నడవి కిప్పుడే యేఁగెదను. నీవు గొప్పమనసును, ధైర్యమును గలిగియుండుము. ఓ ఒచ్చెములేనిదానా! ఓ సొంపయినదానా! నేను సకల మునులుండెడి యడవులకేఁగిన పదంపడి, నీవు నోములు నోచుచు నొక్కప్రొద్దులుండవలయును. నీవు దినదినము వేఁకువనులేచి, యథా విధిగా దేవతలకుఁ బూజలు సల్పి, మా తండ్రియగు దశరథనృపాలునికి నమస్కారము చేయుచుండుము. నాతల్లియగు కౌసల్య ముదుసలిది; నా వియోగదుఃఖముచే నొచ్చినది. కావున నామె దుఃఖము పాయునట్లు నీవు ధర్మము నవలంబించి, ప్రతిదినమును శుశ్రూష చేయుచుండుము. నా తల్లులందఱు నాయం దొకేవిధమైనప్రేమయుఁ, జెలిమియు, రక్షణముం గలవారు గావున నీవు వారికి నందఱికి శుశ్రూషలు సల్పుచుండుము. భరతశత్రుఘ్ను లిద్దఱు నాకుఁ బ్రాణములకంటె మించినవారు గావున,

నీవును వారిని దోఁబుట్టువులంబోలెను, కొడుకులంబోలెను, జూచుకొను చుండవలసినది. అదియుఁగాక నీ వెల్లప్పుడును భరతున కిష్టముగాని పనులు చేయకుము. అతఁడు మన దేశమునకు మనవంశమునకును ప్రభువును రాజునుగదా ?

జనులు మంచి నడవడిగల్గి, పూనికతో దాపుననుండి కొల్వు గొల్చుచుండినయెడల రాజులు దయ గలిగియుందురు. అట్లుగాక, వారి కెగ్గులుసేయుచు, వారి నాశ్రయింపకున్నయెడలఁ గోపముగల్గియుందురు. రాజులు తమ కడుపునఁబుట్టిన బిడ్డలనైనను తమకుఁ గీడు రోయువారిని విడిచిపెట్టుదురు. ఇతరులనైనను దమ మేలుఁగోరువారిని దమకడఁ జేర్చు కొందురు. కావున ఓ కల్యాణీ! నీవును స్వధర్మమునం దాసక్తి గలిగి, సత్యమునే ముఖ్యవ్రతంబుగా నవలంబించి యిచ్చటనే భరతు ననుసరించి యుండుము. ఓ చెలీ, నేను గొప్ప యడవులకుఁ బోయెదను. ఓ భామా, నీ విచ్చటనే యుండవలసినది. ఎల్లరకును సమ్మతముగునట్లు నీవు నా మాటవిని నేను జెప్పినట్లు నడచుకొనుచుండుము" అని రాముఁడు సీతతోఁ జెప్పెను.

## 27-వ సర్గము

### సీత అడవికి వచ్చెదనని రామునితోఁ జెప్పుట

సంతోషవాక్యములు పలుకఁదగినదియుఁ, బరులమనసుల కింపయిన పలుకులు పలుకునదియునైన సీత మగఁడు పలికిన పలుకులు విని ప్రణయ కోపముతో, మగనికి నిట్లనియె. "ఓ రాజేంద్ర పుత్త్రుఁడా! రామా! నన్నుఁ జులకనచేసి, యేల యిట్లు పరియాచకములాడుచున్నావు. ఇదేమి వింత! ఇంతకును నీవిప్పు డిట్టిపలుకులు పలుకఁగాఁ దలిదండ్రులు విని నదిలేదే. ఓ నాథా! (యార్యపుత్రా,) లోకమున తోఁబుట్టువులు, కొడుకులు, కోడండ్రు తమ పుణ్యఫలములను తా మనుభవించు చున్నారు. పురుషశ్రేష్ఠుఁడా! పైఁ జెప్పినవారివలెఁగాక, భార్య యొక్కతె మాత్రము తన పెనిమిటియొక్క పుణ్యాపాపరూపములయిన కర్మఫలముల ననుభవించుచున్నది. కావున నీ కీయఁబడిన యీయానతిచే నేనును అడవియందుండవలసిన దానను. ఇహాపరలోకములు రెండింటి యందును మగువకుఁ బతియొక్కఁడె యెల్లపుడు గతిగాని, తండ్రి

గాఁడు. కొడుకును గాఁడు. తల్లి గాదు, చెలికత్తెలుగారు. తనకుఁ దానును గతిగాదు. రఘువంశోద్భవా, నీ విప్పుడు చొఱరాని యడవులకుఁ బోదువేని, నేను నీ మున్నుగ దర్భముండ్లను గాలితోఁ ద్రొక్కుచుఁ బోయెదను. నీవు నా వెనుక వచ్చుచుందువేని, నీ కాలియందు ముండ్లు గ్రుచ్చుకొనవు. ఓ శూరుఁడా! నీవు పరాక్రమవంతుఁడవు. నీ కెచ్చటను భయంబులేదు. నీవు నాయందు విశ్వాసముంచి "నామాట వినక, పుణ్యమును పంచుకొన నాతోడ నరణ్యమునకు వచ్చెదనని చెప్పుచున్నదే" యనెడి యీర్ష్యను "నా మాట మీఱుచున్నదే" యనెడు కోపమును ద్రాఁగఁగా మిగిలిన నీటిని బాఱఁబోయునట్లు విడిచి, శంక మాని నన్నుఁగూడఁ గొనిపొమ్ము. నాయం దెట్టి యపరాధమును లేదు. మేడలపైనఁ గూర్చుండుటకంటెను, విమానములమీఁద సంచరించుటకంటెను, ఆకాశమునఁ దిరుగుటకంటెను, నన్ని యిడుమలం బడుచుఁ బెనిమిటి యడుగున నడుగుపెట్టుచుఁ బోవుటయే మేలు. తల్లియుఁ దండ్రియు నన్నుఁ బలుతెఱఁగులుగా శిక్షించి, యన్ని విషయంబుల నేర్పియున్నారు. కావున నే నెవ్వరివిషయమున నెట్లు నడచుకొనవలయునో, యా విషయము నిప్పుడు నేర్చుకొనవలసినది యక్కఱలేదు. జనసంచారములేక, నానావిధములగు మృగముల గుంపులతో నిండి, పులులతోడను, తోడేళ్లతోడను గూడియున్న చొఱరాని యడవులకుఁ బోయెదను. ముల్లోకములనైనను లెక్కింపక, పెనిమిటి నియమమువంటి నియమము గలదాననై యడవియందుఁ దండ్రి యింటియందువలెనే సుఖముగ నుండెదను. ఓ శూరుఁడా! నేను సర్వదా శుశ్రూష చేయుచు, బరిశుద్ధురాలినై, బ్రహ్మచర్య వ్రతమువూని, పూఁదేనె తావిగల యడవులందు నీతోడఁ గ్రీడింపుచుండెదను. మానరక్షకుఁడా! నీవు అడవిని యితరజనములనైనను బరిపాలింపఁజాలుదువు. అట్లుండఁగా, ప్రియురాలనైన నన్నొక్కతెను గాపాడఁజాలుదువను విషయమున నేమి సందియము? నే నిప్పుడే నీతోడ నడవికి వచ్చెదను, దీనికి సంశయమువలదు. మహానుభావా, నేను నీ వెంబడివచ్చుటకుఁ బూనితిని. ఇఁక నీవెన్ని చెప్పినను నా తలంపు మఱలింప నలవికాదు. "అచ్చట మంచి యాహారము దొరకదు. నీ

వెట్లుండఁగల" వందువేమో, నేను ఎల్లప్పుడు దుంపలను, బండ్లను దినుచు నుండెదను. నీతోడనుండి నీ కెట్టి యిడుములుగలిగింపను. నేనును బుద్ధిమంతుఁడైన నాథుఁడవగు నీతోడనున్నదాననై భయము వదలి, యరణ్యములం దచ్చటచ్చట నుండు నదులను, పర్వతములను, తీర్థములను, తపోవనములను జూడఁ గోరుచున్నాను. శూరుఁడవగు నీతోడఁగూడి సౌఖ్యము లనుభవింపుచు, హంసలచేతను, బెగ్గురుపక్షుల చేతను వ్యాపింపఁబడినవై, చక్కఁగాఁ బూఁచిన తామరపూవులు గలిగిన కొలఁకులను జూడఁగోరెదను. నేను నియమము పూని, యా తామర కొలఁకులందే జలకమాడుచు సంతోషముతో నిన్నుఁగూడి సుఖించెదను. ఓ విరివికన్నులు గలవాఁడా! నేను నీతోడ నిట్లుఁగూన వేయి సంవత్సరములు గడచినను, నూఱుసంవత్సరములు గడచినను మీఱిన సంతోషముతో నుండెదను. నీవు లేక స్వర్గమైనను నాకు రుచింపదు, ఓ రఘువంశమునఁ బుట్టిన పురుషోత్తముఁడవగు నృపాలా, నా కొకవేళ స్వర్గమున వాసము సిద్ధించినను, నీవు లేకున్నచో, నేను దానింగూడఁ గోరను. మృగములతోను, కోఁతులతోను, మదపుటేనుఁగులతోను గూడినదై, చొఱ నలవికాని యడవికైనను వచ్చెదను. నీ పాదముల బట్టుచు నియమవంతురాలనై, తండ్రియింట నుండునట్లె వనమునందు నిర్విచారముగా నుండెదను. ఓ నాథా! నా మనస్సు నిన్నువిడిచి మఱియొకనిపైకిఁ బోదు. నీ యందే నా మనస్సు ప్రేమగలిగియుండును. నీవు నా ప్రార్థన నియ్యకొనక నన్నుఁ బాసితేని, నేను తప్పక మరణము నొందెదను. నన్నుఁ దోడ్కొని పొమ్ము. నా ప్రార్థనను సఫలము చేయుము. నావలన నీ కేమియు భారములేదు." అని సీత రాముని నానావిధములఁ బ్రార్థించెను. ఇట్లు సీత యనేకవిధములుగాఁ బ్రార్థించినను, ధర్మమునం దత్యంత ప్రేమగలిగిన నరోత్తముఁడగు రాముఁడు సీతను దోడ్కొనిపోవ నిచ్చగింపక, వనవాసముయొక్క యవస్థను గూర్చి, దుఃఖితురాలైన సీతకుఁ దెలియజెప్పి యామెను మఱలింప ననేక విధంబులఁ బ్రయత్నించెను.

## 28-వ సర్గము

**రాముఁడు వనవాసఖేదములను సీతకుఁ దెలుపుట**

ఇట్లు సీత పలుకుచున్నను, ధర్మముల నెఱింగినవాఁడు, ధర్మమునఁ బ్రేమగలవాఁడునైన రాముఁ డరణ్యవాసమందలి యిడుమలఁ దలంచి, సీత నరణ్యమునకుఁ గొనిపోవ బుద్ధిఁ దలఁపఁడాయెను. అట్లు ధర్మాత్ముఁ డగు రాముఁడు గొంత సేపాలోచించి, సీతను బలుమాఱు పలుతెఱఁ గుల నూఱడించియుఁ గండ్లనిండఁ గన్నీరు నించుకొనియున్న యా సీతనుజూచి మఱల నిట్లనియె. "ఓ సీతా! నీవు గొప్పవంశమునఁ బుట్టిన దానవు. ఎల్లప్పుడు ధర్మమునందు మిక్కిలి యాసక్తురాలవు. నీ విచ్చ టనేయుండి నా మనస్సున కానందము గలుగునట్లు నన్నుఁ గూర్చి వ్రతములు మున్నగు స్వధర్మముల నాచరింపుము. ఓ సీతా! నేను జెప్పిన చొప్పున నడచుకొనుము. ఓ కాంతా! వనవాసంబునఁ బలుకష్టములు గలవు. వానినెల్ల నెఱింగించెద నాలకింపుము. అట్లాలకించి, వనవాస మునందుంచిన యీ బుద్ధిని వదలుము. వనవాసమునఁ బెక్కిడుములు గలవని చెప్పఁగా వినియుందువుగదా. నీ మేలుగోరి నే నీ మాటఁ జెప్పి తినికాని, నిన్నుఁ బోషింపలేక కాదు. అచ్చటికష్టములను జెప్పెద నాల కింపుము. అడవిలో నెల్లప్పుడు దుఃఖమే కలుగునుగాని, సుఖము గలు గదు. ఇది నాకుఁ దెలియును. సెలయేళ్ల రొదలును, గుహాలందుండు సింహముల బొబ్బరింతలును భయంకరముగానుండును. నిర్జన వనమందలి యేనుఁగులు మొదలగు గొప్పమృగములు బాగుగాఁ గ్రొవ్వి, భయము విడిచి, విచ్చలవిడిగా సంచరించుచు మనలను జూచి, మనపైకిఁ బరుగిడి వచ్చును. అచ్చటి నదులు మొసళ్లతోఁ గూడి, మిక్కిలి యడుసుగలిగి, మదించిన యేనుఁగులకయిన దాఁటుట కలవిగాకయుండును. అడవులలోని దారులు తీఁగెలతోను, ముండ్లతోను నిండినవై యడవికోళ్లకూఁతలకు మాఱుమ్రోఁత లీనుచు, త్రాగుటకు నీరులేక, నడచుటకు సాధ్యముగాక యుండును. పగళ్లయందంతయు గడ్డలు దుంపలు దిని యలసటనొంది, విచారపడి స్వయముగా నేలపై రాలినయాకుల పాన్పుపైఁ బరుండ వలయు. రేయుంబగళ్లు నియమముతోనుండి, తమంతటఁ జెట్లనుండి పడిన పండ్లను దిని తనివినొందవలయు. మఱియు నారచీరలను గట్టి

జడలు దాల్పవలయును. శక్తికిఁ దగిన ట్లుపవాసము సేయవలయును. దిన
దినము దేవతలకును, పితృదేవతలకు నప్పుడప్పుడు వచ్చెడు నతిథుల
కును శాస్త్రప్రకారముగాఁ బూజలు సలుపవలయును. నియమముతో
ప్రాతస్సంధ్యామధ్యాహ్నసాయంకాలములందు ముమ్మాఱు స్నాన మాచరింప
వలయును. తాను తెచ్చిన పూవులతో ఋషిప్రోక్తవిధానమున నగ్ని
వేదికిఁ బ్రత్యహమ్ముఁ బూజలు సల్పవలయును. వనమునఁ దిరుగుచు నీ
వస్తువులు తినవచ్చును, ఈవస్తువులు దినరాదనియు, ఇంతమాత్రమే
తినవలయును, ఇన్నిసారులే తినవలయునని యాహారనియమము గలిగి,
దొఱకినదానితోఁ దనివినొందవలయు. వనమునందుఁ బెనుగాలి వీచు
చుండును; కాఱుచీకటి గ్రమ్మి దిగులు పుట్టించుచుండును. ఆఁకలియు
మితిమీఱియుండును. గొప్పభయములు గలుగుచుండును. బహువిధము
లయినపాము లనేకములు విచ్చలవిడిగఁ దిరుగుచుండును. ఓభామినీ, నీ
వాఁడుదానవు గావున వానిని జూచినంతటనే భయపడుదువు. ఏళ్లయం
దున్నవియు, నీటివలె వంకరగాఁ బోవునవియునైన పాములు దారి
నడ్డగించియుండును, కావున నీవు వానిని జూచి మిక్కిలి వెఱతువు.
మిడుతలు, తేళ్లు, పురుగులు, అడవియీఁగలు, దోమలు సర్వదా
బాధించుచుండును. ఓయబలా! యడవియందే విధమునను సుఖము కాన
రాదు. ఓ భామినీ! అడవులందలి మ్రాకులు ముండ్లు గలిగియుండును,
వానికొమ్మ లుఱ్ఱూతలూఁగుచు నొండొంటితో రాయుచుండును.
రెల్లును, దర్భలును ఱంపపుటంచులవలె వాఁడియైనయంచులు గల్గి
యుండును. ఓ సీతా! అరణ్యవాసమున దేహశ్రమము మెండు. భయము
లనేకములు. కావున నచ్చట నన్నితెఱఁగుల దుఃఖమేగాని, సుఖము లేదు.
కోపమును లోభమును విడువవలయును. ఎల్లప్పుడు తపస్సునందే మన
స్సును నిలుపవలయు. వెఱవఁదగిన సందర్భము వచ్చినను వెఱవఁ
గూడదు. కావున నీ వడవికి రావలదు. నీకు వనవాసము యుక్తము
గాదు. ఎంత యాలోచించి చూచినను, వనవాసమునఁ బలుతెఱంగులగు
నపాయములే కనఁబడుచున్నవి." అని రాముఁడు సీతతోఁ బలికెను.
రాముఁ డప్పుడు సీతను గొనిపోవ సమ్మతింపకుండఁగా, సీత కడు వగ

పాలయి రామునిమాటల నొప్పుకొనక, యతనితో నీక్రిందితెఱఁగునఁ జెప్పెను.

## 29-వ సర్గము

సీత తన్నడవికిఁ దోడ్కొనిపోవ రాముని నిర్బంధించుట

సీత రాముఁడు సెప్పిన పలుకులు విని, దిగులుపడి కన్నీరు నించుచు, రామునితో మెల్లన నిట్లనిరియె. "ఓ నాథా! వనవాసమున నేయేదోషము లున్నవని చెప్పితివో, యవియెల్ల నీసహవాసమువలన గుణములేకాని, దోషములుగావు. అయ్యారణ్యములం దుండుజింకలు, సింహములు, ప్రీతిపూర్వకమగు ఖడ్గమృగములు, ఏనుఁగులు, గాతెను పోతులు, చమరములు మొదలగు మృగము లంతకుమున్ను నీరూపమును బోలురూపమును జూచియెఱుఁగవు గావున, నవియన్నియు నీరూపమును జూచి వెఱచి పరుగిడును. భయకారణము తటస్థపడినప్పు డన్నియు వెఱచునుగదా! కావున నా క్రూరజంతువులన్నియు నీతోడనున్న నన్నే మియుఁ జేయఁజాలవు. పెద్దలయాజ్ఞ గావున నేనును నీతోడ నవశ్యముగా వనము రావలసినదాననే. నిన్నుఁబాసి యొక్కక్షణమైనను జీవింపఁ జాలను. నేనంతటఁ బ్రాణముల విడువవలసినదే. నీచేరువనున్న నన్ను దేవతలకెల్ల నధిపతియగు నింద్రుఁడైనను దనబలిమిచేఁ జెనకఁజాలఁడు. పెనిమిటిని బాసినయాఁడుది తన ప్రాణముల నిలుపుకొనఁజాలదు. ఓరాముఁడా! నీవివయము నెన్నిమాఱులో నా కుపదేశించియున్నావు. అంతియకాక, గొప్పపండితుఁడా! నేను మునుపు మాతండ్రియింట నున్నప్పుడు జ్యోతిశ్శాస్త్రవేత్తలగు విప్రులు "నీవు కొంతకాల మరణ్యమున నుండవలసివచ్చును" అని చెప్పఁగా వినియుందును. బలవంతుఁడ వగు రాముఁడా! సాముద్రికలక్షణముల నెఱిఁగిన విప్రులును నన్నుఁ గూర్చి "నీవు కొంతకాల మరణ్యవాసము చేయవలసివచ్చు" నని చెప్పఁగా నే నాలకించియుందును. అప్పలుకులు విన్నదిమొదలు "ఎప్పు డెప్పుడు వనమునకుఁ బోవుదునా" అని చాల నుత్సాహము గలిగియున్నాను. ఆవిప్రులు చెప్పినచొప్పున నేనును గొంతకాలము వనవాసము సేయవలయుఁగదా! ఓ ప్రియుఁడా! నేనును నీతోడ వచ్చెదను. నే నొంటరిగా నెట్లు వనంబున కేఁగఁగలను? నేను నీవెంబడివచ్చితినేని, యాబ్రాహ్మ

ణుల యాజ్ఞను నెఱవేర్చినట్లు నగును. నేను వనవాసమునకుఁ బోవఁ
దగినసమయము వచ్చినది. కావున నేను నీతోడ వచ్చెదను. లక్షణవేత్త
లగు బ్రాహ్మణుల వాక్యములు యథార్థము లగునుగాక! వనవాసమునఁ
బెక్కుడుములు గలుగునని నేనెఱుఁగుదును. ఓశూరుఁడా! ధైర్యవంతులు
గాని పురుషులే యట్టియిడుముల నొందుదురు కాని నీవంటి శౌర్యవంతులు
పొందరుగదా! తొల్లి నేను పుట్టింటనుండఁగా నొకనాఁడు, మంచి నడత
గల యొకతాపసస్త్రీ యేతెంచి, నేను నాతల్లియెదుట నుండఁగా నన్నుఁ
గూర్చి, 'ఓపడుచా! నీవు కొంతకాలము వనమున నుండగల'వనిచెప్పి
నది. నేను నిన్నుఁ బలుతెఱఁగులుగా మున్ను సంతోషపఱచి నీతోడ
వనమునకు రావలయునని యప్పుడప్పుడు కోరుచుంటినిగదా? రాఘవా!
నీకు మేలయ్యెడును. నేనును నీతోడ నరణ్యమునకు రావలయునని
మిక్కిలి మక్కువపడియున్నాను. కావున నన్నుఁ దోడ్కొనిపొమ్ము.
శూరుఁడవగు నీకు శుశ్రూషచేయుచు వనమున నుండఁ గోరు
చున్నాను. నిర్మలహృదయుఁడా, నేను మగనిపైఁ బ్రేమచే నతనిని విడిచి
యుండఁజాలను. కావున భర్తవగు నిన్ను వెంబడించివచ్చి పాప
రహితురాల నయ్యెదను. నాకుఁ బెనిమిటియే దైవము. నాకుఁ బర
లోకమునను నిరంతరము నీతోడిచేరికయే కావలసినది. కీర్తి
మంతులగు బ్రాహ్మణులు చెప్పునట్టి పవిత్రమయిన వేదవాక్యములను
వినియున్నాను. ఈలోకమునఁ దల్లిదండ్రు లెవనికిఁ దమ యాచారము
చొప్పున నే కన్యను దారపోయుచున్నారో, ఆకన్యక పరలోకమునను
అతనికే భార్యయగును. ఇట్లు వేదములు పలుకుచుండగా, స్వజాతి
సంభవురాలను, మంచినడవడిగలదానను, పతివ్రతను నయిన నన్నుఁ
దోడ్కొనిపోవకుండుట కేమికారణము? కాకుత్స్థుఁడా నేను పతివ్రతను;
సుఖదుఃఖములం దొక్కతీరుననే యుండుదానను; నీకు సుఖము వచ్చి
నప్పుడు సుఖమును, దుఃఖమువచ్చినప్పుడు దుఃఖమును అనుభవించు
దానను. నిన్నే మనస్సునఁ దలఁచుచుండుదానను. ఇట్టి నన్ను విడిచి
పోవుట నీకు యుక్తముగాదు. నన్నుఁ గొనిపొమ్ము. ఇవ్విధమునఁ
గుందుచుండు నన్నుఁ దోడ్కొని పోఁగోరవేని, నేను గరళము
మ్రింగియైనను, నిప్పులోఁ జొఱఁబడియయినను, సముద్రమునఁ బడి

ర్థైనను మృతినొందెదను. ఇట్లు సీత తనరాకనుగూర్చి పలు తెఱఁగుల వేఁడుకొనుచున్నను, గొప్ప భుజములుగల రాముఁడు సీతను నిర్జనవనమునకు వెంటఁబెట్టుకొని పోవ సమ్మతింపఁడయ్యెను. అంతట నాసీత యివ్విధంబునఁ దన్నడవికిఁ గొనిపోవ సమ్మతింపక రాముఁడు సెప్పిన పలుకు లాలకించి, తనకండ్లనుండి కాఱు వేఁడి కన్నీళ్లచేఁ బుడమిని దడుపుచు మిక్కిలి వ్యసనము నొందెను. అట్లు విచారపడుచుండు కెమ్మోముగల సీతను రాముఁడు మఱలింపఁ గోరి యామెను పలు తెఱఁగుల నూఱడించెను.

## 30-వ సర్గము

### సీత తనరాక నంగీకరింపమికై రాముని దూఱుట

జనకమహారాజకూఁతు రగు సీత తన ప్రియుఁడు బతిమాలుచున్నను వినక, యరణ్యవాసముం గూర్చియే మాటలాడఁ గోరి, తన్ను రాముఁడు దోడ్కొని పోనిచ్చగింపమికై మిక్కిలి చింతనొంది, ప్రేమచేతను, గర్వముచేతను విరిఱొమ్ముగల తనప్రియుని రాముని నీ తీరున దూషింపఁ దొడఁగెను.

రామా! మిథిలాధిపతియగు నాతండ్రి జనకమహారాజు పురుషరూపముననున్న స్త్రీకి నిన్ను నల్లునిఁగా బడసి యేమనుకొనును?

రామా, మిథిలాపురి నేలెడి నాతండ్రి జనకమహారాజు, భార్యను గాపాడుకొన లేక యిచ్చట విడిచి యడవులకేఁగుచున్న నీసంగతిని విని, "నాయల్లుఁడు స్త్రీయే కాని పురుషుఁడు కాఁడు. పురుషవేషముఁ దాల్చిన స్త్రీయై నన్ను వంచించెను" అని తలఁచునుగదా! వెలుఁగుచున్న సూర్యునియందెట్టి ప్రతాప మున్నదో యట్టి ప్రతాపము రాముఁడవగు నీయందుఁ గనఁబడదు. ఈజనులందఱు తెలివిలేమిచే రాముఁడు ప్రతాపవంతుఁడని చెప్పుదురేని, యది వట్టిమాటయె కదా! నీవేపనిని జేసి మనమున దిగులు పడితివి? నీవెందువలన వెఱచెదవు? వేఱుగతిలేని నిన్నే నమ్మియుండు నన్ను నీ వేకారణముచే విడువఁదలఁచితి? పరాక్రమవంతుఁడా! ద్యుమత్సేనుని పుత్త్రుఁడగు సత్యవంతుని సావిత్రి వెంబడించి పోయెనుగదా! ఆపతివ్రతయగు సావిత్రిని బోలినదాననుగ నన్నెఱుఁగుము. ఓరూపవంతుఁడా! నిన్నుఁదప్ప వేఱొక్కనిని మనమునైనను దలంపను. రాఘవా! కులమునకుఁ గళంకముఁదెచ్చు నీచకాంత

వలెఁ గాక, నేను నిన్నెడఁబాయక నీతోడనే వచ్చెదను. రాముఁడా! ప్రాయము వచ్చినదానను; చాలకాలము నీతోఁ గాపురము చేసినదానను; నిన్నుఁ గాఁచుకొనియున్న దాననైన నన్ను నటునివలెఁ బరులపాలు చేయఁ గోరుచున్నావు.

ఓ దోషరహితుఁడవగు రామా! నీ వే పెద్దలకు మేలు చేయ నన్నుఁ బురికొల్పుచున్నావో, ఏవనవాసము నిమిత్తము నన్ను వనమునకు రావలదని చెప్పుచున్నావో అట్టి దశరథుఁడు మొదలగు పెద్దలకు నీవు లోఁబడి, వారు చెప్పిన చొప్పున నడచుకొనువాఁడవు గమ్ము. సకల ధర్మముల నెఱింగినట్టి నీవు నన్నుఁ దోడ్కొనక యడవికిఁ బయనమగుట దగదు. నేను నీతోడనుండియే తపస్సునైనఁ జేయవలయును; అరణ్యమున నయిన నుండవలయు; స్వర్గసుఖములనయిన ననుభవింపవలయు. నీతోఁగూడ వేడుకగాఁ దిరుగునప్పుడును, బరుండియున్నప్పుడును నాకెంత సుఖముగలుగునో, యంత సుఖము నీవెంబడి నడవికిఁ జనునప్పుడును గలుగునుగాని దారిబడలిక కొంచెమయినను గలుగదు. మార్గమున నిరువైపుల నుండునట్టి దర్భలు, ఱెల్లు, ముండ్లదుబ్బులును, మఱి యనేకములగు ముండ్ల చెట్లును నీ సమీపమున నుండు నాకు దూదివలెను, జింకతోలువలెను మెత్తనై యుండును. ఓ ప్రియుఁడా! నేను నీతోడ నడవియందుఁ దిరుగునపుడు, పెనుగాలివీచుటచేఁ రేఁగి పైఁ బడిన దుమ్మును మేలిమితావిగల చందనపుఁ బూఁతగా నెంచెదను. అడవులందగుపడువాఁడా! నీతోడ నడవులలో పచ్చిక బయళ్ళయందుఁ బరుండుట కంటె రత్నకంబళములు పఱచిన పాన్పులపైఁ బరుండుట యంత సుఖకరముగ నుండదు. నీతోడ నే నడవులందుఁ దిరుగునప్పుడు కొంచెముగాని, హెచ్చుగాని, ఆకులు, దుంపలు, పండ్లు నీ వేది ప్రేమతోఁ దెచ్చి యిత్తువో అదియె నా కమృతము. నే నడవులందుండునపు డయ్యాయి ఋతువులందలి పుష్పములను, కందమూలఫలములను ననుభవించుచుఁ దల్లినిగాని, తండ్రినిగాని, ఇంటినిగాని తలంపను. మఱియు నేను నీతోడ నడవి కేతెంచినప్పుడు నా నిమిత్తము నీకుఁ గొంచెమైనను కష్టముగాని, వ్యసనముగాని వలదు. నేను నిన్నచ్చుటఁ గష్ట పెట్టను; బరువుగాఁ దోఁపను. రామా! నాకు నీతోడ నుండుటయె

స్వర్గము; నిన్నెడఁబాసి యుండుటయె నరకము. రామా! ఈ సంగతిని బాగుగా నెఱింగి, నన్నిచ్చట విడువక, నన్నుఁదోడ్కొని వనమునకేఁగి, నాతోఁగూడియుండి యెక్కువ సంతసము నొందుము. ఇట్లు కలవరపడి యున్న నన్ను వనమునకుఁ దోడ్కొనిపోవవేని, యిప్పుడే విషముఁ ద్రావెదనుగాని, పగతురకు లోఁబడి యుండఁజాలను. ఓ నాథా! యిప్పుడు కాకపోయినను, పిమ్మటనైనను ప్రియవిరహదుఃఖముచే నేను బ్రాణములతో నుండఁబోవునది లేదు. కావున నీ యెదుట నిప్పుడే ప్రాణంబులఁ దొఱఁగుట మేలు. నేను నీ వియోగదుఃఖము నొక నిముసమైన నోర్వఁజాలను. అట్లుండ నిన్నుఁ బాసి పదునాలుగేండ్లేమి! నేను వ్యసనముతో బ్రదికియుండుటేమి! అని యివ్విధమునఁ జింతాక్రాంతురాలై, జాలిపుట్టునట్లు విశేషముగాఁ బలవించి, మిక్కిలి యలసి, ప్రియునిఁ గౌఁగిలించికొని, గట్టిగా నేడ్చెను. పిమ్మట రాముఁడు మర్మభేదకములగు మాటలు పలుకఁగా, విషము పూయఁబడిన బాణముల చేతఁ గొట్టఁబడిన యాఁడేనుఁగు చందమున నా పలుకులచే సీత నొచ్చినదయి, యరణియను నిప్పుచిలికెడు కొయ్య చక్కఁగాఁ జిలుకఁబడినదై నిప్పును గ్రక్కినట్లు, చిరకాలమునుండి లోపలనే యడఁగించుకొని యుండిన కన్నీటిని విడిచెను. దుఃఖముచేఁ గలిగిన, స్ఫటికమణులం బోలు కన్నీరు కమలములనుండి యుదకము స్రవించుమాడ్కి నా సీత యొక్క కన్నులనుండి కాఱుచుండెను. వెడఁదకన్నులుగలదియు, నిర్మలమగు చంద్రునిఁబోలు కాంతిగలదియునైన యా సీతయొక్క ముఖము నీటినుండి యెత్తి గట్టున వేయఁబడిన తామరపూవు యెండవేఁడిమికి వాడునట్లు మిక్కిలి వాడెను. అట్లు చింతించినదై స్మృతిఁ దప్పిన దానివలెఁ బడియున్న సీతను రాముఁ డప్పుడు లేవనెత్తి తన యిరుగేల గట్టిగాఁ గౌఁగిలించుకొని, యోదార్చుచు నిట్లనియెను. ఓ దేవీ! నిన్ను వగపాలునేసి, నాకు స్వర్గము ప్రాప్తించినను నేను బోను. ప్రపంచము నందలి సకల జంతువుల సృష్టిస్థితి లయంబులకుఁ గారణభూతుఁడై, తనంతటఁ బుట్టినవాఁడగు బ్రహ్మదేవుని కెందును భీతిలేనట్లు నాకును నన్నింటివలనను భీతియనుమాట లేదు. సొంపయిన మోముగలదానా! నేను నిన్నన్నిచోట్లను గాపాడఁగలవాఁడనైనను, నీ యభిప్రాయము

అంతయు బాగుగ నెఱుఁగక నిన్నడవికిఁ గొనిపోఁగూడదని
తలఁచి, యీ ప్రకారముగఁ జెప్పితిని. ఓ సీతా! నీవు నాతోడ వన
వాసముచేయు నిమిత్తము పుట్టితివి కావున, ధైర్యవంతుఁడు కీర్తిని
విడువఁజాలనిచందమున నిన్నును విడువఁజాలను. ఏనుఁగుతొండములం
బోలు తొడలు గలదానా! భర్త యెచ్చటికిఁబోయిన నచ్చటికి భార్య
యేఁగుట యను ధర్మము పూర్వము పెద్ద లాచరించినదే కాని వేఱు
గాదు. సూర్యుని సువర్చల వెంబడించునట్లు నీవు నన్ను వెంబడింపుము.
నేను నా పెద్దల ధర్మము ననుసరించి వనమునకు నిన్నుఁ దోడ్కొనిపోయె
దను. ఓ జనకరాజకూఁతురా! నాతండ్రియొక్క సత్యమయినవాక్యము
నన్నడవికిఁ గొనిపోవుచున్నది. కావున నే నడవికిఁ బోవక యుండఁ
జాలను. సొగసైన పిఱుఁదులుగలదానా, లోకమునఁ దల్లిదండ్రులకు
గురువునకు లోఁబడి యుండుట గొప్ప ధర్మముగదా. కావున నట్టి ధర్మ
మును వదలి యొక క్షణమయినను జీవింపఁగోరను. తల్లి, తండ్రి, గురువు
ననువారు మువ్వురు ప్రత్యక్షదైవములు. వారిని బూజించినయెడ,
వారు సంతసించి, మనకు ఫలమొసఁగుదురు. అట్టి స్వాధీనములయిన
ప్రత్యక్షదైవములను విడిచి, మనకన్నుల కగపడక ఫలమొసఁగునో
లేదో యను సందియమున కాస్పదమయిన దైవము నేల యారాధింప
వలెను? సొంపగు క్రీఁగంటి చూడ్కులుగలదానా! తల్లి, తండ్రి, గురువు
లను వారు మువ్వురు మూఁడులోకములు. వారితో సమానమయిన
పావన మగు వస్తు వీ భూలోకమున మఱొక్కటి లేదు. కావున
నేను దక్కిన దైవములను విడిచి, వారిని ముగ్గురిని ఆరాధించు
చుందును. వారి యారాధనమున ముల్లోకములను గెలువవచ్చును.
పితృశుశ్రూష యెంత శ్రేయస్కరమో, సత్యము, ఈవి, మర్యాద గనఁ
బఱచుట యివియు నంత శ్రేయస్కరములుగావు. విశేషదక్షిణలుగల
యాగములు నంత శ్రేయస్కరములుగావు. తల్లి, తండ్రి, గురువు ననెడి
వారి యనుమతముచొప్పున నడచుకొనుటవలన నిహలోకమున ధనము,
ధాన్యము, విద్యలు, సంతానము, సౌఖ్యములును, నంతమున స్వర్గ
లోకమును గలుగుచున్నవి కావునఁ దల్లిదండ్రులయొక్కయు, గురువు

యొక్కయు శుశ్రూషచేఁ బడయరాని దొక్కటియు లేదు. తల్లిదండ్రుల సేవయందే మనస్సుగలవారు దేవలోకమును, గంధర్వలోకమును, గో లోకమును, తక్కిన లోకములను వరుసగాఁ బొందుచుఁ గడపట బ్రహ్మలోకమును బొందుదురు. దశరథుఁడు సత్యసంధుఁడై నాకేమి యాన తిచ్చెనో, ఆ ప్రకారము నడచుకొందును. ఇది యనాదియైన ధర్మము. నీ వడవులలోఁ దిరుగఁజాలవని, నిన్ను దండకారణ్యమునకుఁ గొనిపోవ మనమునఁ దలఁపనైతిని. ఇప్పుడు నీవు "నే నడవులలో నుండెదను" అని చెప్పి నన్ను వెంబడించుటకు గట్టి పట్టుదల పూనితివి. మద్యమువలె మోహముఁగొలుపు కన్నులు గలదానా, నీవు వనవాసము నకై యిట్టి యొచ్చెములేని యవయవములు గలదానవుగా సృజింపఁబడి తివి. ఓ భయపడుదానా, నీవు నన్ను వెంబడించి రమ్ము. నాతోడనుండి నేఁ జేయు ధర్మములను జేయుచుండుము. ఓ సీతా! నీకు మగనిని వెంబ డించి పోవలె నను గొప్పతలంపు కలిగినది. ఇట్టి తలంపు నీకుఁ గలుగుట మాకులమునకును, మీ కులమునకును దగినది; విశేష కీర్తిప్రదమును, సొగసయిన పిఱుఁదులుగలదానా, వనవాసయోగ్యము లయినపనుల నారంభింపుము. ఇప్పుడు నిన్నుఁబాసి స్వర్గమునకుఁ బోవుటయు నా కభి మతముగాదు. బ్రాహ్మణులకు రత్నముల నొసఁగుము. సన్న్యాసులకు భోజనమును బెట్టింపుము. మఱియు యాచకుల కందఱకు నడిగినది యిమ్ము. తామసింపక పయన మగుము. నావియు, నీవియునైన వెలగల తొడవులను, మేలిమి బట్టలను, వేడుకకైన మన యొద్దనున్న సకల పాత్రలను, పాన్పులను, తక్కుంగల వస్తువులను మొదట పనివారల కొసఁగి, పిమ్మట బ్రాహ్మణుల కొసఁగుము." అని రాముఁడు సీతతోఁ జెప్పెను.

అంతట గొప్ప మనస్సును, ఎక్కువకీర్తియుఁ గలదియగు సీత దనరాకను బ్రియుఁ డంగీకరించినందుకై సంతసించి, నిండిన మనము గలదై, గగుర్పాటొంది, తన ప్రియునిమాట ప్రకారము ధార్మికులగు బ్రాహ్మణులకును, భృత్యులకును ధనములను, రత్నములను నొసఁగ నారంభించెను.

## 31.వ సర్గము

### లక్ష్మణుని రాకకు రాముఁ డొడంబడుట

మిక్కుటమగు కీర్తి గలవాఁడును, రఘువంశమునఁ బుట్టిన రాజు లకు సంతసము గావించువాఁడును నైనలక్ష్మణుఁడు మున్నే రామునితోడ వచ్చినవాఁడు గావున సీతకును రామునికిని జరిగిన సంవాదమును విని, "సీత రామునకుఁ బ్రియురాలు. ఆమెకూడ వచ్చెదనన్న రావలదనిచెప్పి, యెంతయో వేడికోలుమీఁద నామెరాకకు నొప్పుకొనెనే, నేను వచ్చెద ననిన నొప్పుకొనునో, యొప్పుకొనఁడో" యని కన్నీటిచే నెదరిన మొగ్గము గలవాఁడయి, దుఃఖము నాఁపుకొనఁజాలక, తన యన్న పాదములను గట్టిగాఁ బట్టుకొని, సీత యెదుట నిలఁబడి వినుచుండఁగా, వనవాస మహావ్రతమును నెఱవేర్పఁబూనియున్న యన్ననుజూచి, "ఓ యన్నా! లెక్కకు మిక్కిలియగు మృగములతోను, వనగజములతోను నిండి భయము పుట్టించు నడవులకుఁ బోవుటకయి గట్టిగ సంకల్పించిన వాఁడవయితివేని, నేను వింటిని గొని అడవిలో ముందటఁ బోవు చుందును. నీవు నాతోఁ గూడినవాఁడవై, పక్షులయు, మృగముల గుంపులయు రొదలతో నంతటను నిండి వెఱపుఁగొలుపు ననేకములైన యరణ్యములయందు సంచరింప నీవు లేకున్న, నేను స్వర్గలోకమును గోరను; దేవత్వమును గోరను, ముల్లోకముల యాధిపత్యమును గోరను" అని చెప్పఁగా, రాముఁడు వనవాసమునకు నిశ్చయించియున్న లక్ష్మణుని జూచి, "లక్ష్మణా! నీవు రావల"దని పలుతెఱఁగుల బతిమాలెను. అయి నను లక్ష్మణుఁ డామాటలను వినక రామునిం జూచి "ఓ యన్నా! నీవు మునుపే "నేనుగూడ వచ్చెద"నన్న నొప్పుకొంటివే. ఇప్పు డదేల నన్ను రావలదనుచున్నావు? ఓ దోషరహితుఁడా! నేను రావలెనని కోరుచుండఁగా, నన్ను వలదనుచున్నావే. కారణమేమో తెలియరాదు. దీనికిఁ గారణంబుఁ దెలియఁ గోరెదను. నాకు సందియముగా నున్నది" యనెను.

ఇట్లు పలికి, తనకన్నము న్నడవికిఁ బ్రయాణమయి ముందుకువచ్చి నిలఁబడి, దోసిలిగట్టుకొని "నేను వచ్చెదను; నన్నుఁ గూడఁ దీసికొని పొమ్ము" అని ప్రార్థించుచున్న లక్ష్మణునితో నెక్కువ ప్రతాపముగల

రాముఁ డిట్లనియె. "ఓ తమ్ముఁడా! నీవు నాయందుఁ బ్రేమగలవాఁడవు; మఱి ధర్మమునం దాసక్తిగలవాఁడవు. ఎల్లప్పుడు మంచిదారియందుండు వాఁడవు; నా కిష్టుఁడవు; ప్రాణములతో సమానమయినవాఁడవు; చెప్పి నట్లు వినువాఁడవు; తమ్ముఁడవు; చెలికాఁడవు. అన్నితెఱఁగుల నీవు నాతోడ వచ్చుట నాకేమో మంచిదే. అయినను, సౌమిత్రీ! నీవు నా వెంబడి వత్తువేని, కీర్తిమతులగు కౌసల్యా సుమిత్రల నెవ్వఁడు పోషించువాఁడు? వారి పోషణమునకై నిన్ను రావలదని చెప్పితినిగాని వేఱొండు కారణములేదు. "వారి పోషణకై తండ్రియుండలేదా? నేనేల యిచ్చట నుండవలెను" అని యనెదవేమో? పర్జన్యుఁడు వర్షించి భూమికి క్షేమముఁ గలిగించునట్లు ప్రతాపవంతుఁడగు నృపాలుఁడు జనులకోర్కులను దీర్చువాఁ డయినను, ఇప్పుడు కైకేయియందలి కామ మనెడి పాశములచేఁ గట్టువడి మంచి చెడ్డ లరయఁజాలకున్నాఁడు. కావున నతఁడు వారి యోగక్షేమముల విచారింపఁడు. "కైకేయి వారి పోషణచేయదా" యని యందువేమో? యశ్వపతిమహారాజుయొక్క కూఁతురగు కైకేయియు నీ రాజ్యమును బొంది, యైశ్వర్య గర్వముచే విచారములపాలయియున్న తన సవతులకు మేలుసేయదు. "భరతుఁడు తల్లులం దొక్కతీరున నుండువాఁడేకదా! అతఁడు కౌసల్యా సుమిత్రలను బోషింపఁడా!" యని యందువేమో! భరతుఁడు స్వయముగా మంచి వాఁడయినను, కైకేయియొక్క దుర్బోధనలకు లోఁబడి రాజ్యమును బడసి మిక్కిలి పగలపాలైయున్న కౌసల్యా సుమిత్రలను విచారింపఁ బోఁడు. కావున నీవె యిచ్చటనుండి స్వయముగాఁగాని, రాజు నను గ్రహముఁ బడసి కాని, పూజ్యురాండ్రగు కౌసల్యా సుమిత్రలను బోషింపుము. ఓ సౌమిత్రీ, యీ నేఁ జెప్పిన యీపనిని జేయుము. దీనికి మాఱు పలుకకుము. ఇట్లు నీవు చేతువేని, నాయం దెక్కువ మన్నన గనఁబఱిచినట్లగును. ధర్మముల నెఱిఁగినవాఁడా, పెద్దలకు శుశ్రూషచేయు చుంటివేని, సాటిలేని గొప్ప పున్నెము గలుగును. ఓ రఘునందనా, సుమిత్రాపుత్రా, నా నిమిత్త మీ పనిని జేయుము. ఓ సౌమిత్రీ, నీవు నామాటలను వినక, యీ ప్రకారము చేయవేని, మనలఁబాసి ఖేద మొందుచున్న మన తల్లులగు సుమిత్రా కౌసల్యలకు సౌఖ్యములేదు,

ఇదియే నేను నిన్ను వలదన్నందుకుఁ గారణ”మని రాముఁడు మృదువుగ లక్ష్మణునితోఁ జెప్పెను.

ఆ పలుకులు విని మాటలందుఁ జమత్కారియైన లక్ష్మణుఁడు మాటలందు నేర్పరియగు తన యన్నను జూచి, “ఓ శూరుఁడా, నీవు పరాక్రమవంతుఁడవు గనుక, భరతుఁడు రాజ్యమున కధికారియైనను తన తల్లి నొక్కటీరునను, మన తల్లుల నొక్కటీరునను జూచిన నీ కెక్కడఁ గోపమువచ్చునో యని నీ ప్రతాపమునకు వెఱచి కౌసల్యా సుమిత్రలను శ్రద్ధతోఁ గాపాడును. దీని కేసంశయములేదు. నీ తల్లియగు కౌసల్యయొక్క యనుగ్రహముచే ననేకు లాశ్రితులు వేలకొలఁది గ్రామంబులఁ బొంది సుఖంబుగా జీవించుచున్నారు. ఆమెయే నాకోటి వారిని వేవురనైనను భరింపజాలును. కీర్తిమతియగు నామె వేవురనేలఁ జాలియున్నప్పుడు తన్నును, నా తల్లియగు సుమిత్రను, మనవంటివారిని బలువురను బోషింపఁజాలును. నన్నుఁ గింకరునిగఁ జేసికొనుము. ఈ విషయమున నీ కేమియు ధర్మలోపము గలుగదు. నేను నీకుఁ బరిచర్య సేయుటచేఁ గృతార్థుఁడనయ్యెదను. నీకును మేలుగలుగును. ఓ యన్నా, ధనుర్బాణములను, గడ్డలను దుంపలను బెల్లగించుటకై గుద్దలిని, జిన్న గంపను దీసికొని నీకు దారిని జూపుచు నీ ముందట పోవుచుందును. ప్రతిదినంబును దుంపలను, బండ్లను, నింకను మునులకుఁ దగిన వనములఁ బుట్టిన యితర పదార్థములను మంచివానిని నీకుఁ దెచ్చియిత్తును. నీ వన్ననో సీతతోఁగూడి కొండచరియలందు విహరింతువు. నీవు మేల్కొని యున్నప్పుడును, నిద్రించునపుడును నీకు సకలోపచారములఁ జేసెదను” అని తిన్నని పలుకులతోఁ జెప్పెను. రాముఁడును ఈ మాటచేఁ గడు మోదమునొంది, “ఓ లక్ష్మణా, పోపొమ్ము. నీ స్నేహితులతో నంపకేి తోను జెప్పి రమ్ము. జనకుని గొప్ప యాగమున మహానుభావుఁడగు వరుణుఁడు తాను భయంకర రూపముగల యే ధనుస్సులను, భేదింప రాని దివ్యకవచములను, తఱుఁగని బాణములుగల యమ్ములపొదులను, సూర్యునిమాడ్కిఁ దళతళ మెఱియు బంగారు పూతపూసిన రెండు ఖడ్గ ములను నొసఁగెనో వీని నన్నింటిని జక్కఁగఁ బూజించి గురువులగు వసిష్ఠుల గృహమున నుంచియున్నాను. లక్ష్మణా! యా యాయుధముల

నన్నింటిని గైకొని వేగ నేతెమ్ము" అని లక్ష్మణునితోఁ బ్రత్యుత్తరము సెప్పెను.

లక్ష్మణుఁడును దన చెలికాండ్రనందఱను వీడ్కొని, వనవాసము నకు నిశ్చయించి, యిక్ష్వాకువంశస్థులకు గురుండగు వసిష్ఠుని గృహ మున కేతెంచి, యచ్చట రాజశ్రేష్ఠుఁడగు రామునిచేఁ బూజింపఁబడి, పూవులచే నలంకరింపఁబడి యుంచఁబడియున్న యా దివ్యాయుధముల నన్నింటినిఁ గైకొనివచ్చి రామునకుఁ జూపించెను. సంతోషవంతుఁ డయిన యా రాముఁ డాయుధముల నన్నిఁటిని గొనివచ్చిన లక్ష్మణునిఁ జూచి, "ఓ నాయనా! నేను నీ రాకకై యెదురుచూచుచుంటిని. నేను నా యీ ధనంబునంతయు బ్రాహ్మణులకును దాపసులకును నియ్యఁ గోరితిని. నీవును గూడ నుంపుము. మఱియు నిచ్చటఁ దల్లి దండ్రు లందును, పెద్దలందును భక్తిగల యే బ్రాహ్మణశ్రేష్ఠు లున్నారో, వారికిని, మఱి నా పనివారికందఱకును విశేషముగా దానములు చేసెదను. నీవు బ్రాహ్మణోత్తముఁడును, మర్యాద సేయఁదగినవాఁడునునైన వసిష్ఠ పుత్త్రుఁడగు సుయజ్ఞుని వేగముగాఁ దోడ్కొనిరమ్ము. ఆతనిని, మఱియు ననేకులను సదాచార సంపన్నులగు బ్రాహ్మణులను బూజించి, యడవుల కేఁగెదము" అని లక్ష్మణుని కాజ్ఞ యొసఁగెను.

## 32-వ సర్గము

### రాముఁడు యాత్రాదానంబులు సేయుట

అటుతర్వాత లక్ష్మణుఁడు, తన యన్న ప్రేమతో నొసఁగిన కడు మేలయిన యానతిని గైకొని సుయజ్ఞుని గృహమునకుఁ జని, యగ్ని హోత్రశాలయం దౌపాసనము గావించుచున్న యా సుయజ్ఞునకుఁ బ్రణమిల్లి "యో మిత్రమా! రమ్ము. చేయ నలవికానిపనినినెల్ల సాధింపఁ బూనిన మాయన్న నిన్నుఁ దోడ్కొనిరమ్మని యానతి యొసఁగెను. నీ వచ్చటికి వచ్చి యతని కార్యములఁ జూడుము" అని యా సుయజ్ఞు నితోఁ జెప్పెను. సుయజ్ఞుఁడు లక్ష్మణుని పలుకులు విని, సంధ్యావందనా ద్యనుష్ఠానమును దీర్చికొని సత్వరముగ లక్ష్మణునితోడఁ బయనమై, రాజలీవిచే శోభిల్లుచుండు సొబగగు రాముని నగరు సొచ్చెను. ఆ సుయజ్ఞుని రాక యెఱిఁగి రాముఁడు సీతాసమేతుఁడై లేచి, వేదార్థము

నెఱిఁగినవాఁడును, పూజ్యుఁడును, నగ్నిహోత్రుని వలెఁ దేజరిల్లుచుండు వాఁడునునై వచ్చుచున్న సుయజ్ఞుని నెదుర్కొని, యర్ఘ్యపాద్యాది సత్కారములు సేసి, బంగారువైన మేటి బాహుపురులను, సొగసగు కుండలములను, పసిఁడి త్రాళ్లలో గ్రుచ్చిన రతనాలహారములను, చేతికడియములను, నానావిధములగు రత్నభూషణములను సమర్పించెను. అప్పుడు సీత దాపుననుండి ప్రేరణచేయఁగా, రాముఁడు సుయజ్ఞునిఁ జూచి, "ఓ సౌమ్యుఁడా! సీత వనవాసమునకు వెడలి, తనవగు ముత్యాలపేరులను, బంగరుసరదులను, ఒడ్డాణములను, వింతఁగొల్పునట్టి రతనాల బాహుపురులను కేయూరములను నీభార్యకై నీచేత నిచ్చుచున్నది. వాని నెల్లఁ గొనిపోయి నీ భార్యకిమ్ము. అంతియ కాక, మేలయిన పఱపులు గలదియు, రతనములచే నలంకృతమయినదియు నగు మంచమునుగూడ నీఁ గోరుచున్నది. దానిని గైకొనిపొమ్ము. ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా, నా మేనమామ నాకిచ్చిన శత్రుంజయమనెడి యేనుఁగును, దానితోడ వేయి యితర గజములను నొసఁగెదను." అని చెప్పఁగా సుయజ్ఞుఁడు వానినెల్లఁ గైకొని, రామలక్ష్మణ సీతలకు శ్రేయస్కరములగు దీవనలఁ జేసెను.

అంతటఁ బ్రియములు పలుకునట్టి రాముఁడు దిట్టయగు తన యనుఁగుఁదమ్మునిఁజూచి, బ్రహ్మదేవు డింద్రునితోడవలె నిట్లు పలికెను. గొప్పభుజములు గలవాఁడవు, శత్రువుల యహంకారము నడఁచువాఁడవు నైన సౌమిత్రీ, బ్రాహ్మణోత్తములగు నగస్త్య కౌశికులను బిలిచికొని వచ్చి, పైరును నీటిచేఁ దనివినొందించునట్లు, వారికి వేలకొలఁది యావులను, బంగారును, వెండిని, అమూల్యములగు రత్నములను, అపరిమితముగ ధనమును నొసఁగి వారిని దనివినొందింపుము. తైత్తిరీయ శాఖాధ్యయనము చేయువారికి గురువైన యొక వేదవిదుఁడు, పండితుఁడునగు విప్రుఁడు కౌసల్యయందుఁ బ్రేమగలిగి యామెకు దీవనలు సల్పుచు నాశ్రయించియున్నాఁడు. ఆతనిఁబిలిపించి, యాతఁడు తనివి నొందునట్లు వాహనములను, పనికత్తెలను, తెల్లని పట్టు బట్టలను నొసఁగుము. మన తండ్రికిఁ గడు నెయ్యంపువాఁడయిన చిత్రరథుఁడను పేరుగల సారథి యొకఁడు బహుకాలమునుండి మనకడ నున్నాఁడు. ఆతనిని బిలిపించి,

వెలలేని రత్నములను, పుట్టములను, ధనములను పెయ్యలనన్నిటిని, వేయిగోవులను నతనికిచ్చి సంతోషపఱపుము. కఠ, కాలాపము లనెడి రెండు శాఖల నధ్యయనము చేయువారును, పలాశదండమును దాల్చువారునైన యనేకులు బ్రహ్మచారు లిదిగో యిచ్చటనున్నారు. వా రెడ తెగక వేదాధ్యయనము చేయువారు గావున నితర వ్యాపారముల నొంగించి త్తయినను జేయరు; వారు సోమరులు; మధురాహారమునే తినఁ గోరువారు; యోగ్యులచేతను సైతము మన్ననవడయువారు. వారిని బిలిపించి, వారికి రత్నరాసులుపోసిన యెనుబది వాహనములను, ధాన్యము మోయు వేయిబండ్లను, రెండునూఱుల చిన్నయెద్దులను, భోజన వ్యామసాధనములగు పాలు పెరుఁగు నెయ్యి వెన్న మొదలగు వానికై వేయియావులను ఇప్పింపుము. బ్రహ్మచారు లనేకులు మాతల్లి నాశ్రయించియున్నారు. మా తల్లి నే నొసఁగు దక్షిణను జూచి సంతసించు ప్రకారముగ నా బ్రాహ్మణోత్తముల కొక్కరొక్కరికి వేయివంతున నావుల నిప్పింపుము" అని చెప్పెను.

అంతటఁ బురుషశ్రేష్ఠుఁడయిన లక్ష్మణుఁడు తానే యాధనమునంతయు నన్న చెప్పిన తీరున బ్రాహ్మణోత్తముల కందఱకును గుబేరుని చందమున నొసఁగెను. ఆ వెంబడే రాముఁడు కన్నీరుగార్చుచు నిలువఁబడియున్న పనివారిం జూచి, ఒక్కొక్కనికి సుఖజీవనమునకుఁ జాలునంత ధనము నొసఁగి, వారిం జూచి, "ఓ కింకరులారా! మేము వచ్చునంతదాఁక, లక్ష్మణుని నగరును, నీ నా నగరును సదా కాచుచుండి, పాడుపడినది యని చెప్పకుండునట్లు చూచుకొనుఁడు" అని చెప్పి, బొక్కసపుఁ గాపరిం బిలిచి, "విస్తారముగా ధనము గొనిరమ్ము" అని యాజ్ఞాపించెను. అంతటఁ బనివారందఱు నతని ధనంబునంతయు మోసికొనివచ్చి రాశి పోసిరి. ఆ గొప్పధనరాశి చూపఱ కానంద మెసఁగఁ జేయుచుండెను. అంతటఁ బురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు లక్ష్మణుని దాపునఁ బెట్టికొని, యా ధనమునంతను బ్రాహ్మణులకును, పనివారికి, ముసలివాండ్రకు, దరిద్రులకు నిప్పించెను. అచ్చట సమీపారణ్యమున నెల్లప్పుడు నుంఛవృత్తిచే జీవించువాఁడును, కఱ్ఱు, గుద్దలి, నాఁగలి గలవాఁడును, పింగళవర్ణుఁడును, గర్గవంశస్థుఁడును నగు త్రిజటుఁ డను

బ్రాహ్మణుఁ డుండెను. ప్రాయమున నున్న యా త్రిజటునిభార్య లేమిచే మిక్కిలి నొచ్చినదై, పసిపిల్లలగు తన కొడుకులను బిలుచుకొనివచ్చి తన ముదుసలి పెనిమిటిని జూచి, "ఓ నాథా! కఱ్ఱును గుద్దలిని అవలఁ బాఱవైచి, నేను జెప్పెడి పనిని జేయుము. ధర్మజ్ఞుఁడయిన రాముని దర్శింపుము. నీవట్లు చేయుదువేని యేదియైనను ఫలము నొందుదువు" అని చెప్పెను. ఆ త్రిజటుండు భార్య మాటను విని, చినిఁగి పేలికలై కప్పుకొనుటకు సాధ్యపడని వస్త్రమును గప్పుకొని రాముని నగరునకుఁ బోవుదారిని విచారించికొనిపోయి, రాముని నగరులోపలికిఁ జొచ్చెను. భృగువు, అంబరీషుఁడు నను మహర్షులవలెఁ దపోమహిమచే దేదీప్యమానుఁడై వచ్చుచున్న యా త్రిజటుని నైదవ తొట్టికట్టువఱకు జనసమూహములో నొక్కఁడైనను నడ్డగింపఁడయ్యె. అంతటఁ ద్రిజటుండు రాజపుత్రుఁడగు రాముని దర్శనమొనర్చి, "విస్తారకీర్తిగల యో రాజపుత్రుఁడా! నేను బీదవాఁడను, పెక్కు బిడ్డలుగలవాఁడను; ప్రతిదినముంఛవృత్తిచే జీవించువాఁడను. నన్నుఁ గటాక్షింపుము" అని వేఁడుకొనెను. అప్పుడు రాముఁ డా బ్రాహ్మణోత్తమునిఁ జూచి, హేళనముగా, "నే నొక వేయిగోవులనైన నొకని కీలేదు. నీ వొక కఱ్ఱను దీసికొని విసరివేయుము. అది యెంతదవ్వునఁ బోయి పడునో, అంతవఱకుఁగల గోవులను నీకొసఁగెద"నని యా త్రిజటునితోఁ జెప్పెను. అంతట నా త్రిజటుఁ డామాట విని, తడఁబడుచు, కొటిని మొలకుఁ జుట్టి, కొయ్యను గిరగిరఁ ద్రిప్పి, వేగముతోఁ దన బలముకొలఁది విసరివైచెను. ఆ కఱ్ఱ యా బ్రాహ్మణుని చేతినుండి జాఱి సరయూనది గట్టును దాటి, యనేక సహస్రసంఖ్యగల యావుల మందయం దొక యాఁబోతునకుఁ జేటువఁబడెను. ధర్మాత్ముఁడగు రాముఁ డా త్రిజటుని కౌఁగిలించుకొని, సరయూనది గట్టువఱకునున్న గోవులమందలను త్రిజటుని యాశ్రమమునకు గొల్లలచేతఁ దోలించిపంపెను. అంత రాముఁడును గర్గవంశస్థుఁడయిన యా త్రిజటుని మంచి మాటలచే నూఱడించుచు "ద్విజోత్తమా, కోపపడకుము. నేను వేడుకకై యీమాటఁ జెప్పితినిగాని వేఱుగాఁ దలఁపకుము. అడ్డగింపరాని నీ తపఃప్రభావము నెఱుఁగఁగోరియే యీ పని సేయ నిన్నుఁ బ్రేరణసేసితిని. ఇంకను కావలసినదానిని గోరి

కొనుము. నీవేది యడిగిన దాని నిచ్చెదను. నేను నిజముగాఁ బలికెదను. నీ కేమియు నడ్డులేదు. నాయొక్క యావద్ధనంబును బ్రాహ్మణుల నిమిత్తమే కాని వేఱొక పని నిమిత్తముగాదు. నీకు విశేషముగా నొసంగుట చేతనే నేను సంపాదించిన ధనము సార్థకమగును. జనులకు నాపైఁ బ్రేమగలుగును. నాకు గొప్ప పేరును వచ్చును" అని యా త్రిజటునకుఁ జెప్పెను. అంత త్రిజటుఁడు భార్యాసమేతుఁడై, యావులమందలను గైకొని యెక్కువ సంతసమునంది, మహాత్ముఁడగు రామునకుఁ గీర్తి, బలిమి, సంతసము, సౌఖ్యముఁ బెంపొందున ట్లాశీర్వాదములు సల్పి, యాశ్రమమునకుఁ జనియెను. ఆ రాముఁడును నిండు మనముగలిగి, న్యాయబలముచే సంపాదించిన తన యపార ధనంబును వారివారి మర్యాదలకుఁ దగిన గారవంపు మాటలను బలుకుచుఁ దన స్నేహితులకును బనివారికిని నిమ్మని తమ్ముని కానతిచ్చెను. ఆ యయోధ్యాపురి యందు బ్రాహ్మణుఁడు, హితుఁడు, పనివాఁడు, లేమిడిదశలోనుండి బిచ్చ మెత్తువాఁడును వారివారికిఁ దగిన గారవముచేతను, దానము చేతను; ఆనందములచేతను దృప్తినొందనివాఁ డొక్కఁడును లేఁడయ్యెను.

## 33-వ సర్గము

### రామలక్ష్మణులు సీతతోడ దశరథునిఁ జూడఁబోవుట

రామలక్ష్మణులు సీతతోఁగూడి బ్రాహ్మణులకును, భృత్యులకును నపారధనంబొసంగి, సీతను దోడ్కొని, యితరులకుఁ జూడ నలవికానివియు, పుష్పమాలికలచేఁ జుట్టఁబడినవియు, సీతాదేవిచేఁ జక్కఁగాఁ గైసేయఁబడినవియునై వెలుఁగుచున్న ధనుస్సులు మొదలగు నాయుధములను దాల్చినవారలై, తండ్రిని జూడఁబోయిరి. అప్పుడు గాంతిమంతులైన జను లందఱు సంతోషము లేనివారలై, ధనికుల మేడలను, రాజులయు దేవతలయు గృహంబులను, నేడంతస్తు మేడలను ఎక్కి మౌనముతోఁ జూచుచుండిరి. వీథులన్నియుఁ బెక్కండ్రు జనులతోఁ నిండినవై నడచుటకు సందు లేకుండుటం జేసి, జనులనేకులు మేడలనెక్కి, విన్నదనముతోఁ జూచుచుండిరి. అప్పుడు జనులందఱు ఛత్రచామరములు లేక కాలినడకతోఁ బోవుచున్న రామునిఁజూచి "యక్కటా! రాజపుత్రుఁ

డగు రాముని కింతయిడుమువచ్చెఁగదా!" యని మనంబుననొచ్చి తమతమ మనసులకుఁదోఁచిన ట్లనేకవిధములుగ ననుకొనుచుండిరి, "ఆహా! చూచితిరా దైవబలిమి! తొల్లి యే రాముఁడు రాజవీథిం జనునపుడు గొప్ప చతురంగబలము వెంబడించెనో, ఆ రాముఁ డొంటరియై పోవుచుండఁగా, నతనిని లక్ష్మణుఁడును సీతయునే వెంబడించుచున్నారు. ఈ రాముఁడు రాజ్యము చేయలేకయు, జనులకోర్కుల నీడేర్పలేకయుఁ గానలకుఁ బోవుచున్నాఁడేమో యని యందురేమో! ఈ రాముఁడు ప్రభుత్వముయొక్క సారాంశమిట్టిదని యెఱిఁగినవాఁడు; జనులుకోరిన కోర్కుల నొసఁగువాఁడు. అట్టివాఁడయ్యును, తండ్రిమాట మీఱరాదనెడు ధర్మమునందలి గౌరవముచేతను, దండ్రి చేసిన వాగ్దానము నీడేర్చి సత్యసంధుఁడనెడు పేరతనికిఁ దెప్పింపఁ గోరుటచేతను నడవికిఁ బోవ నున్నాఁడు. మునుపు, ఆకాశమునఁ దిరిగెడు ప్రాణులకయిన జూడనలవికాని సీతను నేఁడు రాజమార్గమున నున్న జనులందఱుఁ జూడగలిగియున్నారు. మేలిమైపూఁతలకుఁ దగినదియు, నెఱ్ఱని చందనముఁ బూసికొనునదియు నైన సీత వానకుఁ దడియుచు, నెండకెండుచుఁ, జలికి వణఁకుచుఁ గాంతి తఱిఁగి యుండఁగలదు. దశరథుని కిప్పుడేమో దయ్యము పట్టినట్లున్నది. కావుననే యిప్పు డీవిధమున రాముని నడవికిఁ బంపుచున్నాఁడు. రాజు తన ముద్దులపట్టి నెప్పుడును నడవులకుఁ బంపఁ జాలఁడు. లోకమున గుణహీనునైనను బుత్రుని నడవికిఁ బంప నెవనికైనను మనమురాదు. అట్లుండఁగా, దానమానాది సత్కారములచేతఁ గాక, యొక సద్గుణముచేతనే జనులందఱిని లోఁబఱచుకొన్న రామునిఁ బోలు సత్పుత్రునిఁ బంప మనంబు వచ్చునా? అహింస, భూతదయ, శాస్త్రజ్ఞానము, మంచినడత, ఇంద్రియనిగ్రహము, ఓర్పు నను నీ యాఱు గుణములు రామునియందు విలసిల్లుచున్నవి. రాముఁ డట్టి గుణములు గలవాఁడు. అట్టి రాముని కిప్పు డాపద సంభవించుటంజేసి, నీటివలన జీవించు జంతువులు వేసవిని నీళ్లింకుటచే నల్లాడునట్లు మిక్కిలి నొచ్చిన వారలయి జనులందఱు నల్లాడుచున్నారు.

లోకాధిపతియగు రాముని కాపద సంభవించుటచేఁ బువ్వు ఫలాదులతో నిండినచెట్లు మొదలునఱుకుటచేఁ గ్రిందఁబడి నశించునట్లు,

జగత్తంతయు మనోదుఃఖముచే నొచ్చి తఱిగిపోవుచున్నది. మహాకాంతి గల యీ రాముఁడె మనుజు లనెడువృక్షమునకు మూలము. ధర్మమే యీ రామవృక్షమునకుఁ జేవ. ఇతర జనులందఱు రామవృక్షమునకుఁ బువ్వులు, కాయలు, ఆకులు, కొమ్మలు నైనవారు. కావున నట్టి మన మందఱమును పత్నీ బాంధవాది సమేతులమై, లక్ష్మణునివలెనే రాముని మార్గమున బోదము. మన యిండ్లను, తోఁటలను, పొలములను విడిచి, రామునితో సమానముగ సుఖదుఃఖముల ననుభవించుచు, ధర్మాత్ముఁ డయిన రాముని వెంబడింతము. మనమందఱు మొక్కపెట్టున నయోధ్యను విడిచి రాముని వెంబడించి పోయితిమేని, యయోధ్యాపురము పాడు వడిపోవును, ఇండ్లలోని నిధులన్నియుఁ బెల్లగింపఁబడును, ముంగిళ్లు సమ్మార్జనాదులు లేమిచే రూపుసెడును. మంచి మంచి వస్తువులన్నియు నపహరింపఁబడును. ధనధాన్యములు గొనిపోఁబడును. గృహము లన్నియు దుమ్ముతో నిండును. గృహదేవతలు విడిచిపోవుదురు. ఎలుకలు, పందికొక్కులు బెద్ద బొఱియలుచేసి యంతటను నిర్భయముగాఁ దిరుగు చుండును. నీరు నిప్పుల ప్రసక్తి లేకపోవును. నివాసములు లేమిచే నూడ్వఁబడక పెంట నిండియుండును. నందున వైశ్వదేవము, యజ్ఞము, వేదాధ్యయనము, ఔపాసనము, గాయత్రీజపము మొదలగు ననుష్ఠా నంబు లుండవు. చెడ్డకాలము తానే పగులఁగొట్టెనో యనునట్లు తుత్తు నియలయిన పాత్రలతో నిండియుండును. మనము విడిచిపోయిన యట్టి యయోధ్యాపురంబునందలి యిండ్లలో నా కైకేయి యొంటరిగాఁ బొరలాడుచుండఁగలదు. ఎక్కడికి రాముఁడు పోవుచున్నాఁడో, యదే బట్టణముగుఁగాక! మనచే విడువఁబడిన యయోధ్యాపట్టణమే యడవి యగుఁగాక! మన మడవులందు నివాసంబు లేర్పఱచుకొంటిమేని, మనకు వెఱచి పాములెల్లఁ బుట్టలనుండియు, మృగములు, పక్షులును గొండ చరియలనుండియు, సింహములు, గజములు అడవులనుండియు వెడలి, మనము వదలిన తావునకుఁ బోయి చేరునుగాక! మనముచేరిన తావును వదలునుగాక! ఇట్లు తృణభక్షకములు, మాంసభక్షకములు, ఫలభక్షక ములునైన భయంకర సర్పములును, మృగంబులును, పక్షులును గల దయిన యయోధ్యాపురంబునందుఁ గైకేయియు నామె కొడుకును,

బంధువులను, జేర్చుకొని వాసముచేయునుగాక! మనము రామునితోఁ గూడఁబోయి వనంబున నిర్విచారులముగా నుండఁగలము." అని యివ్విధంబున జనులందఱు పరిపరివిధముల మాటలాడుకొనుచుండిరి. రాముఁడిట్టిఁగున జనులు మాటలాడు మాటలను వినినను, మనంబున నించుకైనను వికారము నొందఁడయ్యె.

ధర్మాత్ముఁడగు రాముఁడు మదపుటేనుఁగుయొక్క శౌర్యముం బోలు శౌర్యముఁగలవాఁడై, దవ్వవనే కైలాసశిఖరము పగిది నున్నతమైన తండ్రి నగరుఁ జూచి, ప్రదక్షిణముసేసి, వినయవిధేయులగు వీరపురుషులుగల రాజనగరునొచ్చి, చేరువను దీనుఁడయియున్న సుమంత్రునిఁ జూచుచుఁ, దన వనవాసమునకై వ్యసనపడుచున్న జనులఁ జూచినను, తన మనసున వ్యసనమున్నట్లు కనఁబఱపక, తండ్రిని జూడఁగోరియుఁ, దండ్రియానతి రవంతయైనఁ దప్పక నెరవేర్పఁగోరియుఁ జెలునవ్వుతో నగరులోపలికిఁ బోయెను. ఇక్ష్వాకువంశస్థుఁడును, ధైర్యగాంభీర్యములు గలవాఁడునగు రాముఁ డడవికిఁ బోవువాఁడై, తన యరణ్యవాస వార్త విన్నదిమొదలు ఖేదమొందుచుండు సుమంత్రునిఁ జూచి, తండ్రికిఁ దనరాక యెఱిఁగింపఁగోరి యచ్చట నిలిచి, తాను ధర్మముఁ నందాసక్తిగలవాఁడు గావున తండ్రియానతి యన్నమాత్రముననే యరణ్యమునకుఁ బోవ సమకట్టి, సుమంత్రునిఁ బిలిచి, "రాజునకు నా రాక యెఱింగింపు"మని చెప్పెను.

## 34-వ స ర్గ ము

—— సీతా రామలక్ష్మణులు వనవాసంబునకై దశరథుని వీడ్కొనుట ——

కమలాక్షుండును, నీలమేఘవర్ణుఁడును, కృశోదరుఁడునైన రాముని యానతి వడసి వెంటనే గొప్ప బుద్ధిమంతుఁడయిన సారథియగు సుమంత్రుఁడు చింతాక్రాంతచిత్తుఁడై, వేగిరంబుగ లోపలికిఁ బ్రవేశించి, వేఁడి నిట్టూర్పులు విడుచుచు రాహువుచే మ్రింగఁబడిన సూర్యుని మాడ్కియు, నివురుగప్పిన నిప్పుచందముననను, నీల్లింకిన కొలనిచాడ్పునను గాంతిహీనుఁడై డెందమున మిక్కిలి వగచుచు నా రామునే తలఁచి తలఁచి దుఃఖపడుచుండు నృపాలునిఁ జూచి, కొంత దాపునకుఁ జేరి, తొలుత "మహారాజా! జయముగుఁగాక" యని దీవించి, దిగులుచేఁ దడఁ

బడుచున్న తిన్నని పలుకులతో "మహారాజా! పురుషశ్రేష్ఠుండయిన రాజపుత్త్రుండగు రాముండు బ్రాహ్మణులకును, గింకరులకును దన యావద్ధనము నొసంగి, తమ్ముం జూచుటకై వాంకిటవచ్చియున్నాండు. నీకు శుభము గలుగునుగాక! స్థిరపరాక్రమంబుగల రాముండు తన చెలికాండ్ర యందఱికడ సెలవుదీసికొని, యిప్పుడు ప్రభుదర్శనంబు గోరుచున్నాండు. భూయధిపతీ, కిరణములచే వెలుంగు సూర్యునివలె సకలరాజగుణంబులచేతను వెలుంగుచున్న రాముండు గొప్ప యడవికిం బోవనున్నాండు. తమరట్టి రామునిం జూతురుగాక" యని చెప్పెను.

సత్యముం బలుకువాండును, ధర్మాత్ముండును, సముద్రమువలె గంభీరుండును, ఆకాశమువలె నిర్మలుండునునైన దశరథనృపాలుండు సుమంత్రునిం జూచి, "ఓ సుమంత్రా! నా భార్యలనందఱిని దోడ్కొని రమ్ము. వారినందఱిని దగ్గఱనుంచికొని రామునిం జూడం గోరుచున్నాను" అని యానతీయంగా, సుమంత్రుండు వారి యంతఃపురంబులకుం బోయి వారితో "అమ్మలారా! నృపాలుండు మిమ్ముం బిలుచుచున్నాండు. ఆలస్యము చేయక రండు" అని చెప్పెను. రాజు నసుజ్ఞయగుటం జేసి, రాముని వనవాసవార్తాశ్రవణ దుఃఖముచే నెఱ్ఱని కన్నులు గల్గియున్న నృపాలుని కాంతలు మున్నూటయేంబండ్రు జవరాండ్రును నియమవతులై, కౌసల్యను జుట్టుకొని మెల్లంగా నడచి పోయి దశరథ నరేంద్రుని భవనముం జేరిరి. భార్యలందఱు వచ్చినంతటనే దశరథ మహీపాలుండు సుమంత్రునిం జూచి, "సారథీ! నా పుత్త్రుండగు రామునిం బిలుచుకొనిరమ్ము" అనంగా, సుమంత్రుండు వాంకిటికిం బోయి, సీతను రామలక్ష్మణులను దోడ్కొని, వేగిరముగా నృపాలుని యెదుటికి వచ్చుచుండెను. అంతలోపల దశరథనృపాలుండు చేతులుజోడించుకొని వచ్చుచున్న రాముని దవ్వుననే చూచి, డెందంబునం గుందుచున్న కాంతలతోడం దానును సత్వరంబుగ లేచి నిలిచెను. అట్లు నిలిచి, నృపాలుండు వేగిరంబున రాముని కెదురుగాం బరుగిడి, శోకముచేం గడు నొచ్చినవాండై, రాముని దాపునకుం జేరకయె మూర్ఛిల్లి, నేల కొఱంగెను. మహారథులగు రామలక్ష్మణు లిరువురును దశరథుండు మైమఱచి క్రిందంబడుటను జూచి, తత్తరపాటుతోం

బరుగిడివచ్చి, వియోగ దుఃఖము నోర్వజాలక యొడలుమఱచి నేలపైఁ బడియున్న నృపాలుని దాపునకుఁ జేరిరి. అప్పుడు రాజగృహమున వేల కొలఁదిగనున్న స్త్రీ లందఱు తమ భూషణముల మ్రోఁతలు దోడ్పడు చుండఁగా "నయ్యయ్యో రామా"యని తత్తరపాటుతోఁగూడ నేడ్వఁ దొడఁగిరి. అప్పుడు రామలక్ష్మణులు సీతయు నేడ్చుచు దశరథుని చేతులఁ గ్రుచ్చియెత్తి పాన్పునఁ గూర్చుండఁబెట్టిరి. కూర్చుండఁబెట్టిన కొంతసేపటికి దశరథనృపాలుఁడు దెప్పిఱిల్లి, దుఃఖసాగరమున మునిఁగి యుండెను. అట్టి తండ్రిని జూచి, రాముఁడు చేతులు జోడించి, వినయ వంతుఁడై, మ్రొక్కి, "మహారాజా! నేను దండకారణ్యమునకుఁ బయన మైతిని. తమరు మా కందఱకుఁ బ్రభువులరు; కావున తమయొద్ద సెలవుఁ గైకొనవచ్చితిని. నాకు సేమంబు గలుగునట్లు దీవింపుఁడు. సీతయు లక్ష్మ ణుఁడును నాతోడ రాఁ బయనమైయున్నారు. నే నెన్నియో సరియైన కారణములు చెప్పి, మీ రిచ్చటనే యుండుఁడని వారించినను, వారు సమ్మతింపక నాతో రా నున్నారు. వారికిని ననుజ్ఞయిండు. శత్రువుల యహంకారమును ఖండించు నృపాలా, తమరు శోకమువదలి, బ్రహ్మ దేవుఁడు ప్రజల నాజ్ఞాపించునట్లు మాకు మువ్వురకు వనమునకేఁగ సెల వొసఁగి, మమ్మందఱినిఁ బంపివేయుఁడు" అని తండ్రితోఁ జెప్పెను.

అట్లు పలికి, ధైర్యముతోఁ దన యానతికై యెదురుచూచుచున్న తనదు కుమారునిఁ జూచి, "ఓ రామా, నేను కైకేయికి వరము నొసఁగి మోసపోయితిని. నా యానతిని మీఱి నీవె యిప్పు డయోధ్యాపురంబు నకు యువరాజవుగమ్ము" అని తండ్రి చెప్పఁగా, ధర్మసంరక్షకులలో మేటియు, మాటలందు నేర్పరియునైన రాముఁడు తండ్రి మాటను విని చేతులు జోడించి యాతనితో నిట్లనియె.

"మహారాజా! తా మనేకవేల సంవత్సరములుగాఁ బుడమి నేలు చున్నారు. తామే ప్రభుత్వము చేయుదురుగాక! నే నరణ్యమున కేఁగె దను. నానిమిత్తమయి తమ రసత్యదోషముఁ గట్టుకొనవలదు. నరా ధిపా! నేనును బదునాలుగేండ్లరణ్యవాసముముగించి, మఱలఁ దమ పాద ములకడఁ జేరెదను" అని తండ్రితో రాముఁడు చెప్పెను. అంతట నృపా లుఁడు సత్యమను త్రాటిచేఁ గట్టఁబడి, పుత్రవియోగ దుఃఖము సైరింపఁ

జాలక కలవించుచుఁ గైకేయి మఱుఁగుననుండి రాము నడవికే పంపుము పంపుమని ప్రేరణసేయుచుండుటం జేసి, చేయునదిలేక తనముద్దులకొడుకుం జూచి, "నాయనా! నీకు మేలుగలుగుఁగాక; సంపద వృద్ధిఁబొందునుగాక; మఱల క్షేమముగా వచ్చి జేరుదువుగాక. ధైర్యవంతుఁడవై మంచి దారిని బొమ్ము. నీ కెక్కడను భయము దోఁపనేరదు. నీవు సత్యమే స్వభావంబుగఁ గలవాడవు; ధర్మమునందే విడువని ప్రూనికి గలవాఁడవు. నీవలన రఘువంశస్థు లందఱు "మనవంశమున నిట్టి మహనీయుఁడు పుట్టెనుగదా" యని సంతోషపడుచుందురు. నీ పట్టుదల నెవ్వఁడును నివారింపఁజాలఁడు. ఈరాత్రికే యెట్లయినను పయనముగాకుము. నే నీ పూటయైనను నిన్నుఁ జూచుచు నానంద మొందెదను. నన్నును దల్లినిఁ జూచుచు నీరేయియెల్ల నిచ్చటనుండుము. ఈరేయి మాశక్తి కొలఁది, నీ కోరికలఁ దీర్చెదము. మావలన నన్నికోరికలను బొందిన వాఁడవై, రే పుదయముననె పయనమగుదువు. రఘునందనా! నా యిష్టము నెఱవేర్పఁగోరి, నీ సౌఖ్యములనెల్లఁ బాసి, నిర్మానుష్యమయిన వనంబున వసింపఁబోవుచున్నాఁడవు. నీ విప్పుడు చేయ నలవికాని యొక పని చేయఁబూనితివి. ఇట్టి కార్యము నీవు తప్ప మఱెవ్వఁడు సేయఁ నోపును? నాయనా! నేనొట్టుపెట్టి చెప్పెదను, నీ వడవికేగుట నాకెంత మాత్ర మిష్టముగాదు. అయినను లోఁతు మనసుగలదై, బూడిఁ గప్పిననిప్పు చందమున నున్న యాఁడుదానిచేత మోసపోయితిని. దురభిప్రాయురాలగు నీ కైకేయియొక్క ప్రేరణముచేత మోసపోయిన నన్ను తప్పింపఁ గోరుచున్నావు. నీ యంతటి యుత్తమ పురుషుఁ డెవ్వఁడైనఁ గలడే? నీవు నాకు పెద్దకొడుకవై యుండి, నాకు సంభవించిన యసత్య దోషంబు దొలఁగించుట యొక గొప్ప వింతగాదు. లోకమున బెద్ద కొడుకు తండ్రి ముదుసలి యైనప్పుడు తానే యన్ని సంగతులను విచారించుకొనుచుండును గదా" అని దశరథుఁడు చెప్పెను.

అంతట రాముఁడు తండ్రి శోకపురస్సరముగాఁ జెప్పిన పలుకులు విని, విన్నదనము మోమునఁ దోఁపఁగా, లక్ష్మణుని యనుమతంబునఁ దండ్రితో నిట్లనియె. "ఓ తండ్రీ! యీ దినమున నేఁ గోరు నన్నివస్తువులు మీరు నాకిచ్చితిరిపొండు, రేపు వాని నెల్ల నాకెవ్వఁ డీ

గలఁడు! కావున నీ దినముననే యడవికిఁ బోవుట యన్ని కోరికల నొందినట్లుగాఁ దలఁచుచున్నాను. ధనధాన్యములతోడను, జనపదములతోడను, సకలజనులతోడను నిండినదియు నేను విడిచినదియునగు నీ పుడమినెల్ల భరతున కొసఁగుడు. నేను వనవాసమునకు నిశ్చయించితిని. ఇఁక నా బుద్ధి మాఱదు. వరదా! తమరు సంతసముతోఁ గైకేయి కొసఁగిన వరమును బూర్తిగా నొసఁగి యామెను సంతసము నొందించి, సత్యసంధులరగుఁడు. నేనును దమ యానతిని తాముచెప్పినచొప్పున నడపుచుఁ బదునాలుగేండ్లడవియందు వనవాసులతోడఁ దిరుగుచుందును. వేఱువిధముగా నాలోచింపక భరతునికిఁ బట్టాభిషేకము సేయుఁడు. నాకు రాజ్యము గావలెననియు, దేహసౌఖ్యము గావలెననియుఁ గోరికలేదు. తమయాజ్ఞ నెవ్విధముననైనను జెల్లించి కీర్తినొందఁ గోరెదను. తమరు శోకము మానుఁడు; కన్నీరు విడువకుఁడు. నదులకు ఱేఁడగు సముద్రుఁ డెవ్వరికి దాఁట నలవికాక కలఁతఁ జెందకుండుఁగదా. అట్లె తమరును దైన్యము విడిచి ధైర్యము నవలంబింపుఁడు. నాకు రాజ్యమునందుఁ గోరికలేదు; సౌఖ్యమునందును గోరికలేదు; సీతతోఁగూడి రమింపవలెననియుఁ గోరికలేదు. ఈ భోగము లన్నియుఁ గావలె ననియు కోరను. తుదకు స్వర్గమునందును, వేయియేల, నా ప్రాణమునందే నాకుఁ బ్రేమ లేదు. తమ యెదుట నేను జేసెడి ధర్మకార్యములను, సత్యవాక్యపరిపాలనమును సాక్షులనుగాఁబెట్టి చెప్పెదను. పురుషోత్తమా! తమరు చెప్పిన మాట తప్పి, యసత్యవాదియని పేరుతెచ్చుకొనక, ఆడినమాట తప్పనివాఁడన్నమాట రావలెనని కోరెదను. ఓ నృపాలా! నే నిఁక నొకనిమిషమైనను నిలువఁజాలను. ఇఁక వ్యసనము మాఁపుకొనుఁడు. ఇఁక నా తలంపు మాఱదు. కైకేయి "రాఘవా! నీ వరణ్యమున కేఁగుము" అని నన్నుఁ గోరెను. నేనును "అట్లె యరణ్యమునకుఁ బోయెదను" అని చెప్పితిని. కావున నేను వాగ్దత్తమును రక్షించెదను. ఓ మహారాజా, యెక్కువ మోహము నుంపకుము. మేమును సాధువులగుజింకలు మెండుగాఁగలిగి, నానావిధములగు పక్షులయొక్క కలకలధ్వనులతోఁ గూడిన వనమున విహరించుచుందుము. తండ్రీ! దేవతలకుఁగూడఁ దండ్రియే దైవమని

చెప్పఁబడెను. నేనును దండ్రియే దైవమని యెంచి తండ్రియానతి ననుస
రింపఁగోరితిని. నరశ్రేష్ఠుఁడా, నేను బదునాలుగేండ్లు నిండి మఱలిరాఁగా నే
నన్నుఁ జూడఁగలరు. కాఁబట్టి తాము దుఃఖముఁబాయుఁడు. కన్నీరు
గ్రుక్కుకొని డగ్గుత్తికతోనున్న యీ జనుల దుఃఖమును దమరు దీర్ప
వలసియుండఁగాఁ, బురుషశ్రేష్ఠా, తమ రేల యిట్టి దుఃఖవికారము నొంది
తిరి? అయోధ్యాపురమును, రాజ్యమును, భూమండలమునంతయు నేను
విడిచితిని. తాము భరతున కొసఁగుఁడు. నేను దమయాజ్ఞ ననుసరించి
చిరకాలము వనవాసము చేయఁబోయెదను. భరతుఁడే నేను వదలినదియు,
పర్వతములు, నడవులు, పట్టణములు ననేకముగఁ గలదియు, క్షేమంకర
మయినదియుఁ, జక్కని యెల్లలుగలదియునైన భూమండలము నెల్లఁ
బాలించునుగాక! నృపాలా! తమరు మొదట నెవి యెట్లు చెప్పితిరో, యది
యట్లే యగునుగాక! పెద్దలకు సమ్మతమయిన గురుని యాజ్ఞ నెఱవేర్చుట
యందు నాకెంత పట్టుదలయున్నదో యంత పట్టుదల గొప్ప భోగము
లందుఁగాని, నా కిష్టమగు వస్తువులందుఁగాని లేదు. ఓ మహాత్మా!
తమరును నాకై వ్యసనము నొందవలదు. ఓ పాపరహితా! తమ
యాజ్ఞను నెఱవేర్పక, తమరి నసత్యవాదినింజేసి, అవ్యయమయిన రాజ్య
మును కోరికలను గోరను, సుఖము గోరను, సీతను గోరను, జీవితమును
గోరను, సత్యవాక్య పరిపాలమును మాత్రము గోరెదను. తమరును
సత్యవాక్య పరిపాలనము సేయుదురుగాక! నేనును నడవులకుఁ జని కంద
మూలఫలములను భక్షించుచుఁ బర్వతములను, నదులను, తటాకములను
జూచుచు వింత వింతలగు చెట్టుగల వనములలోఁ దిరుగుచు సుఖముగ
నుండెదను. తామును దుఃఖమువిడిచి నిర్విచారులరై సౌఖ్యము నొందు
దురుగాక!" యని రాముఁడు దశరథునితోఁ జెప్పెను.

దశరథుఁడు దుఃఖముచేఁ బరితపించుచుఁ బుత్త్రుని గౌఁగిలించి
కొని, స్మృతిదప్పి, మూర్ఛిల్లి, కొంచెమైన నిట్టటుకదలక నేలపైఁబడి
యుండెను. అపుడు, కైకేయి తప్పఁ దక్కినవారందఱు గుమిగూడి
ఘోరన నేడ్చుచుండిరి. సుమంత్రుఁడును బలవించుచు మూర్ఛనొందెను.
ఆ నగరంతయు రోధన ధ్వనులతో నిండెను.

## ౩౫వ సర్గము

### సుమంత్రుఁడు కైకేయిని దూఱుట

అంతట సుమంత్రుఁడు దశరథ రాముల సంవాదమువిని, యిది యెల్లఁ గైకేయియొక్క దురాలోచనయని తలఁచి, కోపాక్రాంతుఁడయి వేగముగఁ దలయూఁచి, పలుమాఱు నిట్టూర్పు విడిచి, చేతులు పిసికి కొనుచుఁ బండ్లు పటపటఁ గొఱుకుచుఁ గన్ను లెఱ్ఱనచేసి, ముందున్నట్టి మోము సొంపువదలి, కోపపరవశతచే నోర్వరాని సంతాపమునొంది, దశరథునకు రాముఁ డరణ్యమున కేఁగుట సమ్మతముగాకున్నదని యెఱిఁగి, కైకేయియొక్క హృదయమును వాఁడి మాట లనెడుబాణములచే జిల్లులుపడఁగొట్టి యదలింపఁజేయుచు, సాటిలేని పరుసనిమాటలనెడి వజ్రములచే కైకేయియొక్క మర్మములనెల్ల ఛేదించుచు నామెతో నిట్లనియె:—

"ఓ కైకేయీ! స్థావరజంగమాత్మకముగు ప్రపంచమునకెల్ల నధిపతి, నీ ప్రియభర్తయునైన దశరథనృపాలుని విడిచితివే! ఇది యెంత యకార్యము! ఇంతటి చేయరానిపనికిఁ బూనిన నీ వెంతపనిని జేయవు! దేవేంద్రునివలె జయింప నలవిగాని పరాక్రమవంతుఁడును, పర్వతము మాడ్కిఁ గదలింప నశక్యుఁడును, మహాసముద్రమువలెఁ గలియఁబెట్ట నలవికానివాఁడును నైననృపాలునికి నీ దుష్కార్యములచే నొప్పించు చున్నావే! దీనిఁబట్టిచూడ నీవు మగనిఁ జంపుదానవనియు, బాగుగ యోచించినచోఁ గడపటికిఁ గులనాశకురాల వనియు నేఁ దలఁతును. జనుల నందఱఁ బోషించువాఁడును, కోరిన వరము నొసంగువాఁడును నైన భర్త నవమానింపకుము. కాంతకు మగని యిష్టముచొప్పున నడుచుట కోటిపుత్రులకంటె నెక్కువ. ఒకదేశమున రాజు మృతినొంది నప్పుడు రాజులు వయఃప్రకారమున రాజ్యము నొందుదురు. ఇక్ష్వాకు వంశ నాథుఁడగు నీ రాముఁడు పెద్దవాఁడు గావున నతఁడు రాజుగావ లసియుండ, నా కార్యము నేల యాటంకపఱచెదవు. నీ కొడుకగు భరతుఁడే రాజగుఁగాక! అతఁడే రాజ్యమును బాలించుగాక! రాముఁ డెచ్చటికిఁబోవునో, యచ్చటికి మేమును బోయెదము. నీ కొడు కేలెడి యీ దేశమున నొక్క బ్రాహ్మణుఁడయిన నుండఁబోఁడు. అట్టి పరువులేని

కసి యేల చేయఁదలఁచితివి? ఓసీ క్రూరశీలా! నీ విట్టి క్రూరకార్యము చేయుచుండఁగా నీ పుడమియెల్ల వెంటనే బ్రద్దలుగాకున్న దేమి? ఇది గొప్ప వింతగా నున్నది. వాఁడిపై చూపులను వెలిపించునట్టి గొప్ప బ్రహ్మర్షులు సెప్పెడి "ఛీ! ఛీ!" యను శాపవాక్యములు రాము నడవికిఁ బంపఁ గంకణము గట్టుకొన్న నిన్ను రూపుమాపకున్నవి కదా! మామిడి మ్రాఁకును గొడ్డటితో నఱికి, యచట వేఁపచెట్టును నాటి పాదుగట్టి, పాలు పోసి పెంచిన వాని కది తీయనిపండ్ల నీయదు. నీ తల్లియొక్క స్వభావ మెట్టిదో, యట్టి స్వభావమే నీకును గలిగినది. వేఁపచెట్టునుండి తేనె పుట్టునా? అట్లు చెడ్డదియగు నీ తల్లి కడుపునఁబుట్టిన నీవును చెడ్డదానవు గాకుందువే? నీ తల్లియొక్క చెడ్డపట్టుదలను మా పెద్దలు సెప్పఁగా వినియున్నాను.

తొల్లి వరముల నొసఁగు నొక మునీంద్రుఁడు నీ తండ్రికి నుత్తమ మగు వరము నొసఁగెను. ఆ వరప్రభావమునంజేసి నీ తండ్రియగు కేకయరాజు పశువులు మొదలగు సకల తిర్యగ్జంతువుల మాటలను దెలిసికొనఁ గలవాఁడయ్యెను. మితిమీఱిన కాంతిగల యాతఁ డొక దినమునఁ బాన్పుపైఁ బరుండియుండఁగా, జృంభమను నొక చీమ మాట లాడెను. ఆ చీమ యభిప్రాయము నెఱిఁగి యాతఁడు పకపక నవ్వెను. ఆ నృపాలుని ప్రక్కనఁ బరుండియున్న నీతల్లి నిష్కారణముగ నవ్వినందుకై కనలి, మగనికి మరణమును బ్రాటినిగోరి, "నృపాలా! నీవేల యిప్పుడు నవ్వితివి? నవ్విన కారణము నెఱుఁగఁ జెప్పవే" యని యడిగెను. అప్పుడు నీ తండ్రి నీ తల్లిని జూచి, "ఓ దేవీ! నేను నవ్వినందుకుఁ గారణముఁ జెప్పుదునేని, నాకుఁ దప్పక వెంటనే మరణము సంభవించు"నని చెప్పెను. ఆమాట విని, నీ తల్లి రాజును జూచి, 'రాజా! నీవు బ్రతుకనైన బ్రతుకుము, చావనైన జావుము. నీవు నన్నుఁ బరిహసించుటకై నవ్వ లేదని తెలిసికొనవలయు'నని యడుగఁగాఁ, గేకయనృపాలుఁ డా పలుకులు విని, తనకు వరము నొసఁగిన మహాత్మునితో, "మహాత్మా! నాదేవి నాశకారణము నడుగుచున్నది. చెప్పుదునా" యని యడిగెను. ఆ వరదుఁడగు మహాత్ముఁ డప్పలుకులు విని "రాజేంద్రా

చావనీ, పాడై పోవనిమ్ము. నీ వేమాత్రము చెప్పకు" మని చెప్పెను. నృపాలుఁ డా మహాత్ముఁడు నిష్కలహృదయముతోఁ జెప్పినపలుకులు విని, నీ తల్లిని వెంటనే తఱిమివైచి, కుబేరునివలె విహరించుచుండెను. పాపకార్యమందే దృష్టిగలదానా! నీవు నట్లు చెడ్డవారు నడిచెడిదారిలో నున్నదానవై, తెలివిలేక నృపాలునిచేఁ జెడుకార్యమును జేయించుచున్నావు. అదియుఁ గాక మగబిడ్డలు తండ్రుల ననుసరించియు, నాఁడుబిడ్డలు తల్లుల ననుసరించియుఁ బుట్టుదురనియు లోకమ్మున వాడుకొను లోకోక్తి నిజమని నాకుఁ దోఁచుచున్నది. నీ విట్టి మొఱకుఁదనము వదలుము. నృపాలుఁడు సెప్పినతెఱఁగున నడచుకొనుము. ఇప్పుడు నీ భర్తయొక్క యభిప్రాయము నవలంబించి, యీ జనులకెల్ల గతియగుము. నీవు చెడ్డవారి దుర్బోధనలకు లోఁబడి, దేవేంద్రునివలె వెలుఁగునట్టి లోకరక్షకుఁడగు నీ మగని నధర్మమునఁ ద్రోయకుము. దేవీ! పాపరహితుఁడును కాంతిమంతుఁడునైన దశరథనృపాలుఁడు మోసపోయి యొసఁగిన వరముల నిప్పుడు నీ కీకపోఁడు. రాముఁడు పెద్దవాఁడు; దానశీలుఁడు; సదాచారసంపన్నుఁడు; స్వధర్మమును గాపాడువాఁడు; సకల జంతువులను రక్షించువాఁడు; బలవంతుఁడు. ఇట్టి సకల గుణములు గల రామునికిఁ బట్టాభిషేకము జరుగునట్లుచేయుము. ఓ దేవీ! తండ్రిని బాసి, రాముఁడు కానలకేఁగునేని, నీకు గొప్ప యపవాదము సంభవించును. ఆ రాముఁడు రాజ్యపాలనము సేయునుగాక! నీవును జింతను బాసి యుండుము. రాముఁడు తప్ప నితరుఁ డెవ్వఁడును సమర్థుఁ డిక్కడ నుండఁజాలఁడు. రాముఁడు యువరా జగునేని, మేటివిలుకాఁడగు దశరథనృపాలుఁడు తన పెద్దలదారి ననుసరించి, వానప్రస్థాశ్రమము నడపుటకై వనమున కేఁగును" అని యివ్విధమున సుమంత్రుఁడు నయభయ సూచకములగు మాటలచే రాజసమక్షమున గైకేయి మనసును గలఁతపెట్టి, మఱల చేతులు జోడించికొని యుండెను.

సుమంత్రుఁ డిన్నిమాటలఁ జెప్పినను, కైకేయియొక్క మనస్సు కొంచెమైనను గలఁతనొంద దయ్యెను; సంతాపము నొంద దయ్యెను. అప్పు డామె మోమునందు విన్నదనమును దోఁపదయ్యెను.

## 36-వ సర్గము

**సిద్ధార్థుండను మంత్రి కైకేయిని దూషించుట**

అంతట నిక్ష్వాకువంశస్థుఁడగు దశరథనృపాలుఁడు వరదానముల నొసంగినందుకు మిక్కిలి నొచ్చినవాఁడై, కన్నీరుగార నిట్టూర్పు విడుచుచు సుమంత్రునిఁ జూచి మాటిమాటికి నిట్లనియె.

"ఓ సారథీ! చతురంగబలములతోఁ గూడిన సేన విశేషధనముఁ గైకొన్నదై రాముని వెంబడించి పోవున ట్లుత్తరువు చేయుము. మాటలచే నితరుల మనముల నాకర్షించువారగు వేశ్యలును, గొప్ప భాగ్యవంతులగు వర్తకులును బదార్థములను గొని పుష్కలముగఁ రామునిఁ జేనలను వెంబడింతురుగాక! ఎవ రెవనియండ జీవనము చేయుచున్నారో, యెవరియొక్క బలిమినిఁజూచి రాముఁడు సంతోషపడుచుండునో; వారి కందఱికిని విస్తార ధనము నొసఁగి, వారినిగూడ రాముని వెంబడించు న ట్లానతిమ్ము, పట్టణవాసులు శ్రేష్ఠములయిన యాయుధములను దాల్చి, బండ్లను దోలుకొనియు, వనములందుఁ దిరుగు బోయలును రాముని వెంబడిఁ బోవుదురుగాక. రాముఁ డట్లు సర్వసైన్యముతోఁగూడ నేఁగి; మృగములను, ఏనుఁగులను జంపుచు నడవి తేనెను ద్రావుచు, పలు నదులను జూచుచు, రాజ్యమునే తలంపఁబోఁడు. నా ధాన్యపుఁగొట్టును, బొక్కసమును జన రహితమయిన వనమున నుండఁగల రాముని వెంబడించునుగాక! రాముఁడు పుణ్యదేశములందు జన్నములు సేయుచు, యాచకులకుఁ గావలసిన దక్షిణ లొసఁగుచు, ఋషులతో నిష్టగోష్ఠి సల్పుచు వనంబున సుఖముండును. గొప్ప బాహువులుగల భరతుఁడు నయోధ్యను బాలింపఁగలఁడు. సర్వోత్కృష్టుఁడగు రామునికి నెల్ల యిష్టార్థముల నొసఁగి, యడవులకుఁ బంపుము."

ఇట్లు దశరథుఁడు సుమంత్రునితోఁ జెప్పుచుండఁగా కైకేయి కెక్కువ భయముదోఁచెను. మోము మెండిపోయెను. కంఠధ్వని సన్నమయ్యెను. ఆ కైకేయి యుత్తెఱఁగున దుఃఖించి, మిక్కిలి వెఱచి, సంతాపముచే నెండుచున్న మోముగలదై, రాజున కెదుట నిలఁబడి "ఓ సత్పురుషుఁడా! జనులందఱు రామునితోఁగూడఁ బోయినతర్వాత పాడుపడిన యీ యయోధ్యాపురము సారముదీసిన కల్లువలె రుచిలేనిదై యనుభవ

యోగ్యము గాకయుండును. అట్టి పురమును భరతుఁ డేలుటకు సమ్మతింపఁడు" అని సిగ్గువిడిచి, కడుభయంకరముగాఁ జెప్పఁగా, దశరథుఁడు విశాలనేత్రయగు కైకేయిం జూచి, "ఓ శత్రురాలా! బరువు మోయ నన్ను నియమించి, మఱల నన్నేల బాధించుచున్నావు. ఓ పెద్దదానా! నేను దలఁచిన కార్యము గాకుండఁ జేయుటకు ముందే యేల నివారింపవైతివి" అని కోపముతో నడిగెను. సౌందర్యవతియగు కైకేయి దశరథుఁడు కోపముతోఁ జెప్పిన పలుకులు విని, తా నతని కంటె రెట్టించిన కోపముగలదై, రాజుం జూచి, "తొల్లి నీయొక్క వంశమున నే పుట్టిన సగరచక్రవర్తి యసమంజుఁడని ప్రసిద్ధికెక్కిన తన పెద్ద కుమారుని నేమియు నీక తఱుమఁగొట్టెనుగదా! అతఁడు సీతతోడ నేఁగెనా! అరణ్యమునకుఁ బోవలెనన్న సర్వధనము విడిచిపెట్టి పోవలయు ననికదా యభిప్రాయము. ఆ యసమంజు నట్లే యీ రాముఁడు నేఁగవలయు"నని చెప్పఁగా, దశరథుఁ డా మాట విని, "ఛీ! యిది పరమ నీచురాలు. ఇది మున్నడుగనిదానినిగూడ నిప్పుడు గోరుచున్నది. ఇది దహింపఁబడుఁగాక" యని నిందించెను. అచ్చట నున్న జను లందఱు దాని దీమసమును జూచి సిగ్గుపడిరి. ఆ కైకేయి వానినంతయు లక్ష్యపెట్టకుండెను.

అప్పు డచ్చట సిద్ధార్థుఁడను ప్రధానమంత్రి యొకఁ డుండెను. అతఁ డాచారవంతుఁడు; ఎక్కువ మర్యాదగలవాఁడు. అతఁడు కైకేయిం జూచి యిట్లనియె. "పెద్దబుద్ధిగల యసమంజుఁడు దారిలో నాడుకొనుచుండు బాలురను గొనిపోయి, సరయూనదిలోఁ బడవైచి, వేడుక చూచుచుండెను. అట్లు రాజపుత్రుఁడు చేసెడి యన్యాయమును జూచి, పురజనులందఱు కోపగించికొని రాజసన్నిధికిఁ జని, "రాజ్యమును బాలించు నృపాలా! అసమంజునిఁ దఱుమఁగొట్టి, మమ్మునైన నీ దేశమున నుంచుకొనుము. మమ్మునందఱిని దఱిమి యసమంజు నొక్కనినైన నుంచుకొనుము" అని సగరచక్రవర్తితో మొఱపెట్టుకొనిరి. అపుడు రాజు జనులను జూచి, మీ కింత వెఱపు పుట్టుట కేమి కారణమని యడిగెను. రాజు మిగుల ప్రేమతో నడిగిన తర్వాత జనులందఱు రాజుం జూచి, "నరేంద్రా! యీ యసమంజుఁడు చంచలచిత్తుఁడై,

వాడలో నాటలాడుకొను మా పిల్లలనందఱఁ గొనిపోయి సరయూనదిలో
వైచి తేలితేలుచే మిక్కిలి వేడుకతోఁ జూచుచున్నాఁడు. ఇదియె
మా భయమునకుఁ గారణ" మని చెప్పిరి. ఆ సగరనృపాలుఁడు జనుల
పలుకులు విని, వారియిష్టము నెరవేర్పఁగోరి, అహితుఁడగు కుమారు నస
మంజుని భార్యాపరివారసమేతముగ రథమెక్కించి, "ఇతఁడు బ్రతికి
యున్నంతకాలము పట్టణములోపలికి రాఁగూడదు. అడవిలోనే యుండ
వలయును" అని పంపివేసెను. ఆ యసమంజుఁడు గుద్దలిని గంపను
గైకొని, పాపంపుఁ బనులు సేయువాని చందమున పర్వతదుర్గములం
దును, నానాదిక్కులందును ద్రిమ్మరుచుండెను. ఈ కారణములచే
మిక్కిలి ధర్మాత్ముఁడయిన సగరుఁడు తనదు పెద్దకొడుకును
విడిచిపెట్టెను. ఇప్పుడు రాముని నడవికిఁ బంపఁదలఁచితివే!
రాముఁ డట్టి యే చెడ్డపని సేసినవాఁడు? రామునియెడ లేశ
మైనను దుర్గుణము గనఁబాలము. చంద్రునందుఁ గళంక మెట్లులేదో,
అట్లే రామునియందుఁ గించిత్తైనను దుర్గుణము లేదు. ఓ దేవీ! అట్లు
కాక, నీ కేదియైన దోషము గనఁబడునేని, దాని నిపుడు యథార్థముగాఁ
జెప్పుము. ఆ కారణమున రాము నరణ్యమునకుఁ బంపవచ్చును.
దుష్టుఁడుగాక, సన్మార్గమునఁ దిరుగువానిని విడుచుట యధర్మము గావున
నట్టి యన్యాయ మింద్రుని సంపదనైనను బోఁగొట్టును. కావున రాముని
పట్టాభిషేకమునకు విఘాతము సేయవలదు. సొగసైన మోముగలదానా,
లోకాపవాదమునకైనను వెఱచి, యిట్టి యన్యాయమునకుఁ బాల్పడ
కుము" అని సిద్ధార్థుఁడు కైకేయితోఁ జెప్పఁగా, రాజు దుఃఖముచే మఱింత
హీనస్వరము గలవాఁడై, కైకేయిం జూచి "ఓ పాపాత్మురాలా, నిన్నుఁ
జూడ దీనికి నీవు సమ్మతింపవనితోఁచెడి. నీకుఁగాని, నాకుఁగాని హిత
మునుగోరవు. నీచమార్గమును ద్రొక్కి కుచ్చితంపుఁ బనులు చేయు
చున్నావు. నీ నడత సన్మార్గమునకు విరుద్ధముగా నున్నది. నేనును
రాజ్యమును, సుఖమును, ధనమును బాసి యిప్పుడే రాముని వెంబడించె
దను. నీవును భరతునితోఁగూడి సుఖము లనుభవించుచుఁ జిరకాలము
రాజ్యము బాలింపుము" అని చెప్పెను.

## 37-వ స ర్గ ము

—● రామాదులు కైకేయి దెచ్చియిచ్చిన నారబట్టలను ధరించుట ●—

రాముఁడు సిద్ధార్థుఁడను ప్రధానమంత్రియొక్క మాటనువిని, వినయమిట్టిదియని యెఱిఁగినవాఁ డగుటఁ జేసి, సవినయముగా దశరథునిం జూచి, "నృపాలా! సుఖములను బాసి, యడవులయందుఁ గందమూల ఫలాదులను దినుచు, సకలాశల వర్జించియుండఁబోవు నాకీ సేనలతో నేమి యుపయోగమున్నది? ఎవఁడైన నొక్కఁడు మేటియేనుఁగునొసఁగి దాని నడుమునకు గట్టెడి మోకును గోరినయెడల నేమి యుపయోగము? ఏనుఁగును విడిచినతర్వాత దాని నడుమునకుఁ గట్టెడి మోకునం దాశపడి యేమి యుపయోగములేదు. ఓ పుడమిఱేఁడా! సత్పురుషశ్రేష్ఠుఁడా! నాకీ సేనలతో నేమి యుపయోగము? అన్నిఁటిని నా భరతునకీ సమ్మతించుచున్నాను. నాకు నారబట్టలఁ దెచ్చి యిత్తురు గాక! అవియే నాకుఁ జాలును. నేను బదునాలుగేం డ్లరణ్యమున నుండ వలయుఁ గావున నాకుఁ బ్రాణధారణమునకై, గడ్డలు దుంపలు గుద్దలిని, బుటికను దెచ్చి యిప్పింపుఁడు" అని యడిగెను.

కైకేయి వెంటనే తానే నారబట్టలఁ దెచ్చి జనులందఱు చూచు చుండఁగా "రామా! యివిగో! నారబట్టలు కట్టుకొమ్ము" అని సిగ్గుమాలి చెప్పెను. ఆ పురుషశ్రేష్ఠుఁడైన రాముఁడు కైకేయివలన నా రెండు నారబట్టలను గైకొని, తాను గట్టియున్న సన్నపుట్టము నూడఁదీసి, యా మునులు దాల్చెడు నారవస్త్రములను గట్టెను. లక్ష్మణుఁడు నచ్చ టనే తండ్రి సమక్షముననే మేలి వస్త్రములను విడిచి తాపసులు దాల్చెడి వల్కలములను గట్టెను. అంతట సీతాదేవి దా నెప్పుడు పట్టుబట్టలఁ గట్టుకొనునది కావునఁ దన నిమిత్తము కైకేయి తెచ్చిన నారచీరను జూచి, వలను జూచిన యాఁడు జింకవలె గడగడ వడఁకెను. శుభలక్షణములు గలదియు, సర్వధర్మముల నెఱిఁగినదియు, భర్తృధర్మములనే తన ధర్మ ములనుగా నెంచుచుండునదియునైన సీత కైకేయి దెచ్చిన నారచీరలను గైకొని, మనంబున మిక్కిలి నొచ్చినదై, కన్నీటిచే నిండిన కన్నులు గలదై, గంధర్వరాజుం బోలెడి తనదు పెనిమిటిం జూచి "నాథా! వన ముననుండు మును లీ నారబట్ట లెట్లు కట్టుకొందురు" అని మాటిమాటి

కడిగి వానిని దాల్చుటకుఁ జేతఁగాక నిశ్చేష్టురాలయియుండెను. అట్లు కొంతసేపుండి, యా సీత యొక వల్కలము మెడకుఁ గట్టికొని, మఱొక్కటి చేతఁ బట్టికొని, కట్టుకొనఁజాలక యచ్చటనే సిగ్గుతో నిలఁబడి యుండెను. ధర్మపోషకులలో మేటియగు రాముఁడు వేగిరంబు సీతకడ కేఁగుదెంచి, యామె కట్టియున్న పట్టుచీరకుఁ బైనఁ దానే నారచీరను గట్టెను. సీతకు శ్రేష్ఠమయిన నారచీరను గట్టుచున్న రామునిఁ జూచి యంతఃపురాంగన లందఱు కన్నీరుగార్చుచు మిక్కిలి యాయాసము నొంది, ప్రతాపముచే వెలుఁగుచున్న రామునిఁ జూచి "ఓ బిడ్డఁడా! గొప్ప మనసు గలదగు సీత వనవాసమునకుఁ బోవలయునని యాజ్ఞాపింపఁ బడలేదు. నీవు పితృవాక్య పరిపాలనముకై యడవి కేఁగినప్పుడు, ఓ ప్రభూ! నీకు మాఱుగా సీతను జూచుచుందెదము. ఓరీ కొడుకా, నీవు లక్ష్మణునిఁ దోడ్కొని వనమునకుఁ బొమ్ము. ఈ సుకుమారాంగియగు సీత మునిపత్నివలె వనవాసము సేయ నర్హురాలుగాదు. ఓ కుమారా! నీవు ధర్మమే ప్రధానముగాఁగలవాఁడవు. నీ విప్పుడు తండ్రి పనుపుఁ దప్పించి యరణ్యమునకుఁబోవక నిలువవుగదా! కావున మా వేఁడికోలు నియ్యకొని సీత నిచ్చట విడిచిపొమ్ము. ఆమె యిచ్చట నుండును గాక!" యని పలికిరి. దశరథ తనయుఁడగు రాముఁ డివ్విధమునఁ బలుకు నంతః పురాంగనల మాటల నాలకించుచుఁ దన స్వభావముంబోలు స్వభావముగల సీతకుఁ దానే వల్కలము గట్టనే కట్టెను. సీత నారచీరలఁ గైకేయి చేతినుండి కైకొన్న వెంటనే, రాజపురోహితుఁడగు వసిష్ఠుఁడు సీతాదేవిని, "నీవు కట్టుకొన నక్కఱలే"దని నివారించి, కైకేయిం జూచి యిట్లనియె. "న్యాయము దాఁటి చెడ్డదారులలోఁ బ్రవేశించు బుద్ధిగలదానా, కులమునకుఁ జెఱుపనచేఁటయైనదానా, నృపాలుని మోసపుచ్చి, మర్యాదమీఱి యెంతపనికైనఁ దెగఁబడితివిగదా! గుణహీనురాలా, సీతాదేవి యేల యడవుల కేఁగవలెను? ఆమె పోవలసినదిలేదు. ఆమెయే రాముని కిప్పుడు సిద్ధముగానుండు సింహాసనమెక్కి రాజ్యముఁ బాలింపఁ గలదు. సంసారియగు గృహస్థునికి భార్యయె యాత్మయని వేదములు సెప్పుచున్నవిగదా! అట్లే రామునికి సీత యాత్మ గనుక సీత రామునికి బదులుగానుండి భూమిని బాలింపఁగలదు. అట్లు కాక, సీత రాముని

వెంబడించి వనంబున కేఁగునేని, మేమును వెంబడింతుము. ఈ పట్టణ మెల్ల వెంబడించును. రాముఁడు భార్యాసమేతుఁడై పోవు వనంబునకే సేనాధిపులును, జనుల కాదరువయిన దశరథుఁడును, నతని దేశమున నుండు జనులును, పట్టణవాసులును తమ సకలపరివారములతోఁగూడఁ బోవుదురు. భరతుఁడును, శత్రుఘ్నుఁడును వల్కలములఁ గట్టుకొని, యడవులఁ దిరుగుచునున్న తమయన్నకడ కేఁగుదురు. అటుపిమ్మట నీ వొక్కతెవె, చెడునడతలు గలదానవై, జనులకుఁ గీడుచేయుచు నిర్మానుష్యమై చెట్లు మొలచియుండు నీ పురము నేలుచుందువు. రాముఁడు రాజుగాని రాజ్యము రాజ్యముగాదు. రాముఁడుండఁగల యరణ్యమె రాజ్య మయ్యెడిని. భరతుఁడు దశరథునకే పుత్రుఁడగునేని, తన తండ్రి తనకు మనఃపూర్తిగ నీని రాజ్యము నేల నిచ్చగింపఁడు. నీవు తన తండ్రికి విరోధముసేసితివిగాన నీయందుఁ గొడుకువలె భక్తిగలిగియుండ నేరఁడు. నీవు నేలనుండి నింగికెగిరినను, తనపెద్దల వంశచరిత్రము నెఱిఁగిన భరతుఁడు మర్యాదకు భంగముగా నడచుకొనఁడు. కావున నీవు నీ కొడుకుపైఁ బ్రేమతోఁజేసిన కార్యము నీకొమరునకు సమ్మతమైనదికాదు. నీవు పుత్రుని కిష్టమని చేయ నెంచిన పని యతనికి విరుద్ధమేయగును. లోకమున రాముని మనము ననుసరించి పోవనివాఁ డొక్కఁడు నుండఁడు. ఓ కైకేయీ! రాముఁడు పయనముగాఁగానే, యీ రామునితోఁగూడ నేఁగదలఁచియుండు సింహ, వ్యాఘ్ర, మృగాదులను నీ విప్పుడే చూడఁగలవు. ఓ కైకేయీ! నీ కోడలుగట్టిన నారచీరను విప్పి, శ్రేష్ఠములయిన యాభరణముల నొసఁగుము. ఈ నీ కోడలగు సీత నారబట్టలను దాల్పఁదగినదికాదు. మఱియు నీవు "రాముఁ డొక్కఁడే వనమున నారబట్టలఁ దాల్చియుండవలయు"నని కోరితివి. కావున నీ కోడలగు సీత భూషణములను దాల్చి, కైసేఁత సేసికొని, రామునితోడ నరణ్యమున వాసము చేయఁగలదు. ఈ సీతయు రామునట్లే జడలను, వల్కలములను దాల్చి వనమునకుఁ బోవలెనని నీవు గోరవైతివి గావున, రాజపుత్రియగు సీత ముఖ్యములయిన వాహనములను, పరిచారకులను, సకలవిధములగు వస్త్రములను, సకలవిధ సాధనములను గూడఁ దీసికొని పయనముగాఁగలదు" అని కైకేయితోఁ జెప్పెను.

బ్రాహ్మణశ్రేష్ఠుఁడు పాటిలేని తపోమహిమ గలవాఁడు నగు రాజ పురోహితుఁడయిన వసిష్ఠమహాముని యీప్రకారము పలుకుచుండఁగా, సీతమాత్రము తన ప్రియకాంతుని యభిమతమునకు విరుద్ధముగాఁ బోఁ దలఁచినదిగాదు కావున సీతయొక్క మనసు గించిత్తయినను మాఱ దాయెను.

## 38-వ సర్గము

### దశరథుఁడు సీతకు నారబట్టలు వలదనుట

సీత నాథుఁడు గలదైనను నాథుఁడు లేనిదివోలె నారచీర గట్టుకొనుచుండఁగ జను లందఱు చూచి, "ఛీ! దశరథుఁడా!" యని దశరథుని మిగుల నిందించిరి. ఆ నగరమందలి యీ కోలాహలమును విన్నతోడనే, యీ మహీపాలుఁడు తన ప్రాణమునందును, ధర్మమునందును, కీర్తియందును నాశవిడిచి, యింకఁ దన కవి రావనియెంచి, వేఁడినిట్టూర్పు విడిచి, యీ భార్యతో, "ఓ కైకేయీ! సీత నారచీరను గట్టుకొని వనమునకుఁ బోఁజనదు. ఆ సీత సుకుమారి; చిన్నవయసుది; ఎల్లప్పుడు సౌఖ్యము లనుభవింపఁదగినది. మా గురువగు వసిష్ఠమునీంద్రుఁడు "ఈ సీత వనవాసమునకుఁ దగినదిగా" దని నిజము చెప్పెను. ఈ రాజేంద్రుని పుత్రికయగు సీత దయసూపఁదగినది. ఈ సీత యెవరికి నీషత్తయిన నపకారము సేయలేదు. ఈసీత నారచీరఁ గట్టికొని జనుల నడుమ వెలవెలపోవుచు, మై మఱచినట్లు, మునికాంతవలె నిలిచి యున్నదే! ఇట్లుండవలసిన యవస్థ యీమె కేల సంభవించెను! ఈమె జనకమహారాజకూఁతురు; సామాన్యురాలు కాదు. ఈమెను నారచీరలను విడిచివేయుమని చెప్పుము. సీతయుఁగూడ నారచీరలఁ గట్టికొని యరణ్యమునకుఁ బోవలయునని వరమును నే నొసఁగనైతిని. కావున రాజపుత్రి యగు నీ సీత తన సౌఖ్యమునకు లోపము వాటిల్లకుండునట్లుగఁ దనకుఁ గావలసిన యమూల్య రత్నాదులను దీసికొని వనమున కరుగునుగాక. నేను బ్రతుకఁదగినవాఁడనుగాను. కావుననే నీ కింతటి క్రూరమైన వాగ్దానమును జేసితిని. ఆడినమాట తప్పలేక యింతకష్టముఁ దెచ్చుకొంటిని. ఇఁక నేమి యనుకొని యేమి యుపయోగము? నీవును మూఢురాలవై రాముని యరణ్యవాసము, భరతుని పట్టాభిషేకము ననెడి

యీ వరములం గోరితివి. ఎవరును దాని పుష్పమె కాల్చునట్లు, నే నొసర్చిన వరదానము నన్నే దహించెను. ఇఁక నేనేమి చేయుదును. ఓసీ క్రూరురాలా! రాముఁడు నీ కెట్టిదైనఁ గీడు రవంతచేసినాఁడను కొందువుపో! అక్కటా! నీచురాలా! నీకు సీత యేమి యపకారము సేసినది? ఈ సీత యాఁడుజింకవలె విశాలమయిన కన్నులు గలది; మెత్తని స్వభావముగలది. నీవలెఁ గీడురోయునది కాదు. చూపఱకు దయ తలఁపఁదగినది. అట్టి జానకి నీకేమి యొగ్గు సేసినది? ఓసీ క్రూరురాలా! రాముని నడవికిఁ బంపుటకుఁ గంకణము గట్టికొంటివే! అది యొక్కటి చాలదా? మఱియు నిట్టి తుచ్ఛంపుఁ బాపకార్యము లేల చేసె దవు? వీనిచే నీకు వచ్చెడు ఫలం బేమి? ఓకైకేయీ! పట్టాభిషేకము నకై వచ్చిన రామునిఁ గూర్చి, "ఈ రామునికిఁ బట్టాభిషేకము నిలిపి యరణ్యమునకుఁ బంపు" మని యడిగితివి. నీమాటను విని నేను నంత మాత్రమునకుఁ బ్రతిజ్ఞ చేసితిని. నీవిప్పు డామాట మీఱి, సీతకూడ నారచీరఁగట్టుచుండఁగాఁ జూచుచున్నావుగదా! నన్నడిగినదానికంటె హెచ్చుగా నీవు గోరుచున్నావు గాన నీవు నరకము నొందఁగోరితివి" అని యివ్విధంబున మహానుభావుఁడగు దశరథుఁడు విలపించుచుఁ గొంచె మైనను వ్యసనముయొక్క దరిఁ గానక, యీ పుత్రవియోగ వ్యసనము నందే మునిఁగినవాఁడై, కడునొచ్చి పుడమిపైఁబడి, మఱలఁ గొంత సేపటికి లేచి కూర్చుండెను. ఆ ప్రకారముగఁ బలుకుచుఁ దలవాల్చి కూర్చుండియుండు తండ్రినిగూర్చి రాముఁ డడవికిఁ దఱలినవాఁడై యిట్లనియె: "ధర్మపరుఁడవగు ఓ ప్రభూ యీ నా తల్లియగు కౌసల్య గుణవతియని కీర్తివడసినది; పెద్దది; గొప్ప స్వభావముగలది; తా మీ ప్రకారముగఁ దన పుత్రుఁడగు నన్నుఁ గానలకుఁ బంప నెంచితిరని తమరిని దూషింపకున్నది. తాము కోరిన గోర్కులొసంగువారుగాన, నన్నుఁబాసి, దుఃఖసాగరమున మునిఁగినదియు, నింతకు మున్నిట్టి వ్యస నముల నెఱుఁగనిదియునైన నా తల్లిని ప్రేమతోఁ జూచుచుండఁ గోరెద. ఇంద్రసమానా! తాము జనులచే మర్యాదసేయఁదగినవారలు. తమ మన్ననచే జాలినొందఁదగిన యీమె నాయెడఁబాటువలని వ్యసనము నెట్లొందక, నన్నే తలంచుచు, తమకడఁ బ్రాణములు నిలుపుకొని

యుండునో, నేను వనమున నుండఁగా, దుఃఖముచేఁ జిక్కిన యామె యమసదనము నొందక, నేను మరల వత్తునని యాశగలిగి, నా రాక కెదురుచూచుచుండునో, ఆ ప్రకారముగఁ దాము సేయవలయు" నని రాముఁడు తండ్రితోఁ జెప్పెను.

## ౩౯-వ సర్గము

{ సుమంత్రుఁడు దశరథాజ్ఞచే రాముని వనంబునకు దోడ్కొనిపోవ రథంబుఁ దెచ్చుట }

దశరథుఁడు పత్నీసమేతుఁడై శ్రీరాముని వచనమును వినియు, మునివేష ధారియగు రాముని జూచియు, స్మృతిఁదప్పి, దుఃఖముచేఁ గడు నొచ్చినవాఁడై, యీ రామునిఁ జూడఁజాలకపోయెను. ఆతఁడు పాఱఁ జూచియు, దుఃఖపారవశ్యముచే మాటలాడఁజాలనివాఁ డయ్యెను. ఆ నృపాలుఁడు ముహూర్తకాలము మైమఱచినవాఁడువోలె నుండి, శోకమునొంది, రామునే మాటిమాటికిఁ దలఁచికొని యేడ్చుచు "తొల్లి నే నెందఱను బిడ్డలనుండి యెడఁబాపితినో? లేక యెందఱు ప్రాణులను హింసించితినో? కావుననే యీ వ్యసనము నాకు సంప్రాప్త మయినదని తలఁచెను. కాలము రానిది పొందెనుండి ప్రాణములు తొలఁగనే తొలఁగవుగదా! ఈపాపాత్మురాలైన కైకేయి పెట్టెడి బాధల ననుభవించుచున్నను నాకు మరణము రాకున్నది. సన్నని బట్ట లనువిడిచి, మునులు గట్టెడి నారబట్టలను గట్టుకొని యగ్నిహోత్రుని వలెఁ దేజరిల్లుచు ముందట నిలఁబడియున్న నా కన్న కొడుకును నేను జూచుచున్నాఁడనే! నాకంటెఁ గ్రూరుఁ డొక్కఁడున్నాఁడే! ఇట్లు మోసము పన్ని, స్వకార్యమునకై ప్రయత్నపడిన యొక కైకేయి నిమిత్త మింతజనము దుఃఖించుచున్నదిగదా" అని చెప్పి, కన్నీటిచే మూఁతపడిన కన్నులుగలవాఁడై "రామా!" యని యొకతడవమాత్రమే పిలిచి, పైమాట చెప్పఁజాలనివాఁ డయ్యెను. అమ్మహీపాలుఁడు కొంత సేపటికి స్మృతిఁదెచ్చుకొని రెండుకన్నులనిండఁ గన్నీరుంచుకొని సుమంత్రుని జూచి, "మంత్రివర్యా! రాజులెక్కఁదగిన మన రథమునకు మేటిగుఱ్ఱములనుగట్టి, తీసికొనివచ్చి, యీ సౌందర్యశాలియగు రాముని నందుఁగూర్చుండఁజేసి, యీ పట్టణమునకు వెలుపటి వనమున

విడిచిరమ్ము. లోకమున గుణవంతులయొక్క సుగుణములకివియె ఫలము కాఁబోలునని తలఁచెదను. శూరుఁడయిన రాముఁడు తలిదండ్రులచే నడవులకుఁబంపఁబడుచున్నాఁడుకదా! ఏలయన, నాడినమాట తప్పరాదను సుగుణముగలిగి యుండుటఁబట్టికదా యిప్పుడు నేను రాముని నడవులకుఁ బంపవలసివచ్చెను. కావున సుగుణములు సయితమొక్కసమయమునఁ గష్టములకే యగుచున్నవి" అని చెప్పెను.

సుమంత్రుఁడును నృపాలుని వాక్యము విని, వేగముగ నడుగులిడుచుఁబోయి, యుత్తమములయిన గుఱ్ఱములచే శోభిల్లుచున్న రథముఁదోలుకొని యచ్చటికి వచ్చి, చేతులుజోడించుకొని "రాజకుమారా! మేటిగుఱ్ఱములఁ గట్టిన, సకలభూషణంబులచే నలంకరింపఁబడిన రథమును దెచ్చిపెట్టియున్నాను" అని రామునితోఁ జెప్పెను. ఆ మాటలు విని, దశరథమహారాజు ధనమును నిలువచేయుటయం దాసక్తిగలవాఁడును దేశకాలముల నెఱిఁగినవాఁడును, లోపలను బయటను సైతము పరిశుద్ధుఁడును, స్థిరమయినమనస్సుగలవాఁడునునైన బొక్కసపుటధికారిని వేగిరముగఁ బిలిచి, "ఓ ధనాధ్యక్షా! యెక్కువ వెలగల వలువలను, శ్రేష్ఠములైన భూషణములను నీ పదునాలు గేండ్లకుఁ జాలినంత లెక్కపెట్టి, వేగముగ సీతకుఁ దెచ్చియిమ్ము" అని యానతీఁగా, ధనాగారాధిపతి, బొక్కసమునకుఁ బోయి, నృపాలుఁడు చెప్పినప్రకారము సరిగాలెక్కపెట్టితెచ్చి సీత కొసఁగెను. అయోనిజయగు నా సీత వనమునకుఁ బయనమైనదై, చక్కని తన యంగములను వింతలైన సొమ్ములతో నలంకరించుకొనెను. ఆ భూషణములచే నలంకరింపఁబడిన యా సీత, యరుణోదయకాలమునఁ బొడుచుచున్న సూర్యుని కాంతి యాకసమును వెలుఁగజేయుమాడ్కి నా రాజగృహము నలంకరింపఁజేసెను.

అట్టి సమయమున న త్తయగు కౌసల్య, దిగులుతోఁగాక, సంతసముతోఁ బనులు చేయుచున్న సీతను రెండు చేతులతోఁ గౌఁగిలించుకొని, శిరము మూర్కొని యిట్లనియె:—

ఈ ప్రపంచమునం దంతయుఁ బెద్ద యతివలు తమ ప్రియులచే నెల్లప్పుడు మన్ననపడయుచున్నను నొకప్పు డిడుములంబడిన తమ భర్తలను లెక్కసేయరు. మగువలు భర్తలవలనఁ దొలుత నెక్కువ సౌఖ్యము

ననుభవించినను, స్వల్పమైన యాపదవచ్చినప్పుడు మగలను నిందింతురు; తుదకు విడువనైనను విడుతురు. ఇది సామాన్యముగ మగువల స్వభావము. జవరాండ్రు బొంకులాడుట స్వభావముగఁ గలవారు; సకల ప్రయత్నములచేతను గనిపెట్ట నలవికానంత లోఁతయిన మనస్సుగల వారు; అప్పటప్పటికి మనమున మార్పునొందువారు; చెడుతలంపులు గలవారు; క్షీణదశలలో భర్తలపైఁ బ్రేమవిడుచువారు. స్త్రీలు కులమును, ఉపకారమును, విద్యను, ఇచ్చినవస్తువులను, లోక మర్యాదలను మనమున లెక్కింపరు. వారి మనస్సు లెల్లపుడు చపలములై యుండును గావున వారిని నమ్మరాదు. మంచి స్వభావము, సత్యము, శాస్త్రజ్ఞానము, ఓర్పు అను వానియందు నిలుకడగల పతివ్రతలగు స్త్రీలకన్ననో, భర్త యొక్కఁడే పరమపావనమైన దైవము. కావున, ఓ సీతా! కానలకుఁ బంపఁబడిన నా కొమరుని నీ వలక్ష్యము సేయకుము. అతండు పేద డైనను ధనికుఁడైనను అతఁడే నీకు దైవము" అని కౌసల్య సీతతోఁ జెప్పెను.

సీతయుఁ దన యత్తగారు చెప్పిన ధర్మయుక్తమైన మాటను విని, తనయెదుట నిలఁబడియున్న యత్తగారినిగూర్చి యిట్లనియె. "ఓ పూజ్యురాలవయిన యత్తగారా! తమ రానతిచ్చిన చొప్పున నేనంతయును నొనర్చెదను. భర్తకడ నెట్లుండవలయునో యదియెల్ల నే నెఱుంగుదును. నేను పెద్దలకడ వినియున్నాను. ఓపూజ్యురాలా! నన్నుఁ జెడిపెలతో సరిపోల్పకుము. చంద్రునికడనుండి యతని కాంతి తొలఁగిపోనట్లు నేను ధర్మమునుండి తొలఁగిపోఁజాలను. తంతులులేక వీణ వాయింపఁబడదు; చక్రములు లేక బండి కదలదు. అట్లే నూరుగురు బిడ్డలఁ గన్నదైనను ఆఁడుది పెనిమిటిలేక సుఖముఁ బడయఁజాలదు. ఆఁడుది తన తండ్రి నేదైన నడిగిన, నతఁడు మితముగా నొసఁగును; తల్లియు మితముగా నొసఁగును; కుమారుఁడును మితముగా నొసంగును; భర్త యన్ననో యమితముగా నొసఁగును; అట్టి భర్త నే కాంత పూజింపకుండును? ఓ పూజ్యురాలా! నేను మహాపతివ్రతను; తమబోటి పెద్దలవలన ధర్మముయొక్క యివతలి యవతలి గట్టుల నెఱిఁగినదానను; అట్టి నేను భర్త నవమానింతునే? స్త్రీలకుఁ బెనిమిటియేకదా దైవము"

అని సీత కౌసల్యతోఁ జెప్పెను. నిష్కపట స్వభావముగలదగు కౌసల్య సీతయొక్క మనోహరమయిన వాక్యమును విని, 'యిట్టి సీత యరణ్యమున కేఁగుచున్నదే' యనెడు వ్యసనమువలనను, 'మన రాముని కీర్తి సుగుణసంపన్నురాలగు పెండ్లాము వచ్చెను గదా. ఇఁక మనకేమి కొదువ' యనెడి సంతసమువలనను గలిగిన కన్నీటిని వెంటనే విడిచెను.

ధర్మమునందే యెక్కువబుద్ధి గలరాముఁడు కృతాంజలియై తల్లులనడుమ మిక్కిలి గారవింపఁదగు తనతల్లికిఁ బ్రదక్షిణముసేసి, యామె నుద్దేశించి, "అమ్మా! నీవు వ్యసనపడకుము. నాతండ్రిని గనిపెట్టుకొనియుండుము. వనవాసముయొక్క ముగింపు వేగిరమే రాఁగలదు. కనుమూసి తెఱచునంతలోపలఁ బదునాలుగేండ్లు నిండఁగలవు; ఆవలఁ బరిపూర్ణ మనోరథుఁడనై, చెలికాండ్రతోఁగూడ నేఁగుదెంచిన నన్నుఁ జూడఁగలవు" అని సవినయముగాఁ దల్లితోఁ జెప్పి, యామెవలెనే దుఃఖించుచున్న మిగిలిన మున్నూటయేఁబదుగురు తల్లులను జూచి, "తల్లులారా! చిరకాలపరిచయముచేఁగాని, తెలిసితక్కువచేఁగాని నే నేవేని పరుసములు పలికియుండిన వానినెల్ల మన్నింపుఁడు. మిమ్ము నందఱ నడిగిపోవచ్చితిని. పోయివచ్చెదను" అని చెప్పెను. వారందఱు రాముఁడు వినయముతో ధర్మమునకు విరుద్ధముగాకుండఁ బలికిన యా మాటను విని, మిక్కిలి రోదనము చేసిరి. ఆ యంతఃపురాంగనల రోదనధ్వని, యాఁడు క్రౌంచపక్షుల కూఁతలవలె నుండెను. తొల్లి మద్దెలలయు, నుడుకలయు, మేఘములవను ధ్వనులతోఁగూడియుండిన దశరథుని భవనమిప్పుడు రోదనధ్వనులచేఁ గలఁతపడి, తీరని వ్యసనముతోఁ గడు దుఃఖము గలదయ్యెను.

## 40-వ సర్గము.

### సుమిత్ర లక్ష్మణునకు బుద్ధి సెప్పుట

అంతట రామలక్ష్మణులును, సీతయుఁ జేతులు జోడించుకొని తండ్రికి నమస్కరించి, ప్రదక్షిణము గావించి, యాతని యనుజ్ఞ గైకొనిరి. అంత రాముఁడు ధర్మజ్ఞుఁడగుటచేఁ దల్లిని విడువఁజాలక దుఃఖముచే నొడలు దెలియనివాఁడై, తల్లికి నమస్కరించెను. లక్ష్మణుండును నన్నకు వెంబడే కౌసల్యకు మ్రొక్కి, తరువాతఁ దన తల్లియగు

సుమిత్ర పాదములకు మ్రొక్కెను. సుమిత్ర తన కుమారుఁడగు లక్ష్మణుండు మ్రొక్కుచుండుటను జూచి, విలపించుచు నతని మేలు కోరినదై పొడవుచేతులవాఁడగు లక్ష్మణుని శిరమాఘ్రాణించి యి ట్లనియె. "ఓరీ నాయనా! నీ వడవులం దునికికై పుట్టితివి. చెలికాఁడయిన యన్నయం దనురాగంబుఁ గొంటివి. నాయనా! అన్నగారు పోవునపుడు, ఆతని కెట్టి యాపద రాకుండఁ జూచుచు నేమఱుపాటు లేక యుండుము. ఆతఁడు దుఃఖముగలవాఁ డయినను, సంపదగలవాఁ డయినను, ఓ దోషరహితుఁడా! ఆతఁడే నీకు గతి. అన్నకు లోఁబడి యాతని యిష్టప్రకారము నడచుకొనుట తమ్మునికి విధి. లోకములోని యీ క్షత్రియకులమునఁ బుట్టిన వానికి ఇదియు దానము, యజ్ఞములు, యుద్ధములందు దేహమువదలుట యనునివియు శాశ్వతములైన ధర్మములుగదా". అని యివ్విధమునఁ జెప్పి, సుమిత్ర, లక్ష్మణునిఁ జూచి రాముని లోకమునకంటెఁ బ్రియునిగా నెంచి యతనివెంటఁ బయనమునకు సిద్ధుఁడై యున్న యాతనితో "ఓ నాయనా! రాముని నీ తండ్రియగు దశరథునిగాఁ దలఁచికొనుము. సీతనే నీ తల్లియగు నన్నుఁగాఁ దలఁచికొనుము. అరణ్యమునే యయోధ్యాపట్టణముగా నెంచుము. నాయనా! సుఖముగాఁ బోయి రమ్ము" అని మఱలఁ జెప్పిపంపెను.

అంతట వినయ మిట్టిదని యెఱిఁగినవాఁడగు సుమంత్రుఁడు వినయముగలవాఁడై, రామునిం జూచి, మాతలి దేవేంద్రునితోఁ జెప్పిన ట్లాతనితో "ఎక్కువ కీర్తిగల యో రాజపుత్రా, తేరెక్కుము. నీకు మేలయ్యెడు. నీ వెచ్చటికిఁ దోడ్కొనిపోయి విడువమనెదవో, యచ్చటికి నిన్నుఁగొనిపోయి విడిచెదను. కైకేయి చెప్పినచొప్పున నీవు పదునాలుగేండ్లరణ్యమున నుండవలసినది, నీ విపుడా వనవాసమున కుపక్రమింపవలసినది" యని చెప్పెను.

సొగసయిన పిఱుఁదులుగల సీతాదేవి, తా నలంకారము చేసికొని, వనమునకుఁ బోవలసివచ్చెగదా యని తలంపక సంతసముతోఁ గూడిన మనముతో, సూర్యునిఁబోలె, వెలుఁగుచున్న యా రథము నెక్కి కూర్చుండెను. ఆ తరువాత యన్నదమ్ములగు రామలక్ష్మణు లిద్దఱును బంగరుసొమ్ములచే నలంకరింపఁబడినవారై యగ్నిహోత్రునివలె దేదీప్యమాన

మైయున్న యా రథము నెక్కిరి. దశరథుఁడు వారు వనవాసమున నెన్ని దినము లుండవలెనో, యన్ని దినంబుల కెన్ని చీరెలు, తొడవులు గావలెనో, యన్ని పుట్టములను, సొమ్ములను, భర్తను వెంబడించునట్టి సీత కొసఁగెను. అట్లె యన్నదమ్ముల కిరువురకుఁ గావలసిన యాయుధ సమూహములను, కవచములను నొసఁగెను. అంత దశరథుఁడు సీతా రామలక్ష్మణుల కొసఁగిన భూషణములను, వస్త్రములను, నాయుధములను, చిన్నపుటికను, గుద్దలిని సుమంత్రుఁడు రథమునడుమ నుంచి, సీతతోడఁ జేర్చి ముగ్గురుగా రథమున రామలక్ష్మణులు, గూర్చుండిన తోడనే, వాయువేగములు, లక్షణయుక్తములు నయినగుఱ్ఱములను గట్టిగా నదలించి తోలెను. రాముఁడు బహుకాలముండుటకయి యడవికిఁ బ్రయాణమయినంతటనే, యయోధ్యాపురమునందలి జనులును, సైనికులును మూర్ఛనొందిరి. ఆ పురమునందలి జనులు రాముఁ డరణ్యమునకుఁ బోవుచున్నాఁడని విన్నంతనే మిక్కిలి కలఁతనొంది, తత్తరపడుచు గొల్లగానము చేసిరి. ఏనుఁగు లన్నియు నది విని, మదించినవై కోపముచే ఘీంకారములు చేసినవి. గుఱ్ఱము లన్నియు బెదరి యిట్టట్టు పరుగులిడుటచే, వాని కాలియందెలు మొదలగు భూషణముల ధ్వనులు చెలరేఁగినవి. ఇట్లయోధ్యాపురమునఁ గలిగిన గొప్ప రొద చెవులకుఁ జెవుడు పడునట్లు చేసెను. అంతట నా పురవాసులంద ఱాబాలవృద్ధముగా మిక్కిలి వ్యసనపడి, - వేసవిని దప్పిగొన్న వాఁడు నీటిని వెదకుచుఁ బోవునట్లు, రామునే వెంబడించి పరువిడిరి. అట్లు పౌరు లందఱు వెంబడించి, కొందఱు రథమువెనుకను, గొందఱు రథముప్రక్కలను బట్టుకొని వ్రేలుచుఁ గొందఱు రథమున కెదుటను నిలుచుచుఁ గండ్లనుండి కన్నీరు గార్చుచు, వేఁడి నిట్టూర్పులు విడుచుచు నా సుమంత్రుం జూచి, "ఓ సారథీ! గుఱ్ఱముల పగ్గముల నీడిచి పట్టుకొనుము; రథమును మెల్లగాఁ బోనిమ్ము. రాముని ముఖమును మేము చూచెదము. ఆ మోము నికఁ జిరకాలము చూడఁబోముకదా! అక్కటా! రాముని తల్లియొక్క హృదయ మురుక్కుతోఁ జేయఁబడినది. ఇందుకు సందియము లేదు. అట్లు కానిచో, దేవకుమారునింబోలు రాముఁ డడవికిఁ జనుచుండఁగా నామె హృదయము బ్రద్దలు కాకుండునా? నీడవలె సీత తన

భర్తను వెంబడించెం గాన నామె ధన్యురాలు. సూర్యునికాంతి మహాపర్వతమునుబోలె భర్త్రానురక్తురాలయి సీత భర్తను విడువదు. ఓ లక్ష్మణా! నీ వదృష్టవంతుఁడవు. నీ కార్యం బీడేరును. ఎల్లప్పు డింపు మాటలు పల్కు దేవసమానుఁడయిన యన్నను గొలువఁ బోవు చున్నావు. ఇంతటిభాగ్య మెవరికి దొఱకును? నీ వీ రాముని వెంబడించుట యనునది నీకొక గొప్పదేవతానుకూల్యము. నీకిది యొక గొప్ప యభివృద్ధి. నీ కిది యొక స్వర్గద్వారము." అని యిట్టివిధమునఁ బలుకుచుఁ బ్రియుఁ డైన యిక్ష్వాకునందనుఁడగు రాముని వెంబడించుచుఁ గన్నులందుండి పచ్చెడి కన్నీటి నాఁపుకొనఁజాలరైరి. అంతట మిగుల దిగులుపడియున్న దశరథుఁడు దుఃఖముచేఁ గలవరపడి, సంతపముఁ దక్కియున్న పత్ను లతోఁగూడి ప్రియకుమారుఁ డగు రామునిఁ జూడఁబోయెదనని యిల్లు వెడలి బయలుదేరెను. మగయేనుఁగును గట్టివేసినపు డాఁ డేనుఁగులు గుంపుగఁగూడి ఘీంకారము చేయఁగా గొప్ప రొద పుట్టున ట్లాయంతః పురాంగన లందఱు గూడి యేడ్చుచుండఁగా గొప్ప రొద పుట్టెను. రామునితండ్రియగు కాంతిమంతుఁ డయిన దశరథనృపాలుఁడును రాముని వియోగమువలని దుఃఖముచేఁ బున్నమనాఁడు రాహువుచే మ్రింగఁబడిన నిండుచందురునిమాడ్కిఁ జిక్కియుండెను. కలిమిగల వాఁడును, ఎఱుఁగరాని మహిమగలవాఁడును నైన దశరథనందనుఁడగు రాముఁడన్నవో రథము వేగిరముగాఁ దోలుమని సుమంత్రునిఁ దొందర పెట్టె. జనులు సారథిని నిలుమనిచెప్పిరి. ఇట్లు రాముఁడు రథమును శీఘ్రముగఁ బోనిమ్మనియు జను లాఁపుమనియుఁ జెప్పఁగా నప్పుడు సూతున కెట్లు చేయుటకును జేతఁగాక పోయెను. పొడవు చేతుల వాఁడగు రాముఁడు పత్తనము విడిచిపోవునపుడు పైకిలేచిన దుమ్ము పురజనుల కన్నీటిచేఁ దడుపఁబడి యణఁగెను. రాముఁడు పయనమైపోవునపుడు పురజను లందఱు నేడ్పువలని కన్నీటిచేఁ దడిసిన వారలై, హాహాకారములు చేయుచు, మిక్కిలి నొచ్చినవార లగుచు నుండిరి. చేఁప లిట్టటు తిరుగుటచేఁ గదలెడు తామరపువ్వులనుండి నీరు బొట్లుబొట్లుగాఁ గాఱునట్లు, వ్యసనమువలని కన్నీరు తామరపువ్వుల రేకులఁబోలు స్త్రీల కన్నులనుండి బొట్లుబొట్లుగాఁ గాఱుచుండినవి.

కాంతిమంతుఁడగు దశరథనృపాలుఁడు, పురమెల్ల నా రామునిం దోడ్కొనియుంచే మన సుంచియుండుటను జూచి, మహా దుఃఖముతో మొదలునఱికిన వృక్షమువలెఁ గ్రిందఁ గూలఁబడెను. దశరథుఁడు రాముని వెంబడించి కడు వ్యసనముతోఁ గృశించి చతికిలఁబడిపోవుటం జూచి జనులందఱు నల్లకల్లోలముగా నఱచిరి. కొందఱు జనులు "అయోధ్యా! రామా!" యనియు, మఱికొందఱు "అయ్యో! కౌసల్యా!" యనియు నిత్తెఱఁగున నంతఃపురాంగన లందఱును కౌసల్యను జుట్టుకొని రోదనము సేసిరి. రాముఁడును బార్శ్వములఁ దృష్టి నెఱపుచుఁ, జెదఱిన మనంబుతోఁ దన్ను వెంబడించి దారిని వచ్చుచున్న తల్లిదండ్రుల నిరువురను జూచెను. ఆ రాముఁడును, త్రాటిచేఁ గట్టివేయఁబడిన గుఱ్ఱపుఁ బిల్ల తల్లిని బాగుగఁ జూడఁజాలనట్లు, ధర్మమను త్రాటిచేఁ గట్టఁబడినవాఁడై తల్లిని సరిగాఁ జూడఁ డయ్యెను.

అంతట రాముఁడు రథముపై నెక్కి రాఁదగినవాఁడయినను గాలినడకను వచ్చుచుట్టివారును, సుఖము ననుభవింపఁదగినవాఁడయినను, దుఃఖము ననుభవించువారును, నట్లు దుఃఖానుభవమునకుఁ దగనివారునునైన తన తల్లిదండ్రులం జూచి, వారికష్టములఁ జూడఁజాలక సారథిని ద్వరగాఁ బోనిమ్మని ప్రేరణచేసెను. మావటీనిచే నంకుశముతోఁ బొడువఁబడిన యేనుఁగువలె ధర్మపాశముచేఁ గట్టుపడిన రాముఁడు వ్యసనకరమైన తన తల్లిదండ్రుల దర్శనము నోర్వఁజాలక, సారథి కట్టాజ్ఞ సేసెను. గోవు యొద్ద దూడను గట్టివేసి యావుకు బాలనుకొనఁ దోలినయెడల, నది దూడమీఁది మురుపుచే నెట్లు దూడ నిమిత్తమై యుండలేక మరలి వచ్చునో, అట్లు కౌసల్యయును రథమునకుఁ గూర్చుండిపోవుచున్న రాముని వెంబడించి పరుగిడెను. అట్లు రథమును వెంబడించి పరుగెత్తుచు "అయ్యో! రామా! అక్కటా! లక్ష్మణా! హా! సీతా!" యనుచు కేకలిడుచు, సీతారామలక్ష్మణుల నిమిత్తమై కన్నీరు విడుచుచును, నృత్యము చేయువానివలె దుఃఖాతిశయమునఁ జిందులు ద్రొక్కుచున్న తన తల్లిని బలుమాఱు చూచెను. దశరథుఁడు సుమంత్రుని నిలువుమని యఱచెను. రాముఁడు "పో పొమ్మని" యఱచెను. అప్పుడు సుమంత్రుని మనసు రెండు చక్రములనడుమఁ జిక్కినవానివలె మిక్కిలి వ్యాకులపాటు నొందెను.

అప్పుడు రాముఁడు సుమంత్రునిజూచి, "ఓ సారథీ, నీవు సంశయపడకుము. రథముఁ దోలుము. ఒకవేళ నృపాలుఁడు నీవు మఱలివచ్చినప్పుడు "నేను రథము నిలుపుమని యఱచినపుడు నీ వెందుకు నిలుపలేదు" అని యడిగి, నిన్నుఁ గసరి తిట్టినను, నీవు "మహాప్రభూ! చిత్తము! నాకుఁ దమ పిలుపు జనుల సందడిలో వినఁబడలే"దని చెప్పుము. అట్లయిన నేలరథముఁ దోలుమని నిన్నడిగెద నందువేమో? "ఒకరు దుఃఖపడుచుండఁగాఁ జిర కాలమోర్చి చూచుచుండుట మిక్కిలి కష్ట"మని చెప్పెను. అంత సుమంత్రుఁడును రాముని మాటచొప్పున రథముఁ దోలఁగోరి, రథమువెంబడి వచ్చుచున్న వారి కందఱికిని రామునిచే సెలవిప్పించి పంపి, వేగముగఁ బొలుచున్నను, గుఱ్ఱములను మఱింత తొందరగాఁ బరుగిడునట్లు తోలెను. రాజభటులందఱు రామునికిఁ బ్రదక్షిణముసేసి మఱలిరి. తక్కిన జనుల గుంపులన్నియు మనస్సును, గన్నీళ్లప్రవాహమును నా రాముని వెంబడిఁ బంపినవి. అవిమాత్రము తగ్గనేలేదు. "ఎవఁడు త్వరలో రావలెనని మనము కోరుదుమో, అతనిని బహుదూరము వెంబడింపరాదు" అని మంత్రులు దశరథునితోఁ జెప్పిరి. దిగులు పడియున్న దశరథుఁడు మంత్రులు చెప్పిన హితవగు మాటను విని, జోఱు చెమటలచే దడిసిన మేనుగలవాఁడై యా సకలగుణసంపన్నుఁ డయిన కుమారునేఁ జూచుచుఁ బత్నులతోడ నిలఁబడెను.

## 41-వ సర్గము

### రాముని వనవాసమునకై మూఁడులోకములవారు దుఃఖించుట

పురుషోత్తముఁ డయినరాముఁడు తల్లిదండ్రులు మొదలగు పెద్దలకెల్లఁ జేతులు జోడించి వినయమును గనఁబఱచుచు నడవికిఁ దఱలఁగా, నపు డంతఃపురమున స్త్రీల రోదనధ్వని పుట్టెను. "దిక్కులేని వారికిని, బలిమిలేనివానికిని, దయచూపఁదగినవారికిని నెవఁడు గతిగాను, రక్షకుఁడుగాను నుండెనో, యారాముఁ డెచటికిఁబోయెను? ఏ రాముఁడు తిట్టినను గోపగింపఁడో, కోపమురాఁదగిన సందర్భములనుగూడ వదలి చిన్నలనైనను బెద్దలనైనను గోపపడువారి నందఱిని శాంతింపఁజేయుచు నితరుల సుఖదుఃఖములను దనివిగనే యెంచువాఁడగు నా రాముఁ డేడఁబోయెను? "ఈమె మనతల్లి, వీరు పొరుగువారు" అను భేదములేక కౌసల్యయం

దును, మనయందును నొకతీరునన నే భక్తిని బ్రేమను నెఱపుచుట్టి గొప్ప బుద్ధిగల రాముఁ డెచ్చటికిఁబోవుచున్నాఁడు? ఆఁడుదియగు కైకేయి తొందరపడలేక నృపాలుఁడు ప్రేరణసేయఁగా, సకల లోకములకు శరణ్యుఁడైన రాముఁ డెచ్చటికిఁ బోవుచున్నాఁడు? ఓహో! నృపాలుఁడు వివేకహీనుఁడు కాఁబోలు! కావుననే, జంతుసమూహముల కెల్ల మిక్కిలి యిష్టుఁడును, ధర్మమార్గముఁ దప్పనివాఁడును నైనరాముని వనమునకుఁ బంపఁ దలఁచినాఁడు" అని యంతఃపురమునందు రాణులందఱు దుఃఖముచే నొచ్చినవారలై, దూడలఁ బోనాడిన యావులవలె నాక్రందనము చేసిరి; గొంతెత్తి మిక్కిలి బిగ్గఱగా నఱచిరి. పుడమిఱేఁడు మొదట కొడుకు నెడఁబాయుటవలని యంగలార్పుచే మిక్కిలి నొచ్చినవాఁడై, దానితోడ నంతఃపురమునందలి రాణులరోదన ధ్వనిని నైతము విని, కడు దుఃఖమునొందెను. రాముఁడు కానలకుఁ బయనమగుటఁజూచి, గేస్తులగ్నిహోత్రముల వేల్వరైరి; పాకములఁ జేయరైరి; ప్రజలు పనులను జాలించిరి; సూర్యుఁడును గ్రుంకెను. ఏనుఁగులు తమ తొండములతో నెత్తికొన్న కబళములను విడిచినవి. ఆవులు దమ దూడలకుఁ బాలియ్యవాయెను. తల్లులు తమ మొదటికొడుకులను జూచి, "మనగతి యింతయే కదా" యని సంతసమొందరైరి. * త్రిశంకువు, నంగారకుఁడు, బృహస్పతి, బుధుఁడు, మఱికొన్ని క్రూరగ్రహములు భీకరములై చంద్రునికడఁ జేరియుండినవి. రిక్కలును దక్కిన గ్రహములును గాంతిలేనివై ప్రకాశింపకుండెను. విశాఖానక్షత్రములుగూడ కనుమాసి బాగుగఁ బ్రకాశింపకుండెను. ప్రలయకాలమందలి సుడిగాలిచే నుప్పొంగి మిన్నుముట్టిన మహాసముద్రమువలె, నాపట్టణమునందలి జన సమూహముఁ గలఁగుచుండిరి. పట్టణమెల్లఁ గదలిన ట్లుండెను. దెస లన్నియుఁ జీకట్లు గ్రమ్మినట్లు గుర్తింపరాకుండినవి. మఱియు నొకగ్రహముకాని, యొక నక్షత్రముకాని మరియేవస్తువుకాని ప్రకాశించినదికాదు. పట్టణమునందలి జనులందఱు హఠాత్తుగా వగలపాలయి, భోజనములందును, వేడుకలం

* ఈ త్రిశంకువు విశ్వామిత్రునచే ముందటి వాఁడు. స్వర్గమునుండి త్రోయఁబడి, యాకాశమున నక్షత్రమండలమున నక్షత్రమువలె విరాజిల్లుచున్న వాఁడు. బాలకాండ చూడుఁడు.

డును మనస్సులేనివారైరి. అయ్యయోధ్యాపురమునందలి జనులందఱు గుబులుగొని వచ్చెడు దుఃఖముచే మిక్కిలి వెతల నొంది, యెడతెగని నిట్టూర్పులు విడుచుచు, "దశరథునివలనఁగదా మనకింత వ్యసనము సంభవించెను" అని యతనినే మనంబునఁ దలపోయుచు వగచుచుండిరి. గన్నీటిచేఁ దడిసి కలఁగినమోములతో రాజమార్గమున నున్న జనమునందొక్కనిమోముననేని సంతోషము కానరాకుండెను. అందఱును దుఃఖితులయియుండిరి. చల్లనిగాలి వీవకుండెను. చంద్రుఁడు కాంతిదఱిఁగియుండెను. సూర్యుఁడు లోకముల వెలుఁగఁజేయక, మబ్బుక్రమ్మినట్లుండెను. లోకమంతయుఁ గలఁతపడియుండెను. స్త్రీలు బిడ్డలందును, మగలందును, తోఁబుట్టువులందును ప్రేమలేకయుండిరి. వేయియేల? అందఱు సర్వకార్యములను విడిచి, రామునే తలఁచుచుండిరి. రాముని యాప్తులందఱు దెలివిఁదప్పినవారలయి, దుఃఖమనెడి బరువుచేఁ గ్రుంగినవారలై లేవఁజాలక పాన్పులందే పరుండియుండిరి. ఏనుఁగులు, గుఱ్ఱములు, భటులు మున్నగువారితోఁగూడిన యీ యయోధ్యాపురము, పర్వతాదులతోఁగూడిన భూమండలము, దేవేంద్రుని వియోగముచేతవలె నా మహాత్ముఁడయిన రాముని వియోగముచే "నిఁక మనకు రక్షకుఁడెవ్వఁ" డనియెడి భీతిచేతను, "మనయందు దయ చూపుచుండినవాఁడు మనలవిడిచిపోయెనే" యను విచారముచేతను నొచ్చినదై గడగడవణఁకిపోయెను.

## 42-వ సర్గము.

### దశరథుఁడు కౌసల్య యంతఃపురము సేరుట

రాముఁడు బయలుదేఱిపోవునప్పు డెంతవఱకు రథగమనమువలని దుమ్ము గనఁబడుచుండెనో, అంతవఱకును నిక్ష్వాకువంశస్థులలో శ్రేష్ఠుఁడయిన దశరథనృపాలుఁడు తనదృష్టిని మఱలింపఁడయ్యెను. ఆ దశరథనృపాలుఁడు మిక్కిలి ధార్మికుఁడయిన తన ముద్దులకుమారునిఁ జూచునంతవఱకును నృపాలుఁడు తన కొడుకును జూచుటకై, యీ పుడమిపైని పరాగము వృద్ధిఁబొందుచున్నదో యనునట్లు తోఁచెను. ఎప్పుడు రామునియొక్క రథగమనమువలనఁ బుట్టిన పరాగముగూడ నగపడలేదో, యప్పుడే నృపుఁడు మిక్కిలి నొచ్చి దుఃఖమునొంది, నేలకొఱఁ

గెను. కౌసల్యాదేవి నృపాలుఁడు క్రిందఁబడఁగా నతని కుడిచేతినాని నిలిచెను. భరతునిపైఁ బ్రేమగల కైకేయి యెడమచేతినాని నిలిచెను. న్యాయశాస్త్రజ్ఞానము, ధర్మాచరణము, వినయము ననువీనితోఁ గూడిన యా దశరథుఁడు తన యెడమప్రక్క నిలిచిన కైకేయినిజూచి, మనము నందు మిగుల నొచ్చి, "ఓసీ కైకేయీ! నీవు నా యవయవములను ముట్టకుము. నీవు దుష్టురాలవు. నేను నీ మోముచూడ నిచ్చగింపను. నీవు నాకుఁ బెండ్లామువుగావు, చుట్టమునుగావు. నిన్నాశ్రయించి బ్రతుకుచున్న వారికి నేనుగాను; నాకు వారుఁగారు. అర్థమొక్కటె ప్రధానముగాఁగలదానవు, ధర్మము మీఱినదానవునైన నీవు నాకడ నుండఁజనదు. నేను నిన్ను విడనాడితిని. నే నగ్నిహోత్రుని సమక్షము నందే నీచేతినిఁ బట్టితినో, ఆ హస్తము నీ లోకమునను బరలోకమునను విడిచెదను. నీ తోడి యెల్ల సంబంధమును విడిచిపెట్టెదను. భరతుఁ డీ శాశ్వతమయిన రాజ్యమునుబడసి ప్రసిద్ధి కెక్కునుగాక! పితృ ప్రీతికై యాతఁడు నా కొసఁగు జల తర్పణాదులు నాకుఁ జెందకుండును గాక" అని కైకేయిని దూఱెను. అటుపిమ్మటఁ గౌసల్య నృపాలుని లేవ నెత్తి దేహమంతయు నంటుకొన్న దుమ్ముదుడిచి, వ్యసనముచేఁ జిక్కి నదై, యప్పుడే తననగరునకు మఱలెను. ధర్మమునడపుటయే స్వభా వముగాఁగల దశరథుఁడు కావలెనని బ్రాహ్మణునిఁ జంపినవాఁడు వోలెను, చేతితో నిప్పునంటినవాని పగిదియు మునివేసముఁ దాల్చి యడవికిఁ జనిన రాముని దలఁచి తలఁచి సర్వదా సంతాపము నొందు చుండెను. తిరిగితిరిగి చూచుచు వచ్చుచుండు దశరథనృపాలుని రూపము రాహువుచే మ్రింగఁబడిన సూర్యబింబముపగిదిఁ దేజరిల్లకుండెను. దశరథుఁడును తన ముద్దుల కొడుకునే తలఁచి తలఁచి యిట్లు దుఃఖపడు చుండి, రాముఁడూరిపొలిమేరను జేరెనని, తెలిసికొని "నాకుమారునిఁగొని పోవు మేటి గుఱ్ఱముల యడుగులు కనఁబడుచున్నవి కాని, ఆ మహాత్ముఁ డయిన రాముఁడు గనఁబడఁడు. నా కొడుకులలో మేటియయిన యే రాముఁడు గంధముపూసికొని, చక్కనైన జవరాండ్రు విసరు చుండఁగా, మెత్తని పాన్పుపైఁ బరుండుచుండునో, ఆ రాముఁడు నేఁ డెచ్చటనో యొక చెట్టు మొదటఁ గొయ్యయో, రాయియో తల

గడగాఁ జేసికొని తప్పక పడుండఁగలఁడు. నేలపైఁ బరుండుటం జేసి, నా కొడుకు మిక్కిలి దీనుఁడై, యుదయమున లేచునపు డొడలంతయు నంటుకొన్న దుమ్ముతోఁ గూడినవాఁడై సెలయేటినుండి యాఁడేనుఁగుల రాయఁడు లేచునట్లొకటికి నేలపైనుండి లేవఁగలఁడు. అట్లు లేచి పోవు చుండు పొడవుచేతులవాఁడగు రాముని ముల్లోకములజేని నైనను దిక్కులేనివానిని బోలె వననివాసులు చూడఁగలరు. ఇది నిజము. రాముని సంగతి యటుండనిమ్ము. ఆ జనకమహారాజు కూఁతురగు సీత యెల్లప్పుడు సుఖము ననుభవింపఁదగినది. ఆమె యిప్పుడు ముండ్లపై నడుగులుంచి యడవిని బోవుచుండును. ఆపె యడవులన నెట్టివో యెఱుఁగ నిది. ఆ సీత గంభీరమును మేనికి గగ్గుర్పాటొదవించునదియును నగు మృగముల నినాదములను విని వెఱపుఁ గొందఁగలదు. ఇది నిజము. ఓసీ, కైకేయీ! నీవు కోరికతీరినదానవగుము. నే నిప్పుడే మృతినొందుదును. నీవంతట విధవవై రాజ్యము వహింపుము. నేను బురుషశ్రేష్ఠుఁడయిన రామునిఁ బాసి యొక్క క్షణమైనను మనఁజాలను" అని చెప్పెను. ఇవ్విధమునఁ బలికి నృపుఁడు ఖేదపడుచు జనులగుంపులు వెంబడించు చుండఁగా, బంధువులు చావఁగాఁ గాటికేఁగి మఱలి స్నానముసేసి యింటునింటికిఁ బోవు చందమునఁ బట్టణోత్తమమయిన యయోధ్యలోఁ బ్రవేశించెను. అపు డయోధ్యాపురమున నాలుగువీథులు గలియుచోటు లందును, నిండ్లవాఁకిళ్లయందును జనులు లేకుండిరి. అంగడివీథులును దేవాలయములును [illegible]యఁబడియుండినవి. జనులందఱును డస్సి, సత్త్వహీనులు విచారగ్రస్తులు నయియుండిరి. రాచబాటలయందు జనులు పలుచఁగా నుండిరి. అట్టి యయోధ్యాపురము తీరు నెల్లఁ జూచుచు, రామునే తలఁచితలఁచి మనమున గుబులుకొని హెచ్చెడి వ్యసనముచేఁ బలపించుచు, సీతారామలక్ష్మణులు లేకపోవుటచేత, అక్షోభ్యమును గరుడునిచే నపహరింపఁబడిన పాముగలదియు నయిన పెనుమడుపువలె నున్న రాజగృహమును సూర్యుఁడు మేఘములోపలఁ బ్రవేశించునట్లు దశరథుఁడు ప్రవేశించెను. దశరథుఁ డట్టి నగరునుచేరి, విలపించుచు, డగ్గుత్తికతో సంగతి విశేషము లేకుండునట్లును, ఇతరులకుఁ దెలియఁజాల నంత తిన్నగాను, ద్వారపాలురతో "నాకింకొకచోట మనస్సునకు

నెమ్మదిగలుగదు. నన్ను రామునితల్లియగు కౌసల్యయొక్క యంతిపురము
నకుఁ గొంపొండు" అని చెప్పెను. ఆ మాట విని ద్వారపాలురు నృపా
లుని గౌసల్యా భవనమునకుఁ దోడ్కొనిపోయి విడిచిరి. వినయముతోఁ
పిమ్మటఁ బరిచారకులు నృపాలునిఁ గౌసల్యయింట మెత్తనిపాన్పులపైఁ
బరుండఁబెట్టిరి. అట్లు పరుండినపిదపఁగూడ నృపాలుని మనము కుదుటఁ
బడకుండెను. అతనికిఁ దన యిరువురు కొడుకులును, కోడలునులేని
రాజభవనమును చందురుఁడు లేని యాకసమువలెఁ గానుపించెను.
అపుడు వీర్యవంతుఁడయిన దశరథమహారాజు, "హా! రామా!
నన్నుఁ బాసితివిగదా" యని చేయియెత్తి పెద్దగొంతుతో నేడ్చుచు,
"యే నరోత్తములు రాముఁడు మఱలివచ్చునంతవఱకను జీవించి
యుందురో, వారు రామునిఁజూచి, యాతని గౌఁగిలించుకొని,
యానందము నొందుదురుగదా" అని తనలోఁ దా ననుకొనుచు విల
పించుచుండెను. అంత రాజేంద్రుఁడు, తనకుఁ బ్రలయకాలరాత్రియో
యనఁదగు రాత్రి వచ్చి, చీకట్లు క్రమ్మఁగానే, నడురేయియందుఁ
గౌసల్యను బిలిచి, "కౌసల్యా! రాముని వెంబడించిన నా చూపిప్పటికిని
మఱలకున్నది. నీ రూపుగూడ నా కంటికిఁ దెలియకున్నది. "నేను
నీ పుత్త్రుని వనమునకుఁ బంపితి నని నాపైఁ గ్రోధమును మనసున
నుంపక, నన్నుఁ జేతితోఁ దాఁకి పట్టుకొనుము" అని విలపించెను. అవ్వి
ధమున రామునే తలఁచుచుఁ బాన్పునఁ బరుండి విలపించుచున్న నృపా
లునిఁజూచి యతనికిఁ గడుజేరువఁ గూర్చుండి, తానును మిక్కిలి వ్యసన
మొందినదై, నిట్టూర్పులు విడుచుచు విలపించెను.

## 43-వ సర్గము

### కౌసల్య పుత్త్రవియోగమునకై దుఃఖించుట

అంత పాన్పునందు వ్యసనముచేఁ గృశించి పరుండియున్న పుడమి
తేనిం జూచి, కౌసల్య పుత్త్రవియోగ దుఃఖముచేఁ బీడింపఁబడినదై,
యిట్లనియె.

"ఓ మహీపాలా! నరోత్తముఁడయిన రామునియెడఁ గపటమునెడి
విషమునుంచి, కైకేయి కుబుసమువిడిచిన యాఁడుపాముచందమున
నిర్భయముగా సంచరింపఁగలదు. ఆపె యదృష్టవంతురాలును, చెప్పినట్లు

విను భర్త గలదియుం గాన దన కోరికను బొంది, రామునిం దఱుమంగొట్టి
మనస్సమాధానము నొంది, యింట నుంచుకొన్న దుష్టసర్పమువలె న
న్నెల్లప్పుడు భయపెట్టంగలదు. ఓ మహారాజా! నా కుమారుని భరతునికిం
బనివానింగానైన నుంచుకొనుమని కైకేయి వరము కోరుట మేలుగా
నుండదా? అప్పు డతం డూరిలోపల బిచ్చమెత్తుకొనియైనను నింటం
గండ్లముందట నుండునుగదా! కైకేయి రాముని స్వస్థానమునుండి పడం
ద్రోసి, యహితాగ్నియగు నతండు పున్నమనాండు దేవతలకీవలసిన
హవిర్భాగమును రక్కసులకొసంగునట్లు, భరతునకు రాజ్యభారము
నొసంగెను. గజేంద్రమువంటి నడకగలవాండును, శూరుండును, గొప్ప
చేతులవాండును, విలుకాండునైన రాముండు సీతాలక్ష్మణసమేతుండై వన
మున కిప్పటికి బ్రవేశించియుండును. నృపేంద్రా! కాముకైకేయి మనో
రథం బీడేర్పంగోరి, వనవాసశ్రమము లింతకుము న్నెఱుంగనివారలను
వనమునకుం బంపితివి. వారు వనమున నేక నేగతి ననుభవింతురో!
వారు ప్రాయము వారు. ధనహీనులుగాం జేయంబడిరి; సుఖము లనుభ
వింపవలసిన కాలంబునం దఱుమంబడిరి. వా రడవులందు దరిద్రులై,
పండ్లను, దుంపలను దిని యెట్లు బ్రతుకుచుండంగలరు? మఱల సీతతోను
దమ్మునితోను నిచటికివచ్చిన రామునింజూచి, నాదు శోకము క్షీణించి
పోవునట్టి శుభకాల మిప్పుడువచ్చునా? శూరులగు రామలక్ష్మణులు నిద్ర
పోయి లేచినవారివలెనె నెప్పు డయోధ్యకు మఱలివత్తురు? ఎప్పు
డయోధ్యాపురమునందు జనులు సంతోషముతో ధ్వజపటములను
గట్టంగా, నయోధ్యాపుర మాధ్వజపటములచే శోభిల్లుచుం గీర్తి
మంతమైయుండును. అడవినుండి మఱలివచ్చిన పురుషోత్తములగు
రామలక్ష్మణులంజూచి, పర్వతమునందలి సంద్రముచొప్పున నయోధ్యా
పురజను లెప్పుడు పొంగుదురు? ఎప్పుడు దీర్ఘబాహువగు శూరుండైన
రాముండు, వృషభం బావునువలె సీతను రథంబుపైం దనముందరం
గూర్చుండంబెట్టికొని యయోధ్యకు రాంగలండు? ఎపుడు వారు సంత
సముతో నయోధ్యయందుం జొచ్చి, మంచి మనసుతోం గన్యకలకును
బ్రాహ్మణులకు దానముల నొసంగి జనుల నెప్పుడు సంతోషపఱతురు?
శత్రుసూదనులైన నా యిరువురు కొడుకులు రాజమార్గమున వచ్చు

నెప్పుడు వేలకొలఁది పురజను లెప్పుడు సేసలు చల్లుదురు? నా కొడుకులు కర్ణభూషణముల ధరించి, యాయుధములను, గత్తిని చేతఁ బట్టుకొని శిఖరములతో వెలుఁగు పర్వతముల చందమున విరాజిల్లుచు నెప్పుడు పురమునకుఁ బ్రదక్షిణము సేయఁగలరు? బుద్ధియందును, వయస్సునందును వికాసము నొందినవాఁడై దేవతలంబోలు కాంతిగలిగినవాఁడగుచు ధర్మజ్ఞుఁడయిన రాముఁ డేతెంచి, మూఁడేండ్లపసిబిడ్డఁడువోలె నన్నెప్పుడు సంతసపఱుపఁగలఁడు? శూరుఁడవగు ఓ నృపాలా, పూర్వజన్మమున బిడ్డలు పాలుత్రాగఁ గోరుచుండఁగా, వారితల్లుల స్తనములను గడుఁగ్రూరురాలయిన నేను గోసి పాఱవేయించియుందును ఇందుకు సందియము లేదు. కావున ఓ పురుషశ్రేష్ఠా, దూడయం దెక్కువ మక్కువగల లేఁగటియావును సింహము దూడలేనిదానిం జేయునట్లు నే నీ జన్మమునఁ బుత్రవాత్సల్యముగలదాన నయినను, నన్నీ కైకేయి బలాత్కారముగా నట్లుచేసిన దాయెను. సకల శాస్త్రములందుఁ బండితుఁడును, ఒప్పులకుప్పయు నయినయట్టి కుమారునిఁబాసి, యొంటిబిడ్డను గలదాననయిన రాముఁడు మఱలివచ్చునంతవఱకు జీవించియుండఁ జాలను. పొడవుచేతులు గలవాఁడును, నెక్కువ బలిమిగలవాఁడునైన నాముద్దుల కొడుకును జూడక నేను బ్రాణములు దాల్చియుండ నాకుఁ గొంచెమయినను దిటవుచాలదు. వేసవియందు ఖరకిరణుఁడయిన భగవంతుఁడగు సూర్యుఁడు తన కిరణములచే నీ పుడమిని మాడ్చునట్లు, పుత్రవియోగముచేఁ గలిగిన దుఃఖమనెడునగ్ని యప్పటికప్పటికి వృద్ధి నొందుచు నన్ను దహించుచున్నది. నే నీ వేంద్రమున కోర్చియుండఁ జాలను" అని కౌసల్య నృపాలునితోఁ జెప్పి విలపించెను.

## 44-వ సర్గము.

### సుమిత్ర కౌసల్య నూఱడించుట

అత్తెఱఁగునఁ బలవించుచున్న యుత్తమాంగనయగు కౌసల్యను జూచి, ధర్మమునం దాసక్తిగలదగు సుమిత్ర ధర్మము మీఱని యీ క్రింది వాక్యములఁ జెప్పఁదొడఁగెను.

"ఓ భాగ్యశాలినీ! సద్గుణవంతుఁడగు నీ పుత్త్రుఁడు పురుషోత్తముఁడు. నీ పతనినిగూర్చి దీనముగ వగచియు నేడ్చియు నుపయోగము

లేదు. ఓ పూజ్యురాలా! నీ కొమరుఁడు బలశాలియైనను, తన తండ్రికిఁ బ్రతిజ్ఞఁదప్పనివాఁ డనుపేరు తేఁగోరి, రాజ్యము బరిత్యజించి, కానలకుఁ బయనమయ్యెను. తండ్రి యానతి ప్రకారము నడచుటవలన శాశ్వతమైన పరలోకము సిద్ధించును. ఆధర్మమునే పూర్వికులగు పెద్దలును నాచరించిరి. అతఁడు సర్వజనోత్తముఁడు. ఆతనిఁగూర్చి యెన్నఁడును విచారపడ నక్కఱలేదు. దోషరహితుఁడగు లక్ష్మణుఁ డెల్లప్పు డతని యందు మంచితలంపు గలిగియున్నాఁడు. అతఁడు సర్వభూతములందు దయగలవాఁడు; మహాసమర్థుఁ డయినరామునికిఁ బెన్నిధియయిన వాఁడు, సుఖము లనుభవింపఁదగినది యైన జానకి వనవాసమునందలి యిడుముల నెఱిఁగినదయ్యును, ధర్మాత్ముఁడయిన నీ కుమారుని వెంబడించి పోవుచున్నది. సమర్థుఁడైన నీ కొమరుఁడు నేర్పరియై లోకమునఁ దన కీర్తియనెడి టెక్కెమును ద్రిప్పుచున్నాఁడో, యట్టి, ధర్మపరిపాలనమును, సత్యవాక్యమును ధనముగాఁగల నీ పుత్త్రుఁ డేల సత్వరముగా రానేరఁడు. రాముని శీలమును సామర్థ్యమును నెఱిఁగినవాఁడై, సూర్యుఁడు తన కిరణములచే నతనికి వేఁడిమిని గలిగింపఁడు. ఇది నిజము. మఱియు నడవులనుండి వెడలు గాలి యన్నివేళలందును మేలుగావించు నదై, సమశీతోష్ణములు గలిగి, రాముని కింపగునట్లు వీవఁగలదు. చంద్రుఁడును రాత్రులందుఁ బరుండియున్న మహాత్ముఁడగు రామునిఁ దండ్రివలెఁ గౌఁగిలించుచుఁ దన చల్లనికిరణములను బర్వఁజేసి; మిక్కిలి సంతసము గావింపఁగలఁడు. తొల్లి శంబరాసురుని పుత్త్రునిఁ దన పరాక్రమముచే రాముఁడు సంహరించినప్పుడు బ్రహ్మదేవుఁడు సంతసించి, రామునకు దివ్యాస్త్రములనెల్ల నొసంగెను. అట్టి పురుషశ్రేష్ఠుఁడయిన శూరుఁడగు రాముఁడు తన బాహుబలమువలన నడవియందున్నను, నింటియందున్నట్లే నిర్భయుండై తిరుగుచుండఁగలఁడు. యుద్ధరంగమున నీ రాముని బాణముల బాఱింబడిన శత్రువులు తప్పించుకొనఁజాలరు. అట్లుండఁగా నితని వశమున నీ భూలోకమెల్ల నుండుట కేమి సందియమున్నది? ఆరాముని ముఖకాంతిని, మగఁటిమిని, సత్స్వభావమునుజూడ సత్వరమ వనవాసము నెఱపి, వెంటనే యయోధ్యకువచ్చి యతఁడు తప్పక పట్టాభిషిక్తుఁడు గాఁగలఁడు.

ఓ కౌసల్యా! రాముఁడు సూర్యునకు సూర్యుఁడు; అగ్ని కగ్ని;
రాజునకు రాజు; కాంతికిఁ గాంతి; కీర్తికిఁ గీర్తి; ఓర్పున కోర్పు; దేవతలకు
దేవత; భూతములకెల్లఁ బ్రధానభూతము. అట్టివాఁడు పట్టణమున
నున్న నేమి? దేశమందున్న నేమి? ఎచ్చట నున్నను రాముని కెట్టి
యాపదయు సంభవింపనేఱదు. రాముఁడు వేగముగ సీతతోను,
సంపదతోను, భూమితోడను గూడి పట్టాభిషేకము నొందఁగలఁడు.
అప్పుడు పురమున నంతకుమున్ను రాముని వనవాసమునకై వ్యసన
పడుచున్న జనులు పట్టాభిషిక్తుఁడయిన రామునిఁ గాంచి యానందబాష్ప
ములను విడువఁగలరు. శత్రువులకు లోఁబడని రాముఁడు వల్కల
ములను, దర్భలను ధరించి పోవునప్పుడు సీతవలెనే రాజ్యలక్ష్మియు
నతనిని వెంబడించినది. కావున నతనికేది దుర్లభమగును? విలుకాండ్రలో
మేటియగు లక్ష్మణుఁడును బాణములను, ఖడ్గములను, నస్త్రములను
దాల్చి, రామునికిముందు నడుచుచున్నాఁడు. అట్లుండ నా రాముని కేమి
కొఱతయున్నది? ఓ దేవీ, వనవాసము నెఱపి, సీతతోను లక్ష్మణుని
తోను జంద్రునివలె నీ ముందట నుదయించి, నీ పాదములకు మ్రొక్కి,
పట్టాభిషిక్తుఁడయి వెలిఁగెడి రాముని నీవు గట్టిగాఁ గౌఁగిలించుకొని,
యానందబాష్పములతో నాతని శరీరమును బాగుగాఁ దడుపఁగలవు.
ఓ కల్యాణీ! ఆ రామునివిషయమున దిగులును విచారమును బొంద
నక్కఱలేదు. నీవు దుఃఖముఁ బాయుము. నీ వజ్ఞానమును విడువుము.
నేను నీకు యథార్థముఁ జెప్పితిని. నీవు మాబోఁటి తక్కినజనుల నందఱ
నోదార్పవలసియుండఁగా, నీవేల యిట్లు వ్యసనమున మునిఁగెదవు.
రామునికిఁ దల్లివైన నీ విట్లు వ్యసనపడఁదగదు. రామునికంటె మించిన
సత్పురుషుఁ డొక్కఁడైనను ముజ్జగములలోపల లేఁడు. ఆరాముఁడు
స్నేహితులతో నయోధ్యకుఁ ద్వరలో మఱలివచ్చి మృదువులయిన బలసిన
తనచేతులతో నీ రెండుపాదములను బట్టుకొని నీకు మ్రొక్కఁగా
నాతనిపై నీవు వార్షికమేఘమువలె నానందాశ్రువులను విడువఁగలవు”
అని యిత్తెఱఁగున రామునితల్లియగు కౌసల్యకు ననేకవిధ వాక్యములం
జెప్పి మాటలందును నుపచారములందును నేర్పరురాలయిన సుమిత్ర
యంతటితో నూరకుండెను. అట్లు లక్ష్మణుని తల్లియగు సుమిత్ర పలికిన

పలుకులను వినుటచేఁ గౌసల్యశోకము స్వల్పోదకముగల శరత్కాల మేఘమువలె నశించెను.

## 45-వ సర్గము

### రాముఁడు సరయూనదీతీరమున విడియుట

తిరమయిన మగఁటిమి గలవాఁడును, మహాత్ముఁడును నైన రాముఁడు వనమునకుఁ దరలఁగా, జను లందఱు నతని ప్రేమతో వెంబడించిరి. రాముని స్నేహితులును, తండ్రియు బలాత్కారముగా నిల్పినను, ప్రజలుమాత్రము నిలువక రాముని రథమును వెంబడించి పోవుచు వెనుకకు మఱలకుండిరి. గొప్ప పేరుపడసినవాఁడును, మేటి గుణములతోఁ గూడినవాఁడు నైనందునఁ బున్నమచందురునిఁబోలె రాముఁ డయోధ్యానగర వాసులగువారికిఁ బ్రీతిపాత్రుఁడయి యుండెను. అట్లు జనులు రాముని వెంబడించి, "ఓ జగద్రక్షకా! నీ విపు డరణ్యమునకుఁ బోవలదు. వెనుకకు మఱలివచ్చి, మమ్ము నేలుము" అని వేఁడుకొనుచున్నను, దండ్రిని సత్యవంతునిగఁ జేయఁ గోరి, యడవికిఁ బోవలెననియే చెప్పి, రాముఁడు జనులనందఱను ప్రేమమీఱఁ గన్నులతోఁ బానముచేయురీతిని వీక్షించుచు నా ప్రజలనందఱను దనబిడ్డలవలె భావించుచు వారితో నిట్లనియె:—

"ఓ జనులారా! యయోధ్యాపుర నివాసులరగు మీకు నాయెడ నెంతప్రేమయు, గౌరవమును గలదో, యంతటిప్రేమను గౌరవమును నా ప్రీతికై భరతునందు విశేషముగఁ జూపుదురుగాక! ఆ భరతుఁడు మేటి నడవడిగలవాఁడు; కైక కానంద మొసఁగఁ జేయువాఁడు. అతఁడు మీ కిష్టములును శ్రేయస్కరములునగు కార్యములను యథావిధిగఁ జేయఁగలఁడు. అతఁడు వయస్సునందుఁ బిన్నయైనను జ్ఞానమునందు వృద్ధుఁడు; సాధువులందు మెత్తనివాఁడు; దుష్టులందు శూరుఁడు; యోగ్యుఁడు. అతఁడు శత్రువులవలని వెఱపుఁ దొలఁగించి, మీకుఁ దగినయేలికయై మిమ్ము నాదరింపఁగలఁడు. రాజగుణయుక్తుఁడగు నా భరతునే నృపాలుఁడు యువరాజునుగాఁ జేయఁదలఁచెను. మఱియు రాజు నానతి చొప్పున నేనును, మీరును, నడచుకొనవలయును. మీరు నా కిష్టముఁ జేయఁగోరితిరేని, నేను గానలకేఁగితినని మహారాజు విచార

పడకుండునట్లు నడచుకొనవలయును” అని చెప్పెను. అట్లు రాముఁడు తండ్రిమాట జరుపుటయను ధర్మంబున నిలుకడగలవాఁడై, “నేను మఱలి యయోధ్యకు రా” ననుకొలఁదియు, జను లాతనినే రాజుగనుండవలెనని మీఁదుమిక్కిలి నిర్బంధము చేసిరి. పురజనులందఱు కన్నీటిచేఁ గన్నులు మూతఁపడి దుఃఖముతో రామలక్ష్మణులను వెంబడించిపోవుటఁ జూడఁగా, రామలక్ష్మణులు దమ గుణము లనెడు త్రాళ్ళతో వారిం గట్టి లాగుకొని పోవుచున్నారేమో యని చూపఱకుఁ దోఁచుచుండెను. జ్ఞానము, వయస్సు, పరాక్రమమునను మూఁటిచే వృద్ధులగు బ్రాహ్మణులు వయసుచే శిరము వణఁకుచుండఁగా దూరముననుండియే గుఱ్ఱములను గూర్చి “ఓ మంచిజాతియందుఁబుట్టి వేగవంతములయి రాముని వహించుచుండు గుఱ్ఱములారా! మీరు మఱలుఁడు. పోవలదు. మీ యజమానుఁడగు రామునికి మేలుచేయుఁడు. మృగములన్నిటిలో గుఱ్ఱములకు వినికిడి శక్తి అధికము. కావున మీరు మాప్రార్థన నంగీకరించి వెనుకకు మఱలుఁడు. రాముఁడు ధర్మపరిపాలనముచే నిర్మలమగు స్వభావముగల వాఁడు; శూరుఁడు; నియమముఁ దప్పనివాఁడు. అట్టి మీ ప్రభువును మీరు పట్టణమునకుఁ బిలుచుకొని రావలయునే కాని, పట్టణమునుండి యడవికిఁ గొనిపోవుట తగదు” అనిరి. ఇట్లు మిక్కిలి దీనముగా మొఱలిడుచు రోదనముచేయుచున్న వృద్ధబ్రాహ్మణులను జూచి, రాముఁడు వెంటనే రథంబునుండి దిగి, సీతాలక్ష్మణసమేతుఁడై, యడవియందే మనంబుంచినవాఁ డగుటచేఁ దిన్నగా నడుగులిడుచుఁ బోయెను. రాముఁడు దయార్ద్రదృష్టి గలవాఁడును, సత్ప్రవర్తనమునఁ బ్రేమ గల వాఁడును నగుటం జేసి, కాలినడకతో వచ్చెడి బ్రాహ్మణుల నందఱినివిడిచి రథముమీఁదఁ బోవఁజాలనివాఁ డయ్యెను. నడచిపోవుచున్న రామునిఁ జూచి బ్రాహ్మణులందఱు మిక్కిలి దుఃఖపడి, మనములు చెదరినవారయి “ఓ రామా! ఈ బ్రాహ్మణులందఱు దమ మూపురములపై నగ్నులను బెట్టికొని బ్రాహ్మణహితముగోరెడు నిన్ను వెంబడించుచున్నారు. శరత్కాలమందలి మేఘములవలెఁ దెల్లనై, వెంబడి వచ్చుచుండునవియు, వాజపేయ యాగమున మాకు లభించినవియునైన మా గొడుగులను జూడుము. వాజపేయము చేయుటచే మాకు దొఱకిన యీ ఛత్ర

ములను, గొడుగులేక యెండవేడిమిచే పొలియుండు నీకుఁ బట్టెదము, ఎల్లప్పుడు వేదాధ్యయమునందుఁ బ్రవర్తించుచుండు మాబుద్ధి యిపుడు నీ వడవికేఁగుచున్నందున, నీతోడ నరణ్యమునకు రాఁ దిరిగినది. మాకు గొప్పధనమైన వేదము లేవియున్నవో, అవి మా మనసులందే యున్నవి. మా భార్యలును దమ పాతివ్రత్యబలముచేఁ గాపాడఁబడుచు గృహంబులందే యుండఁగలరు. కావున వారు మాతోడ రారు. మేము నిన్నెట్లయినను నయోధ్యకు మఱలించికొనిపోవలెనని వచ్చితిమి. నీ విఁక వనవాసమునందలి తలంపు మానుము. నీవు ధర్మము నాచరించుట యందే తలంపుగలవాఁడ వగుదువేని, మామాట వినుటకంటె మిాఁకిన ధర్మాచరణ మేమియున్నది? ధర్మము నాచరించుటయందు విడువని పట్టు దలగల యో రామా! మేము కడు వృద్ధులము. మా తలవెండ్రుకలు హంసలవలెఁ దెల్లగ నెఱసినవి. ఆచారనిర్వహణమున నేలపైఁబడి దుమ్ముంటికొనినవి. పెద్దలమును దుఃఖము సైరింపఁజాలనివారమునైన మాయొక్క ప్రార్థనల నంగీకరించి వెనుకకు మఱలుము. అనేకులు ద్విజో త్తములు యజ్ఞము లారంభించి, వలయు సంభారములను సేకరించి యున్నారు. ఓ నాయనా! యవి నీవు తిరిగివచ్చినయెడల నెఱవేఱఁగలవు. నీవు రానియెడల నవి యంతటితో నిలిచిపోవును. జంగమములు స్థావర ములు నగు ప్రాణులన్నియు నీయెడ భక్తిగలిగి నీవు నగరమునకు మఱలి రావలెనని కోరుచున్నవి. రామా, అట్లు నీయెడ భక్తిగలిగియున్న వాని కోరికను దీర్పుము. వృక్షములు విశేషముగాఁ గదలుటచూడఁగా, నవి నిన్ను విడిచియుండఁజాలక, నీ వెంబడి రావలెనని ప్రయత్నించినను, వేళ్లు-గతినిరోధము చేయుటచేత నవి నిన్ను వెంబడింపఁజాలక, "మన మిా వేళ్ల యాటంకముచే రాముని వెంబడింపలేమైతిమికదా" యని యాక్రోశించుచున్నట్లున్నవి. పక్షులును నీ వరణ్యములకుఁ బోవుటం జూచి, యాహారమునకై బయటఁబోక, చేష్టలుమాని, చెట్లమిాఁద నెక్కడివక్కడనే కూర్చుండి, సకల భూతదయాళువయిన నిన్ను వనము నకుఁ బోవలదని యాచించుచున్నట్లున్నవి" అని యివ్విధమున రాము నితోఁ జెప్పిరి.

అట్లు రాముని మఱల్చుటకై ఘోషించుచుండు బ్రాహ్మణులను మఱలింపక పోవుచున్న రామునిఁ గూర్చి, తమసానది "ఓరామా! నీ విట్లు బ్రాహ్మణులను సమాధానపఱుపక పోరాదు" అని నివారించు చున్నదో యనున ట్లగపడెను. అంతట సుమంత్రుఁడును రథమునిలిపి, గుఱ్ఱములనువిప్పి డస్సిన యాగుఱ్ఱములను వేగముగ నలపుదీర్చుకొను టకై నేలపైఁ బొరలించి, నీరు త్రాగించి, యొడళ్లుతోమి, బాగుగఁ గడిగి, తమసానది చేరువను త్రిప్పుచుండెను.

## 46-వ సర్గము

### రామాదులు జనులను వంచించి రథం బెక్కి పోవుట

అంతట రాముఁ డందమైన తమసానదీతీరముఁ జేరి, సీతనుజూచి, లక్ష్మణునితో "సౌమిత్రీ! వనవాసమునకు వెడలిన మన కిది మొదటి రాత్రి. లక్ష్మణా! నీకు మేలయ్యెడుగాక; గగ్గోలుపడకుము. లక్ష్మణా! చూడుము. శూన్యములయిన యీ యరణ్యములను తమతమ నివాస ములకు వచ్చెడి మృగములతోను, పక్షులతోను గూడినవై, కళదప్పి, రోదనము చేయుచున్నవో యనునట్లున్నవి. ఇప్పుడు మన తండ్రియొక్క రాజధానియగు నయోధ్యాపురముననున్న స్త్రీ పురుషులందఱు అడవు లకు వెడలిన మనలనుగూర్చి వగచుచుందురు. దీనికి సంశయములేదు. నరశ్రేష్ఠా! జనులందఱు ననేక సుగుణములచే దశరథుని, నిన్నును, నన్నును భరతశత్రుఘ్నులను గడుఁ బ్రేమతోఁ జూచుచున్నారు. తండ్రియుఁ గీర్తిమంతురాలగు తల్లియు వనమునకు వచ్చిన మనలను గూర్చి మిక్కిలి యేడ్చి యేడ్చి కన్నులుచెడి యంధు లగుదురేమో? వారినిగూర్చి నేను మిగుల వగచుచున్నాను. మహాత్ముఁడగు భరతుఁడు తల్లిదండ్రులను ధర్మార్థ కామములతోఁగూడిన మాటలు సెప్పి యూఱ డింపఁగలఁడుగదా! భరతుని మంచితనమును మఱియు మఱియుభావించి లక్ష్మణా! తండ్రినిగూర్చికాని, తల్లినిగూర్చికాని నేనంతగా దుఃఖింపను. పురుషశ్రేష్ఠా! నీవు నావెంట వనమునకు వచ్చుట మంచిపనియయ్యెను. అటుకాకున్న; నే నరణ్యమున సీతారక్షణమునకై సాహాయ్యము వెదక వలసియుండునుగదా! ఈ నదీతీరమున మనకాహారమునకుఁ గావలసి నన్ని వన్యవస్తువు లున్నవి. కాని మన మీ రేయి నీరు ద్రావి యుండె

దము. ఇదియే మంచిదని నాకుఁ దోఁచుచున్నది" అని చెప్పి, సుమంత్రునితో "ఓ సారథీ! గుఱ్ఱములను జాగ్రత్తతోఁ జూచుకొనుము" అని చెప్పెను. ఆసుమంత్రుఁడును ప్రొద్దుగ్రుంకఁగనే గుఱ్ఱములఁ గట్టివేసి కావలసిన గడ్డినివేసి, సమీపముననే కాఁచియుండెను.

రాముఁడును నదికిఁ బోయి సాయంసంధ్యావందనా ద్యనుష్ఠానములు దీర్చుకొనివచ్చినపిదప, రాత్రియయ్యెనని తెలిసికొని సుమంత్రుఁడు లక్ష్మణుని తోడ్పాటుతో రామునకుఁ బాన్పు నేర్పఱచెను. ఆకులతో నేర్పఱచిన యాపాన్పునుజూచి రాముఁడు లక్ష్మణునితోడను, సీతతోడను దానిపైఁ గూర్చుండెను. అంతఁ గొంతతడవునకు రాముఁడు, సీతయు బాగుగ నిద్రింపఁగాఁజూచి లక్ష్మణుఁడు సుమంత్రునికి రాముని నానా గుణములను జెప్పుచుండెను. తమసానదిగట్టున మేల్కొని లక్ష్మణుఁడు సుమంత్రునకు రాముని గుణములు వర్ణించుచుండఁగనే, రాత్రి తెల్ల వాఱఁబొచ్చెను. ఆలమందలచే నిండిన యా తమసానదీతీరమున రాముఁ డా రాత్రి వెంబడివచ్చిన జనులతోఁగూడ నివసించెను. ఎక్కువ శౌర్యము గలవాఁడగు రాముఁడు నిద్ర మేల్కొని, నిద్రపోవుచుండు నా జనుల నందఱిం జూచి, శుభలక్షణములుగల తమ్ముఁడగు లక్ష్మణునిఁ గూర్చి, "లక్ష్మణా! యీ జనులు మనయందలి ప్రేమచేఁ దమ గృహములం దపేక్షమాని, యిప్పుడు చెట్లమొదటఁబరుండి నిద్రించుచున్నారు; చూడుము. ఈ పౌరులు మనలను మఱలించుటకై యెంతయో పట్టుదల గలిగియున్నారు, వీరు ప్రాణములు విడుచుటకైనను సాహసింతురుగాని, తమ నిశ్చయమును విడువఁజాలరు. కావున గాఢనిద్రలోనుండు వీరు నిద్ర లేవకుండులోపలనె మనము చప్పుడుచేయకుండ రథమెక్కి నిర్భయముగా సాగిపోవుదము. మన మిప్పు డిట్లు చేయుదుమేని, మనయం దాసగల యయోధ్యాపురవాసు లందఱు నిఁకమీఁద నెప్పటికి నిట్లు చెట్లక్రిందఁ బరుండి నిద్రింపరు. రాజపుత్రులు జనులను వారువారు తెచ్చుకొనిన కష్టములనుండి తప్పించవలయునేకాని, పురజనులు తమ నిమిత్తమై విచారపడునట్లు చేయరాదుగదా!" అని చెప్పెను. లక్ష్మణుఁడు నాపలుకులు విని, ధర్మమే యవతరించెనో యనఁదగియుండు తనయన్నను జూచి, "ఓ ప్రాజ్ఞుఁడా! నాకును నదియే యుక్తముగాఁ దోఁచుచున్నది;

వేగము రథము నెక్కుదము" అని చెప్పెను. అంతటఁ గాంతిమంతుఁడయిన రాముఁడు సుమంత్రునిఁబిలిచి, "ఓ సమర్థుఁడా! తేరునకు గుఱ్ఱములు పూన్చి తెమ్ము. ఇచ్చటినుండి మఱియొక యరణ్యమునకుఁ బోవుదము. పో పొమ్ము. వేగ రథము నాయితపఱుపుము" అని యానతీగా వెంటనే సుమంత్రుఁడు శ్రేష్ఠము లయినగుఱ్ఱములను గట్టి, తేరి నాయితము చేసి, యంజలిబద్ధుఁడై, "రథిక శ్రేష్ఠా! యిదిగో రథము నాయితపఱచి తెచ్చితిని. నీకు మేలయ్యెడు. నీవు సీతా లక్ష్మణ సమేతుఁడవై, తేరి నెక్కుము" అని చెప్పెను. అంత రాఘవుఁడు యాయుధములనెల్లఁ గైకొని రథమెక్కి వేగముగా సుళ్లుదిరిగిపాఱుచున్న తమసానదినిదాఁటి, ముండ్లులేక, బాగుగాఁ దీర్చినదియు, భయపడువారికి భయమును బోఁగొట్టునదియునైన గొప్పబాటనుబొంది, పురజనులను వంచింపఁగోరి, సారథియగు సుమంత్రుని బిలిచి, "సారథీ! నీ వుత్తరముఖముగ రథమునుబోనిమ్ము. రెండుగడియలసేపు రథమును వేగముగాఁబోనిచ్చి పిదప మఱలింపుము. నీ విట్లుచేసినయెడలఁ బురజనులు మనరథముజాడ నెఱుఁగకుందురు. ఆ ప్రకారముగ హెచ్చరికతోఁ జేయుము"అని చెప్పి రథమునుండి దిగెను. అంత సారథి రాముని మాటప్రకార మొనర్చి మఱలవచ్చి, రామునికిఁ దేరప్పగింపఁగా, నప్పుడు రఘువంశవీరులయిన రామలక్ష్మణులు తమకై సిద్ధపఱుపఁబడిన రథముమీఁద సీతతోఁ గూర్చుండిరి. అంతట నా సుమంత్రుఁడు తపోవనమునకుఁ బోవు మార్గముననే గుఱ్ఱములను దోలెను. వెండియు మహారథుఁడయిన రాముఁడు రథము నెక్కి యెడవికిఁ బయనమై పయనమునకుఁ దగిన శుభశకునములను జూచుటకయి తొలుత నుత్తరపువైపునకు రథము మఱలించెను.

## 47-వ సర్గము

రాముఁడు తమ్ము విడిచిపోయినందుకై పురజనులు విచారపడుట

ఆరేయి కడచి తెల్లవాఱఁగాఁ బురజనులందఱు మేల్కాంచి, రాముఁడు లచ్చట లేకుండుటఁ జూచి, దుఃఖము దెబ్బకు సహింపలేక చెయువులు దక్కినవారలై, మూర్ఛిల్లి, మఱలఁ గొంతసేపటికి లేచి కండ్లయందుఁ గన్నీటిని నిండించుకొని, యచ్చటచ్చటఁ జూచియు రాముని రథముయొక్క దుమ్మునైనను జూడఁజాలకపోయిరి. అంతట వారు

వ్యసనముచే వాడిన మోములతోఁ గూడి, ధైర్యవంతులయినను, జ్ఞాని యైన రాముని వియోగముచే దైన్యమునొంది, మిక్కిలి దీనముగఁ దమలోఁ దా మిట్లనుకొనిరి. "ఛీ! యీ నిద్రగదా మనల నింత చెఱచినది. ఈ నిద్రచే మైమఱచినవారలమై, విరివిరొమ్మును, బొడవుచేతులును గలవాఁడగు రాముని నిప్పుడు చూడలేకపోతిమి. గొప్పచేతులు గలవాఁడగు రాముఁడు మనల నెప్పుడును వంచించినవాఁడు కాఁడు. అట్టి యాతఁడు భక్తజనులను విడిచి, యెట్లు వనమునకుఁ బోయి యుండును. తండ్రి తన కడుపునఁ బుట్టిన బిడ్డలనుబోలె, రాముఁడు మనల నెప్పుడు పాలించుచుండునో రఘువంశపు రాజులలో మేటియైన అట్టి రాముఁ డెట్లు మనలను బాసి యడవికిఁ బోయెను. కావున మనమిచ్చటనే మరణింతము, లేదా, మరణపర్యంతము యాత్రగావింతము. అంతియ కాని, రాముని బాసిన మన జీవితముతో నేమి ప్రయోజనము? ఇచ్చట బాగుగా నెండిన లావుకట్టెలు విస్తారముగా నున్నవి. వీనితో నిచ్చట నొక చితిపేర్చి, యగ్నిని రగులుకొల్పి యందుఁ బ్రవేశింతము. మనము మఱలి యయోధ్యకుఁ జనినపు డచ్చటిజనులు మనలఁజూచి, "జనులారా! అసూయలేనివాఁడును, జనులకుఁ బ్రియముగా మాటలాడువాఁడును నైన రాముఁ డెక్కడికిఁబోయె" నని యడిగిరేని, "మమ్మువిడిచి, యాతఁ డడవికేఁగె" ననియేకదా చెప్పవలయును. ఆమాట యెట్లు చెప్పఁగలము? ఆయోధ్యాపురవాసులందఱు స్త్రీ బాల వృద్ధులతోడఁ గూడి, రాఘవునిఁ బాసి వచ్చిన మనలను జూచి కడు వ్యసనమొందుదురు. ఇది నిశ్చయము. జితేంద్రియుఁడగు రామునితోఁగూడ మనము పత్తనమునుండి వచ్చితిమి. ఇప్పుడు రాముఁడు లేకుండ మన మా పురము సొచ్చి పురజనులను జూడఁగలము" అని యిత్తెఱఁగులైన మాటలను చేతులు పైకెత్తి పలుకుచు, వ్యసనాక్రాంతులై, దూడఁబాసిన యావులవలె పలవించుచుండిరి. పిదప వారు రాముని తేరిజాడను గనిపెట్టి పోఁదలఁచి, యా దారినే కొంతదూరమేఁగి, దారిజాడయైనఁ గనఁబడమిచే వ్యసనముతోఁ గూడినవారై, "ఇదియేమి? మన మింక నేమిసేయఁగలము. దైవముచే మనము వంచింపఁబడితిమి" యని తలఁచుచు వెనుకకు మఱలిరి. అంత వారందఱు వాడువాఱిన డెందములతో వచ్చినదారిని

బట్టి, విచారపడుచుండు సజ్జనులతో నిండి యయోధ్యాపురము సొచ్చి, తమ యిండ్లకుఁ బోవుటకుఁగూడ మనసు లేక, యయోధ్యాపురము సొంపు దక్కియుండుటను జూచి, దుఃఖసంతాపముతోఁ గూడిన కన్నులనుండి కన్నీరు విడిచిరి. పన్నగములు గరుడునిచే నెత్తికొనిపోఁబడిన మడుగు చందమున రాముఁడు లేని యయోధ్యాపురము శోభిల్లకుండెను. రాముఁడు లేమిచేఁ జంద్రుఁడు లేని యాకసము మాడ్కియు, నీరులేని కడలిచాడ్పునను సంతసము దక్కియున్న యయోధ్యాపురము సొచ్చి, జనులు తమ గృహము సకల ధనధాన్య సమృద్ధములైయున్నను, దుఃఖముచేఁ గొట్టువడి, విచారముతోడ నా యిండ్లకుఁ బోయి, సంతసము దక్కియుండుటం జేసి, జనులను జూచుచున్నను, వీరు తమవారు, వీరు పొరుగువారని తెలియఁజాలరైరి.

## 48-వ స ర్గ ము

### అయోధ్యాపురజనులు రాముని వనవాసమునకు దుఃఖించుట

ఆ నగర నివాసులగు జనులు రాముని వెంబడించి, మఱలివచ్చి, దుఃఖముచే మిక్కిలి పీడింపఁబడినవారై, కన్నులనుండి కన్నీరు గాఱుచుండ, ధైర్యమువిడిచి మూర్ఛనొందినవారలగుచుండుటఁ జూడఁగా, వారి ప్రాణములు వెలువడి రాముని వెంబడించినవా యనునట్లు చూపట్టుచుండెను. జను లట్టి యవస్థ ననుభవించుచుఁ దమ తమ యిండ్లకు వచ్చి, భార్యాపుత్రులను జుట్టు కూర్చుండఁబెట్టికొని, మోమున మిక్కిలి విన్నదనము దోఁపఁజేయుచుఁ గన్నీరు విడిచిరి. వర్తకులు సంతోషరోమాంచముల నొందక, యంగళ్లుపెట్టరైరి. పుణ్యకార్యములు జరుగకుండెను. గృహస్థులు వంట వార్పులు సేయరైరి. జనులు తమ గృహముల నుండిన వస్తువు లగపడకపోయి, మఱల దొఱికినను, విస్తారధనము దొఱికినను సంతసము నొందకుండిరి. మొదటఁ గొడుకును గన్న తల్లు లాకొడుకును జూచి యానందింపరైరి. ఇంటింటను మగువలేడ్చుచు భర్త లింటికివచ్చుటను జూచి, వ్యసనపీడితలై, అంకుశములచే నేనుఁగులంబోలెఁ దన పెనిమిటులను పరుసని మాటలచేఁ బొడుచుచు "ఎవరు రాముని జూడకుందురో, వారి కిండ్లుండిన నేమి? భార్యలున్న నేమి? విస్తార ధనమున్న నేమి? కొడుకులున్న నేమి? సకల సుఖము

లున్న నేమి? లక్ష్మణుఁడును సీతయు రామునికిఁ బరిచర్య సేయుచు వనమునకుఁబోవు రాముని వెంబడించుచున్నారు గావునఁ బురుషులలో లక్ష్మణుఁ డొక్కఁడే సజ్జనుఁడు. ఆఁడువారిలో నా సీత యొక్కతెయె ధన్యురాలు. రాముఁ డరణ్యమునందలి యే తామర కొలఁకులందును, సామాన్యములగు కొలఁకులందును బరిశుద్ధోదకమున స్నానము సేయునో, ఆకొలఁకులే పుణ్యము సేసినవి. అందములైన వనములుగల యడవులును, గొప్ప జలప్రాయ ప్రదేశములందలి నదులును, నెత్తములతోఁగూడిన కొండలును రాముని బ్రకాశింపఁజేయును. రాముఁ డేయడవికిఁగాని, పర్వతమునకుఁగాని పోవునో, యా యడవియు నాకొండయుఁ బ్రీతితోఁ దనయింటి కతిథివలె నేతెంచిన రాముని బూజసేయకుండఁజాలవు. వింతలైన పుష్పములె శిరోభూషణములుగాఁ గలవై, యనేకములగు పూల గుత్తులను దాల్చి, తుమ్మెదలచే వెలయుచున్న వృక్షములు రామునిఁ జూడఁగలవు. పర్వతముల కాలమునయినను వృక్షములయందు పుష్పములను, ఫలములను బ్రీతితో రామునకుఁ దోఁపింపఁజేయును. మఱియుఁ బర్వతములు వివిధములయిన వింతలగు సెలయేళ్లతోఁగూడి, నిర్మలోదకములను స్రవించుచుండును. వృక్షములు కొండలకొనలందుఁ బుష్పఫలాదులతోఁ గూడి రాముని సంతోషపఱచుచుండును. రాముఁ డెచ్చటనుండునో, అచ్చట భయము లేదు; అపజయము లేదు; దశరథపుత్త్రుఁడయిన దీర్ఘబాహుఁడగు రాముఁడు శూరుఁడుగదా! రాఘవుఁడు మనకతిదూరమునకుఁ బోవకమునుపే యా రాముని వెంబడింతము. అట్టి మహాత్ముఁడైన ప్రభుఁడగు రాముని యడుగుల నీడ సుఖకరముగ నుండును. ఆతఁడే యీ జనులకుఁ బ్రభుఁడు; ఆతఁడే గతి; ఆతఁడె లోకమునఁ బొందఁదగిన స్థానము. మేము సీతకుఁ బరిచర్య సేయుచుందుము; మీరును రామునికిఁ బరిచర్య సేయుచుండుఁడు. అరణ్యమున మీయొక్క యోగక్షేమములను రాముఁడే విచారించుకొనఁగలఁడు. సీతయు మా యోగక్షేమములను విచారించికొనును. ప్రసిద్ధి కోలుపోయినదియు, రామునిపై మక్కువతోఁ దహతహపడుచుండునదియు, రమ్యము గానిదియు, మనమునకు సంతసము నొదవనిదియునైన యీ యయోధ్యయందు నిఁక నెవ్వఁ డుండఁగలఁడు? ఈ రాజ్యము

న్యాయము లేనిదయియుండు నేని, దిక్కు లేనిదానివలెఁ గైకేయిచేఁ జిక్కి. అట్టిరాజ్యమున నుండుటవలనఁ బ్రయోజనములేదు. కావున మాకుఁ బ్రాణములతో నక్కఱలేదు. అట్లుండ, మాకు బిడ్డ లెట్లు పోయిన నేమి? ఇండ్లు, వాఁకిళ్లు, సమస్త సంపదలు నెట్లు పోయిన నేమి? కులనాశకురాలయిన కైకేయి రాజ్యకాంక్షచేఁ దన పెనిమిటిని, కొడుకును విడిచినప్పు డిఁక నెవరినిఁ బాఱఁదోలకుండును. ఆమెయే రాజ్యాధికారము నొందునేని, మన కలుములనెల్ల లాఁగికొని మనలను గూడ రామునివలె నడవికిఁ దఱుముును. దీని కేమియు సంశయములేదు. మా బిడ్డల తోడుగా మేము చెప్పెదము. కైకేయిరాజ్యమున మేము కూలివారముగా నైన నుండఁజాలము. ఇంతయేల? ఆమె బ్రతికియున్న మే మామెను జూచుచు బ్రతికియుండఁజాలము. ఎవతె దయమాలినదై రాజపుత్త్రుఁడయిన రాముని నడవికిఁ బంపినదో, ధర్మముదప్పినదియుఁ బాపకార్యము లొనర్చునదియునైన యట్టి కైకేయికడనుండి యెవ్వఁడు జీవింపనోపును. ఈ పురజనమెల్ల మిక్కిలి యుపద్రవమునకు లోనయి, యాదరువుదప్పి, దిక్కులేక, యీ కైకేయిమూలమున నాశమునొందఁగలదు. రాముఁ డడవికిఁ బోయినాఁడు గావున నృపాలుఁ డిఁక జీవింపఁబోఁడు. దశరథుఁడు మృతినొందు నేని, యటుపిమ్మట కార్యము రోదనమే, వేఱొక్కటిలేదు. ఇది నిశ్చయము. పుణ్యహీనులును, దరిద్రులును నైన మీరు చక్కఁగా యోచించి, రామునైనను వెంబడింపుఁడు. లేదేని, విషమునైనను ద్రాగుఁడు. అటుకాదేని, మీ పేరు వినరానియట్లెక్కడికైన దూరదేశములకుఁ బొండు. రాముఁడు సీతాలక్ష్మణులతోఁ గూడ వంచనమెయిఁ గానలకుఁ బంపఁబడెను. కటికివాని వశమునఁ బసులువోలె భరతునివశమున నప్పగింపఁబడితిమి. రాముని గుణములు వర్ణింప నలవికానివి. లక్ష్మణునియన్నయగు రాముఁడు పున్నమచంద్రునిఁ బోలు మోముగలవాఁడు; నీలవర్ణుఁడు; బలిసిన మూపురములును, పిక్కలుదగులునంత పొడవుచేతులును, కమలములంబోలు కన్నులునుగలవాఁడు; అందఱిని ముందుగా హెచ్చరించువాఁడు; తియ్యనిమాటలవాఁడు; సత్యము పలుకువాఁడు; అధిక బలవంతుఁడు, జనుల కందఱకుఁ జంద్రునివలెఁ బ్రేమతోఁ జూడఁదగినవాఁడు; మదపుటేనుఁగు కౌర్య

మనుజులలో శౌర్యముగలవాఁడు; * మహారథుఁడు, ఆ పురుషోత్త
మ్ముఁడు వనములందు సంచరించుచు, వానినిఁ బ్రకాశింపఁ జేయఁ
గలఁడు" అని తమ భర్తలను గొంతసేపును, కైకేయిని గొంతసేపును,
దమ్ముఁ గొంతసేపును నిందించుకొనుచు, మృత్యుదేవతను జూచి వెఱచి
నట్లు, భీతితోను జింతతోనుకూడి, మిక్కిలి బిగ్గఱగా గొంతెత్తియేడ్చిరి.
ఇవ్విధమునఁ బౌరకాంతలందఱు దమయిండ్లలో విలాపము సేయుచుం
డఁగాఁ బొద్దు గ్రుంకెను; రేయి వచ్చెను. అప్పు డాపట్టణమున జనులు
దీపములు వెలిగింపరైరి. బ్రాహ్మణులు వేదాధ్యయనము, పురాణేతిహాస
ముల పఠనము మానిరి. అప్పు డాపట్టణము చీఁకటిచేఁ బూయఁబడిన
ట్లుండెను. ఆయోధ్యానగరజను లాదరవు దప్పి సంతసము లేకుండిరి.
అప్పు డాపట్టణము రిక్కలులేని యుప్పరముపగిది వెలయకుండెను. ఆ
పౌరకాంతలు రాముని దమకొడుకులకంటె నెక్కువగా నెంచుటచేఁ
దమ కొడుకులును, లేక సోదరులును, నడవికిఁ బంపిన నట్లు దుఃఖిం
తురో, అట్లె రాము నడవికిఁబంపుటచే సంతసముమాని, దుఃఖముతోఁ
గూడి యేడ్చుచుండిరి. గానములు, వేడుకలు, నాట్యములు, వాద్య
ములులేకయు, నంగళ్లుమూయఁబడియు, సంతసములేకయు నుండుటచే
నా పురము నీరింకిన గొప్ప కడలి చందమునఁ గాంతి దఱిగియుండెను.

## 49-వ సర్గము.

రాముఁ డుత్తరకోసల దేశములను దాఁటుట

పురుషశ్రేష్ఠుఁడయిన రాముఁడు తండ్రియొక్క యాజ్ఞయందే
మనస్సునుంచి యారేయి గడచునంతలోపలఁ గడు దవ్వేఁగెను. అట్లు
రాముఁడు పోవుచుండఁగ నారేయి సుఖముగాఁ గడచెను. అంత
రాముఁడు సూర్యోదయమగుడు స్నానము మొదలగు ననుష్ఠానముల
నెల్లఁ దీర్చికొని, దేశముయొక్క పొలిమేరను జేరి యచ్చటఁ జక్కఁగా
దున్నఁబడిన పొలిమేరలుగల గ్రామములను, పూఁచిన వనములను
జూచుచు, వేగశీలములైన మేటి గుఱ్ఱములు పూన్చిన రథమునఁ
గూర్చుండి పోవుచున్నను, మెల్లగాఁ బోయినట్లే చాలదూరమేగెను.

* తన్నును, సారథిని, గుఱ్ఱములను గాపాడుచుఁ బగతురతో యుద్ధచేయు
వాఁడు మహారథుఁ డనఁబడును.

అప్పుడు రామునిఁజూచి, పల్లెపట్టుల నున్న జనులు "ఛీ! దశరథనృపాలుఁడు కామపరవశుఁడై యెంతపని జేసెను. చూచితిరా! అక్కటా! పాపాత్మురాలును, బాపచింతకలదియునైన కైకేయి యెంత క్రూరురాలు? ఎంత పాపకార్యమున కొడికట్టినది! పాపాత్మురాలగు కైకేయి, ధర్మమునందుఁ బట్టుదలగలవాఁడును, మహాబుద్ధిమంతుఁడును, సకల భూతములందు దయగలవాఁడును, ఇంద్రియములను గెల్చినవాఁడునునైన యిట్టి రాజపుత్రుని వనమునకుఁ బంపినదే యీ కైకేయి, కటికిఁదనముగలదై, మర్యాదమీఱి యెంత ఘోరకృత్యము నొనరించుటకుఁ దెగఁబడినది. ఎల్లప్పుడు సుఖముల ననుభవించు జనకుని ముద్దుల పట్టియగు సీత భాగ్యశాలినియయిన యే విధముగా నడవుల నిడుములఁ బడఁగలదు? అక్కటా! దశరథుఁ డెంత దయమాలినవాఁడు! జనులకుఁ బ్రియుఁడును, దోషరహితుఁడునునైన తన కొడుకు నరణ్యమునకుఁ బంప నిచ్చగించినాఁడు!" అని చెప్పుకొనుచుండిరి. వీరుఁడైన కోసలేశ్వరుఁడగు శ్రీరాముఁడును నా పల్లెపట్టుల జను లనుకొనుచుండు నిత్తెఱఁగు మాటల నాలకింపుచుఁ గోసలదేశము దాఁటి, పవిత్రోదకముగల వేదశ్రుతి యనియెడు నదిని దాఁటి, దక్షిణదిక్కువైపునకుఁదిరిగి చాలదూర మేఁగి, యావులమందలతోఁగూడిన జలమయప్రదేశముగలదియు, సముద్రమున సంగమించునదియునైన గోమతీనదిని, యా వెంబడి నెమళ్లయు, నంచలయుఁ గూఁతలతోఁగూడినదియగు స్యందికయను నదిని వేగవంతములైన గుఱ్ఱములు గట్టిన రథంబుచే దాఁటి, యచ్చటి ప్రదేశమును జూచి, "ఓ ప్రియురాలా! తొల్లి మన పూర్వికుఁడయిన యిక్ష్వాకువునకు నీ సకల ధనధాన్య సమృద్ధిగల దేశములతోఁ గూడినదగు నీ పుడమిని మనుచక్రవర్తి యొసఁగెను" అని సీతాదేవికి చూపించెను. వెంటనే మదించిన హంసముయొక్క కంఠధ్వనిం బోలు కంఠధ్వని గలవాఁ డయిన పురుషోత్తముఁ డగు శ్రీమంతుఁడైన రాముఁడు సుమంత్రుని "సారథీ" యని పలుమాఱు పిలిచి, "నేను వనవాసము ముగించివచ్చి, తల్లి దండ్రులం జేరి, యెప్పుడు సరయూనది గట్టునఁ బుష్పములు విరిసియుండు నీ వనము వేఁటాఁడుచు విహారింపఁగలను? రాజర్షుల కీ లోకమున నడవులందు వేఁటయేకదా మిక్కిలి సంత

సము గల్గించునది. శ్రాద్ధాదికాలములందు మనుజు లపేక్షించునదియు, విలుకాండ్ర కభిమతమయినదియునైన సరయూతీర వనమునందు మృగయా విహారమును నే నధికముగాఁ గోరను. రాజర్షుల కీ వేఁటయం దెక్కువ మక్కువగలదు. వారికి దీనింబోలు మఱొక్క యాటలేదు” అని యింక నాయా విషయముల నుద్దేశించి, యింపులైన పలుకులు పలుకుచు నా దారి గడచిపోయెను.

## 50-వ సర్గము.

### రాముఁడు గంగానదియొద్ద గుహునిఁజేరుట

బుద్ధిమంతుఁడగు లక్ష్మణుని యన్నయగు రాముఁడు విశాలము లయి కన్నులకుఁ బండువుసేయుచుండు దక్షిణ కోసల దేశములనుదాఁటి, యయోధ్యాపురము వైపునకుఁ దిరిగి చేతులు జోడించి, “కాకుత్స్థులచేఁ బరిపాలింపఁబడుచున్న యో యయోధ్యాపురమా! నిన్నును, నిన్నుఁ గాపాడుచు నీయందుండు దేవతలను వీడ్కొనుచున్నాను. నేను వనవాసముఁ బూర్తిచేసి, తండ్రి ఋణమును దీర్చుకొన్నవాఁడనై, మఱలఁ దల్లితండ్రుల కడకుఁ జేరి, నిన్నుఁ జూడఁగలను” అని యయోధ్యాపురమును గూర్చి చెప్పి, రక్తమువలె నెఱ్ఱనైన కన్నులు గల రాముఁడు కన్నులనిండ నీరుపెట్టికొని, సంతసముమాని దేశవాసులగు జనులను జూచి, “ఓ జానపదులారా! మీరు నాయెడ నెంత యాదరమును, దయయు చూపితిరి. అదియంతయు చిరకాల దుఃఖమునకు హేతువాయె, అట్లు చిరకాలము దుఃఖ మనుభవించుట కష్టముగదా! కావున మీకార్యములను చూచుకొనుటకై మీ యిండ్లకుఁ బొండు” అని చెప్పెను. ఆ రాముని పలుకులు విని జనులందఱు మహాత్ముఁడగు రామునికి సాగిలఁబడి మ్రొక్కి, ప్రదక్షిణముసేసి, బిగ్గఱగా నేడ్చుచు నచ్చట నచ్చట నిలిచిరి. అట్లు జనులందఱు తనివినొందక యచ్చట విలపించుచుండఁగనే, సాయంకాలమున సూర్యుఁడు గంటికిఁ గనఁబడనట్లు రాముఁడు జనుల కన్నుల కగపడకపోయెను.

అంతటఁ బురుషోత్తముఁడగు రాముఁడు రథమునఁ గూర్చుండియే ధనధాన్యములతోఁ గూడినవియు, దానముచేయు స్వభావముగల వియు, సొంపయినవియు, నెవరివలనను భయములేనివియు, యజ్ఞశాలల

తోను యూపస్తంభములతోను గూడినవియు, నుద్యానవనములతోను మామిడితోఁపులతోను గూడినవియు, జలసమృద్ధములయిన సరోవరములు గలవియుఁ, దనిసి బలిసిన జనులతో నిండినవియు, రాజులచేఁ జూడఁదగినవియు, బ్రాహ్మణుల వేదఘోషమునకు మాఱుమ్రోఁత లీనుచున్నవియు నైన కోసలదేశముల నతిక్రమించెను.

మఱియు, ధైర్యవంతులలో మేటియైన యా రాముఁ డట్లు కోసలదేశముం దాఁటి, సంతుష్టిపడుజనులతోఁ గూడినదియు, సర్వసస్యసమృద్ధంబైనదియు, మనోహరములగు నింటి తోఁటలతోఁ గూడినదియు, రాజశ్రేష్ఠుల యనుభవమునకుఁ దగినదియునైన కోసలదేశము పొడుగున నా దేశపుసొంపుఁ జూచుచునే పోయెను. అయినను, అది యాతని మనస్సు చలించునట్లు చేయఁజాల దాయెను. ఆ కోసలదేశముయొక్క దక్షిణపార్శ్వముననే ప్రవహించుచుండు గంగానదిని జూచెను. అయ్యది నిర్మలజలముగలిగి, పాచిలేక పావనమై, మనమునకు రమ్యమై, ఋషులచే సేవింపఁబడునదయి యొప్పాఱుచుండెను. దాని చేరువను సొబగుమీఱు తపోవనములు వెలుఁగుచుండెను. అప్సరసలందలి మడుగులలో సంతోషముతో జలకము లాడుదురు. గంగానదిగట్టున దేవతలు, దానవులు, గంధర్వులు, కిన్నరులు విహరించుచుందురు. ఆ నిత్యపావనమయిన గంగానదిని గంధర్వకాంత లనేకులు సర్వదా కొల్చుచుందురు. దాని చేరువను దేవతలయుపవనము లనేకములుగలవు. దేవతలయుద్యానములు నూఱులకొలఁదిగ దాని గట్టుననున్నవి. ప్రఖ్యాతిగల యా గంగానది దేవతలనిమిత్త మాకసమునఁ బాఱుచుండును. అందు దివ్య కమలములు గలవు. అందలి ప్రవాహముయొక్క ధ్వని యట్టహాసమువలె భీకరమయినది. తెల్లని నురుగు నవ్వువలెనుండును. ఒకొక్కచోట జల మొక్కపాయగాఁ బాఱుచుండును. కొన్నిచోట్ల నీటిసుళ్లచే శోభిల్లునది. కొన్నిచోట్లఁ గదలక లోతైనది. కొన్నిచోట్ల బ్రవాహజలముచే నల్లకల్లోలమైనది. కొన్నిచోట్ల గంభీరమైన ప్రవాహధ్వనిగలది. కొన్నిచోట్ల భయంకరధ్వనిగలది. గంగనీటియందు దేవగణములు స్నానముచేసి పోవుచుందురు. అది నిర్మలములయిన కలువలచే శోభిల్లుచుండును, కొన్నిచోట్ల విశాలములైన యిసుక తిన్నెలుండును,

కొన్నిచోట్లఁ దెల్లని యిసుక యుండును. హంసలు, బెగ్గురుపక్షులు, చక్రవాకపక్షులు నదిగట్టున శబ్దించుచుండును. ఎడతెగని మదముగల పక్షులు నదమిప్రదేశములందుఁ గూయుచు శోభిల్లఁ జేయుచుండును. గట్టున మొలచినచెట్లు పుష్పమాలికలువోలె నానదికి శోభ గలిగించు చుండెను. కొన్నిస్థలముల నల్లకలువలును, కొన్నిస్థలములందుఁ దామర లును, కొన్ని ప్రదేశములందుఁ దెల్లకలువలును, నరవిరిసిన మొగ్గల సొంపు చేత నా గంగానదిని శోభిల్లఁజేయుచుండును. మఱియు నా గంగానది కొన్నిచోటులం దనేకవిధములైన పూవులయొక్క పరాగము నిండి యుండుటచే, మఱికితోఁగూడినదిగను మఱికిలేనిదగుటచేత స్ఫటికము నందు నవి నిర్మలముగఁ ప్రతిబింబము కాన్పించునదిగను నుండును. ఆ గంగానది చేరువనుండు వనములలో దిగ్గజములును, వనగజములును, మేటి మదపుటేనుఁగులును, దేవతలకు వాహనములగు నేనుఁగులును మాటిమాటికి ఘీంకారములు చేయుచుండును. అందుఁ బండ్లు, పువ్వులు, చిగుళ్లు, పొదలు, పక్షులు నావరించియుండుటచే నయ్యది, సకల భూషణములను దాల్చిన కాంతవలె సొంపుమీఱియుండును. కూర్మ గ్రాహ సర్పాదులగు జంతువులతోఁ గూడియుండును. అట్టి సకల గుణ ములతోఁగూడినదియు, విష్ణువుయొక్క పాదమునఁ బుట్టినదియు, దేవలోక మునఁ బుట్టినదియగుటచేఁ బాపరహితయైనదియు, పాపాత్ముల పాపములఁ బోఁగొట్టునదియు, భగీరథుని తపోబలముచే నీశ్వరుని జటాజూటము నుండి పుడమికిఁ జాఱిపడినదియు, బెగ్గురుపక్షులయు, క్రౌంచములయు నాదములతోఁగూడినదియునైన సముద్రరాజపత్నియగు గంగానదిని రాముఁడు శృంగిబేరపుర సమీపమునఁ జూచెను. తరంగములతోఁ గూడుకొనిన సుళ్లుగల గంగానదిని జూచిన పదంపడి మహారథుఁడైన రాముఁడు సారథింబిలిచి, "సుమంత్రుఁడా! మన మీదినమున నిచ్చ టనే యుందము. ఇదిగో, చూచితివా యీ నదికి దాపుననే లెక్కలేని పువ్వులతోను పండ్లతోను గూడినయొక గొప్ప గారచెట్టున్నది. దానిక్రిం దనేయుండి, నిర్మలోదకముగలిగి పావనమై, దేవ, దానవ, గంధర్వ, మానుషులచేతను, మృగములచేతను, పక్షులచేతను గొల్వఁబడుచుండు నదీశ్రేష్ఠమైన గంగానదిని జూచెదము." అని చెప్పెను. అంత సుమంత్రుఁ

డును లక్ష్మణుఁడును 'సరి'యని చెప్పి యాగారచెట్టుయొక్క చేరువకు రథమును దోలిరి. వెంటనే రాముఁడును సీతాలక్ష్మణులతోడ రథము నుండి దిగి, యా రమ్యమయిన గారచెట్టుక్రింద విడిసెను. సుమంత్రుఁడును తేరినుండి దిగి, మేటిగుఱ్ఱములను విప్పి, దాఁపునఁ గట్టివేసి, చెట్టు క్రిందఁ గూర్చుండియున్న రాముని సన్నిధానమునఁ జేతులు జోడించికొని యుండెను.

అప్పు డచ్చట గుహుఁడనెడి బోయరా జొకఁడుండెను. ఆతఁడు రామునికిఁ బ్రాణస్నేహితుఁడు. బలవంతుఁడు స్థపతియని ప్రసిద్ధిగనిన వాఁడు. ఆ గుహుఁడు పురుషోత్తముఁడగు రాముఁడు తనదేశమునకు వచ్చియున్నాఁడని విని, పెద్దలతోను, మంత్రులతోను, దన కులము వారితోను గూడి యతని నెదుర్కొనఁగా, నప్పుడు రాముఁడు దూరముననే వచ్చెడు గుహునిం జూచి, లక్ష్మణునితోఁగూడ నాతనిఁ గలిసికొనెను. గుహుఁడును దుఃఖితుఁడై రాముని గౌఁగిలించి, "యో రామా! నీ కయోధ్య యెట్లో యట్లె యిదియును నని తలఁచుకొనుము. నీ కేమి చేయుదును? ఓ మహాబాహువా, నీవోటి ప్రియుఁడగు నతిథి యెవ్వనికి దొఱకును" అని చెప్పి షడ్రసోపేతమయి రుచికరమయి నానావిధములయిన భక్ష్యభోజ్యాదులతోఁగూడిన యన్నమును తెప్పించి, యర్ఘ్యాదిపూజాద్రవ్యములను సిద్ధపఱచి, రాము నుద్దేశించి, 'యో దీర్ఘబాహుఁడా! నీకు స్వాగతము. ఈ భూమండలమెల్ల నీయది మేము నీకుఁ గింకరులము. నీవు భర్తవు. నీవు మా రాజ్యమును స్వేచ్ఛగా నేలుము. ఇవిగో భక్ష్య, భోజ్య, పేయ, లేహ్యములును, మేటిపాన్పులును, గుఱ్ఱములకు మేఁతయును సిద్ధముగా నున్నవి. వీని ననుగ్రహించి, భక్ష్యభోజ్యాదులతోఁగూడిన యన్నమును భుజించి సుఖకరములగు పాన్పులపైఁ బరుండుము. గుఱ్ఱములకును తీని వేయింపుము." అని యివ్విధమునఁ జెప్పుచుండు గుహునిచూచి, "గుహా! నీవు రాజవై యుండియుఁ గాలినడకతో వచ్చుటచేతను, చెలిమిఁ జూపించుటచేతను, మేము పూజింపఁబడితిమి. సకలవిధములుగా మేము సంతసించితిమి" అని చెప్పి, బలిసిన బాహువులతో నాతనిని గట్టిగాఁ గౌఁగిలించికొని, యిట్లనియె. "ఓ గుహా! నీకును, నీ బంధువులకును

దైవానుగ్రహమువలన నారోగ్యమేకదా. నీయొక్క రాజ్యమున క్షేమమేకదా! నీ స్నేహితు లందఱు నేమముగా నున్నారుగదా! నీకు సకలవస్తువులందును కొఱంతలేక యున్నదిగదా! నీ విప్పుడు నాకుఁ బ్రీతితోఁ దెచ్చిపెట్టిన వానినన్నింటిని అంగీకరించితిని. కాని నేను వాని నిప్పుడు గైకొను స్థితియందు లేను. నేను దర్భలను, నారబట్టలను, కృష్ణాజినములను దాల్చి, పండ్లను దుంపలను దినుచు, స్వధర్మాచరణము నందు హెచ్చరికగలవాఁడనై యడవులందుఁ దిరుగుచు, మునినై యుండఁ బోయెదను. ఇప్పుడీ గుఱ్ఱములకుఁ దీనిమాత్రము కావలయును, అదిమాత్రము చాలును. దానిచే నీవు నన్నన్నివిధములచేఁ బూజించిన ట్లగును. ఈ గుఱ్ఱములు మాతండ్రియగు దశరథనృపాలునకు మిక్కిలి ప్రీతికరములు. వీనికిఁ దగిన తీని వేసి వీనిని తనివినొందించినయెడల, దానిచే నేను జక్కఁగాఁ బూజింపఁబడినవాఁడ నయ్యెదను" అని చెప్పఁగా గుహుఁడు దచ్చటినుండియే పనివారింబిలిచి, యీగుఱ్ఱములకు వేగిరంబుగ నీరువెట్టించి తీని వేయింపుఁడని యానతియొసఁగెను. అంత రాముఁడు నారబట్టయే యంగవస్త్రముగా వేసికొని, సాయంకాలిక సంధ్యావంద నము నాచరించి, లక్ష్మణుఁడు తెచ్చియిచ్చిన గంగోదకమును మాత్రమె త్రాగెను. భార్యతోడ నేలపై పరుండియున్న రామునిపాదములు కడిగి లక్ష్మణుఁడు తానును గారచెట్టుకడకు వచ్చిచేరెను. గుహుఁడును సుమంత్రునితోఁగూడి లక్ష్మణునితో మాటలాడుచు, విల్లు చేతఁబట్టి, మెలఁకువతో రామునికడ మేలుకొనియుండెను. అంతట మహాబలవంతుఁడును, కీర్తిమంతుఁడును, బుద్ధిమంతుఁడును, దుఃఖము నెఱుఁగని వాఁడును, సౌఖ్యములకుఁ దగినవాఁడును నైన దశరథ పుత్త్రుఁడగు రాముఁ డట్లు నిద్రింపఁగా, నారేయి యాలస్యముగా దాఁటినట్లుండెను.

## 51-వ సర్గము.

### గుహుఁడు లక్ష్మణునితో సంభాషించుట

గుహుఁడు, నిష్కపటముగాఁ దన యన్న యొక్క కాఁపుదల నిమిత్తమై నిద్రమేల్కొనియున్న లక్ష్మణునిఁ జూచి, మిగుల సంతాపముతో "ఓ లక్ష్మణా! నాయనా, యీ పాన్పు నీ నిమిత్తము పఱుపఁ బడినది, రాజపుత్త్రా! యీ పాన్పునందుఁ జక్కఁగాఁ బరుండి యలసట

దీర్చికొనుము. వనవాసులమగు మేము సకలక్లేశముల ననుభవింపఁదగిన
దుము. నీవు సౌఖ్యముల ననుభవింపఁ దగినవాఁడవు. నీవు పాన్పునఁ
బరుండి నిద్రింపుము. రాముని రక్షణమునిమిత్తమై మేము రాత్రియెల్ల
మేల్కొనియుండెదము. నాకు రామునికంటె మించిన చెలికాఁ డీ
భూలోకమున లేఁడు. నాసత్యము సాక్షిగా నొట్టిడి చెప్పెదను. ఇది
నిజముగాఁ బలికితినని నమ్ముము. నేను నా యనుఁగుఁజెలికాఁడయిన
యీ రాముని యనుగ్రహమునఁజేసియె మిక్కిలి విస్తారమయిన కీర్తిని,
విశేషమయిన ధర్మమును, ఎక్కువ ధనమును బొందఁ గోరుచున్నాను.
అట్టి నేను విల్లు చేతఁబట్టి, నా బంధువుల నందఱను దోడుచేసికొని,
సీతతోఁగూడ శయనించియుండు నాయనుఁగుఁ జెలికాడయిన రాముని
గాపాడఁగలను. నే నెల్లప్పు డీ వనమునకుఁ దిరుగువాఁడనగుటచే
నే నెఱుఁగనిది యిచ్చట నొక్కటియు లేదు. గొప్పదయిన చతురంగ
బలముతో నెవరైన నెత్తి వచ్చినను, మేము వారి నోర్వఁగలము" అని
లక్ష్మణునితోఁ జెప్పెను.

అప్పుడు లక్ష్మణుఁడు గుహుని పలుకులు విని, గుహుని చూచి,
"పాపరహితుఁడవైన యో గుహుఁడా! నీ వెల్లప్పుడు సత్కార్యము
నందే పట్టుదల గలవాఁడవు. నీయొక్క కాఁపుదలవలన మేమందఱము
నిర్భయులముగా నున్నవారము. అయినను దశరథపుత్రుఁడైన
రాముఁడు సీతతోఁగూడి యుత్తనేలపైఁ బరుండునప్పుడు, నాకెట్లు
నిద్ర వచ్చును? సుఖమెక్కడిది? తుదకుఁ బ్రాణములైన నెట్లు నిల్చును?
యుద్ధరంగమున దేవదానవు లందఱు గూడి వచ్చినను, ఏ రాముని పరా
క్రమమునకు నోర్వఁజాలరో, అట్టి రాముఁడు పచ్చికపై సుఖముగా
సీతతోఁగూడి యెట్లు నిద్రించుచున్నాఁడో, చూడుము. దశరథుఁ
డనేకమంత్రములు జపించి, గొప్ప తపస్సుచేసి, నానావిధములగు కష్ట
ములకోర్చి, పడసిన ప్రియపుత్రుఁడయిన రాముఁడు తండ్రి గుణముల
కీడయిన గుణములు గలవాఁడు. ఇట్టి తన కుమారుని నడవికిఁ బంపి
చాలకాలము జీవింపఁజాలఁడు. కావున శీఘ్రముననే యీభూమి విధవ
యగును. అప్పు డంతఃపురకాంతలందఱు పెద్ద గొంతెత్తియేడ్చి, యల
సటచే నూరకుందురు. అప్పుడు రాచనగరు రోదమాని, నిశ్శబ్దముగా

నుండఁగలవని తలఁచెదను. కౌసల్యయు, నృపాలుఁడును, నల్లె మాతల్లియు జీవించియుందురేని యీరాత్రిమాత్రమే యని తలఁచెదను. నా తల్లి సుమిత్ర శత్రుఘ్ననిమీఁదియాశతో జీవించియుండవచ్చును. కాని వీరుని గన్నతల్లియగు కౌసల్య జీవింపదు. ఈ దుఃఖము నన్ను మిక్కిలి పీడించుచున్నది. రాజుపై నెక్కువ ప్రేమగల జనులుగలదియు, సౌఖ్యమునకు దావలమైనదియు, లోకమునకుఁ బ్రియమును గలిగించునదియు నగు నయోధ్యాపురముగూడ రాజులేని వ్యసనముచేఁ బాడువడును. మహాత్ముఁడగు దశరథుఁడు ప్రియుఁడైన గొప్పబుద్ధిగల తనదు పెద్దకొడుకును జూడక యెట్లు ప్రాణములతో నుండఁజాలును? కావున నృపాలుఁడును తప్పక మృతినొందును. రాజు మృతినొందిన వెంటనే కౌసల్య చెల్లుకొనును. ఆ వెంబడే నా తల్లియు నశించును. కడచినది కడచినదియే. అది వేఱువిధముగా జరుగదు. మా తండ్రి రామునికిఁ బట్టాభిషేకమొనర్చి చూడవలెనను కోరికగలవాఁడై యుండెను. అతఁడు తనకోరికయగు రామపట్టాభిషేకమును గావింపకయే మృతి నొందఁగలఁడు. అట్టి సమయము వచ్చినయెడల, ధన్యులయినవారు దగ్గఱనుండి, లోకాంతరమునొందిన మా తండ్రికిఁ బ్రేతకృత్యములు నిర్వర్తింపఁగలరు. అందములైన ముంగిళ్ల తీరుగలదియుఁ, జక్కఁగాఁదీర్చిన పెద్దవీథులు గలదియు, గొప్ప ధనికుల యిండ్లతోను, రాజనగరులతోనుఁ గూడినదియు, అందకత్తెలగు నాటచేడియలచే వెలయుచున్నదియు, ఏనుఁగులతోడను, గుఱ్ఱముల తోడను, తేరులతోడను గ్రిక్కిరిసియుండునదియు, వాద్యముల ధ్వనులచే మ్రోగింపఁబడినదియు, సకల శుభములతోఁ గూడినదియు, సంతోషము సమృద్ధిగల జనులచే నెడతెరిపిలేకయుండునదియు, ఉపవనముల తోను ఉద్యానములతోను గూడినదియు, జనులందఱుం గలిసి చేయు నుత్సవములచేతఁ బ్రకాశించునదియునైన నా తండ్రియొక్క రాజధానియగు నయోధ్యయందు సుఖపురుషు లుండఁగలరు. దశరథుఁడు బ్రతికి యుండునా? వనవాసము సమాప్తిగావించి మేమువచ్చి, నియమవంతుఁడైన మా తండ్రినిజూతుమా? ఈతఁడు వనవాసము ముగించి మఱలి వచ్చునప్పటికి క్షేమముతో నున్న సత్యసంధుఁడైన మా తండ్రిగారితోఁ

కూడ నయోధ్యను బ్రవేశింతుమా ?" అని యివ్విధమున లక్ష్మణుఁడు గుహునితోఁ దన మనోదుఃఖమును దలపోసికొనుచు మేల్కొని నిలఁబడియుండఁగా, నా రేయి గడచెను. ప్రజల మేలు గోరెడి నరేంద్ర పుత్త్రుఁడయిన లక్ష్మణుఁడు దన యన్నయందలి ప్రేమచే నవ్విధమున యథార్థమును జెప్పుచుండఁగా, గుహుఁడును లక్ష్మణుని మాటలచే మిక్కిలి విచారము నొందినవాఁడై, జ్వరముతో బాధపడుచున్న యేనుఁగువలె దుఃఖముతో బాధనొందినవాఁ డయ్యెను.

## 52-వ సర్గము

రాముఁడు గంగానదినిదాఁటి వత్సదేశములకుఁ జేరుట

ఆ రేయిగడచి తెల్లవాఱఁగా, విశాలమయిన ఱొమ్ముగల వాఁడును కీర్తిమంతుఁడునునైన రాముఁడు శుభలక్షణములుగల లక్ష్మణునిఁ జూచి, "నాయనా! యిది సూర్యోదయకాలము. పూజ్యమయిన నిశ గడచినది. ఇదిగో యిచ్చట మిక్కిలి నల్లని యొక కోయిల కూయుచున్నది. వనమునఁ గూయుచుండు నెమళ్ళకూఁతలు వినఁబడుచున్నవి. ఓ సాధువా! వేగముగాఁ బ్రవహించునదియు సముద్రగామియునగు గంగానదిని దాఁటుదము" అని చెప్పెను. మిత్త్రులకు సంతోషమును గలిగించు లక్ష్మణుఁడు రాముని యభిప్రాయ మెఱిఁగి, గుహుని, సారథిని బిలిచికొనివచ్చి తన యన్నయెదుట నిలఁబడెను. ఆ గుహుఁడును, రాముని పలుకులు విని, యా మాటలకొప్పుకొని, వెంటనే తన మంత్త్రులను బిలిచి, "ఓ మంత్త్రులారా! రాముని నిమిత్తమయి గట్టిదియు, నందమైనదియు, సులభముగా దాఁటఁగూడినదియునైన యొక నావను సిద్ధపఱిచి, దానికి వలయు సాధనములతో దానికొక పడవవాని నేర్పఱిచి, రేవునందు వేగముగ నిల్పుము" అని యానతిచ్చెను. వెంటనే గుహుని మంత్త్రులంద ఱా యానతిని విని, యొక సొగసునావను రేవుకడకుఁ దెప్పించిపెట్టి, గుహున కా సంగతిఁ దెలిపిరి.

అంతట గుహుఁడు లేచి చేతులు జోడించికొని నిలఁబడి, "ఓ ప్రభూ? యిదిగో నావ సిద్ధమయినది. ఇఁక నేమి యానతిత్తురో దాని జేసెదను. పురుషోత్తమా! దేవకుమారసదృశా! మంచి నియమముగల వాఁడా! యీ నావ నీ సాగరగామినియగు గంగానదిని దాఁటు నిమి

త్రము చెప్పించితిని. తా మెక్కి కూర్చుండుఁడు" అని చెప్పెను. అంతట రాముఁడును గుహుని చూచి, "నీవలన నాకోరిక తీరినది. మమ్ములను ద్వరలో నెక్కించుము" అని చెప్పి, తానును, లక్ష్మణుఁడు నమ్ముల పొదులను గట్టికొని, కత్తులు నడుమునఁగట్టుకొని, విండ్లనుబట్టి సీతను దోడ్కొని, గంగానదియొడ్డునకుఁ బోవు దారిని బయనమైరి. అంతట సారథియగు సుమంత్రుఁడు కృతాంజలియై ధర్మజ్ఞుఁడయిన రామునికడ కేఁగుదెంచి, మిక్కిలి యడఁకువతో "మహాప్రభూ! నా కాజ్ఞయేమి?" అని యడిగెను. అంత రాముఁడు శ్రేష్ఠమైన తనకుడిచేతితో నతనినిదడవి "సారథీ! వెంటనే మఱలి తండ్రికడ కేఁగుము. నృపాలుని సమీపమున జాగ్రత్తతో నుండుము. నీ వింతదూరము నన్నుఁ దోడ్కొనివచ్చి విడచితివి. ఇఁక రథముమాని, కాలినడతో నడవులందు సంచరించెదము. నీవు మఱలి యూరికిఁ బొమ్ము" అనెను. సారథియు, రాముఁడు దన్ను మఱలి పట్టణమునకుఁ బొమ్మని సెలవొసంగుటఁ జూచి, పురుషోత్తముఁ డగు నిక్ష్వాకునందను నుద్దేశించి యిట్లనియె. "పురుషోత్తమా! నీవు తమ్మునితోను భార్యతోను దరిద్రునివలె నడవిలోఁ దిరుగు నవస్థ నెవ్వఁడును దప్పింపఁజాలకున్నాఁడుగదా! నీయొక్క కష్టము చూడఁగా, బ్రహ్మచర్యము, వేదాధ్యయనము, మెత్తన, కపటములేమి మున్నగు గుణములవలన ఫలము లేదనితలఁతును. వీరుఁడా! నీవు సీతాలక్ష్మణులతో మాత్రముగూడి వనముననున్నను, ముల్లోకముల గెలుచునట్లుత్తమగతి నొందుదువు. ఓరామా! మమ్ము దైవము వంచించెను. నీవును మోసపుచ్చితివి. ఇఁక మేము దుఃఖపడుచుఁ బాపాత్మురాలగు కైకేయివశమున నుండఁగలవారము" అని చెప్పుచు సుమంత్రుఁ డప్పటప్పటికి దూరమగుచుండు రామునిఁ జూచి, దుఃఖపీడితుఁడై చాలసేపు బిగ్గఱగా నేడ్చెను. అట్లు విలపించి, కన్నీరు కడిగికొని యాచమనముచేసి, పరిశుద్ధుఁడయియున్న సారథినిజూచి, "ఓ సుమంత్రా! యిక్ష్వాకువంశస్థులకు నీవంటి చెలికాఁడు మఱొక్కఁడు లేఁడు. కావున దశరథుఁ డెట్లు నన్నుఁ గూర్చి వ్యసనము నొందకుండునో, అట్లు నీ వొనరించుచుండవలయును. నృపాలుఁడు దుఃఖముచేఁ గొట్టువడిన మనసుగలవాఁడు, ముసలివాఁడు, మీఁదుమిక్కిలి కామాతిశయముచేఁ బీడింపఁబడియున్నవాఁడు. కావున

నీ మాటను జెప్పితిని. మహాబలిష్ఠుఁడగు దశరథనృపాలుఁడు కైకేయి మనోరథమును నెఱవేర్చుటకై యానతిచ్చువాని నంతయు నీవు మాఱాడక చేసి తీరవలయును. రాజులు తమకుఁ దోఁచినకార్యములు నిర్విఘ్నముగా జరుగునిమిత్తమేకదా రాజ్యములను బాలింతురు! సుమంత్రా! మహారాజేది యెట్లు చేయుమని చెప్పునో, యాయన కసత్యదోషము వాటిల్లకుండునట్లు, దుఃఖముచే నొవ్వకుండునట్లును ఆయన చెప్పిన పనిని నాయన చెప్పినప్రకారమే చేయుచుండుము. దుఃఖమనఁగ నెట్టిదో యెఱుఁగనివాఁడు, పెద్ద, పూజ్యుఁడు, జితేంద్రియుఁడునైన దశరథనృపాలునికి నీవు నామాఱుగా నమస్కరించి, వెంటనే యీ మాటను నేఁ జెప్పినట్లుగఁ జెప్పుము. "మహారాజా! నేను కాని, లక్ష్మణుఁడు కాని, సీతగాని మేము మఱల్వరము నొకప్పుడయినను యయోధ్యాపురమును విడిచి వచ్చితిమ యనికాని అరణ్యమున నుండవలసివచ్చెనని కాని, దుఃఖమొందుట లేదు. పదునాలుగేండ్లు నిండఁగా వెంటనే మఱలివచ్చిన మమ్ము ముగ్గురను జూడఁగలరు. ఈ ప్రకారమే మాతల్లితోను, అచ్చటఁ గూడియున్న తక్కిన రాజపత్నులతోను జెప్పుము. కైకేయితో మాటిమాటికి నీ సంగతిఁ జెప్పుము. తరువాత మా తల్లియగు కౌసల్యతో సీతయు, లక్ష్మణుఁడు, నేనును జెప్పుచున్నట్లుగా మా క్షేమములను, పిదప మా నమస్కారములను జెప్పుము. మహారాజుతో విన్నవించి యానతిఁ గైకొని భరతుని శీఘ్రముగాఁ దోడ్కొనిరమ్ము. భరతుఁడును వచ్చినతర్వాత నృపాలుని యభిమతముఁ గనుఁగొని, యాతనికిఁ బట్టాభిషేకము గావింపవలయును. అట్లు నీవు భరతునికి యువరాజపట్టముఁ గట్టి, యాతని నాలింగనము చేసికొంటివేని, వియోగమువలని దుఃఖము నిన్నేమియుఁ జేయఁజాలదు. భరతునికిఁగూడ "ఓ భరతా! నీవు తండ్రి విషయమున నెట్లు వర్తింతువో యట్లే తల్లు లందఱివిషయమునను నేకరీతి నుండుము. పక్షపాతము నెంచకుము. నీకుఁ గైకేయి యెట్టిదో సుమిత్ర యట్టిది. కౌసల్యయు నట్టిది. కావున నీవు వారికి ముగ్వురికిని భేదములేక యేకవిధమయిన గౌరవమును జూపుము. తండ్రియొక్క మనోరథము ప్రకారము నడపుటకై నీవు యౌవరాజ్యముఁ బొందుదువు కావున నీ విహపరములకు రెంటికిని నుపయుక్తమగు సుఖమును

జెంపొందించుకొనఁగలవు" అని చెప్పుమని రాముఁడు సుమంత్రునితోఁ జెప్పెను.

ఇట్లు సుమంత్రుఁడు రామునిచే మఱలింపఁబడుచు, దుఃఖపీడితుఁడై యా రాముఁడు సెప్పిన పలుకులనెల్ల నాలకించి, రాముని గూర్చి స్నేహముతో నిట్లనియె. "ఓ రాఘవా! నే ననురాగముచే భయమువదలి, యేమాట చెప్పుచున్నానో, యది యుపచారార్థముగాఁ జెప్పునది కాదు, భక్తితో మనఃపూర్వకముగఁ జెప్పునది. అట్టిమాటలను నీవు "ఇతఁడు భక్తు"డనియెంచి నన్ను మన్నింపవలెను. "రాజపుత్రా! నీ వియోగముచేఁ బుత్రశోకముచేతనుఁబోలె వగచుచున్న యయోధ్యాపురమునకు నేను నిన్నిక్కడ విడిచి యెట్లు పోవుదును? అప్పుడు జనులందఱు రామునితోఁగూడిన రథమునుజూచిరి. రాముఁడు లేని రథము నిప్పుడు జూచిన నాపట్టణములో జనులగుండె లవియునేకదా! ఈయుత్తరమును జూచినంతనే, యుద్ధమున వీరుఁడయిన నాయకుఁడు మరణింపఁగా సారథితోలుకొనివచ్చు శూన్యరథమును చూచినసైన్యము వలె నయోధ్యాపురము మిగుల దైన్యము నొందఁగలదు. జనులు, నీవు దవ్వుననున్నను, మనము ఎదుట నున్నట్లే భావించి, నిన్నే ధ్యానించుచు నాహారముఁ గానకుందురు. రామా! నీ వడవికి వచ్చునప్పుడు, నీ వియోగదుఃఖము నొచ్చిన మనసులు గలజనుల క్షోభమును నీవు కన్నులారఁ జూచియున్నావుగదా! నిన్నుఁ గొనిపోవునాఁడు పుట్టినజనుల యార్తనాద మిప్పుడు రథమున నొంటరినైయున్న నన్నుఁ జూడఁగనే మునుపటికంటె నూఱంతలెక్కువ కాఁగలదు. మఱియు నీ తల్లిగారిని జూచి, "నీకొమారుని నేను మేనమామయింట విడిచివచ్చితిని. నీవు వ్యసనపడనక్కఱలేదు" అని చెప్పుదునా? ఈమాట ప్రియమైనను నసత్యము గానఁ జెప్పుట కెట్లిష్టపడుదును? లేక, "నీ కొడుకును వనమున విడిచి వచ్చితి" నని చెప్పుట నిజమైనను, అప్రియమైనమాట నే నెట్లు చెప్పుదును? ఎట్లు చెప్పుటకును లేకయున్నది. నే నేమి చేయుదును? నిన్నును నీ బంధువులగు సీతాలక్ష్మణులను వహించికొనివచ్చిన యీ గుఱ్ఱములు నా కొక్కనికే లోఁబడును. అవి నీవులేని రథమును మఱలించి యెట్లీడ్చుకొని పోవఁగలవు? కావున, ఓ పాపరహితుఁడా! నిన్నువిడిచి,

నే నయోధ్యకుఁ బోఁజాలను. సీతతోడ వనవాసము సేయు సెలవిమ్ము.
నే నిన్ని తెఱంగుల యాచించినను, నన్ను విడిచిపోదువేని, నే నిక్కడనే
రథముతోఁగూడ నగ్నియందుఁ బడెదను. లేక నన్నుఁగూడఁ దీసికొని
పోదువేని, నీ తపమునకు విఘ్నకరములగు మృగముల నీ రథము నెక్కి-
పోయి చంపెదను. నీ యనుగ్రహమున రథము దోలి, రథమునఁ
గూర్చుండు సుఖము ననుభవించితిని. ఇప్పుడును నీ యనుగ్రహమున
వనవాస సౌఖ్యము ననుభవించెదను. ఓ రాముఁడా! నేను నడవిలో
నీతోడ నుండఁగోరుచున్నాను. అనుగ్రహింపుము, ప్రీతితో నా చెంత
నుండుమని చెప్పుము. ఓ శూరుఁడా! యీ గుఱ్ఱములును వనముల
నుండి నీకుఁ బరిచర్యచేసి యుత్తమగతి నొందఁగలవు. రామా! వనమున
నివసించుచు, నీ వాజ్ఞయిచ్చిన కార్యమును శిరసావహించి చేసెదను.
ఎల్ల విధముల నయోధ్యకుఁబోను. స్వర్గమునకైనను బోను. పాపాత్ముఁడు
స్వర్గలోకమునకుఁ బోఁజాలనట్లు, నిన్ను విడిచి యయోధ్యాపురమునకుఁ
బోఁజాలను. వనవాసము ముగిసినపిదప నీరథముననే మిమ్ముఁ గూర్చుండఁ
బెట్టికొని మఱల యయోధ్యకుఁ గొనిపోయెదను. ఇదియే నామనోరథము
నేను నీతోడ నరణ్యమున నుంటినేని, నాకీ పదునాలుగేండ్లును నొక
క్షణమువలె గడచును. అట్లుకాకున్నచో నీ పదునాలుగేండ్లే నూఱేం
డ్లుగాఁ దోఁచును. పరిచారకులందుఁ బ్రేమగల యో నృపాలా! నేను
భృత్యుఁడను భక్తుఁడను, మర్యాద దప్పనివాఁడను. ప్రభుపుత్త్రుఁడ
వయిన నీదారిలోఁ బోఁదలఁచుచున్నాను. ఇట్టి నన్నుఁబాసి పోవుట
తగదు." అని యివ్విధమునఁ బలుతెఱఁగుల మాటిమాటికిఁ బ్రార్థించు
చున్న సుమంత్రునిఁ జూచి, సేవకులందు వాత్సల్యముగల రాముఁ
డిట్లనియెను. ప్రభుభక్తిగల యో సుమంత్రా! నీకు నాయెడఁగల
యత్యంత భక్తిని నే నెఱుఁగుదును. అయినను, ఓ సారథీ! నేను నిన్నేల
పత్తనమునకుఁ బంపుచున్నానో చెప్పెదను వినుము. నా సవతితల్లియగు
కైకేయి యయోధ్యకు మఱలివచ్చిన నిన్నుఁజూచి, రాముఁడు కానల
కేఁగెనని మనమున నమ్మికఁ బొందును. నా వనవాసమును విని, మనోరథ
పరిపూరణముచే మిక్కిలి సంతసమొంది, ధర్మపథముఁ దప్పని రాజును
గూర్చి యితఁ డసత్యవాదియను సంశయము వదలును. నా కడఁ

గొట్టుతల్లియగు కైకేయి భరతుని న్యాయపరిపాలనముచే జక్కఁగా వృద్ధిఁబొందిన తన పుత్త్రుని రాజ్యమును బొందుననుటయే నాకుఁ బ్రధానము. నీవు నా మనోరథసిద్ధికొఱకును తండ్రియొక్క సత్య వాక్యపరిపాలనరూపకార్యసిద్ధికొఱకును రథముఁ దోలుకొని పట్టణమునకుఁ బొమ్ము. సీతో నేయే సంగతుల నెవరికెవరి కెట్లెట్లు చెప్పితినో, వారికివారి కాయాసంగతుల నట్లట్లె చెప్పవలసినది" అని యివ్విధముగా సారథితోఁ జెప్పి, మాటిమాటికి నూఱడించి, ధైర్యవంతుఁడయిన రాముఁడు గుహునిగూర్చి, సకారణముగా నిట్లనియె. "ఓ గుహా! జనసంచారముగల యిట్టి వనమున నుండుట యోగ్యము గాదు. మునులు నివసించెడి తపోవనములం దుండవలయును. అందుకుఁ దగినవిధులను నిర్వర్తించుకొనవలయును. కావున ఋషుల కలంకారములగు వ్రతములనుబూని, తండ్రికిని, సీతాలక్ష్మణులకును హితముఁగోరి, జడలుదాల్చి యాశ్రమములకుఁ బోయెదను. మఱ్ఱిపాలు తెమ్ము." అని రాముఁ డానతీఁగా, గుహుఁడు వేగిరముగా రాజపుత్త్రుఁడగు రామునకు మఱ్ఱిపాలు తెచ్చి యిచ్చెను. రాముఁ డాపాలను గైకొని తాను జడలును దాల్చెను. లక్ష్మణుని జడలనుదాల్చునట్లు చేసెను. దీర్ఘబాహువైన పురుషోత్తముఁ డిట్లు జడదారియాయెను. అప్పుడు నారబట్టలను గట్టుకొని జడలఁ గుంపులుదాల్చిన యా యన్నదమ్ములగు రామలక్ష్మణులు ఋషులపగిది వెలుఁగొందుచుండిరి. అంత రాముఁడు లక్ష్మణసమేతుఁడై వైఖానసవ్రతము నవలంబించి, నియమము లవలంబించినవాఁడై చెలికాఁడగు గుహునిఁ జూచి, "ఓ గుహా! సైన్యము, బొక్కసము, దుర్గము, దేశమునను వాటియందు జాగ్రత్తగలిగియుండుము. ఏలయన, రాజ్యపరిపాలనము మిక్కిలి గడుసైనదికదా!" అని చెప్పి, గుహుని వీడ్కొని సీతాలక్ష్మణసమేతుఁడై ధైర్యముతో వెడలెను. అంత గంగానదితీరమున నిక్ష్వాకువంశనందనుఁడైన రాముఁడుఁ వేగముగాఁబాఱెడు గంగానదిని దాఁటఁగోరి, నదియొడ్డుననున్న నావనుజూచి, లక్ష్మణుని వైపునకుఁ దిరిగి, "నరశ్రేష్ఠుఁడా! యీ నిలిచియుండు నావయందు మెల్లఁగానెక్కి కూర్చుండుము. మంచి మనస్సుగలసీతను వెనుకనుండి బట్టికొని యెక్కింపుము" అనెను. తర్వాత లక్ష్మణుఁ డన్నమాట ద్రోసి

వేయక, ముందుగా సీత నెక్కించి, పిదపఁ దానెక్కి కూర్చుండెను. అటు తర్వాత శూరుఁడైన రాముఁడును ఎక్కి కూర్చుండెను. అంతట నిషాదుల కధిపతియగు గుహుఁడు నావను నడపుఁడని తన బంధువులను బురికొల్పెను. మహాతేజస్వియైన రాముఁడును నావయెక్కి, బ్రాహ్మణ క్షత్రియులకు యోగ్యమయి, తన కితవుచేయు "దైవీం నావం" అను మంత్రమును జపించి, పిదప నాచమనముసేసి, సీతతోఁగూడ నాగంగానదికి మ్రొక్కెను. సంతసముచే నుప్పొంగిన విశేషకాంతిగల లక్ష్మణుఁడును గంగాదేవికి మ్రొక్కెను. రాముఁడును, సుమంత్రుని, గుహుని, వాని సేనలను వీడ్కొని, యోడనడపువారితో నిఁక నోడను గదలనిండని చెప్పెను. వారు విశేషశ్రద్ధతో, మంచితెడ్లతోఁ ద్రోయుచున్నందున, నావ వేగముగా నావలిగట్టునకుఁ బోయిచేరెను. సీతాదేవియు నడిమియేటికి వచ్చిన పిదపఁ జేతులుజోడించి, యానది నుద్దేశించి, "ఓ గంగాదేవీ! యీ యార్యపుత్రుఁడును ధీమంతుఁడును నయిన మహాబలుఁడగు దశరథుని యాజ్ఞను శిరసావహించి, నీచే రక్షింపఁబడి, పూర్తిగాఁ బదునాలుగు సంవత్సరము లరణ్యమునఁ గడపి, మఱల నాతోడను లక్ష్మణునితోడను మఱలివచ్చును. ఓ పూజ్యురాలా! అప్పుడు నేనును సేమముతోవచ్చి, యన్ని కోర్కులను బొందినదాననై మహానందముతో నీకుఁ బూజ లొనరించెదను. నీవు స్వర్గాదులగు ముల్లోకములందును నడిలేకుండ సంచరించుదానవు. బ్రహ్మలోకమును జూడగలవు. సముద్రరాజునకుఁ బత్నివి. కావున నీ లోకమున మాకందఱకు దర్శనము నొసఁగుచున్నావు. దేవీ! నీకు మ్రొక్కెదను; స్తోత్రములు చేసెదను, ఓతల్లీ, నీ ప్రీతికై, నరోత్తముఁడయిన రాముఁడు మఱలి క్షేమముతో వచ్చిన తర్వాత లక్షగోవులను, వస్త్రములను బ్రాహ్మణుల కొసఁగెదను. విస్తారముగా మృదుమధురమగు నన్నప్రదానము సేయుదును. వేయికుండల మద్యముచేతను, మాంసమిశ్రమయిన యన్నముచేతను నిన్నుఁ బూజింతును. నీ గట్టున నున్న సకలదేవతలును, సకలతీర్థములను, సకల దేవాలయములను నా కగపడినవాటి నన్నిటిని బూజించెదను. ఓ పాపరహితురాలా! పాపరహితుఁడయిన మహాబాహువగు రాముఁడు వనవాసము ముగించి నాతోడను, లక్ష్మణునితోడను గూడి, మఱల సౌఖ్యముగా

నయోధ్యాప్తనమునకు వచ్చిచేరుదును గాక!" యని యివ్విధమునఁ బలుకుచు, నేర్పరియును ఉత్తమురాలును నయిన సీత యివ్విధమున గంగాదేవిని బ్రార్థించుచు, గంగానదియొక్క దక్షిణపుగట్టునకు వేగిరమె వచ్చి చేరెను. శత్రువులనోప్పించు నరోత్తముఁడగు రాముఁ డొడ్డుచేరి, సీతతోను లక్ష్మణునితోడను నావనుండి దిగి, యడవులకుఁ బయనమై, లక్ష్మణుని జూచి, "లక్ష్మణా! జనులుండు ప్రదేశమునఁగాని జనులు లేనట్టి ప్రదేశమునగాని నీవు మమ్ముఁ గాపాడుచుండుము. విశేషముగా నిర్జనవనమునఁ దప్పక మారక్షణమున శ్రద్ధవహింపుము. సౌమిత్రీ! నీవు ముందు పొమ్ము. సీత నీవెంబడి వచ్చును. నేను నిన్నును సీతను గాపాడుచుఁ గడపట వచ్చెదను. పురుషశ్రేష్ఠా! మన మొండొరుల మివ్విధమునఁ గాపాడుకొనవలయును. ఏ పనిరైయినను జరిగిపోయినది సవరించుట వీలు గాదు. కావునఁ గార్యము చెడకుండునట్లు చూచుకొనవలయును. ఇప్పుడు సీత యరణ్యావాసమువలని శ్రమ మిట్టిదని తెలియఁగలదు. జన సంచారము లేనిదియుఁ, బంట పొలములు, ఉద్యానములు లేనిదియు, మిట్టపల్లములు గలయడవిని బ్రవేశించి యచ్చటఁ గష్టము లనుభవించును. కావున జాగ్రతతో నీవు ముందు నడువుము" అనిచెప్పెను. లక్ష్మణుఁడును రాముని పలుకులువిని, తాను ముందుగాఁబోయెను. సీత యాతని వెంబడించెను. రఘునందనుఁడయిన రాముఁడు సీతవెంబడిఁ బోయెను. సుమంత్రుఁడును రాముఁ డవతలిగట్టుచేరి, తన కంటికిఁ గనఁబడునంత వఱకుఁ జూచుచుండి, చాలదూరము పోవుటచే దృష్టికిఁ గనఁబడ నందున జాపుమఱల్చి, సంతసము మాని, మనోవ్యథచేఁ బీడితుఁడగుచుఁ గన్నీరు విడిచెను. లోకపాలురంబోలు సమర్థుఁడగు వరదుఁడైన రాముఁడు మహావిశాలమైన గంగానదినిదాఁటి, పైరుపచ్చలతో సమృద్ధమయి కలకలలాడుచు నుప్పొంగుచున్న వత్సదేశమును బ్రవేశించెను. అంతట రామలక్ష్మణు లాఁకలిగొన్నవారై, పందిని, మనుఁబోతును, దుప్పిని, నల్లచారల దుప్పిని జంపి పరిశుద్ధమైన వాని మాంసమును భుజించి, సాయంకాలమున నొక చెట్టుక్రిందికిఁ జేరిరి.

## 53-వ సర్గము

రాముఁడు లక్ష్మణునితో మాటాడుచుండుట

అంత జనులను రంజింపఁజేయువారిలో శ్రేష్ఠుఁడయిన రాముఁడా వృక్షమూలమును బొంది, సాయంకాల సంధ్యావందనము సేసి, లక్ష్మణునిఁ జూచి "లక్ష్మణా! మనము దేశము విడిచి వచ్చినవారము. ఇది మొదటిరాత్రి. సుమంత్రుఁడుగూడ మనలను విడిచిపోయినాఁడు. నీవు వ్యసనపడకుము. సీతయొక్క యోగక్షేమములు మన యధీనములు గనుక మనము రాత్రులందు జాగ్రత్తతో మేలుకొనియుండవలయును. ఆకులపాన్పు నిర్మింప నవకాశము లేదు గనుక, లక్ష్మణా! యీరేయి యెట్లో యొక విధముగఁ గడపెదము. మనము సేకరించుకొనిన యాకులను నేలపైఁ బఱచుకొని పరుందము" అని చెప్పి, యమూల్యమయిన పాన్పునఁ బరుండఁదగిన తాను, నుత్తనేలపైఁ బరుండి, లక్ష్మణునకుఁ బుణ్యకథల నివ్విధమునఁ జెప్పుచుండెను. "లక్ష్మణా! మహారాజిప్పుడు గడు వ్యసనముతోఁ గూడఁ బరుండియుండును. కైకేయియుఁ దన కోరిక సిద్ధించుటచే సుప్పొంగుచుండును. ఆ కైకేయి, భరతుఁడు వచ్చినం జూచి, రాజ్యలోభముచే మహారాజు ప్రాణములు దీయదుగదా! దశరథుఁడు నాథుఁడులేనివాఁడు ముదుసలి, నన్నుఁబాసినవాఁడు కామపరతంత్రుఁడు, కైకేయికి లోఁబడినవాఁడు. అట్టి యాతఁ డేమి సేయఁగలఁడు? ఈ దుఃఖమును నృపాలుని బుద్ధి విభ్రమమును జూడఁగా, అర్థధర్మములకంటెఁ గామమే గొప్పదియని నాకుఁ దోఁచెడిని. ఎంత తెలివిమాలినవాఁడయినను, ఆఁడుదాని నిమిత్తమై తన యభిప్రాయముచొప్పున నడచు నన్నుఁబోలు కొమరుని మన తండ్రివలె విడుచునా? కైకేయి పుత్త్రుఁడగు భరతుఁడు భార్యాసమేతుఁడై, సకలసంపదలతో నిండిన కోసలదేశములను బాలించుచు సుఖించునుగదా! తండ్రి ముసలివాఁ డగుటచేతను, నే నరణ్యమున నుండుటచేతను, భరతుఁ డొక్కఁడే రాజ్యమునకు ముఖమువంటివాఁడు. అర్థధర్మములను విడిచి, యెవఁడు కామమును మాత్ర మవలంబించుచున్నాఁడో, వాఁడు దశరథనృపాలునిమాడ్కి వేగిరమే ముప్పునొందును. ఓ సాధువా! దశరథుని చేటుకొఱకును, నన్నడవికిఁ బంపుటకొఱకును, భరతునికి రాజ్య మిప్పించుటకొఱకును,

నీ కైకేయి మనకుఁ దటస్థపడినది. ఈ కైకేయి తన మగఁడు తానెట్లు చెప్పినను విను ననెడిగర్వముచే మైమఱచినదై, నా నిమిత్తమై కౌసల్యా సుమిత్రల నిప్పుడు బాధింపకుండునా? లక్ష్మణా! నీవు నావెంబడి వచ్చుట నా నిమిత్తమై సుమిత్రాదేవియు నేల దుఃఖపడవలెను? నీవు వేకువను లేచి యిచ్చటనుండియె యయోధ్యాపురమునకుఁ బొమ్ము. నే నొక్కఁడనే సీతతోడ దండకావనములకుఁ బోయెదను. దిక్కులేనిదై యుండు కౌసల్యకుఁగూడ నీవు దిక్కు కాఁగలుగుదువు. కైకేయి నీచపుఁ బనులు చేయునది. ఆమె ద్వేషముగల్గించు పనినైనను, న్యాయవిరుద్ధమగు కార్యము నైనను జేయును. లక్ష్మణా! ధర్మజ్ఞుఁడయిన భరతునివశమున నాతల్లి నప్పగింపుము. పూర్వజన్మమున నెప్పుడో మాతల్లి తల్లులకును గొడుకులకును నెడఁబాటు గలిగించినది. కావుననే యీ జన్మమున నామెకు నిట్టి పుత్రవియోగ దుఃఖము సంభవించినది. కౌసల్య నన్నుఁ జిన్ననాఁటినుండి శ్రమపడి ఉపవాసములుండి, నోములునోచి, యింతవాని నంతవానిని జేసినది. నేను పెద్దవాఁడనై, శుశ్రూషలుచేయు నప్పుడామె సుఖముగా నుండవలసినది. అట్టి యామెకు శుశ్రూషచేసెడి యదృష్టము నాకు లేకపోయెను. నాజన్మమేల? లక్ష్మణా! యెప్పుడును లోకమున నే యంగనయు నావంటి కుమారునిఁ బడయకుండునుగాక! నేను దల్లికిఁ దుదిలేని దుఃఖముఁ దెచ్చిపెట్టితినిగదా! ఇట్టి కొడుకు పుట్టిన నేమి? పుట్టకున్న నేమి? లక్ష్మణా! నాతల్లి గోరువంకపిట్ట నొకదానిని బెంచుచున్నదిగదా! ఆ గోరువంకపిట్ట, "చిలుకా! శత్రుపాదమును గొఱుకుము" అని చిలుకతోఁ జెప్పుచుండును. తిర్యగ్జాతియందుఁ బుట్టిన యాగోరువంకపిట్ట యెంత ప్రియమును బలుకుచున్నది! మనుష్యుఁడనైన నాకంటె నది గొప్పదికదా! శత్రుసంహారియగు లక్ష్మణా! నాతల్లి, నా వియోగముచే దుఃఖించుచుండును. ఆమె తనకు వేఱొక పుత్రుఁడు లేమిచే మిక్కిలి దుఃఖించుచుండును. అట్టి యదృష్టహీనురాలయిన నా తల్లికి నావలన నేమి ప్రయోజనము? దురదృష్టవంతురాలయి నాతల్లియగు కౌసల్య, నాయెడఁబాటువలనఁ గలిగిన దుఃఖముచే మిక్కిలి నొచ్చినదై శోకమను సముద్రమునఁ బడియుండును. లక్ష్మణా! నాకుఁ గోపమువచ్చెనేని, నే నొక్కఁడనే యయోధ్యాపురమును మాత్రమేకాక, భూమండ

లము నంతయును జయింపఁగలను. అయినను నాకిప్పుడు వీర్యము జూపఁ దరుణముగాదు. లక్ష్మణా! తండ్రిమాట మీఱిన, ధర్మలోపమును, పర లోకమునకు హానియుఁ గలుగునని యెంచియే నే నిపుడు పట్టాభిషేకము సేసికొననైతిని." అనియు, మఱియు ననేకసంగతులు మాటాడుచు, నిర్జనవనమున దుఃఖించి, కన్నులనిండ నీరుంచికొని, రాత్రియెల్ల నిద్దుర మాని కూరుచుండియుండెను. ఇవ్విధమున, విలపించి యూరకుండు టచే, మంటలేని యగ్నివలెను, అలలవేగములేని సముద్రమువలె నున్న రాముని లక్ష్మణుఁ డీక్రింది విధమున నూఱడించెను. "యుద్ధవీరులలో శ్రేష్ఠుఁడా! యిప్పు డయోధ్యాపురము నీ వరణ్యమునకు రాఁగాఁ జంద్రుఁడులేని రాత్రివలెఁ గాంతిదఱిగియుండును. ఇయ్యది నిశ్చయము. పరోత్తముఁడవగు రామా! నీ విట్లు దుఃఖపడుట యుక్తముగాదు. నీవే యిట్లు దుఃఖపడిన, నాకును సీతకును ఖేదముగలుగకుండునా? నీటినుండి యెత్తి బయటవేయఁబడిన చేఁపలవలె నిన్ను విడిచి, నేనును, సీతయు నొక్క క్షణమయినను జీవింపలేము. శత్రుతాపనా! తండ్రినిజూడవలయు ననికాని, తమ్ముని జూడవలెననికాని, తల్లిని జూడవలయు ననికాని నాకుఁ గోరికలేదు, తుదకు స్వర్గమునకైనను నిన్ను విడిచి నేఁ బోఁజా లను" అని యివ్విధమున లక్ష్మణుఁడు రాముని నూఱడించెను. అంత నచ్చట సుఖముగాఁ గూరుచుండియున్న ధర్మాసక్తులగు సీతారాములు దాపుననే మఱ్ఱిచెట్టుక్రింద లక్ష్మణునిచేఁ జక్కఁగాఁ బఱుపఁబడిన పాన్పును దిలకించి, దానిపైఁ బరుండిరి. ఇట్లు శత్రుసంహారియగు రాముఁ డును లక్ష్మణుఁడు చెప్పిన యుత్తమమగు గంభీరవాక్యమును ప్రేమతో విని, బహుకాలము వనవాసము సేయ నిశ్చయించెను. అంతట రఘు వంశప్రదీపకులైన మహాబలవంతులగు రామలక్ష్మణులు నిర్మానుష్యము లగు వనములలోఁ గొండచరియలందుఁ దిరిగెడు సింగమువలె భీతిని, తత్తరపాటును నొందక, దర్పముతో సంచరించుచుండిరి.

## 54-వ సర్గము.

**రాముఁడు భరద్వాజాశ్రమమున నివసించుట**

ఆ సీతారామలక్ష్మణు లా శుభరాత్రి యమ్మహావృక్షము క్రింద నుండి, సూర్యోదయముగాఁగానే యచ్చటనుండి బయలుదేఱి, యమున

గంగానదితో సంగమించు ప్రదేశమునకుఁ బోఁగోరి, యొక్క మహావన మును బ్రవేశించి, నానావిధములైన భూప్రదేశములను, నచ్చటచ్చట తా మింతకుమున్ను చూడనిమనోహర ప్రదేశములను జూచుచుఁ బోయిరి. ఇట్లు రామలక్ష్మణులు సేమమున నానావిధములగు వృక్షము లను జూచుచుఁ బోవుచుండఁగాఁ, బ్రొద్దుగడవఁగనే, రాముఁడు లక్ష్మణు నుద్దేశించి, "సౌమిత్రీ, ప్రయాగక్షేత్రమునకు సమీపమునఁ బూజ్యుఁ డగు నగ్నిహోత్రుని యొక్క టెక్కెమయిన పొగ మిక్కిలి యున్న తముగాఁ గనఁబడుచున్నది మన మిప్పుడు నిజముగా గంగా యమునా నదులు సంగమమగు స్థానమును బొందితిమి. రెండు ప్రవాహ ములు నొండొంటి నొఱసికొనుటవలనఁ గలిగిన చప్పుడు వినఁబడు చున్నది గదా! వంటచెఱకునమ్మి జీవించు నడవి జాతులవారిచేఁ జీల్పఁ బడిన కట్టెలు చూడఁగా, నీ భరద్వాజాశ్రమమున నానావిధ వృక్షము లున్నట్లు తెలియవచ్చుచున్నది" అని చెప్పెను.

ఇట్లు వారిరువురు మాటాడుచు, దారి బడలిక దెలియనంత సుఖ ముగా నడచి, సూర్యుఁ డస్తమించునప్పటికి గంగా యమునానదులు సంగమించు స్థలముననున్న భరద్వాజమహాముని యాశ్రమమును జేరిరి. రాముఁడును లక్ష్మణుఁడును మున్యాశ్రమమునొంది, మృగములను బక్షులను వెఱపించుచుఁ గొంతదవ్వేఁగి, భరద్వాజమహాముని చేరు వకుఁబోయి, సీతతోడ నమ్మహామునిని జూడఁగోరి, దవ్వుననే నిలిచిరి. అట్లు రాముఁడును సీతాలక్ష్మణులతోడ భరద్వాజాశ్రమము సొచ్చి, శిష్యబృందపరివేష్టితుఁడై కూరుచున్నవాఁడును, కఠిననియమము మనోదార్ఢ్యముఁ గలవాఁడును, తపోబలముచే జ్ఞాననేత్రమునుబడసిన వాఁడునునైన భరద్వాజమహామునిని నగ్నిహోత్రము వేల్చిన పిదపఁ దిలకించినతోడనే, చేతులు జోడించికొని యభివాదనము సేసెను. సీతయు, లక్ష్మణుఁడును నమస్కరించిరి. అట్లు నమస్కరించిన పిదప రాముఁడు మహామునికిఁ దన చరిత్రమును దెలుపఁగోరి; "ఓ మునీంద్రా! భగవంతుఁడా! మే మిద్దఱము దశరథుని కొడుకులము. ఈ సుమంగలి యగు కాంత నా భార్య; జనకమహారాజు కూఁతురు. పరిశుద్ధురాలగు యీ నా భార్య మనుజసంచారములేని తపోవనమునకు నేను వచ్చు

చుండఁగా నన్ను వెంబడించివచ్చినది. తండ్రి నన్నరణ్యమునకుఁ బదునాలు గేండ్లుండ నాజ్ఞాపించెను. నియమము వదలనివాఁడగు నా యనుఁగుఁ దమ్ముఁడు లక్ష్మణుఁ డడవులకుఁ జను నన్నుఁ బాసి యుండఁజాలక నా వెను వెంట నేతెంచెను. ఓ మహాత్మా! మేము, తండ్రి యడవులకుఁ బొమ్మని చెప్పుటచేఁ దపోవనమునఁ జొచ్చెదము. అచ్చట దుంపలు, పండ్లు మొదలగునవి తినుచు స్వధర్మములనే చేయుచుందుము” అని మునీంద్రుఁడగు భరద్వాజునితోఁ జెప్పెను. అంతటఁ దపస్సంపన్నుఁడైన భరద్వాజుఁడు వారి పూజకయి, ఆవును, ఉదకమును ఇతరపూజాద్రవ్యములను తెప్పించెను. వాని యాహారమునకయి వన్యములగు గడ్డలు, పండ్లు మొదలగువానినుండి సిద్ధముచేసినపదార్థములను సమకూర్చి వారుండుట కొకశాల నేర్పాటుచేసెను. అంత మృగములతోను, పక్షులతోను, మునులతోనుగూడి యర్ఘ్యపాద్యాదులచే రాముని బూజించి, “మీరు సుఖాగమనమేకదా!” యని కుశలప్రశ్న చేసెను. రాముఁడును మునీంద్రుఁడగు భరద్వాజునివలనఁ జేయఁబడిన పూజలను గైకొని కూర్చుండెను. అప్పుడు భరద్వాజుఁడు రామునిచూచి, “కకుత్స్థవంశోద్భవుఁడా! చిరకాలమునకు నీ విచటికి రాఁగా నిన్ను చూడగలిగితిని. దశరథుఁడు నిన్ను నిష్కారణముగా నడవికిఁ బంపినాఁడని నేను వింటిని. మహానదులగు గంగా యమునలు రెండును సంగమించు నీప్రదేశము విజనమైనది; పావనమైనది; సొంపయినది. ఇచ్చట నీవు సుఖముగా నుందువుగాక” యని ధర్మయుక్తముగాఁ బలికెను. అట్లు భరద్వాజుఁడు సెప్పఁగా, జంతువు లన్నిటికిని మేలుచేయుటయందే యాసక్తిగల రాముఁడు మంచి మాటలతో “భగవంతుఁడగు మునీంద్రా! పట్టణముల వారును, పల్లెలవారును, దేశమువారును నిచ్చటికిఁ గడుచేరువ నున్నారు. కావున వారందఱు మమ్ముఁ జూడఁగోరి, “రామాదులు భరద్వాజాశ్రమముననే యున్నారు. సులభముగా చూచిరావచ్చును. రండు” అని యిచ్చటికి మాటిమాటికి వచ్చుచుందురు. ఈ కారణముఁ బట్టి నే నిచ్చట నుండుట కిచ్చగింపను. ఓ మునీంద్రా! సీతాదేవి జనకమహారాజు కూఁతురు. సుఖముగా నుండఁదగినది. కావున సీత మనస్సునకు రంజకమైయుండు నుత్తమమయిన తపోవనము

నొక్కడాని వాలోచించి చెప్పుడు" అనెను. మునీంద్రుఁడగు భర
ద్వాజుఁ డప్పలుకులువిని, రాముని యభిప్రాయమునకు సరియైన మాట
చెప్పఁగోరి, "రాఘవా! ఇచ్చటికిఁ బదికోసుల దూరమున నొక కొండ
యున్నది. దానిని జిత్రకూటమందురు. అయ్యది గంధమాదన పర్వత
మును బోలినది. అచ్చట మహర్షులు సర్వదా నివసించుచుందురు.
ఏవైపు చూచినను గన్నుల కింపై యుండును. మఱియు నప్పర్వతమునఁ
గొండముచ్చులు, కోఁతులు, ఎలుఁగుబంట్లును విశేషముగా నుండును.
అట్టి చిత్రకూటము పర్వతముయొక్క శిఖరముల నే మనుష్యుఁ డెప్పుడు
చూచునో, అప్పుడే యా మనుష్యునికిఁ బాపబుద్ధి తొలఁగిపోవును,
సత్కార్యములందే మనసు పుట్టును. అట్లు ఋషు లనేకులు వేలకొలఁది
యేండ్లచ్చట సుఖముగ నివసించి తమ తపోమహిమచేత కపాలశిరస్సు
తోడ స్వర్గమునకుఁ బోయి సేరిరి. ఆస్థలము విజనమయినది; ఆచోటు
మీకును సుఖముగ నుండును. నీ వరణ్యవాసము గడపుటకై యచ్చటి
కైనఁ బొమ్ము. కాదేని, యిచ్చటనే నాతోడ నుండుము" అని చెప్పెను.
ధర్మవేత్తయగు భరద్వాజుఁడు తన యాశ్రమమునకు వచ్చిన యిష్టాతిథి
యగు రాముని, తత్పత్నిని సీతను, తదనుజుని లక్ష్మణుని, వారికోరికల
నెల్లఁ దీర్చి, సంతృప్తులను జేసెను. ఇట్లు రాముఁడు మునీంద్రుని చేరువ
నుండి, ఆతఁడు వింతవింత కథలు సెప్పుచుండఁగాఁ బావనమైన రాత్రి
యయ్యెను. సుఖముగా నుండఁదగినవాఁడును, దారినడచుటవలన డస్సిన
వాఁడును నయిన రాముఁడు సీతాలక్ష్మణులతో రమ్యమయిన యా భగీ
రథాశ్రమమున నారేయి హాయిగాఁ బరుండెను.

మఱునాఁటియుదయమున నరశ్రేష్ఠుఁడగు రాముఁడు తేజస్సుచే
వెలుఁగుచున్న భరద్వాజమునీంద్రుని సన్నిధికివచ్చి "సత్యమే స్వభా
వముగాఁగల ఓ మహాత్మా! మేమీ రేయి సుఖముగాఁ గడపితిమి. ఇఁకఁ
దమరానతిచ్చిన తావునకుఁ బోవ సెలవొసఁగుఁడు" అని యడుగఁగా,
భరద్వాజుఁడును రామునిఁ జూచి, "విశేషబలవంతుఁడవగు రాముఁడా!
యాచిత్రకూటపర్వతమే నీ కనుకూలమగు ప్రదేశము. అచ్చట ననేకము
లగు వృక్షములున్నవి. కిన్నరులును పన్నగులును (పాములును)

విశేషముగా నచ్చట నుందురు. అక్కడ నెమళ్ళకూఁత లంతటను మ్రోఁగుచుండును. గొప్ప యేనుఁగులు సదా వాసముచేయుచుండును. ఆతావు పాపహరమును, రమణీయమును, ప్రసిద్ధమునునైనది. మీకుఁ గావలసిన తేనెయు దుంపలును బండ్లును నచ్చట దొరకును. కావున నీ వచ్చటికిఁ బొమ్ము. అచ్చట నేనుఁగుగుంపులును, జింకలగుంపులును నంతటఁ దిరుగుచుండును. వానిని నీయాశ్రమము దాఁటినఁ జూడవచ్చును. నీవా పర్వతము నేరి, సీతతోఁగూడ నచ్చటి నదులను, సెలయేళ్లను, చఱులను, చిన్నపెద్దగుహలను, నీటిప్రవాహములను జూచుచు నానందించఁగలవు. ఆపర్వతమునఁ గోయిలలు, చిలుకఁ గొక్కెరలు సంతోషముతో గానము చేయుచుండును. మృగములును, విశేషముగా మదపుటేనుఁగులును గలిగి యాపర్వతము చూచుటకు రమ్యమైయుండును. కావున నీ వచ్చట నొక్కచక్కని యాశ్రమము నేర్పఱచుకొని సుఖముగనుండుము" అని భరద్వాజమహాముని రామునితోఁ జెప్పెను.

## 55-వ సర్గము.

### రాముఁడు చిత్రకూటమునకుఁ బోవుట

శత్రుసంహారకు లయిన రాజపుత్రులగు రామలక్ష్మణులు సీత తోడ నా రేయి యక్కడ నుండి మఱుసటిదినము, తెల్లవాఱ భరద్వాజ మునీంద్రునకు నమస్కరించి యా చిత్రకూటమునకుఁ దఱలిరి. మహా తేజస్సు గలభరద్వాజమహామునియుఁ బయనమయిన యా రామాదు లను దీవనలు నేసి, తండ్రి కొడుకులనుబోలె వారిని వెంబడించి, స్థిరమగు మగఁటిమిగల రామలక్ష్మణులకు నిర్విఘ్నంబున దారిఁ జెప్పెను, "ఓ నరో త్తములారా! మీరు గంగయు యమునయుఁ గలియు చోటికిఁబోయి, యచ్చటినుండి పడమటిమొగముగాఁ బాఱెడు యమునానది మార్గము ననే పోయి, యా యమునానదిని సమీపించి, యది బహువేగ ముగాఁ బ్రవహించునది కావున, పురాతనమయి, జనులందఱు వాడు కగా వచ్చుచుఁ బోవుచునుండు రేవునుజూచి యచ్చటఁ దెప్పనేర్పఱచు కొని యమునానదిని దాఁటుఁడు. ఆవలిగట్టునకుఁ బోవుదురేని, యచ్చటఁ బచ్చని యాకులుగలిగి, మిక్కిలి పొడువుగ నెదిగి, చుట్టు ననేకవృక్షము లుండుటచే నల్లనై, సిద్ధులకు నునికిపట్టయి వెలయుచున్న యొక మఱ్ఱి

పెట్టు గనఁబడును. సీత యా వృక్షముఁ జూచినంతట దానికి మ్రొక్కి, మనోరథము లీడేరునట్లు ప్రార్థనచేసికొనవలయును. ఆ వృక్షముఁ జేరి, యచ్చట నివసింపుఁడు. కాదేని దానిని దాఁటిపొండు. అచ్చటినుండి యొక క్రోశమాత్రదూరము పోవుదురేని, మోదుగుచెట్లతోను, రేఁగు చెట్లతోను, యమునానదియందుఁ బుట్టిన వెదుళ్లతోను గూడి నల్లనైన యొక రమణీయమగు వనము మీకుఁ గనఁబడును. ఆవనములోననే చిత్రకూటమునకుఁ బోవలెను. నే నా దారి నెన్నిపర్యాయములో చిత్రకూటమునకుఁ బోయియున్నాను. ఆ మార్గము మనోహరమైనది. ముళ్లు లేక మెత్తనై యుండును, అచ్చట కాఱుచిచ్చులు లేవు. ఆదారిని మీరును బొండు" అని వారికి దారిఁ జెప్పి భరద్వాజమహాముని వెనుకకు మఱలెను. రాముఁడును ఆమహామునికి నమస్కరించి, యాతనిని వెనుకకు మఱలించి, లక్ష్మణుం జూచి, "లక్ష్మణా! భరద్వాజమునీంద్రుఁడు దారిఁ జెప్పి మనయందు మిక్కిలి దయఁజూపెను. మనము ధన్యులమైతిమి," అని చెప్పి, సీతను ముందుఁ బోనిచ్చి, తానును లక్ష్మణుఁడును వెనుకఁబోవుచు యమునానదిం జేరి, మిక్కిలి వడిగాఁ బ్రవహించుచున్న యమునానదిం జూచి, "యెట్లు మన మీనదిని దాఁటగల" మని మిక్కిలి చింతనొందిరి. వారు కొయ్యలపై నెండిన వెదుళ్లను జేర్చి, యొక గొప్ప తెప్పనుగట్టి, దానిపై పట్టి వేళ్లు పఱచిరి. వీర్యవంతుఁడగు లక్ష్మణుఁడు ప్రబ్బలి తీఁగెలను, నేరేడు రెమ్మలను నఱకి, సీతకు సుఖకరమైన యొక్క యాసనము నిర్మించెను. అంతట రాముఁడు తెలియరాని మహాప్రభావముగల లక్ష్మీదేవియో యనునట్లున్నదియుఁ గొంచెము సిగ్గుపడుచున్నదియునైన ప్రియురాలగు సీతను దానే పడవయెక్కించి, యాపెకుఁ బ్రక్కననె భూషణములను, వస్త్రములను, గుద్దలిని, మేఁకతోలుగప్పిన పుటికను, ఆయుధములను ఉంచెను. అంత వారెక్కి, తెప్పనుబట్టుకొని, తమ శౌర్యము మెఱయఁ బూనికతో యమునానదిని దాఁటఁబూనిరి. నడియేటికిఁ బోయినంతటనే, సీతయు నయ్యమునాదేవికి మ్రొక్కి, "ఓ దేవీ! మేలుగలుగునుగాక! నిన్ను దాఁటుచున్నాను, రాముఁడు వనవాసము నెఱపి, సౌఖ్యముగా నిక్ష్వాకువంశస్థులు పాలించెడు నయోధ్యం జేరినపిదప, నేను నిన్ను వేయిగోవులచేతను, నూఱుకుండల

కల్లుచేతను బూజించెదను." అని ప్రార్థించెను. అట్లు ప్రార్థించినతరువాత వారు గట్టులందలి యనేకములగు చెట్లచే శోభాయమానమయి యల లతోఁగూడి, వడిగాఁ బాఱుచున్న యమునానదిని నేమంబున దాఁటిరి. అట్లు యమునానదిని దాఁటి యా నదియొడ్డునందలి వనమునుండి తెఱవి పోవుచు గొప్పదైన చల్లని మఱ్ఱిచెట్టును జూచిరి. సీత యా వృక్షము కడకుఁ బోయి, "ఓ వృక్షరాజమా! నమస్కారము. నా పెనిమిటి వ్రతమును బూర్తిచేయునుగాక! కీర్తిమంతులగు కౌసల్యాసుమిత్రలను జూతునుగాక." అని ప్రార్థించి యావృక్షమునకుఁ బ్రదక్షిణము గావించెను. అప్పుడు రాముఁడు ప్రేమగలిగి, చెప్పునట్లు చేయునదియైన నిర్దోషురాలగు సీత మఱ్ఱిచెట్టును బ్రార్థించుటఁ జూచి, లక్ష్మణు నుద్దేశించి, "భరతాగ్రజా! నీవు సీతను వెంటఁబెట్టుకొని ముందుగాఁ బొమ్ము. నరోత్తమా! నేను మీ వెంబడి నాయుధములధరించి వచ్చెదను. లక్ష్మణా! సీత యేయేపండునుగాని, పువ్వునుగాని కోరునో, యాయా పండును బువ్వులను గోసియిమ్ము" అని చెప్పి పోవుచుండెను. పోవుచున్న యా రామ లక్ష్మణుల నడుమఁబోవుచున్న సీతాదేవి రెండేనుఁగుల నడుమఁ బోవుచున్న పెంటియేనుఁగుమాడ్కి వెలయుచుఁ దా నింతకుముందుఁ జూడక యిప్పుడు చూచిన ప్రతియొక్క వృక్షమును, పొదను, పూలచేఁ దేజరిల్లు తీఁగెను చూచి ఒక్కొకదానిం గూర్చి యడుగుచు, నానా విధములగు పుష్పఫలములతోఁగూడిన చెట్లను జూచుచు వచ్చుచుండ, లక్ష్మణుఁడా సీతయొక్క పలుకులకుఁ బ్రత్యుత్తరము చెప్పుచు నామె యడిగిన వస్తువులను దెచ్చి యిచ్చుచుండెను. జనకరాజపుత్రియగు సీతయు లక్ష్మణుఁడు దెచ్చియిచ్చెడు పుష్పఫలములెల్లఁ గైకొనుచు నానావర్ణవిశిష్టమగు నిసుకలోఁ బ్రవహించుచు, హంసలయు, బెగ్గురు పక్షులయు నాదములతోఁగూడియున్న యమునానదిని జూచి మనస్సునందు మిక్కిలి సంతసమొందెను. సోదరులగు రామలక్ష్మణు లచ్చటినుండి క్రోసుదూరమేఁగి, యమునానదీ ప్రాంతములందుఁ బరిశుద్ధములయిన మృగములనుజంపి, వాటి మాంసమును సీతయును దామును భుజించిరి. అంతట గంభీరరూపములనున్న రామలక్ష్మణులు నెమళ్లగుంపుల కూఁతలతోఁగూడి, నదిదరిని కోఁతులయు, నేనుఁగులయు గుంపులతో నిండి

మనోహరమైయున్న వనమున వందలకొలది సత్కృతమయి చదరముగానున్న యొక ప్రదేశముఁ జేరి, యచ్చట వారా రాత్రి నివసించిరి.

## 56-వ సర్గము

### రాముఁడు చిత్రకూటపర్వతము చేరుట

అంత నా రేయి గడచి సూర్యోదయమగుడు, రాముఁడు స్వల్ప నిద్ర చెందియున్న లక్ష్మణుని మెల్లగా నిద్రలేపి, "సుమిత్రానందనా! వనములందలి జంతువులెల్ల మధురముగాఁ గూయుచున్నవి. వినుము, మనము పయన మయ్యెదము. ఇది ప్రయాణయోగ్యమగు సమయము" అని చెప్పెను. అట్లు లక్ష్మణుఁ డన్న లేపఁగాఁ జివుక్కున లేచి, నిద్రమత్తు, సోమరితనము, దారి యలసటయు లేనివాఁ డయ్యెను. అంతట వారు ముగ్వురు లేచి, యమునానదియొక్క పుణ్యజలములయందు స్నానము చేసి, భరద్వాజమునీంద్రుఁడు చూపిన దారిని బట్టి చిత్రకూటమునకుఁ బయనమైరి. అట్లు వా రందఱు పోవుచుండఁగా, రాముఁడు కమలములం బోలు కన్నులుగల సీతకు వనముయొక్క సొంపును గనఁబఱపఁ దొడఁగెను. "ఓ వైదేహీ! వసంతర్తువున నంతటఁ జక్కఁగఁ బూఁచిన యెఱ్ఱని తమ పూవులచేఁ బుష్పమాలికలుగలవి యనదఁగి మిక్కిలి దీపించు చున్నట్లుండు మోదుగు చెట్లను జూడుము. చక్కఁగాఁ బూఁచినవియు, పండ్లచేతను నాకులచేతను వంగినవియు, మనుష్యులు దాఁపునకుఁ జేరుటకుఁ దగనివియునైన యీ జీడి చెట్లను జూడుము. మన మిచ్చట నిజముగా నుండఁజాలుదుము. లక్ష్మణా! తేనెటీఁగెలు చెట్టు చెట్టునను జేర్చి పెట్టిన నిద్దుము తేనె గలతేనెతెట్టెలు వ్రేలాడుచున్నవి చూడుము. పూలు తఱచుగ నుంటచే నిరుకై మనోహరమైయున్న వన ప్రదేశమున నిదిగో వానకోయిల కూయుచున్నది. దానికిఁ బ్రతిగాఁ నెమలి కూయుచున్నది. ఏనుఁగుల మేటి గుంపులతోఁగూడి, పక్షికులంబుల కూఁతలతో వ్యాపింపఁబడియున్న యెత్తు శిఖరములుగల చిత్రకూట పర్వత మిదిగో కనఁబడుచున్నది చూడుము. ఓరి యబ్బాయీ! యనేకవృక్షములతోఁ గ్రిక్కిరిసి రమ్యమయి, పావనమయియున్న యీ చిత్రకూటవనమునందలి నేల చదునయినది. ఇచ్చట మనము విహరింతము" అని చెప్పి యా ముగ్వురు కాలినడకనుపోయి రమణీయమును

మనోహరము నగుచిత్రకూటమును చేరిరి. అట్లుపోయి నానావిధములగు పక్షులగుంపులతోఁగూడి, దుంపలను ఫలములను దండిగాఁగలిగి, మనోహరమయి, కమ్మని నీటితోఁ గూడిన యా పర్వతమును బొంది, "సౌమ్యుఁడా! యీకొండ యనేకవృక్షములతోను, లతలతోను గూడి, కందమూలఫలసమృద్ధమయి, వాసయోగ్యమయి యున్నయది. ఇచ్చట మనము సుఖముగా జీవింపఁగలుగుదుము. మఱియు నీ కొండపయి మహానుభావులగు ఋషులు నివసించుచున్నవారు. ఇది మనకు నివాసమయ్యెడుఁగాక! ఇచ్చట మనము సుఖముగా నుందుము," అని చెప్పి, వాల్మీకియాశ్రమమును జొచ్చి యా వాల్మీకికి నమస్కరించెను. లక్ష్మణుఁడును, సీతయు వెంబడే యమ్మునీంద్రునకు మ్రొక్కిరి. ధర్మజ్ఞుఁడయిన వాల్మీకిమహర్షి కడు మోదము నొందినవాఁడై, వారిని కుశలప్రశ్న చేసి, కూర్చుండుఁడని యానతి నొసఁగెను. అంతట దీర్ఘబాహుఁవగు రాముఁడు వాల్మీకి మునీంద్రునికి మర్యాద మీఱక, తన సంగతినంతయుఁ జెప్పి, లక్ష్మణుని జూచి, "ఓరి నాయనా! మేలయిన గట్టికొయ్యలను గొట్టి తెచ్చి యిచ్చట నొకశాలను నిర్మింపుము. ఇచ్చట నుండవలెనని నా మనము గోరెడి" యనెను. వెంటనే లక్ష్మణుఁ డన్నమాటలను విని, పలుతెఱఁగులగు కొయ్యలను గొట్టి తెచ్చి యొక పర్ణశాలను నిర్మించెను. రాముఁడు లక్ష్మణునిచే దిట్టముగాఁ గట్టఁబడి, చుట్టుఁ దడిగల చూచుటకింపుగనున్న పర్ణశాలను దిలకించి, యొక్కటే మనస్సుతో శుశ్రూష సేయుచున్న లక్ష్మణునిఁ జూచి, "లక్ష్మణా! నల్లయిఱ్ఱిమాంసమును దెచ్చి గృహదేవతలకు బలియిత్తము. ఆయుర్వృద్ధిని గోరువారు వాస్తుశాంతి చేయవలయును. శుభకరములగు కన్నులు గలవాఁడవయిన యో లక్ష్మణా! మృగమును జంపి వేగమ తెమ్ము. శాస్త్రోక్తవిధానమున గృహశాంతి చేయవలయును. ధర్మశాస్త్రమును మఱవఁజనదు. అని యానతీఁగా, శత్రుసంహారియగు లక్ష్మణుఁ డన్నమాట విని, యాతఁడు సెప్పినప్రకారము నల్లయిఱ్ఱిని పట్టి తెచ్చెను. రాముఁడును మఱల లక్ష్మణుం జూచి, "మనము గృహాధిదేవతలను బూజింతము. ఈ మృగమాంసమును బక్వముచేయుము, ఓరీ నాయనా! త్వరపడుము. ఇది ధ్రువమయిన శుభముహూర్తము. ఈ దినమును నట్టిదియే. కావున గృహాధిపతియు

స్థైర్యము నొందెను. ప్రతాపశాలియగు లక్ష్మణుఁడు నల్ల యిఱ్ఱిని జంపి, దాని పరిశుద్ధమయిన మాంసమును జక్కఁగా మండుచున్న నిప్పునందుఁ బక్వముచేసెను. అంతట నా యిఱ్ఱి రక్తమంతయు నింకి చక్కఁగాఁ గాలినదని తెలిసికొని లక్ష్మణుఁడు నరోత్తముఁడగు రామునిఁ జూచి, "ఓ దేవతలఁబోలువాఁడా! ఈ నల్లయిఱ్ఱిని ఛేదింపక యట్లే పక్వముచేసితిని. అది నల్లయిఱ్ఱివలెనే యున్నది. ఇఁక గృహదేవతలఁ బూజింపుము. నీ వతి సమర్థుఁడవుగదా!" అనెను. గుణవంతుఁడును, మంత్రజ్ఞుఁడునునైన రాముఁడు స్నానముసేసి, పరిశుద్ధుఁడై, గృహశాంతి మంత్రములను సంగ్రహముగాఁ బఠించి, గృహాధిదేవతలనెల్లఁ బూజించి, పావనమయిన గృహమునఁ బరమానందముతోఁ బ్రవేశించెను. అట్లు ప్రవేశించి, వైశ్వదేవబలిని, రుద్రబలిని, విష్ణుబలిని జేసి, గృహశాంతియందుఁ జేయఁదగు శుభకార్యములను నడపించుచు, శక్తికిఁ దగినట్లు జపముసల్పి, నదియందు యథావిధిగా స్నానముచేసి, పాపాపనోదకమయిన యుత్తమబలి నర్పించెను. అంత నాశ్రమమునకుఁ దగినట్లుగా బలిహరణాదులకైన తిన్నెలను, దేవాలయములను, అగ్నిహోత్రగృహములను నేర్పఱచెను. ఇవ్విధమున వనమునఁబుట్టిన పుష్పమాలికలు, కందమూలఫలములు, పక్వమాంసములు మున్నగువానిచేతను, తీర్థోదకములచేతను, వేదోక్తమంత్రజపములచేతను, దర్భలచేతను, సమిత్తులచేతను, కుశలచేతను గృహాధిదేవతలం బూజించి, యాకులతోఁ గప్పఁబడి, యాయాకార్యములకుఁ దగినట్లు ప్రత్యేకస్థలము లుండునట్లు కట్టఁబడి యెక్కువ గాలి దగులకుండునట్లు చేయఁబడి, మనోహరమయియున్న యా పర్ణశాలయందు, దేవతలింద్రసభయందుఁబోలె సీతాలక్ష్మణ సమేతుఁడై ప్రవేశించెను. అట్లు రామాదులు ముగ్గురా పర్ణశాలయందు వసించి, జితేంద్రియులయి, లెక్కలేని వింతవింతలగు మృగపక్షులతో నిండి, పలురంగుల పూలగుత్తులుగల చెట్లచే శోభిల్లుచు, భయంకరములగు నేనుఁగులయు, నితర మృగములయు నఱపులచే నిండియున్న యా చిత్రకూట పర్వత ప్రాంతవనములందు విహరించుచు, మంచితీర్థముగల మాల్య

పతీనదియందు స్నానపానాదులను జరుపుకొనుచుఁ బట్టణము విడిచి వచ్చినందుచేఁ గలిగిన దుఃఖముఁ బాసియుండిరి.

## 57-వ సర్గము

### సుమంత్రుఁడు వనమునుండి మఱలి యయోధ్య చేరుట

గుహుఁడు రామునితో మాటాడుచుండి రాముఁడు గంగానది యొక్క దక్షిణపుటొడ్డు చేరఁగానే, చాలతడవు రాముని గుణములను గూర్చి చెప్పుకొనుచుఁ గడువ్యసనముచే నొచ్చినవాఁడై, తన గృహమునకు సుమంత్రునితోడ మఱలివచ్చెను. అచ్చటయున్న పడవవాండ్రు రామాదులు గంగానదినిదాఁటి భరద్వాజుని యాశ్రమమునకుఁ బోవుటయుఁ, బ్రయాగయందు దమ్మునీంద్రునితోఁగూడ నుండుటయు, వారు చిత్రకూటపర్వతమునకుఁ బోవుటయు మొదలగు సంగతులను జెప్పిరి.

సుమంత్రుఁడు వ్యసనముచే మిక్కిలి నొచ్చినవాఁడై, రామునిచే సెలవుపొంది, యుత్తమాశ్వములను రథమునకుఁ బూన్చి, యయోధ్యానగరికే బయలువెడలి, దారినడుమఁ బరిమళవంతములగు వనములను, నదులను, దటాకములను, గ్రామములను, బట్టణములను జూచుచుఁ బోయి, మూఁడపదినము సాయంకాలము శోకసాగరమున మునిఁగి నిశ్శబ్దమై పాడువడినదో యనఁదగియున్న యయోధ్యాపురమును జూచి, దుఃఖాతిశయముచేఁ గొట్టువడి, మనస్స్వాస్థ్యము కొంచెమైనను లేనివాఁడై, "యయోధ్యాపురము గజాశ్వములతోను, జనులతోను, ప్రభువులతోనుగూడ రాముని వియోగమువలని శోకాగ్నిచే దహింపఁబడలేదుగదా!" యని చింతించుచు, వేగిరంబుగాఁ బఱతెంచు గుఱ్ఱములతోఁగూడిన రథంబుతోఁ బట్టణద్వారముఁ జేరి లోపలికిఁ జొచ్చెను.

అంత సుమంత్రుఁడు మఱలివచ్చుటం జూచి, జనులు నూఱులు నూఱులుగను, వేలువేలుగను గుంపులుగూడి వచ్చి "రాముఁ డేఁడీ?" యని యడుగుచు నెదురుగాఁ బరుగెత్తి వచ్చిరి. సుమంత్రుఁడును జనులను జూచి, "ఓ పౌరులారా! నేను రామాదులను గంగానది యొడ్డు వఱకుఁ గొనిపోయితిని. పిదప ధర్మపరుఁడగు రాముఁడు రథమునిచ్చి, నన్ను మఱలిపొమ్మని యానతీయఁగా నేను మఱలివచ్చితిని." అని బదులిడెను. జనులందఱు గంగాయమునానదులను దాఁటిరని తెలిసి

కొని, కన్నులనిండ నీరు నించికొని, "యక్కటా" యని నిట్టూర్చి "హా! రామా" యని విలపించి, యచ్చటచ్చట గుంపులుగూడి, "రాముఁ డెక్కడ కానరాఁడు. మనము కూలారిపోయితిమి. దానములు, యజ్ఞములు, పెండ్లిండ్లు, మహోత్సవములు ధార్మికుఁడయిన రాముఁడు లేక మనమొకప్పుడును జూడఁబోము. రాముఁడు ఏది కావలెను? ఏది యిష్టము? ఏది సౌఖ్యకరము" అని జనులను దండ్రివలె విచారించుచుఁ బరిపాలించుచుండెను" అని జను లనుకొనుచుండు మాటలను సుమంత్రుఁ డాలకించుచు, సంగడివీథిం బోవుచుండఁగా, రాముని వియోగదుఃఖముచే నొచ్చినవారలయి, గవాక్షములందుఁ గూర్చుండి విలపించుచున్న స్త్రీలరోదన ధ్వనుల నాకర్ణించెను. అట్లు సుమంత్రుఁడు రాజవీథిని జొచ్చి, మోమును గప్పుకొన్నవాఁడై, దశరథనృపాలుఁ డున్న నగరు చేరువకుఁ బోయి, వేగిరముగ రథమునుండి దిగి, జన బాహుళ్యముచే నల్లకల్లోలముగనున్న యేడు తొట్టికట్లు దాఁటెను. అచ్చట మేడలమీఁదను, విమానములమీఁదను రాజగృహములందును నుండిన స్త్రీలు సుమంత్రునిమాత్రము వచ్చినఁజూచి, రాముని బొడ గానక యందఱును "అయ్యయ్యో" యని యార్చుచుఁ గన్నీరు చారలుగాఁ గారెడి నిర్మలనేత్రములు గలవారలై, మిక్కిలి దీనముగా నొండొరుల మోములను జూచుచు, "సుమంత్రుఁడు రామునితోఁ గూడఁ బోయినాఁడు. రాముఁడు లేకుండ వచ్చినాఁడు. ఆతఁడు పోయి నదిమొదలు విడువని దుఃఖముతోనున్న కౌసల్యను జూచి యేమి చెప్పఁ గలఁడు? పుత్త్రుఁడు తన్నుఁబాసి యడవికిఁ బోయినతరువాతఁగూడ కౌసల్య జీవించియున్నది యనుట యేదికలదో, అట్టి పాడుబ్రతుకు బ్రతుకుట సులభ సాధ్యముగాదని తలఁచెదము" అని చెప్పికొనుచుం డిరి. అట్లు వారు చెప్పికొను నిక్కములైన మాటలను విని, దుఃఖాగ్నిచే నెఱియుచున్నట్టు లున్న దశరథుని యంతఃపురగృహముఁ జొచ్చి, యావల నెనిమిదవ తొట్టికట్టునఁ దెల్లరంగుగల గృహమునఁ బుత్త్ర శోకంబుచేఁ గుములుచు, నొచ్చియున్న దశరథునిఁ జూచెను.

అట్లు సుమంత్రుఁడు సింహాసనమునఁ గూర్చున్న దశరథునిఁ జూచి, తత్సమీపమున కేఁగి, నమస్కరించి, రాముఁడు చెప్పిన మాటల

నన్నింటిని విన్నవించెను. ఆ దశరథుఁ డాతని మాటలను విని, చెదఱిన మనస్సు గలవాఁడై, రాముని వియోగదుఃఖముచే మిక్కిలి నొచ్చి మైమఱచి, సొక్కి, క్రిందఁబడెను. పుడమిఱేఁడగు తమ నాథుఁడు మూర్ఛచేఁ గ్రిందఁబడినతోడనే, చేతులు పైకెత్తి యంతఃపురకాంత లందఱు నేడ్చిరి. అప్పుడు కౌసల్య సుమిత్ర తోడ్పాటుతోఁ గ్రిందఁ బడిన తమ భర్తను లేవనెత్తి కూర్చుండఁబెట్టి, "మహాత్ముఁడవగు నాథా! చేయ నలవిగాని యెంతటి కార్యములనైనను జేయుచున్న యా రాముని వనమున విడిచిపెట్టి వచ్చిన యీ సుమంత్రునితో నెందుకు మాటాడవు. ఓ రఘువంశోద్భవా, యిప్పుడిట్టి యన్యాయమును జేసి యేల సిగ్గుపడెదవు? లేచి కూర్చుండుము. సత్యవాక్యపరిపాలనచే నీవు పుణ్యము నొందుదువు, దుఃఖించి యుపయోగములేదు, నాథా! కైకకు వెఱచి రామునికడనుండి వచ్చిన సుమంత్రునిఁ బలుకరింపకున్నావేమో! ఇచ్చటఁ గైక లేదు. నీవు నిర్భయముగా మాటాడుము" అని దశరథ మహారాజుతోఁ జెప్పి, డగ్గుత్తికచేఁ దడఁబడునట్లు మాటాడుచు దుఃఖ వేగమును సహింపఁజాలక నేలపైఁ గూలఁగెను. నేలపైఁబడి యేడ్చుచున్న కౌసల్యను, భర్తను జూచి, యంతఃపురాంగనలెల్ల గుమిగూడి పెద్దెలుఁగుతో రోదనము సేసిరి. అప్పు డంతఃపురంబునఁ బుట్టిన రోదనంబును విని, పట్టణమునందలి ముదుసలులు, ప్రాయమువారు, స్త్రీలు నందఱును గూడ నేడ్చిరి. అప్పు డయోధ్యాపురమంతయు రాముఁడు వనవాసంబునకుఁ బోవునప్పుడువలెనే రోధనధ్వనులతోఁ నిండెను.

58-వ సర్గము

సుమంత్రుఁడు రాజునకు రామాదులు చెప్పినమాటలను వినిపించుట

నృపాలుఁడును, కౌసల్యాదులు చేసిన యుపచారములచే నూఱట వడసి, మూర్ఛనుండి తెప్పిఱిల్లి, రాముని వృత్తాంతముఁ దెలిసికొనుటకై యా సుమంత్రుని బిలిపించెను. అంతట సారథియగు సుమంత్రుఁడు, వినయముచేఁ జేతులు జోడించికొని, రామునే తలఁచి తలఁచి దుఃఖించువాఁడును, అప్పుడే పట్టుకొనఁబడిన యేనుఁగువలె కడు వ్యసనముతో మిక్కిలి నొచ్చినవాఁడునై, వేడి నిట్టూర్పులు విడుచుచుఁ జింతనొంది, నెమ్మదిదప్పిన యేనుఁగువలె నుండువాఁడునైన చీఁకుపుడమిఱేనికడ

కేతెంచి నమస్కరించెను. దశరథుఁడు నట్లు దుమ్ముచేనిండిన శరీరము గల వాఁడయి, కన్నీరు విడుచుచు దీనవదనుఁడై యుండు సుమంత్రునిఁ జూచి, మిక్కిలి నొచ్చినవాఁడయి యిట్లనియె. "సూతా! తొల్లి కడుసుఖముగ రాజగృహములందు వసించుచుండిన ధర్మాత్ముఁడగు రాముఁ డిప్పుడు చెట్ల క్రింద నెట్లున్నవాఁడు? ముందు భక్ష్యభోజ్య లేహ్యపేయాదులతోడఁ గూడిన మధురాన్నమును భుజించుచుండిన రాముఁ డిప్పుడేమి భుజింపు చున్నాఁడు? రాముఁ డింతకుఁబూర్వము దుఃఖములకుఁ దగనివాఁడు; సుఖమైన పాన్పులందుఁ బరుండినవాఁడు; అట్టి రాజపుత్త్రుఁ డిప్పు డనాథుఁడై వడి కటికినేలపై నెట్లు పరుండుచున్నాఁడు? తొల్లి చతురంగ బలములు వెంటరాఁ జనుచుండెడు రాముఁడు నేఁ డెట్లు నిర్జనవనమున నివసించుచున్నాఁడు? పెద్దపులులును, గడిఁది మెకములును, నల్లత్రాచు లును నెఱసియుండు నడవియందు నాకుమారులు సీతతోడ నెట్లు కాఁపురమున్నారు? సుమంత్రా! సుకుమారియు మునిపత్నులఁబోలునదియు నగు సీతతో రాజపుత్త్రులగు రామలక్ష్మణులు రథమునుండి యెట్లు కాలి నడకతోఁ బోయిరి? ఓ సారథీ! యశ్వినీదేవతలు మందరపర్వతముఁ జొచ్చునట్లు, నా పుత్త్రు లిరువు రరణ్యముఁ జొచ్చుచుండఁగా, నీవు వారిని జూచితివి కావున నో సుమంత్రుఁడా! నీవు కృతార్థుఁడవు. వన ముఁ జొచ్చినపిదప, రాముఁ డేమి చెప్పెను? లక్ష్మణుఁ డేమి చెప్పెను? సీత యేమి చెప్పినది? సారథీ! రాముఁ డెక్కడఁ గూర్చుండెను? ఏమి భుజించెను? ఎచ్చటఁ బరుండెను? నాకు విస్తరించి చెప్పుము. యయాతి స్వర్గమునుండి భూలోకముఁ బడునప్పుడు దేవేంద్రునిఁ బ్రార్థించి, సత్పురుషుల నడుమఁబడి జీవించునట్లు, నేను నీ రామునికథ విని కొంత కాలమైన బ్రతికి యుండఁగలను." అని దశరథుఁడు ప్రశ్న చేయఁగా, సుమంత్రుఁడు కన్నీళ్లతోఁగూడి, తడఁబడుచున్న మాటలతో నరేం ద్రునిఁగూర్చి యిట్లనియె. "మహారాజా! రాముఁడు ధర్మమునే యనుస రించి చేతులు జోడించి, శిరమువంచి మ్రొక్కి నాతో నిట్లనెను. "సారథీ! ఆత్మజ్ఞానముగలవాఁడును, వందన మొనర్పఁ దగినవాఁడును నైన మహాత్ముఁ డగు తండ్రియొక్క పాదములకు నాకుమారుగ వందనమాచరింపుము, సారథీ! నా మాఱుగా నంతఃపురమున నున్నవారికి నా క్షేమములు

చెప్పి, వారివారి వయస్సులకు, యోగ్యతలకుఁ దగినట్లు నమస్కారము
లను జేయుము. మాతల్లిగారితో నా క్షేమమును నా నమస్కారము
లను, అజాగ్రత్తలేకుండుటను జెప్పి, మఱియు నీ క్రిందిమాట చెప్పుము!
ఓ దేవీ! నీవు ధర్మమార్గముఁ దప్పకుము; కాలము దప్పక యగ్నిహోత్ర
శాలయందుఁ బురోహితు లగ్నిహోత్రములు వేల్చుచున్నారా యని
విచారించుకొనుచుండుము; పతిపాదములనే దైవముగా భావించి పూజిం
చుము; సవతులవిషయమున, నేను పెద్దదాన నను నహంకారమును గర్వ
మును మాని నడచుకొనుచుండుము. తల్లీ పూజ్యురాలగు కైకేయి
మహారాజు ననుసరించి యుండునట్లు చేయుము; పిన్నయగు భరతుని
యందును నృపాలునందువలె నీవు ప్రవర్తింపుము. వయసుచేఁ జిన్నలయి
నను, రాజులు ధర్మముచేఁ బెద్దలు, ఈ రాజధర్మమును మఱవకుము
అని తన తల్లియగు కౌసల్యతోఁ జెప్పుమనెను. భరతునకు నా క్షేమము
జెప్పి, నా మాటగాఁ దల్లు లందఱియందును నేకరీతిగా నుండుమనుము.
మఱియు నిక్ష్వాకువంశ నందనుఁడయిన దీర్ఘబాహువగు భరతున కీ
సంగతి జెప్పుమనెను, "భరతా! నీవు యువరాజ పట్టము నొందిన
వాఁడవై, రాజ్యపరిపాలనము సేయుచుండు తండ్రికిఁ దోడుగా
నుండుము. రాజు వయసు చెల్లినవాఁడు. కావున నాతని యభిప్రాయము
నకు విరుద్ధముగా నడచుకొనకుము. ఓ భరతా! తండ్రియాజ్ఞప్రకారము
నడచుకొనుచు యువరాజవయి సుఖముండుము. అని భరతునితోఁ
జెప్పుమనెను. రాముఁడు విశేషముగాఁ గన్నీళ్లువిడుచుచు మఱల నాతో
నిట్లనెను. "ఓ భరతా! మాతల్లి పుత్రవాత్సల్యముగలది కావున, మీ
తల్లినివలెనే మాతల్లినిగూడఁ జూచుకొనుము" అని చెప్పుమనుచు
విస్తారమగు కీర్తిగలవాఁడును, తామరఱేకులంబోలు కన్నులుగల
వాఁడునునైన యా రాముఁడు జొటజొట గన్నీరువిడిచెను. అప్పుడు
లక్ష్మణుఁడు గడు నలిగినవాఁడై, నిట్టూర్పువిడిచి, నాతో నిట్లనియె.
"సుమంత్రా! రాజపుత్రుఁడగు రాముఁ డే కారణమున వనవాసమునకుఁ
బంపఁబడెను? దశరథుఁడు కైకయొక్క నీచమైన యాజ్ఞకులోఁబడి
మాకు బాధదెచ్చెడి యీ యకార్యమును మంచిచెడ్డ లెఱుఁగక చేసెను.
రాముని నడవికిఁ బంపుటకుఁ గారణము లోభమయినను కాక వరముం

నను ఎవ్విధమున నయినను జేసినది చెడ్డపనియే కాని వేఱుగాదు. కైకేయి రాముని నడవికిఁ బంపుమని యడిగినప్పుడు "నేను రాముని నడవికిఁ బంపజాల" నని చెప్పియుండఁగూడదా? ఇక్కార్యమును దశరథుఁడు "తాను ప్రభువు" అనునదే ముఖ్యముగాఁ దలఁచి, చేసెనేకాని రాముని వనమునకుఁ బంపుట కేమియుఁ గారణము నాకుఁ దోఁపకున్నది. దశరథుఁడు మొదట విచారింపక, తెలివిలేమిచే లోకవిరుద్ధములగు నిక్కార్యము (రామవివాసనకార్యమును) జేసెను. అది యిప్పుడు దశరథునకు మిగుల సంతాపమును గలిగించుచున్నది. నే నన్ననో, దశరథమహారాజును దండ్రియని తలఁచను. నాకు రాముఁడే తోఁబుట్టువు; రాముఁడే ప్రభువు; రాముఁడే చుట్టము; వేయియేల! రాముఁడే తండ్రియు." అని చెప్పి, "ఓ తండ్రీ! సకల జనులకుఁ బ్రియుఁడును, సకలజనులకుఁ మేలు గోరువాఁడును నైన రాముని నడవికిఁ బంపిన నీపైన సకలజనులకు ప్రేమ యుండునే? జనులందఱి మనముల కొప్పినవాఁడును, ధర్మములఁ దప్పనివాఁడునైన రాముని వనమునకుఁబంపి, జనులందఱికి విరోధివైన నీవెట్లు రాజవు కాఁగలవు" అని తమతోఁ జెప్పుమని నాతోఁ జెప్పెను. మహారాజా! మంచి మనస్సుగల సీత యన్ననో, వేఁడినిట్టూర్పులు విడుచుచు దయ్యముపట్టినదానివలె నివ్వెఱపాటుతో నిలఁబడియుండెను. సీత రాచకొమరిత; ఇంతకు మున్నిట్టి దుఃఖముల నెఱుఁగనిది; గుణవతియని ఖ్యాతినొందినది. ఆమె నశ్వసనముతో నేడ్చుచు, నాకొక సంగతియుఁ జెప్పలేదు. ఎండువాఱుచున్న మోముతో భర్తను చూచుచు మఱలి వచ్చుచుండు నన్నుఁజూచి, వెక్కిలి దుఃఖముతోఁ గన్నీటికాలువలు కట్టించెను. అట్లు రాముఁడు చేతులు జోడించి, కన్నీరువిడుచుచు, లక్ష్మణుని భుజబలంబుచేఁ గాపాడఁబడుచు నచ్చటనుండెను. సీతయు శోకముచే విలపించుచు రాజరథమును, నన్నును జూచుచుండెను.

## 59-వ సర్గము.

### సుమంత్రుఁడు దశరథునకు రామునివనవాసముతీరు చెప్పుట

ఇట్లు చెప్పుచున్న సారథియు మంత్రిశ్రేష్ఠుఁడునయిన సుమంత్రునిఁ జూచి, దశరథుఁడు "ఇఁక మిగిలిన సంగతినిఁ జెప్పు" మని యడిగెను. ఆ నృపాలుని యా మాటలువిని, సుమంత్రుఁడు కన్నీరువిడుచుచు దిటవు

మూని, మఱల రాముని వృత్తాంతమును విస్తరించి చెప్పఁ దొడఁగెను. "మహారాజా! శూరులైన యా రామలక్ష్మణులు నారబట్టలుగట్టి జడలు దాల్చుకొని, గంగానదిని దాఁటి ప్రయాగవైపునకుఁ బోయిరి. రఘునందనుఁడగు రామున కండయయి లక్ష్మణుఁడు ముందుగాఁ బోయెను. ఆతనివెనుక సీతయు నామెవెనుక రాముఁడును బోయిరి. అవ్విధంబునఁ బోవుచుండువారిని జూచి యిఁకఁ జేయునదిలేక వెనుకకు మఱలితిని. నేను మఱలినతర్వాతఁగూడ గుఱ్ఱములు రాముఁడు వనమునకుఁ బోయెనన్న విచారముచే వేఁడి కన్నీరు విడుచుచు, దారిలోనికి మఱలకుండినవి. నేనును రాజపుత్త్రుల కిద్దఱికిఁ జేతులు జోడించి మ్రొక్కి, నా దుఃఖమును లోపల నడఁచుకొని రథమెక్కి ప్రయాణమైతిని. రాముఁడు మఱల నన్ను రమ్మని చెప్పి పంపునేమో యని తలఁచి శృంగిబేరపురమనే గుహునితోడ మూఁడుదినము లుంటిని. ఆరాముఁడు చెప్పి పంపనే లేదు. నరేంద్రా! దేవరవారి దేశముననున్న చెట్లు సయితము రాముని వనవాసదుఃఖముచేఁ గృశించినవై పుష్పములతో మొగ్గలతోఁ జిగుళ్లతోఁగూడ వాడువాఱిపోయినవి. నదులందును, గుంటలందును, చెఱువులందును నీళ్లు మసలఁ గ్రాఁగినట్లున్నవి. తోఁటలందును, నుద్యానవనములందును నాకులెండి జలజల రాలుచున్నవి. జంతువులు ప్రాఁకకున్నవి. క్రూరమృగములు దిరుగకున్నవి. వనమంతయు రాముని వనవాసశోకముచేఁ గొట్టువడి నిశ్శబ్దముగా నున్నది. నరాధిపా! తామరకొలంకులందలి తామరతీఁగెలు వాడిపోవుచున్నవి; తామరాకులు నీటిలో మునిఁగినవి, నీళ్ళు కలఁకవాఱినవి. చేఁపలును, హంసలు మొదలగు జలపక్షులును గానరాకున్నవి. కావున, తామరకొలఁకులన్నియు మురికిగుంటలవలె నున్నవి. తామరపువ్వులు మొదలగు నీటి పుష్పములును, జాజి మొదలగు మెట్టలందుఁ బుట్టు కుసుమములును సువాసనలేనివై, వెనుకటివలెఁ బ్రకాశింపకున్నవి. ఫలములును బూర్వమువలె దీపిలేకయున్నవి. ఈయయోధ్యాపురమునందలి యుద్యానవనములు పక్షులయొక్క ఇంపయినకూఁతలు లేక పాడుపడియుండియున్నవి. నరేంద్రా! యుపవనములన్నియు సొంపుదఱిఁగియున్నవి. అయోధ్యాపురంబున నొక్కఁడైనను, మఱలివచ్చుచుండు నన్నుఁగని సంతసింపరైరి.

ప్రజలందఱు రామునిఁ గానక మాటిమాటికి నిట్టూర్పులు విడుచు చుండిరి. ప్రభూ! రాముఁడు లేని రాజరథమును జూచి, రాజమార్గమునం దలి జనులందఱు దుఃఖముచేఁ గన్నీరు వెట్టుకొనిరి. స్త్రీలందఱు మేడల మీఁదను, విమానములమీఁదను (ఏడంతస్తుల మేడలమీఁదను) రాజ గృహములమీఁదను ఎక్కి రాముఁడు లేకయే వచ్చిన రథమునుజూచి, "యయ్యయ్యో" అని యాక్రందించుచుండిరి. స్త్రీలు మిక్కిలి నొచ్చిన వారలై, నిర్మలములు, విశాలములునయిన కన్నులనిండుగ నీరు దెచ్చు కొని యేమియుఁ దోఁచక యొండొరులను జూచుకొనుచుండిరి. రాముని పగతురను, చెలికాండ్రను, మధ్యస్థులును దుఃఖితులై యుండుటచేత, వీరు శత్రువులనియు, వీరు మిత్రులనియు, వీరు మధ్యస్థులనియు భేదము దెలియుట కష్టముగా నుండెను. అయోధ్యాపట్టణమున జనులు సంతోషహీనులుగ నుండిరి. గజాశ్వములు గళదప్పియుండెను. రోదన ధ్వనులే యంతట వినఁబడుచుండెను. అట్టి యయోధ్యాపురము రాముఁ డరణ్యమునకుఁ బోవుటచేఁ బుత్రు నెడఁబాసిన కౌసల్యవలె సంతోష హీనముగ నుండెను.

దశరథుఁడును సారథియగు సుమంత్రునిమాట విని, దుఃఖముచే డగ్గుత్తిక వడిన మాటలతోఁ గడుదీనముగ నా సారథియగు సుమంత్రుని జూచి యిట్లనియె. "ఓ సుమంత్రా! చెడ్డకుటుంబమునఁ బుట్టి చెడ్డతలఁ పులు గలదైన కైకేయి వరము లడుగఁగా, నేను మంత్రాలోచనలందు నిపుణులగు పెద్దలతో యోచింపక నాప్తులతోనైనను యోచింపక, దాని యందలి మోహముచే స్త్రీసుఖముఁగోరి, యీ కార్యమును ముందు వెనుక లాలోచింపక చేసితిని. కాదేని, సారథీ! యీ మాకులము నశించుటకుఁగా నీ కష్టమును తప్పక దైవము గల్గించియుండును. సారథీ! నే నింతకుమున్ను చేసిన పుణ్యమేదియైన గొంచెమున్నయెడల, నన్నుఁ గడువేగముగ రాముని కడకుఁ జేర్చుము. లేనిచో నా ప్రాణములు నా బొందిలో నుండఁజాలవు. ఇప్పుడును నా యాజ్ఞకుఁ జెల్లుబడి యుండునేని; నీవు పోయి రాముని మఱలించికొనిరమ్ము. నేను రామునిఁ బాసి యొక క్షణమైన నుండఁజాలను. అట్లు కాక, రాముఁ డిప్పటికిఁ జాలదూరంబేఁగియుండును గావున నన్నే రథమునఁ గూర్చుండఁబెట్టి

కొని, శీఘ్రముగా నా రామునికడకుఁ గొనిపోయి, యాతనికి జూపిం పుము. చక్కని పలువరుసగలవాఁడును, మేటి విలుకాఁడునునైన లక్ష్మణుని యన్నయగు రాముఁ డెచ్చటనున్నాఁడు? నే నీ పదునాలు గేండ్లు బ్రతికియుందునేని, సీతతోడ మఱలివచ్చిన రామునిఁ జూతును. ఎఱ్ఱని కన్నులు, గొప్ప బాహువులు గలవాఁడును, మణిమయములగు కుండలములను దాల్చినవాఁడును నైన రామునిఁ జూడకుందునేని యమపురి కేఁగుదును. వృద్ధుఁడనైన నే నింత వ్యసనమునొందియు నిక్ష్వాకునందనుఁడైన రాముని నిచ్చట చూడకున్నాను. దీనికంటె మించిన దుఃఖము మఱేమి యుండును? అక్కటా? రామా! హా! లక్ష్మణా! హా! సీతా మీ వియోగదుఃఖము నోర్వలేక దిక్కులేని వాఁడువోలె మృతినొందనున్న నన్ను మీ రెఱుఁగఁజాలరుగదా!" అని సుమంత్రునిచూచి, దుఃఖించి, నృపాలుఁడు చింతాక్రాంతచేతస్కుఁడై దాఁట నలవికాని శోకసాగరమున మునిఁగినవాఁడగుచు, కౌసల్యనుచూచి, "ఓ దేవీ! రాముని యెడఁబాటువలని శోకమనఁబడు నెక్కువ వైశాల్యముగలిగి, సీతావియోగమనెడు నావలిగట్టుతోఁగూడి, నిట్టూర్పు లనెడు నలలతో, గొప్ప సుళ్లతో వెలసి, కన్నీరనెడి నురువుచేఁ గలఁక వాఱి, చేతులాడించుట యనెడు చేఁపలగుంపులుగలదై, అధికరోదన మనెడు ఘోషగలిగి విఱియఁబోసికొన్న కేశములనెడు పాఁచితీఁగెలతోఁ గూడి, కైకయనెడు బడబాగ్ని గలదయి, గూనిదానిమాటలనెడు గొప్ప మొసళ్లుగలిగి ఘాతుకురాలైన కైకేయి వరములనెడి చెలియలికట్టతో విల సిల్లుచు, రాముని ప్రవాసన మనెడు నిడివిగలిగియున్న నా కన్నీటి ప్రవాహమను జలమువలనఁ బుట్టిన దుఃఖమను సాగరమున మునిఁగితిని. అక్కటా! రాము నెడఁబాసి ప్రాణములనుదాల్చి యీ సాగరము నే నెట్లు దాఁటఁగలను? నే నిప్పుడు రాముని లక్ష్మణుని చూడఁగోరియు చూడకున్నానుగదా. దీనికంటె నాకేమి యమంగళము గావలెను?" అని చెప్పి యేడ్చుచు మూర్ఛనొంది వెంటనే పాన్పుపైఁ బడెను. ఇట్లు దశ రథుఁడు విలపించుచు మూర్ఛనొంది క్రిందఁబడఁగాఁ, గౌసల్య రాజేం ద్రుని పలుకులు విని, రామునివిషయమై యినుమడికే దిగులుపడి

యుండఁగా, నిప్పుడు నృపాలుఁ డిట్లు మూర్ఛనొంది క్రిందబడినందుకై
యినుమడిగ దిగులునొందెను.

## 60-వ సర్గము.

### కౌసల్య సుమంత్రుని నడుగుట

అటుపిదపఁ గౌసల్య దుఃఖితురాలై, దయ్యముపట్టినదానివలెఁ
మాటి మాటికి వడఁకుచు నేలపయిఁ బ్రాణముపోయినదానివలెఁ
బడియుండి సుమంత్రునితో "ఓ సారథీ! యెచ్చట రాముఁడు లక్ష్మ
ణుఁడు సీతయు నున్నవారో, అచ్చటికి నన్నుఁ గొనిపొమ్ము. వారినిబాసి
నేనొక నిమిషమైన జీవించియుండఁగోరను. రథము నిచ్చటినుండియె
త్రిప్పి, వేగముగ నన్నును దండకారణ్యములకుఁ గొనిపొమ్ము. అట్లు
వారిని వెంబడించి పోవనేని, యమపురికిఁ బోయెదను" అని చెప్పఁగా,
సారథియుఁ, గౌసల్య నూఱడింపఁగోరి, యంజలిచేసి, కన్నీటివేగముచే
డగ్గుత్తికచేత తొట్రుపడుచున్న మాటలతో నా కౌసల్యాదేవికి నిట్లు
నియె; "ఓ దేవీ! శోకమును, అజ్ఞానమును, వ్యసనజనితమైన తత్తర
పాటును విడువుము. రాముఁడును దుఃఖమునుబాసి యరణ్యమున
నుండఁగలఁడు. ధర్మజ్ఞుఁడును, ఇంద్రియనిగ్రహములుగలవాఁడునైన
లక్ష్మణుఁడును నరణ్యమున రాముని పాదములకు శుశ్రూషలు చేయుచుఁ
బరలోకము సాధింపఁ బూనుచున్నవాఁడు. సీతాదేవి నిర్జనమయిన
వనమునందున్నను, యింటియందున్నట్లే, దిగులుమాని రామునియందే
మనసుంచి, కుశలముగనున్నది. ఈ సీతాదేవి యావంతయైనను దిగులు
నొందియున్నట్లు కాన్పింపదు. ఆమె యరణ్యవాసమునకుఁ దగినదాని
వలెనే తోఁచుచున్నయది. పట్టణోద్యానములందు సీత యెట్లు విహ
రించుచుండెనో, అట్లె జనులులేని కానలందును విహరించుచున్నది.
బాలచంద్రునివంటి మోముగల యా రామామణియగు సీత నిర్జన
వనంబున నున్నను, రామునికిఁ దన మనసు నప్పగించినది యాటవలనా
బాలికవలె నచ్చటఁ గ్రీడించుచున్నది. ఈ సీతయొక్క మనోజీవితములు
రెండును రాముని యధీనములైయున్నవి. ఒకవేళ రామునితోడఁబోక,
సీత యయోధ్యయందున్నను, నయోధ్య సీత మనస్సున కడవిగానే
తోఁచును. మఱియు సీత యయోధ్యాపురమునకుఁ గ్రోసుదూరమున

సుండు వనంబులందు విహరించునట్లు తలఁచి, నడుదారియందుఁ గనఁబడు గ్రామములను, నగరములను, నదులను, నానావిధ వృక్షములనుగూర్చి రామునినైనను లక్ష్మణునైన నడిగి తెలిసికొనుచున్నది. సీత కైకేయినిఁ గూర్చి తొందరగాఁ జెప్పినమాట యిది యొక్కటియే. అని చెప్పి, “అది చెప్పినఁ గౌసల్యా దశరథులు మఱింత వ్యసనము నొందుదు” రని యెంచి, “అది యేదో యిప్పుడు జ్ఞప్తికి రాకున్నది” యని నోటినుండి పొఱపాటుచే వచ్చిన యామాట నావలకుఁ ద్రోసి కౌసల్యకు నానంద దాయకమగు వాక్యము పలుకఁగోరి, “ఓ దేవీ, చంద్రకిరణములతో సమమయిన యామె శరీరకాంతి దారి నడచుటవలనఁగాని, యాగాలి సోఁకుడువలనఁగాని, వ్యాకులపాటుచేతఁగాని, యెండలకుఁగాని మాఱు పాటు నొందకున్నది. ఆ దానశీలురాలయిన సీతయొక్క ముఖము పున్నమచంద్రునితోను గమలముతోను సమానమై యెప్పటికి నొక తీరుననే యున్నది. ఆ సీతయొక్క పాదములు లత్తుక రసమువలె నెఱ్ఱని కాంతిగలవి గావున లత్తుక యలఁదకపోయినను నిప్పుడుగూడఁ దామర మొగ్గల కాంతివంటి కాంతిచే మీఱియున్నవి. సీత కాలి యందెలు ధరింపకున్నను, రామునియందలి ప్రేమచేతఁ గాలియందెల మ్రోఁతకుఁ దగినట్లు సవిలాసముగ నిపుడును దిరుగుచున్నది. సీతాదేవి యేనుఁగునొండె, సింహమునొండె, వ్యాఘ్రమునొండె చూచినను రాముని చేతులను బట్టుకొన్నదై భయమునొందకున్నది. కావున వారిని గూర్చి విచారపడ నక్కఱలేదు. మనలఁగూర్చియుఁ జింత యక్కఱలేదు. దశరథనృపాలునిగూర్చియుఁ జింతింప నవసరములేదు. ఈ పితృవాక్య పరిపాలన రూపమయిన చరిత్రము లోకమున శాశ్వతమైయుండఁగలదు. వారును దుఃఖముఁ బాఱఁదోలి, సంతుష్టమనస్కులై, మహర్షులు నడచిన దారులలో నడచుచు, నడవులందుండ నపేక్షగలవారలై, యచ్చటఁ గందమూల ఫలములను దినుచు శ్రేయస్కరమగు తండ్రిప్రతిజ్ఞను బరిపాలించుచున్నారు” అని సుమంత్రుఁడు కౌసల్యతోఁ జెప్పెను. అట్లు సుమంత్రుఁడు మంచి మాటలను జెప్పి యూరడించుచున్నను, కౌసల్యాదేవి పుత్రవియోగ శోకము సైరింపఁజాలక, హా! ప్రియా! హా! పుత్రా! హా! రాఘవా! యని యాక్రోశించుచునే యుండెను.

## 61.వ సర్గము

### కౌసల్య దశరథుని దూఱుట

ధర్మపరుఁడును, జనులను సంతోషపెట్టువారిలో నుత్తముఁడునైన రాముని యరణ్యవాసమునకై కౌసల్య కడు దుఃఖించి, యేడ్చుచు భర్తను జూచి, యిట్లనియె: "మహారాజా, దశరథుఁడు సర్వభూతము లందు దయగలవాఁ డనియు, దాతయనియు, ప్రియము మాటాడువాఁ" డనియు మూఁడులోకములందును నీ కీర్తి వ్యాపించియున్నది. ఇప్పు డిష్టముగాని పని చేసితివి. ఓ రాజేంద్రా, రాజపుత్రులగు రామలక్ష్మణు లింతవఱకు సుఖముగాఁ బెరిగిరి. అట్టివారు దుఃఖముచే నొచ్చినవారై, సీతతోఁగూడ నయ్యడవులం దేలాగు కష్టముల నోర్చి యుండఁగలరు? జవరాలును, పిన్నవయస్సుగలదియు, సుకుమారియు, సుఖములకుఁ దగినదియునైన సీత యడవులం దెండను, చలిని నెట్లోర్చుకొని యుండఁగలదు? ఇంతవఱకు నిచ్చట రుచికరములగు శాకపాకములతోఁ గూడిన మేలయిన యన్నమును భుజించుచుండిన రాజపుత్రి యిప్పుడు నెమలిబియ్యమును కందమూలఫలములను ఎట్లు భుజింపఁగలదు? పూర్వ మిచ్చట గీతములయు, వాద్యములయు ధ్వనిని వినుచుండిన సీత యిప్పుడు భయంకరములైన సింహ వ్యాఘ్రాదుల గర్జనముల నెట్లు విను చుండఁగలదు? ఇంపయిన గానములయు, వాద్యములయు ధ్వనులను విని సంతోషపడుచుండిన యుత్తమాంగనయగు సీత యిప్పు డెట్లు భయంకర ములగు మృగములయొక్కయు సింహములయొక్కయు బొబ్బరింతలను వినుచుండఁగలదు? దేవేంద్రుని ధ్వజముమాడ్కి జనులందఱకు సంతో షముఁ గల్గించువాఁడును, దీర్ఘబాహువులు గలవాఁడును, బలవంతుఁడు నైన రాముఁ డినుపగుదియంబోలు తన చేతిని దిండుగాఁ జేసికొని యెచ్చట నిద్రించుచున్నాఁడో! తామరపువ్వులవన్నె గలదియు, చక్కని కొనవెండ్రుకలతోఁ గూడినదియు, తామరపువ్వులతావివంటి తావి గల నిట్టూర్పుతోఁగూడినదియు, తామరపువ్వులరేకులవంటి కన్నులు గల దియునైన యారాముని యందమయిన ముఖమును నే నెప్పుడు చూడఁ గలను? నా హృదయము వజ్రసారముతోఁ జేయఁబడినది. నిక్కము కావుననే రాముని జూడకున్నను వేయిముక్కలుగ బ్రద్దలుగాకున్నది.

ఓ నృపాలా, నా వారగు రామాదులను, సుఖములకుఁ దగినవారిని దయమాలి యడవికిఁ బంపితివి. వా రిప్పుడు దుఃఖితులై యచ్చటచ్చట నడవులలో నల్లాడుచున్నారు. నీ హృదయ మెంత క్రూరమైనది? ఎంత ఘాతుకపుఁ బని సేసితివి? రాముఁడు పదునేనవయేట మఱలివచ్చినను రాజ్యముగాని, ధనముగాని గ్రహింపఁబోఁడు. వానిని భరతుఁడే యనుభవించును. లోకమునఁ గొందఱు శ్రాద్ధములకు తమ బంధువులనే నిమంత్రణము చేసి, శ్రాద్ధానంతరమునఁ దమతోడ నిష్టపంక్తియందు భుజింప బ్రాహ్మణోత్తములఁ బిలుతురు. గుణవంతులును, పండితులు నగు బ్రాహ్మణోత్తములు, గుణహీనులగు బ్రాహ్మణులను కర్తలు నిమంత్రించి, వారికి మొదటఁ బెట్టుటవలనఁ దమ కావల నమృతము నిడినను దాని నంగీకరింపరు. తమకుముందు భుజించినవారు బ్రాహ్మణులేయైనను, ఆఁబో తులు తమ కొమ్ములు నఱికివేయుటకు సహింపఁజాలనట్లు భుక్తశిష్టమైన యన్నమును గుడువఁజాలరు. ఇట్లు తనకంటెఁ జిన్నవాఁడగు భరతునిచే నేలఁబడిన రాజ్యము గైకొనుట పెద్దవాఁడును, శ్రేష్ఠుఁడునైన రాము నకు నవమానకరముగదా! వ్యాఘ్రి మితరమృగములు దిన్న మాంస మును దినఁజాలనట్లు, నరవ్యాఘ్రుఁడగు రాముఁడును నొరులు చవిగొన్న రాజ్యము నంగీకరింపఁజాలఁడు. హవిస్సులు, ఆజ్యము, పురోడాశములు, కుశలు, చంద్ర యూపములు నొక యాగమున నుపయోగింపఁబడినవి మఱియొక్క యాగమున నుపయోగింపఁబడవుగదా! అట్లె రాముఁడు సారమునశించిన కల్లువలెను, సోమమునశించిన యజ్ఞమువలెను జవిగొనఁ బడిన రాజ్యమును బాలింప నియ్యకొనఁడు. అతఁడు పరులకోపమునకు లొంగనివాఁడు గావున నీ యవమానమును సైరింపఁజాలఁడు. అతఁ డాగ్రహవంతుఁ డయ్యెనేని, కఱకుటమ్ములతో మందరపర్వతమునైనను దుత్తునియలు చేయఁగలఁడు. అతఁడు కోపవంతుఁడై చంద్రసూర్య గ్రహనక్షత్రములతోఁ గూడియున్న యాకాశమును దలక్రిందులు చేయఁగలఁడు. అట్టివాఁడయినను, నీవు తండ్రివిగాన నీమాట త్రోయఁ జాలకున్నాఁడు. అనేక పర్వతములతో నిండిన యీ పుడమినెల్లఁ గలియఁ బెట్టఁగలఁడు. జనులందఱుఁగూడివచ్చినను సరకుసేయక యడ్డగింపఁ గలఁడు. మహాత్ముఁడగు రాముఁ డన్నియు దెలిసినవాఁడు గావున నీవు

తంత్రివనుగౌరవముచే నిన్నుఁ జంప సాహసింపలేకున్నవాఁడు. బలిష్ఠ మయిన వ్యాఘ్రము తోఁకఁబట్టియీడ్చిన నోర్వఁజాలనట్లు, రాముఁడిట్టి యగౌరవము నోర్వఁజాలఁడు. ఇతనిని ముల్లోకములవారు గూడివచ్చి నను, నేమియుఁ జేయఁజాలరు. ధర్మాత్ముఁడయిన రాముఁడు ధర్మహీనమై యున్న యీ లోకమును ధర్మము గలదానినిగాఁ జేయఁగలఁడు. ఓ నృపాలా! పొడవుచేతులవాఁడును, ఎక్కువ పరాక్రమముగలవాఁడు నైన రాముఁడు ప్రళయకాలాగ్ని సకల భూతములను బోలెఁ దన బంగారుబాణములచే సప్తసముద్రములను సైతము దహించును. నృపేంద్రా, నీవు న్యాయమునం దెక్కువ యాసక్తిగల కుమారుని నడవికిఁ బంపితివికదా! నీవు బ్రాహ్మణోత్తము లాచరించునవియు, శాస్త్రములందుఁ జెప్పఁబడినవియు నైన శాశ్వతధర్మములను జేసినవాఁడ వగుదువే? ఆఁడుదానికిఁ బెనిమిటి మొదటిదిక్కు. అతనికిఁ దరువాత రెండవదిక్కు కొడుకు. మూఁడవదిక్కు దాయాదులు. నాలగవదిక్కు యీ లోకముననె లేదు. ఆ మూఁడుగతులలో మొదటి గతివియైన నీవేమో నా సవతికి లోఁబడినవాఁడవు కాన నీవు నాకు గతివి కావు. ఇఁక రెండవగతియగు రాముఁ డన్ననో యడవికిఁ బోయెను. నిన్నుఁ బాసి పోవుట ధర్మము కాదు; కనుక, నేను రామునితోఁగూడఁ బోవఁజాల నైతిని. భర్తయగు నీవును, పుత్త్రుఁడగు రాముఁడును నుండఁగా నితరు లగు చుట్టముల నాశ్రయించుట యుక్తము గాదు; కావున, నీవు నన్ను నానావిధముల మొక్కచెఱచితివి. ఓ నృపాలా! నీవు రాజ్యమెల్లఁ బాడుచేసితివి, నీవును చెడితివి; మంత్రులకుఁ జేటుతెచ్చితివి. నన్నును, నా కొడుకగు రాముని పౌరులను అధోగతిపాలు సేసితివి. నీ భార్య యగు కైకేయియు, నీ ముద్దులకొడుకగు భరతుఁడును సంతసపడునట్లు చేసితివి." అని దశరథునిఁ బొడుపుమాటలతో నెత్తిపొడిచెను. దశరథ భూమినాథుఁడును కౌసల్య యివ్విధముగాఁ జెప్పిన కర్ణకఠోరములగు మాటలను విని మిక్కిలి వగచి మూర్ఛనొందెను. పిమ్మటఁ గొంతసేపటికిఁ దెప్పిఱిల్లి, తాను ముందుచేసిన పాపకర్మమును స్మృతికిఁ దెచ్చికొని మఱల దుఃఖము నొందెను.

## 62-వ స ర్గ ము

### దశరథుఁడు కౌసల్యను నూఱడించుట

ఇట్లు కౌసల్య కోపముతో నాడిన నిష్ఠూరపు మాటలను విన్నవాఁడై దశరథుఁడు వగచి, మనమునఁ గలఁగి, మూర్ఛనొంది, చాల సేపటికి మఱలఁ దెప్పిఱిల్లి వేఁడినిట్టూర్పులు విడుచుచు, మఱలఁ బ్రక్కననున్న కౌసల్యను జూచి, "నే నిట్లు పుత్రశోకము నొందఁ గారణ మేదియైననున్నదా? అట్టి పాపకృత్యము మున్నేమిచేసితినో?" యని యాలోచించి, కడపటికిఁ దాను శబ్దవేధి యయి (=చప్పుడుగని పెట్టి బాణమువేయువాఁడయి) చేసిన పాపకృత్యము జ్ఞప్తికిఁ దెచ్చుకొని, ఉన్న యొక్కవ్యసనమున కా రెండవవ్యసనము దోడుగాఁగా, రెండు శోకములచే దహింపఁబడుచు, వణఁకుచు దోసిలిగట్టి, తలవంచుకొని కౌసల్య నోదార్పఁబూని యామెను జూచి, "ఓ కౌసల్యా, నేఁ జేతులు జోడించుకొని మ్రొక్కెదను. నిన్ను బతిమాలుకొనెదను. నీ వెల్లప్పుడు శత్రువులందయినను బుత్రప్రేమగలిగి, చెఱుపు చేయఁ బూనవుగదా! ఓ దేవీ, మగఁడు గుణవంతుఁడైనను, గుణహీనుఁ డయినను స్త్రీలకుఁ బ్రత్యక్షదైవ మని ధర్మముల నెఱిఁగిన యతివ లెఱుఁగుదురుగదా! నీవును అట్లె ధర్మములం దాసక్తిగలదానవు. ఎల్లపుడు లోకమున గుణ దోషములను జక్కఁగా నెఱింగినదానవు. అట్టి నీ కెంత వ్యసనము ప్రాప్తించినను, మిక్కిలి నొచ్చియున్న నన్ను మాటలచే నొప్పించు చున్నావు. ఇది నీకుఁ దగదు" అని పలికెను.

అట్లు దశరథుఁడు మిక్కిలి దీనముగా జాలిపుట్టునట్లు చెప్పిన మాటను విని, కౌసల్య కన్నీరు ధారలుగాఁగార దుఃఖించుచుఁ దామర మొగ్గంబోలు రాజేంద్రుని దోసిలి నెత్తి తన శిరమున నుంచుకొని, తత్తరపాటుతోడ మాటలు తడఁబడుచుండ నిట్లనియెను. "దేవా! న న్ననుగ్రహింపుము. తలయొగ్గి వేడుచున్నాను. నీకిదే సాష్టాంగనమ స్కారము. నీచే యాచింపఁబడి పాడయితిని. నీచేతఁ జంపఁదగినదానినిగా నయితినిగదా! కొనియాడఁదగినవాఁడును, బుద్ధిమంతుఁడును నైన మగఁడు ఎవతెను గొనియాడుచున్నాఁడో, ఆ యాఁడుది యిహపర ములకు రెంటికిని గాని యధోగతిని బొందును. ఓ ధర్మజ్ఞుఁడా! ధర్మ

స్వరూపము నే నెఱుఁగుదును. నీవు సత్యవంతుఁడవనియు నెఱుఁగుదును. అయినను, పుత్రశోకముచే నొడలు దెలియక నే నేదియో చెప్పితిని. నాథా దానిని మన్నింపుము. శోకము ధైర్యమును బోఁగొట్టును. శోకము సర్వమును బోఁగొట్టును. శోకముతో సాటియగు శత్రువు పుడమిని లేఁడు. శత్రువు చేతిదెబ్బనయిన నోర్వవచ్చునుగాని, హఠాత్తుగా సంభవించిన యించుక దుఃఖమునేనియు నోర్చుట యలవికాదు. ధర్మములనెల్లఁ నెఱింగినవారయినను, సకలశాస్త్రములఁ జదివినవారయినను, ధర్మార్థములను పురుషార్థములవిషయములం దేమియు సంశయము లేనివారయినను, శోకముచే మునింగిన బుద్ధిగలవారలై యుక్తాయుక్తములఁ దెలియక జితేంద్రియులగు యతులు సైతము నవివేకము పాలగుచున్నారు. రాముఁ డడవికిఁబోయి, నేటి కైదుదినము లయినవి. దుఃఖముచేఁ గ్రుంగి కూలారుచున్న నాకు నీ యయిదుదినము లయిదేండ్లతో సాటిగా నున్నవి. ఆ రామునే తలఁచుచుండు నా మనమున శోకము నదులప్రవాహముచే సముద్రజలము వృద్ధినొందునట్లు, దినదినమునకు వృద్ధిఁజెందుచున్నది." అని కౌసల్య దశరథనృపాలునితో మాటాడుచుండఁగా, సూర్యుఁ డస్తమించెను. రేయియు నాసన్నమయ్యెను. అట్లు కౌసల్య మంచిమాటలచే బుజ్జగించుచుండఁగా, నృపాలుఁడు శోకాక్రాంతుఁడై నిద్దురచెందెను.

## 63-వ సర్గము

దశరథుఁడు తన పుత్రశోకమునకుఁ గారణము చెప్పుట

అంత కొంతసేపటికి మేల్కాంచి, దుఃఖముచేఁ గొట్టుపడిన మానసముగలవాఁడై యున్న ఇంద్రసమానుఁ డగు నా దశరథనృపాలుఁడు, సూర్యుఁడు రాహువుచే మ్రింగఁబడునట్లు చింతచే మ్రింగఁబడినవాఁడై రాముఁ డడవి కేఁగిన యాఱవనాటి నడురేయిని శ్రీ రాముఁడు లరణ్యమున కేఁగుటకుఁ గారణమయిన తన పాపకర్మమును దలఁచి మిగులవగచి యా పాపకర్మమును పుత్రశోకముచే నొచ్చియున్న కౌసల్యకుఁ జెప్పఁదలఁచినవాఁడయి యామెతో నిట్లనియె. "ఓ మంగళస్వరూపురాలా! లోకమున మానవుఁడు శుభమునేకాని అశుభమునేకాని తా నాచరించిన కార్యమునకుఁ దగినఫలమును బొందుచున్నాఁడు. ఎవఁడు కార్యము

లారంభించునపుడు కార్యముల గొప్పకొంచెములను, గుణదోషములను నెఱుఁగఁడో, వాఁడు మూర్ఖుఁ డనఁబడును. ఏ మనుష్యుఁ డెఱ్ఱగాను నందముగాను నుండు మోదుగుపూవును జూచి, దానియొక్క పండ్లను ఆలాగే గొప్పవిగా నుండునని తలఁచి, పండ్లు కావలెననికోరి, చిన్న చిన్న పూవులుగల మామిడిచెట్లు చిన్న చిన్న పండ్లనే పండునేమో కనుక నివి మన కక్కఱలేదని యెంచి, మామిడితోఁపును నఱికి, మోదుగుచెట్లకే నీళ్లుపోసి పెంచుచున్నాఁడో, వాఁడు పండ్లకాలమున మోదుగుచెట్ల నుండి తా పండ్లను బొందక విచారపడును. కావున ఫలమును గనుఁగొనక యెవఁడు కర్మనే యనుసరించుచున్నాఁడో, వాఁడు మోదుగుచెట్లను బెంచినవానికైవడి ఫలసిద్ధి యగు సమయమున నా ఫలంబు నొందక విచారపడును. నేనుకూడ నిప్పు డాచందమున నే. మామిడితోఁపును నఱికి, మోదుగుచెట్లను బెంచితిని. ఫల మనుభవింపవలసి వచ్చినప్పుడు మూర్ఖుఁడనై రామునిఁ బాసి చింతిల్లుచున్నాను. నేను ప్రాయమున మృగములను వేఁటాడునప్పుడు మృగములఁ జూచి వేఁటాడక, వాని చప్పుడు గనిపెట్టి గుఱిపెట్టి మృగములపై బాణము లేసి చంపుచుంటిని. ఆ కారణముచేతనే నే నీపాపము నొడిగట్టుకొంటిని. కౌసల్యా, నేను పడుచుఁదనమున నున్నపుడు "ఈ పడుచువాఁడు చప్పుడుగనిపెట్టి బాణము నేయఁగలవాఁ"డని ప్రసిద్ధిఁ జెందియుంటిని. ఆ యహంకారము చేతనే నే నీ పాపకర్మముఁ జేసితిని. దేవీ, మూర్ఖుఁడు విషమును విష మని తెలియక మ్రింగినట్లు నేనును ఈ దుఃఖమును స్వయముగానే తెచ్చికొంటిని. విషము మ్రింగినవాఁడు పడునవస్థ నేనును బొందవలసి నదే. ఒకానొకఁడు మోదుగుపూవులను జూచి, వానిపండ్లును గొప్పవిగా నుండునని తలఁచి వానిని బోషించి, పండ్లయెడనుఁ దన కోర్కికిఁ దగిన ఫలములను బొందక విచారపడునట్లే నేనును శబ్దవేధిత్వమువలనఁ గీర్తిఁ బడసి, దాని ఫలమును గొప్పదిగనే యుండునని భ్రమసి కడపట నిట్టి ఫలమును బొందితిని. ఆ కథను నీకు విస్తరించి చెప్పెదను వినుము: దేవీ, నిన్ను నే నప్పటికిఁ బెండ్లాడ లేదు. నే నప్పుడు యువరాజునుగ నుంటిని. ఒకప్పు డట్టిసమయమున మదమును, కామమును హెచ్చఁ జేయు వర్షాకాలము వచ్చెను. సూర్యుఁడును గ్రీష్మర్తువునందు ద్రవ

ద్రవ్యములనెల్లఁ బీల్చి, పుడమినంతయుఁ దపింపఁజేసి, దక్షిణదిశ కేఁగు దెంచెను (ఉత్తరాయణముపోయి దక్షిణాయనము వచ్చెను). వెంటనే వేఁడిమి చల్లాఱెను. మేఘములు నల్లగాఁ గనఁబడినవి. కప్పలు, చాతకములు, నెమళ్లు అన్నియు సంతసముతోఁ గూయసాగినవి. పక్షులన్నియు ఱెక్కల మీఁదిభాగములు తడియుటచే స్నానముచేసినవాని వలెఁ గనఁబడుచు, వానగాలిచే నల్లలాడుచుండు చెట్లకొన కొమ్మలకు మిక్కిలి ప్రయాసముతోఁ జేరినవి. పైనఁబడినదియు, పడుచున్నదియైన నీటిచేఁ దడిసినదియు మదించిన యేనుఁగులుగలదియు నగు పర్వతమున సముద్రముభంగిఁ జూపఱకుఁ గన్పట్టుచుండెను. కొండ చఱియలనుండి పాఱు సెలయేళ్ల ప్రవాహములు స్వయముగా నిర్మలములయియున్నను, గైరికాది ధాతువుల (కావిరాళ్ళ) చేరికవలనఁ గొన్నిచోట్లఁ దెల్లఁగను, మఱికొన్నిచోట్ల నెఱ్ఱఁగనునై కార్చిచ్చుయొక్క బూదితోఁ గలిసి, పాములవలె వంకరలుగాఁ బాఱుచుండినవి. ఆ వర్షర్తువునందుఁ బ్రవాహములు నిర్మలములయినను, వాన కురియుటచేఁ గలఁకపాఱిన యెఱ్ఱని నీరుగలవై మెట్టులందుఁగూడఁ బ్రవహించుచుండెను. అట్టి కడు సంతోషప్రదమయిన యీ వర్షర్తువునందు ధనుర్బాణములను ధరించి, రథారూఢుండనై, సరయూనదీతీరమునకుఁ జని, యింద్రియాశవలన నచ్చటి మడుగులలో రాత్రులందు నీరు ద్రావవచ్చు నడవి దున్ననుగాని, మదపుటేనుఁగునుగాని, తక్కిన భయంకరమగు నే మృగమునుగాని చంపఁగోరి, విల్లెక్కుపెట్టికొని, యవి వచ్చెడి రేవులకుఁ జేరువనే మఱుగున నుంటిని. అప్పుడు నేనును తీరమునకు వచ్చిన యొక మృగము యొక్క చప్పుడు గనిపెట్టి, యా మృగమును మఱియొక్క క్రూరమృగమును జంపితిని. పిదపఁ గంటికిఁ దెలియనంత కటికి చీఁకటియం దొక మునిపుత్త్రుఁడు కుండను నీటియందు ముంచుచుండఁగాఁ గలిగిన బుడ బుడ శబ్దమును బృంహితముచేయుచుండు నడవియేనుఁగుయొక్క చప్పుడని భ్రమసి, కోఱలలో విషముగల కృష్ణసర్పమువలె మండుచున్న బాణమునెత్తి, యేవైపునుండి చప్పుడు వినవచ్చెనో, యావైపున నేనుఁ గున్నదని యెంచి గుఱిపెట్టి యా బాణము నేసితిని. బాణమును విడిచితినో లేదో, అంతలోపలనే యచ్చటనుండిన యొక మునిపుత్త్రున

కా బాణముదెబ్బ యాయువుఁబట్టునఁ దగులుటచే నా మునిపుత్త్రుఁడు నీటిలోఁ బడుచు "నయ్యయ్యో" యని బిగ్గఱగాఁ గేకవేసి, "వల్కలధారులమగు మావంటి మునులపై నీ బాణము వచ్చిపడినది, మే మెవ్వరిజోలికిఁ బోవువారము కామే? నేను ఈ కుండతో నీళ్లు ముంచుకొనిపోవుటకై యీ రేవున నొక్కరుండ రని యిచ్చటి కేతెంచితిని. ఎవ్వఁడు నన్ను బాణముతోఁ గొట్టెను? ఎవనికి నేనేమి యపకారము నేసితిని? జీవహింసను మాని, జితేంద్రియుండనై వనమునందలి కందమూలఫలములను దినుచుఁ దపము నేయుచుండు నావంటివాని నెవ్వఁడు బాణములవాతఁ బెట్టునట్లు దండన విధించును? జడలను దాల్చి, నారబట్టలను గట్టి కృష్ణాజినము గప్పుకొని తపస్సు చేయుచుండు మునిపుత్త్రుఁడనైన నన్నుఁ జంపి యతఁ డేమి కార్యము సాధింపఁగలఁడు? నే నతని కేమి యపకృతి నొనర్చితిని? ఎవ్వఁ డిట్లు తనకు నితరులకును జేటుమాత్రమే తెచ్చెడి యీ పనికిమాలిన పనిని జేసెను? ఇట్టి పాపకృత్యముఁ జేసినవాని నెవనినైనను గురుపత్నీ సంగమము చేసినవానింబోలె జనులు లెక్కపెట్టరు. నేను నా ప్రాణములను గోల్పోయినందు కంతగా దుఃఖింపను. అయినను, నా తల్లిదండ్రులు కడువృద్ధులు. కన్నులు లేనివారు. వారికి నే నొక్కఁడనే పుత్త్రుఁడను. నేను వారిని బహుశ్రద్ధతో నింతకాలము గాపాడితిని. నా ప్రాణములు పోయినవెనుక ముసలులగు నా తల్లిదండ్రుల నెవ్వఁడు కాపాడఁగలఁడు? వా రేగతిని బోవుదురు? ఎవఁ డా మూర్ఖుఁడు? నన్నును, మా తల్లిదండ్రులను నెవఁడో మూఢుఁడు కఠినుఁ డొక్క బాణముచేఁ జంపెను." అను మాట వినవచ్చెను. నేను ధర్మమునందే కోర్కిగలవాఁడ నగుటం జేసి, యాదీనవాక్యములు వినినమాత్రముననే, నా చేతినుండి బాణముతోఁగూడ విల్లు తనంత జాఱి క్రిందఁబడెను. ఆ ప్రకారము రేయియం దానదీతీరముననుండి యేడ్చుచున్న యామునికుమారుని యొక్క రోదనధ్వనిని విని, దుఃఖాతిశయముచే మిగులఁ దత్తరపడుచు స్మృతిదప్పి పడియుంటిని. పిమ్మటఁ గొంతసేపటికి మూర్ఛనుండి తెప్పిఱిల్లి, ధైర్యసంతోషములు లేమిచే మనస్సు చెడినవాఁడనై నేను రేవును సమీపించి, నా బాణముచేఁ గొట్టఁబడి, విఱియఁబాఱిన జడలును, దొరలిన నీటికుండయును, ధూళిబ్రుంగి

నెత్తుటఁదడిసిన శరీరమునుగలవాఁడయి ములికి గ్రుచ్చుకొనియుండు టచే నొప్పితో నేలమీఁదఁబడి పొరలుచున్న మునిపుత్రునిఁ జూచితిని. అతఁడును, భయముచే మనస్స్వాస్థ్యములేకయున్న నన్నుఁ దన తపో మహిమచే దహించువానివలెఁ జూచుచుఁ జూడ్కి నిగిడించి, నాతో నిట్లనెను. "ఓ నృపాలా! నే నరణ్యవాసిని. నేను నాతండ్రికి నుదకముఁ గొనిపోవ వచ్చితిని. నిరపరాధుఁడ నయిన నన్ను బాణముతో నేసితివి. నేను నీకేమి యెగ్గుసేసితిని? ఒక బాణముచే నన్నాయపుఁబట్టునఁగొట్టి, నన్నును, ఆదరువులేని నాతల్లిదండ్రులను జంపితివి. నా తల్లిదండ్రులు ముసలివారు; దుర్బలులు; గ్రుడ్డివారు, కావున వారు మిగుల దప్పిగొని యున్నారు, నేను నీళ్లుదెచ్చి యిత్తునన్న వాంఛతో నారాక కెదురు చూచుచు నోర్వరానిదప్పిక నెట్లోర్చియుండఁగలరు. నేను చేసిన గొప్ప తపస్సునకును, నేఁ జదివిన చదువునకును నేమి యుపయోగము? నా తండ్రి నే నిచ్చటఁ బడియుండుస్థితి తెలియఁజాలఁడు. ఒకవేళఁ దెలిసి నను, నడువను శక్తిలేని నాతండ్రి, పెనుగాలి వీచుటచే విఱిగిపడుచుండు చెట్టునకుఁ బొరుగున నున్న వృక్షమేమియు తోడ్పాటుఁజేయఁజాల నట్లు, నాకేమి తోడ్పాటుచేయఁగలఁడు? ఓ రాఘవా, నీవె నా తండ్రి కడకు వేగ నేగి, యీ విచారవార్తను చెప్పిరమ్ము. రగులుకొనిన యగ్నిహోత్రుఁడు వనముదహించునట్లు, నాతండ్రి యలిగినవాఁడై నీకుఁ గీడొనరింపఁడుగాక! నృపాలా! మాతండ్రియాశ్రమమున కీకాలిత్రోవఁ బోవచ్చును. నీ వచ్చటికేగి మాతండ్రిని బ్రార్థింపుము. ఆతఁ డాగ్రహ పడి నిన్ను శపింపకుండుఁగాక! అట్లు నీ వచ్చటికిఁబోయి, యాతనిని బ్రార్థింపవేని, యతఁ డాగ్రహమొంది శాపమొసఁగును. ఓ నృపాలా! నీటివెల్లువ యెత్తయిన యిసుకదొడ్డును గరఁగించునట్లు ఈ వాఁడి యైన బాణము నా ఱొమ్మున నాఁటికొని, నన్ను మిక్కిలి బాధించు చున్నది. నా మర్మములందు గ్రుచ్చుకొన్న యీ బాణము వెలికి వేయుము." అని యా మునికుమారుఁడు చెప్పఁగా, నేనును, "బాణము వెలికివేయకున్న నీ మునిపుత్రుఁడు బాధపడుచునుండుననియు, బాణము వెలికివేసిన, మృతినొందు" ననియుఁ దలఁచి, బాణము నూడఁబెఱుకు విషయమునఁ గొంచెము విచారము నొందియుంటిని,

దుఃఖముగలవాఁడనై, ధైర్యము మాని, "బాణము పెఱికివేయకున్న, మునిపుత్రుఁడు బాధపడును. బాణము పెఱికివేసినఁ బ్రాణవియోగము నొందును. నాకు బ్రహ్మహత్యాదోషము వాటిల్లు"నని యెట్లు చేయుట కును దోఁపక యోచించుచున్న నా తలంపును దెలిసికొన్నవాఁడై, యవయవములను బొరలించుచు, నేలపైఁ బొరలుచు, సొక్కి సోలుచు, నంతము సమీపించినవాఁడయి, నన్నుఁ జూచి "ఓ రాజా! శోకము మాని ధైర్యము నవలంబింపుము. నేనును మనసున ధైర్యముఁ బూనె దను. బ్రహ్మహత్య సంభవించు ననెడు భయము విడిచి, నా ఱొమ్ము నుండి యీ బాణము నూడఁదీయుము. నేను ద్విజన్ముండను గాను; నేను శూద్రయోనియందు వైశ్యునకుఁ బుట్టినవాఁడను. కావున నీ కా మెర మెర యక్కఱలేదు." అని కష్టముతోఁ జెప్పుచు, మర్మస్థానమున బాణము నాటుకొనుటచేత నయిన యారాటమున నిటటు తిరుగుచు నొక ప్పుడు చెయువులుమాని, మఱొక్కపుడు నేలపైఁ బొరలుచు, వే ఱొకప్పుడు దేహమును సంకోచపఱచుచున్న మునిపుత్రుని ఱొమ్ము నుండి బాణము నూడఁబెఱికితిని. ఆ తపోధనుఁడగు మునిపుత్రుఁడు నన్నుఁ దలయెత్తిచూచి మిక్కిలి భయపడి ప్రాణములను విడిచెను. అట్లు సరయూనదియందుఁబడి, దేహమంతయుఁ దడిసి, మిక్కిలి యేడ్చి కష్టముచే నిట్టూర్పులు విడుచుచున్న యా మునిపుత్రునిఁజూచి, నేనును మిక్కిలి విచారమునొందినవాఁడ నైతిని." అని దశరథుఁడు కౌసల్యా దేవితోఁ జెప్పెను.

## 64-వ సర్గము.

### దశరథుఁడు పుత్రశోకముతో మృతినొందుట

ధర్మాత్ముఁడగు దశరథుఁ డక్రమముగాఁ దాఁ జేసిన యా ముని పుత్రుని హత్యనుగూర్చి విలపించుచు, కౌసల్యాదేవితో నిట్లనియెను. "ఓ దేవీ! నేను దెలియక మహాపాతక మొనర్చినందుకై పశ్చాత్తాపపడుచు నింద్రియస్వాస్థ్యముఁ దప్పి, "అప్పుడేమి చేసిన మేలు గలుగు" నని యొక్కఁడనే యోజించితిని. పిదప మంచి నీటితో నిండిన యాకలశముఁ గైకొని, మునిపుత్రుఁడు చెప్పిన కాలిత్రోవనే పోయి, యా యాశ్రమ

మును జేరి, యచ్చట బలహీనులును, గ్రుడ్డివారును, ముసలివారును, అండలేనివారును నై నందున రెక్కలూడ్చిన పక్షులవలె నొక్కచోటఁ గూర్చున్నవారును, అడుగుపెట్టక తమ కుమారునిఁ గూర్చిన సంగతులనే మాటాడుకొనుచున్నవారును, నా మూలమున నా పుత్ర విషయకమగు నాశ లేనివారును, దిక్కులేనివారివలె నూరకున్నవారును నగు నా ముని పుత్రునితల్లిదండ్రులను జూచితిని. ఆ యాశ్రమమునకుఁ బోయిన వెంటనే అన్యాయ్యముగా మునిపుత్రునిఁ జంపితి నను దుఃఖముచే మనమునఁ గుందుచు నమ్ముని తల్లిదండ్రు లేరుందురో యని దిగులుపడి, మఱింత దుఃఖము నొందితిని. అప్పుడు ముదుసలియగు నమ్ముని నా యడుగుల చప్పుడు వినినంతనే నన్నుఁ దన పుత్రునిగా నెంచి, "ఓరీ నాయనా! యేల యింతతడవు సేసితివి? వేగిరముగ నీటిని దెచ్చియిమ్ము. నీవు నీటిలో నాడుచు నిట్లాలసించితివని తలఁచెదను. ఇదిగో! నీ తల్లి నిన్నుఁజూడ దహతహపడుచున్నది. వేగిరముగ నాశ్రమములోనికిఁ బ్రవేశింపుము. ఓ పుత్రుఁడా! నేనుగాని, తల్లికాని యేదియైన నీ కప్రియమొనరించినను, నీవు దపస్సంపన్నుఁడవు గావున దానిని మనమున నిడికొనకుము. గతిలేనివార మగు మాకు నీవే గతివి. కన్నులు లేని వారమగు మాకు నీవే కన్నులు. మా ప్రాణములు నీయందే నిలిచి యున్నవి. నీవు మాతో నేల మాటలాడకున్నావు" అని యనెను. ఆ మాటలు విని, తొట్రుపడుచున్నదియు, స్పష్టముగానిదియు, అక్షరములు చక్కఁగా వినఁబడనిదియునైన వాక్కుతోఁగూడి, మీఁదు మిక్కిలి వెఱచి, మనస్సున గలిగిన భీతిని, మాటలతొట్రుపాటు వ్యాపారములచే నణఁచుకొని, మునిని హెచ్చరించి "నేను దశరథుఁడను. క్షత్రియుండను. మహాత్ముఁడవగు నీయొక్క పుత్రుఁడనుగాను. నా పూర్వజన్మ పాపకర్మమువలన, సజ్జను లందఱు విని "ఛీ! ఛీ!" యనఁదగిన యీ చెప్పఁబోవు దుఃఖము నాకు సంప్రాప్తమయినది. ఓ మహాత్మా! నీరు త్రాగవచ్చిన ఘాతుక మృగమునుగాని, యేనుఁగునుగాని చంపఁగోరి విల్లు చేతఁగొని సరయూనది యొడ్డున కేతెంచితిని. అంత నీటియందుఁ గుండను ముంచుచుండఁగా బుడబుడయను నొక చప్పుడు వినవచ్చెను. ఆ శబ్దము నీరు ద్రావుచున్న యడవియేనుఁగుయొక్క శబ్ద మని

తలఁచి బాణముసేసితిని. అంత నదీతీరమునకు వచ్చిచూడఁగా, నే నేసిన బాణము గ్రుచ్చుకొనుటచేఁ బ్రాణములు పోయినట్లు నేలపై కొఱఁగి యున్న ఋషిపుత్త్రునిఁజూచితిని. ఓ మహాత్మా! శబ్దముఁగని పెట్టి, యేనుఁగని యెంచి, దానిం జంపఁగోరి బాణము నేయఁగా, నది మీపుత్త్రునికిఁ దగిలి నది. అంతట నేను దాపునకుఁబోయి చూచితిని, అతఁడు బాణపాతమున కోర్వఁజాలక, "ఓ రాజా! నా యొమ్మున గ్రుచ్చుకొన్న బాణము నూడఁ బెఱుకు"మని నన్నడిగెను. అట్లు నే నా బాణము నూడఁబెఱుకఁగా, నతఁడు, "అయ్యో! నా తల్లిదండ్రులు గ్రుడ్డివారు, ముసలివారు. ఇఁక వారికి దిక్కెవరు? అనుచు చెప్పి ప్రాణములఁ దొఱఁగెను. నేను తెలియక మీ పుత్త్రునిఁ జంపితిని. ఇఁక మీరు నన్ను గ్రహించి, యేమి చేయవలయునో యానతిండు" అని యమ్మహామునితోఁ జెప్పితిని. ఓ కౌసల్యా, మహాత్ముఁడును, తేజస్సుగలవాఁడునయిన యమ్మునీంద్రుఁడు నేఁ జెప్పిన వ్యసనకరములు క్రూరములునయిన పలుకులు విని, యత్యాగ్రహము నాఁపుకొనఁజాలక, కండ్లనిండఁ గన్నీరుపెట్టికొని, దుఃఖముచేఁ గృశించి, వేఁడి నిట్టూర్పు విడుచుచు, చేతులు గట్టికొని, యడఁకువతో నిలఁబడియున్న నన్నుఁ జూచి, "ఓ నృపాలా! నీవు చేసిన యీదారుణ కృత్యమును నీవై చెప్పక, యిఁక నే తీరుననైనను దెలిసియుండునేని, నీ శిరము వెంటనే లక్షతునుకలుగాఁ జీలియుండును. ఓ రాజా! క్షత్త్రియుఁ డెవరినిఁగాని, అందును వానప్రస్థుని బుద్ధిపూర్వకముగాఁ జంపియుండునేని, అతఁడు దేవేంద్రుఁడయినను రాజ్యభ్రష్టుఁ డగును. తపస్సుచేయుచు బ్రహ్మచర్యవ్రతంబు సలుపుచున్న యట్టి మునిపైఁ దెలిసి, బాణము వేయువానితల యేడువ్రక్కలై యుండును. నీవు తెలియక, యీ కార్యము చేసినదానినిబట్టియే ప్రాణములతో నున్నావు. లేనియెడల, ఇక్ష్వాకువంశమే నశించి యుండును. అట్లుండ నీవు నశించిపోయి యుందువని వేఱుగఁ జెప్పవలయునా? ఓ నృపాలా! మమ్మిరువుర నచ్చటికిఁ గొనిపొమ్ము. నెత్తుటిచే నొడలంతయుఁ దడిసి, కట్టుకొన్న నారబట్టయుఁ గప్పుకొన్న కృష్ణాజినమును దొలఁగిపోయి, నేలపైఁ బడి, నిర్జీవుఁడై యముని కధీనుఁడయియున్న యా నా కొమరుని గడపటితడవ చూడఁగోరెదము" అని నన్నడిగిరి. అట్లే నేనొక్కఁ

డనే మిక్కిలి దుఃఖపడుచున్న వారి నిరువుర నచ్చటికిఁ గొనిపోయి వారి కొమరుని దేహమును దాఁకించితిని. వారిరువురును దమపుత్రుని కళేబరము దగ్గఱఁ జేరి చేతులతోఁ దడవి, యా కళేబరము పైఁబడి యేడ్వ సాగిరి. అప్పుడు తండ్రి తన కొడుకుఁగూర్చి యిట్లు దుఃఖపడఁదొడఁ గెను. "ఓ నాయనా! నీ విప్పటివలె నన్ను నమస్కరింప వేమి? ఏల నన్నుఁ బలుకరింపవు? ఏల నేలపైఁ బడియున్నావు? ఏమి మాపైఁ గోపగించుకొంటివా? ఓ ధార్మికుఁడా, నేను నీ కంత ప్రియుఁడనుగా నేని, కొడుకా! తల్లిని జూడుము. ఏల నన్నుఁ గౌఁగిలింపవు? ఇంపు గులుకు మాటలు పలుకుము. ఇఁక నపరరాత్రమున నెవ్వరు వేదాధ్యయనము, ఇతరశాస్త్రపఠనము చేయఁగా నా మధుర ధ్వనిని వినఁగలను? నాయనా! నీవు స్నానము చేసి, సంధ్యావంద నము నాచరించి, ఔపాసనము చేసి యయిన వెంటనే, దాపునఁ గూర్చుండి యుపచరించుచుందువే. ఇఁకఁ బుత్రశోకము చేఁ బీడింపఁ బడుచున్న నా కెవఁడు శుశ్రూష చేయఁగలఁడు? ఓ నాయనా! యిఁక నేను స్నానాద్యనుష్ఠానములఁ జేయలేను. నాకడ నీవారాది ధాన్యములు చేర్చి పెట్టినవి లేవు. నీ వుండఁగా నా కన్నియు జరుగు చుండినవి. ఇఁక మీఁదట, ప్రియుఁడయిన యతిథికిఁ బెట్టినట్లు, నా కెవ్వఁడు గడ్డలను, దుంపలను, పండ్లను దెచ్చి, ప్రేమతోఁ బెట్టును? గ్రుడ్డిది, ముస లిది, దుఃఖించినది, పుత్రునిపై నెక్కువ మక్కువగలది యగు నీ తల్లిని నే నెట్లు పోషింపఁగలను? ఓరీ కొడుకా! నీవు యమపురికిఁ బోవలదు, ఇక్కడనే యుండుము. రేపు నీతల్లియు నేనును వచ్చెదము. మాతోఁ గూడ రేపు పోవచ్చును. మే మిరువురమును పుత్రశోకము చేఁ బీడింపఁ బడినవారము, అనాథులము! దీనులమునై యీ యడవియందు నిన్నుఁ బాసి యుండఁజాలము గాన, మేమును వేగిరమే నీతోడ యమసదన మునకు వత్తుము. అంతట నేను యమునిఁ జూచి, "ధర్మరాజా! ఈతఁడు తల్లిదండ్రులకు శుశ్రూషలు చేయవలయు. నన్ను మన్నించి యితని బ్రతి కింపుము." అని నేను బ్రార్థించెదను. కీర్తిమంతుఁడును, ధర్మాత్ముఁడును, లోకపాలుఁడునైన యముఁ డందఱికి నభయం బొసఁగువాఁడు గావున నా యొక్క యిట్టి దురవస్థనుజూచి, నాశము లేని యీయొక్క యీయభయ

దానముఁ జేయును. ఈ పాపాత్ముఁడయిన దశరథుఁడు నిన్నుఁ జంపుటచే నీ పాపములు దొలఁగిపోయినవి. శస్త్రయుద్ధముచేయువారి కే లోకములు గలుగునో, ఆ లోకములు నీకు నాసత్యబలమువలనఁ గలుగును. సంగరమున మఱలని శూరులై యుద్ధములందు శత్రువుల నెదిరించి, శత్రువులచేఁ జంపఁబడిన వీరు లేపుణ్యలోకములఁ బొందుదురో, ఆ యుత్తమ లోకములను నీవును బొందుదువు. సగరుఁడు, శైబ్యుఁడు, దిలీపుఁడు, జనమేజయుఁడు, నహుషుఁడు, దుందుమారుఁడు పొందిన లోకములను నీవును బొందుదువు. సజ్జనుల కందఱకు నేది గతియో, నిరతాధ్యయనమువలనను, దపస్సువలనను నేది గతియో, భూదానమొనర్చువానికి, నిరతాగ్నిహోత్రపరునికి ఒకతెనే భార్యనుగాఁ గలిగి యుండువానికి, వేయిగోవులను దానముచేయువానికి, తల్లిదండ్రులు మొదలగువారిం బోషించువానికి ప్రాయోపవేశము చేయువానికి నేది గతియో, ఆ గతి నీకును గలుగును. ఈ మనకులమునఁబుట్టినవాఁ డెవ్వఁడయినను దుర్గతినొందఁడు. నా పుత్రుఁడవయిన నిన్నెవఁడు చంపెనో, వాఁడు హీనగతిం బొందును" అని యివ్విధమున నమ్మునివర్యుఁడు కడు దీనముగాఁ బలుమాఱు రోదనముసేసి, యావల భార్యాసమేతుఁడై, యతనికిఁ దర్పణాదులగు నంత్యకృత్యములనెల్ల జరిపించెను. అంత నా మునిపుత్రుఁడు తన పుణ్యకర్మలచే దివ్యరూపము ధరించి దేవేంద్రునితోడ వేగిరంబుగ స్వర్గమునొందెను. అట్లు పోవునపుడు ముని పుత్రుఁడును దేవేంద్రునితోఁ గూడ ముదుసలులగు తల్లిదండ్రుల నూఱడించి "ఓ తల్లిదండ్రులారా! మీకు శుశ్రూష లొనర్చుటచే నే నుత్తమలోకముఁ బొందితిని. మీరును శీఘ్రముగా నాయొద్దకు వచ్చి చేరఁగలరు" అని యిట్లు సెప్పి, సుందరమైన దివ్యవిమానమునఁ గూర్చుండి స్వర్గమునకుఁ బోయెను. ఆ తాపసుఁడును, భార్యాసమేతుఁడై, కొమరునకు జలతర్పణాదులెల్ల ముగించి, చేతులు గట్టుకొని నిలఁబడియున్న నాతో నిట్లనియె. "ఓ నృపాలా! ఏకపుత్రకుఁడనయిన నా కొడుకును జంపి, నన్ను నపుత్రకునిఁ జేసితివిగదా! నన్నును నీ విప్పుడె సంహరింపుము. నేను మరణమునకై వ్యసనపడను. ఇఁక నా బ్రతు కేల? ఓ రాజా! నీవు తెలియక నిరపరాధుఁడయిన నా పుత్రునిఁ జంపి, నాకుఁ

బీరనిపుత్రశోకమనెడి మహాదుఃఖముఁ దెచ్చి పెట్టితివి; కావున నేనును నీకు మిగుల భయంకరము అత్యంతము దుఃఖకరమునగు శాపము నిచ్చెదను. ఓ రాజా! నే నిప్పుడు పుత్రశోకము నెట్లనుభవించుచుఁ బ్రాణములు విడుచుచున్నానో, అట్లే నీవును నంతకాలమునఁ బుత్రశోకముతోడనే ప్రాణములు విడుతువు. ఓ నరాధిపా! నీవు క్షత్రియుఁడవయి తెలియక మునికుమారునిఁ జంపితివి కావున నీకు బ్రహ్మహత్యాదోషము గలుగదు. అయినను, దక్షిణయొక్క ఫలము దాతను బొందునట్లు, ప్రాణహానికరమైనదియు, భయంకరమునునైన యిట్టియవస్థ నిన్నును త్వరితముగనే బొందును" అని నాకు శాపమునొసఁగి, జాలిపుట్టునట్లు మిక్కిలి దుఃఖించి, కాష్ఠముపై నిద్దఱునెక్కి, ప్రాణములఁ దొఱఁగి స్వర్గలోకము నొందిరి.

ఓ దేవీ! శబ్దమునుగనిపెట్టి బాణము వేయునపుడు దెలియక చేసి దెచ్చుకొన్న యాశాప మిప్పుడట్లే యాలోచింపఁగా జ్ఞప్తికివచ్చెను. అపథ్యములగు వస్తువులతోఁ జేర్చి భుజించువానికి రోగమువచ్చునట్లు, నాఁడు చేసిన పాపకర్మమునకు ఫల మీదినమునఁ గలిగినది. ఓశుభాంగీ, నా కా దుష్కర్మమువలననే యా మహాముని వాక్యము తగిలినది. కావున నే నిప్పుడు పుత్రశోకముతోఁ బ్రాణములను దొఱఁగెదను. నేను నిన్నుఁ గన్నులెత్తి జూడఁజాలకున్నాను. నన్నుఁ దాఁకుము" అని చెప్పి మఱల దశరథుఁడు కౌసల్యను జూచి యిట్లనియె: ఓ దేవీ! నేను రామునివిషయమున నేమిచేసితినో, అది క్రూరుఁడనయిన నాకే తగును. రాముఁడు నావిషయమున నేమిచేసెనో, యది యారామునకే తగును. లోకమున నెవ్వఁడు చెడునడత గలవానిని నైనను గన్న కొడుకును నావలె నడవులకుఁ బంపును? ఎవఁడు రామునివలె నడవికిఁ బొమ్మనినఁ దండ్రితో విరోధము పెట్టుకొనకుండు? ఇప్పుడు రాముఁడు నన్నొకమాఱు దాఁకినను, లేక నా కన్నుల కగపడినను నాకుఁ దనివిదీఱి యుండును? మరణము నొందినపిదప మానవులు తమ బంధువులఁ జూడఁజాలరుగదా. ఓ దేవీ, నాకన్నులు మూతలుపడుచున్నవి. నీ రూపము నాకుఁ దెలియకున్నది. నాకు స్మృతియుఁ దప్పిపోవుచున్నది. ఇదిగో, యమదూతలు నన్నుఁ దొందరపెట్టుచున్నారు. నేను అవసానకాలమునందు

సత్యమయిన మగటిమిగలవాఁడును, ధర్మముల నెఱిఁగినవాఁడును నైన రామునిఁ జూడ లేకున్నానుగదా. దీనికంటె హెచ్చయిన వ్యసనము మఱొక్కటియున్నదే? ఆసాటిలేనిపనులు చేయురామునిఁ జూడమివలని శోకాగ్ని, యాతపము స్వల్పజలమును బీల్చివేయునట్లు, నాప్రాణములను మాడ్చుచున్నది. పదునేనవయేఁట వనవాసము ముగించివచ్చినపిదప మనోహరములగు కుండలములను దాల్చిన రాముని నెవరు చూడఁగలరో, వారు మానవులుగారు, దేవతలు. కమలదళములఁబోలు కన్నులు, సొగసయిన కనుబొమ్మలు, మంచి పలువరుస, చక్కనిముక్కు గలిగి చంద్రునివలె నొప్పారుచుండు రామునిమోమును వనవాసానంతరమునఁ బుణ్యాత్ములు చూడఁగలరు కాని, నావంటి పాపాత్ములకట్టి రామునిఁ జూచు నదృష్టముగలుగునే! శరత్కాల చంద్రునితోను, వికసించిన తామరపువ్వుతోను సాటియైనదియు సుగంధము గలదియు నగు రామునిమోముచూచుట పుణ్యాత్ముల కబ్బునేకాని నావంటి పాపాత్ముల కబ్బునే! వనవాసము పూర్తిచేసి, మఱల నయోధ్యకేతెంచి, స్వస్థానగతుఁడైన శుక్రునివలె దేదీప్యమానుఁడైయుండు రాముని సుఖపురుషులు చూడఁగలరు. ఓ కౌసల్యా! నాకు మనస్స్వాధీనత తప్పుచున్నట్లున్నది. నాబుద్ధి తప్పిపోవుటచేత ధ్వనికూడ వినఁబడలేదు. ఏ వస్తువు తగిలినను తెలియలేదు. రుచియుఁ దెలియకున్నది. మనసు చెదరుటవలనఁ దక్కిన యింద్రియములుగూడ, చమురులేని దీపముయొక్క కాంతులు దగ్గునట్లు తగ్గిపోవుచున్నవి. ప్రవాహవేగము ఏటిగట్టును గరఁగఁదీయునట్లు, నేను స్వయముగాఁ దెచ్చుకొన్న దుఃఖము దిక్కులేక, నెమ్మది దప్పియున్న నన్నుఁ గృశింపఁ జేయుచున్నది. అక్కటా! రాఘవా! దీర్ఘబాహువా! నాకష్టములఁ బాపువాఁడా! తండ్రిమన్ననకెక్కినవాఁడా! నాథా! ఓకొడుకా! నీ వెచ్చటనున్నాఁడవు! ఓ కౌసల్యా! ఓ సుమిత్రా! ఓసీ, కైకేయీ! క్రూరురాలా! శత్రువా! కులమును జెఱిచినదానా! నే నిదిగో ప్రాణములఁ దొఱఁగుచున్నాను" అని యివ్విధమునఁ బుత్రుని ప్రవాసమునకై, మిగులవగచుచు మిక్కిలి జాలిపుట్టుమాటలు పలుకుచు ఉదారదృష్టిగల దశరథుఁడు నడికిరేయిని బ్రాణములఁ దొఱఁగెను.

## 65.వ స ర్గ ము.

కౌసల్య మొదలగు నంతఃపురాంగనలు భర్తృమరణమునకై చింతించుట

అంత నారేయి గడవఁగా, మఱునాఁటియరుణోదయమున వందులును, మంచి యలంకారములను దాల్చిన సూతులును, మంగళవాచకులును, విశేష శాస్త్రజ్ఞానముగలవారును, గాయకులును, స్తుతిపాఠకులును వేర్వేఱుగావచ్చి తమతమ విహితకృత్యములను జేయుచు, నృపాలుఁడు కాలధర్మము నొందియున్న రాజగృహమున నుండిరి. వందులు మున్నగు వారు చేయు స్తుతులయొక్క ధ్వనులు రాజగృహమునం దెల్ల వ్యాప్తమై యుండెను. అంత సూతులు రాజు వంశావళిఁ బొగడుచు తాళములు వేయువారు, రాజుగారియొక్కయు వారిపూర్వులయొక్కయుఁ బూర్వ వృత్తాంతములను బొగడుచు తాళములు వాయించుచుండిరి. ఆ చప్పుడునకు చెట్ల కొమ్మలం దుండునవియు, పంజరములం దుండునవియు, రాజగృహమున నుండునవియునగు పక్షులు మేలుకొని మిక్కిలి కూఁతలిడినవి. ఆ సూతమాగధాదులు చెప్పు శబ్దములును, వీణలమ్రోఁతలును, వారు చేయుదీవనల ధ్వనులును, కీర్తనలధ్వనులు, ఆరాజగృహమును నిండించిన దయ్యెను. అంతట మంచి యాచారముగలవారును, శుశ్రూషలొనర్చుట యందు నేర్పరులునైన యంతఃపురపరిచారకులు మామూలు ప్రకారము వచ్చి కొల్చుచుండిరి. స్నానవిధి నెఱిఁగిన భృత్యులు సుగంధయుక్తమయిన యుదకమును నృపాలుని స్నానముకొఱకు బంగారు బిందెలతో వేళతప్పక యథావిధిగాఁ దెచ్చిపెట్టిరి. మఱికొందఱు జవరాండ్రు స్నానార్థము గావలసిన తైలమును, జిడ్డుఁ బోఁగొట్టు సంస్కార చూర్ణము మొదలగు పదార్థములను పలుదోమినపిదప నోటిని శుభ్రపఱచుకొనుటకు వలసినసువ్వుపిండి, జీలకఱ్ఱ మొదలగువస్తువులను అద్దము, వస్త్రములు, ఆభరణములు మొదలగు నలంకారసామగ్రిని గొనితెచ్చిరి. ఇట్లు రాజునగరియందున్న పరిచారికా జనులందఱు శుభలక్షణములతోఁ గూడినవారలై, తమతమ కృత్యములఁ దీర్చుకొని, సుగుణ సంపదలతో నొప్పుచుండిరి. సూర్యోదయమగువఱకుఁగూడ నృపాలుఁడు నిద్ర లేచి రాకుండుటఁ జూచి, యచ్చటిజనులందఱు నౌత్సుక్యముతో "నృపాలుని కేమి జబ్బో తెలియకున్నది" యని సందియముగలవారైరి. అంత దశరథ

నృపాలుని పాన్పునకుఁ బ్రక్కనే పరుండియున్న స్త్రీలందఱు గూడి తమ భర్తను మేలుకొలిపిరి. ఆ యుచితవృత్తిగల స్త్రీలందఱు మిక్కిలి వినయముతోను, యుక్తితోను పాన్పునందుఁ బరుండియున్న నృపాలునిఁ దాఁకి, యేమియు లేక కట్టెవలె నీల్గియుండుటను జూచిరి. వారు మొదటఁ గలయోయని భ్రమసిరి. అయినను నృపాలుఁడు చేతులుగాళ్లు గదలింపకుండుటచే, నిది నిద్రాలక్షణము గాదని యెఱింగి, నృపాలుఁడు మృతినొందినట్లున్నది యని గడగడ వణఁకుచుఁ బ్రవాహమున కెదుట నున్న గడ్డికొనవలెఁ గదలుచుండిరి. అట్లు స్త్రీలు గడగడవణఁకుచు రాజుం జూచి యేమి సంశయపడిరో, అది యట్లె స్థిరపడెను. కౌసల్యా సుమిత్రలును పరవశలై, మృతినొందినవారి కైవడి నిద్రించుచు లేవరైరి. కాంతియు, వన్నెయుఁ దఱిగి, శోకముచేఁ గృశించియున్న కౌసల్యాదేవి చీఁకటిచేఁ గప్పఁబడిన నక్షత్రముపగిదిఁ బ్రకాశింపకుండెను. రాజునకుఁ బిమ్మటఁ గౌసల్యయు, కౌసల్యకుఁ బిదప సుమిత్రయు దుఃఖించుచుఁ గన్నీటిచే నిండిన ముఖముగలవారలై, కాంతిలేక యుండిరి. అప్పు డంతఃపుర స్త్రీలందఱు నవ్విధమున నిద్రించుచున్న శుభాంగులగు కౌసల్యాసుమిత్రలఁ జూచి, దశరథుని నిద్రవోవుచునే ప్రాణములఁ దొఱఁగినట్లుగా నెంచిరి. అంత నరణ్యమున నుండు నాఁడేనుఁగులు తమమేటి యేనుఁగును బోఁగొట్టుకొని, కడు బిగ్గఱగా నేడ్చునట్లు, ఆ యుత్తమ స్త్రీలందఱు మిక్కిలి దీనముగా గొల్లున నేడ్చిరి. ఆ స్త్రీల రోదనధ్వనిని విని కౌసల్యాసుమిత్రలు వెంటనే తెలివినొంది, మేల్కాని, పార్థివుం జూచి, "యయ్యో! నాథా!" యని దుఃఖించుచు నేలఁబడిరి. ఆ కోసలరాజు కొమరితయగు కౌసల్య నేలమీఁదఁ బొఱలుచు దుమ్ముంటుకొనుటచే, నాకసమునుండి జాఱి నేలమీఁదఁబడిన నక్షత్రము కైవడిఁ బ్రకాశహీనురాలై యుండెను. నృపాలుఁడు చెయువులు దప్పి క్రిందఁబడి యుండుటఁ జూచి కొట్టఁబడిన యాఁడేనుగుంబోలియున్న యా కౌసల్యను నంతఃపుర స్త్రీలందఱు చూచిరి. అటుపిదపఁ గైకేయి మొదలగు నృపాలునిభార్య లందఱు మిక్కిలి సంతాపముతోఁ జెయువులు మాని క్రిందఁబడిరి. ఆ కైకేయి మొదలగువా రేడ్చిన యఱపులతోఁ గూడిన కౌసల్యాదుల రోదనధ్వని యా గృహమునం దంతయు నిండి

పోయెను. పూర్వము సంతోషముచే నిండియున్న యంతఃపురము దశ
రథుని మృతినొందియుండుటం జూచి, యంతట నల్లకల్లోలమయి,
ఆతురులగు జనులుగలిగి, సొంపుదఱిగి, కడు దైన్యముతోఁ గూడి, సంత
సములేనిదై యుండెను. నృపాలుని రాణులందఱు రథికశ్రేష్ఠుఁ డగు దశ
రథనృపాలుఁడు గతించినవాఁ డని యెఱింగి, యతనిచుట్టు గూర్చుండి
చేతులు తల పైకెత్తి దిక్కులేనివారివలె విశేషముగా నేడ్చుచుండిరి.

## 66-వ సర్గము

మంత్రులు దశరథుని కళేబరమును తైలభాండమున నుంచి కాపాడుట

అంత కౌసల్య చల్లాఱిన యగ్నిహోత్రునివలెను, నీరులేని సము
ద్రమువలెను, వెలుఁగులేని సూర్యునివలెను గాంతిహీనుఁడై స్వర్గలో
కము నొందిన దశరథనృపాలునిఁ జూచి, కన్నులనిండఁ గన్నీరుపెట్టికొని,
నానావిధములుగ నేడ్చుచు, నృపాలుని శిరమును దనతొడపైఁ బెట్టి
కొని, కైకేయిం జూచి, "ఓసీ చెడునడతలదానా, నీ కోరిక సఫలమైనది.
రాజును మృతినొందెను. ఇఁక నీవే, క్రూరురాలా, యేకాగ్రచిత్తురాలవై,
నిష్కంటకమయిన రాజ్యము నేలుము. నా పుత్త్రుఁడగు రాముఁడు
నన్నుఁబాసి వనమునకేగెను. భర్తయు స్వర్గలోకము నొందెను. దొంగల
భయముతోనిండిన చెడుదారియందుఁ దోడులేకుండఁ బోఁగూడనట్లు,
నేను నీచే నేలఁబడు రాజ్యమున మనఁ గోరను. తనకు దైవతమగు పెని
మిటిని బాసి యీ యన్యాయపరురాలగు కైకేయి తప్ప, మఱియెవతె
జీవించియుండఁగోరును? లోభి పేరాసచే విషముగలిసిన వంటకమును
దినుచు నందలి విషదోషము నెఱుఁగనే యెఱుఁగడు. ఈ కైకేయి గూని
దాని దుర్బోధనలకు లోఁబడి తనకొడుకునకుఁ బట్టముగట్టఁగోరి, రఘు
వంశమునకుఁ జేటుదెచ్చినది. రఘువంశమునకుఁ జేటుదెచ్చుటయేకాక,
జనకునకును దుఃఖముగలిగించినది. కైకేయి యడుగని వరముల నడిగినను,
వాని నిచ్చుటకు దశరథుఁ డొప్పుకొని, రాముని సీతతోడ నడవులకుఁ
బంపినాఁ డని విని జనకమహారాజును నావలె దుఃఖము నొందఁగలఁడు.
ధర్మిష్ఠుఁడును, కమలదళములంబోలు కన్నులుగలవాఁడు నయిన
రాముఁడు జీవించియుండియు, వనమునకుఁబోయి యుండుటచే నేను
పెనిమిటినిబాసి విధవనైతినని యెఱుఁగఁజాలఁడు. విదేహరాజు కూఁతు

రగు సీత జాలిచూపఁదగినదియు, దుఃఖము లనుభవింపఁదగనిదియు
నైనను, అరణ్యములందు దా నిడుములఁ బడుటకు మిక్కిలి వెఱచును.
జను లులికిపడునట్లు మృగములు, పక్షులు కూయుచుండఁగా విని సీత
వెఱచి, తప్పక రాముని యండకుఁ జేరుకొనఁగలదు. నిక్కము.
వృద్ధుఁడును, స్వల్పసంతతి గలవాఁడునునగు జనకుఁడు తన కూఁతురు
విపినములం దిడుమలం బడుచున్నందుకై వగలఁ బొగులుచు దేహము
విడువఁగలఁడు. నే నన్ననో, పాతివ్రత్యము ననుసరించి, యీ నా పెని
మిటిశరీరముఁ గౌఁగిలించుకొని, యగ్నిం బ్రవేశించి, యిప్పుడే తనువుఁ
దొఱఁగెదను" అని యిత్తెఱంగునఁ బలుకుచు విలపించెను. అట్లు నృప
కళేబరముఁ గౌఁగిలించుకొని మిగుల వగలపాలయి, విలపించుచున్న
తపస్వినియగు కౌసల్య నూఱడించి యావలకుఁ బంపిరి. వెనుక వసిష్ఠాది
మునులు, పుత్త్రులులేక సంస్కారము చేయఁగూడదని చెప్పుటచేత
మంత్త్రులు రాజదేహమును సంస్కరింపక, యా కళేబరము చెడకుం
డుటకై నూనె కొప్పెరయం దుంచి పదిలముగాఁ గాపాడి, తాము
సమస్తధర్మముల నెఱిఁగినవారు గావున రామలక్ష్మణులు వనముల కేగిరి
గాన భరతశత్త్రుఘ్నులకుఁ జెప్పి పంపి, వారు వచ్చునంతదాఁక యట్లె
యుంచఁగోరిరి. మంత్త్రులచే నూనెకొప్పెరయం దుంపఁబడిన రాజకళే
బరముఁ జూచి, యంతఃపురపుఁగాంత లందఱు ఆ తైలకటాహముఁ జుట్టు
కొని, కడునొచ్చినవారై యేడ్పుమోములతోఁగూడి కన్నీరువిడుచుచు,
వగలం బొగులుచు హా! మహారాజా! యెల్లప్పుడు ప్రేమతో మమ్ము నాద
రించుచు, మాటతప్పనివాఁడగు రాముని నడవులకుఁ బంపితివి. నీవును
మమ్మువిడిచి పోవుట యుక్తమా? ఇఁక మాగతియేమి? కైకేయి చెడు
తలంపుగొని, మమ్ము రామునినుండి యెడఁబాపి, పెనిమిటినిగూడఁ జంపు
కొనెను. అట్టి యా కైకేయికడ మే మనాథలమై యెట్లుండఁజాలుదుము?
శ్రీమంతుఁడగు నా రాముఁడే యెల్లప్పుడు మాకుదిక్కు. నీకును బ్రభువు.
అతఁడు మంచి మనస్సుగలవాఁడు. అట్టి రాముఁడు రాజ్యలక్ష్మిని విడిచి
యరణ్యములకుఁ బోయెను. నిన్నును రామునిఁ బాసి, దుఃఖముచేఁ
దెలివిదప్పి, కైకేయియొక్క తిరస్కారమునకు లోఁబడి, మే మెట్లు
మనఁజాలుదుము. ఏ కైకేయి, సుగుణులును, బలవంతులునగు పుత్త్ర

లను సీతను నడవికిఁ బొఱిఁదోలి, మగనిని జంపినదో, యట్టి ఘాతకురా లగు కైకేయి మాబోటి యితరులఁ దొందరపెట్టక, తలుమఁగొట్టక యుండునే" అని యివ్విధమున దశరథుని యంతఃపురాంగనలందఱు తుదిలేని శోకముతోఁ గూడి, కన్నీళ్లయందుఁ దెప్పఁ దోఁగి, సంతసము మాని, రోదనముసేయుచు నేలఁబడి పొరలుచుండిరి. అయోధ్యాపుర మున జనులు గన్నీటిప్రవాహముచేఁ దడిసినవారుగానుండిరి. కులకాంత లందఱు హాహాకారములు చేయుచుండిరి. ఇండ్లముంగిళ్లను, నాలుగు దారులు గలిగియు చోటులును పాడుపడి వెనుకటివలెఁ బ్రకాశము లేనివై యుండెను. కనుక, చంద్రుఁడులేని రాత్రివలెను, పెనిమిటిఁ బోఁగొట్టుకొన్న వనితవలెను నృపాలుండులేని యయోధ్యాపురము శోభిల్లకుండెను. ఇట్లు నరాధిపుఁడు పుత్రశోకముచే స్వర్గమున కేగఁగా, నృపాంగనలందఱు నేలపైఁబడి పొఱలుచుండఁగా, సూర్యుఁడు సంచా రంబు చాలించి యస్తంగతుఁ డాయెను. చీఁకటి నలుదెసలఁ గ్రమ్మునట్లు చేయుచు రాత్రి వచ్చెను. మంత్రులందఱు నృపాలుని దేహమునకు సంస్కారము చేయఁదలఁచియు, వసిష్ఠాది మునులందఱు పుత్రులు దగ్గరలేకుండఁగ సంస్కారము చేయఁగూడదనిరి గావున, రూపుచెడి యున్న నృపాలుని తైలభాండమునందుంచి కాపాడఁదలఁచిరి. ఆ పురంబు నందు నృపాలుఁడు స్వర్గమునకేగుటచేతను, జనులు కన్నీళ్లు పెట్టుకొని మూలమూలలలో విలపించుటచేతను నయోధ్యాపురము సూర్యుఁడు లేని యాకసమువలెను, నక్షత్రగణములులేని రాత్రివలెను జెన్నుదఱిగి యుండెను. ఆ పురమునందలి స్త్రీపురుషులందఱు నృపాలుని మరణము సంభవింపఁగా గుంపులుగూడి, వ్యసనాక్రాంతులై భరతునితల్లియగు కైకేయివలనఁగదా యింతదుఃఖము సంభవించెనని యామెను దూఱుచు, నూఱటఁబాసి యుండిరి.

## 67-వ సర్గము

### మునులు రాజును గోరుట

ఆ యయోధ్యాపురమునందలి జనులు రోదనము సేయుచుఁ గన్నీటిచే డగ్గుత్తికపడు కంఠధ్వనితోఁ గూడినవారలై యుండుటఁజేసి, యా రేయి మిక్కిలి దీర్ఘమయి యెట్టకేలకుఁ గడచెను. అట్లు రేయిగడచి

సూర్యుఁ డుదయింపఁగా, మార్కండేయ, మౌద్గల్య, వామదేవ, కాశ్యప, కాత్యాయన, గౌతమ, జాబాలులు మొదలగు కీర్తిమంతులగు ఋషులు మంత్రులతోడ సభకు వచ్చి రాజపురోహితుఁడగు వసిష్ఠమహా మునిం జూచి యిట్లనిరి. "మునీంద్రా, ఈ నృపాలుఁడు పుత్రశోకము వలన మృతినొందుటచే నీరేయి యొక్కటియే నూఱేండ్లతో సమా నముగా నుండెను. మహారాజగు దశరథుఁడు స్వర్గతుఁడయ్యెను. రాముఁడు కాననమున కేగెను. ప్రతాపశాలియగు లక్ష్మణుఁడును రాము నితోఁగూడ నరణ్యమునకు పోయెను. శత్రుసంహారులయిన భరత శత్రుఘ్నులిద్దఱు కేకయదేశమునందుఁ దాతగారి పురమగు రమ్యమగు రాజగృహమున నున్నారు. అయోధ్యాపురమునకు నిప్పుడే యిక్ష్వాకు వంశస్థులలో నొక్కనిని రాజునుగా నేర్పఱుపుఁడు. అట్లొనర్చినయెడల, రాజులేని మనదేశము మఱల రాజన్వంతమై (మంచిరాజుగలదై), నాశమునొందకుండును. రాజులేని దేశమున మబ్బు లుఱుములతోను, మెఱుపులతోను గూడి దివ్యజలము వర్షించి, దేశమునకు క్షేమముఁ గలిగింపదు, జనులు దొంగలెత్తుకొనిపోవుదురన్న భీతిచే విత్తనములు చల్లకుందురు. తండ్రికిఁ గొమరుఁడును మగనికిఁ బెండ్లామును జెప్పిన మాట వినకయుందురు, ధనము లపహరింపఁబడును. దుష్టులు పరస్త్రీల నీడ్చికొనిపోయి చెఱతురు. వీనికంటె నెక్కువభయంబుఁ గలిగించునది యొక్కటియున్నది. ఆరాజకమగు దేశమున సత్యమే నిలువదు. జనులు సంతోషహీనులై యుందురు. దుష్టులు చెఱుపుదురన్న భీతితో సభలు చేయరు. దుష్టులు నఱికివేయుదురన్న భీతితో మనోహరములగు తోఁటలు నిర్మింపరు. దొంగలు దాఁగుటకు దుర్గములుగ నుపయోగపడు నన్న భీతితో దేవగృహములను గట్టరు. బ్రాహ్మణులు శాంతులు, బ్రహ్మ జ్ఞానులు, కఠినవ్రతులునై యెల్లప్పుడు యాగముచేయు స్వభావముగల వారైయున్నను, దుష్టులు చెఱుపుదురన్న భీతితో యాగములు సలు పరు. అట్లు యాగములు సల్పినను, యాగముచేయు బ్రాహ్మణులు ధన వంతులైయున్నను దొంగలు దోఁచుకొనిపోవుదురన్న భీతితోఁ జాలి నంత దక్షిణలొసఁగరు. ప్రేరణ చేయువారు లేమింజేసి నేర్పరులగు నటులు న ర్తకు లుత్సవంబులందుఁ దమ నేర్పుఁజూపి జనులకు సంతసము

గావింపరు. రాజ్యమునకు వన్నెఁదెచ్చు కూటములును జరుగవు. క్రయ
విక్రయములవల్ల జీవించువారును, లోకవ్యవహారములు దీర్చువారును
తమపనులు చక్కఁగా జరుగమిచే సంతసముఁ బాసియుందురు.
పౌరాణికులు కథలు వినువారికిఁ గథలు చెప్పి, వారిని రంజింపఁ
జేయరు. ప్రాయపుమగువలు, దొంగలకు భయపడి బంగరుభూషణములు
ధరించి, సాయంకాలమున నాడుకొనుటకై యుద్యానవనములకుఁబోరు.
కాముకులగు పురుషులు తమ ప్రియకాంతలతోఁగూడి, వనవిహారము
నిమిత్తము వేగముగాఁ బాఱెడు వాహనములనెక్కి సవారిచేయరు.
వ్యవసాయము వలనను గోపాలనము వలనను జీవించుచు సురక్షితు
లుగనుండిన ధనికులు దొంగలవలని భీతితోఁ దలుపు తెఱచుకొని
హాయిగా నిద్రింపరు. దూర దేశములకుఁబోయి అనేక విక్రయవస్తువుల
నంగళ్లపెట్టి యమ్ము వర్తకులు దొంగల భీతిచేత మార్గములందు క్షేమ
ముగాఁ బోఁజాలరు. గంటలుగట్టినవియు, కొమ్ములుగలవియు నైన యఱు
వదియేండ్ల యేనుఁగులు రాజవీథులందు నిర్భయముగాఁ దిరుగవు. ఆయుధ
ముల నభ్యసించునపుడు, ఎల్లప్పుడు బాణప్రయోగమువలనఁ గలుగు
నల్లెత్రాటి చప్పుడు వినఁబడదు. దుష్టులు బాధింతు రన్న దిగులుచే,
మును లొంటరిగాఁదిరుగుచు జితేంద్రియులై, మనములందు భగవంతుని
గొల్చుచు నెచ్చట చీఁకటిపడిన నచ్చట బసచేయుచుఁ దిరుగుచుండఁ
జాలరు. జనులు లేనివి తెచ్చుకొనఁ జాలరు. తెచ్చుకొన్న వానిని
గాపాడుకొనఁ జాలరు. శత్రువులు దోఁచుకొని పోవుదురన్న భీతి
గలిగియుందురు. సైన్యములు చిందరవందరలై శత్రువుల నోర్వఁ
జాలవు. జనులు రథములమీఁదను, మేఁటి గుఱ్ఱములమీఁదను గూర్చుండి
వేడుకగాఁ దిరుగఁజాలరు. పండితులు వనములందును, ఉపవనములందును
శాస్త్రవిచారము చేయుచు నుండరు. నియమవంతులగు జనులు దేవతా
పూజకై పూలను, కుడుములను జేయఁజాలరు, దక్షిణల నొసఁగ
జాలరు. రాజపుత్రులు అగరు గంధము నలఁదుకొని, వసంతర్తువు
నందలి వృక్షములవలెఁ గాన్పింపరు. రాజులేనిదేశము నీరులేని యేటి
చందమునను, పచ్చికలేని యడవిచందమునను, గొల్లవాఁడులేని యావుల
వలెను గాంతిదఱిగియుండును. రథమునకు టెక్కెము గుఱుతు, పొగ

యగ్నిహోత్రునికి గుఱుతు, మనకెవ్వఁడు ధ్వజమో, ఆతఁ డివ్విధ మున స్వర్గమునొందెను. రాజులేని దేశమున జను లిది తమ వస్తువని తలఁప భయపడుదురు. మఱియు జనులు చేఁపలమాడ్కి నెల్లప్పు డొకరినొకరు పీఁకుకొని తినుచుందురు. పరువులేనివారై, పరలోకము లేదని వాదించుచు విచ్చలవిడిగాఁ దిరుగునట్టి నాస్తికులు రాజదండనము నొందినవారయినను, సజ్జనులమని తలఁచుకొనుచుందురు. శరీరము యొక్క మంచిని నేత్రములు గమనించునట్లు రాజేంద్రుఁడు స్వదేశము లందలి ధర్మార్థములను గొఱతపఱచకుండును. రాజే నరులకు సత్యము ధర్మము కులవంతులకు గొప్పకులమును. రాజే ప్రజలకుఁ దల్లియుఁ దండ్రియు హితము చేయువాఁడును. రాజు తన ప్రజాపాలన సామర్థ్య ముచే నింద్రాగ్నియమవరుణులను మిాఱఁగలఁడు. రాజు లోకమున మంచిచెడ్డ లరయక యుండునేని, యీ లోకమెల్లఁ జీఁకటి క్రమ్మి నట్లుండును. దశరథమహారాజు జీవించియుండినప్పుడును సముద్రము చెలియలికట్టను దాఁటఁ జాలనట్లు మే మందఱమును మిా మాట నతిక్ర మింపకుంటిమి. కావున నో మహాత్మా! మా క్రియను చక్కఁగా నడుపఁ గోరితేని, రాజులేని రాజ్యము అరణ్యముతో సమానమయినది కావున ఇక్ష్వాకువంశస్థుఁడైన దాతయగు నొక్కనిని తామే పట్టాభిషేకము జేయుఁడు" అని ఋషులు చెప్పిరి.

## 68-వ స ర్గ ము

వసిష్ఠుఁడు దూతలను గేకయనగరమునకుఁ బంపుట

వసిష్ఠమహాముని వారి మాటను విని, యచ్చటనున్న మిత్రులను మంత్రులను, బ్రాహ్మణులను అందఱిని జూచి "భరతుఁడు శత్రుఘ్నుని తోడఁ గేకయపురమున మేనమామ యింట సుఖముగనున్నాఁడు కావున నచ్చటికి వేగవంతములగు గుఱ్ఱములు పూన్చిన రథమెక్కి దూతలేగి, వారి నిద్దఱిని బిలుచుకొని వత్తురుగాక! దశరథుఁడు భరతునికే పట్టాభిషేకముచేయునట్లు ఏర్పాటుచేసెనుగదా. అట్లుండ మనము విచా రింపవలసిన పని యేమి యున్నది." అని చెప్పఁగా, వారందఱు "అట్లె చేయవచ్చు"నని బదులు చెప్పిరి. వసిష్ఠమహాముని వారి యా మాటను విని, "సిద్ధార్థుఁడా! విజయుఁడా! జయంతుఁడా! అశో

కుఁడా! నందనుఁడా! మీరందఱిక్కడికి రండు. మీరు చేయవల
సిన పని సెప్పెద. ఆలకింపుఁడు, మీరు వేగముఁగల గుఱ్ఱములపై
నెక్కి కూర్చుండి, రాజగృహపురమునకుఁ బోయి, దుఃఖముఁ గనఁబఱుపక,
భరతునిఁ జూచి, నా యాజ్ఞగా "యో రాజపుత్రుఁడా! తమ మంత్రు
లును, పురోహితుఁడును తమ క్షేమము విచారించి తమరు దగ్గఱనుండి
చేయవలసిన ముఖ్యకార్యమున్నది గావున వేగిరముగా రమ్మని చెప్పిరి
అని చెప్పుఁడు. మీ రెంతమాత్రము "రాముఁడు వనమున కేగె" నని
కాని, "దశరథుఁడు మృతినొందె"నని కాని, ఈ రఘువంశోపద్రవమును
మీ రెంతమాత్రము చెప్పవలదు. పట్టువస్త్రములను, శ్రేష్ఠములగు
భూషణములను గైకొని భరతునకుఁ గేకయరాజునకు దీసికొనిపోయి
రండు" అని చెప్పెను.

అంతట దూతలు దారిబత్తెములను గైకొన్నవారలయి, వడిగల
గుఱ్ఱములనెక్కి, కేకయదేశమునకుఁ బోవుచుఁ దమ భార్య బిడ్డలకు
నీ వంగతిఁ దెల్పుటకై తమతమ యిండ్లకుఁబోయి, ప్రయాణమునకు
వలసిన యితరకార్యములను దీర్చుకొని వసిష్ఠుని యాజ్ఞానుసారము గేకయ
దేశమునకుఁ బయనమైరి. ఆదూత లయోధ్యనుండి పడమటివైపుగాఁ
బోయి యపరతాలమను పర్వతముయొక్క దక్షిణపుకొనను దాఁటి, పిదప
యపరతాల ప్రలంబ పర్వతములనడుమ మాలినీ తీరమార్గమునఁ గొంత
దూర ముత్తరముగా నేగి, యా ప్రలంబపర్వతము నుత్తరమునుండి పడ
మటివైపుగాఁబోయి, హస్తినాపుర సమీపమున గంగానదినిదాఁటి, కురు
జాంగలదేశముల నడుమఁ బోవుచుఁ బాంచాలదేశమును బొంది, పడ
మటివైపుగాఁబోవుచు, పూర్ణముగా నిండిన తటాకములను, తేఁట నీళ్లు
గల నదులను జూచుచు, పని తొందరవలన నెచ్చటను నిలువక చనిరి.
అంత నిర్మల జలముగలిగి, నానావిధములగు పక్షులగుంపులతో జను
లతో నిండియున్న శరదండానదిని వేగముతో దాఁటి, యా నదిగట్టున,
దేవతావాసమై, యాచకుల కోర్కు లొసఁగుటచే సత్యోపయాచనమని
సార్థకనామము గలిగిన వృక్షమునకుఁ బ్రదక్షిణ నమస్కారములు
గావించి, కుళింగాపురిని బ్రవేశించి, అంతట నభికాలమును జేరి,
యచ్చట బోధిభవన పర్వతమునందుఁ బుట్టి ప్రవహించుచుండు

నదియు, రఘువంశమునఁ బుట్టినవారిచే ననుభవింపఁబడు గ్రామములకుఁ జేరువనున్నదియునైన యిక్షుమతీ నదినిదాఁటి, యచ్చట దోసెఁడు నీరు మాత్రమే యాహారంబుగాఁ గలవారై, తపస్సుచేయుచున్న వేదవిదులగు బ్రాహ్మణులం జూచుచు, బాహ్లీకదేశ సుదామపర్వతముల దారిని బోవుచు, విష్ణుపదమును, విపాశానదిని, ఆ నదిగట్టుననున్న శాల్మలీవృక్షమును జూచుచు నచ్చటచ్చటనున్న నదులను, కోనేళ్లను, చెఱువులను, గుంటలను, సింహవ్యాఘ్రాదులగు భీకరజంతువులను జూచుచుఁ బ్రభుశాసనముఁ జెల్లింపఁగోరి, కడుదూర మేగిరి. అంతట దీర్ఘప్రయాణముచే గుఱ్ఱములలఁతనొందినను, వారు భరతునిఁ గొనిపోయి యతనిచే దశరథునకు సంస్కారము చేయించి, యతనికిఁ దృప్తి గలిగించుటకును, రాజకులరక్షణము చేయుటకును, రాజవంశమునకుఁ గీర్తి గలుగఁజేయుటకును గోరి, యెచ్చటను నిలువక, యతివేగముగాఁ జీఁకటిపడునప్పటికి గిరివ్రజమను వేఱు పేరుగల కేకయ రాజధానియగు రాజగృహమునకు జేరిరి.

## 69-వ స ర్గ ము.

భరతుఁడు తాను దుస్స్వప్నము గనె నని చెప్పుట

దూతలు కేకయాధిపుని పురము చేరిన రాత్రియే భరతుఁడును జెడ్డకల యొక్కటిఁ గనెను. మఱునాటి యుదయముననే యాభరతుఁడా చెడుస్వప్నముఁగూర్చి తలఁచికొని, "యెవరి కేమి యపాయము సంభవించెనో" యని మనమునఁ గుందుచుండెను. అప్పుడు భరతుని మోమునందలి విన్నదనమును జూచి, యతనికిఁ బ్రియములు పలుకునాతని సరియీడువారగు చెలికాండ్రందఱు నాతని యాయాసమును బాపఁగోరి, ఇష్టగోష్ఠి ననేకకథలను జెప్పుచుండిరి. కొందఱాతని మనశ్శాంతికై వీణ మొదలగు వాద్యములను వాయించిరి; కొంద ఱాటలాడించిరి. కొందఱు నాటకములను జదివిరి. కొందఱు నానావిధ హాస్యములను జేసిరి. ఇట్లు నెచ్చెలులు ప్రియములు పలుకుచు, గోష్ఠులు సలుపుచు హాస్యములు నెఱపుచున్నను, మహాత్ముఁడగు భరతుఁడు తన విన్నదనము విడిచి సంతోషమునొందినవాఁడు కాఁడయ్యె. అప్పుడు భరతుని నెచ్చెలియగు నొకఁడు "చెలికాండ్రు నీ చుట్టు కూర్చుండి నిన్ను

వేడుకపఱచుచున్నను, నీవేల యిట్లు కుందుచున్నావు" అని యడుగఁగా, భరతుఁ డతనితో నిట్లనియె: "ఓ నెచ్చెలీ, నా కీ యధైర్యము దోఁచి నందుకుఁ గారణము సెప్పెద నాలకింపుము. నే నీరేయి యొక చెడుకల గంటిని. దానియందు మాతండ్రి మాసిన బట్టలు గట్టుకొని, తల విరియఁ బోసికొని, కంపుకొట్టుచుండు పేఁడగుంటయందుఁ గొండకొననుండిపడి, యా పేఁడగుంటయుం దీఁదుచు, దోసిలితో నూనెఁ ద్రావుచు, వెఱ్ఱివాని కైవడి మాటిమాటికి నవ్వుచు, నూవులు గలిసిన యన్నముఁ దినుచుఁ బలుమాఱు దలక్రిందుగనున్న వాఁడై యొంటికంతకుఁ దైలముఁ బూసి కొని, తైలములో మునిఁగియుండునట్లును, పిమ్మట నల్లయినుముతోఁ జేయఁబడిన పీఠమందుఁ నల్లబట్టఁ దాల్చి కూర్చుండియుండఁగా నతనిని నలుపుఁ బసుపుగలిసిన మేనిచాయగల కాంతలు చుట్టునుండి హేళనము చేయునట్లును, ధర్మాత్ముఁడగు మాతండ్రి యెఱ్ఱనిగంధ మలఁదికొని, గాడిదెలుగట్టిన రథమునఁ గూర్చుండి త్వరగా దక్షిణదిశకుఁ బోయి నట్లును, ఎఱ్ఱనిబట్టకట్టుకొని వికారమైన మోముగల నడుప్రాయపు రాక్ష సాంగన యొకతె యట్టహాసముచేయుచు నృపాలునిఁ జేయిపట్టి యీడ్చి నట్లును గలగంటిని. మఱియు సముద్రము లింకినట్లును, చంద్రుఁడు నేల మీఁదఁ బడినట్లును, లోకమంతయుఁ జీకటి గ్రమ్మియుండునట్లును, రాజు లెక్కఁదగిన యేనుఁగుయొక్క కొమ్ములు తునియలయినట్లును, మండుచున్న నిప్పు తటాలునఁ జల్లాఱినట్లును, భూమి బ్రద్దలుగాఁ జీలినట్లును, నానా విధములగు వృక్షములు నిట్టనిలువున నెండిపోవునట్లును, పర్వతము లన్నియుఁ బొడుపడి పొగరాఁజుచున్నట్లును భయంకరమయిన స్వప్న మును గంటిని. ఈ దుఃస్వప్నమునకు ఫలముగా దశరథనృపాలుఁడో, రాముఁడో, లక్ష్మణుఁడో, నేనో మృతినొందఁగలము. గాడిదలుగట్టిన రథమున నెవఁడేని గూర్చుండిపోయినట్లు స్వప్నము గంటిమేని, యా స్వప్నమునకు ఫలముగాఁ బోడుతనే నాతని చితియందుఁ బొగను జూతుము. నెచ్చెలులారా, దీనిని బట్టియే సంతోషములేక దిగులు పడి మిమ్ము హెచ్చరించుకొనకుంటిని. మఱియు నా గొంతెండుకొని పోవుచున్నది: నా మనస్సు నెమ్మదిదప్పియున్నది. భయకారణము దెలియ కున్నను మిగుల భయపడుచున్నాను. గొంతునుండి మాట వెలువడ

కున్నది. నా శరీర కాంతియుఁ దఱుఁగుచున్నది. నన్ను నేనే ఏవగించు కొనుచున్నట్లున్నాను; కారణ మెంత యోచించినను దెలియకున్నది. పలుతెఱఁగుల యీ స్వప్నమునకుఁ గారణము దెలియరాకున్నది. ఇట్టి కల నే నెన్నఁడును గనినది లేదు. రాజున కేమి యపాయము సంభవించెనో యను గొప్పదిగులు నా హృదయమునుండి తొలఁగకయున్నది" అని భరతుఁడు తన వయస్యులతోఁ జెప్పికొని విలపించుచుండెను.

## 70-వ సర్గము.

### భరతుఁ డయోధ్యకు మఱలుట

భరతుఁ డివ్విధమునఁ దన దుస్స్వప్నము రీతిం దెల్పుచుండఁగా, దాఁటరానియగడ్తగల రాజగృహపురమునకు దూతలు,గుఱ్ఱములుబడలిక నొందఁగా వచ్చి చేరి, రాచనగరునొచ్చి, కేకయరాజును మ్రొక్కి, ఆతని కొడుకగు యుధాజిత్తును సందర్శించి వారిని సేమమరసి భరతునిఁగూర్చి, "ఓ భరతా! నీ పురోహితుఁడగు వసిష్ఠమునీంద్రులు నిన్నుఁ గుశల మడిగి, త్వరగా రమ్మనియు, నీ వవశ్యముగా వచ్చి చేయవలసిన కార్య మున్నదియనియుఁ జెప్పుమనిరి. ఈ విలువగల వస్త్రములను భూషణములను గైకొనుము. వీనిలో రాజున కియ్యఁదగిన వస్త్రభూషణము లఱువదికోట్ల విలువగలవి. మేనమామ కియ్యఁదగిన వస్త్రాభరణముల యొక్క విలువ పదికోట్లు పూర్తి వెలగల యవి" అని చెప్పిరి.

అంత, బంధుజనమునందుఁ బ్రేమగలవాఁడగు భరతుఁడు దూత లొసఁగిన వస్త్రాభరణములను గైకొని, యా దూతలను సర్వకామములచే సంతృప్తులం గావించి, వారితో నిట్లనియెను. "మా తండ్రి దశరథమహారాజు క్షేమముగానున్నారా? రామలక్ష్మణు లారోగ్యవంతులై యున్నారుగదా? గొప్పవంశమునఁ బుట్టినదియు, ధర్మమునం దాసక్తి గలదియు, ధర్మముల నెఱిఁగినదియు, ధర్మమునే గ్రహించునదియునైన ధీమంతుఁడగు రామునితల్లియగు కౌసల్య క్షేమముగా నున్నదా? వీరులగు లక్ష్మణ శత్రుఘ్నుల తల్లియు, నడిమియునైన ధర్మజ్ఞురాలగు సుమిత్ర యారోగ్యము గలిగి యున్నదిగదా? తన కార్యమునందే పూనికిగలదియు, ఎల్లప్పుడు భయంకరురాలును, కోప పడునదియు, తన కేమియుఁ దెలియకున్నను నన్నియు దెలిసినట్లు తలంచునదియునైన

మాతల్లి కైకేయి యారోగ్యవతియై యున్నదిగదా! ఆమె నా కేమి సంగతిఁ జెప్పి పంపినది” అని యడిగెను.

మహాత్ముఁడగు భరతుఁ డివ్విధమున నడుగఁగా, దూతలును “నరశ్రేష్ఠా! నీ వెవ్వరెవ్వరి క్షేమమరయుచున్నావో, వారందఱు క్షేమముగనున్నారు. కమలమును జేతఁదాల్చిన (రాజ్య) లక్ష్మి ,నిన్ను వరించుచున్నది. నీవు త్వరగా తేరి నాయితపఱుప నానతిమ్ము” అని భరతునితోఁ జెప్పఁగా, భరతుఁడును దూతలతో, “నేను మా తాతగారి కడకేగి, “దూత లయోధ్యాపురమునుండి నన్నుఁ బిల్చుకొనిపోవ వచ్చి యున్నారు” అని చెప్పి వచ్చెదను” అని చెప్పి, దూతలు త్వరపఱచు చుండఁగాఁ దన తాతగారికడకుఁ బోయి, “ఓ తాతా, మా యూరి నుండి నన్నుఁ దోడ్కొనిపోవ దూతలు వచ్చియున్నారు. నేను మా తండ్రిగారికడ కేగెదను. మఱల మీ రెప్పుడు రమ్మని చెప్పిపంపిన నప్పుడు వచ్చెదను” అని తాత నడుగఁగా, కేకయనృపాలుఁడు తన మనుమఁడగు భరతుఁ జేఱి, శిరమున ముద్దాడి “నాయనా పోయి రమ్ము, నీవలననే కైకేయి సుపుత్త్రుఁడుగలది యనిపించుకొనుగాక! నీ తల్లితోను, తండ్రితోను, పురోహితునితోను, తక్కిన బ్రాహ్మణోత్తములతోను, మేటి విలుకాండ్రగు నీతోడఁబుట్టువులయిన రామలక్ష్మణులతోను మా క్షేమము సెప్పుము” అని చెప్పి, భరతునకు మేటి యేనుఁగులను, పలురంగులుగల రత్నకంబళములను, కృష్ణాజినములను, రెండువేల బంగారు వరహాలును, విస్తార ధనమును పదునాఱునూఱుల గుఱ్ఱము లను నొసఁగి, యిష్టులును, నమ్మఁదగివారును, గుణవంతులునైన యమాత్యులను దోడుగాఁ బంపెను. అంతియకాక, ఇంద్రశిరంబను పర్వతంబునఁ బుట్టినవియు, ఐరావతజాతిలోఁ జేరినవియుఁ జూడ నొంపయి యుండునవియునైన యేనుఁగులను, బరువు విశేషముగా మోయఁగల వడిగల కొన్ని ఖరములను, అంతిపురమునందే బాగుగాఁ బెరిగినవియు, పులియొక్క శౌర్యబలములంబోలు శౌర్యబలములు గలవియు, కోఱలే యాయుధములుగాఁగలవియు, గొప్పశరీరము గలవియునైన కొన్ని (వేఁట) కుక్కలను గానుకగా నొసఁగెను. తాతగా రంత ధనము నిచ్చి నను, భరతుఁడు పయనపుఁ దొందరలో వానిఁగూర్చి యెక్కువ

సంతోషపడఁ దయెన్ను. చెడుకల యొక్కటివచ్చుటచేతను, దూతలు తొందరపెట్టుచుండుటచేతను భరతుని మనముఁ గడు గొప్ప విచారము పెట్టెను, అంత జనులతోను, ఏనుఁగులతోను గుఱ్ఱములతోను గూడి యున్న తన యింటినుండి బయలుదేరి కాంతిమంతుఁడగు గొప్పబుద్ధిగల భరతుఁ డందమైన రాజవీథిని కొంతదవ్వేగి యడ్డుపెట్టఁబడక యంతః పురములోపలఁ బ్రవేశించి, తాతను మేనమామయగు యుధాజిత్తును వీడ్కొని, శత్రుఘ్నునితోడ రథమెక్కి, భృత్యు లనేకులు గుండ్రని చక్రముగల రథములపైనెక్కి, యొంటెలతోడను, గోవులతోడను, గుఱ్ఱములతోడను, సేనలతోడను వెంబడించి, కాపాడు చుండఁగా, తనతో పరివారగు మంత్రులు గూడ వచ్చుచుండఁగా నిష్కంటకుండై సిద్ధుఁ డింద్రలోకంబునుండి మఱలి వచ్చునట్లు రాజ గృహపురమునుండి బయలువెడలెను.

## 71-వ సర్గము.

### భరతుఁ డయోధ్యాపురము జేరుట

ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవాఁడును, కాంతిమంతుఁడును నైన భరతుఁడు రాజగృహపురమునుండి వెడలి, తూర్పుమొగముగా బయలు దేఱిపోవుచు సుదామానదిం జూచి దాని సొబగు నీక్షించుచు నానంద ముతో దాఁటి, యతివిశాలమగు హ్లాదినీనదినిదాఁటి, పడమటి మొగ ముగాఁ బాఱెడు పెక్కులలుగల శతద్రూనదిని, ఏలధాన మను గ్రామము సమీపమున దాఁటి, అపరపర్పటములను దేశములను జొచ్చి శిలావహా యను నదినిదాఁటి, యాగ్నేయమందున్న శల్యకర్తనమను గ్రామమును, శిలావహాయను నదిని జూచుచుఁ జైత్రరథంబుం గూర్చి పోవుచు గొప్ప పర్వతములను దాఁటెను. అంత సత్యసంధుఁడును, సదాచారసంపన్నుఁ డును, గాంతిమంతుఁడునునైన భరతుఁడు సరస్వతీనదిని గంగానదిని సమ కాలముననే దాఁటి వీరమత్స్యదేశముల కుత్తరముననుండు భారుండ మను వనమునఁ బోవుచు, వేగముతోఁ బాఱుచున్నదియు, మనస్సంతో షముఁ గలిగించునదియు, పర్వతములతోఁ జుట్టఁబడినదియునైన కులింగా నదిని, దానిపిమ్మట యమునానదిని దాఁటి, తన సేనలను కొంతతడవు విశ్రమింపఁజేసి, బడలిన గుఱ్ఱముల నేటిలో దింపి యంగములను దోఁపి

కడిగించి, యచ్చటఁ దాను స్నానము సేసి, నీరుద్రావి, మార్గమునఁ గొంతదవ్వు జలముదొఱకదు గావున గొంతజలము దీసికొని పయన మాయెను. సుందరాకారుఁడయిన రాజపుత్రుఁడగు భరతుఁడు తఱచుగా నడచుదారికాని యట్టి మహారణ్యమును భద్రజాతియందుఁ బుట్టిన యేనుఁగుమీఁద నెక్కి, వాయువు ఆకాశమునుంబోలె మఱింత వేగముతోఁగడచి, ప్రాగ్వటమను ప్రసిద్ధమయిన పట్టణమునకు దాపుననుండు వంశుధానమను గ్రామముదగ్గఱ దాఁటనలవికాని గంగానదిని కుటికోష్ఠిక యనునదిని గూడ దాఁటి, సైన్యముతోఁ గూడ ధర్మవర్ధనమను గ్రామము చేరి, యచ్చటనుండి తోరణగ్రామమునకుఁ బోయి, యచ్చటినుండి దక్షిణముగాఁ దిరిగి జంబూప్రస్థమునుబొంది, తదనంతరము వరూథగ్రామమునకుఁ జని యచ్చట మనోహరమయిన వనమునవిడిసి యటనుండి తూర్పువైపునకుఁ దిరిగి, విశేషముగాఁ గదంబవృక్షములతో నిండిన యుజ్జిహాన యనునగరమందలి యుద్యానముఁ జేరి, యటుమీఁదట స్వదేశమగుట వలన "గుఱ్ఱము లలఁతఁ దీర్చికొన్నపిమ్మట, మీరు తిన్నగారం"డని సేనల కాజ్ఞయొసఁగి, వేగముగాఁబోవు గుఱ్ఱములుగట్టిన రథమెక్కి వేగముగఁ బోవుచు, సర్వతీర్థమున బససేసి, యుత్తానికానదిని, తక్కిన యనేక నదులను పర్వతంబులందుఁ బుట్టిన గుఱ్ఱములమీఁదనెక్కి దాఁటి హస్తిపృష్ఠక గ్రామమును జేరి, యచ్చటఁ గుటికానదిని, లౌహిత్యగ్రామమునఁ గపీవతియనునదిని, ఏకసాలమున స్థాణుమతీనదిని, వినతయందు గోమతీ నదిని దాఁటి, కళింగనగరమునను్న సాలవనమునుబొంది, గుఱ్ఱములు మిక్కిలి బడలినందున నచ్చటఁ గొంతతడవు విశ్రమించి, మఱల నచ్చటి నుండి ప్రయాణమై రాత్రియెల్ల సాలవనమును వేగముగా దాఁటి, యరుణోదయకాలమున మనుచక్రవర్తిచే నిర్మితమయిన యయోధ్యా పురమును జూచెను. ఇట్లు పురుషశ్రేష్ఠుఁడయిన భరతుఁడు దారియం దేడురాత్రులు గడపి, యెనిమిదవనాటివేఁకువ నయోధ్యాపురము నెదుటఁబొడఁగాంచి సారథితో నిట్లనియె! ఓసారథీ, యీ యయోధ్య మనోహరములగు తోఁటలతోఁగూడి, యెక్కువ కీర్తిగలిగి, తెల్లని మన్నుగలదై సుగుణవంతులును, వేదములఁ దుదముట్టఁ జదివిన వారును, సోమయాజులునైన సంపన్నులగు బ్రాహ్మణులతోఁగూడి

రాజర్షి యగు దశరథునిచేఁ బాలింపఁబడుచున్నది గదా! అట్టి యీ యయోధ్యాపుర మేల యెక్కువ శోభలేనట్లుగాఁ గాన్పించుచున్నది? తొల్లి యయోధ్యాపురమున నాఁడువారును మగవారును సంతతటఁ గలకల ధ్వనులు సేయుచుందురు. ఇప్పు డా కలకల ధ్వని వినఁబడకున్నది. సాయంకాలమునఁ బురజనులు తోఁటలందు విహారములు సల్పుచుండి యలసి యచ్చటికచ్చటికిఁ బోవుచుందురు గదా! ఇప్పు డట్లుండునట్లు కానిపింపకున్నది. కాముకులు లేమిం జేసి, యీ యుద్యానములు రోదనముసేయుచున్నవో యనున ట్లున్నవి. ఈ యయోధ్య యరణ్యప్రాయముగఁ దోఁచుచున్నది. ఇచ్చట పూర్వము వలెనే యేనుగులమీఁదను, గుఱ్ఱములమీఁదను, రథములమీఁదను నెక్కి రాకపోకలు సలుపువా రెవ్వరుఁ గానరాకున్నారు. పూర్వము మదించి, సంతసముతోఁ గూయుచున్న కోకిలలు మొదలగు పక్షులతోఁ గూడి, చక్కఁగఁ జిగిరించి పూచియుండుటచేత విహారము నిమిత్తము వచ్చెడు కాముకులకు మిక్కిలి యుపయుక్తములై ప్రకాశించుచుండినవి. అట్టి యుద్యానము లిప్పు డంతటను మార్గములందు రాలిన యాకులు గలిగి యేడ్చుచున్నవో యనునట్లుండు మ్రాఁకులతోఁగూడి, దేవురించుచున్నట్లు కనఁబడుచున్నవి. ఇప్పుడు సూర్యోదయమయినను మదించినవైన మృగములును బక్షులును నవ్యక్తమధురముగను, శ్రావ్యముగను, రాగయుక్తముగను గూయుచున్న ధ్వనులు వినరాకున్నవి. చందనాగురు ధూపవాసనలతోఁగూడి సుఖకరముగ వీచు వాయు విప్పుడు పూర్వమువలె వీవకున్న దేల? మున్ను, సర్వదా భేరీమృదంగ వీణాది వాద్యములయొక్క గంభీరధ్వని యిప్పుడు వినఁబడకున్న దేమి? అనిష్టములను దెలుపునవి గనుక, మనస్సునకు నింపు గొలుపని పలుతెఱఁగులైన చెడు శకునములు కానవచ్చుచున్నవి గావున నామనము కలవరపడుచున్నది. సారథీ, నాబంధువులందఱు క్షేమముతోనున్నట్లు సకలవిధములఁ దోఁపకున్నది. అది నిశ్చయముగా నుండవచ్చును. దుఃఖహేతువు లేకున్నను నా మనసు దిగులుపడుచున్నది. అని యిట్లు సారథితోఁ జెప్పుచు దుఃఖమునొంది, మనస్సున నాయాసమును, ఇంద్రియముల వైకల్యమును బొంది, దిగజాఱి,

యిక్ష్వాకువంశమువారిచేఁ బాలింపఁబడు నయోధ్యాపురమును వైజ
యంత మను ద్వారమునఁ బ్రవేశించెను. అప్పుడు గుఱ్ఱములు మిక్కిలి
యలసియుండినవి. అట్లు వచ్చుచుండు భరతునింజూచి ద్వారపాలురు లేచి,
జయ మడిగి వెంబడివచ్చుచుండఁగా నాభరతుఁడు నిలుకడలేని మనస్సు
గలవాఁడై, ద్వారపాలురను మర్యాదచేసి, బడలికఁజెందియున్న యశ్వ
పతిమహారాజు సారథిని బిలిచి యిట్లనియె. "ఓ పాపరహితుఁడా! నే నేల
వీరిచే నిష్కారణముగాఁ బిలిపింపఁబడితిని? నా మనమున నేవియో
చెఱుపులే తోఁచుచున్నవి. నా ధైర్యస్వభావము తగ్గిపోవుచున్నది.
సారథీ, రాజులు నశించినపు డేయేలక్షణములు గాన్పించు నని పెద్దల
వలన వినియున్నానో, యాయలక్షణము లన్నియు నిచ్చట నగపడు
చున్నవి. ఇచ్చట నుండు కుటుంబులయిం డ్లూడ్వఁబడక గఱుకులు
పాఱియున్నవి. తలుపులు తెఱవఁబడియున్నవి. పూజాకర్మలు నడవ
కున్నవి. సుగంధధూపములు వేయఁబడకున్నవి. జనులందఱు భోజనము
లేక, వాడుపాఱిన మోములు గలిగియున్నారు. ఇట్లుండుటచే గృహ
ములు గాంతిదఱిగియున్నవి. దేవాలయములందుఁ బుష్పమాలికల యలం
కారములు లేకయున్నవి. ముంగిళ్లు చక్కఁగా నలుకఁబడకుండుట
చేతఁ బాడుపడియున్నందున పూర్వమువలెఁ బ్రకాశింపకున్నవి. దేవతా
పూజలును, యూపస్తంభములును, యజ్ఞసభలును లోపించియున్నవి.
పూలయంగళ్లయందుఁ బూలసరముల యమ్మకము జరుగకయున్నది.
ఇచ్చట వర్తకులు మునుపటివలెఁగాక, చింతతోఁగూడినవారలై, క్రయ
విక్రయములు నిల్పి దీనులవలెఁ గాన్పించుచున్నారు. దేవాలయము
లందును, మంటపములందును, బక్షులు గుంపులుగూడి దీనముగా రొద
చేయుచున్నవి. పురమునందలి స్త్రీపురుషు లందఱు మాసిన బట్టలను గట్టు
కొని, నయనములనిండఁ గన్నీరుపెట్టుకొని, ధైర్యమువిడిచి, చింతచేఁ
జిక్కి తహతహపడుచు నున్నట్లు తోఁచుచున్నది." అని భరతుఁడు తన
తాతగారి సారథితోఁ జెప్పుచు, నయోధ్యాపురమునందలి యా
యశుభలక్షణముల సూచుచు, జనసంచారములేని చదుకములతోను,
గృహములతోను, రాజమార్గములతోను గూడినదియు, దుమ్ముపడుటచే
నెఱ్ఱనైన ద్వారములందలి తలుపులును, ద్వారబంధములును గలదియునై

పూర్వ మమరావతిం బోలియుండిన యయోధ్యాపురమును జూచి, మిక్కిలి దుఃఖముతో నిండినవాఁడై, యింతకుము న్నెప్పుడును నీ పురమునఁ జూడని యప్రియముల ననేకములను జూచుచుఁ దలవాంచి, మనమున ధైర్యము విడిచి సంతోషహీనుఁడై తండ్రియొక్క నగరునఁ బ్రవేశించెను.

## 72-వ స ర్గ ము

—కైకేయి భరతునకు అయోధ్యయందు నడచిన సంగతిఁ దెలుపుట—

అంత భరతుఁడు పితృగృహమున దండ్రిని గాననివాఁడై, మాతృగృహమునఁ దల్లిని జూడఁ బోయెను. కైకేయియుఁ దాతగారి యూరికిఁ బోయియుండి వచ్చిన భరతునిఁజూచి, సంతోషముతోఁ దన బంగరుగద్దియపైనుండి లేచెను. ధర్మశీలుఁడగు భరతుఁడు చెన్ను దఱిగియున్న స్వగృహము చేరినవెంటనే తనతల్లియొక్క శుభకరము లగు పాదములకు నమస్కరించెను. ఆ కైకయుఁ దనకు మ్రొక్కిన కీర్తిమంతుఁడగు తనపుత్త్రుని భరతుని లేవనెత్తి శిరమున ముద్దాడి, గట్టిగాఁ గౌఁగిలించుకొని, యతనిని దనతొడమీఁదఁ గూర్చుండఁబెట్టికొని, క్షేమము లడుగఁబూనెను. "ఓ నాయనా! నీవు తాతగారియూరు బయలువెడలి యెన్నిరాత్త్రులాయె? నీవు వేగిరముగ రథమున నేతెంచినాఁడవే! నీకు దారిబడలిక లేదుగదా! ఓరి నాయనా! పూజ్యుఁడయిన నీ తాతయు, నీ మేనమామ యగు యుధాజిత్తును క్షేమముగ నున్నారా? నీవును దూరదేశమున సౌఖ్యముగా నుంటివా? ఈ సంగతి యెల్ల నాకు సవిస్తరముగాఁ జెప్పుము." అని తల్లి యడుగఁగా, కమలలోచనుఁడయిన రాజనందనుఁడగు భరతుఁడు సంగతియంతయు సవిస్తరముగాఁ దల్లికిఁ జెప్పఁదొడఁగెను. "ఓ తల్లీ! నేను తాతగారి యింటినుండి బయలుదేఱి నేఁటి కేడురాత్త్రులు గడచినవి. నీ తండ్రియు, నా మేనమామయు క్షేమముతో నున్నవారు. నాకుఁ దాతగా రొసఁగిన ధనమును, రత్నములను గొనివచ్చెడి పనివారు డస్సినందున దారిలో నొకగ్రామమున నిలిచిరి. నేను ముందుగా నేతెంచితిని. రాజుగారిచేఁ బంపఁబడిన దూతలు నన్నుఁ దొందరపెట్టుటచే, నేను నిలువకయు వచ్చితిని, నేను ఏది యడుగుదునో, దానికి నీవు బదులీయవలె నని కోరు

చున్నాను. "ఓ తల్లీ బంగరు భూషణములచే నలంకరింపఁబడిన నీవు కరుండెడి యీ పాన్పు వట్టిదిగ నున్నది. దశరథుని సంబంధులయిన వారందఱు మోమున సంతోషము లేకయున్నట్లు తోఁచుచున్నది. నృపాలుఁడు తఱచుగా నిచ్చటనుండుట వాడుకగదా! ఆయన యిచ్చటఁ గనఁబడలేదు. ఆయనను జూడఁగోరి నే నిచ్చటి కేతెంచితిని. తండ్రిగారి పాదములకు మ్రొక్కవలయును. ఆతఁడు నా పెద్దతల్లియగు కౌసల్య యొక్కయింట నున్నాఁడా? చెప్పుము." అని యడిగెను. అంతట, కైకేయి రాజ్యమునందలి లోభముచే మంచిచెడ్డ లరయఁజాలనిదై, భయంకరమును, నిష్టము గానిదియునైన వృత్తాంతమును బ్రియ మని తలఁచి, యొక్కటియు నెఱుఁగని భరతునితో నిట్లనియె.

"అయోధ్యాదేశము నేలువాఁడును, మహాబుద్ధిమంతుఁడును, పరాక్రమశాలియు, యాగము లనేకములను జేసినవాఁడును, సజ్జనులకు గతియైనవాఁడు నగు నీ తండ్రి యందఱు పోయి చేరెడు స్థలమునకుఁ బోయెను." అని చెప్పెను. ధర్మిష్ఠుఁడును, సత్కులప్రసూతుఁడును, ఆచారసంపన్నుఁడు నైన భరతుఁ డీ మాటలు విని, పితృవియోగ దుఃఖము సైరింపఁజాలక, వెంటనే "అక్కటా! చచ్చితినిగదా!" యని మిక్కిలి హీనస్వరముతోఁ బలుకుచుఁ దన నిడుదచేతులను విదలించికొని క్రిందఁబడి, తండ్రి మరణమునకై మిక్కిలి చింతించి, మనము భ్రమసి కలవరపడి యిట్లు లేడ్వసాగెను. "ఈ నా తండ్రియొక్క శయనగృహము పూర్వము శరదృతువునందలి చంద్రునిచే వెలుఁగు నిర్మలరాత్రివలె బహు రమ్యముగాఁ బ్రకాశించుచుండెను. ఇప్పు డా ధీమంతుఁడగు రాజులేని యీ శయనము చంద్రుఁడు లేని రాత్రికైవడి నీ రింకిన సముద్రమువలెఁ గాంతిఁ దఱిగియున్నది" అని చెప్పుచుఁ గన్నీరు విడిచి, పితృవియోగముచే మిక్కిలి విచారపడి కాంతిగల తన మోమును బట్టతోఁ గప్పుకొని గట్టిగ విలపించుచుండెను. నొచ్చినవాఁడును, దేవతలంబోలు కాంతిగలవాఁడును, కాననమున గొడ్డలితో నఱకఁబడిన మ్రానిబోదెవలె నేలమీఁదఁ బడియుండువాఁడును, మదపుటేనుఁగుఁ బోలువాఁడును, చంద్రసూర్యులవలె వెలుఁగువాఁడునైన భరతుని కైక లేవనెత్తి కూర్చుండఁబెట్టి యిట్లనియె. "కీర్తిమంతుఁడ వగు నో రాజపుత్త్రుఁడా!

లే లెమ్ము. ఏల పడియుండెదవు? సభాపూజ్యులయిన నీకోటివారు శోకము నొందరుగదా! బుద్ధిమంతుఁడా! నీ యొక్కబుద్ధి దానములకు, యజ్ఞములకు నధికారము గలదియు, సదాచారముల వేదవాక్యముల ననుసరించినదియునై సూర్యమండలమునందు వెలుఁగువలె వెలుఁగుచున్నది." అని కైకేయి భరతునితోఁ జెప్పెను. ఇవ్విధమున నానావిధములగు విచారములతో నిండినవాఁడై అంత భరతుఁడు చాలసేపు నేలపైఁ బొఱలుచుండి, తల్లిం జూచి "నాతండ్రి రామునికిఁ బట్టాభిషేకము సేయనున్నాఁడో, లేక జన్నము సేయనున్నాఁడో." అని యెంచి మహానందముతో నిటకుఁ బయనమై వచ్చితిని. అది యిప్పుడు వేఱుగా మాఱిపోయెను. ఎల్లప్పుడు మాకిష్టమును మేలును గల్గించుటయం దత్యంత శ్రద్ధగల మాతండ్రి కానిపింపకపోవుటచేత నా మనము బ్రద్దలయిపోయినది. తల్లీ! నేను రాకమునుపే, యేవ్యాధిచే నతఁడు లోకాంతరము నొందెను? రామాదులందఱు దగ్గఱనుండి పితృసంస్కారము చేయుటచే ధన్యులైరి. కీర్తిమంతుఁడగు మహారాజు "నేను వచ్చితి"నని దృఢముగా నెఱుఁగఁడు గాబోలు! ఆతఁడు "నేను వచ్చితి"నని యెఱుఁగునేని, వేగముగ వచ్చి, నన్నుఁ దలవంచిముద్దాడునుగదా! నేను వీథులలో నాటలాడునపుడు నాయొడలి కంటుకొనిన దుమ్మును మృదువుగా దులుపునట్టిదగు పుణ్యకర్మముల నాచరించు నాతండ్రి చేయి యెక్కడ? ఎవ్వఁడు నాకుఁ దోబుట్టువును, దండ్రియు, జుట్టమునై యున్నాఁడో, ఏ బుద్ధిమంతునికి నేను దాసుఁడనై యున్నానో, పాపకార్యముల చేయని యట్టి రామునికి నేను వచ్చియుండు సంగతిని త్వరగాఁ దెలియఁజేయుము. ధర్మము నెఱిఁగినవానికి నన్నయేగదా తండ్రి. కావున నాతని పాదములను బట్టుకొందును. తండ్రి గతించినపిమ్మట నింక నతఁడేకదా నాకు గతి. ధర్మముల నెఱిఁగినవాఁడును, ధర్మమునందే నెలకొన్నవాఁడును, సత్యము తప్పనివాఁడును, నియమము దాఁటనివాఁడును, స్థిరమగు పరాక్రమముగలవాఁడునునైన పూజ్యుఁడగు నా తండ్రి దశరథనృపాలుఁడు నా కేమి చెప్పి పోయెను? మా తండ్రి చనిపోవునప్పుడు చెప్పిన మంచిమాట యేదియో వినఁగోరుచున్నాను." అని భరతుఁ డడుగఁగా, కైకేయి నడచినది నడచినట్లు చెప్పఁగోరి, "ఓ భరతా! గతిమంతులలో శ్రేష్ఠుఁ

డయిన మహాత్ముఁడగు నృపాలుఁడు "ఓ రామా! ఓ లక్ష్మణా! ఓ సీతా!" యని విలపించుచుఁ బరలోకము నొందెను. నీతండ్రి మృత్యుదేవతచే నీడ్వఁబడి త్రాళ్లచేఁ గట్టఁబడి మదపుటేనుఁగువలె విలపించుచు నీ తుది మాటను జెప్పెను. "ఏ నరులు సీతతోఁగూడ మఱలివచ్చిన రాముని, మహాబాహువగు లక్ష్మణునిఁ జూడఁగలరో, వారు కృతార్థులు." అని యాతఁడు చెప్పెను." ఇట్లు కైకేయి చెప్పిన రెండవ యప్రియవాక్యమును విన్నవెంటనే భరతుఁడు కడువ్యసనమునొంది, మోమున విన్నదనము దోఁపఁగా, మఱలఁ దల్లి నిట్లని యడిగెను. "ఓ తల్లీ! ధర్మాత్ముఁడును, కౌసల్యయొక్క ముద్దులపట్టియునైన రాముఁడు, తమ్ముఁడగు లక్ష్మణుఁడును, సీతయు నొకటేపర్యాయ మెక్కడికిఁ బోయిరి?" అని యడుగఁగా, భరతునితల్లియగు కైకేయి భరతునికిఁ బ్రియముగాని మాటను బ్రియ మను భ్రాంతితో వాస్తవముగాఁ జెప్పఁదొడఁగెను.

"ఓ పుత్రా! రాచకొమరుఁడగు నా రాముఁడు నారబట్టలను గట్టుకొని, లక్ష్మణుఁడు వెంబడి వచ్చుచుండఁగా, సీతను బిలుచుకొని దండకారణ్యములకుఁ బోయెను." అని కైక చెప్పఁగా, భరతుఁడు తనవంశము సదాచార సంపన్న మయినది గావున, తనయన్న యేమిరైనఁ జెడుపని చేసెనా యని సంశయించి, తల్లిని మఱల ని ట్లడుగఁదొడఁగెను. "ఎచ్చటనైనను రాముఁడు బ్రాహ్మణుల ధనం బపహరించెనా? దరిద్రునిఁగాని, లేక భాగ్యవంతునిఁగాని తప్పులేనివానిని దండించెనా? రాజపుత్రుఁడగు నారాముఁ డెప్పుడును పొరుగువారి భార్యలను జెఱచువాఁడుకాఁడు గదా! భ్రూణహత్యఁ జేసినవాని నడవికిఁ బంపునట్లు రాముని నడవికిఁ బంపుట కేమి కారణము?" అని భరతుఁ డడుగఁగా, భరతుని తల్లియగుకైకేయి, మూఢురాలయినను తన్నుఁ బండితురాలినిగా నెంచినదగుటవలన, స్త్రీ స్వభావముచేత జరిగిన సంగతి యిది యని యంతయు దాఁపక యున్నది యున్నట్లు, భరతునితోడనే చెప్పఁదొడఁగెను. "ఓ పుత్రుఁడా, రాముఁడు బ్రాహ్మణధనమును కొంచెమయిన నెప్పుడును నెచ్చటను నపహరించినదిలేదు; తప్పుచేయనివానిని భాగ్యవంతునైనను దరిద్రునినైనను హింసచేయుటయు లేదు; రాముఁడు పరదారలను గన్నెత్తియైనఁ జూడఁడు. కుమారా! దశరథుఁడు రామునిపట్టాభిషేకము

నకుఁ బ్రయత్నముచేయుచున్నాఁడని నేను విన్నతోడనే, నీకుఁ బట్టాభిషేకము సేయునట్లును, రామునిఁ బదునాలుగేండ్లు దండకారణ్యములకుఁ బంపునట్లును నృపాలుని రెండువరముల నడిగితిని. ఆ నృపశ్రేష్ఠుఁడును వాగ్దత్తమును దప్పఁగూడదను తన నియమములను బట్టి, నే నడిగినప్రకారము చేయఁదలఁచి, రాముని సీతాలక్ష్మణులతో నడవికిఁ బంపెను. ఆ పుత్రుని నడవికిఁబంపి, యా పుత్రవియోగదుఃఖము సైరింపఁజాలక, మిగులఁ బొగిలి మృతినొందెను. ధర్మముల నెఱిఁగినవాఁడా! నీ విప్పుడు రాజ వగుము. నీకు రాజ్యము వచ్చునిమిత్తమే నే నిదియంతయుఁ జేసితిని. నాయనా! దుఃఖసంతాపములను వదలి ధైర్యము నవలంబింపుము. ఈ యయోధ్యాపురమును, ఈ సుభిక్షమైన రాజ్యమును నీ యధీనమైయున్నవి. ఓ పుత్రుఁడా! నీవు జాగు చేయక శాస్త్రవిధుల నెఱిఁగిన వసిష్ఠాదిమహామునులు చెప్పుప్రకారము ధైర్యవంతుఁడగు తండ్రికి సంస్కారము గావించి, పట్టాభిషేకముఁ జేసికొనుము” అని కైక భరతునితోఁ జెప్పెను.

## 73-వ సర్గము.

### భరతుఁడు తండ్రి, తోఁబుట్టువులనుగూర్చి విలపించుట

భరతుఁడు కైకవలనఁ దండ్రి మృతినొందినదియు, తోఁబుట్టువులు సీతతోడ నరణ్యమునకుఁ బోవుటయు విని, దుఃఖసంతప్తుఁడయి యిట్లనియె:— “తండ్రిని, తండ్రితో సమానుఁడయిన నా యన్నను విడిచి, బెట్టుచెడి దుఃఖించుచున్న నా కీ రాజ్యమేల? నీవు నాతండ్రినిఁ జంపి, అన్న నడవికిఁ బంపి, వైద్యుఁడు పుంటిమీఁద క్షారము నుంచునట్లు దుఃఖముమీఁద దుఃఖమును గలిగించితివి. కులమునకుఁ జేటు తెచ్చుటకై నీవు ప్రలయకాల రాత్రివలె మాయిల్లు సొచ్చితివి. మా తండ్రి నిన్నుఁ జెడ్డదానిఁగఁ దెలియక యొడిలో నిప్పుఁగట్టుకొన్నట్లు నిన్నుఁ గట్టికొని మృతినొందెను. ఓ చెడు పనులందుఁ దలఁపుగలదానా! నీవు కావలెనని మా తండ్రికి మరణముఁ దెచ్చిపెట్టితివి. ఈ ఇక్ష్వాకువంశమునకు నీ వజ్ఞానముచే సుఖమునుబోఁగొట్టి దుఃఖముఁ దెచ్చితివి. సత్యసంధుఁడును కీర్తిమంతుఁడునైన నాతండ్రి నిన్నుఁ బొంది, యోర్వరాని దుఃఖముచే నొచ్చినవాఁడయి పరలోకమును జెందెను. ధర్మవత్సలుఁ

డయిన నా తండ్రియగు మహారాజేల నీచేఁ జంపఁబడెను? రాముని నేల యూరు వెడలఁగొట్టి యడవులకుఁ బంపితివి? కౌసల్యయు సుమిత్రయుఁ బుత్రశోకపీడితలయి, నా తల్లియగు నీకడఁ జేరి యిఁక జీవింతు రను మాట కల్ల. పెద్దలకడ నెట్లెట్లుండవలయునో, అదియెల్ల నెఱిఁగిన రాముఁడును తన తల్లియందువలెనే నీయందును భయభక్తులు గల్గి శుశ్రూష చేయుచుండునుగదా! దూరాలోచనగల నా పెత్తల్లియు ధర్మము నవలంబించి, నిన్నుఁ దన చెల్లెలితో సాటిగాఁ జూచుకొనుచుండును గదా, ఓ పాపిష్ఠురాలా! నీపైఁ బ్రేమగల యట్టి కౌసల్య కొమరుఁడును బుద్ధిమంతుఁడును నైన రామునికి నారబట్టలు గట్టించి, యడవికిఁ బంపి, నీ వెట్లు దుఃఖింపవు? చెడ్డపనులందు దృష్టిలేనివాఁడు, శూరుఁడు, బుద్ధిమంతుఁడు, గుణవంతుఁడని ప్రసిద్ధిచెందినవాఁడును నైన రామునికి నారబట్టలొసఁగి యూరు వెడలఁగొట్టితివికదా! అట్లు చేయుట కేమి కారణముకలదు? నేను రామునియందు మిక్కిలి భయభక్తులు గలవాఁడనని వివేకహీనురాలవయిన నీ వెఱుఁగవైతివని తలఁచెదను. కావుననే నీవు రాజ్యముమీఁది యాశచే నీ యనర్థమును దెచ్చిపెట్టితివి. నే నన్ననో, పురుషశ్రేష్ఠులయిన రామలక్ష్మణులను జూడక యేశక్తిమహిమమువలన రాజ్యముఁ బరిపాలింప సాహసింపఁగలను? మేరుపర్వతము తలయందలి వనమునుంబోలె, బలిష్ఠుఁడైన దశరథనృపాలుఁడు బలవంతుఁడైన తన పుత్రుని రాముని నాదరువుచేసికొని యుండెను. అట్లుండఁగా, బరువుమోయఁగల గొప్ప యెద్దు మోయఁదగిన భారమును కోఁడె మెడమీఁదఁ బెట్టిన, నా భారము నాకోఁడె మోయఁజాలనట్లు దశరథునిచే రాముని తోడ్పాటువలన మోయఁబడుచున్న రాజ్యభారమును బసివాఁడ నైన నేను మోయఁజాలను. ఆ బరువు మోయు నంతటి శక్తి నా కెక్కడిది? అట్లు కాక, నాకు సామాద్యుపాయముల చేతఁగాని, బుద్ధిబలముచేతఁగాని రాజ్యపరిపాలనము సేయు శక్తి యుండినను నుండనిమ్ము. అట్లున్నను, పుత్రునందుఁ బేరాసగలిగిన నీ కోరిక నీడేర్ప నా కిష్టములేదు. రాముఁడు తనతల్లియందువలెనే నీయందును భక్తిగౌరవములు గలవాఁడు గనుక, ఆయనకుఁ గోపము వచ్చు నని పాపపుఁదలంపుగల నిన్ను విడువఁజాలకున్నాను. రామునికి

నీయం దట్టి గౌరవము లేదేని, నిన్ను నేఁ బరిత్యజించియే యుందును. పాపబుద్ధిగలదానా! సచ్చరిత్రమును గోలుపోయినదానా! పెద్దలెల్ల దూషించునట్టి యీ దుర్బుద్ధి నీకెట్లు పుట్టినది? మా వంశమునఁ బెద్దల నాటినుండి పెద్దకుమారునికిఁ బ్రభుత్వ మొసఁగుదురు. అతని తమ్ము లతని యందు భయభక్తుల గలిగి మెలఁగుచుందురు. ఓసీ క్రూరురాలా! రాజ ధర్మమును గమనింపవలెననియు, రాజుల సాంప్రదాయకమైన మర్యాద మీఱరాని దనియు నీవు దెలియవైతివికదా. రాజధర్మముఁ బరిశీలించి చూడఁగా, రాజ్యమునఁ బెద్దకుమారునికిఁ బట్టాభిషేకము జరుగుట క్షత్రియు లందఱకును సమానము. ముఖ్యముగ నిక్ష్వాకువంశపు రాజు లకు మిక్కిలి సమ్మతముగు విషయము. కేవలము ధర్మమునే కాపాడు చుండువారును, కులమర్యాదలు, సదాచారములుం గలవారునునైన యీ యిక్ష్వాకువంశమువారికిఁ గల సచ్చరిత్రాభిమానము నీవలనఁ బాడైపోయెను. నీ పుట్టినింటివారగు రాజులు మిక్కిలి యోగ్యులు గదా! పెద్ద లందఱు నిందించెడు నీయజ్ఞానము నీ కెట్లు సంభవించినది? చెడుతలంపుగలదానా! నేను నీ కోర్కె నెఱవేర్పను. నీవు నాకుఁ బ్రాణ హానిచేయు నీ దుఃఖమును దెచ్చిపెట్టితివి. నీమనోరథము సిద్ధింపకుండు టకై యిదిగో చూడుము! ఇప్పుడు నేను బంధుజన ప్రియుండగు రాముని మఱలించుకొని వచ్చెదను. అట్లు రాముని మఱలించికొనివచ్చి, తేజస్సుచే వెలుఁగుచున్న యా రామునకుఁ బట్టముగట్టి మిక్కిలి దృఢ మయిన మనస్సుతో నతనికి దాసుఁడనై యుండెదను.” అని యిట్లెఱుఁ గున గంభీరస్వభావముగల భరతుఁడు మిక్కిలి అప్రియములైన పలుకు లతో నామెను నొప్పించుచు శోకపీడితుఁడై, పర్వతముయొక్క గుహయం దున్న సింహమువలెఁ దద్దయుం బెద్ద గర్జించెను.

## 74-వ స ర్గ ము.

### భరతుఁడు మఱల కైకేయిని దూషించుట

భరతుఁ డప్పుడు తల్లియగు కైక నవ్విధమున దూషించి, మఱల నత్యుగ్రహమునొందినవాఁడై కైకేయింజూచి యిట్లనియె: “క్రూరురాలా! చెడునడతగలదానా! నీవు ధర్మముఁ బాసితివి గావున రాజ్యమునుండి తొలఁగిపొమ్ము. నేను మృతినొందితి నని నీ వేడ్చుచు నుండుము, నృపా

లుఁడుగాని, అతిధర్మశీలుఁడయిన రాముఁడుగాని నిన్నుఁ దిట్టిరా? ఏమియు లేకున్న, వారిలో నొక్కరికి మరణము మఱొక్కరికి వనవాసము నొకతూరిగా నెందుకుఁ దటస్థించెను. కులనాశకురాల వయిన నిన్ను భ్రూణహత్యాపాతకము చుట్టుకొనినది. నీవు నరకమునఁ బడుము. నీభర్తపోయినలోకము నీకు లభింపదు. నీవు ఘోర ప్రయత్నము నేసి, సకల లోకప్రియుండైన రాముని నడవికిఁ బంపి, నీ వొనర్చిన యీ పాప కార్యము నా మనస్సునకు గొప్ప భయముఁ దెచ్చుచున్నది. నీ నిమిత్తమయి నాతండ్రి మృతి నొందెను. రాముఁ డడవికిఁ బోయెను. నాకీ భూలోకమున నపకీర్తియుఁ గలిగెను. మాతృరూపిణి యగు నా శత్రువా! రాజ్యమునుగోరు క్రూరురాలా! చెడునడతగలదానా! పెనిమిటిని జంపుకొన్నదానా! నీవు నాతో నేమియుఁ బలుకుట తగదు. కౌసల్య, సుమిత్ర మొదలగు నా తల్లులందఱు కులముఁ జెఱుపఁబుట్టిన నీవలనఁ గడు వగలపాలయిరి. నీవు ధర్మాత్ముఁడును, వివేకియునైన యశ్వపతికిఁ బుత్రికవు గావు. తండ్రి కులమును రూపుమాపుటకై యచ్చట రక్కసివిగాఁ బుట్టితివి. నీవు రక్కసివి కావేని ధర్మమునందాసక్తిగలవాఁడును, సర్వకాలములందును సత్యముఁ దప్పనివాఁడును నగు రాముని నడవికిఁ బంపి, పుత్రవియోగ దుఃఖముచే మాతండ్రి స్వర్గమునొందునట్లు చేసియుందువా? పాపకార్యమే ముఖ్యముగాఁగల దానవై, నీవు నాతండ్రినిఁ బరలోకము నొందించి, నా తోఁబుట్టువుల నడవులపాలుచేసి, లోకుల కందఱకు నన్నప్రియునిఁ జేసి, నీ చేసిన పాపమునెల్ల నా నెత్తినిఁ ద్రోఁచితివి. నీవు చెడుతలంపు గలదానవు నరకమున కేగుదానవునైనందున ధర్మాత్మురాలగు కౌసల్యయొక్క పుత్రు నడవులకుఁ బంపించి యామెకుఁ బుత్రవియోగ దుఃఖము గలిగించితివి. నీ వన్యాయ్యముగా సాధుబాధ చేసితివి కావున నీ విపు డెట్టి నరకలోకము నొందెదవో నాకుఁ దెలియకున్నది? నీ పాపమునకుఁ దగిన నరకలోకము నా కొక్కటియుఁ దోఁపలేదు. ఓ క్రూరురాలా! కౌసల్యాపుత్రుఁడగు రాముఁడు సదా బంధువుల కాదరువైనవాఁడనియు, నృపాలుని పెద్దకొడుకు గాన నాకుఁ దండ్రితో సాటియగువాఁ డనియు నీకుఁ దెలియదయ్యెఁగదా? పుత్రుఁడనువాఁడు తల్లియొక్క ముఖము, కంఠము,

పొట్ట, కుక్షి, చేతులు, కాళ్లు మొదలగు నంగముల వలనను, కన్నులు, ముక్కులు, చెవులు, నోరు మొదలగు ప్రత్యంగములవలనను, హృదయమువలనను బుట్టుచున్నాఁడు. కావునఁ దల్లికిఁ దనయంగ ప్రత్యంగహృదయములవలనఁ బుట్టిన పుత్త్రుఁ డెంతటి ప్రియుఁడో, తక్కిన బంధువు లంత ప్రియులు గారు. కావునఁ దల్లి కట్టిపుత్త్రుని నెడఁ బాసియుండుట యెంతయో కష్టముగదా! తొల్లి యొకానొకప్పుడు, ధర్మములనెల్ల నెఱిఁగినదియు, దేవతలచేఁ బూజింపఁబడునదియునైన కామధేనువు భూలోకమున నాఁగేటి నీడ్చుచు, దున్నఁజాలక, సగము దినము దున్ని, యలసి నిర్జీవములవలెఁ బడియుండు తన పుత్త్రులగు రెండు వృషభములఁ జూచి, కన్నీటిచేఁ జెదరిన చూడ్కులు గలదై, పుత్త్రశోకముచే రోదనము సేయఁగా, నా కామధేనువునకుఁ గ్రిందుగాఁ బోవుచున్న మహాత్ముఁడయిన దేవేంద్రునియొడలిపై సువాసనకల సన్నని కన్నీటిబొట్లు పడినవి. ఇంద్రుఁడును దన దేహమునఁబడిన సువాసనగల కన్నీటిబొట్లను జూచి, యా కన్నీరు విడిచినది యుత్తమయగు కామధేను వని యెఱిఁగి, యాకసమునఁ గడుచింతతో విలపించుచు సంతసముఁ దక్కి కదలక నిల్చియున్న కామధేనువునకు నంజలి చేసినవాఁడై, విచార పడుచుఁ గీర్తిమతియుఁ, వగపుచే నొచ్చినదియునైన యా కామధేను వుతో "మాలో నెవరివలనను నీకు భయములేదుగదా. సకల జనముల మేలుగోరు కామధేనువా! నీవేల యిట్లు వ్యసనపడుచున్నావు? నీ వ్యసనమునకుఁ గారణమేమి? చెప్పు" మని యడిగెను. అంత ధైర్యముగలదియగు కామధేనువు ధీమంతుఁడగు మాటలలో నేర్పరి యైన యింద్రునిఁజూచి, "అయ్యయ్యో! మీరన్నట్టి యమంగళవాక్య మును నేను వినకుందునుగాక! అమరావతీ విభుఁడా! మీవలన నా కెట్టి భయమును లేదు. దేవేంద్రా! కృషీవలులు పెట్టెడి బాధలకు లోనయి, యెండవేఁడిమికి వాడుపాఱి, బక్కచిక్కి దీనులయి యాపదయం దున్న నా పుత్త్రులనుఁజూచి, "అక్కటా! నా దేహమునుండి పుట్టిన యీవృష భము లిట్లు బరువు మోయఁజాలక కష్టములపా లయియున్నవి." అని విచారపడుచుఁ గన్నీరువిడిచితిని. లోకమునఁ గన్నకొడుకుంబోలెడు ప్రియుఁడు లేఁడుగదా!" అని చెప్పెను. ఇంద్రుఁడును "ఈ ప్రపంచ

మంతయుఁ దన కొడుకులు వేలకొలఁదిగ వ్యాపించియున్నను, ఇరువురు బిడ్డలు కష్టపడుచుండుట కింతగా వ్యసనపడుచున్నదే యా కామధేనువు! లోకమునఁ బుత్రునికన్న ప్రియమయినవా రన్యులు లే"రని తలఁచెను. ఎల్లప్పుడు సాటిలేని మంచి నడవడిగలదియు, అందరికంటె మించిన కాంతిగలదియు, ఎడఁబాయని గుణములుగలదియునైన కామధేనువు స్వభావముచే సమస్తమును సృజింపశక్తిగలదై, లోకరక్షణము నిమిత్తము వేలకొలఁది బిడ్డలను సృజించి, పుడమియెల్ల వ్యాపింపఁజేసియున్నను, ఇరువురు పుత్రుల యిడుమలఁజూచి, విచారపడుచుండ, నొకపుత్రునిఁగన్న కౌసల్య రామునిఁబాసి యెట్లుండఁగలదు? అక్కటా! నీ వీ విధమెుక్క యొంటికొడుకును వనంబునకుఁ బంపి యామెకు నామె బిడ్డనికి నెడఁబాటు గలిగించితివి. కావున నీ వెల్లప్పుడు, ఇహపరములు రెండింటియందును దుఃఖము ననుభవించుచుందువు. నే నన్ననో మా యన్నకును దండ్రికిని బూజలు సల్పుచుఁ గీర్తిని వృద్ధిచేసికొనెదను. ఇది నిస్సంశయము. అటు కాదేని, బలవంతుఁడయిన కౌసల్యాపుత్రుఁడగు రాముని నిచ్చటికిఁ బిలుచుకొనివచ్చి, పట్టాభిషిక్తుఁజేసి, మునులుండు నరణ్యములకు నేనే పోయెదను. చెడుకోర్కులు గలదానా! పురజనులందఱు కన్నీరుపెట్టుకొని చూచుచుండఁగా, నీవు సంపాదించి యిచ్చిన యీ పాపపురాజ్యమును వహించియుండఁజాలను. నీ వగ్నియందైనఁ బ్రవేశింపుము, నీవె దండకారణ్యములపాలుకమ్ము. లేక గొంతున ఉరియైన వేసికొనుము. ఇంతకన్న వేఱుశరణము నీకు లేదు. నిక్కముగు మగటిమిగల రాముఁడు మఱల నయోధ్యకు వచ్చినప్పుడే నేను కల్మషములను బోఁగొట్టికొని కృతార్థుఁడ నయ్యెదను." అని కైకేయితో భరతుఁడు చెప్పెను. శత్రుసంహారియగు భరతుఁడు కోపముచేఁ గన్నులెఱ్ఱనచేసి, బల్లెముతోను, ఈఁటెతోఁ బొడువఁబడిన యేనుఁగువలె బుసకొట్టుచున్న పాముమాడ్కి నిట్టూర్పు నిగిడించుచు, నొడలిబట్ట వీడుట కూడఁ దెలియక, తాలుమారైన సర్వాభరణములతోఁ గూడి, యుత్సవానంతరమున నింద్రునివలె నేలఁబడి మూర్ఛిల్లెను.

## 75-వ స ర్గ ము

భరతుఁడు కౌసల్యయొక్క నమ్మికకై యొట్టులు పెట్టుకొనుట

మగటిమిగల భరతుఁడు చాలసేపటికి లేచి కూర్చుండి తెలివినొంది, కండ్లనిండఁ గన్నీరుపెట్టుకొని, తన యభిప్రాయము చొప్పునఁ దన కొమరుఁడు రామికై వగచుచుండు కైకేయిం జూచి, యచ్చట నప్పు డున్న మంత్రు లందఱు వినునట్లుగా దూషించి, వారిం జూచి, "నే నొకప్పుడు రాజ్యముగావలె నని కోరను లేదు. నేను తల్లితో మంతనము సేయను లేదు. నృపాలుఁడు కైకేయియొక్క ప్రోత్సాహముచే నాకుఁ బట్టాభిషేకము సేయవలె నని తలంచినదియు నాకుఁ దెలియదు. నే నెంతయో దూరదేశమున శత్రుఘ్నునితోఁగూడ నుంటిని. కావున ధైర్యశాలియైన రాముని నరణ్యమునకుఁ బొమ్మనినదియు, లక్ష్మణుఁడు, సీతయు నాతనిని వెంబడించిపోయినదియు నాకుఁ దెలియదు." అని గొంతెత్తి యఱచి చెప్పెను.

అవ్విధమున మొఱపెట్టుచున్న బుద్ధిమంతుఁ డగు భరతునియొక్క గొంతుచప్పుడును కౌసల్య గుఱుతుపట్టి సుమిత్రం జూచి, "దయమాలినదై గొంతుకోసెడునట్టి పనులుచేయు క్రూరురాలగు కైకయొక్క కొడుకగు భరతుఁడు వచ్చినట్లున్నది. అతఁడు దూరదృష్టిగలవాఁడు. అతఁడు రాముఁడు లడవికిఁ బోవునప్పుడిచ్చట నున్నఁ దా నీ యపవాదమునకుఁ బాత్రుఁ డగుదునని మున్ముందుగా నాలోచించి, తల్లియొక్క బోధనచేతఁ దాతగారియింటికిఁ బోయినట్లు నెపముపన్ని, రాముఁ డడవికిఁబోయినవెంటనే పట్టాభిషేకము చేసికొనుటకై మఱలివచ్చినవాఁడు. ఏమియు నెఱుఁగనివానివలెనిప్పుడు మాటాడుచున్నాఁడు. ఆహా! యితఁడు దూరాలోచన చేయువాఁడు" అని చెప్పి, వన్నె దఱిఁగినదియు, మలినమంటినదియు చిక్కినదియునైనశరీరము గలిగి వణఁకుచు, మాటిమాటికి నొడలు తెలియక క్రిందఁబడుచు లేచుచు, భరతుఁ డుండు చోటికిఁ కౌసల్య దఱలెను. అంత భరతుఁడును యాకౌసల్యయొక్క నగరునఁ బ్రయాణమయ్యెను శత్రుఘ్నుఁడును తన యన్నయగు భరతుని వెంబడించి పోయెను, వా రిద్దఱు పోయి, కొడుకు నెడఁబాటుచేఁ దల్లడిల్లుచు నొడలు మఱచి

నేలఁబడియుండు కౌసల్యను కౌఁగిలించికొని, మంచి మనస్సుగలదైన పూజ్యురాలగు తమ పెత్తల్లి దుఃఖపడుచుండఁగాఁ, వారును నామె యొక్క వెతలఁ జూడఁజాలక యేడ్చుచుండిరి.

అప్పుడు కౌసల్య మిక్కిలి వగలపాలైనదై, భరతునిఁజూచి, "ఓరీ నాయనా! రాజ్యము గావలె నని కోరితివి. ఇదిగో రాజ్యము వచ్చినది. తండ్రి మృతినొందెను. రామలక్ష్మణు లడవుల కేగిరి. ఇఁక శత్రుఘ్నుఁడు చిన్నవాఁడు; నీకు లోఁగినవాఁడు. వాఁడు నీకుఁ బ్రియుఁడు. కావున నీ రాజ్యము నిష్కంటకమయినది. నీకు శత్రుబాధ లేదు. అక్కటా, కైకేయి చేసిన క్రూరపుఁ బనిచేతఁగదా యింత వేగముగా రాజ్యము నీ చేతికి వచ్చినది. ఔరా! కటికిపనులనే వెదకు నట్టి యీ కైకేయి, నా కొడుకుచేత నారబట్టలఁ గట్టించి, యడవుల పాలుచేసి, యేమి లాభముఁ బడిసినది? బంగరువంటి మేనిచాయ గల వాఁడును, విశేషకీర్తిశాలియునైన రాముఁ డున్నచోటికి నన్నును వేగిరమే తఱుముఁగొట్టఁగలదు. లేదేని, నేను స్వయముగానే సుమిత్రను దోడ్కొని యగ్నిహోత్రుని ముందుంచుకొని రాముఁ, డున్న యడవులకు సుఖముగాఁ దఱలిపోయెదను. అట్లుకాదేని, పురుషశ్రేష్ఠుఁడైన రాముఁ డెచ్చటఁ దపస్సుచేయుచున్నవాఁడో యచ్చటి కిప్పుడు నీవైనను నన్నుఁ గొనిపొమ్ము. ధనధాన్య సమృద్ధిగలిగి, రథగజతురగపదాతులనెడి చతురంగబలముతో నిండియున్న యీ విశాలమైన రాజ్యమును కైక నీకు సంపాదించి యిచ్చినది. నీవు దీనిని సుఖముగా నేలుము" అని భరతునిఁ బలుతెఱఁగుల దూఱెను.

భరతుఁడును కౌసల్య యాడిన నిష్ఠురపు మాటలచేఁ బుంటి యందు సూదిచేఁ బొడువఁబడినవానివలె మనస్సున నధికముగ బాధ నొంది దుఃఖాతిశయముచే మిక్కిలి తల్లడిల్లి, యా కౌసల్యయొక్క కాళ్ళపైఁబడి మూర్ఛ నొందెను. మఱలఁ గొంతసేపటికి తెలివిఁదెచ్చుకొని లేచి, చేతులు జోడించి, యామె ముందట నిలిచి, యివ్విధంబునఁ బలువిధముల దుఃఖములపాలయి యున్న కౌసల్యతో నిట్లనియె.

"ఓ పూజ్యురాలా! యేమియు నెఱుఁగక నిరపరాధినై యున్న న న్నేల నిష్కారణముగ దూఱెదవు? రామునియెడ నాకుఁగల విస్తార

మైన నిశ్చలభక్తి నెఱుఁగవే? † నా యనుమతిమీఁదనే సత్యసంధుఁడు (=ప్రతిజ్ఞఁ దప్పనివాఁడును), సజ్జనశ్రేష్ఠుఁడునైన రాముఁ డడవికిఁ బోయి యుండునేని, నేను గురుముఖమున నేర్చిన శాస్త్రానుసారియయిన బుద్ధి నశించునుగాక. రాముని యరణ్యప్రవాసము నా సమ్మతిమీఁదనే నడచిన దగునేని, నేను మహాపాపాత్ములకుఁ గింకరుఁ డగువానికిఁ గలుగు పాతకమును, సూర్యుని యెదుట మూత్రపురీషములను విడిచిన వానికిఁ గలుగుపాతకమును నిద్రించుచున్నయావును గాలితోఁ దన్నిన వానికిఁ గలుగుపాతకమును నాకుఁ గలుగును. నా యనుమతి మీఁదనే రాముఁడు వనంబులకేగియుండెనేని, పనివానిచేతఁ జాకిరి చేయించుకొని, బత్తెమియ్యక పంపిన యజమానునకుఁ గలుగు పాపము నాకుఁ గలుగును. రాముని వనవాసము నాకు సమ్మతమైయున్నయెడల, సకల జీవరాసులను దన పుత్రులతో సాటిగాఁ బాలించు రాజునకు ద్రోహము సేయువారికిఁ గలుగు పాతకము నాకు సంభవించును; జనుల యాదాయము నుండి యాఱవపాలు పన్ను గైకొని, జనులనుగాపాడనట్టి రాజు చెందెడి

---

† వాల్మీకి మహాముని భరతుని నెపమునఁ గొన్ని మహాధర్మములను బోధించుచున్నాఁడు. సజ్జనుల కపాయంబుఁ దలఁచువానికి గురుముఖమునఁ బడసిన శాస్త్రజ్ఞానము నశించిపోవును. పాపాత్ములకుఁ గొల్వుకాఁడు కాఁగూడదు. సూర్యు నెదుటికిఁ దిరిగి మలమూత్రములు విడువరాదు. నిద్రించుచున్న యావును గాలితోఁ దన్నరాదు. పనివానిచేతఁ బని చేయించుకొని, బత్తెమియ్యకుండఁ బంపరాదు. అట్లు చేయుటచే వాఁడు సకుటుంబముగా దుఃఖమునొందుచుఁ దిట్టుకొనును గావున నిది యజమానునికి శ్రేయస్కరంబుగాదు. రాజు తనదేశ ప్రజలను దన బిడ్డలనువలెఁ జూచుకొనవలెను. అట్లు చూచుకొను రాజునకు జనులు కీడు చేయరాదు. జనులను దన కొడుకులంబోలెఁ బాలింపని రాజునకుఁ గీడుసేయవచ్చును. రాజులు ఆఱవపాలు పన్నుఁ గైకొని జనులను బోషింపవలయును. అట్లు రాజు దానికంటె హెచ్చు పన్నుఁ గైకొన్నను, ఆఱవపాలు పన్నుఁ గైకొనియు, జనులను న్యాయ్యముగాఁ బాలింపకున్నను దోషవంతుఁడగును. యాగంబులందు యజమానుఁడు మునులకు దక్షిణ లిచ్చెదనని వాగ్దత్తముచేసి, యావల దాని నియ్యఁడేని, మహాపాతకంబు నొందును. ఘోరమయిన యుద్ధమునం దేక్షత్రియుఁడు శత్రువులకు వెఱచి వెనుకకుమఱలి పరుగిడరాదు. గురువు నాశ్రయించి, యాతని యనుగ్రహమున సూక్ష్మార్థములుగల శాస్త్రవిజ్ఞానముఁ బడసి, దానిని మఱచువానికి మహా

పాపమును బొందుదును. ఎవని కీ రాముని ప్రవాసము సమ్మతముగా నుండెనో, వాఁడు యాగమునందు ఋషులకు దక్షిణ లొసఁగెద నని మాటయిచ్చి యావల దాని నియ్యక యేమార్చునట్టివాఁ డొందు పాపము నొందును. ఎవని యనుమతిమీఁద రాముఁడు వనమున కేఁగెనో, వాఁడు రథగజతురగ పదాతులతో నిండియున్న యుద్ధరంగమునఁ బగతురం జూచి పరుగెత్తువానికిఁ గల్గుపాతకమును బొందును. ఎవనియనుమతిని రామునికి వనవాసము గలిగెనో, చెడుతలంపుగల యాతఁడు గురుశుశ్రూషసేసి, ప్రయత్నపూర్వముగా జ్ఞానియగు నా గురువువలనఁ బొందిన మిక్కిలి సూక్ష్మవిషయములుగల శాస్త్రజ్ఞానమును మఱచిపోవునుగాక! ఎవఁడు రాముని నడవులకుఁ బంపుటకై ముందుగా యోచనలుచేసెనో, ఆ పాపాత్ముఁడు ఎత్తయిన మూపురములును, పొడవు చేతులుం గలవాఁడునై సూర్యచంద్రులంబోలె వెలుఁగుచు, రాజ్యమేలెడి

---

పాతకముగలుగును, పాపాత్ములగువారు శ్రీరాముని రాజ్యపరిపాలన సమయంబున నుండజాలరు. పాయసము అనఁగా పాలతో నుడికించిన యన్నము. కృసరము అనఁగా నువ్వులు బెల్లము గలిపిన యొక వంటకము. ఛాగము అనగా మేక మాంసము. శ్రాద్ధాదులందును, బ్రాహ్మణ సంతర్పణములందును, బంధువులు అతిథులు తమ యిండ్లకు వచ్చినప్పుడును ఈమూటిని వండింపవలయును. అట్లుగాక యుత్త సమయములందుఁగూడ వీనిని బచనము చేసి తినువాఁడు పాతకము నొందును. కావున వానిని తనకై వండరాదు. ఆవులను గాలితోఁ దన్నరాదు. పెద్దలను ఒకరు తిట్టునప్పుడె వినరాదు. అట్లుండ తానె తిట్టుటకు పూనిన నెంత గొప్ప పాతకంబు సంభవింపవచ్చును? నమ్మినవానికి ద్రోహము చేయరాదు. ఒకఁడు రహస్యముగా బయలుపఱపఁగూడదని చెప్పిన తన యపవాదమును బయలు పఱపరాదు. పరోపకారము చేయవలయును. చేసిన మేలు మఱువరాదు. ఆత్మహత్య చేసికొనరాదు. పెద్దలయెడ లజ్జగలిగియుండవలయును. బహుజనవిరోధంబు గలిగియుండఁజనదు. గేస్తుఁడు క్రొత్తదైన యొక పదార్థముఁ దెచ్చెనేని, భార్యకు, బిడ్డలకుఁ, బనివారికి దానిని బెట్టినపిమ్మట నే తాఁ దినవలయును. అట్లు వారికిఁ బెట్టక తాఁ దినినచో మహాదోషము సంభవించును. సజ్జనుల కపకారంబులు సేయువారికి గుణవతియగు పత్ని దొరకదు. అగ్నిహోత్రాది సత్కార్యములు జరుగవు. సంతతిలేక వంశాభివృద్ధి నొందరు. వారిట్లిహాపరములు రెంటిని బొరయఁజాలరు. సత్పురుషాపకారికి నాయుస్సు క్షీణించును. సంతతియుఁ గలుగదు, వాఁడు దుఃఖితుఁడై యుండును. రాజహత్య, స్త్రీహత్య వృద్ధహత్య గావించు వానికి నితరహత్యలు సేయువానికంటె నెక్కుడు పాపంబు గలుగును.

రాముని జూడఁజాలఁడు, రాముని వనవాసమునకు సమ్మతించువాఁడు దయలేనివాఁడై, క్షీరాన్నమును, కృసరమును, మేకమాంసమును బితరులకును, బ్రాహ్మణులకును, నతిథులకును నివేదింపక తానే తిన్నవానికిఁ గలుగు పాపము నొందును; గురువులను దిరస్కరించినవాని పాపమును బొందును. రాముని వనవాసమునకుఁ దలయూఁచినవాఁడు గోవును గాలితోఁ దన్నును; తల్లిదండ్రులు, ఉపాధ్యాయుఁడు మొదలుగాఁగల వారిని దిట్టును; నమ్మిన చెలికాని కెంతయు ద్రోహముఁ దలఁచును. రాముని వనవాసమును గోరినవాఁడు చెలికాఁడు తన ప్రాణస్నేహితుఁడని చెప్పికొన్న రహస్యమును బయలుపఱచువానికిఁ గలుగు పాపము నొందును. ఎవఁడు రాముని వనవాసమున కంగీకరించెనో, వాఁడు పరోపకారశూన్యుఁడును, చేసినమేలు మఱచువాఁడును, ఆత్మహత్య చేసికొన్నవాఁడును, పెద్దలయెడ లజ్జమానినవాఁడును, లోకులకెల్ల విరోధియు నగును. శ్రీరాముఁ డరణ్యములకేగుట నాకు సమ్మతముగా నుండు

---

భృత్యులను నిరాధారముగా విడువరాదు. లక్క, మద్యమాంసములు, ఇనుము, విషము మొదలగువానిని విక్రయింపరాదు. అవి విక్రయించుట మహాదోషప్రదము. ఘోరయుద్ధమునందు శత్రువునకు వెఱచి పరువిడరాదు. అట్లు పరువిడుచు, వాఁడు చంపఁబడునేని, మహాపాతకముఁబొందును. సజ్జనాపరాధి కల్మిలేక, యన్నమునకుఁ గష్టపడుచు బిచ్చమెత్తుకొనును. మద్యపానము, జూదము, స్త్రీమోహము చెఱుపుగల్గించునవి కావున సజ్జనుల కపకారమొనరించువాఁడు పైమూఁటిలో నొకదానియందుఁ గాని, అన్నిటియందుఁగాని యాసక్తిగలిగి, దినదినమునకు బుద్ధిమాఱుదలచే నశించునుగాన మద్యపానము సేయరాదు, జూదమాడఁగూడదు. స్త్రీలకు విశేషముగా లోఁబడఁగూడదు. సజ్జనుల కపకారమొనర్చువానికి ధర్మమందు శ్రద్ధయుండదు, అధర్మంబునందే వానికి బుద్ధి లయించు. వాని ద్రవ్యము నయోగ్యులపాలగును. కావున మానవుఁడు ధర్మమునందు శ్రద్ధయుంచవలెను. అధర్మమునందాసక్తి పనికిరాదు. ద్రవ్యము నయోగ్యులపాలు చేయరాదు. సజ్జనాపరాధి సంపాదించిన విస్తార ద్రవ్యము దొంగలపాలయిపోవును. సూర్యోదయసూర్యాస్తమానములందు నిద్రింపరాదు. అది మహాదోషము. కాపురమున్నయింట నిప్పుపెట్టుటయు, గురుభార్యసంగమము చేయుటయు, నమ్మిన చెలికానికిఁ గీడు రోయుటయు మహాదోషకరములు గావున నట్టిదుపనులు సేయరాదు. దేవతలకుఁ బూజలు సేయవలయును. పితృప్రీతిగాఁ దర్పణాదులు చేయవలెను. తల్లిదండ్రులకు శుశ్రూష

నేని, తనయింట నాలు బిడ్డలుఁ బనివాండ్రు చుట్టుగూర్చుండి యాఁక
లితో నకనకలాడుచుండఁగా, వారినందఱిని విడిచి, తా నొక్కఁడే తనివి
తీఱఁ దినువానికిఁ గలుగు పాతకము నొందుదును. నేనే రాముని వన
వాసమునకుఁ గారణభూతుఁడనుగా నుందునేని, నేను సమాన రూప
వయోలావణ్యాదులుగల భార్యలభింపక, బిడ్డలులేక మృతినొందువాని
కగుపాపమును, విహితధర్మములగు కార్యములనుజేయక యిహపరములకు
రెంటికిఁగాక చెడువాఁ డొందు పాపమును బొందుదును. రాముని నడ
వికిఁ బంపుటకు నేను సమ్మతించియే యుందునేని, దీర్ఘాయుస్సునొందక,
నాభార్యలందు సంతతి నొందక పోదును. రాముఁడు వనవాసమునకుఁ
బోవ నేఁ బ్రయత్నించి యుందునేని, రాజులను, స్త్రీలను, వృద్ధులను

---

చేయవలయును. ఇవి చేయకున్నయెడల మహా దోషము సంభవించును. మనము
సర్వ ప్రయత్నములచే సత్పురుషుల లోకము నొందుటకును సత్పురుషులు చేయు
మంచిపనులు చేయుటకును బ్రయత్నింపవలయును. కావున నవి చేయనివాఁడు
భ్రష్టుఁడగును. తల్లికి శుశ్రూష చేయవలయును. అది చేయఁడేని మానవుఁడు దోషి
యగును. సజ్జనవిరోధి దరిద్రుఁడయి, యొక్కువసంతతిగలవాఁడై, వారిని బోషింపఁ
జాలక రోగములలోఁ జిక్కుకొని, యెడతెగని కష్టములపాలగును. కావున సజ్జనా
పరాధము సేయరాదు. యాచకులకు నిచ్చెదనని యియ్యక పోరాదు. రాజవిరుద్ధ
కార్యములు సేయరాదు. కాఠిన్యమువహించి యుండరాదు. కపటము పూనరాదు.
ఒరులను వంచనసేయరాదు. సజ్జనాపరాధమువలన నీ యిడుములు సంభవించును.
ఋతుస్నాతయయి ఋతుకాలమునఁ బుత్రార్థియైవచ్చిన భార్యయొక్క మనోరథ
మీడేర్పనివాఁడు మహాపాతకము నొందును. పరదారగమనము సేయరాదు. తన
ధర్మపత్నులందే రమింపవలయును. అట్లుగాక, స్వభార్యనువిడిచి, పరదార
గమనము చేయుట మహా పాపంబు. స్వభార్యయందు సంతతి నొందక, వేశ్యా
లోలుఁడై యుండరాదు, అది మహాపాపము. నీటిలో మలమూత్రముల విసర్జింప
రాదు. ఒరులకు విషంబుఁ బెట్టరాదు. బ్రాహ్మణపూజకుఁ గావలెనని విఘాతంబు
సేయరాదు. ఆవు ఈనినపిదపఁ బది దినములగు నంతవఱకుఁ బాలు దీయరాదు.
ఒకఁడు మిక్కిలి దప్పిగొని, "యయ్యా, తీర్థముఁ గొంచెమి"మ్మని వచ్చి యడిగిన
యెడల, వాని కెచ్చట నయినను దెచ్చియైనను దప్పి కియ్యవలయును. అట్లుం
డఁగా, తన యింటియందుఁ దీర్థముండియు నియ్యనియెడల, మహాపాతకంబు
గలుగును. దారిలో నిద్దఱు జగడమాడుచుండినయెడల, వారి వివాదంబుఁ దీర్పఁ
బ్రయత్నింపవలయునుగాని, వారి జగడము హెచ్చుచుండఁగా వేడుక చూచు
చుండరాదు.

జంపిన పాపమును, నమ్మిన పనివానినిఁ బనినుండి తొలఁగించిన పాపమును నే నొందుదునుగాక! నేను రామప్రవాసనహేతు భూతుఁడ నయ్యెద నేని, లక్క, మద్యమాంసములు, ఇనుము విషము మొదలగు నిషిద్ధ వస్తు విక్రయమువలనఁ గలుగు లాభముచేఁ గుటుంబము పోషించు వానికిఁ గలుగు పాపంబు నాకును గలుగును. నేను రాముని ప్రవాస మునకు సమ్మతించియుందు నేని, శత్రుసేనలకు భీతిఁ గలిగించునట్టి యుద్ధ మున నెదిరి సేనలం జూచి పరువిడుచుఁ జంపఁబడువానికిఁ గలుగు పాపము నాకును గలుగును. నేనే యీ రాముని ప్రవాసమునకుఁ గారణంబౌదు నేని, తలపుఱ్ఱె చేతఁ బట్టికొని, గుడ్డపేలికను గట్టుకొని, బిచ్చ మెత్తుకొనుచు వెఱ్ఱివానివలెఁ దిరుగుచుందును. నేను రాముని యరణ్యావాసమున కొప్పుకొని యుందు నేని, మద్యపానమున, జూద మున, స్త్రీలయందు నెల్లప్పుడు మనము చొప్పించి, కామక్రోధములకు లోఁబడియుందును. రాముని వనవాసమును నే నంగీకరించి యుందు నేని, నా మన సెల్లప్పుడు ధర్మమునందుఁ బొఱక యన్యాయమునందు ప్రవ ర్తించునుగాక. మఱియు నా ధనము యోగ్యులపాలుగాక యయో గ్యులపాలగునుగాక! నేను రాముని ప్రవాసము నంగీకరించియే యుందు నేని, సకల విధములుగా నాచే సంపాదింపఁబడిన ధనమును దొంగ లెత్తి కొని పోదురుగాక! రాముఁడు నా సమ్మతిమీఁద నరణ్యములకుఁబోయి యుందు నేని, ప్రాతస్సాయంకాలములందు నిద్రించువానికిఁ గలుగు పాపము నొందుదును. రాముఁ డడవికేగుట నా యనుమతిమీఁద జరిగి యుండె నేని, ఇండ్లకు నిప్పు పెట్టినవానికిఁ గలిగిన పాపమును, గురుభార్యా సంగమము చేసినవానికిఁ గలుగు పాపమును, మిత్రద్రోహము సేయు వానికిఁ గల్గుపాపమును నేను బొందుదును. ఎవని సమ్మతిమీఁద నే రాముఁ డడవికిఁబోయెనో, వాఁడు దేవతలఁ బూజింపనివానికిని, పితరులకుఁ దర్ప ణాదులు సేయనివానికిని, తల్లిదండ్రులకు శుశ్రూష సేయనివానికిని, గలుగు పాపమును బొందును. నా సమ్మతిమీఁద నే రాముఁ డడవికిఁ బోయియున్న యెడ, నేను సత్పురుషుల లోకము నొందక, సజ్జనులు గొని యాడెడి పనులఁ జేయక, సత్పురుషులు చేసెడు పనుల నాచరింపక వేగి రముగా నిప్పుడే నరకమునఁ బడిపోదును. పాడవుచేతులు గలవాఁడును,

వెడల్పు బొమ్ము గలవాఁడనునై రాముఁడు నా సమ్మతిమీఁద నరణ్య
ములకుఁ బోయి యుండునేని, నేను దల్లికి శుశ్రూషసేయక చెడిపోదును
గాక! నా యనుమతిమీఁద రాముఁ డడవులకేగియుండునేని, దరిద్రుఁ
డనై, బహు పుత్త్రుఁడనయి, రోగములఁబడి, యొడతెగని కష్టముల ననుభ
వింతును. నేను రాముని యరణ్యవాసమునకు సమ్మతించియుండునేని,
పైనఁ గూర్చుండుటచే మోరలెత్తి యాచించుచుండు దీనుల కిచ్చెదనని
చెప్పి, పిదప నీయనివానికిఁ గలుగు పాపమును నేను బొందుదును.
రాముఁడు వనవాసమున కేగుట నాకు సమ్మతమగునేని, యెల్లప్పుడు
అధర్మపరుఁడనై, కఠినుఁడనై, పాపినై, అపరిశుద్ధుఁడనై, రాజునకు
వెఱచి మోసముచే జీవించువాఁడు చెందు పాపము నొందుదును,
నా సమ్మతిమీఁదనే యీ కార్యము జరిగియుండునేని, దుష్టబుద్ధిగల
వాఁడనై, ఋతుస్నాతయై ఋతుకాలమున వచ్చిన భార్యం జేరనివానికిఁ
గలుగు మహాపాపమును నేను బొందుదును. నేను రాముని యరణ్య
వాసమున కంగీకరించి యుండునేని, వివేకశూన్యుఁడనై, న్యాయమందు
శ్రద్ధమాని స్వభార్యను విడిచి, పరదారలతో రమించువాఁ డొందు
పాపమును నే నొందుదును. నేను రామప్రవాసాంగీకారి నయియుండు
నేని, భార్యనువిడిచి, వేశ్యాలోలుఁడయి, స్వభార్యయందు సంతతి
నొందని బ్రాహ్మణునికిఁ గలుగు పాపము నాకుఁ గల్గును. నేను రాముని
యరణ్యవాసమునకు సమ్మతించియే యుండునేని, నీటిలో మలమూత్రా
దులను విసర్జించి నీటిని జెఱుచువాఁడును, విషము పెట్టువాఁడును,
బొందు పాపమును నే నొక్కఁడనే చెందుదును. రాముని వనవాసము
నకు నే నంగీకరించియుండునేని, బ్రాహ్మణపూజను బాపబుద్ధితోఁ జెఱుపు
వాఁడును, లేఁదూడగల యావుపాలు దీసినవాఁడును బొందు నరక
లోకములను బొందుదును. నేను రాముని యరణ్యవాసమున కొడఁబడి
యుంటినేని, ఒకఁడు దప్పిగొని వచ్చినప్పుడు, ఇంట నీరుంచుకొనియు,
లోభముచే లేదని వానిని బంపువాఁ డెంతపాపము నొందునో యంత
పాపము నే నొందుదును. నే నా రాముని యరణ్యవాసమున కిష్టపడిన
వాఁడనయి యుంటినేని, దారిలో నిద్దఱు సరిగాఁ బోరాడుచుండఁగా,
వారిలో నొక్కనియందుఁ బక్షపాతముచే వాని జయముఁగోరి వానికి

నుపాయము చెప్పియిచ్చువానికిఁ గలుగు పాపము నాకుఁ గలుగును" అని యివ్విధమున రాజపుత్త్రుఁడయిన భరతుఁడు పెనిమిటిని బోఁగొట్టి కొని, కొడుకు నడవులపాలుచేసి దుఃఖించుచున్న కౌసల్య కనేకవిధములచే నమ్మిక పుట్టించు మాటలు పల్కుచునే దుఃఖపీడితుఁడై క్రిందఁబడెను. అట్లు పెట్టుకొనరాని యొట్టులు పెట్టుకొనుచు, దుఃఖముచే నొచ్చినవాఁడై మూర్ఛనొందియున్న భరతునిఁ జూచి, "ఓ నాయనా! పతిపుత్త్ర వియోగముచే నా దుఃఖము హెచ్చుచున్నది. నీవు వినరాని యొట్టులు పెట్టుకొనినందున, నాదుఃఖము మఱింత హెచ్చినదై, నాప్రాణము లెగసిపోవున ట్లున్నవి. నా బిడ్డఁడా! నీవును లక్ష్మణుని చొప్పున నే భాగ్యవశమునం జేసి, ధర్మమునుండి చలింపకున్నావు. నీవు ప్రతిజ్ఞ దప్పనివాఁడవై సత్పురుషుల లోకము నొందఁగలవు" అని చెప్పి, తోఁబుట్టువులందు మిగులఁ బ్రేమగలవాఁడును, దీర్ఘబాహువునైన భరతునిఁ దన తొడమీఁదఁ గూర్చుండఁ బెట్టికొని కడుదీనముగ నంగలార్చెను. ఇట్లు వగలపాలై మిగులఁ బరితాపంబుఁ జెంది, ధైర్యముఁ బాసి భరతుఁడు వ్యసనపడుచుండఁగా, మైమఱపువలనను, దుఃఖము యొక్క యావేగమువలనను అతని మనస్సు గలఁతచెందెను. అట్లు భరతుఁడు విలపించుచు, నడుమనడుమ మైమఱపునొందుచు, బుద్ధిసెడి, నేలఁమీఁదఁబడి మాటిమాటికి వేఁడి నిట్టూర్పులు నిగిడించుచు దుఃఖముతోఁ గన్నుఁ గూర్కక యారేయియెల్ల నెట్టకేలకుఁ బుచ్చినవాఁడయ్యెను.

## 76-వ సర్గము

భరతుఁడు దశరథునకు సంస్కారము చేయుట

మాటలలో నేర్పరియు, సందర్భములకుఁ దగినట్లు మాటాడు వాఁడును నగు వసిష్ఠుఁడు, ఇత్తెఱఁగున వగలఁబొగులుచు మైమఱచి క్రిందఁబడియుండు భరతునిఁజూచి "విస్తారమైన కీర్తిగల రాజపుత్త్రుఁడా! దుఃఖమువలదు. నీకు మేలయ్యెడు. ఇప్పుడు దశరథమహారాజునకుఁ జేయఁదగిన యుత్తరక్రియలను జేయుము." అని చెప్పఁగా, ధర్మవేత్త యగు భరతుఁడు దుఃఖముబాసి, ధైర్యమువూని, ప్రేతకృత్యముల నన్నింటినిఁ జేయఁదొడఁగెను. అంతట భరతుఁడు దశరథుని, కళేబర

మును నూనెకొప్పెరనుండి యెత్తించి, పుడమిమీఁదనుంచి, పసుపువన్నె గల మోముతోఁగూడి, నిద్దురపోవునట్లుండు నృపాలుని సకల రత్నములచే నలంకరింపఁబడి మేలిమి పాన్పునందుఁ బరుండఁబెట్టియు, మిక్కిలి నొచ్చినవాఁడయి, "ఓ నృపాలా! నేను పరదేశమున కేగి రాక యుండఁగా, ధర్మముల నెఱింగిన రాముని బలవంతుఁడైన లక్ష్మణుని వనమునకుఁబంపి, నీవేమి చేయఁదలఁచితి? మహారాజా! పుణ్యకర్మములు సేయునట్టి పురుషోత్తముఁడయిన రామునిఁ బాసి, యాదరువులేక విలపించుచుండు మమ్ము విడిచి, నీ వెచ్చటికేగితివి? ఓ నాతండ్రీ! నీవు స్వర్గమునకుఁబోయి, రాముఁడును వనమునకేగఁగా నీ పత్తనమునందలి జనుల యోగక్షేమములు విచారించువాఁడెవ్వఁడు? నృపాలా! నిన్నుఁబాసి, భర్తలేనిదై యీ పురము చంద్రుఁడులేని రాత్రిమాడ్కిఁ గాంతి దఱిగి యున్నది" అని దశరథనృపాలునిఁగూర్చి విలపించెను. ఇట్లు భరతుఁడు దీనవదనముతోఁ గలఁతచెందిన మనముతో నేడ్చుచుండ వసిష్ఠమహామునీంద్రుఁడు భరతు నవలోకించి, "దీర్ఘబాహుఁడా! యీనృపాలునికిఁ జేయవలసిన యుత్తరక్రియలు విచారముమాని జాగ్రత్తతో లోపము వాటిల్లకుండునట్లు కావింపుము" అని చెప్పెను. అంతట భరతుఁడు వసిష్ఠమహామునిమాట గారవించి, ఋత్విక్పురోహితా చార్యులను ద్వారగాఁ గార్యములను నడపుఁడని తొందరపఱపఁగా, వారు గృహాంతర్భాగమున శవమున్నందున నగ్నిహోత్రశాలనుండి వెలుపటికిఁ గైకొని రాఁబడియున్న యగ్నిహోత్రములు యథావిధిగాఁ దెచ్చిరి. అంతఁ బరిచారకులు నిర్జీవుఁడయిన దశరథుని కళేబరమును, బల్లకియందుఁ బరుండఁబెట్టి, మహాదుఃఖముతోఁ గన్నీరువిడుచుచు మోసికొనిపోవుచుండఁగా, జను లందఱు బంగారమును, వెండిని, అనేకవిధములగు వస్త్రములను మార్గము పొడుగునను విరఁజల్లుచు శవమునకుముందుగాఁ బోయిరి. మఱి కొందఱు చందనాగరు చూర్ణములను, గుగ్గిలమును జల్లుచు సరళమను ధూపమును వేయుచు పద్మచూర్ణమును, దేవదారుచూర్ణమును నా భూమీశుని కళేబరముపైఁ జల్లుచుఁ దీసికొనిపోయి శ్మశానమున నాదశరథుని కళేబరమును జితియందుంచిరి. అంతఁ భరతుఁడు నృపాలుని దేహముపై నగ్నిహోత్రు ముంచినపిదప శాస్త్రప్రకారముగా ఋత్వి

జులు పైతృమేధికములగు మంత్రములను బఠించిరి. మఱికొందఱు
సామగులు సామగానముఁ జేసిరి. ఆ దశరథుని భార్యలును వృద్ధులతోఁ
గూడినవారలై వారివారిగౌరవములకుఁ దగినట్లు పల్లకులమీఁదను,
రథములమీఁదను గూర్చుండి నగరునుండి వెడలి వెలుపలికివచ్చిరి. అంత
ఋత్విజులును కౌసల్యాదులగు దశరథనృపాలుని యంతఃపురపుఁ గాంత
లందఱును, భరతుఁడును దుఃఖముచే నొచ్చినవారలై, పెక్కుయాగము
లొనర్చిన యా నృపాలునియొక్క కళేబరమునకు నప్రదక్షిణముఁ
గావించిరి. అప్పుడు కౌసల్యాదులగు స్త్రీ లందఱు నాఁడుక్రౌంచ
పక్షులమాడ్కి వేలకొలఁదిగా మోఁఱలెత్తి మొఱలిడుచుండిరి. అట్లు
స్త్రీ లందఱు విలపించుచు, మాటిమాటికి మైమఱపునొందుచు, రథము
లందుఁ గూర్చుండి సరయూనదిగట్టున దిగిరి. అట్లు నృపాంగనలును
మంత్రి పురోహితులును భరతునిచే మహారాజునకు జరుగవలసిన
పితృకార్యములను నడిపించి, కన్నీరుగ్రమ్మిన కన్నులుగలవారలై పట్ట
ణము ప్రవేశించి, † పది దినంబులు నియమముతో నుండి యావల
నాశౌచమును దీర్చుకొనిరి.

## 77-వ సర్గము.

భరతుఁ డస్థి సంచయమునకుఁ బోయి విలపించుట

అటుతర్వాతఁ బదియవదినమునందలి యుత్తరక్రియ కాఁగానే
భరతుఁ డంటుతీర్చుకొని, పండ్రెండవదినమునఁ దండ్రికి షోడశ సపిండీ
కరణాదులగు నుత్తరక్రియలను నిర్వర్తించి, బ్రాహ్మణులకు సమృద్ధముగా
నన్నముఁ బెట్టించి, హిరణ్యదాన, గోదాన, ఛాగదాన, శయ్యాదాన,
వాహనదాన, గృహదాన, రజతదానాదులగు షోడశ మహాదానము
లను, భూదాన, దాసదాన, దాసీదాన, వాహనదానా ద్యుపదానము
లను జేసి, వారిని దనివి నొందించెను. అంతఁ బదుమూఁడవనాఁటి వేఁకు
వను దీర్ఘ బాహువగు భరతుఁడు, అస్థి సంచయనార్థ ముయి, శ్మశాన

† షోడశేనభూపాలాః—"రాజులకుఁ బదునాఱు దినంబులచేత నాశౌచంబు
తీరును" అని యుండ నీ భరతుఁడు పదిదినములే యాశౌచ మున్నందున కేమి
కారణము ?" అని యాక్షేపింప, క్షత్రియస్తు దశాహేన స్వకర్మనిరతః శుచిః"
స్వకార్యమును దప్పక చేయుచుఁ బరిశుద్ధుఁడయియున్న క్షత్రియుండు పది దినములె
యాశౌచం బాచరింప వచ్చునని విశేష విధియున్నందున భరతాదులు పది దినములే
యాశౌచ మండిరి.

మునకుఁ బోయి దుఃఖాక్రాంతుఁడై, డగ్గుత్తికతో నేడ్వనారంభించి, కాష్ఠమునొద్దఁ గూర్చుండి, తండ్రి నుద్దేశించి, ఓ తండ్రీ! రాముఁడు చీర జటాజినములను దాల్చినవాఁడయి యడవికిఁ బోవ, శూన్యమయిన యీ యయోధ్యాపురమున నన్నొంటరినిగా విడిచి స్వర్గమునకుఁ బోతివి. తన యొక్క కొడుకు నరణ్యమునకుఁ బంపి, దిక్కులేక పతినే దిక్కుగా నెంచియున్న మా తల్లియగు కౌసల్యనుగూడ విడిచి యెక్కడికిఁ బోతివి?" అని చెప్పుచుఁ గాలుటచే నెఱ్ఱగానుండు నదియు, గాలిన యస్థులు గలదియు, తండ్రి శరీరమును బోఁగొట్టినదియునైన యాచితిప్రదేశమును జూచి, గట్టిగా నఱచుచు, దీనుఁడై రోదనము చేయుచు, బగ్గములచేఁ బైకెత్తఁబడుచు జాఱి క్రిందఁబడిన యింద్రధ్వజమువలె భరతుఁడు నేలపైఁబడెను. అంత నతని మంత్రులు భరతుఁడు గ్రిందఁబడుటను జూచి, లేవనెత్తఁగోరి, తొల్లి పుణ్యక్షయమునఁ గ్రిందఁబడిన యయాతిని లేవనెత్తుటకై ఋషులేతెంచిన చాడ్పున నాతనిదగ్గఱ కేతెంచిరి. శత్రుఘ్నుఁడును దుఃఖాక్రాంతుఁడై పడియున్న భరతునిఁజూచి సైఁగదప్పి నృపాలునే తలఁచుచుఁ గ్రిందఁబడెను. ఆ శత్రుఘ్నుఁ డట్లు కొంతతడ వొడలుదెలియక పడియుండి, మఱల లేచి, తండ్రియొక్క గుణములను అంగములను దలఁచి తలఁచి పిచ్చివానివలె యిట్లు మిగుల విలపించెను. "మంథరవలనఁ బుట్టినదై, కైక యను మొసలిచే భీతికరమైన, వరదాన రూపమై ఘోర నలవిగాని దగు శోకసముద్రమున మే మిందఱమును మునిఁగితిమి. ఓ నాయనా! నీచే నెల్లప్పుడు బుజ్జగింపఁబడుచుండు సుకుమారుఁడును, పసివాఁడునునై విలపించుచున్న భరతుని విడిచి, నీ వెచ్చటికిఁ బోయితివి? ఓ నాయనా! యింకమీఁద మాకు అన్నపానాదు లమర్చి, వస్త్రాభరణాదులను యథేష్టముగా నొసఁగి, మమ్ముఁ గాపాడువాఁ డెవ్వఁడు? ఓ నాయనా! ధర్మజ్ఞుఁడు, మహాత్ముఁడు, ప్రభువునగు నీవు లేనిదైన యీ భూమి బ్రద్దలు కావలసినది. ఏల యింకను బ్రద్దలుకాకున్నది? తండ్రి స్వర్గమున కేగెను; అన్న యరణ్యమునకుఁ బోయెను; ఇఁక నాజీవిత మేల? కావున నేను నగ్నిప్రవేశము చేసెదను. యిక్ష్వాకువంశపు రాజులచేఁ బాలింపఁబడినదియు, పాడువడినదియు నగు నయోధ్యను, తండ్రిని అన్నను

బోఁగొట్టుకొనిన నేను బ్రవేశింపను. నే నరణ్యములందుఁ జొచ్చెదను." అని రోదనము చేయుచుండెను. వారివెంబడి వచ్చిన వారందఱు నా భరతశత్రుఘ్నుల విలాపప్రకారమును, దుఃఖమును జూచి, తామును మిక్కిలి దుఃఖముచే నొచ్చినవారైరి. అప్పుడు భరతశత్రుఘ్ను లిద్దఱు విలపించి విలపించి రోదనముచేసి యలసినవారై కొమ్ములు నఱికిన వృషభములవలె నేలమీఁదఁబడి పొరలుచుండిరి. అప్పుడు సత్స్వభావుఁడును, పండితుఁడును, రాజపురోహితుఁడునైన వసిష్ఠమునీంద్రుఁడు భరతుని లేవనెత్తి కూర్చుండఁబెట్టి, "ఓ సమర్థుఁడా! నీతండ్రి మరణించి నది మొద లిది పదమూఁడవదినము. ఈ దినమున నస్థి సంచయనము చేయవలసియుండఁగా నేల యాలస్యము చేయుచున్నావు. ఆఁకలి దప్పులు, శోకమోహములు, మృతిమిచావులు అను నీ మూఁడుద్వంద్వము లందఱికిని గలవు. అవి యొవరికిని దప్పించుకొన నలవిగాదు. అట్టివానిని గూర్చి మూఢునట్లు నీవు విచారపడఁదగదు" అని చెప్పెను. తత్త్వము నెఱిఁగిన సుమంత్రుఁడును శత్రుఘ్నుని లేవనెత్తి యూఱడించి "నాయనా! జాతస్య మరణం ధ్రువం" అని యున్నది. ప్రపంచమున జన్మించిన ప్రతి జంతువు గిట్టవలసినదే. దానింగూర్చి విచారపడి యుప యోగము లేదు" అని బోధించెను. కీర్తిమంతులైన యా నరశ్రేష్ఠులగు భరత శత్రుఘ్నులు లేచి, ఎండచేతను వానచేతను గొట్టుపడియున్న యింద్రధ్వజమువలెఁ బ్రకాశించిరి. అప్పుడు మంత్రు లేడ్పుచే నెఱ్ఱ వారిన కన్నులనీరు దుడుచుకొనుచు దీనముగా మాటాడుచున్న రాజ పుత్రులను మిగిలిన యుత్తరక్రియలు సేయుటకై తొందరపఱచిరి.

## 78-వ స ర్గ ము

### శత్రుఘ్నుఁడు మంథరను జంపఁబూనుట

అటుపిమ్మట లక్ష్మణుని సోదరుఁడగు శత్రుఘ్నుఁడు గృహమునకు వచ్చినపిదప రామునికడ కేఁగఁదలఁచియున్న దుఃఖపీడితుఁడగు భరతుని జూచి "సర్వభూతములకు రాముఁడు గతియైయుండ నాతనిం గూర్చి విచారమేటికి? బలవంతుఁడయిన యట్టిరాముఁ డొకస్త్రీచే నడవికిఁ బంపఁబడెనుగదా. బలపరాక్రమములుగల లక్ష్మణుఁడును తండ్రిమాట మీఱి యేల రాముని నాఁపియుండఁగూడదు? దశరథుఁడు చెడ్డదైన

కైకకు లోఁబడి చెడ్డదారికి దిగకముందే, న్యాయాన్యాయములు విచారించి యాతనిమాటను దిరస్కరించి యుండవలసినది” అని చెప్పు చుండఁగా, గూనిదగు మంథర, మంచి గంధము పూసికొన్నదియు, మేటి పుట్టములను గట్టినదియు, నానావిధములగు భూషణములచే నలంకరింపఁబడినదియు, చిత్రవర్ణములైన మొలనూళ్లను, మఱియు ననేక భూషణములు దాల్చినదయి త్రాళ్లతోఁ గట్టఁబడిన యాఁడుకోతివలెఁ గన్పట్టుచుఁ దూరుపువాఁకిటయొద్ద కేతెంచెను. అప్పుడు ద్వారపాలురు కడుఁ బాపాత్మురాలును దయలేనిదియునగు కుబ్జను బట్టుకొని శత్రుఘ్నుని యెదుటికిఁ దెచ్చి నిలఁబెట్టి “ఓ రాజపుత్రా! యెవతెవలన రాముఁడడవికిఁబోయెనో, ఎవతెవలన మీతండ్రి మృతినొందెనో, క్రూరహృదయ యగు నాపాపాత్మురాలి నిదిగో పట్టితెచ్చితిమి. మీ కెయ్యది యిష్టమో, యాదండనను దీనికిఁ జేయుఁడు” అని చెప్పిరి. వ్రతనియమములుగల శత్రుఘ్నుఁడును ద్వారపాలురమాటఁ గైకొని, కడు వగచి యంతఃపురమందున్నవారి నెల్లరఁజూచి, “ఏ క్రూరురాలగు మంథర నన్నును, నా తోఁబుట్టువులను, నా తండ్రిని నోర్వరాని కష్టములందుఁ బెట్టినదో, యామంథర తన పాపకర్మములకు ఫలమును బొందునుగాక” యని చెప్పి, చెలికత్తెల నడుమనున్న యా గూనిదానిని గట్టిగాఁ జేయి పట్టియీడ్చెను. అంతట నా గూనిది యిల్లెత్తిపోవునట్లు బిగ్గఱగా నఱచెను. అంత దాని చెలికత్తెలందఱు మిగుల సంతాపము నొందినవారలై శత్రుఘ్నుఁ డలిగియుండుటనుజూచి, “ఈ శత్రుఘ్నుఁడు మనలను సాధింప నుద్యమించినవాఁడు. ఇఁక మనల నితఁడు మిగిలింపఁబోఁడు. కావున మన మిప్పుడు దయగలదియు, దానశీలయు, ధర్మజ్ఞురాలును, కీర్తిమతియునైన కౌసల్యను శరణుచొత్తము. ఆమెయె మన కిప్పుడు గతి”యని యనుకొనుచు నలుకెలఁకులకుఁ బరువిడిపోయిరి. శత్రువులను దమించు శక్తిగల శత్రుఘ్నుఁ డలుకచేఁ గన్నులెఱ్ఱఁజేసి, మొఱలిడుచుండు మంథరను నేలఁబడఁద్రోసి, యీడ్చెను. ఆ శత్రుఘ్నుఁ డీడ్చుకొనిపోవునప్పుడు, ఆ గూని మంథరయొక్క వింతలైన నానావిధములగు భూషణము లచ్చటచ్చటఁ గ్రిందరాలిపడెను. అప్పు డట్టు లెల్లెడలఁ జెదరిపడియున్న నగలతో నొప్పుచున్న యా రాజమందిరము శరదృతువునందలి యాకసమువలెఁ బ్రకాశించుచుండెను.

బలవంతుఁడగు నా పురుషశ్రేష్ఠుఁడయిన శత్రుఘ్నుఁడు కోపముతో మంథరను గట్టిగాఁ బట్టుకొని, దానిని విడిపింపవచ్చిన కైకేయిని బెదరించి పరుసని పలుకులు పలికెను. కైకేయియు నాపరుషవాక్యములకుఁ గడుంగడు దుఃఖించుచు శత్రుఘ్నుఁ డేమిజేయునో యన్న వెఱపుచేఁ దత్తరపాటొంది తన కొమరుని శరణుచొచ్చెను. అంత భరతుఁ డామెనుజూచి కోపముతో మండిపడుచున్న శత్రుఘ్నునిఁ జూచి, "ఓ నాయనా! సకలజంతువులందును స్త్రీజాతి నెంత యపరాధమున్నను జంపరాదు గావున దీని నేమియుఁ జేయక విడువుము. ఓర్పు వహింపుము. ధార్మికుఁడైన రాముఁడు, తల్లిని జంపినవాఁడనని నా మీఁదఁ గోపపడఁడేని, చెడ్డపనులు చేయునదియు, పాపాత్మురాలునునైనఁ యీ కైకను జంపియేయుందును. పోనీ, ఈ గూనిదానినైనఁ గూల్చెదమన్న, దీనిని జంపినది గూడ ధర్మాత్ముఁడగు రాముఁ డెఱుఁగునేని, మనలను పలకరింపఁడు. ఇది నిస్సంశయము" అని చెప్పఁగా, లక్ష్మణుని తోఁబుట్టువగు శత్రుఘ్నుఁడు భరతుని మాటలు విని, కోపమణఁచుకొని, మంథరను విడిచిపెట్టెను. ఆ మంథర శత్రుఘ్నునిచే విడువఁబడి, కైకేయియొక్క పాదముల పయిఁబడి, వేఁడినిట్టూర్పులువిడిచి, మిగులవగచుచు జాలిపుట్టునట్లు విలపించెను. అప్పుడు భరతుని తల్లియగు కైకేయి, శత్రుఘ్నుఁడు మెడఁబెట్టి త్రోయుటచేఁ దెలివిదప్పినదియు, నొచ్చినదియునై, వలలోఁ జిక్కుకొని దిక్కుతోచకయున్న యాఁడు క్రౌంచపక్షివలెఁ జూచుచున్న గూనిదానిని దగ్గఱకుఁ జేర్చి మెల్లగా నోదార్చెను.

## 79-వ సర్గము.

భరతుఁడు రాముని౯ బిలుచుకొని రాఁ బయనమగుట

అంతట బదునాలవనాటి వేఁకువనే, రాజాంగములవా రందఱుఁ గూడివచ్చి భరతునింగూర్చి, "యెక్కువ కీర్తిగల యో రాజపుత్రుఁడా! కడు గొప్పవాఁడగు దశరథుఁడు, పెద్దవాఁడయిన రాముని, బలవంతుఁడయిన లక్ష్మణుని నడవులకుఁ బంపి, తాను స్వర్గమునకేగెను. నీ విప్పుడు మాకుఁ బ్రభువవు గమ్ము. ఇప్పు డీ దేశ మరాచకమైనను, దైవబలముచే నెట్టి యన్యాయములకును బాలుగాకున్నది. ఇట్లే యెప్పటికి నుండు నని తలంపరాదు. అభిషేకమునకుఁ గావలసిన వస్తువుల నెల్లఁ దెచ్చి, నీ

బంధువులును, జనులును నీ రాకకై వేచియున్నారు. నరశ్రేష్ఠుఁడా! వంశపరంపరగా వచ్చిన యీ శాశ్వతమగు రాజ్యము నను గ్రహించి, పట్టముఁ గట్టుకొని, మమ్ము నేలుము" అని ప్రార్థించిరి.

నియమముఁ దప్పనట్టి భరతుఁడు తన యభిషేకము నిమిత్తము తేఁబడియున్న పదార్థములనెల్లఁ దిలకించి, ప్రదక్షిణ నమస్కారములు నేసి, యా జనుల నందఱను నుద్దేశించి, "ఓ జనులారా! మా వంశమునఁ బెద్దవానికేఁ బట్టముగట్టుటయె యెల్లప్పుడు నాచారము. అది మీరెఱిఁగియుండియు నిట్లు నన్నుఁ జెప్పుట యుచితముకాదు. మా పెద్దయన్నయగు రాముఁడు మీకు రాజు గాఁగలఁడు. నే నతనికి బదులుగాఁ బదునాలుగేం డ్లరణ్యమున నుండెదను. చతురంగబలముగల గొప్పసేన నాయితముసేయుఁడు. నే నడవికేగి మా యన్నను రామునిఁ దోడితెచ్చెదను. ఈ యభిషేకమునకై సిద్ధముచేయఁబడిన సకలసామగ్రిని ముందుంచుకొని రామునిఁ గొనివచ్చుటకై నేనే యడవికిఁ బోయెదను. ఆ వనముననే యీ యభిషేకద్రవ్యములతో నతనికిఁ బట్టాభిషేకముసేసి, యజ్ఞగృహమునుండి యగ్నిహోత్రుని దెచ్చున ట్లచ్చటినుండియె రామునిఁ దోడితెచ్చెదను. తల్లియనిమాత్రము పేరుకొనఁదగిన యీ నా తల్లియొక్క మనోరథమును నెఱవేర్పను. నేనే యడవులం దుండెదను. రాముఁడే పుడమిఁ బాలించువాఁడు గాఁగలఁడు. మీరు శిల్పులతోఁ జెప్పి మిట్టపల్లములు సరిచేసి దారివేయింపుఁడు. కొండదారుల నెఱిఁగినవారలను దోడుగా వెంట నేతెంచుట కేరుపాటు చేయుఁడు" అని చెప్పెను.

ఇవ్విధమున రామునిఁ బిలుచుకొనివచ్చు నిమిత్తము ప్రస్తావించుచున్న నృపకుమారుఁడగు భరతునిఁ జూచి జను లందఱు "ఓ రాజపుత్రా! నీవు జ్యేష్ఠుఁడగు రామునకు రాజ్యము నీయఁగోరుచున్నావు గాన నిన్ను రాజ్యలక్ష్మి తానే వరింపఁగలదు" అని మంగళకరమును, ఉత్తమమును నయిన మాటను చెప్పిరి. భరతుఁడు సెప్పిన వాక్కులను విని మిగుల సంతోషమునొందిన యా రాజకర్తల కన్నులనుండి యానందబాష్పములు వెలువడినవి. అంత మంత్రి పురోహితాది సభ్యు లందఱు విచారముమాని మనమున సుప్పొంగుచు, శిల్పివర్యులచే వన

మార్గము చక్కఁబెట్టింపను, మార్గరక్షకుల నియమించుటకును సుత్తరు వొసఁగి, "ఓయీ రాజపుత్రా! మార్గము చక్కపఱుపఁబడుచున్నది. వన మార్గప్రదర్శకులగు కావలివారును నియమింపఁబడిరి" అని భరతునితో విన్నవించిరి.

## ౮౦-వ సర్గము

### శిల్పులు వనమునకు మార్గమును నిర్మించుట

అంత భూప్రదేశము లెచ్చట నెచ్చట నేయే రీతిగా నుండునో యది తెలిసినవారును, లోఁతయిన బావులు మొదలగు వానినుండి నీరు చేఁదుటకు వలయు త్రాళ్లు మొదలగువానిని చేఁదువారును, తమ పనులం దెక్కువ జాగ్రత గలవారు, శూరులు నగు ఉప్పరవారును, యంత్రములను నిర్మించువారును, కూలివాండ్రును, గొప్ప శిల్పులును, యంత్ర నిర్మాణమునందు నేర్పరులగువారును, వడ్రంగులును, దారుల నేర్పఱచువారును, చెట్లు నఱుకువారును, బావులు త్రవ్వువారును, సున్నపుఁబని చేయువారును, వెదురుపనులఁ జేయువారును, మార్గము లంతకుమున్ను చూచిన యనుభవశాలురును, ముందుగాఁ బయనమైరి. ఆ తీరున వనప్రదేశమునకుఁ బోవుచున్న విస్తారమగు జనసమూహము పున్నమనాఁడు పొంగెక్కిన సముద్రమువలె శోభిల్లుచుండెను. బాటలు వేయుటయందు నేర్పరులగువా రందఱు తమవారిం జేర్చుకొని, తమ తమ పనులకుఁ గావలసిన కొఱముట్లు గైకొని ముందుగా వెడలిరి. వా రట్లు పోవుచు, కొమ్మలను, తీగలను, పొదలను, మొక్కలను, ఱాలను పలువృక్షములను నఱుకుచు దాఁటిపో నలవికాని యరణ్యమున మార్గము నేర్పఱుపఁ దొడఁగిరి. చెట్లు దట్టములై చొఱనలవికాకయున్న చోట్లఁ గొందఱు గొడ్డళ్లతోను, ఉలులతోను, అంపములతోను, చెట్లను నఱికిరి. చెట్లులేక బట్టబయలుగా నుండు చోట్లఁ జెట్లను నాఁటిరి. మఱి కొందఱు కడుబలశాలురు కోయ నలవికాకయుండు నవురుగడ్డిని గాల్చి, యచ్చటచ్చటఁ బోవ నలవికాకయున్న ప్రదేశములను సమపఱచిరి. మఱికొందఱు దారి కడ్డముగా నున్న పాడుబావులను, వెడల్పయిన బొరియలను, పల్లములను మన్నుద్రోసి పూడ్చి సమముచేసిరి, కొంద ఱచ్చటచ్చటఁ గట్టవలసినవానిని గట్టిరి, పొడిసేయఁదగినవానినిఁ బొడి

జేసిరి. పగులఁగొట్టఁదగిన తిప్పలు మొదలగువానిని పగులఁగొట్టిరి. కొందఱు శీఘ్రకాలములోపల స్వల్పప్రవాహములకుఁ గట్టలుకట్టి, వానియందు సముద్రముతో సాటియగునట్లు నీటిని నిలువఁజేసిరి. కొందఱు నీళ్లులేని తావులందుఁ బలు తెఱఁగులైన గొప్పబావులను ద్రవ్వించి, వాని చేరువ విశ్రమించుటకుఁ దగిన తిన్నెలఁ గట్టిరి. అట్లు వారిచే నేర్పఱుపఁబడిన యా సేనలమార్గము సున్నపుఁ బూఁతతోఁ గూడిన పై ప్రదేశముగలదియు, చక్కఁగఁ బూఁచిన పూలచెట్లతోఁ గూడినదియు, మదించి యెక్కువ కూఁతలు గూయుచున్న పక్షులగుంపు గలదియు, టెక్కెములచేఁ గ్రైసేయఁబడినదియు, గలయంపి చల్లఁబడినదియు, నానా విధములగు పుష్పములుచల్లుటచే శోభిల్లుచున్నదియునై దేవమార్గముంబోలె నెంతయుఁ బ్రకాశించుచుండెను. మార్గ నిర్మాణానంతరమున నృపాలుని యధికారులందఱు దమ బుద్ధికిఁ దోఁచినట్లు భృత్యులకుఁ బనిచేయ నానతియొసఁగి, భరతుఁడు దారిలో దిగుటకై తగు గుడారములను వేయఁదలఁచి, వానికిఁ దగు ప్రదేశము నేర్పఱుపనందఱుగూడి యాలోచించి, నానావిధములగు తియ్యని ఫలములతోఁ గూడినవై మనమునకు రమ్యములైయుండు ప్రదేశములందు మహా బుద్ధిశాలియగు భరతునకు సమ్మతములయిన శిబిరములను శుభనక్షత్రములతోఁ గూడిన శుభముహూర్తములందు నిర్మింపించి, వానిని సకల భూషణములతో నలంకరించిరి. భరతునికొఱకై నిర్మింపఁబడిన యా గుడారములు విస్తారమైన యిసుకతోఁగూడి, యగడ్తలచేఁ శోభిల్లుచు నింద్రకీల పర్వతముంబోలి, రాజగృహములు, ధనికగృహములు, ఏడంతస్తుల మేడలును గలిగి, టెక్కెములతోఁగూడినవై వరుసలుదీర్చిన గొప్ప వీథులచే వెలయుచు, ఆకాశమునకు వ్యాపించుచున్నవో యన్నట్లుండు గువ్వల గూళ్లు కొనలందుఁ గల యెత్తైన విమానములతోఁ గూడి, దేవేంద్ర భవనముమాడ్కి శోభిల్లుచుండినవి. అయ్యధికారులిట్టి గుడారములను నానావిధ వృక్షములుగల వనములతోను, చల్లని తేఁటనీటితోను, గొప్పచేఁపలతోను గూడియున్న గంగానదివఱకు నిర్మించిరి. ఆవల వీలుపడమిచే వానిని నిర్మింపరైరి. రేయియందు చంద్రనక్షత్రములతోఁగూడి నిర్మలమయిన యాకాశము వెలుఁగు

చందమున నేర్పరులగు శిల్పులచే క్రమక్రమముగా నిర్మితమయి రమ్యమయియుండు నా రాజమార్గము వెలయుచుండెను.

## 81-వ సర్గము.

### భరతుఁడు రామునియొద్దకుఁ దఱలుట

అంత నభ్యుదయ యుక్తమగు నపరరాత్రియందు మాటలలో ననేకభేదముల నెఱిఁగిన సూతమాగధులు మంగళయుక్తములగు స్తోత్రములచే భరతుని స్తుతించిరి. జాములు దెలియుటకై వాయింపఁబడు దుందుభివాద్యము బంగారుకోయ్యలచే వాయింపఁబడినది. శంఖములును, వెవ్వేలు స్వరములుగల వాద్యములును పలుమాఱులు వాయింపఁబడినవి. ఆ కడు గొప్పదైన వాద్యములధ్వని యాకసమును నింపుచు, దుఃఖపడుచున్న భరతుని మఱింత దుఃఖపఱచెను. భరతుఁడును మేలుకాంచి, "యీవాద్యములు వాయింప నక్కఱలేదు, నేను రాజనుగాను" అని చెప్పి, శత్రుఘ్నునిఁజూచి యిట్లనియె. "ఓ శత్రుఘ్నా! కైకేయి లోకమున కంతకు నెంత యపకారము చేసినదో చూడుము. దశరథనృపాలుఁడు నన్ను దుఃఖముల పాలుసేసి స్వర్గతుఁ డయ్యెను. అట్టి న్యాయ పరిపాలకుఁడైన దశరథనృపాలునియొక్క రాజ్యలక్ష్మి సముద్రమున మాలిమిలేని యోడవలె నల్లాడుచున్నది. ఎవఁడు మనకు గొప్ప యాదరువుగా నుండెనో, యా రాముని నీనాతల్లి నీతిఁదప్పి యడవికిఁ బంపినది." ఇట్లు చెప్పుచు విలపించుచుండు భరతుం జూచి, యంతిపురపు చానలందఱు గొల్లున జాలిపుట్టున నేడ్చిరి. అట్లు భరతుఁడు విచారపడుచుండఁగా, రాజధర్మముల నెఱిఁగినవాఁడును, కీర్తిమంతుఁడునునగు వసిష్ఠ మునీంద్రుఁడు శిష్యసమేతుఁడై, బంగారుతోఁ జేయబడి, మణులుచెక్కఁబడిన రమ్యమయి యొప్పుచున్న యింద్రసభయగు సుధర్మనుబోలియున్న యిక్ష్వాకువంశాధీశ్వరు సభయందుఁ బ్రవేశించి, మెత్తని పఱపుఁబరచిన బంగారుమయమయిన పీఠమునఁ గూర్చుండి దూతలను రాఁబనిచి, "మీరు వేగ నేగి, మంత్రులను, బ్రాహ్మణక్షత్రియ వైశ్యులను, కూటముల యధికారులను, కడువేగముగాఁ దోడ్కొనిరండు, మనకు నవసరముగాఁ గావలసిన పని యొండు గలదు. రాజపుత్రులతో సమేతులయిన కీర్తిమంతులగు భరత శత్రుఘ్నులను, యుధాజిత్తు, సుమంత్రుఁడు ననుమంత్రులను,

మఱి మన మేలు గోరెడు హితులను బిలిచికొనిరండు" అని యాజ్ఞ యిచ్చెను. జనులు రథ, గజ, తురగముల నెక్కి వచ్చెడు నపుడు మిక్కిలి గొప్పదగు కోలాహల ధ్వని పుట్టెను. అంత రథారూఢుఁడై వచ్చు చుండు భరతునిఁ జూచి, దేవతలు దేవేంద్రునిఁ గొనియాడునట్లు, జనులు దశరథునిఁబోలెఁ బలుతెఱఁగులఁ గొనియాడిరి. గొప్ప గొప్ప చేఁపలతోను, నీటి యేనుఁగులతోను గూడి, కదలని జలముగలిగి రత్నములును, శంఖములును, ఇసుకయుఁ గలిగియుండు మడువుంబోలి, దశరథపుత్రులగు భరతశత్రుఘ్నులచే శోభిల్లుచున్న యా సభామంటపము పూర్వము దశరథునితోఁ గూడియున్నప్పటి దానివలెనే వెలయుచుండెను.

## 82.వ సర్గము.

భరతుఁడు ససైన్యుఁడై యడవికిఁ దఱలుట

బుద్ధిమంతుఁడగు భరతుఁడు పూజ్యులగు వసిష్ఠాది మునులతో నిండి నిశ్శబ్దముఁగనున్న యా సభామందిరమును పూర్ణచంద్రుఁడు రాత్రినివలెఁ జూచెను. అప్పుడు పెద్దలందఱు మేలిమి బట్టలను గట్టుకొని, నెత్తావిగల గంధము నలఁదికొని వచ్చి వారి వారి గౌరవములకుఁ దగినట్లుగ నాసభలోని యాసనంబులందుఁ గూర్చుండిరి. అపుడు వారి మైపూఁతల డాలుచేతను, బట్టల కాంతిచేతను శ్రేష్ఠమైన యా సభ వెలుఁగఁ జేయఁబడినదై, పండితజనములతో నిండి, రమణీయమగుచు, పున్నమచందురునితోఁ గూడిన శరత్కాల రాత్రివలె మిక్కిలి వెలుఁగు చుండెను.

అప్పుడు ధర్మవేత్తయగుపురోహితుఁడు రాజులను, జనులనందఱను జూచి, భరతునితోఁ దిన్నని మాటల నిట్లనెను. "ఓరి నాయనా, నీ తండ్రియగు దశరథుఁడు సత్యసంధుఁడై, ధనధాన్య సమృద్ధిగలిగి, విశాలమై యున్న యీ భూమండలమును నీకొసఁగి స్వర్గము నొందెను. శాశ్వతమైన ధైర్యముగలవాఁడగు రాముఁడు తండ్రిమాట నెఱవేర్చుట యను తన పెద్దల నడవడిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని, ఉదయించిన చంద్రుఁడు వెన్నెలను బాయనట్లు తండ్రి యాజ్ఞను మీఱక యరణ్యమునకుఁ బోయెను. తండ్రియు, నన్నయు నీ కొసఁగిన నిష్కంటకమైన యీ రాజ్యమును

మంత్రులను సంతోషపఱచుచు ననుభవింపుము. వేగిరమె పట్టాభిషేకము చేసికొమ్ము. ఉత్తర దక్షిణ పశ్చిమదేశ వాసులగు రాజులును, సింహాసనములేని సామాన్య రాజులును, పశ్చిమదేశవాసులగు యవనులును, సముద్ర మధ్యములందలి దీవులం దుండు రాజులును రత్నములను గానుకగా నొసఁగుదురుగాక." అని వసిష్ఠమునీంద్రుఁడు భరతునితోఁ జెప్పెను. ధర్మజ్ఞుఁ డయిన భరతుఁడును వసిష్ఠుని వాక్యమును విని దుఃఖముపొంగుచుండ ధర్మమునందలి యాసక్తిచే రాముని మానసమున ధ్యానించెను. కలహంసముయొక్క కంఠస్వరముఁబోలు కంఠస్వరము గలవాఁడును, ప్రాయపువాఁడును నైన యా భరతుఁడు కన్నీటిచే సువ్యక్తముకాని మాటలతో సభనడుమనే రామునిఁ దలఁచికొని రోదనంబుసేసి, పురోహితుం జూచి, "యిట్టి యధర్మమైన మాటను చెప్పుటకుఁ దమ కెట్లు నోరాడెను" అని యాతనిని నిందించి, మఱల నమ్మునీంద్రాదులం జూచి, "మీర లిట్లు చెప్పితిరే" బుద్ధిమంతుఁడును బ్రహ్మచర్య వ్రతము జరుపువాఁడును, వేదాధ్యయనము చేసి, పిదప వ్రతస్నానమొనర్చి, జ్ఞానవంతుఁడై, ధర్మకార్యములందుఁ బ్రయత్నపడుచుండువాఁడునునైన రామునియొక్క రాజ్యమును నాబోటివాఁ డపహరించునే? దశరథునికిఁ బుట్టినవాఁ డెట్లిపని సేయఁగలఁడు? రాజ్యము రామునిది. నేనును రామునికింకరుఁడను. ఈ విషయమున నేది న్యాయమో మీరె చెప్పవలయును. రాముఁడు నాకంటెఁ బెద్దవాఁడు; శ్రేష్ఠుఁడును, ధర్మాత్ముఁడును; దిలీపనహుషులతో సాటియగు వాఁడును. కావున దశరథునికిఁ బిదప రాముఁడే రాజ్యమున కర్హుఁడు. దుష్టు లాచరించునదియు, నరకము నొందించునదియునైన యీ పాప కార్యము నే నాచరింతునేని, నే నిక్ష్వాకువంశమునకుఁ జెఱుపచేటయైన వాఁడ నగుదును. నా తల్లికిఁ గలిగిన చెడుతలంపు నా కింతయు సమ్మతముగాదు. నే నిచ్చటనుండియే చొరరాని యరణ్యప్రదేశములం దుండు రామునికిఁ జేతులు జోడించి మ్రొక్కెదను. రాముని ననుసరించియే నేఁ బోయెదను. మనుజశ్రేష్ఠుఁ డగు నా రాముఁడే రాజు. రాముఁడు ముల్లోకములనైనను బాలింపఁగలఁడు," అనెను.

సభాసదులందఱు భరతుని ధర్మముఁ దప్పని యామాటలను విని రామునియందే దమ మనస్సులను లయింపఁజేసి, సంతసంపుఁ గన్నీటిని విడిచిరి. మఱల భరతుఁడు సభ్యుల నందఱను జూచి, "నే నట్లు మాయన్నను నిర్బంధముచేతనయిన నడవినుండి మఱలింపఁజాలనేని, యార్యుఁడగు లక్ష్మణుఁ డుండునట్లే నేను నచ్చటనే యుండెదను. సుగుణులు, సజ్జనులునైన తమయందఱి యెదుటనే బలవంతపెట్టియైనను, మాయన్నను దోడ్కొనివచ్చుటకుఁ దగు ప్రయత్నములనెల్లఁ జేసెదను. దారిని బాగుచేయుటకును, దారితోడుగ నుండుటకును దగినకూలివారిని వెట్టివారిని అనేకులను, ఇదివఱకే పంపితిని. కావున, సర్వవిధముల నతనిఁ బిలిచికొనివచ్చుటకు నేఁ బోవలయును." అని యందఱు వినునట్లుగా చెప్పి ధర్మాత్ముఁడును, తోఁబుట్టువులం దెక్కువ ప్రేముడి గలవాఁడునైన భరతుఁడు దగ్గఱ నిలఁబడియున్న యాలోచనపరుఁడగు సుమంత్రునిం జూచి యిట్లనియె: "సుమంత్రా! నీవు వేగిరముగా నేగి నాయాజ్ఞగాఁ బ్రయాణమును జాటింపుము. సేనలను గొనిరమ్ము." అని చెప్పెను. మహాత్ముఁడయిన భరతుని యాజ్ఞను శిరసావహించి, హర్షముగలవాఁడైన సుమంత్రుఁడు శ్రద్ధతో భరతుఁడు జెప్పినచొప్పున నన్ని పనులను గావించెను. సేనాధిపతులును, జనులును రామునిఁ బిలిచికొనివచ్చుటకై యొసఁగిన యానతిని విని, పరమానందభరితులైరి. ఆ పురియందలి యుద్ధవీరుల పత్నులు సంతసముతోఁగూడినవారయి ప్రతియింటను దమతమ భర్తలను దొందరపఱచిరి. సేనాధిపతులు వడిగాఁ బోవు గుఱ్ఱములను, ఎద్దులబండ్లను, రథములను, కాలి బలమును గొనివచ్చి భరతునకుఁ దెలిపిరి. అప్పుడు భరతుఁడు ప్రయాణమునకు సిద్ధమయివచ్చి నిలిచియున్న యాబలమునుజూచి ప్రక్కనున్న సుమంత్రునిఁజూచి, వసిష్ఠముని సమక్షముననే "సారథీ, నా రథము సిద్ధపఱపుము" అని చెప్పెను. అంత సుమంత్రుఁడు భరతు నాజ్ఞను విని, యానందభరితుఁడై, వేగవంతములయిన గుఱ్ఱములు గట్టిన రథమును, ద్వారలోఁ దెచ్చి సిద్ధపఱచెను. శాశ్వతమైన ధైర్యముగలవాఁడును, ప్రతాపవంతుఁడును, విడువని పరాక్రమము గలవాఁడునునైన భరతుఁడు మహారణ్య మధ్యమున నున్న కీర్తిశాలియగు తన యన్నను బతి

మాలి తోడ్కొని రాఁగోరి, సుమంత్రునితో నిట్లనియె, "సుమంత్రా, నీవు లేచి వేగముగఁబోయి సేనానాయకులతో సేనలను సిద్ధపఱుపుఁడని చెప్పుము. లోకముయొక్క మేలుఁగోరి, వనమున నున్నట్టి హితుఁడయిన రాముని బ్రార్థించి, యిచ్చటికిఁ బిలుచుకొని రాఁ గోరుచున్నాను." అని చెప్పెను. సుమంత్రుఁడును భరతునియాజ్ఞను శిరసావహించి, నిండిన మనోరథము గలవాఁడయి, పౌరులలో ముఖ్యులను, సేనాధిపులను, చెలికాండ్రను "మీ రందఱు త్వరగా రావలయును" అని యాజ్ఞాపించెను. అంతటఁ బ్రతియింటనున్న బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు, శూద్రులు భరతునివెంబడిఁ బోఁగోరి యుత్తమజాతియందుఁ బుట్టిన గుఱ్ఱములను, ఏనుఁగులను, ఒంటెలను, వేసడములను, రథములను ప్రయాణమునకై సిద్ధముచేసిరి.

## 83-వ సర్గము.

### భరతుఁడు పయనమై గంగాతీరమున విడియుట

అంత, భరతుఁడు వఱువాతనే లేచి, శ్రేష్ఠమైన రథము నెక్కి, రాముని జూచుటయందలి తమితో వేగముగాఁ బయనమయ్యెను. అతనిమంత్రు లందఱును, పురోహితుఁడును, సూర్యరథము మాడ్కి వెలుఁగుచుండునట్టి హయములు గట్టిన రథము నెక్కి, యాభరతుని యగ్రభాగమున బయలువెడలిరి. ఆ యిక్ష్వాకుకులప్రకాశకుండైన భరతునివెంబడి తొమ్మిదివేల యేనుఁగులు తరలినవి. నానావిధాయుధములనుదాల్చిన విలుకాండ్రగు రథికు లఱువదివేలును లక్షమంది గుఱ్ఱపు రౌతులును ప్రతిజ్ఞదప్పనివాఁడును, ఇంద్రియముల నణఁచినవాఁడును, గుణవంతుఁడని ప్రసిద్ధికెక్కినవాఁడును నైన యా భరతుని వెంబడించిరి. ప్రఖ్యాతిగన్న కౌసల్యయు, సుమిత్రయు, కైకేయియు రామునిఁ బిలుచుకొనివచ్చుటయందు మక్కువ గలవారలై వెలుఁగుచున్న వాహనములపైఁ గూర్చుండి వెంబడించిరి. మఱియు నయోధ్యాపుర వాసులగు జనులును, పెద్ద లందఱును రాముని, లక్ష్మణుని, సీతను జూడఁ గోరి, "మేఘముంబోలి నల్లనైన వాఁడును, దీర్ఘబాహుండును, విడువని సత్త్వమును, గట్టి నియమముగలవాఁడును, లోకమునకు దుఃఖమును బోఁగొట్టువాఁడును నైన రాముని మనమెప్పుడు చూడఁగలము?

సూర్యుఁ డుదయించుచు లోకమంతటియొక్క చీఁకటిని బోకార్చునట్లు,
రాముఁడు దర్శన మాత్రముననే మన శోకముఁ బోఁగొట్టఁగలఁడు,"
అని యిత్తెఱఁగున నా రామునిఁగూర్చి పలుతెఱఁగులైన వింత వింతలగు
కథలను జెప్పికొనుచు, మనములం దుప్పొంగుచు, నొండొరులఁ గౌఁగి
లించుచుఁ బయనమైరి. అచ్చట నెవ్వరెవ్వరు రామునకు నిష్టులో,
ఎవ్వరు పట్టణనివాసులో, యాజను లందఱు సంతోషభరితులై,
రామునిఁ జూడఁ బయనమైరి. వారితోడ ననేకులు రత్నముల సానపెట్టు
వారును, మంచి మనస్సుగల కుమ్మరులును, గుడ్డలవారును, ఆయుధము
లచే బ్రతుకువారును, నెమ్మితెక్కలవిసనకఱ్ఱ కట్టువారును, అంపపుఁ
గోఁతకాండ్రును, రంగులు తీర్చువారును, రత్నములు మొదలగు
వానికి బెజ్జములు వేయువారును, దంతపుఁబనులు సేయువారును, పాల
గాఱ మొదలగు సున్నపుఁబూఁతపనులు సేయువారును, సుగంధ ద్రవ్య
ముల నాశ్రయించి జీవించువారును, పేరు వహించిన కంసాలురును,
కంబళ్లు దుడుచువారును, అభ్యంజనాది స్నానములు చేయించువారును,
ఒడళ్లు పిసుకువారును, వైద్యులును, ధూపములు వేయువారును, మద్య
ములు పక్వముచేయువారును, చాకళ్లును, సాలెలను, పల్లెలందును
గొల్లపల్లియలందును నుండు పెద్దకాఁపులును, నట్టువకాండ్రును, చెంబడు
లును గాంతలతోఁ గూడి చక్కని వేషములు దాల్చి, తెల్లని బట్టలను,
గట్టుకొని యొఱ్ఱని గంధముఁ బూసికొని నానావిధ యానముల నెక్కి,
భరతుని వెంబడించి, యా రామునిఁ జూడఁ దఱలిరి. యోగనిష్ఠగల
వారును, వేదవిదులును, సదాచారసంపన్నులునైన వేలకొలఁది బ్రాహ్మ
ణులును ఎద్దులబండ్లెక్కి యా భరతుని వెంబడించిరి. సేన
లును గగ్గురుపాటుతోను వేడ్కతోనుఁగూడి, యన్నయందుఁ
బ్రేమ గలిగి యన్నను బిల్చుకొని రాఁబోవుచున్న కైకయీసుతుని భర
తుని వెంబడించెను. వారు రథగజాశ్వాది యానములమీఁదనే కడు
దవ్వేగి, రాముని చెలికాఁడగు గుహుఁడు బంధుమిత్రాది సంపన్నుఁడై,
జాగ్రత్తతో నేలుచుండెడి గంగానదీతీరమునందలి శృంగిబేర పురముఁ
జేరిరి. భరతుని వెంబడించి పోవుచున్న సేనయు చక్రవాకపక్షులచే
నొప్పుచున్న గంగానదీతీరముఁ జేరి యచ్చట నిలిచిన దాయెను. భర

తుఁడు తనసేనలు దారినడకచే డస్సియుండుటను, గంగానదియందలి తేట నీటిని జూచి, మంత్రుల నందఱ నవలోకించి, "ఇష్టము చొప్పున మన సేనల నిచ్చటనే నిలువఁజేయుఁడు. ఈరేయి యిచ్చట నలఁతఁ దీర్చుకొని, రేపటిదినమున నీ పుణ్యప్రదమైన గంగానదిని దాఁటుదము. అంతియకాక, స్వర్గము నొందిన మా తండ్రికిఁ బుణ్యలోకావాప్తికై, జలతర్పణముఁ గావింపఁ గోరియున్నాను." అని చెప్పెను. మంత్రులందఱు "మహా ప్రభూ! చిత్త మట్లే" యని, సేనల నన్నింటిని వేలువేలుగాఁ దమ తమ యిష్టము చొప్పున విడియఁ జేసిరి. భరతుఁడును గంగానదియొడ్డున వేయఁబడిన గుడారమునందు దిగి, మహాత్ముఁడయిన రామునిఁ దెచ్చు విషయముఁగూర్చియే యాలోచించుచుండెను.

## 84.వ స ర్గ ము.

### గుహుఁడు భరతునికి నతిథిసత్కారము సేయుట

గుహుఁడు గంగానదీతీరమున విశ్రమించియున్న గొప్ప సేనను జూచినంతనే, తత్తరపడుచు బంధువులం జూచి "ఈ గొప్పసేన యపార మయిన సముద్రముంబోలెఁ దోఁచుచున్నది. ఎంత తడవు మనమున యోచించినను, దీనియంతము తెలియరాకున్నది. చెడుతలంపుగల భర తుఁడు తానే యేగుదెంచిన ట్లున్నది. అవును. అదిగో కాంచనవృక్ష ముతోఁ జేయఁబడిన టెక్కెము గానిపించుచున్నది. రథమునందు గనఁబడుచున్న మహాకాయుఁడు భరతుఁడే. అతఁడు జాలరుల నందఱిని గట్టివేయుటకో, లేక మనల నందఱిం జంపుటకో వచ్చు చున్నాఁడు. అటుగాదేని, కైకేయీసుతుఁడు రాజగుటకు నర్హుఁడగు రాముఁ డేతెంచినపిదపఁ దన కీ రాజ్యము దొఱకుట యరుదగునో యని తలఁచి, తండ్రిచే నడవులకుఁ బంపఁబడిన రాముని వధింప నేగుదెంచెనో? రాముఁడు నాకుఁ బోషకుఁడును, చెలికాఁడును. కావున మీ రందఱు నతనికి మేలుగోరుచు, యుద్ధసన్నద్ధులై గంగానదీతీరప్రాంతములందుఁ దిరుగుచుండుడు. మీలోఁ గొందఱు సేనలతోడం గూడి యోడలందే మాంసము, పండ్లు, దుంపలు మొదలగువానిం దినుచు నేటిని గాపాడు చుండవలయు. ఏనూఱు పడవలలో పడవకు నూఱుగురిచొప్పున యువ కులు సన్నద్ధులయి యుండవలయు. భరతుఁడు రామునికిష్టుఁడుగ నుండు

నేని, యీ సేనలతోడ నితనిని దాటింతము." అని తనవారికిఁ జెప్పి, మత్స్యమాంసమద్యములను గానుకగాఁ గైకొని భరతు నెదుర్కొని వచ్చుచుండెను. ప్రతాపవంతుఁడును వినయము నెఱింగినవాఁడును నగు సుమంత్రుఁ డావచ్చుచున్న గుహునిఁజూచి యడకువతోడఁగూడి భరతు నితో నిట్లనియెను. "ఓ రాజపుత్రా! ఇదిగో కనఁబడునట్టివాఁడు స్థపతి యగు గుహుఁడు. ఇతఁడు వేలకొలఁది బంధుజనులతోఁ గూడినవాఁడై యీ దండకారణ్యమున నున్నాఁడు. ఇతఁడు వృద్ధుఁడు; నీ యన్నకుఁ బ్రాణస్నేహితుఁడు. కావున మన మా గుహునికడకుఁ బోదము. ఆతనికి రామలక్ష్మణు లుండు తావు తప్పక తెలియును." అని చెప్పెను. భరతుఁ డును సుమంత్రుని వాక్యము విని, "యట్లే మనము శీఘ్రముగా నా గుహునికడకుఁ బోదము." అని చెప్పెను. ఇంతలోపల గుహుఁడును భరతునివలన ననుజ్ఞను బొంది యెక్కువ సంతసముఁగలవాఁడై, బంధు వులను దోడ్కొనివచ్చి, భరతుఁజూచి, వినయముతో "నృపాలా! యీ దేశము మీయింటితోఁటవంటిది. మేము మీరాకఁ దెలియక మోస పోతిమి, మేము మాగృహంబుల నన్నింటిని మీకు నివేదించెదము. దాసులమగు మాయిండ్లయం దీ రేయియుండి రేపు పయనముసేయుఁడు. బోయలు తెచ్చిన కందమూలఫలములును, వనమృగములవైన యెండి నవి పచ్చివియగు వివిధములయిన మాంసములును విశేషముగా నున్నవి. ఈరాత్రికి సేనలతోఁ గూడ నా వివిధాహారములను భుజించి, మే మొసర్చు నుపచారముల నన్నింటిని స్వీకరించి, రేపు సైన్యముతోడఁ గూడి పోవచ్చు"నని చెప్పెను.

## 85-వ సర్గము

### భరతుఁడు సైన్యముతోఁ గూడ గంగానదిం దాటుట

మహావిచక్షణుఁడగు భరతుఁడు బోయల ఱేఁడయిన గుహుని పలుకులువిని, సహేతుకముగా నాతనికి "ఓ చెలికాఁడా! నీవు నాయన్నకుఁ జెలికాఁడవు. నీ కోరిక లన్నియు సఫలము లయ్యెను. నీ వొక్కఁడవే నాయింత సేనకు నాతిథ్యమీయఁ దలఁచితివిగదా" అని భరతుఁడు గుహునితోఁ జెప్పి మఱల నతనిం జూచి "ఓ గుహుఁడా! భరద్వాజా శ్రమమునకు నే దారినిఁ బోవలయును. గంగకుఁ జేరువ నున్న దేశము

వనములతో నిండినదై, చొర నలవికాక యున్నది. ఈ గంగానదిని
దాఁటుటయు మిక్కిలి కష్టతరముగాఁ గన్పట్టుచున్నది." అని ధీమంతుఁ
డయిన రాజపుత్రుఁ డడుగఁగా, అడవిద్రిమ్మరియైన గుహుఁడు దోసిలి
గట్టికొని, "రాజపుత్రా! నీవు వెఱవకుము. నా భృత్యులు విండ్లనుదాల్చి
మీవెంబడి మిక్కిలి జాగ్రత్తతో రాఁగలరు. నేనును నీవెంట వచ్చె
దను. హానికరములగు కార్యములు సేయని రామునికడకుఁ బోవుట
యందు నీకేమియుఁ జెడుతలంపు లేదుగదా! ఈ నీ యపారసైన్యముఁ
జూడ నీ వతనిపైకి దండెత్తి పోవుచున్నావేమో యని నాకు సందియ
ముగుచున్నది" అని యా భరతుని నడిగెను. అంతట నింగివలె నిష్క-
పటుఁడయిన భరతుఁడు "ఓ గుహా! రామునికి నేను కీడుచేయఁదలఁచు
నట్టి కష్టకాలము రాకుండునుగాక. నీవు శంకింపవలదు. ఆ రాముఁడు
నాకుఁ బెద్దయన్న. కావున నా కతఁడు తండ్రితో సాటియయినవాఁడు.
అడవుల నున్న యాకాకుత్స్థునిఁ దోడితెచ్చుటకు పోవుచున్నాను, నీవు
వేఱువిధముగాఁ దలఁపకుము. నిజము పలికితిని." అని తిన్ననిమాట
లతో గుహునికిఁ బ్రత్యుత్తర మొసఁగెను. గుహుఁడును భరతుని
మాటలు విని, మోమున సంతసముఁ గన్పఱచుచు, గగ్గుఱుపాటొంది,
మఱల భరతుం జూచి, "ఓభరతా! నీవు పుణ్యాత్ముఁడవు. భూతలమున
నిన్నుఁ బోలిన పుణ్యాత్ముఁ డీ భూమండలమున వేఱొక్కఁడు లేఁడు.
ప్రయత్నములేకయే వచ్చిన రాజ్యమును నీవు విడువఁగోరుచున్నావు.
ఇడుమలుపొందుచున్న రాముని నీవు తోడితేఁ గోరుచున్నావు గనుక,
నీకీర్తి యెల్లలోకములందును వెలయుచు శాశ్వతముగా నుండఁగలదు."
అని భరతునితోఁ జెప్పెను.

ఇట్లు గుహుఁడు భరతునితో ముచ్చటలాడుచుండఁగా, చండ
కిరణుఁ డగు సూర్యుఁడు తేజుడిగి యస్తమించెను, రాత్రియయ్యెను.
భరతుఁడును, సేనల నచ్చట దింపి, గుహునితో ముచ్చటలాడుచుఁ
గొంతతడవు గడపి, యాతనిశుశ్రూషలకు సంతసిల్లి, యారేయి శత్రు
ఘ్నునితో నచటఁ బరుండెను. ధైర్యశాలియు, అధర్మమున దృష్టిలేని
వాఁడునునైన భరతుఁడు తా నింతకుమున్ను దుఃఖములనెట్టివో యెఱుఁ
గనివాఁడును, దవానలముచేఁ గాలుచున్న యడవినడుమనున్న చెట్టును

దానిలోని గూఢముగ నుండునగ్ని తపింపఁజేయునట్లు, రామునిఁ గూర్చిన చింత యనెడు నగ్నిహోత్రుఁడు, భరతుని మనస్సులోపల నుండి యతనిని దహించెను. క్రాఁగి కరఁగి హిమపత్పర్వతమునుండి కారుచుండు మంచునీటివలె భరతుని యన్ని యంగములనుండియు దుఃఖాగ్నివలన చెమట వెలువడుచుండెను. కైకేయీపుత్రుఁడగు నా భరతుఁడు చింత యనెడు గొప్ప బండలును, నిట్టూర్పులనెడు ధాతువులును, దిగులనెడు వృక్షములగుంపులును, దుఃఖశ్రమములనెడు శిఖరములును, మూర్ఛ యనెడు మృగసమూహమును, సంతాప మనెడి యోషధులును బొంగు వెదుళ్లును గల దుఃఖమను, పర్వతముక్రింద నెటుపోవుటకును దోఁచక యుండెను. అంతట భరతుఁడు కడు నొచ్చిన మానసముతో వేఁడి నిట్టూర్పు విడుచుచు, మనస్సంతాప పీడితుఁడై యప్పుడప్పుడు తెల్వి దప్పుచు గుంపునుండి తప్పిపోయిన వృషభముమాడ్కిఁ బరితపించుచు సౌఖ్యముఁ బాసియుండెను. అప్పుడు గుహుఁడు సపరివారుఁడయి, భరతునికడ కేగుదెంచి, యాతనితో మాటలాడుచు, నతని దుఃఖమును జూచి, తానును దుఃఖమునొందుచు, నడుమ నడుమ భరతునికి రామునిఁ గూర్చిన సంగతులు సెప్పి యూఱడింపుచు నుండెను.

## 86-వ సర్గము

గుహుఁడు భరతునికి లక్ష్మణుని వాక్యము సెప్పుట

అరణ్యసంచారియగు గుహుఁడు సాటిలేని బలపరాక్రమము గల భరతునికి మహాత్ముఁడగు లక్ష్మణుని సద్భావమును దెలుపఁబూని “ఓ భరతా! తన యన్నయొక్క రక్షణముకొఱకై ధనుర్బాణములను ఖడ్గమును దాల్చి కంటిమీఁద రెప్పవాల్చక నిద్రమేల్కొని యుండువాఁడును, సుగుణసంపన్నుఁడును నగు లక్ష్మణునితో నేనిట్లంటిని: “రఘునందనా! ఓ నాయనా! ఈ సుఖకరమైన సెజ్జ నీకై యేర్పఱచఁబడినది. నీవు దీనియందుఁ బరుండి నిద్రించి సేద దీర్చుకొనుము. ఓ ధర్మాత్ముఁడా, ఈ జనమంతయు దుఃఖముల నోర్చుకొనఁగలది; నీవు సుఖములకుఁ దగినవాఁడవు. ఆ రాముని కాఁపుదలకై మే మందఱము మేల్కొనియుందుము. ఓ లక్ష్మణా! లోకమున రామునికంటె నాకు మిగులఁ బ్రియమైనది మఱొక్కటిలేదు. నీవు రామునిరక్షణకై

మేల్కొనియుండ నక్కఱ లేదు. నీ యెదుట నసత్యము పల్కుదునా? రాముని యనుగ్రహము వడసి యీ లోకమునఁ గడు గొప్పకీర్తిని, విస్తారమైన పుణ్యమును, ముఖ్యమయిన ధనాదిలాభమును బొందఁ గోరుచున్నాను. కావున నేను విల్లు చేతఁబట్టి బంధువులందఱితోడఁ గూడి సీతాసమేతుఁడై పరుండియున్న నా నెచ్చెలియగు రామునిఁ గాపాడుచుండెదను. ఎల్లప్పుడు నే నీవనము సంచారము చేయువాఁడను గనుక, నా కీవనమునఁ దెలియని దొక్కటి లేదు. మేము యుద్ధరంగమునఁ జతురంగములుగల సేనలనైన నోర్వఁగలము” అని మేము పలుకఁగా, ధర్మమునందే దృష్టిగల లక్ష్మణుఁడు మమ్ము నందఱ నిట్లెఱిఁగునఁ జెప్పి సమాధానపఱచెను. “ఓ గుహా! దశరథపుత్రుఁడైన రాముఁడు సుఖకరమైన సెజ్జపైఁ బరుండఁ దగినవాఁడు. అట్టి యాతఁడు సీతతోడ నుత్త నేలమీఁదఁ బరుండియుండఁగా, నా కెట్లు నిద్దురపట్టును. నాకుఁ బ్రాణములమీఁదనే యాశ లేదు. అట్లుండఁగా నాకు నిద్రమీఁదికిఁ గాని, సుఖములమీఁదికిఁ గాని యెట్లు ఆశ పోవును? యుద్ధరంగమున దేవాసురుల కందఱకైన నోర్వఁజాలని పరాక్రమముగల యట్టి రాముఁడు సీతతోడఁ గసవులందుఁ బరుండి నిద్రించుచున్నాఁడు. గుహా, నీవు చూడుము. దశరథుఁడు గొప్పతపస్సుచేసి, సకలకష్టములఁ బడి తనతో పాటి యగు గుణవంతుఁడైన యొక్కపుత్రునిఁ బడసెను. ఇతఁడు వనమునకు వచ్చిన పిదప, రాజు గారిఁక పెద్దకాలము బ్రతుకఁబోఁడు. కనుక త్వరలోనే ఈ పుడమి నాథుఁడులేనిది గాఁగలదు. ఇది సత్యము. ఓ నాయనా! అంతఃపురస్త్రీలందఱిప్పటివఱకు గొప్పగొంతుపెట్టుకొనియేడ్చి యేడ్చి యిప్పటి కాయేడ్పు చాలించియుందురు. కావున రాజగృహ మీవేళకు నిశ్శబ్దమై చప్పచల్లాఱియుండును. కౌసల్యయు, నృపాలుఁడును, అట్లే నాతల్లియు నీ రేయికూడ బ్రతికియుందురని నేను తలంపను. నా తల్లియగు సుమిత్ర తనకు మఱొక్క కొడుకున్నందున, వానింజూచుచునైనను బ్రాణములఁ దాల్చియుండును గాని, శూరుని తల్లియైన కౌసల్య తన యాయొక్క కొమరునిఁబాసి యెట్లు ప్రాణములతో నుండ గలదు? కడచినది కడచినదియే. నాతండ్రి రామునికిఁ బట్టాభిషేకము సేయఁగోరి యా కోరిక నొందకయే మృతినొందఁగలఁడు. పుణ్యాత్ములగువా

రెవ్వరో, వారు మాతండ్రి స్వర్లోకమున కేగునట్టి కాలము వచ్చి నపుడు నృపాలునికి దహనాది ప్రేతకార్యముల నెల్ల నెఱవేర్చు వారు ధన్యులు పుణ్యవంతులగు సుఖపురుషులును మనోజ్ఞములైన ముంగిళ్లతీరును గలదియు, చక్కఁగఁ దీర్చిన గొప్ప వీథులతోఁ గూడి నదియు, మేడలతోను, బలవంతులతోను, నిండినదియు సకలవస్తు రత్నములచేఁ గై సేయఁబడినదియు, రథ గజ తురంగము లనేకముగాఁగల దియు, వాద్య ధ్వనులతోఁ జెలరేఁగుచున్నదియు, సకల శుభకార్యములతోఁ గూడినదియు, ఉపవనములతోను, ఉద్యానములతోను నిండి నదియు, ఉత్సవసమాహములతో శోభిల్లుచున్నదియునై, మనస్సంతోషమును దేహపుష్టియుఁ గలిగిన జనులతో నిండియున్న మా తండ్రి యొక్క రాజధానియందుఁ బుణ్యాత్ములగు పురుషు లుండఁగలరు. ఈ గడువు సత్యసంధుఁడైన రామునితో క్షేమముగను సుఖముగను మేము మఱల నయోధ్యలోఁ బ్రవేశింతుమా!" అని రాజపుత్త్రుఁడగు మహాత్ముఁడయిన లక్ష్మణుఁ డీతెఱఁగున వగచుచు నారేయిని గడపెను. మఱునాఁటి సూర్యోదయమున రాజపుత్త్రు లిద్దఱును జడలు దాల్చిరి. నేను వారి నీ రేవునుండియే సుఖముగ దాఁటించితిని. అంతట బలవంతులును, శత్త్రువులను సంహరించువారును మేటి యేనుఁగులం బోలువారునునైన వా రిద్దఱు నారబట్టలను గట్టికొని కృష్ణాజినములు గప్పుకొని, జడవారులయి మేటివిండ్లను ఖడ్గములను బాణములను దాల్చినవారై యెక్కువ జాగ్రతతో సీతను నడుమ నుంచికొని నడచిపోయిరి.

## 87-వ సర్గము

### భరతుఁడు గుహుని పలుకులు విని చింతించుట

సుకుమారుఁడును, ఎక్కువ బలిమిగలవాఁడును, సింహపు మూఁపువంటి మూఁపులుగలవాఁడును, పొడవుచేతులవాఁడును, తెల్ల తామరపువ్వు రేకులవలెఁ విశాలములయిన కన్నులు గలవాఁడును, ప్రాయంపువాఁడును, ఆహ్లాదకరుఁడునునైన భరతుఁడు మిక్కిలి యింపుగాని గుహునిమాటలను విని, తనకోర్కి సిద్ధించునో, సిద్ధింపదో యని చింతింపఁదొడఁగి, కడుంగడు వగపునొంది, కొంత తడ వా వగపును మనమున నణఁచిపెట్టుకొని, దాని నట్లాపుకొనఁజాలక బరిగోలలచే

మిగులం బొడుపఁబడిన యేనుఁగుమాడ్కి నచ్చటనే పడెను. వెంబడి నున్న శత్రుఘ్నుఁ డట్టి యవస్థ గలిగియున్న భరతునిఁ గౌఁగిటఁ జేర్చి కొని, దుఃఖముచేఁ జిక్కినవాఁడయి, స్మృతిఁదప్పి గొంతెత్తి మిక్కిలి రోదనము చేసెను. అంత నుపవాసము లొనర్చియు, పెనిమిటిని బాసియు బడుగులయియున్న యా భరతుని తల్లులందఱు నచ్చటికివచ్చి నేల మీఁదఁబడియున్న భరతునిఁ జుట్టుకొని రోదనము గావించిరి. బిడ్డలపైఁ బ్రేమముగల రాముని తల్లియగు కౌసల్య తన బిడ్డనుబోలె భరతునిఁ గౌఁగిటఁజేర్చి, యతనితో నిట్లనియె. "ఓ నాయనా! నీకు దేహమున నేమియు వ్యాధిలేదుగదా! మా ప్రాణములెల్ల నీ యధీనములై యున్నవి. రాముఁడు లక్ష్మణునితోడ నడవికిఁ బోయినను, దశరథుఁడు స్వర్గమున కేగినను, నిన్నుఁజూచుకొని మేము జీవించుచున్నాము. ఇప్పుడు నీ వొక్కఁడవ మాకు దిక్కు. నాయనా! లక్ష్మణుంగూర్చి యైనను, భార్యాసమేతుఁడై వనమున కరిగియున్నట్టి, నా యేకపుత్త్రుఁ డగు రామునిఁగూర్చియైనను చెడుమాట దేనినైనను వింటివా?" అని కౌసల్య భరతు నడిగెను. కీర్తిశాలియగు నా భరతుఁడు కొంతసేపటికిఁ దెప్పిఱిల్లి రోదనముసేయుచునే కౌసల్య నూఱడించి, గుహునిఁజూచి, "రాత్రియం దెచ్చట రాముఁడును, సీతయు, లక్ష్మణుఁడును శయనించిరి? ఏమిభుజించిరి? చెప్పుము." అని యడుగఁగా, బోయలఱేఁడయిన గుహుఁ డును దన ప్రియుఁడును హితుఁడును నగు నతిథియగు నా రామునివిషయ మునఁ దాను నడచుకొన్న తీరెల్ల వివరింపఁదొడఁగెను. "నేను నానా విధములగు వ్యంజనములతోఁగూడిన షడ్రసోపేతమయిన యన్నమును, పలుతెఱఁగులైన పండ్లను, మఱియు ననేకములైన పదార్థములను రామునికి భోజనము నిమిత్తము దెచ్చిపెట్టితిని. విక్రమపరాక్రమముగల రాముఁడు వానిని జూచి, మఱల నన్నే తీసికొని పొమ్మనెనుగాని, తన క్షత్త్రియధర్మము దలఁచినవాఁడై, నా విందును గైకొనఁడయ్యెను. మఱియు మహాత్ముఁడగు రాముఁడు నన్నుఁ జూచి, "చెలికాఁడా! మే మెల్లప్పు డొక్కరి కియ్యఁదగునేకాని, పుచ్చుకొనుట యుచితము గాదు." అని మమ్ము సమాధానపఱచెను.

మహా కీర్తిశాలియగు రాముఁడు సీతతోఁగూడి లక్ష్మణుఁడు తెచ్చియిచ్చిన యుదకముఁ ద్రావి, యా రేయి యుపవాసవ్రతము నాచరించెను. లక్ష్మణుఁడును మిగిలిన జలముఁ ద్రావెను. అట్లు వారు మౌనవ్రతులై, యేకాగ్రమనస్కులై సంధ్యోపాసన చేసిరి. లక్ష్మణుఁడును సంధ్య నుపాసించి, తానే యేగి దర్భలను దెచ్చి, రాముని నిమిత్తమై మెత్తని పాన్పు నేర్పఱచెను. రాముఁడును సీతాసమేతుఁడై యా మెత్తని దర్భశయనమునఁ బరుండెను. అప్పుడు లక్ష్మణుఁడు వారి యిరువురి పాదములఁ గడిగి, యావలికిఁ బోయెను. భరతా! వారు పండుకొన్నది యీ గారచెట్టుక్రిందనే. రాముఁడును సీతయు దేనియం దా రాత్రి శయనించిరో, అదియే వారు శయనించిన యీ దర్భశయనము. శత్రుసంహారియగు లక్ష్మణుఁడును ఆల్లెత్రాటి దెబ్బ తగులకుండుటకై యత్త్రైమును, వ్రేళ్ల యొరయుఁ దొడిగికొని, బాణములు నిండుగనున్న యమ్ములపొదులను వీపునకుఁ గట్టుకొని, తన గొప్పవి ల్లెక్కుపెట్టుకొని రేయియంతయుఁ గంటిమీఁద ఱెప్పవాల్పక యీ రామునికిఁ జుట్టు తిరుగుచుఁ గావలి గాచుచుండెను. అంతట నేనును, నుత్తమములగు ధనుర్బాణములను ధరించి, లక్ష్మణుఁ డున్నచోటనే, దేవేంద్రుఁబోలు రామునిఁ గాచుచుంటిని. నా బంధుగులును నా రేయి నిదుర మాని ధనుస్సులు చేతఁబట్టి వారిని గాచుచుండిరి.

## ౮౯-వ సర్గము

### భరతుఁడు రామునిసెజ్జఁ జూచి విలపించుట

భరతుఁడు గుహుని మాటలను శ్రద్ధతో విని, గారచెట్టు మొదటి కేఁగుదెంచి, యా రాముని పాన్పును జూచి, తల్లులందఱిం బిలిచి, "యిచ్చట నమ్మహాత్ముఁడైన రాముఁడు నేలమీఁదఁ బరుండుటకై యేర్పఱచిన పాన్పు ఇదియె. ఇదిగో నలిగి చెదరియున్నది. గొప్ప కులమునఁ బుట్టినవాఁడును, గొప్పవాఁడును నైన జ్ఞానియగు దశరథునికిఁ బుట్టిన రాముఁ డిత్తెఱఁగున నేలపైఁ బరుండుట తగునే? మఱియుఁ బురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు కృష్ణాజినము పఱచినదియు, మేలగు ననేకాస్తరణములు గలదియునైన హంసతూలికాతల్పమునఁ బరుండువాఁడు; ఇప్పు డెట్లు కటికినేలపైఁ బరుండుచున్నాఁడో! ఈ రాముఁడు

విమానములం బోలు మేడలకొనభాగములందును, పై యంతస్తులం
దును, బంగారు వెండి రేకులుతాపినవియు, మేలయిన యాస్తరణ
ములచే శోభిల్లుచున్నవియు, నానావిధములగు పూవులు పఱచినందున
బలురంగులు గల్గియున్నవియు, చందనముయొక్కయు అగురు
యొక్కయు కమ్మనివాసనలు గుబాళించుచుండునవియు తెల్లని మబ్బుల
కాంతివంటి కాంతిగలవియు, చిలుకల కూఁతలతోఁ గూడినవియు, చల్ల
దనము, సువాసనయుఁ గలిగినవియు, బంగారుమయములగు గోడలు
గలిగియున్నందున మేరుపర్వతమును బోలియున్నవియునైన శ్రేష్ఠము
లయిన మేడలమీఁదఁ బరుండి, గీతములయు వాద్యములయు ధ్వనుల
చేతను, మేటిసొమ్ములధ్వనులచేతను, మద్దెల చప్పుళ్లచేతను మేల్కొలుపఁ
బడి, యరుణోదయమునఁ బలువురు సూతమాగధులు పాడెడి యింపు
లయిన పాటలను, వంశావళీబిరుదులను వినుచు లేచుచుండినవాఁడు.
అట్టి రాముఁ డిప్పు డుత్తనేలపైఁ బరుండినాఁ డన్నమాట నమ్మఁదగిన
దని నాకుఁ దోఁప లేదు. ఇది వట్టిమాట యని నాకుఁ దోఁచుచున్నది.
నా మనసు గలవరపడుచున్నది. ఇది కల యని నా యభిప్రాయము.
కాలమునకంటె నెక్కువ బలము గలది యొక్కటియు లేదు. లేకున్న,
దశరథపుత్రుఁడయిన రాముఁ డిట్లుత్తనేలపైఁ బరుండునా? జనకమహా
రాజు కూఁతురును, దశరథనృపాలుని కోడలును, చూచుట కింపయిన
దియు రామునికిఁ బ్రియురాలునైన సీత యెట్లు కటికి నేలపైఁ బరుండు
చున్నది? ఇది మా యన్నగారి పాన్పు. ఇచ్చటనే యాతఁడు పొరలు
టచే నతని యంగము లన్నింటియొక్క రాయిడిచేత నీ దర్భలసెజ్జ
నలఁగియున్నది. ఈ మేటి దర్భశయనమున సీత యాభరణములఁ దాల్చి
నదియై పరుండిన దని తోఁచెడి. కావుననే యచ్చటచ్చట బంగరుపొడి
పడియున్నది. మఱియు నిచ్చట సీత తనపైఁటచెఱఁగుఁ గ్రిందపఱచుకొని
పరుండినట్లున్నది. కాఁబట్టి దర్భలపై నచ్చటచ్చటఁ దెల్లపట్టు నూలి
పోఁగులు దగులుకొనియున్నవి. చిన్నదియు, కష్టముల నోర్వఁజాల
నిదియు, పతివ్రతయు, జాలి నొందఁదగినదియు నైన యా సీత భర్తతోఁ
గూడ నీ పాన్పునఁ బరుండినందున నామెకుఁ గష్టము తెలియరాకుండు
నని తలఁచెదను. అక్కటా! నేనెంత పాపిష్ఠుఁడను! నా నిమిత్తమయి

రాముఁడు దిక్కులేనివానివలెఁ భార్యతోడ నిట్టి కటికి నేలపైఁ బరుండుచున్నాఁడుగదా! చక్రవర్తుల వంశమునఁబుట్టినవాఁడును, జనుల కందఱకు నిష్టుఁడును, జనుల కందఱకు మేలుచేయువాఁడును, ఎఱ్ఱ తామరపువ్వులంబోలు కన్నులవాఁడును, ఆహ్లాదకరుఁడును, సుఖములకుఁ దగినవాఁడును, దుఃఖములకుఁ దగనివాఁడును నయిన యీ రాముఁ డెట్లుత్త నేలపైఁ బరుండుచున్నాఁడు? మంగళకరములగు లక్షణములు గల లక్ష్మణుఁ డాపదలందుఁ దన యన్నను గొల్చుచున్నాఁడు గాన నాతఁడు ధన్యాత్ముఁడు. భర్తను వెంబడించిన సీతయు ధన్యాత్మురాలు. మహాత్ముఁడయిన యీ రామునిఁ బాసియుండిన మన మిప్పు డాతనికడకుఁ బోయిన మనసేవ నొప్పుకొనునో, లేక నాతోఁగూడ రావల దనునో యని సంశయపడుచున్నాను. దశరథుఁడు స్వర్గమున కేగఁగను, రాముఁ డరణ్యమున కేగఁగను, ఈ భూమండలము సముద్రమందు మాలిమిలేని యోడవలె శూన్యముగ నున్నది. రాముఁ డరణ్యమున నున్నను, శత్రురాజు లతని శౌర్యమునకు వెఱచి, యాతని బాహుబలముచేఁ గాపాడఁబడు నీ నేల నాక్రమించుకొన నెల్లరును వెఱచుచున్నారు. ప్రాకార రక్షకులు లేనిదియు, కట్టఁబడనందున స్వేచ్ఛమైఁ దిరుగుచుండు గుఱ్ఱములు నేనుఁగులుఁ గలదియు, తెఱవఁబడియుండు తలుపులు గలదియు, సైన్యములు సంతసము దక్క యసడ్డగలిగియున్నందున కాఁపుదల లేనిదియు, తగ్గుస్థితిలోను, కష్టదశయందు నుండునదియునై యున్నను, శత్రురాజులు విషముగలిపిన భక్ష్యములనుబోలె నీ యయోధ్యాపురమును గోరకయున్నవారు. కావున రాజ్యమున నెవ్వఁ డుండకపోయినను గీడు లేదు. ఇదిమొదలు నేనును నెల్లప్పుడు గంద మూల ఫలముల నాహారముగాఁగొనుచు, జడలుదాల్చి, నారచీరలు గట్టుకొని, నేలమీఁదనో, తృణములమీఁదనో పరుండెదను. నేనును ఆ రాముని ప్రతిజ్ఞ నవలంబించి, యిదివఱకుఁ గడచిన దినములు పోను మిగత కాల మంతయు సుఖముగా వనమున నుండెదను. రాముని ప్రతిజ్ఞ యెన్నఁటికి నసత్యముగానేరదు. అన్నగారి నిమిత్తము వనముల నుండు నన్ను శత్రుఘ్నుఁ డనుసరించి, నావలెనే కందమూల ఫలాశనుఁడై నారబట్టలఁ గట్టు

కొని భూదర్భశయనము చేయుచుండును. మా యన్నగారు లక్ష్మణ సమేతుఁడై యయోధ్యాపురమును బాలింపఁగలఁడు. అయోధ్యాపుర వాసులగు విప్రులు రామునికిఁ బట్టాభిషేకము సేయఁగలరు. దేవత లందఱు నా యీ కోరికను సఫలముఁ జేయుదురా నేను రామునికిఁ దలతోఁ ద్రొక్కి పలుతెఱఁగుల బతిమాలుకొనెదను. అట్లు నా ప్రార్థనము నతఁ డియ్యకొనఁడేని, నేనును రామునితోడ నుండెదను. తనతోడి వనవాసమునకు రాముఁడు న న్నంగీకరింపక పోఁడు." అని చెప్పుచు మిక్కిలి విలపించెను.

## 89-వ స ర్గ ము.

భరతుఁడు గంగానది దాఁటి భరద్వాజాశ్రమమును జేరుట

భరతుఁడు రాత్రియంతయు నా గంగానదీతీరముననే యుండి, వేకువ లేచి, శత్రుఘ్నుంజూచి, "యో శత్రుఘ్నా! యేల యింకను నిద్రపోవుచున్నావు? లే లెమ్ము. బోయల ఱేఁడగు గుహుని వేగఁ దోడ్కొని రమ్ము. నీకు మేలగును. అతఁడు మనలను గంగానదిని దాఁటించును" అని చెప్పెను. ఆ మాటలను విని శత్రుఘ్నుఁడు భరతునితో, "ఓ యన్నా! నేను మేల్కొనియున్నాను. ఆ పూజ్యుఁడైన యన్న నే తలఁచుచుండుటచే నాకు నిద్దుర పట్టకున్నది" అని చెప్పెను. ఇట్లు పురుషోత్తములగు వీ రిరువురు పరస్పరము మాటలాడుకొనుచుండఁగా, గుహుఁడు భరతునికడ కేగుదెంచి చేతులు జోడించికొని, యా భరతునింగూర్చి, "ఓ భరతా! యీ గంగానదీతీరమున నీ రేయి సుఖముగా నుంటిరిగదా! నీవు సేనలతోఁ క్షేమముగనుంటివిగదా." అని యడిగెను. రామునికి విధేయుఁడగు భరతుఁడును గుహుఁడు చెలిమితోఁ జెప్పిన యా మాటను విని, "యో గుహా! మే మీ రేయి సుఖముగాఁ గడపితిమి. నీవును మాకు సకల మర్యాదలను జేసితివి. మేము గంగానదిని దాఁటఁ గోరుచున్నాము. నావికులను రప్పించి, మమ్ము గంగానదిని దాఁటింపుము. అనేకములైన యోడల నాయితము చేయింపుము" అని చెప్పెను. అంత భరతుఁడు త్వరతో నాజ్ఞాపించిన యాజ్ఞను శిరసావహించి, తన పల్లెకుఁ బోయి తన బందుగుల నందఱను బిలిచి, "లే లెండు. మేల్కొనుఁడు. మీ కెల్లప్పుడు మేలయ్యెడు. పడవల

సిద్ధపఱచుకొనిరండు. భరతుని నదిని దాఁటింతము.” అనెను. వారందఱు నట్లే యని లేచి, తొందరపాటుతోఁ దమ ప్రభువు నుత్తరువు ప్రకారమే యేనూఱు నావలను వేగిరమె యీడ్చుకొనివచ్చి యంతట నింపిరి. ఇవియేకాక, గొప్ప గంటలు గట్టఁబడినవియు, గాలియొక్క రాకపోక లకుఁ దగిన గవాక్షములు గలవియు, చక్కగ నిర్మింపఁబడినవియు, మిక్కిలి శోభిల్లుచున్నవియునైన యుత్తమములగు మఱికొన్ని స్వస్తి కము లనెడు నావలకు టెక్కెమును గట్టి, వానినిఁగూడ రేవునకుఁ జేర్చిరి. అంతట గుహుఁడు తెల్లని కంబళము పఱచినదియు, చిఱు గంటలు గట్టినదియునై యొప్పుచున్న యందమైన స్వస్తిక మనెడి యొక నావను దెచ్చెను. ఆ యోడయందు భరతుఁడును, మహా బలుఁడగు శత్రుఘ్నుఁడును నెక్కిరి. వారికిఁ బిదప గురువులును, పెద్దలగు బ్రాహ్మ ణులును నెక్కిరి. పిమ్మట, కౌసల్య, సుమిత్ర మున్నగు రాజస్త్రీలును నెక్కిరి. వారెక్కిన తరువాత భరతుని దేవేరులు మొదలగు రాజ కాంత లందఱు నెక్కిరి. పిదప రథములును బండ్లు, అంగళ్ళును నెక్కింపఁబడెను. అప్పుడు సైనికులలోఁ దాము విడిసిన స్థానముల దహించువారును, నోడలలో నెక్కుటకయి రేవున దిగువారును, సామగ్రులను ఓడలలోపలి కెక్కించువారును జేయుచున్న గొప్ప రొద మిన్ను ముట్టుచుండెను. సేన లెక్కినతర్వాత, నావికులు గూర్చుండి యోడ చాపలు విప్పిన వెంటనే యా యోడలు తమంత మఱింత వేగ ముగా నేగెను. కొన్ని నావలలో నాఁడువా రెక్కిరి. మఱి కొన్నిటిలో గుఱ్ఱము లెక్కినవి. కొన్ని నావలం దెక్కువ బండ్లను, రథములను, ఎద్దులు, గుఱ్ఱములు మొదలగు వాహనములను విస్తారమగు ధనమును సైనికు లెక్కించిరి. ఆ యోడలు నడుపువా రోడల నావలి గట్టును జేర్చి వారినందఱను దింపిరి. పిమ్మట నావికులు నీటియందు నావలను జిత్ర విచి త్రముగ ద్రిప్పిరి. టెక్కెములుగట్టిన యేనుఁగులను మావటీండ్రు దాఁటిం చిరి. అవి యపుడు నడగొండలోయను నట్లుండినవి. మఱియు ననేకులు నావలలో నెక్కి దాఁటిరి. కొందఱు తెప్పలలో నెక్కి దాఁటిరి. కొందఱు కానలపై దాటిరి మఱికొంద ఱీఁదుచు దాఁటిరి. గంగాస్నానముచేఁ బరి శుద్ధమైన యాసేన గంగానదిని దాఁటినదై, మైత్ర మనుముహూర్తమున

సందమయిన ప్రయాగవనమునకుఁ దఱలినవి. మహాత్ముఁడగు భరతుఁడు సేనలను గొంత సేవ్వాఱట నొందించి, సుఖమునకుఁ గొఱఁత రాకుండు నట్లు ప్రయాగవనముననే నిలిపి, తాను ఋత్విజులతోఁ గూడి, ఋషి శ్రేష్ఠుఁడయిన భరద్వాజ మహామునిని జూడఁబోయెను. భరతుఁడట్లుపోయి మహాత్ముఁడును, దేవపురోహితుఁడును, బ్రహ్మవేత్తయునైన ద్విజ శ్రేష్ఠుఁడగు భరద్వాజ మునీంద్రునియొక్క యాశ్రమము చేరి రమ్యము లయిన పర్ణశాలలతోడను, చెట్లగుంపులతోడను నొప్పారుచు రమణీయ ముగనున్న గొప్పయాశ్రమ వనమును జూచినవాఁ డయ్యెను.

## ౯0-వ స ర్గ ము

### భరతుఁడు భరద్వాజాశ్రమమున నుండుట

నరశ్రేష్ఠుఁడగు భరతుఁడు సకల ధర్మముల నెఱిఁగినవాఁ డగుటం జేసి, కోసుదూరముననే భరద్వాజాశ్రమమును జూచి, సైన్యము నంతయు నచ్చట నిలిపి, శస్త్రములను సకల భూషణములను దీసివైచి తెల్లని పట్టుబట్టలను గట్టుకొన్నవాఁడై, పురోహితుని ముందిడుకొని, మంత్రులు వెంబడి వచ్చుచుండఁగాఁ గాలినడకను గొంతదవ్వేఁగి భర ద్వాజాశ్రమము చొచ్చినపిదప మంత్రులను గూడ నిల్పి, పురోహిత పురస్సరుఁడై, భరద్వాజమునీంద్రునిఁ జూడఁబోయెను. విశేష తపస్సం పన్నుఁడగు భరద్వాజమునీంద్రుఁడు వసిష్ఠునిఁ జూచినంతనే, శిష్యులను బిలిచి, యర్ఘ్యము తెండని యానతిచ్చి తా నాసనమునుండి లేచెను. మహాతపోమహిమగల యా భరద్వాజుఁడు వసిష్ఠుని గలిసికొనెను. అపుడు భరతుఁ డమ్మునీంద్రునకు మ్రొక్కెను. భరద్వాజమునీంద్రుఁ డును ఆ మ్రొక్కిన యాతఁడు దశరథనృపాలుని కొడుకగు భరతుఁ డని యెఱింగెను. అంత భరద్వాజుఁడు భరత శత్రుఘ్నుల కిరువురకును మొదట నర్ఘ్యపాద్యముల నొసఁగి, యావల వన్యము లయిన ఫల ముల నొసఁగి, వరుసఁదప్పక యందఱి క్షేమమరసి, పిదప నయోధ్యయం దలి సేనలు, బొక్కసము, చెలికాండ్రు, మంత్రులు మొదలగువారిని గూర్చి, సేనలు బాగున్నవా? బొక్కసముల నిండుగా ధనమున్నదిగదా? చెలికాండ్రందఱు నీ మేలరయుచు నుందురుగదా? మంత్రులు నీ కాలోచనలఁ జెప్పుచుందురుగదా?" యని యడిగెను, కాని దశరథనృపా

టని మరణవార్త నెఱిఁగియున్నవాఁడు కావున నా సంగతిమాత్ర మెత్తఁడయ్యెను. అట్లె వసిష్ఠమునీంద్రుఁడును, భరతుఁడును భరద్వాజ మునీంద్రునిఁ జూచి, "మునీంద్రా! తమకు క్షేమమేగదా! అగ్నిహోత్ర కార్యములు చక్కఁగా జరుగుచున్నవిగదా! శిష్యులు మీ మాట చొప్పున నడచుకొందురుగదా! తపోవనమునందలి మృగపక్షు లొండొరుల మీఁద వైరముఁ బాటింపక పొత్తుగలిగి మనుచున్నవిగదా!" యని యడిగిరి. మహాతపస్వియగు భరద్వాజ మునీంద్రుఁడును "మీ రడిగినదియెల్ల నట్లెయున్న"దని వారిద్దఱితోఁ జెప్పి, రామునియందలి చెలిమిచే భరతుని కిట్లనియె. "ఓ భరతా! నీవు రాజ్యము నేలుచు నిక్కడి కేల యేతెంచితివి? రాజ్యము విడిచి యిట్లు రావలసినంతపని యేమి వచ్చినది? నామనము పరిపరివిధములఁ బోవుచున్నది కావున నా కీ వృత్తాంతము సవిస్తరముగా వినిపింపుము. శత్రుసంహారకుఁడును లోకానందకరుఁడును కీర్తిమంతుఁడును కౌసల్యకన్నకొడుకును నగు రాముని దశరథుఁడు స్త్రీకి లోఁబడి "పదునాలుగేండ్లు వనవాసివిగమ్ము" అని తమ్మునితోడను, భార్యతోడను గూడ నడవులకుఁ బంపెను. నీవు నిష్కంటకమగు రాజ్య మనుభవింపఁగోరి, నిరపరాధియగు నా రాము నకుఁగాని, యాతని తమ్ముఁడగు లక్ష్మణునికిఁగాని యెట్టి కీడును జేయఁ గోరవుగదా!" యనెను.

ఇట్లు భరద్వాజమునీంద్రుఁ డడుగఁగా, భరతుఁడు కన్నుల నిండుగ నీరుదెచ్చుకొని దుఃఖముచేఁ దొట్రుపడుమాటలతో నిట్లనియె. "ఓ మునీంద్రా! తామును నీప్రకారముగాఁ దలఁచితిరేని, నా బ్రదుకు బ్రద్దలయి పోయినది. నావలన నెట్టి యపరాధమును లేదని తలఁచెదను. తా మిట్లానతిచ్చి నన్ను నొప్పింపకుఁడు. నా తల్లి కైకేయి నేను లేనప్పు డెయ్యది చేసినదో, యది నా కెంతయు సమ్మతముగాదు, నేను వచ్చిన పిదప నా కా సంగతి దెలిసినను, నాకు రాజ్యము వచ్చెఁ గదా యని నేను సంతసము నొందను లేదు. నే నామె మాటప్రకారము పట్టాభిషేకము చేసికొనను గోరలేదు. నే నన్ననో యా రాముని పాదములను మ్రొక్కి, యాతనిం బ్రతిమాలి, యతనిని నాయెడ ననుగ్రహము గలవానినిగ నొనరించుకొని యయోధ్యాపురికిఁ దోడుకొనిపోవ వచ్చి

తిని. ఓ మహాత్మా! తాము నా మనోరథము నెఱిఁగితిరి కావున, నాయెడ ననుగ్రహించి, యా రామభూపాలుఁ డెచ్చటనున్నవాఁడో యెఱిఁగింపుఁడు" అని భరతుఁడు భరద్వాజముని నడిగెను. అప్పుడు వసిష్ఠాది మహర్షులును, ఋత్విజులును "మహాత్మా! భరతుని ప్రార్థనము నెఱవేర్పు" మని యాచింపఁగా, భరద్వాజమునీంద్రుఁడును భరతునియెడ ననుగ్రహముసేసి, "ఓ పురుషశ్రేష్ఠుఁడా! పెద్దల సహవాసమును, నోర్పును, సత్పురుషుల ననుసరించుటయు రఘువంశమునఁ బుట్టినవాఁడవగు నీకుఁ దగియేయున్నవి. నీ మనసుననున్న సంగతి నే నెఱిఁగియున్నాను. అయినను, ఆ విషయమును దృఢముగాఁ దెలియఁగోరియు, నీకీర్తి దిగంత విశ్రాంతమగుటకును నే నీమాట యొత్తి యడిగితిని. ధర్మజ్ఞుఁడగు రాముఁడు తమ్మునితోను, సీతతోను గూడి యెచట నుండునది నే నెఱుఁగుదును. నీ యన్న చిత్రకూట మను మహాపర్వతమున నున్నాఁడు. రే పక్కడికిఁ బోదువుగాని, మంత్రులును, నీవును నీ రేయి కిచ్చట నుండుఁడు. అర్థ కామము లను పురుషార్థముల స్వరూపం బెఱింగిన యో బుద్ధిమంతుఁడా! యీ నా ప్రార్థన నంగీకరింపుము." అని భరతునితోఁ జెప్పెను. అంత గొప్పభావముగలవాఁడును, సౌందర్యవంతుఁడునైన రాజపుత్రుఁడగు నా భరతుఁ డట్లె యని చెప్పి, యా మునీంద్రుని యాశ్రమమున నా రేయి గడపఁదలఁచెను.

## 91-వ సర్గము.

### భరద్వాజమునీంద్రుఁడు భరతునకు విందుసేయుట

కైకేయీపుత్రుఁడగు భరతుఁడును నా రేయి యచ్చట నుండుట కియ్యకొనఁగా, నప్పుడు భరద్వాజమునీంద్రుఁ డాతనిని భోజనాంతమైన యతిథిసత్కారమును గ్రహింపగోరెను. భరతుఁడును, "మహాత్మా! తమ రర్ఘ్యపాద్యము లొసఁగి, వనమున దొఱకు ఫలాదులచే నతిథిసత్కారము చేసితిరిగదా! ఇంక నేమి" యని యడిగెను. ఆ పలుకులు విని, మునీంద్రుఁడును "భరతా! నీవు నాయెడఁ బ్రేమగలవాఁడవనియు, నే నేది యొసఁగినను, నీవు దానిచేతనే తనివి నొందుదువనియు నే నెఱుఁగుదును. అయినను, ఈ నీసేనకెల్ల విందుపెట్టఁ గోరుచున్నాను. నరశ్రేష్ఠా! నా కోరిక యెట్లున్నదో, యది యట్లు నెఱవేర్తువుగాక.

పురుషోత్తమా! నీవు దవ్వుననే యేల సేనలను విడిచి వచ్చితివి! సేనలను దోడ్కొని యేల రావైతివి?" అని యడిగెను. భరతుఁడును, చేతులు జోడించి "మహాత్మా! తమకు వెఱచి సేనతోడ రానైతిని. రాజొండె, రాజపుత్త్రుఁడొండె యెల్లప్పుడు తపస్విలుండు ప్రదేశములను సర్వవిధములఁ దప్పించి తిరుగుచుండవలెను. భగవంతుఁడా! శ్రేష్ఠములైన గుఱ్ఱములును, మేటి మదపుటేనుఁగులును, సైనికులును చాలమేర యాక్రమించి నన్ను వెంబడించుచున్నవి. ఆ సేనలు తపోవనమునకు లోపల వచ్చునేని, యాశ్రమములందలి నేల చెట్లను విఱిచి, నీటినిగలియఁబెట్టి, నేలను ద్రొక్కి దుక్కిచేసి పాడుచేయుననియుఁ బర్ణశాలలను బడఁద్రోయుననియుఁ దలఁచి నే నొక్కరుండనే వచ్చితిని" అని చెప్పి, యమ్మహర్షివలన సేనలను లోపలికిఁ దోడ్కొనిరా నానతిఁ బడసినవాఁడై, సేనలను ఆశ్రమమునకుఁ బిలిపింప నానతియొనర్చె.

అంత భరద్వాజమునీంద్రుఁ డగ్నిహోత్రశాల కేఁగి, యాచమనము మున్మూఁ డొనర్చి, తుడుచుకొని, భరతునికి నతిథిసత్కారము సేయుటకై, కొందఱు దేవతల నాహ్వానము చేసెను. "దేవతల వడ్రంగి యగు విశ్వకర్మను ధ్యానించెదను. అతఁడు వచ్చి భరతుని సేనలకు వలయు గుడారములను నిర్మించునుగాక. యమ వరుణ కుబేరు లను లోకపాలురను మువ్వురను, నింద్రుఁడు మొదలగు వేల్పులను బిలిచెదను. వారు దానికై ప్రయత్నపడుదురుగాక. పూర్వవాహినులగు నదులను, పశ్చిమవాహినులగు నదులను, మఱి భూమ్యాకాశముల యందుఁ బ్రవహించు నదులను బిలిచెదను. అవి యన్నియుఁ గూడి వచ్చి యీ యాశ్రమమునందలి సేనల యుపయోగార్థము నిల్చును గాక! కొన్ని నదులు మైరేయమును, మఱికొన్ని నదు లుత్తమమగు కల్లును, మఱికొన్ని నదులు చెఱకుపాలంబోలు చల్లని యుదకమును నొసఁగునుగాక! విశ్వావసువు, హాహా, హూహూవులు మొదలగు గంధర్వులను, గంధర్వాంగనలను, ఘృతాచి, విశ్వాచి, మిశ్రకేశి, అలంబుస, నాగదంత, హేమ, పర్వతముననుండు హిమ మొదలగు నచ్చరలను, దేవేంద్రుని గొల్చెడి స్త్రీలను, బ్రహ్మ నుపాసించుచుండు స్త్రీలను వారి వారి నృత్తగీతాది వాద్యసాధనములతోను బాడినవారిని, గానశిక్షకుఁ

దగు తుంబురు మహామునిని బిలిచెదను. వారందఱు నేతెంచి, నాట్యము సల్పియుఁ, బాటలు పాడియు భరతుని, నతని పరివారమును సంతసపఱుతురు గాక! ఉత్తరకురుదేశములందు వస్త్రములు భూషణములు ననెడి యాకులు గల్గి, రూపవతులగు నంగనలనెడి ఫలములతో శోభిల్లుచుండెడి కుబేరుని సంబంధియైన చైత్రరథమను వనమును, ధ్యానించెదను. అది యిచ్చటికి వచ్చియుండునుగాక. నేను చంద్రుని ధ్యానించెదను. అతఁడు నా ప్రార్థనము నంగీకరించి, భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పానీయము లనెడు చతుర్విధాన్నములను విస్తారముగా వెంటనే సిద్ధపఱచి, నానావిధములగు పుష్పములను భూషణములను, మద్యము మొదలగు పానీయములను పలుతెఱఁగుల నంజుళ్లను సిద్ధముచేయును గాక!" అని యివ్విధమునఁ జెప్పి యోగబల తపోబలములుగల యా భరద్వాజ మునీంద్రుఁ డుత్తేఱఁగున శిక్షయందలి స్వరములతోఁ గూడిన పలుకులతోఁ జేతులు జోడించి తూర్పునకుఁ దిరిగి, దేవతల నందఱను వేర్వేఱుగ మనమున ధ్యానించెను. అంతట వేల్పులందఱు నమ్మునీంద్రుని యెదుటఁ బ్రత్యక్షమైరి. పరిశుద్ధమయిన వాయువును మలయ దర్దుర పర్వతములనుండి వెడలి, జనుల శ్రమవలని చెమ్మటఁ బోకార్చుచు, నెత్తావితోఁగూడి జనుల కానందమును గలిగించుచు వీచుచుండెను. దేవత లాకసమునుండి యెడతెగని దివ్య పుష్పవర్షములఁ గురిపించిరి. దేవతలు దుందుభివాద్యములు వాయింపఁగా, వానిమ్రోతలు దిక్కులెల్ల నిండెను. అప్సరస లందఱు నాట్యమాడిరి. నెత్తావిగల చల్లని తిన్నని గాలులు వీచినవి. దేవతలు గంధర్వులు వీణలను వాయించుచుఁ దదనుగుణముగా గానము సేసిరి. నృత్తగీత వాద్యాదులవలనఁ బుట్టిన యా ధ్వని, మిక్కిలి తిన్ననిదై, శ్రుతితో నేకీభవించి, లయతోఁ గూడి భూమ్యంతరిక్షములందు వ్యాపించి ప్రాణుల శ్రవణముల కానందముఁ గొల్పుచుండె. సకలజనానందకరమయిన యాధ్వని యాఁగినంతనే, భరతుని సైనికులాయాశ్రమమున విశ్వకర్మచే నిర్మితములయిన విడిదలల వింత నిర్మాణమును జూచుచుండిరి. అయ్యాశ్రమముచుట్టు నైదుయోజనములదూరము భూమి యంతటను చదనై, పచ్చలు, వైదూర్యములు పాటిగాఁ దేఁదగిన యనేకములైన పచ్చికపట్టులు గలిగి రమణీయమయి

యుండెను. అయ్యాశ్రమమున మారేడు, వెలగ, పనస, మాతు లుంగము, ఉసిరిక, మామిడి మొదలగు చెట్లు ఫలములతో శోభిల్లు చుండినవి. ఉత్తర కురు దేశములనుండి దేవభోగములతోఁ గూడిన చైత్రరథమనెడి కుబేరుని యుద్యానము భరద్వాజాశ్రమము చొచ్చెను. అనేకములగు పుణ్య నదులును గట్టున ననేకవృక్షములతోఁ గూడినవై యా యాశ్రమమునఁ బ్రత్యక్షమయ్యెను. శుభ్రములయిన బలవంతు లును, గుఱ్ఱపు లాయములును, గజశాలలును, మేడలును, రాచనగ ళ్లును మేలిమి తోరణములతోఁ గూడ నగపడినవి. మఱియు శరత్కాలమందలి మేఘమువలెఁ దెల్లనిదియుఁ, దెల్లని పుష్ప మాలికలచే నలంకరింపఁబడినదియు, మేలైన కలయంపి చల్లబడి నదియు, నిఱుకులేకుండునట్లు నాలుగు మూలలు దీర్చినదియుఁ, బొన్నులు, పీటలు, వాహనములు గలదియు, నానావిధములగు దివ్య రసములతోఁ గూడినదియు, దివ్యభోజన వస్త్రాదుల గలదియు, సిద్ధము చేయఁబడిన యన్ని తెఱఁగుల యన్నములతోఁ గూడి నదియు, ముఱికిలేకుండ చక్కఁగాఁ దోమబడినపాత్రములతోఁ గూడినదియుఁ, జక్కఁగాఁ బఱచఁబడిన సకలాసనములు గలదియునై, మేలిమి బట్టలచేఁ జక్కఁగాఁ బఱచఁబడిన యుత్తమ శయనము లతోఁ గూడి యొప్పారుచున్న రాజభవన మావిర్భవించెను. అంత, దీర్ఘబాహుఁడగు కైకేయీపుత్త్రుఁడైన భరతుఁడు భరద్వాజుని యనుజ్ఞ వడసి, సకలవస్తు సంపూర్ణమైన యా గృహమునఁ బ్రవేశించెను. వెంటనే మంత్రు లందఱును బురోహిత పురస్సరులై యా భరతుని వెంబడించి, యా విడిదల యమరికం దిలకించి సంతోషభరితులైరి. అంత భర తుఁడును మంత్రి సమేతుఁడై యచ్చట నున్న శ్రేష్ఠమగు సింహాసనమున కును, వింజామరలకును, తెల్లని గొడుగునకును, రాజునకుఁబోలెఁ బ్రద క్షిణ నమస్కారము లొనర్చెను. సింహాసనము రామునికొఱకె యని తలఁచి, యా సింహాసనమునకుఁ జేరువనే మంత్రులు కూర్చుండఁదగిన యొక యాసనచామరమును పుచ్చుకొని గూర్చుండెను. అనంతరము పురో హితుండును, మంత్రులును, వారికి వెంబడి సేనాధిపతియు, శిబిరనాయ కుండును గూర్చుండిరి. అంతట భరద్వాజుని యాజ్ఞవలన బురదపలె

చిక్కనైన పాయసమున ప్రవహించునదులా భరతునిముందరఁ బ్రవ
హించుచుండినవి. ఆ నదికి నిరుప్రక్కలను భరద్వాజమునీంద్రుని
యనుగ్రహమునఁ దెల్లని పాలగారతోఁ బూయబడిన రమ్యములయిన
దివ్యములగు గృహము లేర్పడినవి. ఆక్షణముననే దివ్యములైన సొమ్ము
లను దాల్చిన యిరువదివేలమంది యప్సరసలు బ్రహ్మదేవుని పనుపున
నా భరతుని ముందట నిల్చిరి. పెండియుఁ గుబేరునిచేఁ బంపఁబడిన యిరు
వదివేలమంది స్త్రీలు రత్నములు, ముత్తెములు, పవడములు మొదలగు
వానిచే నిర్మితములయిన భూషణములను దాల్చి, శోభిల్లుచు నేతెంచిరి.
పురుషులను వెఱ్ఱివారినిగఁ జేయఁగలంత సొబగు మీఱియున్న యప్స
రస లిరువదివేలమంది నందనవనమునుండి వచ్చి నిలిచిరి. నారదుఁడు,
తుంబురుఁడు, గోపుండు నను గంధర్వరాజు భరతునిముందటికేతెంచి,
గానములఁ గావించిరి. అలంబుస, మిశ్రకేశి, పుండరీక, వామన మున్నగు
నప్సరసలు భరతునిముందర నాట్యమాడిరి. చైత్రరథమున నెయ్యే పుష్ప
ములుగలవో యవియెల్లను భరద్వాజానుశాసనమునఁ బ్రయాగక్షేత్ర
మున నావిర్భవించినవి. అచ్చట బిల్వవృక్షములు మృదంగములు
వాయించువారుగను, తాండ్రచెట్లు తాళములు వేయువారుగను, రావి
చెట్లు నర్తకులుగను నైనవి. మఱియు నచ్చటి సరళవృక్షములును,
దాటిచెట్లును, బొట్టుగుచెట్లును, కానుగుచెట్లును సంతోషపరవశములై
మునీంద్రు ననుగ్రహమున మఱుగుజ్జులును, పొట్టివియు నైనవి.
మఱియు నా భరద్వాజమునీంద్రుని యాశ్రమమున శింశుపావృక్ష
ములు, ఉసిరికచెట్లు, నేరేడుచెట్లు, మఱి యనేకములయిన వన్యములగు
వృక్షములును, మొల్లలు, జాజులు మొదలగు వనమునందలి తీఁగెలును
స్త్రీరూపము దాల్చి యా వనమున సంచరించుచుండినవి. "ఓ సైనికు
లారా! మద్యపానము చేయువారలందఱు యథేష్టముగాఁ బానము
సేయుఁడు. ఆఁకలిగొనినవారు క్షీరాన్నము గుడువుఁడు. మిక్కిలి
పరిశుద్ధములయిన మాంసములను గోరినంత దినుఁడు" అని యా
వృక్షములు చెప్పినవి. కాంత లేడుగు రెనమండ్రు గలిసి, సైనికుల
నొక్కొక్కనికిని నలుగురు పెట్టి రమ్యములయిన యేటిగట్టులందుఁ
గూర్చుండఁబెట్టి స్నానము చేయించిరి. మఱియు నందములైన కన్నులు

గల నలువురు ప్రమద లేఁగుదెంచి, యా సైనికుల కొడళ్లు తుడుచుచుఁ గాళ్లు పిసుకుచు, మద్యము నొండొరులచేఁ ద్రాగించిరి. అంతట మహాబలు లగు వాహనముల కాపరు లిక్ష్వాకువంశపు జోదుల వాహనములయిన వాజిగజోష్ట్రవృషభములకుఁ జక్కఁగాఁ గడ్డి మొదలగు నాహారములను వానికిఁ దగినట్లుగాఁ బెట్టి, జెఱకు ముక్కలను, తేనె గలిపిన పేలాలను బెట్టిరి. సైనికులు మద్యపానము చేసి, మైమఱచి, స్రక్చందనాది భోగములచేఁ గడు మోదమునంది వెలుఁగుచుండుటం జేసి, యేనుఁగులఁ గట్టువా రేనుఁగులను, గుఱ్ఱములఁ గట్టువారు గుఱ్ఱములను గుఱుతు దెలియకుండిరి. సైనికు లందఱు ఎఱ్ఱని గందము నలందుకొని, కోర్కులన్నింటిని బొందుటచేఁ దనివి వడసి యచ్చరలతోఁ గూడి యానందించుచు “మే మిఁక నయోధ్యకును బోవము. దండకారణ్యములకుఁ బోవము. భరతుఁడును, రాముఁడును క్షేమముతో నుండురు గాక!” యని పలుకుచుండిరి.

ఇత్తెఱంగున భరతుని వెంబడించిపోయెడు కాలిబంటులును, గుఱ్ఱపురౌతులు, మావటీండ్రును, గుఱ్ఱముల నేనుఁగులఁ గట్టివేయువారును మునీంద్రుని యాశ్రమమునఁ జేయఁబడిన సకలోపచారముల ననుభవించి స్వేచ్ఛమైఁ దిరుగుచు, వేలకొలఁది గుంపులు గుంపులుగూడి సంతోషాతిశయముచే నొడలు తెలియక, “ఇది స్వర్గమే” యని యరచి చెప్పుచుండిరి. సైనికులలోఁ గొందఱు పుష్పమాలలను దాల్చినవారై గుంపులుగూడి నాట్యమాడిరి. కొందఱు పకపక నవ్విరి. కొందఱు పాటలుపాడిరి. కొందఱు నలువైపులకుఁ బరుగెత్తిరి. ఆ సైనికు లమృతముఁబోలు నా యన్నముఁ గుడిచినను, నచ్చటి దివ్యభక్ష్యములను జూచి, తమ కాఁకలి లేకున్నను, నింకను దినఁ దలంపుగలవారై యుండిరి. సేనలందుండు పనికాండ్రు, పనికత్తెలు, వయసున నున్న సైనికుల యంగనలును నూతనవస్త్రములను దాల్చి, మిక్కిలి మత్తిల్లిరి. ఆ సేనలలోఁ దెల్లని బట్టఁ గట్టనివాఁడును, దుమ్ముపడి తలమాసిన వాఁడును, నాఁకొన్నవాఁడును, మురికిగలవాఁడు నొక్కఁడయినను గానరాఁడయ్యెను. ఏనుఁగులు, గుఱ్ఱములు, ఎద్దులు, ఒంటెలు, వేసడములు, మృగములు, పక్షులు భరద్వాజమునీంద్రునిచేఁ గల్పింపఁబడిన

యాహారమునే భుజించి తనివినొందినవి కాని, వీనికై యొరు లే యాహార
మును గల్పింపరైరి. ఆయాశ్రమమున మేకలయు, వరాహములయు
మాంసములు; మేలయిన వ్యంజనములు, పండ్ల రసములుచేర్చి పక్వము
చేయఁబడియున్న సుగంధ రసములతోఁ గూడిన సూపములు, పూవుల
ఱెక్కలతోఁగూడిన తెల్లని యన్నరాసులును గల లోహపాత్రము
లను జనులందఱు మహాశ్చర్యముతోఁ జూచిరి. వన సమీప ప్రదేశ
ములం దుండు బావులు చిక్కని క్షీరాన్నముతో నిండియుండెను.
గోవులు కోర్కులు పితుకునవియై యుండెను. వనద్రుమములు తేనియలు
గార్చుచుండెను. అచ్చటి నడబావులు మైరేయమను మద్యముతో
నిండియుండినవి. గొప్ప పాత్రములలోఁ జక్కఁగా వండిన మయూరము
లయు, మృగములయుఁ, గోళ్లయు మాంసము యథేష్టముగా నుండెను,
అచ్చట వేలకొలఁది యన్నము వడ్డనచేయు తట్టలును, వ్యంజనము లుంచు
పాత్రములును, లెక్కలేని బంగారు కంచములును, చక్కఁగా సంస్క-
రింపఁబడిన పెరుగుతో నిండిన కుండలును, చిన్నపంటులును, వెడల్పు
నోరుగల చట్టులును నుండినవి. కొన్ని సరస్సులంత క్రొత్తదియు
నంతప్రాఁతదియుఁగాని వెలఁగపండ్ల వాసనగల మంచి మజ్జిగతోఁ నిండి
యుండినవి. మఱికొన్ని చక్కఁగాఁ దాళింపువేయఁబడిన రసాలమనఁ
బడు తెల్లని మజ్జిగ నిండియుండినవి. మఱియుఁ బాయసముల మడుగులు
చక్కెరరాసులు నక్కడ వెలయుచుండినవి. సైనికులు నదీతీరములందుఁ
బాత్రలం దుంపఁబడిన యుసిరిక పిండిముద్దలను, సుగంధ చూర్ణము
లను, నానావిధములగు స్నానసామగ్రిని, వేఁడినీటి హండీలను జూచిరి.
తెల్ల కూర్చగల పండ్లుతోము పుల్లలను; డబ్బిలలోఁ బెట్టఁబడిన తెల్లని
చందనములను, నిర్మలములైన యద్దములను, వస్త్రరాసులను, వేల
కొలఁది చెప్పులజోళ్లను, కాటుకభరిణులను, దువ్వెనలను, మీసములను
దువ్వుకొను నొక తెఱఁగు దువ్వెనలను, వస్త్రములను, విండ్లను, విచిత్ర
ములైన కవచములను, పాన్పులను, పీఠములను; గజ, అశ్వ, ఖర,
ఉష్ట్రములు నీరు త్రాగుటకుఁ దగిన నిండుమడుగులను కలువలు తామర
పువ్వులు గల్గి యాకసముమాడ్కి నిర్మలమయి నీటితోనిండి, సుఖముగా
దిగి స్నానముచేయఁదగిన మడువులను, పసులమేఁతకై చేర్చిపెట్టిన నీల

వైదూర్యముల రంగుగల మెత్తని గడ్డిమోపులను గలయఁజూచిరి. భరతునికై భరద్వాజమునీంద్రునిచే సిద్ధముచేయఁబడిన స్వప్నమో యనఁదగియుండు నాశ్చర్యకరమైన యావిందునుజూచి సైనికులందఱు విశేషాశ్చర్యము నొందుచు వేల్పులమాడ్కి రమ్యమగు నా భరద్వాజాశ్రమమున విహరించుచుండఁగా నారేయి గడచిన దాయెను. వేకువనే భరద్వాజుని పిలుపుచే వచ్చిన నదులు దేవగంధర్వులు, సకలాప్సరసలును మునీంద్రుని వీడ్కొని తమతమ తావరంబులకుఁ జనిరి. భరతుని సైనికులును మద్యపానముసేసి, శ్రేష్ఠమైన యగురు గంధము నలఁదికొని, నానావిధ పుష్పహారములను ధరించి, యా పుష్పహారము లెల్ల వాడి, నలఁగి రాలిపోవునట్లు విహరించుచుండిరి.

## 92-వ సర్గము.

భరతుఁడు చిత్రకూటమునకుఁ దఱలుట

పురుషశ్రేష్ఠుఁడయిన భరతుఁడు సేనలతోడ, భరద్వాజమునీంద్రుఁడు చేసిన యతిథిపూజను బడసి, యారేయి యెల్ల నక్కడనుండి, మఱునాటి వేకువ లేచి, రామునిఁ జూడఁగోరి, యా భరద్వాజమునీంద్రు కడ కేఁగుదెంచి చేతులు జోడించికొని నిలఁబడియుండఁగా, భరద్వాజమునీంద్రుఁ డగ్నిహోత్రకార్యములను దీర్చుకొనివచ్చి భరతుంజూచి, "ఓ పాపరహితుఁడా! మా యాశ్రమమున నీకీ రేయి సుఖముగాఁ గడచినదిగదా! నీ సైనికులందఱు నేఁ జేసిన విందుచేఁ దనివినొందిరి గదా" యని యడిగెను.

భరతుఁడు చేతులు మోడ్చి, యాశ్రమమునుండి వెడలివచ్చినట్టి శ్రేష్ఠమగు బ్రహ్మతేజస్సుగల యమ్మునీంద్రునికిఁ బ్రణమిల్లి, "ఓ భగవంతుఁడా! నేను, నా సైనికులందఱును, నా మంత్రులును తమ రొనర్చిన విందుగొని, యన్ని కోర్కులను బడసితిమి. నా సేనలోని గజాశ్వ వృషభ ఖరోష్ట్రాదులు దనివదీర నాహారము గొనినవి. మే మందఱము దారి బడలికను, బెట్టను బోఁగొట్టుకొని, చక్కఁగా భుజించి, అనుకూలములగు విడిదలందు వసించి, తమ రేర్పఱచిన బంటు లొనర్చు పాదసంవాహనాద్యుపచారములను బడయుచు మిక్కిలి హాయిగాఁ బరుండి నిద్రపోతిమి. ఓ పూజ్యుఁడగు, ఋషీంద్రా! మా యన్నను జూడఁ బయ

న్నమై యున్నాను. నాకు సెలవిండు. నన్ను నెనరుచూపుతోఁ జూడ వలయును. ఓ ధర్మజ్ఞా! ధర్మమందే చింతగల మహాత్ముఁడయిన మా యన్నయుండు నాశ్రమమున కేదారిని బోవలయును? అది యిచ్చటి కెంతదూరము? ఈ విషయము సవిస్తరముగా నెఱింగింపవే" యని యడుగఁగా, గొప్ప తపస్సుగలవాఁడును, బ్రహ్మతేజస్సుగలవాఁడును నైన యమ్మునిపుంగవుఁడు తోఁబుట్టువులం దెక్కువ మక్కువ గలిగి యుండు నా భరతునితో నిట్లనియె. "ఓ భరతా! యిచ్చటికి రెండున్నర యోజనము దూరమున నొక యేకాంతవనమున నా చిత్రకూటపర్వత మున్నది. ఆవనము నానుకొని మందాకిని ప్రవహించుచున్నది. ఆ నది యిరుదరులును పూఁచిన చెట్లతోడను రమ్యములయిన పుష్పవంతము లగు వనములతోడను గూడి యొప్పుచున్నది. ఆ నదికి దక్షిణమునఁ జిత్రకూటమును పర్వతము రమణీయముగు చదునైన కాననము గలదై పెంపొందుచున్నయది. ఆ నదీపర్వతముల నడుమున నా రామలక్ష్మణుల యాకుటి ల్లున్నది. ఆ పర్ణశాలయందే వారు వాసము చేయుచున్నారు. రఘునందనా! సేనానాయకుఁడును, మహాత్ముఁడును నగు భరతుఁడా! చతు రంగబలముతోఁగూడిన యీ సేన నిచ్చటనుండి దక్షిణముగాఁగాని, నైరృతిమూలగాఁగాని పోనిమ్ము. అట్లు పోయితి వేని, నీవు రఘురాముని జూడఁగలవు." దశరథనృపాలుని కాంతలు ప్రయాణమున్న సంగతి విన్న వారలై మునీంద్రుని బ్రణమిల్లుటకై, తమతమ పల్లకులనుండి డిగ్గి, భర ద్వాజమునీంద్రుని జుట్టుకొనిరి. అంతట దుఃఖముచేఁ గృశించియున్న కౌసల్య వణఁకుచు, మునీంద్రుని పాదములకుఁ బ్రణమిల్లెను. సుమి త్రయుఁ గౌసల్యకు వెంటనే మునీంద్రుని చరణముల కెఱఁగెను. వా రిరువురు మ్రొక్కులిడిన పదంపడి, జనులందఱిచే దూఱఁదగిన కైకేయి, తనకోర్కి నెఱవేఱమిచే సిగ్గుతోఁ దలవంచుకొని, యమ్మునీంద్రుని పాదములకు మ్రొక్కి, భగవంతుఁడయిన యమ్మునీంద్రునికిఁ బ్రదక్షి ణము గావించి, భరతుని చేరువనే, దీనమయిన మనముతో నిలఁబడి యుండెను. అప్పుడు నియమము దప్పని భరద్వాజమునీంద్రుఁడు భర తునిఁజూచి, "రాఘవా! నీ తల్లులపేరులు మున్నగునవి దెలియఁగోరు చున్నాను. తెలిపింపు" మని యడుగఁగా, మాటల నేర్పుగాఁడైన

ధీమంతుఁడగు భరతుఁడు భగవంతుఁడైన భరద్వాజమునీంద్రునిఁ జూచి, "ఓ మహాత్మా! తమ సన్నిధానమున దుఃఖముతోఁగూడి, యాహారము మానుటచేఁ జిక్కియుండు నీ యామె కౌసల్య. ఈమె నృపాలునికిఁ బట్టంపుదేవి. పురుషశ్రేష్ఠుఁడును సింగమునుబోలు నడఁటిమి గలవాఁడునైన రాముఁడు దితికిఁ బ్రజాపతి పుట్టినట్లీ కౌసల్యకుఁ బుట్టెను. ఈపెయొక్క యెడమభుజమును గౌఁగిలించుకొని, యడవి యందుఁ బువ్వులురాలిపోయిన కొండగోఁగుచెట్టు కొమ్మవలె వగపాలయి యున్న యామె సుమిత్ర. అశ్వినీదేవతలను బోలువారును, సాటిలేని పరాక్రమముగలవారును, జోదులునునైన లక్ష్మణ శత్రుఘ్ను లిద్దఱు నీ దేవి కుమారులే. ఎవతె నిమిత్తము నరశ్రేష్ఠులయిన రామలక్ష్మణులు ప్రాణములమీఁది యాశమాని, యడవులపాలయిరో, పుత్రశోకముచే నృపాలుఁడు స్వర్గమునొందెనో, యట్టి క్రోధశీలురాలును, బుద్ధిహీనురాలును, గర్వితురాలును, దన్ను రాణివతినిగాఁ దలఁచినదియు, రాజ్యాపేక్షగలదియుఁ, జెడ్డబుద్ధియుఁ, జెడ్డతలంపును గలదియు, గొప్పదానివలెఁ గానిపించునదియునైన ఘాతుకురాలగు నీ రాజపుత్రిని కైకేయి యని యెఱుఁగుఁడు. ఈమెయె నాయొక్క తల్లి. ఈమెవలననే నాకు గొప్ప వ్యసనము సంభవించినది" అని పలికి భరతుఁడు కన్ను లెఱ్ఱఁజేసి, కనలి బుసకొట్టుచున్న పామువలె నిట్టూర్పువిడుచుచు డగ్గుత్తికతో నిట్లునుండెను. బుద్ధిశాలియగు భరద్వాజమహర్షియును తైఱఁగునఁ బలికిన భరతునిజూచి, యర్థగౌరవముగల మాటలతో "ఓ భరతా! కైకేయిపైఁ దప్పులుమోపి యామెను నిందింపఁజనదు. రాముఁ డరణ్యమునకుఁ బోవుటవలన ముందు మేలుగలుగనున్నది. ఆ రాముని వనవాసము వలన దేవదానవులకును, భగవద్ధ్యానపరాయణు లగు ఋషులకును మేలే కలుగగలదు." అని భరతునితోఁ జెప్పెను.

అంత భరతుఁడును యాతని దీవనలు వడసి, మునీంద్రునికిఁ బ్రదక్షిణ నమస్కారములఁ జేసి, యాతనిని వీడ్కొని, సుమంత్రునిఁ బిలిచి, సేనలను తరలింపు మని యానతిచ్చెను. అంతట సైనికు లందఱు ప్రయాణమయి, బంగారు భూషణములతో నలంకరింపఁబడినవియు, బాగసయినవియు నైన మేటి గుఱ్ఱములను బూన్చిన బండ్ల నెక్కిరి.

ఉరుములతోఁ గూడిన వర్షాకాలమునందలి మేఘములవలె బంగరు తొడవులు దొడిగిన యాఁడేనుఁగులును నేనుఁగులును ఱెక్కముల తోడఁ గూడి వెడలినవి. మఱి యనేకములైన చిన్నవి గొప్పవి యగు గుఱ్ఱములు, వేసడములు మున్నగు జంతువులఁబూన్చిన యానములును బయలు వెడలినవి. బంటులు కాలినడకతో వెడలిరి. అంతటఁ గౌసల్య మొదలగు మగువ లందఱు రాముని దర్శనముఁ గోరి, సంతోషముతో మేటి పల్లకులమీఁద నెక్కి వెడలిరి. అందగాఁడగు భరతుఁడు సూర్య చంద్రులమాడ్కి వెలుఁగుచున్నదియుఁ, జక్కఁగాఁ బఱపఁబడినదియు నైన సొగసగు పల్లకిమీఁద సపరివారముగాఁ నెక్కి దఱలెను. గజాశ్వ భట యుక్తమయిన యా భరతునిసేన, మహానందభరితమై, గంగానది యావలి గట్టున దక్షిణదిశయెల్ల వ్యాపించియున్న కారుమబ్బువలె దక్షిణ దిక్కు నంతయుఁ గ్రమ్ముకొని, యచ్చట నదులందును గొండలందును నున్న మృగపక్షులతోఁ గూడిన వనముల దాఁటుచు, నచ్చటి మృగ పక్షుల గుంపులను వెఱపించుచు నా గొప్ప వనమునఁ జొచ్చి ప్రకా శించుచుఁ బోవుచుండెను.

## 93-వ సర్గము

### భరతుఁడు చిత్రకూటముఁ జూచుట

ధర్మశీలుఁడగు కాంతిమంతుఁడయిన భరతుఁడు సంతసము నందిన వాఁడయి, సముద్రమునుం బోలిన దొటచే, వానకాలమున గొప్ప మబ్బాకసమును గ్రమ్మినమాడ్కిఁ బుడమియెల్లఁ గ్రమ్మినదియు, వనము లందలి మత్తిల్లిన మేటియేనుఁగుల మొత్తములను వెఱపించునట్టియు, రొద గలదియు నయిన చతురంగబలముతోను, నేల యగుపడకుండు నట్లు వ్యాపించి వేగవంతములయిన గజాశ్వముల సమూహములతోను గూడినవాఁడై, యా వనములందును పర్వతములందును నెల్లెడలఁ గనఁ బడుచుండు నెలుఁగుబంట్లను చారలుగల జింకలను, చుక్కలులేని గొప్ప శరీరముగల దుప్పులను జూచుచుఁ జాలదూర మేఁగి, గుఱ్ఱము లలయు టచేఁ గొంత వడి తగ్గించి, మంత్రవేత్తలలో నుత్తముఁడగు వసిష్ఠునిఁ జూచి భరద్వాజమునీంద్రుఁ డెట్టి రూపముగలదని చెప్పెనో, నే నెట్టి దని వింటినో, అట్టి రూపముగల ప్రదేశమునకు వచ్చితిమి. ఇదిగో చిత్ర

కూటపర్వతము! ఇదిగో మందాకినీ నది. దానికి దాపుననే నల్లని కాఱు మబ్బుఁ బోలిన యొక వనము గన్పట్టుచున్నది. కొండలను బోలిన మన యేనుఁగు లీ మనోహరములైన చిత్రకూటము చఱియలను త్రొక్కి-పాడుచేయుచున్నవి. వర్షర్తువునందు నీటితోఁ గూడిన నల్లని మబ్బులుదకముఁ గుఱియునట్లీ కొండల నెత్తములందుండు నీ చెట్లు పువ్వులను రాల్చుచున్నవి. ఓరి శత్రుఘ్నా! జలజంతువులచే నిండిన సముద్రము వోలె మెకములచే నంతట నిండినదియుఁ, గిన్నరుల కునికిపట్టును నైన యీ వనము సొంపును బొడఁజూడుము. ఈ మెకముల గుంపులు, గాలిచే నాకసమునఁ జెదరగొట్టఁబడిన శరత్కాల మేఘమువలెఁ గడు వేగముతోఁ దోలఁబడినట్లు పోవుచున్నవి. దాక్షిణాత్యులగు నరులు మబ్బువలె నల్లనైన తమ వెండ్రుకలను బలుకలుగాఁ దీర్చి పూవుల దఱుమునట్లీవృక్షము లన్నియుఁ బుష్పమయములయి శిరోభూషణములను నల్లని కొనలందుఁ దాల్చుచున్నవి. తొల్లి నిశ్శబ్దముగ భయంకరమయియుండిన యీయరణ్య మిప్పుడు మనసేనలతో నిండినదయి యయోధ్యానగరమువలెఁ గానుపించుచున్నది. ఈ మన గుఱ్ఱముల గొరిజలచే లేపఁబడిన దుమ్మాకసమును గ్రమ్మియున్నది. నాకు హితము నాచరించుదానివలె గాలి యాదుమ్మును గొట్టుకొనిపోవుచున్నది. శత్రుఘ్నా! యీ యరణ్యమునందు వడిగల గుఱ్ఱములను బూన్చి సారథులు తోలుచున్న రథము లెంత వడిగాఁ బఱతెంచుచున్నవో చూడుము! ఇవిగో మనోహరములయిన నునుపు ఱెక్కలు గల నెమళ్లు రథముల చప్పుడునకు వెఱచి, తమ యునికిపట్టగు నీపర్వతమునకు వచ్చుచున్నవి. ఈ తాపసుల కునికిపట్టగు నిప్పట్టు స్వర్గమువలె నా మనమున కతి రమ్యముగాఁ దోఁచుచున్నది. ఇచ్చట ననేకములగు తెల్లచుక్కల మృగములు దమ యాఁడుమృగములతోఁ గూడి పుష్పములచే నలంకరింపఁబడినవానివలె మనోహర రూపములు గలవిగాఁ జూపట్టుచున్నవి. రామలక్ష్మణు లెచ్చట నివసించుచున్నారో, తెలియునట్లీ సైనికు లందఱు వెడలి చక్కఁగా వెదకునట్లుత్తరువుచేయుఁడు" అని భరతుఁడు చెప్పెను. సైనికు లందఱు భరతుని వాక్యము విన్నవెంటనే యాయుధము లెత్తికొని, కొంతదూరముచని, యొక్కచోటఁ బొగ

లెగయుచుండుటఁజూచి, వెనుకకు మఱలివచ్చి, "రాజపుత్రా! మను
ష్యులులేని ప్రదేశమున ధూమముపొడమదుగదా! కావున రామలక్ష్మణు
లిచ్చటనే తప్పక యుండవలయును. అట్లు శత్రుసంతాపనులయిన రామ
లక్ష్మణు లిచ్చట నుండరేని, రామునివోలెడు ధైర్యశాలురగు ముని
లయిన నిచ్చట నుండితీరవలయు"నని భరతునితోఁ జెప్పిరి. శత్రుసేనలను
హింసించు భరతుఁడు వారు సెప్పిన మిక్కిలి యిష్టమైన వాక్యమును
విని, యా సైనికుల నందఱిం జూచి, "మీ రిచ్చట జాగరూకులై
యుండుఁడు. ఇచ్చటినుండి పైకిఁ బోవలదు. ఏనును, సుమంత్ర వసిష్ఠ
మహామునులం దోడ్కొని చనియెదను" అని యానతీయఁగా, సైనికు
లంద ఱచ్చటనే నిలిచిపోయిరి. భరతుఁడును పొగ వోఁబడి కన్పట్టు
చున్న ప్రదేశమునకుఁ దఱలిపోయెను. భరతునిచే నచ్చటనే నిలుపఁబడిన
యా సైనికులు, దమకుఁ బ్రియుఁడైన రాముని ద్వరలోఁ గలిసికొనఁ
గలమని మిక్కిలి యానందముతో నా ధూమమువైపునకే చూచుచు
నిల్చియుండిరి.

## 94-వ సర్గము.

### రాముఁడు సీతకు చిత్రకూటముసొంపు దెలుపుట

భరతుఁ డిట్లు చిత్రకూటము చేరువనుండఁగా, నచ్చట దేవతల
కెనవచ్చువాఁడును, పర్వతములందును వనములందును సంచరించుట
యందుఁ బ్రేమగలవాఁడునునైన రాముఁ డొక్కనెల యా చిత్రకూట
పర్వతమున నున్నవాఁడై, తన కాంతయగు సీతకు మనస్సంతోషము
గలిగింపఁగోరియుఁ, దన మనమునకు సైతముఁ గొంచెము విశ్రాంతి
గోరియు, దేవేంద్రుఁడు శచీదేవికిఁబోలె వింతఁ గొలిపెడు చిత్రకూట
పర్వతము సొంపును సీతాదేవికిఁ జూఁపఁగోరి, "ఓ మంగళకరి! యీ
మనోహరమైన పర్వతమును జూచిన పదంపడి, రాజ్యము కోలుపో
వుటకాని, చెలికాండ్రఁ బాసియుండుట కాని నా మనమునకుఁ గించిత్త
యినను శ్రమము గావింపకున్నది. ఓ కల్యాణీ! పలుతెఱఁగులైన పక్షుల
గుంపులతోఁ గూడినదియు, గైరికాది ధాతుమండితములై యాకసము
నొఱయుచున్న కొనలచే వెలుగుచున్నదియునైన యీ పర్వతమును
జూడుము. ఇచట గైరికాది ధాతువులచే నలంకరింపఁబడిన ప్రదేశము

లలోఁ గొన్ని వెండివలెఁ దెల్లగను, మఱికొన్ని నెత్తురువలె నెఱ్ఱగను, వేఱొకకొన్ని పసుపు పచ్చవన్నెయుఁ జిత్రవర్ణములుఁ గలవిగను, ఇంకను గొన్ని శ్రేష్ఠములైన రత్నముల కాంతులు గలవిగను, మఱి కొన్ని పుష్యరాగములయు, స్ఫటికము, మొగలిపూలయువన్నెలు గలవిగను, వేఱుకొన్ని నక్షత్రములయొక్కయుఁ, బాదరసముయొక్కయుఁ గాంతి గలవిగను విరాజిల్లుచున్నవి. మఱియు నీ పర్వతము సౌమ్యములయిన పలుజాతులు, మెకముల గుంపులు, పులులు, చిఱుతపులులు మొదలగు భీకరములయిన మృగములతోను, పలుజాతుల పక్షులతోను, పుష్పఫల భరితములయి, నీడగలిగి, మనమునకు నింపుగుల్కుచుండునవియు నైన మామిడి, నేరేడు, వేగిస, లొద్దుగ, మోరటి, పనస, చంద్ర, ఊడుగు, పెద్దతినాశము, మారేడు, వెదురు, పెగ్గుమ్మడి, పేము, ఉలిమిరి, ఇప్ప, బొట్టుగు, రేఁగు, ఉసిరిక, మంకెన, ఏఱుమద్ది, దాడిమ్మ మొదలగు మహావృక్షములచే శోభిల్లుచు సొంపుమీఱియున్నవి. ఓ కాంతా! చూచితివా యీ రమణీయములగు కొండ చఱులందుఁ జూపఱకు గగుర్పాటొదవించుచుండు కిన్నరదంపతులు వేడ్కమీఱ నొండొరులమీఁద ప్రేమగలిగి విహరించుచున్నారు. ఇచ్చట విద్యాధరులు తమ యాయుధములను, మేలిమి పుట్టములను చెట్ల కొమ్మలకుఁ దగిలించియున్నారు. ప్రియా! విద్యాధరాంగనలు విహరించెడి యీ రమ్యప్రదేశములను జూచితే! ఈ పర్వతము గొన్ని ప్రదేశములందుఁ బైనుండి పడు సెలయేటి ప్రవాహములతోను, నచ్చటచ్చటఁ బుడమి నుండి పుట్టిననీటిబుగ్గలతోను, నూఁటలతోను, గూడి కాఱుచున్న మదముగల మేటి యేనుఁగుఁబోలి వెలయుచున్నది. గుహలనుండి వచ్చెడి గాలి పలు పువ్వుల నెత్తావులను గొని, ఘుమఘుమయని పరిమళించుచు వీచుచున్నవి. ఈ సువాసనగల గాలి సోఁకిన నెట్టిమానవునికైన నీప్రదేశమును విడిచిపోవ మనమురాదు. ఓ సొగసుదానా! నీతోను, లక్ష్మణునితోనుగూడి యిచ్చట నెన్నియేండ్లున్నను, రాజ్యభ్రంశమువలని విచారము నన్నేమియుఁ జేయనేఱదు. ఓ భామినీ! యనేక పక్షిసంఘములతోఁగూడినదియు, నానావిధములగు పుష్పఫలములతో నిండినదియు నైన చిత్రశిఖరములుగల యీ పర్వతమునందుఁ బ్రీతిగలవాఁడ నయి

తిని. ఈ వనవాసమువలనఁ దండ్రి ఋణము దీఱుటయు, భరతునికోర్కె నెఱవేఱుటయు నను రెండు ఫలములు గలిగినవి. ఓ జానకీ! మనోవా క్కాయములను జూఱఁగొను పలుతెఱఁగులగు స్వాభావిక వైచిత్ర్యములను జూచుచు నాతోఁ జిత్రకూటమున సంతసముతోఁ గ్రీడించు చున్నావుగదా. ఓ రాణీ! మాతాత ముత్తాతలు మఱియుఁ బెద్దలగు రాజర్షులు దేహాంతమున మోక్షముఁ బడయుటకై, సంసార సుఖములు మాని, వనమున వాసముచేసి రని పెద్దలు చెప్పిరి. ఈ పర్వతమునందలి పెక్కులైన వెడల్పుగల బండలంతటను నలుపు తెలుపు పసుపు నెఱుపు చిత్రవర్ణము మొదలగు రంగులుగలిగి శోభిల్లుచున్నవి. ఈ పర్వతము నందలి కొన్ని తీఁగెలు తమ కాంతులచే దెసలు వెలుఁగఁజేయుచు నగ్నిజ్వాలలమాడ్కిఁ దేజరిల్లుచున్నయవి. ఈపర్వతమునఁ గొన్ని ప్రదేశము లిండ్లవలెను, మఱికొన్ని తోఁటలవలెను, కొన్ని యొంటి రాయి మేడలవలెను నొప్పుచున్నవి. ఈ చిత్రకూట పర్వతము సర్వత్ర సొంపుమీఱియుండు శిఖరములతోఁ గూడి పుడమినుండి పైకి లేచినదో యనఁదగియున్నది. ఓ సీతా! యీ చిత్రకూట పర్వతముయొక్క శిఖరమును చూచితివా యెంత సుందరముగఁ గనఁబడుచున్నదో! నల్లకలువలు, సురపొన్నపువ్వులు, పుత్రజీవి యను వృక్షముల పుష్పములు, భుజపత్రవృక్షములు, గమలదళములును పైనఁ బఱచిన కాముకుల యీ పాన్పులను జూచితివా? ఈ సెజ్జలందుఁ గాముకులు తమురు దాల్చిన, రతికేళులందు నలఁగిన, తామరపూవుల దండలు దీసి పాఱవైచి యున్నారు. వారు సగము దిని పాఱవైచిన పలుతెఱంగుల పండ్లెన్ని యున్నవో చూడుము. ఈ పర్వతము విస్తారముగనున్న కందమూల ఫల సమృద్ధియు, జలసమృద్ధియుఁ గలిగి, యలకాపురమును, సౌగంధికవనమును నుత్తర కురుదేశమును మించినదో యనఁదగియున్నది. ఓ సీతా! నేను నాక్షత్రియ ధర్మములను, పెద్దల నడవడులను దప్పక, నియమముతో నున్నవాఁడనై యిచ్చట సీతోడను, లక్ష్మణునితోను గూడి వనవాసకాలమును సుఖముగాఁ గడపఁగలను. అని చెప్పెను.

## 95-వ సర్గము

### రాముఁడు సీతకు మందాకినీ నదీవైభవమ్ముఁ జెల్పుట

అంతటఁ గోసలేశ్వరుండును, తామరపూవులంబోలు కన్నులు గలవాఁడునగు శ్రీరాముఁడు చంద్రునింబోలు మోముగలదియు, సొగసులైన పిఱుఁదులుగలదియునైన సీతను దోడ్కొని పర్వతము వెడలి కొంతదవ్వేగి, తేట నీటితోఁ గూడినదియు, హంసలకమనముల కింపు గొలుపునదియునై యున్న మందాకినీనది నామెకుఁ జూపి, "యో ప్రియా! హంసలతోను, బెగ్గురుపక్షులతోను గూడినదియు, వింత గొలిపెడి యిసుక తిన్నెలుగలదియు, తామరపువ్వులతోఁ గూడినదియు, తీరములందు నానావిధములయిన పూలచెట్లును, పండ్లచెట్లునుగలదియు, కుబేరునియొక్క సౌగంధికమనెడి కొలనిమాడ్కి వెలయుచున్నదియునైన యీ మందాకినీ నదిని జూడుము. ఇప్పుడే మృగములగుంపులు నీరు ద్రావినందునఁ గలకఁబాఱియుండు నీటితోఁగూడినవై యీ మందాకినీ నదియొక్క రేవులు నా మనమునకు సంతసము గొల్పుచున్నవి. ఓ ప్రియురాలా! ఋషులు పెక్కండ్రు వేఁకువనె లేచి, కృష్ణాజినములను మొలకుఁ గట్టుకొని, నారబట్టలను బైనఁ గప్పుకొని జడదారులై యీ మందాకినియందు స్నానము సేయుచున్నారు. ఓ వెడల్పు కన్నులదానా! వీరుగో మఱికొందఱు ఋషులు కఠిన నియమములు పూని, చేతులు పైకెత్తికొని, సూర్యుని కుపస్థానము చేయుచున్నారు. నట్టువగాఁడు నాట్యమునకు ముందుగాఁ బుష్పాంజలిని జల్లినట్లు, ఈ పర్వతము గాలి కెగిరిన వృక్షముల కొమ్మలనెడి హస్తములచే, నదిచుట్టును బుష్పాంజలులు చల్లుచున్నది చూడుము. కొన్నిచోట్ల ముత్తెములంబోలు తేట నీరుగలదియు, కొన్ని తావులం దిసుకతిన్నెలచే నొప్పినదియు, కొన్ని ప్రదేశములందు సిద్ధులచే శోభిల్లునదియునైన యీ మందాకినీ నదిని జూడుము. గాలికిరాలి యేటి నీటినడుమఁ బడి కొన్నిచోట్ల విస్తారముగను, మఱికొన్ని ప్రదేశములందు రాసులు రాసులుగనుబడి దట్టముగా నుండు పూవులను జూడుము. ఓ కల్యాణీ! శ్రావ్యమయిన కంఠధ్వనిగల చక్రవాకపక్షులు ఇంపుగఁ గూయుచు నాపూవులప్రోవులపయి నెక్కుచున్నవి. ఓ సుందరీ! చిత్రకూటపర్వతమును జూచుటయు, మందాకినిం

గాంచుటయు నాకు నయోధ్యాపురమున వసించుటకంటెను, నిన్నుఁ జూచుటకంటెను నెక్కువయని తోఁచెడు. ఓచెలీ! పాపములఁ బోఁగొట్టి కొన్నవారును, తపస్సిద్ధులును, వేదాధ్యయనము, ఇంద్రియ నిగ్రహము, ఓర్పు మొదలగు గుణములు గలవారును నగు మహర్షులీ నదియందు స్నానముచేసిపోవుచుందురు. ఇట్టి పవిత్రమగునదియందు దిగి స్నానమొన ర్తము. నాతోడ రమ్ము. ఓ సీతా! నీ స్తనములయొక్కయు, జఘనముల యొక్కయు నొప్పుచేఁ గమలములను, తెల్ల తామరపూవులను నీట ముంచుచుఁ జెలికత్తెతోడవలె నాతోఁగూడి జలకమాడుము. ఓవనితా! నీ వీ యడవియందుండు మృగములను పురజనులనుగను, చిత్రకూటము నయోధ్యాపురమునుగను, ఈ మందాకినీనదిని సరయూనదినిగను నెంచు కొనుము. ధర్మముదప్పనివాఁడగు లక్ష్మణుఁడు నా యానతిఁ దప్పక యున్నాఁడు. నీవు ననుకూలురాలవయి యున్నావు. నాకుఁ బ్రేమను గల్గించుచున్నావు. మీ రిద్దఱు నిట్లు నన్నానందింపఁజేయుచున్నారు. నీ తోడ నిచట నేను ముప్పూటల స్నానముచేయుచుఁ, దేనె, దుంపలు, గడ్డలు మొదలగువానిని దినుచు నిచ్చటనే యుండెదను. నా కయో ధ్యయు నక్కఱలేదు; రాజ్యము నక్కఱలేదు. ఈ నది మృగముల సమూహములతో నిండినదియు, గజసింహవానరములు మున్నగు మృగ ములచేఁ ద్రావఁబడిన యుదకముతో నిండినదియు, చక్కఁగాఁ బూఁచిన పుష్పవృక్షములతోఁ గూడినదియునై మనోహరముగనున్నది. ఈ మనో హరమగు ప్రదేశమును గాంచినవెంటనే సకలశ్రమములు పాయును. ఇది సకలపాపములను దొలఁగించును." అని యిట్లు రఘువంశోద్ధారకుఁ డగు రాముఁడు తనప్రియురాలగు సీతకు గంగానదినిగూర్చి యనేక విషయములఁ జెప్పుచు, కాటుకవలె నొప్పారుచున్న యా రమణీయ మగు చిత్రకూటపర్వతమునందు విహరించుచుండెను.

## 96-వ సర్గము

### లక్ష్మణుఁడు రామునికి భరతునియాత్రను దెలుపుట

ధర్మపరిపాలన తత్పరుఁడగు రాముఁడు మైథిలి కిత్తెఱఁగునఁ బర్వతప్రాంతమునఁ బాఱెడి యానదియొక్క సొంపును జూపించి, యొక చఱియయందుఁ గూర్చుండి, సీతాదేవికి మాంసభక్షణమునం దాశ

గలిగింపఁగోరి, "ఓ ప్రియా! యీ మాంసము పరిశుద్ధమైనది. ఇది రుచ్యమైనది. ఇది చక్కఁగా నిప్పులోఁ గాల్పఁబడినది. దీనిని దినుము, దీనిని దినుమని యొక్కటొక్కటిగా నెత్తి చూపుచు నామెకుఁ దిన నొసఁగుచుండెను.

వారి ట్లచ్చటఁ గూర్చుండియుండఁగా, చిత్రకూటము దాపునకు వచ్చిన భరతుని సైన్యముల కాలిత్రొక్కుడిచే రేగిన పరాగమును రొదయును మిన్ను ముట్టినవయ్యెను. ఈలోపల నప్పర్వతమున నుండిన మదించిన యేనుఁగుల మేటులు మహత్తరమైన సైన్యముల ఘోషములను విని, మిక్కిలి భీతిలి, తమ కదుపులతోఁగూడి దిక్కుదిక్కులకుఁ బఱువిడిపోయినవి. రఘునందనుఁడును సైన్యములనుండి పుట్టుచున్న రొదను విని, మూల మూలలకుఁ బఱువిడుచుండు నా యేనుఁగుల గుంపులను జూచి, తేజస్సుచేఁ బ్రకాశించుచున్న సుమిత్రపుత్త్రుఁడగు లక్ష్మణు నుద్దేశించి, "లక్ష్మణా! యిది యేమి రొద? సీతల్లి కడుపు చల్లఁగా నుండునుగాక! ఈవైపు చూడుము. పిడుగుమాడ్కి గుండె లవియించుచున్నది యీధ్వని! ఈ యరణ్యమునందలి గొప్పవనములలో మూలమూలలలో డాఁగియుండిన యేనుఁగు మొత్తములును, దున్నలును, ఇతరమృగములును సింగములకు బెదరి దిక్కుదిక్కులకుఁ ద్వరగాఁ బఱువిడుచున్నవి. రా జొండె, రాజంతటి గొప్ప ప్రభు వొండె వేఁటకు వచ్చియున్నట్లు తోఁచెడిని. లేక, క్రూరమృగ మేదియైన వచ్చియున్నదో! కనుఁగొనుము. ఈ పర్వతమునఁ బక్షులకుఁగూడ సంచరించుట యలవి కాదు. ఇట్టిచోట నీ గొప్ప రొద వినఁబడుటయు, మృగములు దిగులొంది మూలమూలలకుఁ బరుగులిడుటయు నేలనో వేగమే తెలిసికొనుము." అని లక్ష్మణునితోఁ జెప్పెను.

అంత లక్ష్మణుఁడు వెంటనే లేచి, పుష్పించిన యొక వృక్షము నెక్కి, యెల్లదిశలఁ జూడఁగోరినవాఁడయి తూర్పు దిక్కును బాఱఁ జూచెను. మొగ ముత్తరమునకుఁ ద్రిప్పిచూచుచు, రథగజతురంగములతోఁ గ్రిక్కిరిసినదియు సన్నద్ధులయిన పదాతులతోను గూడినదియు నైన గొప్ప సేనను జూచి, "ఓ యన్నా! గజాశ్వములతో నిండినదై, యరదముల టెక్కెములచే శోభిల్లుచుండెడి యపారమయిన సేన యొక్కటి

యేతెంచుచున్నది. కావున నీ వగ్నిం జల్లార్చి, సీతను గుహాయందు మఱుఁగున నుంచి, విల్లెక్కుపెట్టి, కవచము దొడిగి, బాణములను గైకొని సంసిద్ధుఁడవై యుండుము” అనెను.

పురుషోత్తముఁడగు రాముఁడును మఱల లక్ష్మణునిజూచి “నాయనా! సౌమిత్రీ! యీసేన యెవరిదో చూడుము” అని చెప్పఁగా, లక్ష్మణుఁ డా సేనపై నగ్నిహోత్రునివలె మండిపడి, చుఱచుఱఁ జూడ్కి నిగిడించి, “ఓ యన్నా! కైకకొడుకు భరతుఁడు పట్టాభిషేకం బొనర్చికొని, యంతటితోఁ దనివినొందక సకలసంపదలతో నిండిన రాజ్యమును నిష్కంటకముఁ జేయఁగోరి, మనలఁ జంపవచ్చుచున్నాఁడు. ఇది నిజము. ఇదిగో మిగుల నెత్తయినదియుఁ, గాంతిగలదియునగు నెత్తు బోదెగల కాంచన వృక్షరూపమయిన టెక్కెము రథమున వెలయుచున్నది. గుఱ్ఱపురౌతులు వేగముగాఁ బఱతెంచు గుఱ్ఱములనెక్కి యిచ్చటికి స్వేచ్ఛగా నేతెంచుచున్నారు. వీరుగో, కొందఱు జోదులు గజముల నెక్కి మనమున మిక్కిలి యుప్పొంగుచు వెలుఁగుచున్నారు. శూరుఁడా! మనమును విల్లు చేతఁబూని, పర్వతమును జేరుదము. కాదేని యాయుధములఁ దాల్చి పోరునకుఁ గట్టాయితముగ నిచ్చటనే యుందము. కాంచనపుఁ డెక్కెముగల భరతుని మనము జయింపలేమా? మన కతఁడు లోఁబడఁడే. రామా! ఏ భరతుని నిమిత్తమయి నీకును, నాకును, సీతకును గొప్పవ్యసనము ప్రాప్తించెనో, ఆ భరతుని మనము చూడఁగలముగదా! ఓ రాఘవా! శాశ్వతమయియుండు రాజ్యమును బోఁగొట్టికొని, యెవని నిమిత్త మిట్లు, అడవిలో నిడుమలంబడితివో, యట్టి శత్రువగు గండఁడయిన భరతుఁడు వచ్చుచున్నాఁడు. సకలవిధములఁ బ్రయత్నించి, అతనిని వధింపవలయును. నేనే యీపని చేసెదను. రఘునందనా! భరతునిం జంపుటయం దేదోషము నున్నట్లు కాన్పింపదు. మొట్టమొదట నపకార మొనర్చినవారిఁ బరిత్యజించుటయం దేదోషమును లేదు. రఘునందనా! భరతుఁడు మొదట నపకార మొనర్చినవాఁడు. ధర్మము విడిచి మనపైకి వచ్చుచున్నవాఁడు. ఇతనిని బరిమార్చెదను. నీ వీభూమండలమునెల్ల నేలుము. రాజ్యమునఁ బేరాసగలదగు కైకేయియు భరతుఁడు పోరునందు నాచేఁ జచ్చినాఁ

డని విని కడు డస్సినవై, యేనుఁగుచే విఱుగఁగొట్టఁబడిన చెట్టువలెఁ బడినవానిని జూచి, మిక్కిలి వగవఁగలదు. భరతునే కాక, కైకేయిని, దాని చెలికత్తెలను, చుట్టములను సైతము చంపెదను. ఈ పుడమియు నీ పాపిష్ఠురాలిచే విడువఁబడునుగాక! శత్రువుల యభిమానముఁ బోఁగొట్టువాఁడా! కసవు వామియందు నిప్పువెట్టినట్లు ఇన్ని దినము లాఁపుకొనియున్న కోపమును, అవమానమును శత్రుసేనలపైఁ జూపెదను. ఇప్పుడే వాడితూపులచేఁ బగతుర యొడళ్లు చిల్లులు వడనేసి, యీ చిత్రకూటమునందలి కాననమెల్ల నెత్తుటిప్రవాహముచేఁ దడిసినదానిని జేసెదను. నాచే నాయపట్టులందు నాఁటున శ్లేయఁబడినవై గుండెలు చీలినగుఱ్ఱములను, ఏనుఁగులను, మనుష్యులను క్రూరమృగము లీడ్చుకొనిపోయి తినునుగాక. గొప్పయుద్ధముసేసి భరతుని సేనలతోఁగూడఁ జంపి, నే నెత్తిన బాణములయొక్కయు, విల్లుయొక్కయు ఋణముఁ దీర్చుకొందును. ఇది తప్పదు, నిజమని నమ్ముము" అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను.

## 97-వ సర్గము.

### రాముఁడు లక్ష్మణుని కోపము చల్లార్చుట

రాముఁడు మిగులఁ గోపపడి, కడు నార్భాటముతోఁ గూడిన వాఁడైయున్న లక్ష్మణు నోదార్చి యిట్లనియె. "లక్ష్మణా! మేటి విలుకాఁడైన గొప్ప పండితుఁడగు భరతుఁడు, తానే వచ్చినపుడు డాలు వాలుతోఁగూడిన ఖడ్గమేల? ధనుస్సేల? లక్ష్మణా! తండ్రి సత్యవాక్యము ననుసరించి నడచుకొందు నని ప్రతిజ్ఞచేసి, యిప్పుడు వచ్చిన భరతునిఁ జంపి రాజ్యము గైకొంటినేని, "భరతునిఁ జంపి తండ్రి భరతున కొసఁగిన రాజ్యమును రాముఁ డపహరించె"నని నన్ను జనులందఱు దూరుదురు గదా. అట్లు నిందలకుఁ బాలయిన, యీ రాజ్యము నేల నేఁ గోరవలయు? నా కీ రాజ్యమే యక్కఱలేదు.

లక్ష్మణా! బంధువులను చెలికాండ్రను జంపుటవలన నున్న కలిమిని విషము గలిపిన వంటకములను బోలె నే నెంత మాత్రమును గోరను.

లక్ష్మణా! నే నాయుధము చేతఁబట్టి యొట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. తోఁబుట్టువును ధనవంతులును సౌఖ్యవంతులు నగు నిమిత్తమే ధర్మార్థకామము లనెడి త్రివర్గమును, రాజ్యమును గోరెదను గాని, నా కేమో దేనిమీఁదను ఆశ లేదు.

లక్ష్మణా! నేను గావలెనన్న నీ చతుస్సముద్రవలయితమగు భూమండలము నాకు దొరకకపోదు. అయినను, అన్యాయ్యముచే లభించిన దేవేంద్రపదవినైనను నేఁ గోరను. భరతుని, నిన్ను, శత్రుఘ్నునింబాసి కలిగెడి సుఖము నిప్పులపాలగునుగాక! సోదరప్రేమగలిగి నాకు బ్రాణముకంటె మిన్నయైన భరతుఁ డయోధ్యకు వచ్చియుండును. అచ్చటఁ దండ్రి, కైకేయి మొదలగువారు పట్టాభిషేకము సేయ నిర్బంధము సేసియుందురు. అదియుఁగాక, పురుషోత్తమా! శూరుఁడా! నేను దండ్రియాజ్ఞచే జటావల్కలాజినములను ధరించి, సీతతోను, నీతోను గూడ నిచ్చటికి వచ్చితి ననిన సంగతి దెలియఁగనే, పెద్దవాఁ డుండగఁ జిన్నవారు రాజ్యమేలుట మనయాచారము గాదని యెఱిఁగినవాఁడై, మనయందలి చెలిమిచేఁ గ్రమ్మఁబడిన మనసును, వ్యసనముచేఁ గలవరపడిన ఇంద్రియములుం గలవాఁడగుచు, మనలఁ జూచుటకే భరతుఁ డచ్చటికేతెంచుచున్నాఁడని తలఁచెదను. దీనికంటె వేఱొక్కకారణ ముండఁబోదు. శ్రీమంతుఁడగు భరతుఁడు తల్లిపైఁ గోపపడి, యామెను నిష్ఠురపుమాట లాడి, తండ్రిని సమాధానపఱచి, నాకు రాజ్యమొసగుటకే వచ్చియుండును. ఇపుడు భరతుఁడు మనలను జూడఁగోరియే, యిచ్చటికి వచ్చియుండు నని తలఁచుట యుక్తము. ఇతఁడు మనవిషయమునఁ గలలోనైన నొక్కకీడు తలంచువాఁడు కాఁడు. ఓ లక్ష్మణా! నీ విప్పుడు భరతుని విషయమున సంశయపడునంతటి కీడు నీ కెన్నఁడైనను నింతకుముందు చేసియున్నాఁడే? ఎద్దియైన భయముగలిగించు పనియైనఁ జేసియున్నాఁడే? నీవు భరతునిఁగూర్చి, నిష్ఠురపుమాట లాడకుము. అనిష్టములయిన పలుకులు పలుకకుము. నీవు భరతునియెడ నేదైన నింపుగానిమాట మాటాడుదువేని, అది నన్నన్నట్లే యగు. ఒక యిడుమ వచ్చినప్పుడు కొడుకులు తండ్రి నెట్లు చంపుదురు. లక్ష్మణా! తనప్రాణములోని భాగమగు తోఁబుట్టువును తోఁబుట్టువు చంపునే?

రాజ్యము నిమిత్తమే నీ విట్టి పలుకులు పలుకుదువేని, భరతుని నేఁ జూచినంతనే, "నాయనా! భరతా! రాజ్య మితనికిమ్ము" అని చెప్పెదను. లక్ష్మణా! నేను భరతునితో "ఇతనికి రాజ్యమును"మ్మని చెప్పితినేని, అతఁడును "అట్లే యిత్తును" అని చెప్పునుగాని బదులు సెప్పఁడు." ధర్మాచరణమే స్వభావముగాఁగల రాముఁ డిట్లు పలుకఁగా, అతనికి సమ్మతం బొనర్చుటయందే యాసక్తిగల లక్ష్మణుఁడు సిగ్గుతోఁ గ్రుంగి తలవంచుకొనెను. అట్లు లక్ష్మణుఁడు రాముని వాక్యము విని సిగ్గరియై "తండ్రియగు దశరథుఁడు తానే నిన్నుఁ జూడవచ్చుచున్నా"డని తలఁచెదనని చెప్పఁగా, రాముఁడును సిగ్గుపడియున్న లక్ష్మణుం జూచి, "దీర్ఘబాహువగు దశరథుఁడే మనలను జూచి పోవుటకో సుఖార్హులమగు మన పాటులం జూచి, వీ రీ యవస్థం బడనేరరని మఱల మనలను బురమునకుఁ దోడ్కొనిపోవుటకో వచ్చియుండును. ఒకవేళ మనము వనమున నుండగలమని తలఁచి, యెల్లప్పుడు సుఖము లనుభవించునదియగు సీతనుమాత్రము శ్రీమంతుఁడగు తండ్రి దశరథుఁడు వనమునుండి తోడ్కొనిపోవ వచ్చెనో? ఓ శూరుఁడా! ఇవిగో మంచికులమునఁ బుట్టినవియు, మనోహరములయినవియు, వేగమున వాయువుం బురుడించునవియునైన వేగశీలములగు రెండు మేటి గుఱ్ఱములు గాన్పించుచున్నవి. ఇదిగో, సేనాముఖమున ధీమంతుఁడగు తండ్రి యొక్కడి గొప్ప దేహముగలదగు శత్రుంజయమను పేరుగల యేనుఁగు కనఁబడుచున్నది. అయినను, పొడవుచేతులవాఁడా! లోకపూజితము దివ్యమునగు తండ్రి యొక్క తెల్లని గొడుగు గానరాకున్నది. కావున నావచ్చు నాతఁడు తండ్రియగునో కాడో యని సందియము గలుగుచున్నది. లక్ష్మణా! నీవు నా మాట విని, చెట్టుకొననుండి దిగిర"మ్మని చెప్పఁగా, శత్రుసంహారియైన లక్ష్మణుఁడు వృక్షాగ్రమునుండి దిగి, చేతులు జోడించుకొని, రాముని పార్శ్వమున నిలఁబడియుండెను.

నీతిమంతుఁడగు భరతుఁడు రాముని వనమున కేమాత్రము తొందర గలుగఁ గూడదని తలఁచి, సేనలంజూచి, "మీ రెంతమాత్రము సందడిచేయరా"దని యాజ్ఞాపింపఁబడుటచే, గజాశ్వ రథ సంకులమైన సేన యహంకారము మాని భయభక్తులు గలదై

యాపర్వత పార్శ్వమున నొకటిన్నర యోజనము మేర గుడారముల నేర్పఱచుకొని యుండెను.

## ౧౧౩-వ స ర్గ ము.

భరతుఁడు పాదచారియై రామాశ్రమము వెదకుట

పాదములుగలవారిలోపల నుత్తముఁడును, దీర్ఘబాహుఁడును, మాటకాండ్రలలో మేటియు, పురుషోత్తముఁడునగు భరతుఁడు సేనలకుఁ దగినవసతు లేర్పఱచిన పదంపడి పాదచారియై పితృవాక్యపరిపాలకుఁ డగు రామునిఁ గలిసికొనఁగోరి, వినయవంతునివలె శత్రుఘ్నుం జూచి, "నీవు మనవెంటవచ్చు బోయలను, బనివారిని గూడఁ దీసికొని వేగముగా నీ వనమెల్ల వెదకుము. గుహుఁడును ఖడ్గ, బాణ, ధనుర్ధారులయిన బంధువులను దోడుసేసికొని, తాను నీ చిత్రకూటమును వెదకఁ గలఁడు. మంత్రులు, పౌరులు, వసిష్ఠాదిగురువులు, బ్రాహ్మణులుతోడ రానేను నీవనమందంతటను కాలినడకతోఁ దిరిగి చూచెదను. రామునిని, బలవంతుఁడగు లక్ష్మణుని, పూజ్యురాలగు సీతను జూచునంతవఱకును నా మనమునకు నెమ్మదిగలుగదు. పద్మపత్రాక్షుండయిన రాముని యొక్క పూర్ణచంద్ర నిభమగు మోమును జూచితేని కాని, నామనము కుదుటఁబడదు. రాజలక్షణ సంయుక్తములగు శ్రీరాముని పాదములకు సాష్టాంగముగాఁ బ్రణమిల్లి, వానిని నా శిరముతో నెత్తుకొననిదియు నా మనమునకు శాంతి గలుగఁబోదు. రాజ్యపరిపాలనమునకుఁ దగిన రాముని నయోధ్యకుఁ దోడ్కొనివచ్చి, వంశపారంపర్యముగా వచ్చు నీ రాజ్యమునఁ బట్టభద్రునిఁ జేయునంతవఱకును నా మనమునకు నెమ్మదిలేదు. పున్నమచందురుని బోలి వెలుఁగుచున్న రాజీవాక్షుఁడగు రామునియొక్క మోము నెల్లప్పుడు చూచుచుండు లక్ష్మణుఁడును, చతుస్సముద్ర వేలావలయితంబగు భూమండలమున కేలికయగు తన భర్తను వెంబడించివచ్చిన పూజ్యురాలగు జానకియుఁ బుణ్యాత్ములు. నందనవనము కుబేరునకుఁబోలె, ఈచిత్రకూటము, శ్రీరామునికి నునికిపట్టయ్యెఁ గావుఁ బావనమయ్యెను. భీకర మృగాక్రాంతమును, దుర్గమమును నగు నియ్యరణ్యము ధనుర్ధర వరుఁడగు రామునికి నివాసమయ్యెఁ గావ పవిత్రమయినది. అని పలుకుచుఁ బాదచారియై మహారణ్యముఁ బ్రవే

శించి యచ్చటఁ గొండ నెత్తములందుఁ బూఁచిన పుష్పవృక్షముల రామణీయకము చూచుచుఁ గొంత దవ్వేఁగి, యచ్చటఁ జక్కఁగఁ బూఁచిన యొక మహావృక్షము నెక్కి రాముని పర్ణశాలా ప్రదేశమునుండి వచ్చెడి హోమధూమము నీక్షించి, దుస్తరమగు సముద్రముం దాఁటి యావలి గట్టును జేరినవానికై వడి మహానందమగ్నుఁడై, "శ్రీరాముఁ డిచ్చట దృఢముగా నుండఁగలఁ" డని యెఱిఁగి, పరిజనమును గూడఁ దీసికొని కయే గుహునిచేఁ జూపఁబడు దారిం బోవుచు సజ్జనసేవితమగు రామాశ్రమమునకు ససంభ్రమముగా నేగెను.

## 99-వ సర్గము.

### భరతుఁడు రాముని జూచుట

సేనలు విడిసిన పదంపడి యప్పుడు భరతుఁడు తమకముతో, శత్రుఘ్నునకు రాముని యాశ్రమమును జూపుచు, రామునిఁ జూడఁ దలఁచెను. అట్లు గురువత్సలుఁడయిన భరతుఁడు తఱలి "మునీంద్రా! మా తల్లులను వేగ తోడ్కొని రమ్ము" అని తన యాచార్యుఁడగు వసిష్ఠునిఁ బ్రార్థించి, తాను ముందు వేగిరముగాఁ బయనమాయెను. శత్రుఘ్నుఁడు తన యన్నను వెంబడించెను. భరతునకువలె, సుమంత్రునికిని రాముని సందర్శనాభిలాష మిక్కిలియుండెఁ గావున, సుమంత్రుఁడును శత్రుఘ్నుని వెంబడె పయనమయ్యెను. అంత శ్రీమంతుఁడగు భరతుడు పోవుచునే తాపసుల యునికిపట్టుల నడుమ నెలకొనియున్న యన్నయొక్క యాకుటిల్లును, పందిటిని, ఆయాకుటింటి ముందట విఱిచి పెట్టఁబడియున్న కట్టెలను, పూజనిమిత్తము కోయియుంచబడియున్న పుష్పములను జూచెను. ఆ యాశ్రమమునసే రామలక్ష్మణులు దారి తెలియుటకై గుఱుతులుగ నచ్చటచ్చటఁ జెట్లమీఁద నుంచిన వస్త్రములను, నారబట్టలను చూచెను. మఱియు నతఁడు రామలక్ష్మణులు వానకాలమునఁ జలి కాచుకొనుటకై చేర్చియున్న మృగములయు, దున్నలయు నేఱుపిడకల గొప్ప రాసులను జూచెను.

నిడివిచేతులవాఁడును, గాంతిమంతుఁడునైన భరతుఁడు సంతోషముతో శత్రుఘ్నుని, సుమంత్రుఁడు మొదలగు మంత్రులను, గుహాదులను గూర్చి, "మనము భరద్వాజులు సెప్పినచోటికి వచ్చి చేరితిమని

నేదలఁచెదను. ఇచటికిఁ గడుదాపుననే మందాకిని నది పాఱుచుండునని తోఁచెడి. ఇచ్చటఁ జెట్లమీఁద నచ్చటచ్చట నారబట్టలు కొమ్మలకుఁ దగిలింపఁబడియున్నవి. ఇవి, లక్ష్మణుండు రాత్రికాలము బయటఁబోవునపుడు, దారితెలియుటకై యుంచుకొన్న గుఱుతులై యుండనోపును. బలవంతములును, ఉన్నతదంతములునగు నేనుఁగులు గర్జిల్లుచు నొండొంటితోఁ బోరాడిన ప్రదేశమిదియే యయియుండును. వనములందు మునీంద్రులచే హోమార్థము సదా పదిలముగాఁ గాపాడఁబడుచుండు నగ్నిహోత్రమునుండి లేచు ధూమమిదిగో తెలియుచున్నది. పితృవాక్య పరిపాలన దీక్షితుఁడును, బలవంతుఁడును, జడలధారియునైన మాయన్న యిచ్చట నుండును. పూజ్యుఁడయిన ఆయనను నే నిచ్చట సంతసముతో చూడఁగలను. ఇందుకు సంశయముండదు" అనుచుఁ జిత్రకూటమునుగూర్చి గొంత దవ్వేఁగి, మందాకినిం జేరి, "పురుషోత్తముఁడైన రామనృపాలుఁడు నిర్మానుష్యమయిన యడవికేతెంచి, కటికి నేలపై † వీరాసనమునఁ గూర్చుండియున్నాఁడు. నాకయికదా రాముఁ డింతటి యిడుములపాలయ్యె. నాజన్మమేల! నా ప్రాణములున్న నేమి! పోయిన నేమి! నానిమిత్తమై మహాకాంతిగల జగద్రక్షకుఁడగు శ్రీరాముఁడు తన యెల్లసుఖముల విడనాడి యరణ్యవాసియయ్యెనని జనులు నన్ను దూరుచున్నారు. నే నిప్పుడు రామునియొక్కయు, సీతయొక్కయు, లక్ష్మణుని యొక్కయు పాదములపైఁబడి, నన్ననుగ్రహింప వేఁడెదను" అని విలపించుచుఁ బోయి మద్ది, తాటి, ఇనుమద్దియాకులు దంటగాఁ బఱవఁబడినదియు, యజ్ఞవేదికవలె నంతట మెత్తనిదర్భలు పఱవఁబడినదియు, నూఱుపలముల యెత్తు గలిగినవియు, బంగారువీఁపు గలవియు, విశేషబలముగలవియునై వజ్రాయుధమును బోలినవియు శత్రువుల నొప్పింపఁ గలిగినవియు నగు విండ్లతోడను, సూర్యకిరణములవలె వెలుఁగుచుండు జ్వలించుచున్న కొనలుగలవియునై యమ్ములపొదులం దుంపఁబడిన భయంకరబాణములతోడను గూడి, విసపుమంటలఁ గ్రక్కుచున్న సర్పములతోఁ గూడిన భోగవతివలె నుండునదియు, బంగారపు టొరలలోఁ జేయఁబడి

---

† కుడిమోఁకాలిపై ఎడమపాదమును, ఎడమతొడక్రింద కుడిపాదము నుంచి కాని కూర్చుండుట "వీరాసన" మనబడు.

యున్న కత్తులచే నొప్పునదియు, యచ్చటచ్చట బంగారపు బిళ్ల లతికింపఁబడియున్న డాలువాలులచే విరాజిల్లుచుండునదియు, కాంచన భూషితములును, చిత్రవర్ణములునునైన యచ్చటచ్చటఁ దగిలింపఁబడి యుండు నుడుముతోలుచేఁ జేయఁబడిన వ్రేళ్ల యొరలతోఁ గూడినదియు మృగములకు సింహము గుహనుబోలె శత్రురాజుల కలవికానిదియు విశాల రమణీయమును పావనమునునై యుండు రాములవారి యాకుటింటిని జూచినవాఁడై, దానికి జేరువ నీశాన్యమూలయందుఁ బలమైనదియు, జ్వలించుచున్న యగ్నిహోత్రునితోఁ గూడినదియు, విశాలమును, పావనమునునై యుండు నగ్నిహోత్ర వేదిని జూచెను. అట్లు భరతుఁడు కొంతతడవు పర్ణశాల వేదికల సొంపును జూచుచుండి మఱింత దాపునకేఁగి, సింహముయొక్క మూపురములంబోలు మూపురములు గలవాఁడును, నిడుపు చేతులవాఁడును, తెల్ల తామరపువ్వులం బోలు కన్నులుగలవాఁడును, సముద్రపర్యంతము నుండెడి పుడమి నేలువాఁడును, స్వధర్మము నేమఱక నడపువాఁడును, దర్భలు పఱచిన పుడమిపై సీతా లక్ష్మణులతోఁ గూడఁ గూర్చుండియున్న వాఁడును, జటావల్కలాజినధారియునునై, యగ్నిహోత్రునిమాడ్కిఁ దేజరిల్లుచున్న రామునిఁ జూచెను. రామదర్శనమయినంతనె, కాంతి మంతుఁడు, ధర్మశీలుఁడునై యున్న భరతుఁడు దుఃఖసాగరమగ్నుఁడై యెదురుగాఁ బరుగెత్తి, ధైర్యముతోఁ గన్నీళ్లు నాపుకొనఁజాలక హీన స్వరముతో నిట్లుపలికెను, "మా యన్నయైన రాముఁడు కొలువుకూట మునఁ గూర్చుండి ప్రజలచేఁ గొలువఁబడఁదగినవాఁడు, అతఁ డిప్పుడు శార్దూలాదులగు వన్యమృగములచేఁ గొల్వఁబడుచు నొక యాకుటింటి యందుఁ గూర్చుండియున్నాఁడు. అయోధ్యయం దున్నప్పుడు, అమూ ల్యములైన పలుతెఱఁగుల వస్త్రములఁ గట్టుచుండిన రాముఁ డిప్పుడు జింకతోలును గట్టికొని వానప్రస్థధర్మము నాచరించుచు నున్నాఁడు. తొల్లి యయోధ్యానగరమున నున్న యప్పుడు సువాసనగల నానావిధ పుష్పములను దాల్చుచుండిన రాముఁ డిప్పుడు జడలను దాల్చియున్న వాఁడు. తొల్లి సెత్తావిగల గంధము నలఁదికొనుచుండిన రాముఁ డిప్పుడు ముఱికినిండిన శరీరముగలిగియున్నాఁడు. తాను యజమానుఁడై

యుండి, ఋత్విజులచే జన్నములు చేయించి యా ఫలము నొందవలసిన రాముఁ డిప్పుడు శరీరమును కృశింపఁజేసి పుణ్యము నొందఁగోరుచున్న వాఁడు. అయ్యో! సుఖార్హుఁడైన రాముఁడు నా నిమిత్త మిట్టిదుఃఖము నొంది యున్నవాఁడు. లోకుల నిందకుఁ బాలయిన క్రూరుఁడ నగు నేను ప్రాణములతోనుండి యేమి యుపయోగము!" అని యిట్లు దిగులుపడి దిగఁజాఱి, చెమటపోసిన మోముఁదమ్మిగలవాఁడయి విలపించుచు, రాముని పాదములకడకుఁ బోయి చేరకయె మైమఱచి క్రిందఁబడెను. మఱల లేచినను, మహాబలుఁ డగు భరతుఁడు వెతలపాలయి, యొక తడవ దీనముగా "అన్నా" యని పిలిచెనుగాని, యంతకుఁ బై మాట యేమియుఁ జెప్పక యూఱకుండెను. భరతుఁ డిట్లు దుఃఖాధిక్యముచే నయిన డగ్గుత్తికతోఁ గీర్తిమంతుఁడగు రాముని జూచి "యన్నా" అని మాటిమాటికిఁ బిలుచుచుండెనుగాని, యంతకుఁ బై మాట నేమియుఁ జెప్పఁజాలఁ డాయెను. అనంతరము శత్రుఘ్నుఁడును విలపించుచు రాముని పాదములకు వందన మాచరించెను.

శ్రీరాముఁడును తన తమ్ముల నిరువురను గౌఁగిలించికొని, కన్నీరు మున్నీరై పాఱునట్లు విడిచెను. అంతలో సుమంత్ర గుహులును రామ లక్ష్మణులకడకు వచ్చిరి. అప్పుడా రామలక్ష్మణులు సుమంత్ర గుహులతోఁగూడి, యాకసమున శుక్రబృహస్పతులతోఁ గలసిన దిననాథ నిశానాథులమాడ్కిఁ దేజరిల్లుచుండిరి. అచ్చట నయ్యరణ్యమునఁ గూడిన మేటి యేనుఁగుగున్నలఁబోలు నా రాజులను దిలకించి, యయ్యాశ్రమ వాసులగు మును లందఱు సంతసముమాని, వారియిడుములఁజూచి కన్నీరు విడిచిరి.

## 100-వ సర్గము

### రాముఁడు భరతుని కుశలప్రశ్న చేయుట

రాముఁడును జడలు దాల్చినవాఁడును, నారబట్టలఁ గట్టుకొన్న వాఁడును, చేతులు జోడించుకొన్నవాఁడై నేలఁ బడినవాఁడును నయి ప్రళయకాలమందలి భానుమంతునిమాడ్కిఁ జూడ నలవికాకయున్న భరతుఁ జూచి, చిక్కియు, మోము వన్నెదఱిఁగియు నున్నందున నెట్ట కేలకు నతఁడు భరతుఁ డని యానవాలుపట్టి, యతనిని చేతులఁ గ్రుచ్చి

యెత్తి కూర్చుండఁబెట్టి, గట్టిగాఁ గౌఁగిలించికొని, శిరమున ముద్దాడి, తనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని, సావధానుఁడయి కుశలప్రశ్న చేయఁదొడఁగెను.

ఓ నాయనా! నీ వడవికి వచ్చితివే, తండ్రి యెక్కడ కేఁగుదెంచెను? అతఁడు బ్రతికియుండఁగా, నీ వతనిని విడిచి వనమునకు రాఁదగదు గదా. ఓ నాయనా! నిన్నుఁ జూచి చాలదినము లాయె. నే నడవికి వచ్చుటకుఁ జాలదినములకు మునుపే నీవు కేకయదేశమునకుఁ దాతగారి యింటికిఁ బోయితివి. ని న్నెంతకాలమునకుఁ జూడఁ గలిగితిని. నీ యంగములు గుఱుతే తెలియకున్నవి. ఈ ఘోరారణ్యమునకు నీవెందుల కేఁగుదెంచితివి? నాయనా! ఇప్పుడు తండ్రి బ్రతికియున్నాఁడా? లేకున్న నీ వెట్లు రాఁ గలిగితివి? నృపాలుఁడు పుత్రశోకపీడితుఁడై యా దుఃఖముతో మృతినొందఁడుగదా. ఓ అబ్బాయీ! నీవు బాలుఁడవు గావున నీ రాజ్య మెవ్వరు గైకొనిపోవక తిరమైయున్నదా? ఓరి తండ్రీ! తిరమగు మగఁటిమిగల తండ్రినిఁ గొల్చుచున్నాఁడవే? ఆడినమాట తప్పనివాఁడును, పెక్కు రాజసూయములు, నశ్వమేధములు జేసినవాఁడును, న్యాయమందు నిలకడగలవాఁడునునగు దశరథనృపాలుఁడు సేమముతో నున్నవాఁడే? బ్రహ్మజ్ఞానియు, త్రికాలవేదియు, ధర్మముఁ దప్పనివాఁడును, బ్రహ్మతేజస్సుగలవాఁడును, ఎక్కువ కీర్తిగలవాఁడును, ఇక్ష్వాకువంశమువారికిఁ బురోహితుఁడునునైన వసిష్ఠమునీంద్రునిఁ జక్కఁగాఁ బూజించుచున్నాఁడవె? నాయనా! దుఃఖపడుచుండిన మా తల్లియగు కౌసల్యయు, సుపుత్రులఁ గన్నతల్లియగు సుమిత్రయు, పూజ్యురాలగు కైకేయియు సేమముతో నున్నవారుగదా! వినయముతోఁ గూడినవాఁడును, గురుపుత్రుఁడును, విశేషమైన శాస్త్రజ్ఞానముగలవాఁడును, అసూయ లేనివాఁడును, నీ కార్యములయెడఁ బ్రమాదము వాటిల్లకుండునట్లు చూచువాఁడునైన పురోహితుఁడగు సుయజ్ఞుని గారవించుచున్నాఁడవు గదా! శ్రౌతవిధానముల నెఱిఁగినవాఁడును, బుద్ధిమంతుఁడును, చక్కనివాఁడును, కపటములేనివాఁడునైన సుయజ్ఞుఁడు నీచే నగ్నిహోత్రములు నడిపింప నియోగింపఁబడి యప్పుడప్పుడు జరిగిన హోమములను, జరుగఁబోవు హోమములను జక్కఁగఁ

జూచుకొనుచు నప్పటప్పటికి వానిని నీకుఁ దెలియఁజేయుచున్నాఁడు గదా! వేల్పులను, తండ్రులను, గురువులను, తల్లులను, పితృసములగు బంధువులను, ముదుసలులను, వైద్యులను, బ్రాహ్మణులను నీవు పూజించు చున్నాఁడవు గదా! శ్రేష్ఠములైన బాణములను, ధనుస్సులను గల వాఁడును, నీతిశాస్త్రము నెఱిఁగినవాఁడును నగు నుపాధ్యాయుఁడగు సుధన్వుని మర్యాద చేయుచున్నావుగదా! సరివయసువారును, శౌర్య వంతులును, శాస్త్రజ్ఞానము గలవారును, లంచము గొననివారును, సద్వం శమునఁ బుట్టినవారును, నీ యభిప్రాయము మెఱిఁగి నడచుకొనువారు నగు మంత్రుల నేర్పఱచికొనియున్నాఁడవుగదా! రాజులకు ఆలోచనయే గెల్పునకు హేతువుగనుక, గూఢముగ నెవరికిఁ దెలియకుండులాగున నాలోచనలు తెలిపినవారును, నీతిశాస్త్రము నెఱిఁగినవారును నైన మంత్రులు నీతోనుండి యాలోచనలు సెప్పుచుందురుగదా! ఎల్లప్పుడు నిదురింపవుగదా! వేకువనే నిద్దురలేచుచున్నావుగదా! నడికిరేయి యందుఁ గార్యాలోచనలఁ జేయుచున్నాఁడవుగదా! ఒంటరిగానైనను అనేకులతోనైనను జేరి యోచనలు చేయవుగదా! నీయోచనలు కార్య ములగువఱకు నొరులకుఁ దెలియవుగదా! తక్కువపెట్టుబడితో నెక్కువ లాభమునుగలిగించు కార్యమును నిర్ణయించుకొని జాగుసేయక పనులను జేయుచున్నావుగదా! అట్టిపనులు చేయుటకాలసింపవుగదా! నీయిరుగు పొరుగుల నుండువారు నీవు చేసెడి యన్నిపనులు చక్కఁగాఁజేసి ముగించిన పిదపనో, యించుమించుగా నవి ముగియనున్నప్పుడో వానిని తెలిసికొందురుగాని, నీవు చేయఁబోవు వానిని యెఱుఁగరుగదా! నీ వొండె నీ మంత్రులొండె చేసిన యాలోచన లొరు లూహించియైనను, యుక్తిచే నయినను, మఱియుఁ జెప్ప నలవికాని తంత్రములచేతనైనను నెఱుఁగరుగదా! యోగ్యుఁడు కష్టములు వచ్చినపుడు మనకు మే లొన రించుఁ గావున, నీవు వేలకొలఁది మూఢులలో నొకపండితుని నేర్పఱచి, వానిని జేర్చుకొని తక్కినవారిని వదలుదువుగదా! ఒక్క మహీపాలునికడ మూర్ఖులు వేవురున్నను, పదివేవురున్నను వారివలన నా రాజున కెట్టి యుపయోగమును లేదు, చుఱుకుదనము, శౌర్యము, నేర్పు, తెలివియుఁ గలవాఁడగు మంత్రి యొక్కఁడయినను గొప్ప రాజునకైనను రాజ

మాత్రునికైనను నెక్కువ కల్మి నొడఁగూర్చును, భరతా! గొప్ప పను
లలో గొప్పవారిని, సామాన్యపుఁ బనులందు సామాన్యులను, నీచపు
బనులందు నీచులను నియమించుచున్నావుగదా! సుపరీక్షితులును, కప
టములేనివారును, వంశపరంపరగా వచ్చువారును, ఆచారవంతులును,
ఉత్తమగుణవంతులు నైన మంత్రులకే గొప్ప యుద్యోగము లిప్పింతువు
గదా! కైకయీసుతుఁడా! నీవు జనుల కన్యాయ్యముగా నోర్వరాని
దండనములను విధించి, వారికష్టము కలిగించునప్పుడు నీ మంత్రులు
చూచుచు నూరకుండరుగదా! పట్టరాని దానములు పట్టి ధనమార్జించి
దానిచే యాగము చేయఁ దలఁచు కులభ్రష్టుని యాజకులు లెక్కింప
నట్లును, అతివలు బలాత్కారముగా చేయిపట్టి తిగిచికొని పోయి
రమింపఁగోరువానిని విడుచునట్లును, ఓర్వరాని పన్నులు గైకొనుటచే
నిన్నెవరును దూషింపరుగదా! అన్ని పనులను జేయుటయందు నేర్ప
రియు, నీతిశాస్త్రవిచక్షణుఁడును, సేవకులతోఁ గయ్యములు పుట్టించు
వాఁడును, శూరుఁడును, రాజ్యము నపహరింపఁ గోరునట్టివాఁడునగు
దుష్టమానవుని రాజుచంపకపోయినయెడల వాఁడు రాజు నేచంపును గనుక
నట్టివానిని సంహరించుచుందువే! ధైర్యశాలియు, పెక్కుసమయము
లందు . నీవలన సన్మానమునొంది సంతసించినవాఁడును, తెలివిగల
వాఁడును, ఆచారవంతుఁడును, సత్కుల ప్రసూతుఁడును, నీయెడ
ప్రేమగలవాఁడును, సేనావ్యూహములందు నేర్పరియునునైనవానిని
సేనాధిపతినిగఁ జేసితివిగదా! బలిమిగలవారును, యుద్ధములందు నేర్పరు
లునునైన జోదులను వారు యుద్ధములందు చూపిన సామర్థ్యములను
గనిపెట్టి బహుమానము లొసఁగి సంతోషపఱచితివే! సేనలకు బత్తె
ములు, జీతములు వారివారి నేర్పునకును, నధికారమునకును దగినయట్లు
ఇయ్యవలసిన సమయములలో నిత్తువుగాని యాలస్యము చేయవుగదా!
జీతములచే జీవించు భృత్యులు బత్తెములను జీతములను సకాలమున
నియ్యనిచోఁ బ్రభువుపైఁ గోపపడుదురు; దూషింతురు. కావున నిది
యొక గొప్ప యనర్థమని చెప్పఁబడును. ప్రధానులగు రాజపుత్రు లం
దఱు నీ యెడఁ బ్రేమగలిగి నీ కార్యములందుఁ బ్రాణములనైనను, విడు
తురుగదా! స్వదేశమునందుఁ బుట్టినవాఁడును, విద్వాంసుఁడును, శ్రోత్ర

క్రొత్తగాఁ బుట్టెడు యోచనలతోఁగూడిన బుద్ధిగలవాఁడును, నేర్పరియు, చెప్పినమాటలు సరిగాఁ జెప్పువాఁడును, యుక్తాయుక్తముల నెఱింగినవాఁడునైన దూత నేర్పఱచియున్నాఁడవుగదా. * స్వదేశమునఁ బదునైదు తీర్థములను, బరదేశమునఁ బదునెనిమిది తీర్థములను ఒకరొకరికిని, బరులకును దెలియకయుండునట్లు ముగ్గురు ముగ్గురు వేగులం బంపి వేలువేలుగా విచారించుకొనుచున్నాఁడవే? శత్రుసూదనా! నీచే నొక్కతూరి వెడలఁగొట్టఁబడినవారును, నీకుఁ గీడు దలపెట్టువారును, నీపై దండెత్తువారు నైనశత్రువులను దుర్బలు లని యుపేక్షింపవుగదా! నాస్తికు లగు విప్రులు మూఢులై, తమ్ముఁ బండితులనుగా నెంచుచు, మంచి చెడ్డగాను, చెడ్డ మంచిగాను దెలిపి చెడ్డ పనులలోఁ జొప్పింతురు గావున, ఓరీ నాయనా! యట్టి విప్రులను నీవు దగ్గఱఁ జేర్చుకొనవుగదా? ప్రమాణములగు సజ్జనసమ్మతము లయినధర్మశాస్త్రము లెన్నియున్నను, బెడకట్టె బుద్ధిగలవారలైన యీ నాస్తికులు తమ యూహలచే నపార్థములను గల్పింతురు. నాయనా! శూరులయిన మన పెద్దలచే నేలఁబడినదియు, నయోధ్యయని సార్థకనామముగలదియు, గుఱ్ఱములు నేనుఁగులు రథములు వీనితో నిండినదియు, ఎల్లప్పుడు స్వస్వవిహిత వర్ణాశ్రమధర్మములం దాసక్తులగువారును, జితేంద్రియులును, నెక్కువ పూన్కిగలవారును, యోగ్యులునయిన వేనవేలు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులచేత వెలయుచున్నదియు, పలుతెఱఁగుల సోపానములతోఁగూడినదియు, పండితులచే నొప్పుచున్నదియు, సకలసంపదలతోఁ గూడినదియు, విశాలమైనదియునగు నయోధ్యను శ్రద్ధతోఁ గాపాడుచున్నావుగదా! ఓ భరతా! నూఱులకొలఁదిగాఁగల యాగ

---

* శత్రుదేశమునఁ బదునెనిమిది తీర్థములు:—మంత్రి, పురోహితుఁడు, యువరాజు, సేనాపతి, ద్వారపాలుఁడు, అంతఃపుర రక్షకభటుఁడు, చెఱసాలకాఁపరి, బొక్కసకాఁపరి, కార్యనిర్వాహకుఁడు న్యాయములఁ దీర్చువారు (జడ్జీలు), సేనానాయకుఁడు, పట్టణరక్షకుడు, కర్మాంతికుఁడు, సభాధికారి, ధర్మాధికారి, దుర్గరక్షకుఁడు, దండపాలుఁడు, పొలిమేరకాఁపరి అనునవి.

స్వపక్షమునఁ బదునైదు తీర్థములు:—మంత్రి, పురోహితుఁడు, యువరాజు తప్పఁ దక్కిన పైఁ జెప్పినవారు.

శాలలతోఁ గూడినదియు, మంచి జీవనవసతిగల జనులచే నిండినదియు, దేవాలయములతోను, చలిపందిరులతోను, కొలఁకులతోను నంతట నొప్పు చున్నదియు, సంతోషభరితులయిన స్త్రీపురుషులచే శోభిల్లుచున్నదియు, ఉత్సవములచేతను నూరేగింపులచేతను రంజిల్లుచున్నదియు, చక్కఁగ దున్ని పైరుపెట్టఁబడియుండు పొలములతోఁ గూడినదియు, పశువులుగల దియు, ఈతిబాధ లేనిదియు, వర్షజలమే కాక, యేటినీటి పాఱుదలయు నాధారముగాఁగలదియు, శార్దూలాది భయంకరమృగములు లేనిదియు, చోరాగ్నిదాయాదుల భయము లేనిదియు, బంగారు వెండి మొదలగు లోహములగనులచే నంతట వెలుఁగుచున్నదియు, పాపాత్ముల సంచారము లేనిదియు, నా పెద్దలు చక్కఁగాఁ గాపాడినదియునైన కోసలదేశమెల్ల నన్ని తెఱఁగుల సమృద్ధిగలిగి సుఖముగనున్నదిగదా! దేశమున నున్న కాఁపులును, ఆవులకాఁపరులును నీయెడఁ బ్రేమగలిగియున్నారుగదా? నాయనా! వైశ్యులు నీ మాటలను విని వర్తకముఁ జేయుచు, సుఖము నొందుదురుగదా? ఓ భరతా! ఆ వైశ్యులయొక్క సొత్తులను గాపా డియు, ఆపదలను నివారించియు, వారిని బోషించుచున్నాఁడవే? నృపా లుఁడు స్వదేశవాసులగు జనులనందఱను సర్వవిధములఁ గాపాడవల యునుగదా! స్త్రీలను సంతోషపెట్టుచున్నాఁడవే? నీవు వారిని గాపాడు చున్నాఁడవే? నీవు వారిని నమ్మవుగదా? వారితో రహస్యములు చెప్పవు గదా? ఏనుఁగులు పుట్టునట్టి యడవులను మళ్ళఁదోలించి కాపాడుచున్నాఁ డవే? పెంటియేనుఁగు లున్నవా? ఆఁడేనుఁగులు, గుఱ్ఱములు, గజములు నెన్నియున్నను, నీవు దనివినొందవుగదా! రాజపుత్త్రుఁడా! ప్రతిదినము నుదయమున లేచి సొమ్ములు దొడుగుకొని ప్రొద్దుటిపూట సభలోఁ గూర్చుండి జనులకందఱకు దర్శనమొసఁగుదువుగదా? పనివాండ్ర కంద ఱకిని బలుమాఱు దర్శనమిచ్చుచును, బొత్తుగా దర్శనము నిప్పించకయు నుండక, యెప్పుడప్పుడు వారికి దర్శనమిచ్చుచున్నాఁడవుగదా? నీవు కోటల నన్నింటిని ధనము, ధాన్యము, ఆయుధములు, ఉదకము, యంత్ర ములు, విలుకాండ్రు, వడ్రంగులు నను వీరిచే నిండించియున్నావుగదా? నీకు ఆదాయము హెచ్చుగాను, వ్యయము స్వల్పముగాను నున్నదా? నీ ధన మయోగ్యులపాలు గాకయున్నదిగదా! ఓ భరతా! నీ ధనమును

దేవతలు, పితృదేవతలు, బ్రాహ్మణులు, యోధులు చెలికాండ్రు ననువీరికై వెచ్చించుచున్నాఁడవుగదా? సత్స్వభావముగల సజ్జనులపై దొంగతనములు మోపి శిక్షింపవుగదా? అట్టి పరిశుద్ధుని విషయమున నీతిశాస్త్ర మర్మముల నెఱింగిన పెద్దల సాయమున విచారించి తప్పు మోపుదువు గాని, లంచగొండివై లోభముతో వారిని దండింపవుగదా? ఒక దొంగ దొంగిలించునప్పుడు చూచి పట్టుకొనఁబడి విచారించి, సాక్షులను విమర్శించి దోషము నిరూపింపఁబడిన తర్వాత, డబ్బున కాసపడి వానిని విడువవుగదా? శాస్త్రజ్ఞులైన నీమంత్రులు భాగ్యవంతునికిని దరిద్రునికిని వివాదము సంభవించినప్పుడు ద్రవ్యాశమాని విచారించి తీర్పు చెప్పుచున్నారుగదా? నేరముచేయనివానిపై నేరమును మోపిన నప్పుడు వారు మిక్కిలి వ్యసనముతో విడిచిన కన్నీరు పుడమిపైఁబడి, జనప్రీతికై పాలించెడి యా రాజుయొక్క పుత్రులను, పశువులను, ధనధాన్యాదులను నాశము నొందించును. రఘునందనా! ముదుసలులను, బాలురను, బండితశ్రేష్ఠులను దానము లొసఁగుట, మంచిమాటలు మాట్లాడుట, మనమునఁ బ్రేమగలిగియుండుట యను నీ మూఁడుపాయములచేత లోఁబఱచుకొనుచుందువుగదా! గురువులకు, ముసలివాండ్రకు, ఋషులకు, వేల్పులకు, నతిథులకు, దేవాలయములకు, కృత కృత్యులగు బ్రాహ్మణులకును జూచినపుడు మ్రొక్కుచుందువుగదా? అర్థముచే ధర్మమునుగాని, ధర్మముచే నర్థమునుగాని లేక ధర్మార్థములను రెంటిని సుఖాపేక్షచేతఁ గాని, కామముచేతఁగాని చెడఁగొట్టవుగదా? జయశీలురలోపల శ్రేష్ఠుఁడా! ధర్మమును, అర్థమును, కామమును నీవు కాలము నెఱిఁగినవాఁడవు, వరదుఁడవును గనుక నొక్కొక్క వేళలో నొక్కొక్కదానిని సేవింతువుగదా గొప్ప పండితుఁడా? సకలశాస్త్రముల రహస్యముల నెఱిఁగినవారగు బ్రాహ్మణులును, పురజనులును, గ్రామవాసులును నీయొక్క క్షేమమును గోరుచుందురుగదా. దేవుఁడు లేఁడనుట, బొంకులాడుట, కోపము, ఏమఱుపాటు, జ్ఞానుల దర్శనముచేయమి, సోమరితనము, ఎల్లప్పుడు ఇంద్రియసౌఖ్యములు గోరుచుండుట, కార్యములపట్ల నొంటరిగా యోచించుట, మూర్ఖులతో యోచించుట, ఆలోచించి చేయ నిశ్చయించిన కార్యములను మొదలుపెట్టకుండుట, ఆలోచనను వెలి

పుచ్చుట, సూర్యోదయమున నద్దము చూచుట మొదలగు శుభకార్య
ములు చేయకుండుట, ఒకలే పర్యాయము శత్రురాజు లందఱిపై
దండెత్తుట యనునివి పదునాలుగును రాజదోషము లనఁబడును.
ఈ పదునాలుగు రాజదోషములును నీకు లేవుగదా! వేఁటాడుట,
జూదము, పగటిపూట నిద్రపోవుట, పరులను దూరుట, స్త్రీలయం
దెల్లప్పుడాసక్తిగలిగియుండుట, గర్వము, ఆటలు, పాటలు, వాద్యములు;
పనిలేకుండఁ దిరుగుట యను పది దోషములను; సాపత్న్యము, ధనము,
స్త్రీ, మాటలు, అపరాధము వీనివలనఁ గలుగు పంచవిధ వైరములను,
లేక ఉదకదుర్గము, పర్వతదుర్గము, వనదుర్గము, ఇరిణము, ధాన్వనము
అను పంచవర్గములు; సామ దాన భేద దండము లనెడి చతుర్వర్గమును;
రాజు, మంత్రి, దేశము, బొక్కసము, స్నేహితులు, కోట, సేన యను
సప్తవర్గమును; కృషి, వర్తకము, దుర్గము లేర్పఱచుట, సేతువులు కట్టుట,
ఏనుఁగులఁగట్టుట, గనులను వశపఱచుకొనుట, పన్ను వసూలుచేయుట;
కాఁపురములు లేని యిండ్లలోఁ గాపురము పెట్టుట యను అష్టవర్గమును,
అసాధ్యమైన పనులలోఁ బ్రయత్నపడుట, తెలివిలేమిచే సాధ్యములయిన
పనులలోఁ బ్రయత్నపడకుండుట, సాధ్యములయిన పనులలో సైతము
సమయము మీఱి ప్రయత్నపడుట యను కార్యవ్యసనరూపమైనది;
లేక, ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి యను శక్తిరూపమయినది;
లేక ధర్మ, అర్థ, కామరూపమయినది యగు త్రివర్గమును; త్రయీ,
వార్త, దండనీతి యను త్రివిద్యలను, పంచేంద్రియములను సంధిచేసి
కొనుట, యుద్ధముచేయుట, యుద్ధమునకు వెడలుట, ముట్టడించుట,
మిత్ర భేదము, ప్రక్కబలము సంపాదించుట యను షడ్వర్గమును; నిప్పు,
నీరు, రోగములు, కఱవు, చావు అను దైవవశములైన వ్యసనములను;
తగనివారు, దొంగలు, పొరుగుదేశమువారు, రాజబంధువులు, రాజు
అను మానుషవ్యసనములను; "జీతమునొందని లుబ్ధుఁడును, అవమా
నింపఁబడిన మానవంతుఁడును, నిష్కారణముగాఁ గోపించుకొనఁబడిన
కోపనుఁడును, భయపఱుపఁబడిన భయపడు స్వభావముగలవాఁడు వీరు
రాజునకుఁ జెఱుపు చేయుదురు గాన వీరి కిష్టమయిన వస్తువుల నొసఁగి,
భేదింపవలయు" అని చెప్పఁబడిన భేదకృత్యమును; బాలుఁడు; వృద్ధు,

దీర్ఘరోగి, బంధువులచేఁ దఱుమఁబడ్డవాఁడు, భయపడువాఁడు, భయపడు జనులుగలవాఁడు, లుబ్ధుఁడు, లుబ్ధజనులు గలవాఁడు, వైరాగ్యస్వభావముగలవాఁడు, ఇంద్రియాశలందుఁ దగులుగలవాఁడు, పరిపరి విధములగు యోచనలు చేయువాఁడు, దేవబ్రాహ్మణ నిందకుఁడు, బ్రహ్మర్షి శాపగ్రస్తుఁడు, దైవబలము లేనివాఁడు, కఱవుచే బాధపడు చుండువాఁడు, సేనానాశముచే దుఃఖపడువాఁడు, పరదేశస్థుఁడు, పలువురికిఁ బగవాఁడు, గ్రహాచారము చాలనివాఁడు, సత్యమును న్యాయమార్గమును దప్పినవాఁడు నను నీ వింశతి (20) వర్గమును; మంత్రి, రాజ్యము, దుర్గము, బొక్కసము, దండము అను జయముఁగోరెడు రాజునకుఁ గావలయు ప్రకృతులను; జయముఁగోరువాఁడు, అతని శత్రువు, ఆ శత్రువునకు ముందుండు మిత్రుఁడు, అతనికి ముందుండు శత్రువుయొక్క మిత్రుఁడు, అతనికి ముందుండు శత్రుమిత్ర మిత్రుఁడు నను ముందుండు నైదుగురును; పార్ష్ణిగ్రాహుఁడు, పార్ష్ణిగ్రాహాసారుఁడు అను వెనుకనుండు రాజును, వాని మిత్రుఁడు, ఆతని వెనుకనుండు వాఁడు, పార్శ్వములో నుండువాఁడు, మధ్యనుండువాఁడు, దూరముగ నుండువాఁడును అను మండలమును; అయిదువిధములు గల యానమును, సేనల నిల్పువిధమును, యానాసనములకుఁ గారణమయిన విగ్రహమును, ద్వైధీభావసమాశ్రయములకుఁ గారణమయిన సంధిని, శాస్త్రరీతిగాఁ దెలిసికొని చెడువానిని బరిత్యజించి మంచివానిని గైకొనుచున్నాఁడవే? నీవు మంత్రి కుండవలసిన లక్షణములతోఁగూడిన ముగ్గురు లేక నలుగురు మంత్రులతో వేర్వేఱుగాఁగాని, కలిసికాని యేకాంతమున నాలోచన చేయుదువే? నీవు చదివిన వేదశాస్త్రములను అగ్నిహోత్రాది కార్యములు సేసి సార్థకము చేయుచున్నావా? నీవు సంపాదించిన ధనమును దానభోగములచే సఫలముగునట్లు చేయు చున్నావా! నీ భార్యలు రతిసుఖమును, సంతతియుం బడయుటచే సార్థకులుగా నున్నారా? నీవు నేర్చినశాస్త్రములు నీ మంచిస్వభావముచే సఫలములై యున్నవా? ఆయుస్సును, కీర్తిని నొసంగునదియు, ధర్మార్థకామముల నొసఁగునదియునైన పై జెప్పిన నీతుల నెఱిఁగెడి బుద్ధి నా కెట్లున్నదో యట్లే నీకు నున్నదా? మన తాతముత్తాత లెట్టి నడత

నడచుకొనుచుండిరో, ఏది మంచిదారిఁ దప్పనిదో, ఏది మంచిదో యా నడతనే నీవు నడచుకొనుచున్నావుగదా? మధురపదార్థములను నీ వొంటరిగాఁ దినవుగదా! నీ స్నేహితు లడిగినది శక్తికొలఁదిగా నిత్తువు గదా? భరతా! నృపాలుఁడు మహాబుద్ధిశాలియై జనులలో దుష్టులను గనిపెట్టి దండించుచు, న్యాయమార్గమునఁ బుడమి నేలుచు, భూమండలమునెల్లఁ దనవశముచేసికొని, యీలోకమున సకలసుఖముల ననుభవించి యంతమున పరబ్రహ్మతత్త్వము నెఱిఁగి, శాశ్వత స్వర్గలోకము నొందుచున్నాఁడు." అని భరతునిఁ గుశల మడిగెను.

## 101-వ సర్గము.

### భరతుఁ డన్నకుఁ దండ్రి మరణవార్తను దెలుపుట

భరతుఁడు రాముని పలుకు లాలకించి, "ఓ నరశ్రేష్ఠా! న్యాయమార్గముఁ దప్పినవాఁడనగు నాకీ రాజ్యపరిపాలనముతో నేమి ప్రయోజనముగలదు? పెద్దవాఁడుండఁగాఁ జిన్నవాఁడు రాజగుట మనవంశము నందుఁ బెద్దలనాటినుండి వచ్చెడి యాచారముగాదు. కావున నే నెట్లిప్పుడు రాజ్యాభిషిక్తుఁడ నయ్యెదను? రాఘవా! నీవును సకల సంపత్సమృద్ధమైన యయోధ్యాపురమునకు నాతోడ నేతెంచి, మన వంశాభివృద్ధి గలుగుటకై పట్టాభిషేకము చేసికొనుము. రాజ్యపరిపాలన మైహికఫలదమని చెప్పుదురుగాని, యాముష్మికమగు దైవత్వమునుగూడఁ గల్గించునని నే నెంచెదను. ఏనృపాలుఁడు ధర్మార్థములకు లోపము వాటిల్లకుండునట్లు రాజ్యపరిపాలనము చేయునో, ఆ నృపాలుఁడు దేవత్వము నొందును. కావున నీవు తపస్సుచేతనే దేవత్వముగలుగునని తలంపక రాజ్యము ననుగ్రహింపుము. నేను కేకయపురమున నుండఁగా, సీతాలక్ష్మణసమేతుఁడవై నీ వడవికి వచ్చినతర్వాత, సజ్జనులకుఁ బ్రియుఁడును, జన్నములు సేయువాఁడునైన పూజ్యుఁడగు తండ్రిగారు పుత్రశోకము నోర్వఁజాలక దివమున కేఁగెను. పురుషోత్తమా! లే లెమ్ము. లక్ష్మణసమేతుఁడవై తర్పణాదు లొనరింపుము. ఏనును శత్రుఘ్నుఁడును తర్పణాదులగు నుత్తరక్రియలనెల్లఁ జేసితిమి. రాఘవా! ప్రియుఁడగు పుత్రుఁడుచేసిన తర్పణాదులే పితృదేవతల కెక్కునని పెద్దలు చెప్పుదురు. నీవు తండ్రికిఁ బ్రియుఁడవుగదా, కావునఁ దండ్రికిఁ దర్పణాదు

లగు నుత్తరక్రియలం జేయుము. నీ తండ్రియు నిన్నెడఁబాసి, నీ వియోగదుఃఖమున మునిఁగినవాఁడై, నిన్నుఁ గూర్చియే వగచుచు, నిన్నుఁ జూడఁగోరుచు, నీ యందుఁ దగులుగల బుద్ధిని మఱల్పకయే, నిన్నే తలంచుచు స్వర్గలోకము నొందెను" అని రామునితోఁ జెప్పెను.

## 102-వ స ర్గ ము.

### రాముఁడు తండ్రి కుత్తరక్రియలు సల్పుట

శత్రుపీడాకరుం డయిన రాముఁడు భరతునిద్వారా యుద్ధరంగమున దేవేంద్రునిచేఁ బ్రయోగింపఁబడిన వజ్రాయుధమునుబోలునట్టి మనమున కింపుగాని దిగులు గలిగించు తండ్రిమరణవార్త యనెడి బాణముచే మనమున నాఁటఁబడి, మైమఱచి యిరుగేలును పైకెత్తి, కానన మున గొడ్డటితో నఱుకఁబడిన పూచిన కొనకొమ్మలు గలచెట్టు మాడ్కిఁ బుడమిపైఁ బడెను. అట్లు నేలపైఁబడి, దరులను కొమ్ములతో గోరాడి యలసి గాఢముగ నిద్రించుచున్న యేనుఁగుచందమునఁ దోఁచువాఁడును, దుఃఖముచే మిక్కిలి స్రుక్కినవాఁడును, కడు వగలం బొగులుచున్నవాఁడునైన విలుకాఁడగు రామునిచుట్టు కూర్చుండి తమ్ములందఱు సీతయుఁ గన్నీరు విడుచుచు నారాముని యొడలిపయిఁ జల్లని నీటిని జల్లిరి. ధర్మాత్ముఁడగు రాముఁడు కొంతసేపటికిఁ దెప్పరిల్లి నేత్రములనుండి కన్నీటిని ధారలుగాఁ గార్చుచు జాలిపుట్టునట్లుగా నా భరతుంగూర్చి న్యాయ్యములైన కొన్ని మాటలం జెప్పఁ దొడఁగెను. "ఓ భరతా! తండ్రి మృతినొందిన పిదప, నయోధ్యాపురమున నాకేమి పని యున్నది? నృపాలోత్తముఁడు లేని యయోధ్య నెవ్వఁడు పాలింపఁ గలఁడు? ఏ నృపాలుఁడు నా నిమిత్తమగు శోకముతో మృతినొందెనో; ఏ నృపాలునికి నేను సంస్కారం బొనరింపనైతినో; అమ్మహాత్ముఁడయిన నృపాలునికిఁ జెడు పుత్త్రుఁడైన నేను చేయవలసిన దేమి యున్నది? నిర్దోషుఁడవగు నో భరతుఁడా! నీవును శత్రుఘ్నుండును దండ్రికిఁ జేయవలసిన ప్రేతకృత్యములఁ జేసితిరి గావున మీ జన్మములు పావనములయ్యెను. నృపాలుఁడు మృతినొందుటచే నాథుఁడు లేనిదై, యల్లకల్లోలమైయుండు నయోధ్యకు వనవాసము ముగించిన పిదపఁ గూడఁ బోవ మనము లేదు. తండ్రి లోకాంతరమున కేఁగెఁ గాన వనవాసము

ముగించి యయోధ్యకు వచ్చినపిదప నా కెవ్వఁడు సదుపదేశము సేయఁ
గలఁడు? మంచి నడతగల నన్ను బుజ్జగింపుచు నాతండ్రి నాకేదేది
బోధించుచుండెనో, నా చెవులకింపుగా నుండెడి అట్టి మాటలు నా కిఁక
నెవ్వఁడు చెప్పఁగలఁడు? అట్టి మాటలు నెవరివలన వినఁగలను?" అని
భరతునితోఁ జెప్పి, దుఃఖపీడితుఁ డయి పున్నమచందురునిఁబోలు
మోముగల సీతను, లక్ష్మణునిఁజూచి, "ఓసీతా! నీ మామ మృతుండయ్యె.
లక్ష్మణా! నీవు తండ్రిలేనివాఁడ వయితివి. నృపాలుఁడు స్వర్గమున కేఁగె
నని భరతుఁడు వ్యసనవృత్తాంతముఁ జెప్పెను." అని యిట్లు కాకుత్స్థుఁడు
పలుకఁగా, కీర్తిమంతులగు తమ్ములందఱు గన్నీరు మున్నీరయి పార రోద
నము చేసిరి. తమ్ము లందఱు నన్ననూరార్చి జాలించి, నిట్టూర్పువిడిచి,
తండ్రికిఁ దర్పణము చేయుమని రామునికిఁ జెప్పిరి. ఆ సీతయు మామ
గారు స్వర్గమున కేఁగె నన్న వృత్తాంతము విని కన్నులనిండఁ గన్నీరుంచు
కొని, భర్తను జూడఁ జాలకుండెను. రాముఁడును వగచుచుండు సీతా
దేవి నూఱడించి, దుఃఖితుఁడై వ్యసనపడుచున్న లక్ష్మణునిఁ జూచి,
"లక్ష్మణా! మహాత్ముఁడయినతండ్రికి నుదకదానము చేయఁబోవుచున్నాను.
నీవు గారపిండిని, ఉత్తరీయమును దెమ్ము. సీత ముందు నడుచును. నీవు
దానివెంబడిఁ బొమ్ము. నేను మీ వెనుక వచ్చెదను. ఈ దారి మిక్కిలి
భయంకరమయినది." అని చెప్పెను. అంతట వారి నెల్లప్పు డనుసరించు
వాఁడు, తెలివికలవాఁడు, బుద్ధిమంతుఁడు, మెత్తనివాఁడు, దాంతుఁడు,
శాంతుఁడు, రామునియెడ దృఢభక్తి గలవాఁడు నగు సుమంత్రుఁడు
రాజపుత్రు లందఱితోనుగూడి, రాముని జేయిపట్టుకొని వచ్చి, పవిత్ర
మైన మందాకినీ నదిరేవున దింపెను. కీర్తిమంతులగు రాజపుత్రులందఱు
మంచి రేవులు గలదియు, రెండు గట్టులందు పుష్పఫల భరితములగు
చెట్లచేఁ బ్రకాశించునదియు, మనోహరమైనదియు, వడిగాఁ బ్రవహించు
నదియు నగు మందాకినీ నదియుం దడుసు లేని తేటనీటితోఁగూడిన
యొక రేవునందు దిగి, "ఇది నీకొఱకగును గాక" అనుచు నృపాలునికిఁ
దిలతర్పణ మొనర్చిరి. అపుడు నృపాలుఁడగు రాముఁడు జలాంజలి
నిండఁ బట్టుకొని, దక్షిణదిశ కభిముఖుఁడై, "ఓ రాజశ్రేష్ఠుఁడా! పితృ
లోకము నొందిన నీ కిదిగో నిర్మలజలము నొసఁగుచున్నాను.నాచే నొసఁగఁ

బడిన యీ తర్పణాంజలి నిన్నుఁ బొందునుగాక" అని చెప్పుచుఁ జల
తర్పణ మొనర్చి, యామందాకినీ నదీతీరముఁ జేరి యచ్చటఁ దమ్ము
లతోఁగూడి తండ్రికి సపిండీకరణ మొనర్చెను. రాముఁడు గారపిండిని
రేగుపండ్లరసముతోఁ జేర్చి పిసికి, పిండములుసేసి, దర్భాసనమున నునిచి,
మిగుల వగలపాలై, "మహారాజా! మేము దినుచుండునాహారమునే
నీకర్పించితిమి. దీనిని ప్రీతితో భుజింపుము. పురుషుఁడు తాను దిను
నన్నమునే తాను కొలుచు దేవతలకు నర్పించును." అనుచుఁ దండ్రికిఁ
బిండప్రదానముసేసి, యుత్తరక్రియలను బూర్తిచేసినవాఁడై, యా
మందాకినీనది గట్టుననే పోయి, రమ్యములైన చఱులచే నొప్పుచుండు
పర్వతమునెక్కి తన యాకుటింటి వాకిటికిఁజని భరతలక్ష్మణులను గట్టిగాఁ
గౌఁగిలించెను. అంత నన్నదమ్ములు సీతతోఁగూడి గొంతెత్తి గొల్లున
నేడ్చిరి. సింహగర్జనములకువలె వారి రోదనధ్వనులకు నా పర్వతమునఁ
బ్రతిధ్వనులు పుట్టెను. తండ్రికిఁ దర్పణముచేసివచ్చి రోదనము చేయు
చున్న యీ బలిష్ఠులగు రామాదులయొక్క యల్లకల్లోలమైన యారోదన
ధ్వనిని విని భరతుని సేనలు భయపడి, "ఓహో! భరతుఁడు రామునితోఁ
గలిసికొనెను. తండ్రియొక్క మరణమునుగూర్చి దుఃఖపడుచున్నవారి
ధ్వనులే యీ వినఁబడుచున్నవి." అని తమలోఁదా మనుకొనుచుఁ దమ
యిక్కలువిడిచి యాధ్వని వినవచ్చినవైపునకుఁ గడువేగిరముగా నడువ
నలవికాని దారిలో సుకుమారులు కొందఱు తేఁగులమీఁదను, మఱి
కొందఱు గుఱ్ఱములమీఁదను, వేఱుకొందఱు చక్కఁగాఁ గైసేయఁబడిన
రథములందును గూర్చుండిపోయిరి. తక్కినవా రందఱు నడచివెళ్లిరి.
వారు నడచిపోవుచు, కొన్నిదినముల క్రిందటనే యరణ్యమునకు నేఁగి
రాముని బహుకాలమునకు ముం దరణ్యమున కేఁగినవానినివలెఁ జూడఁ
గోరినవారయి యందఱును వేగముగా నాశ్రమమునకుఁ జనిరి. వారం
దఱు నొండొరులను గలసికొనిన యీ యన్నదమ్ములను జూడఁ మిగులఁ
గుతూహలపడినవారయి గిట్టలయు, రథచక్రములయు ధ్వనులుగల
నానావిధములగు వాహనముల నెక్కి యడవులకుఁ దఱలిరి. ఆ పర్వత
ప్రాంతమునఁ బోవుచున్న యీ యనేక గజాశ్వముల గిట్టలచేతను,
చక్రములచేతను నలుగుచున్న నేలయందుఁ బుట్టినధ్వని వర్షర్తువు నాఁటి

యాకసమునందలి ధ్వనిని బోలియుండెను. ఆ ధ్వనులను విని యాపర్వతమున నున్న యేనుఁగులు భయపడి ఆఁడేనుఁగులతోఁ గూడినవై, తమ మదగంధముచే నావనమును బరిమళింపఁజేయుచు మఱియొక వనమున కేఁగినవి. వరాహములు, తోడేళ్లు, దున్నపోతులు, పాములు, కోఁతులు, గురుపోతులు, పులులు, జింకలు మొదలగు మృగములన్నియు మిగుల నులికిపడినవి. జక్కవలు, నీరుకోళ్లు, రాయంచలు, బెగ్గురుపక్షులు, కొంగలు, మగకోయిలలు, క్రౌంచములు మొదలగు జలపక్షులన్నియు నదరిపడి యొడలుమఱచి దిక్కులకుఁ బాఱినవి. ఆకసమా గందరగోళముచే మిక్కిలి యదరిన పక్షులతోనిండి వెలుఁగుచుండెను. భూమియు మనుష్యులతోనిండి విరాజిల్లుచుండెను. అంత నా భరతుని వెంబడి వచ్చినవారందఱు నొండొరులఁ గడచి పడుచు లేచుచు వచ్చి యాకుటీరంబు నేలపైఁ గూర్చుండియున్నవాఁడును, కీర్తిమంతుఁడును, శత్రుసంహారియు, పురుషశ్రేష్ఠుఁడునైన రాముని జూచి, పాపిష్ఠురాలగు కైకేయిని, మంథరను దూరుచుఁ గన్నీరుగార్చుచు నంగలార్చిరి. అంతట ధర్మజ్ఞుఁడయిన రాముఁడట్లు కన్నీరుగార్చుచు నంగలార్చుచున్న యాజనము నవలోకించి, కౌఁగిలించెను. కొందఱు రామునికి మ్రొక్కిరి. అప్పుడు నరపాలసూనుఁడు చెలికాండ్రను, బంధుగులను వారివారి వయోగుణములకుఁ దగినట్లు గౌరవించెను. అయ్యాశ్రమము చేరువ నమ్మహాత్ములగు రామాదు లొనర్చు రోదనధ్వనులు భూమ్యాకాశములందును, పర్వతగుహలందును మాఱుమ్రోఁత లీనఁజేయుచు భేరీవాద్యములమాడ్కి చెలరేఁగినవి.

## 103-వ సర్గము

### రామునితల్లులు రామునిఁ జూచుట

వసిష్ఠమునీంద్రుఁడు దశరథనరేంద్రుని పత్నులను దోడ్కొని, రామునిఁజూచు మక్కువతో నతఁడుండు ప్రదేశమున కేఁగెను. అట్లు వసిష్ఠమునీంద్రునిచేఁ గొంపోఁబడుచున్న నృపపత్నులందఱు మందాకినీనదిం గూర్చి మెల్లఁగాఁ బోవుచు, రామలక్ష్మణులు మందాకినీ నదిలో దిగుట కేర్పఱచుకొనిన రేవును జూచిరి. అప్పుడు కౌసల్య కన్నీటిచే నిండి బెండుపాఱిన మోముగలదగుచు, సుమిత్రను దక్కంగల

రాజకాంతలను జూచి, హీనస్వరముతో "ఓ మగువలారా! ఇది మున్ను దేశభ్రష్టులుగాఁ జేయఁబడినవారును, పవిత్రచరిత్రులునైన సీతారామ లక్ష్మణులు వనవాసము స్నానార్థమై యేర్పఱచుకొన్న రేవు. ఓ సుమిత్రా! నీ కొడుకు, లక్ష్మణుఁడు నా కొడుకునిమిత్తమయి యేమియు పాటులేక యెల్లప్పు డుదక మిక్కడనుండియె తానే కొంపోవుచుం డును. నీ కుమారుఁ డిట్లు గౌరవహీన మయినపని యొనర్చినను, నతనికి గౌరవము తగ్గదు. అన్నకే శుశ్రూష యొనర్చినను, నది యంతయు సర్వోత్తమమైనది. ఇప్పుడయినను నీ కొమరుఁ డిట్టి యిడుములకుఁ దగిన వాఁడు కాఁడు. కావున ఇప్పుడు సేయునట్టి నీచపుఁబనులు మాని రాజ్య సుఖము వొందునుగాక" యని చెప్పుచు, నావలివైపున దక్షిణపుఁ గొనలు గలుగునట్లు పఱచిన దర్భలం దుంచబడియున్న గారపిండి పిండ ములను జూచి, కడువగచి, తనతోఁ గూడనున్న దశరథపత్నుల నంద ఱం దిలకించి, "యిక్ష్వాకురాజులకుఁ బ్రభువును, రఘువంశోద్భవుఁడును, మహాత్ముఁడునైన రాముఁడు తండ్రికి యథావిధిగ నిడిన పిండములు చూడుఁడు. సకలభోగముల ననుభవించినవాఁడును, దివ్యరూపము దాల్చినవాఁడును, మహాత్ముఁడునగు పార్థివునకు నీ గారపిండి పిండములు తగినవి కావు. నాలుగుసముద్రములచేఁ జుట్టఁబడిన భూమండలము నేలినవాఁడైన దేవేంద్రునిఁ బోలెడు దశరథ భూమిపాలుఁ డీ గారపిండి పిండముల నెట్లు దినఁగలఁడు? సకల సంపదలతో నొప్పినవాఁడయ్యు రాముఁ డిప్పుడు తండ్రికి గారపిండి పిండములను బెట్టుచున్నాఁడు. ఇంతకంటె మించినదుఃఖము లోకమున నింకొక్కటియుండఁబోదు. రాముఁడు తండ్రి కొసఁగిన గారపిండిపిండములను జూచినతరువాతను గూడ నీ దుఃఖముచే నా హృదయము బ్రద్దలు కాకయున్నదేల! "మానవుఁ డే యాహారమును దినునో, వాని దేవతలు నదే యాహార మును గల్గియుందురు" అని లోకప్రసిద్ధమైన శ్రుతి యిప్పుడు నాకుఁ సత్యముగఁ దోఁచుచున్నది" అని చెప్పెను. అప్పుడా నొచ్చియున్న కౌసల్యను సవతు లందఱు ఊరడించి, స్వర్గలోకమునుండి క్రిందికిఁ బడిన వానివలె నాశ్రమమున వెలుఁగుచున్నట్టివాఁడును, సకల భోగములను విడిచినవాఁడునునైన రామునిఁ జూచి దుఃఖించి పేరెలుఁగుతో

నేడ్చుచుఁ గన్నీరు విడిచిరి. అంతటఁ బ్రతిజ్ఞతప్పనివాఁడును, బురుష శ్రేష్ఠుఁడునునైన రాముఁడు దర్భాసనమునుండి లేచి నిలిచి యీ తల్లు లందఱియొక్క మంగళకరములగు పాదములకు నమస్కరించెను. విశాలనేత్రలగు కౌసల్య మున్నగు దశరథ రాజపత్నులందఱు మెత్తని వ్రేళ్లతోఁగూడి సుఖస్పర్శముగలవైన తమ హస్తములతో నా రాముని వీఁపుమీఁది దుమ్ముఁ దుడిచివైచిరి. లక్ష్మణుఁడును తల్లుల నవలోకించి దుఃఖితుఁడై, రామునివెంబడి దానును మెల్లగా వారి కందఱికి మ్రొక్కెను. దశరథతనయుఁడును శుభలక్షణోపేతుఁడునైన లక్ష్మణుని యందును రామునియందువలెనే కౌసల్య మున్నగు వారందఱు ప్రేమను గనఁబఱచిరి. సీతయుఁ దన యత్తల పాదముల కెఱఁగి, వగలం బొగులుచుఁ గన్నులనిండఁ గన్నీరు నించికొని, వారియెదుట నిలఁబడియుండెను. కౌసల్య, యడవియం దుండుటచేఁ గృశించినదియు, దిటవులేనిదియు, వంతలపాలయినదియునైన సీతను దల్లి కూఁతురుంబోలె గట్టిగాఁ గౌఁగిలించికొని, జనకమహారాజుకూఁతురును, దశరథనృపాలుని కోడలును, రామునకుఁ బత్నియునైన యీ సీత యిట్లు జనరహితమగు నడవులం దిడుమలఁ బడవలసివచ్చెఁ గదా యని తలంచి, "ఓ సీతా! ఎండకు వాడిన తామర పూవువలెను, వాడుపాఱిన కలువవలెను, దుమ్ముచేఁ గప్పఁబడిన బంగారమువలెను, మబ్బుచేఁ గ్రమ్మఁబడిన చంద్రబింబమువలెను గాంతి తఱిగియున్న నీ మోమునుజూడ, అరణియందుఁ బుట్టిన యగ్ని దన్నాశ్రయించుదానిం బోలె దుఃఖాగ్ని నా మనమును దహించుచున్నది" అని యాతురతతోఁ జెప్పుచుండఁగా, రాముఁడును కులగురుఁడగు వసిష్ఠమునీంద్రుని పాదము కెఱఁగెను. అప్పు డగ్నిహోత్రుని చందమునఁ దేజరిల్లుచుండువాఁడును, నిండు కాంతిచే వెలుఁగువాఁడును నైన వసిష్ఠమునీంద్రునికి, బృహస్పతికి దేవేంద్రుఁడువోలె రాముఁడు ప్రణమిల్లి, యాతని నుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి, తానును గూర్చుండెను. పదంపడి భరతుఁడును మంత్రి పౌరముఖ్య ధార్మికజన సైనిక సమేతుఁడై రాముని చేరువఁ గూర్చుండి చేతులు జోడించికొని, తాపసవేషముతో నెక్కువ కాంతిం దేజరిల్లుచున్న రాముని దివ్యరూపముఁ జూచి, బ్రహ్మదేవుని యెదుట దేవేంద్రుఁడుంబోలె, నా

రామునియెదుట విరాజిల్లుచుండెను. అప్పుడు జను లందఱును "ఇఁక నీ భరతుఁడు రామునికి నమస్కారముఁ గావించి, సవినయముగ నేమి చెప్పునో" అని మిక్కిలి కుతూహలముతోఁ జూచుచుండిరి. నిక్కమయిన ధైర్యము గలిగినవాఁడగు రాముఁడును, ఎక్కువ మహిమగల లక్ష్మణుఁడును, ధర్మపరుఁడగు భరతుఁడును చెలికాండ్రచేఁ జుట్టఁబడి, యజ్ఞశాల యందు సభ్యులచేఁ జుట్టఁబడిన గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులం బోలె మిక్కిలి ప్రకాశించుచుండిరి.

## 104-వ సర్గము

### భరతుఁడు రాముని రాజ్యము గైకొనఁ బ్రార్థించుట

మహాత్ముఁడును, కకుత్థ్సవంశోద్భవుఁడునైన రాముఁడు లక్ష్మణ సమేతుఁడై, గురువాత్సల్యముగలవాఁడయిన తమ్మునిఁ దిన్నని పలుకులచే నూఱడించి, "నీవు జడలను వల్కలాజినములను దాల్చినవాఁడవయి, రాజ్యము విడిచి యిచ్చటికేల యేతెంచితివి? కారణము దెలిపితివేని వినఁగోరుచున్నాఁడ" నని చెప్పి గట్టిగఁ గౌఁగిలించి, నిర్బంధింపఁగా, నిడుదచేతులవాఁడగు భరతుఁడు చేతులు జోడించుకొని, యన్నంజూచి "మహాబాహుఁడగు దశరథుఁడు చేయ నలవికాని పనిని జేసి దేవర నడవికిఁ బంపి, పుత్రవియోగదుఃఖము సైరింపఁజాలక స్వర్గమునకేఁగెను. ఓశత్రుతాపనా! నృపాలుఁడు కేవల మొక యాఁడుదియైన నా తల్లికి లోఁబడి, తన కీర్తిని బోఁగొట్టెడి యీ గొప్ప పాపపుం బనిఁ జేసెను. అట్టి పాపాత్మురాలయిన నాతల్లి విధవయై దుఃఖముచేడస్సి, తాను గోరిన రాజ్యసుఖము నొందకయె కడు భయంకరమైన నరకమునఁ బడఁగలదు. దాసుఁడనైన నాపై ననుగ్రహముంచి, యిప్పుడే దేవేంద్రునిఁ బోలెఁ బట్టాభిషిక్తుఁడ వగుము. ఈ పురవాసులగు జను లందఱును, విధవలయిన యీ మన తల్లులును నిన్నుఁ బ్రార్థించుచున్నారు. నీవు వారిపై ననుగ్రహింపుము. శత్రువుల యహంకారమును ఖండించువాఁడా! క్రమమున వచ్చినదియు, నీకుఁ దగినదియునైన యీ రాజ్యమును జ్యేష్ఠక్రమమున నంగీకరించి చెలికాండ్ర మనోరథములఁ దీర్పుము. శరత్కాలమందలి రేయి నిర్మల చంద్రునితోడం బోలె భూమండలమెల్ల భర్తవైన నీతోఁగూడి యనాథ కాకుండునుగాక! నేను నాయీమంత్రులును సాష్టాం

గముగాఁ బ్రణమిల్లి వేఁడుచున్నారము. నేను నీకు సోదరుఁడను; దాసుఁ డను నాపై ననుగ్రహింపుము. ఓ పురుషశ్రేష్ఠుఁడా! వంశపరంపరగా వచ్చినవారును, తాతతండ్రులనాఁటినుండి యుండువారునైన యీ ప్రజలందఱు నేకగ్రీవముగాఁ జెప్పుమాటలను నీ వతిక్రమింపఁ దగదు" అని కన్నీరు విడుచుచు రాముని పాదములను శిరము సోఁకునట్లు మ్రొక్కి గట్టిగాఁ బట్టెను. రాముడును మదపుటేనుఁగుమాడ్కి మాటి మాటికి నిట్టూర్పు విడుచుచున్న తమ్ముని భరతునిఁ గౌగిలించి "ఓ భరతా! గొప్ప వంశమునఁ బుట్టినవాఁడును, సత్త్వగుణములోఁ గూడిన వాఁడును, పరాక్రమశాలియు, వ్రతముల నాచరించినవాఁడునైన నీ వంటి మానవుఁడు రాజ్యము నిమిత్తమై యిట్టి పాపకార్యమును జేయునే? శత్రుసంహారకా! నీయెడ నావగింజంతదోష మైనను గాని పింపదు. మఱియు నీవు మూఢతవలన నీ తల్లిని దూరుట తగదు. మహా ప్రాజ్ఞుఁడవగు వ్యసనరహితుఁడా! తల్లిదండ్రులు మొదలగు పెద్దలు శిష్యులు, దాసులు మొదలగువారలకును, భార్యలకును బుత్త్రులకును దమ యిచ్చకువచ్చిన యానతులను జేయఁగలరు. ఓ నాయనా! సాధువులు తమభార్యలను, పుత్త్రులను, శిష్యులను నెట్టివారిఁగఁ దలఁ తురో, అట్లె మన తండ్రియు మనల తలఁచు నని నీవు తెలిసి కొనుము. దశరథమహీపాలుఁడు నాకు నారబట్ట నుత్తరీయముగను, కృష్ణాజినము గట్టుబట్టగను నొసఁగి యడవికిఁబంపుటకైనను, రాజ్యము నొసఁగుటకైనను అధికారముగలవాఁడు. ధర్మవంతులలో శ్రేష్ఠుఁడా! తండ్రియెడ నందఱు మెచ్చునట్టి గౌరవ మెంతయో, తల్లియందు నంత గౌరవము నుండవలయును. ధర్మశీలురైన తల్లిదండ్రులు "వనము నకుఁ బొమ్మని యానతిచ్చియుండ, నే నెట్లు వేఱువిధముగాఁ బ్రవ ర్తింతును. నీ వయోధ్యకు నేలికవై సకల జనులును గొనియాడునట్లు రాజ్యపరిపాలనము సేయవలయు. నేను నారబట్టలను గట్టుకొని యరణ్య వాసము సేయవలయు అని జను లందఱి యెదుటను తండ్రి విభాగ మేర్పఱచి యానతిచ్చి స్వర్గమునకుఁ బోయెను. లోకములకెల్ల గురు వును, ధర్మశీలుఁడును నగు దశరథనృపాలుఁడు నీకును బ్రమాణము గావున, నీవును దండ్రి పంచియిచ్చిన రాజ్యము ననుభవింపఁ దగు

దువు. నేనును బదునాలుగేండ్లు దండకారణ్యమునందే మహాను
భావుఁడగు తండ్రి యొసఁగిన భాగమగు వనవాసము ననుభవించెదను"
అని భరతునితోఁ జెప్పెను.

## 105-వ సర్గము.

రాముఁడు భరతుని మాటలకు బదులు సెప్పుట

పురుషశ్రేష్ఠులగు రాజపుత్రులు నల్వురు సుహృద్గణముతోఁ
గూడినవారలై, యిట్లు విలపించుచుండ నా రేయి యెట్టకేలకుఁ గడ
చెను. మఱునాఁటి వేకువ లేచి యా యన్న దమ్ములును, వారి చెలికాం
డ్రును మందాకినీనదికిఁ బోయి స్నానము, సంధ్య, ఔపాసనము మొద
లగు ప్రాతరనుష్ఠానముల నెల్ల నిర్వర్తించి, రామునికడ కేఁగుదెంచిరి.
అప్పుడు వారందఱు మౌనముతోఁ గూర్చుండిరి కాని, యొక్కరు నే
మాటను బలుకరైరి. భరతుఁడు మాత్రము చెలికాండ్రందఱు విను
చుండ నిట్లుపలికెను. "నృపాలా! మాతల్లికి సమాధానపడినది. నాకు
రాజ్య మీఁబడినది. నాకు రాజ్యమొసఁగితివి. నే నా రాజ్యమును నీకే
యొసఁగెదను. శత్రుబాధలేని యీ రాజ్యమును నీ వనుభవింపుము.
వర్షాకాలమున గొప్ప నీటి ప్రవాహమునకుఁ దెగిన కట్టను గట్టుట యేరి
కిని సాధ్యముగాదుగదా! అట్లే యీ విస్తారమయిన రాజ్యభాగముఁ
బాలింప నీవు దప్ప నెవఁడు చాలును? ఈ రాజ్యము నావంటివాని
కలవియగునది కాదు. ఓ పుడమిఱేఁడా! ఖరమునకు గుఱ్ఱమువేగ మబ్బ
నట్లును, సామాన్యమగు పక్షికి గరుత్మంతునివేగ మబ్బనట్లును, నీ నడ
తను బొందుటకు నాకు సామర్థ్యముచాలదు. జీవనార్థమై యొరులచే నెవఁ
డాశ్రయింపఁబడునో, వాని బ్రతుకు మంచి బ్రతుకు. ఎవఁడు సదాయొరుల
నాశ్రయించి జీవించుచుండునో, వాని బ్రదుకు కడు నధమమైనది. ఒకా
నొక పురుషుఁ డొక్క చెట్టును నాఁటి నీరుపోసి పెంచఁగా, అది
మఱుచవాని కెక్కుటకు వీలుగాక, యెదిఁగిన బోదెగలిగి గొప్ప
వృక్షమయి, సకాలమునఁ బుష్పించి, ఫలముల నొసఁగకుండునేని, యా
వృక్షమును నాఁటినవాఁ డేయుద్దేశముతో నాఁటెనో యా యుద్దే
శము నొందఁడుగదా. నిడివిచేతులవాఁడా! నీవు గొప్పవాఁడవు,
పోషింపఁగలవాఁడవు నయ్యు, మమ్ముఁ బాలింపవేని, యీ దృష్టాం

టము ప్రకృతవిషయమునకుఁ దగియుండును. ఓ నరశ్రేష్ఠా! దాని యర్థమును నీ వెఱుఁగఁగలవు. దశరథనృపాలుఁడు నీవలన గొప్ప సౌఖ్యముఁ బడయఁగోరి నిన్నింతవాని నంతవానిని జేసెను. ఇప్పుడు నీవు పోషింపఁ జాలినవాఁడవయ్యు మమ్ముఁ బోషింపఁదగినవారిని బోషింపవేని, దశరథ నృపాలుని పాటు ఆచెట్టు నాఁటినవాని పాటువలె విఫలమయిపోవును గదా! మహారాజా! శత్రుసంహారివైన నీవు సింహాసనమునఁ గూర్చుండి సూర్యునివలెఁ దేజరిల్లుచుండఁగా, పురజను లందఱు నిన్నుఁ దనివి తీఱఁ జూచుచుందురుగాక! ఓ కకుత్థ్సవంశోద్భవుఁడా! మదపు టేనుఁగులు నిన్ను వెంబడించినవై ఘీంకారము లొనరించును గాక! అంతిపురపు టతివలందఱు మిక్కిలి నెమ్మదిగలిగి సంతసపడు దురుగాక!" అని రామునితోఁ జెప్పెను. అట్లు రామునిఁ బ్రార్థించు చుండు భరతుని పలుకులు విని, యయోధ్యాపురమునుండి వచ్చిన నానాజాతుల జనులును "నీ వచనము బాగుగ నున్నది" యని తల యూఁచిరి. ఇత్తెఱఁగున వంతతోఁగూడి పలవించుచున్న కీర్తిమంతుఁ డయిన భరతునిఁ జూచి, మనస్సును జయించినవాఁడును, ధైర్యశాలియునగు రాముఁ డూఱడించుచు, "ఓ భరతా! మనుజునకు స్వాతంత్ర్యమునునది లేదు. ఈ పురుషుఁ డేదియుఁ దనంతటఁ దాను జేయఁ జాలఁడు. దైవమే పురుషుని నిక్కడి కక్కడికి నీడ్చుచుండును గావునఁ బురుషుఁ డతఁ డీడ్చినతట్టునకుఁ బోవుచుండును. "సంపదలెల్ల నాశమే ముగింపుగాఁగలవి. పెరుగుటలు పడుటలతో ముగియును, కలియఁబాటు లెడఁబాటులకే యగును. పుట్టుట గిట్టుటకొఱకే యగును. చెట్టునందుఁ బండిన పండెట్లు పడకతీఱదో, యట్లె పుడమినిఁ బుట్టిన మానవుఁడు మరణమునొందక తప్పదు. కావున మానవుఁడు మరణభీతి నొందుట యవివేకము. గట్టిగుంజలుగల యిల్లు, ప్రాఁతగిలి కూలుచందము నరులును దిటవుగలవారుగ నున్నను జరామరణములకు లోఁబడినవారలై నాశ మొందుదురు. కడచినరాత్రి మఱల రాదుగదా! నిండు ప్రవాహముతోఁ బ్రవహించు యమున జలపూర్ణమయిన సముద్రమునఁ జేరుచున్నదే కాని యచ్చటినుండి మఱలదు. భూలోకమున పగళ్లు రాత్రు లొక్కటి వెంబడి నొక్కటిగఁ బోవుచున్నవి. అయ్యవి ప్రాణు లందఱి యాయుస్సు

లను, మండు వేసవిని సూర్యకిరణము లుదకమునుబోలె నానాటఁ దఱుగఁజేయుచున్నవి. నీవు నిలుచున్నను, నడచుచున్నను, ఆయుస్సు క్షీణించుచుండఁగా, నిన్నుఁగూర్చి నీవు దుఃఖపడక యొరులంగూర్చి కుందుచున్నాఁడ వేల? పోవునట్టి మనుజునంటి మృత్యువు పోవుచుండును. కూర్చుండు మనుజుని వెంబడే యది కూర్చుండియుండును. కడుదవ్వు నడచివచ్చినను మృత్యువు కూడనే వచ్చుచుండును. కావున మన మెచ్చటికిఁ బోయినను మృత్యువునుండి తప్పించుకొనఁజాలము. అవయవములందు ముడుతలు పడుచున్నవి. తలవెండ్రుకలును నెఱయుచున్నవి. ముదుసలితనముచేఁ బురుషుఁడు శిథిలుఁ డగుచున్నాఁడు. వీని నే యుపాయముచేఁ దప్పించుకొనఁగలఁడు? కావున ప్రాయమున నున్నప్పుడే పరబ్రహ్మవిచారణను, వ్రతోపవాసాదికర్మలను జేయవలయును. మనుజులు సూర్యుఁ డుదయమొందఁగానే, ద్రవ్యసంపాదనాదికార్యములు జరుగఁగలవు గదా యని తనివి నొందెదరు; సూర్యుఁ డస్తమించునప్పుడు నిద్రాకామసుఖము లనుభవింపవచ్చును గదా యని యానంద మొందుదురు. కాని, యహోరాత్రములు గడచుటచేఁ దమ యాయుస్సు క్రమముగ క్షయించుచున్నదని యెఱుఁగఁజాలరు. ఋతుప్రారంభములనుజూచి క్రొత్త క్రొత్త ఋతువు వచ్చెఁగదా యని జను లానందింతురుగాని; ఋతువుల వెంబడి ఋతువులు వచ్చుచుండుటచేఁ దమయాయువు క్షీణించె నని యెఱుఁగరు. ఒక నదీప్రవాహమునందు నొక కఱ్ఱ యొకవైపునుండియు, మఱియొక్కటి మఱొక్కవైపునుండియు వచ్చి కొంతకాలము చేరియుండి, పిదప నెట్లు వేఱగుచున్నవో, అట్లే భార్యలు, పుత్రులు, దాయాదులు, ధనమును. ఎప్పటికైనను భార్యాపుత్రాదులు విడిచి పోవుట నిశ్చయము. ఇహలోకమున మానవుఁడు తన యిచ్ఛానుసారముగా నడచుకొనఁజాలఁడు గావున మానవుఁడు మృతునింగూర్చి వంతల నొందుటచే నుపయోగ మేమియు లేదు. వాని నేమో మత్యువు బ్రతికింపఁబోవునది లేదు. దారినిబోవుచున్న బాటసారులంజూచి యా దారి నున్నవాఁ డొక్కరుఁడు "నేనును మీ వెంబడి వచ్చెదను" అని వారిని వెంబడించిపోవునట్లు మనమును తొల్లింటి పెద్దలైన తాత ముత్తాతలచే ననుసరింపఁబడిన మార్గమున పోవలయును. తిరుగుపాటులేని యా

పూర్వీకులమార్గము నందిన నేల వ్యసనపడవలెను? పాఱుచుండెడి ప్రవాహమువలెఁ బ్రాయము గడచిపోవుచుండుఁ గావున నాత్మకు సుఖకరమయిన దానాదిసత్క్రియలు చేయుచుండవలెను. వారే మానవు లనఁబడుదురుగాని, పరలోకహేతు వగు ధర్మకార్యములం జేయని వారు మృగప్రాయు లనఁబడుదురు. ధర్మాత్ముఁడగు మన తండ్రియగు దశరథనృపాలుఁడు మంగళకరములైన యనేకములగు జన్నములు చేసి, విశేషదక్షిణ లొసఁగి, యా పుణ్యమహిమచే స్వర్గలోకము నొందెను. మనతండ్రి లెస్సగాఁ దనభృత్యులను బోషించుటచేతను, ప్రజలను బాలించుటచేతను, బీదలకు విశేషముగా దానము లొసఁగుటచేతను, సకలశుభకర్మ లాచరించుటచేతను, విస్తారములైన దక్షిణలతోఁ గూడిన జన్నములు సేయుచుండుటచేతను దేవతా, పితృ, ద్విజులం దనివినొందించి, పెద్దకాలము రాజ్యము పాలించి, దీర్ఘాయువుంబడసి, యెంతయో కాలము సౌఖ్యము లనుభవించి మృతినొందెను. ఆ మనతండ్రి శిథిలమయిన మానవదేహము విడిచి, స్వర్గలోకమున దివ్యభోగము లనుభవించుచున్నాఁడు. నీవు సకలశాస్త్రముల నెఱిఁగినవాఁడవు, బుద్ధిమంతులలోపల శ్రేష్ఠుఁడవునై యెట్టి సుగుణసంపద గలిగియున్నాఁడవో, అట్టి నీవోటి ప్రాజ్ఞుఁ డతనిం గూర్చి యిత్తెఱఁగున వ్యసనము నొందఁదగదు. ఈయేడ్పు, కన్నీరువిడుచుట మొదలగు నానావిధములగు వ్యసనములను ధీరుఁడైన బుద్ధిమంతుఁ డగు మానవుఁడు సర్వకాలసర్వావస్థలందును విడువవలయును. మాటకాండ్రలో శ్రేష్ఠుఁడా! నీవు నెమ్మదిపడుము. వంత మానుము. నీవు మఱలి, పురమునకేగి రాజ్యము నేలుము. స్వతంత్రుఁడయిన తండ్రి యట్లె నీ కానతిచ్చెను. ఆయన యానతి మీఱుట తగదు. పుణ్యస్వభావుఁడగు పూజ్యుఁడయిన తండ్రి నన్నేమి చేయుమని యానతిచ్చెనో, దానిని నే నిచ్చటనుండి యాచరించెదను. శత్రుసంహారీ, నే నాతండ్రి యానతి మీఱుట న్యాయ్యము గాదు. నా కెట్లో నీకు నట్లతనిమాట త్రోయఁదగినదిగాదు. ఆతఁడు మన కందఱికి హితబంధువు; రఘువంశోద్భవా, ధర్మము నడపువాఁడగు తండ్రియొక్క యిష్టమగు వనవాసరూపమయిన యాజ్ఞను నేను శిరసావహించి వనమునసుండి పదునాలుగేండ్లు గడపెదను. పురుష

శ్రేష్ఠుఁడా! పరలోకము నొందఁగోరు మానవుఁడు స్వధర్మమును దప్పక యాచరించువాఁడును, దయాళువును, పెద్దలమాట చొప్పున నడుచు కొనువాఁడునునై యుండవలయును. పురుషశ్రేష్ఠుఁడా! మనతండ్రియగు దశరథనరేంద్రుని సదాచారముఁ బరికించి, నీ వాతని యానతిచొప్పున రాజ్యముఁ బాలింపుము" అని మహాత్ముఁడును సమర్థుఁడునైన రాముఁ డివ్విధమునఁ దండ్రియానతిప్రకారము నడచుకొమ్మని తన తమ్మునితో నర్థవంతము లగు కొన్ని మాటలు పలికి యూరకుండెను,

## 106-వ సర్గము

### భరతుఁడు రాము నయోధ్యకు రమ్మని వేఁడుట

అంత మందాకినీతీరమున రాముఁ డర్థగౌరవము గల కొన్ని మాటలు పలికి చాలింపఁగా, ధర్మపరాయణుఁ డయిన భరతుఁడు భక్తజనవత్సలుఁ డయిన రామునింగూర్చి ధర్మము ననుసరించిన యొక్క మాట యిట్లు పలికెను.—"ఓ శత్రుసంహారీ! నీయట్టివాఁ డీ లోకమున నెవ్వఁ డున్నాఁడు? నీ కాపద వచ్చినప్పుడు వ్యసనము లేదు; సుఖము వచ్చినప్పుడు సంతసమును లేదు. సుఖదుఃఖములను రెండింటిని సమానముగాఁ జూచుచున్నాఁడవు. పెద్దల కిష్టుఁడవు. నీ కెద్దియైన సందియము గలిగినప్పుడు వారి నడిగి తెలసికొందువు. మృతునియందుఁ బోలెఁ బ్రతికినవానియందును బగసూపకుండుట, లేనివస్తువునందువలె నున్నవస్తువునందును బ్రేమవిడుచుట యను నీ బుద్ధి యెవనికిఁ గుదురునో, వాఁడు మనసున నొక్కింతయైనను వంత నొందఁడు. మానవేంద్రా, నిత్యానిత్యవస్తువివేకము గలవాఁ డెంతటి యాపద వచ్చినను విచారము నొందఁడు. అట్లు నీవు ఆత్మానాత్మవివేకము గలవాఁడవయి విచారము నొందకున్నాఁడవు. ఓరఘువంశోద్భవా! నీవు దేవతలతో సమానమయిన బలముగలవాఁడవు; ధైర్యవంతుఁడవు; ప్రతిజ్ఞ దప్పనివాఁడవు; సర్వము నెఱిఁగినవాఁడవు; సర్వముఁ జూచువాఁడవు; వివేకివైనవాఁడవు. ఇట్టి సద్గుణములు గలవాఁడవు; ఉత్పత్తిలయముల నెఱింగినవాఁడవు, ఓర్వరాని మహిమగలవాఁడవు నైన నిన్ను దుఃఖము నొప్పింపఁజాలదు. నేను దేశాంతరమున నుండఁగా, నాతల్లి నీచురాలై నాకు రాజ్యము గోరి యే పాపకృత్యముచేసినదో యది నా మన

మునకు సమ్మతముగాదు. కావున నాపైఁ గరుణయుంచి నన్ననుగ్రహిం పుము. నేను ధర్మపాశమునకుఁ గట్టువడియున్నాను. కావున పాపకృత్య మొనరించుటచే దండమునకు నర్హురాలయిన ఆ నాతల్లిని తీవ్రముగ దండించి చంపకున్నాను. సత్కులప్రసూతుఁడును, సత్కార్యపరా యణుఁడునైయున్న దశరథనృపాలునికిఁ బుట్టి, ధర్మమార్గముఁ దెలిసి యుండి, ధర్మవిరుద్ధమైనదియు, లోకులచే నిందితము నైన యీ రాజ్య పరిపాలనరూపకార్యము నెట్లాచరింతు. గురువనియు, యజ్ఞాది సత్కార్య ములు చేసినవాఁడనియు, ముదుసలి యనియు, రాజనియు మృతినొందిన వాఁడనియు, తండ్రియనియు, దైవమనియు నెంచి నే నతనిని సభలో నిందింపను. ఓధర్మజ్ఞుఁడా! ధర్మవేత్తయగువాఁ డెవ్వఁడు స్త్రీకిఁ బ్రియముసేయఁగోరి, ధర్మార్థములకు రెంటికి విరుద్ధమైన యిట్టి పాప కృత్యము సేయనోపును? ముదుసలితనమున జంతువులబుద్ధి మాఱి పోవు నని వేదములు చెప్పుచున్నవి. దశరథుఁ డీలాగు చేసి, యా వేద వాక్యమును నిజముచేసెను. కైకేయి కోపపడుటవలనను, కైకేయిపై మోహమువలనను, సాహసమువలనను తండ్రి ధర్మార్థములకు విరుద్ధ మయిన యిక్కార్యము చేసెను. దీనిని నీవు చక్కఁగా నాలోచించి సవరింపవలయును. ఏ కుమారుఁడు తండ్రియొక్క కార్యమును చెడ్డ దానినైనను మంచిదానినిగాఁ దలఁచునో యా కొమరుఁడు కొమరుఁడు గాఁడు. నీవు తండ్రి యొనర్చిన లోకనింద్యమైన పాపపుఁగార్య మంగీక రించి, నీ వట్టి కొమరుండవు కాకుము. కైకేయి, తండ్రి, నేనును నీ కప కార మొనర్చినవారమైనను, దానిని బరిగణింపక, మమ్మును మిత్ర ములను, బంధువులను, పురములందును, పల్లెలందును నుండు జనులను, ఈ రాజ్యము నంతయును నీవు కాపాడవలయును. అరణ్య మెచ్చట! రాజధర్మ మెక్కడ! జడ లెక్కడ! రాజ్యపాలన మెక్కడ! నీ విప్పు డిట్టి యశాస్త్రీయమైన కార్యము సేయుట తగదు. క్షత్రియునకు రాజ్యాభి షేకము గదా ప్రథమధర్మము. ఆ పట్టాభిషేకమువలననే కదా జనుల పరిపాలించుటకు శక్యమగును. క్షత్రియుఁ డెవ్వఁడు దానభోగములచేఁ బ్రత్యక్షఫలదమయిన రాజ్యపరిపాలనరూపధర్మమును విడిచి, సందిగ్ధ మును, గుఱుతులేని దౌటచే నిశ్చితము గానిదియు, నుత్తర

కాలమునఁ బుణ్యము నొసఁగునదియు నైన మునిధర్మము నాచరించుచును? అట్లు కాక, నీవు కష్టపడి ధర్మార్జనము సేయవలె నని కోరుదువేని, నాలుగువర్ణములను న్యాయమార్గమునఁ బాలించుచుఁ గష్టఫలము నొందుము. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసము లనెడు నాలు గాశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠమని ధర్మవేత్త లయిన పెద్దలు వక్కాణింతురు. ఓ ధర్మజ్ఞుఁడా! నీ వట్టి గృహస్థధర్మము విడువఁ బూనుట పాడియగునా? నేను నీకంటె వయసునఁ జిన్నవాఁడను; శాస్త్రజ్ఞానమునను, స్థానమునను జిన్నవాఁడను. అట్టి నేను, నీ వుండఁగా నెట్లు భూమండలమును నేలఁగలను? నేను బాలుఁడనుమాత్రమె కాక, బుద్ధియందును, గుణములందును దక్కువవాఁడను. హీనస్థితియం దుండువాఁడను. ఇట్టి నేను నిన్నువిడిచి యొక్కనిమిషమైన మనఁజాలను. నే నెట్లింత విస్తారమైన భూమండలము నేలఁగలను? ఓ ధర్మజ్ఞుఁడా! నీవు సకలధర్మముల నెఱిఁగినవాఁడవు గావున, న్యాయాన్యాయములఁ బరిశీలించి, స్వధర్మము పూని, బంధుసమేతుఁడవై నిష్కంటకమైన యీ రాజ్యమును మెలఁకువతోఁగూడి పాలింపుము. ఇచ్చటనే మంత్రులును, వసిష్ఠుఁడును, మంత్రివేత్తలగు ఋత్విజులును గూడి శాస్త్రవత్తుగా నీకుఁ బట్టాభిషేకం బొనరింతురు. లోకముల జయించి యనంతరము, వేల్పులచే నభిషిక్తుఁడయిన దేవేంద్రునిఁబోలె నీవును మాచేఁ బట్టాభిషిక్తుఁడవై, వెలుఁగుచు నయోధ్యకేతెంచి రాజ్యముఁ బాలింపుము. అయోధ్యఁ జేరి, దేవ, ఋషి, పితృఋణములను దీర్చుకొనుచు, దుష్టులను లెస్సగా దండించుచు, సాధువులను సర్వకామము లొసఁగి తనివి నొందింపుచు, నీవె నన్నుఁ బాలింపుము. ఓ పూజ్యుఁడా! నీ పట్టాభిషేకముచే నిప్పుడే నీ చెలికాండ్రందఱు సంతసిల్లుదురుగాక. ఇప్పుడే నీ శత్రువులందఱు వెఱచి మూలమూలకుఁ బరుగిడుదురుగాక. పురుషోత్తమా! నామీఁదను, నాతల్లి మీఁద నున్న కోపమును మాని, ఇప్పుడే పూజ్యుఁడయిన తండ్రికిఁగూడఁ బాపము కలుగకుండునట్లు కాపాడుము. నేను నీ పాదములపైఁబడి మ్రొక్కెదను. నాయందు దయయుంచుము. మహేశ్వరుఁడు సర్వభూతములందు దయ గనఁబఱచులాగున, బంధువు లందఱియందును గరుణఁ జూపుము. నీవు నామాట

వినక, యడవికే పయనమైతివేని, నేనును నీవెంబడి వత్తును" అని భరతుఁడు రాముని బలుతెఱఁగులఁ బ్రార్థించెను.

ఇట్లు భరతుఁడు మనమునఁ దల్లడిల్లుచు ననేకవిధముల వేఁడికొనుచు పాదములకు సాగిలఁబడి మ్రొక్కుచున్నను, రాముఁడు ధైర్యవంతుఁ డగుటంజేసి, తండ్రియొక్క మాటను నడపుటయందే మనము గలవాఁ డగుటచే నయోధ్యాపురమునకు మఱలిపోవ మనమునఁ దలంపఁడాయెను. అప్పుడు జనులందఱు రామునియందలి యద్భుతమైన ధైర్యమునుజూచి, "భరతుఁ డెన్నివిధముల బతిమాలినను, రాముఁ డయోధ్యకు రాఁదలఁపకున్నాఁడుగా" యని పగచిరి. "భరతుఁ డెన్నితెఱఁగులఁ బ్రార్థించినను, రాముఁడు దనప్రతిజ్ఞ విడువకున్నాఁడుగదా" యని సంతసమునొందిరి. అప్పుడు ఋత్విజులును, పట్టణగ్రామవాసులగు పెద్దలును, కౌసల్యాదులును స్మృతిఁదప్పి, కన్నీళ్ళచే మాటలు తడఁబడుచుండఁగా, భరతునిమాటలను విని "యాతఁడు సెప్పినది బాగుగానున్న"దని తలయూఁచిరి. వారును భరతునితోఁగూడ రామునికిమ్రొక్కి యయోధ్యకు రమ్మని రాముని బ్రార్థించిరి.

## 107-వ సర్గము.

రాముఁడు భరతు నయోధ్యకుఁ బొమ్మనుట

సిరియు, మర్యాదయుఁ గలవాఁ డగు లక్ష్మణాగ్రజుఁడగు రాముఁడు మఱల నిట్లు పలుకుచున్న భరతునింగూర్చి, బంధువు లందఱి నడుమ "ఓ తమ్ముఁడా! నీ విప్పుడు చెప్పినమాటలు కైకకు దశరథ నరేంద్రునివలన జనించిన నీకుఁ దగియున్నవి. తొల్లి మనతండ్రి తల్లి యగు కైకం బెండ్లాడినప్పుడు నీతాతతో దీనికిఁ బుట్టిన కుమారునికి రాజ్య మిచ్చెద నని వాగ్దానముచేసెను. అంతియగాక తొల్లి దేవాసుర యుద్ధమునందు మన తండ్రి పగతుర బాణములచేఁ గొట్టఁబడి రథమున మూర్ఛిల్లఁగాఁ, గూడనుండిన కైకేయియు నాతనికి వలయు నుపచారములొనర్చెను. అయ్యుపచారములకు దశరథనృపాలుఁడు సంతసమునంది వరములు రెండు గోరుమని నీతల్లి ననఁగా, నామె నీకుఁ బట్టాభిషేకము సేయుటయు, నన్నుఁ బదునాలుగేండ్లడవికిఁబంపుటయు నను రెండువరము లిమ్మని యడిగెను. నృపాలుఁడు నామె యిష్టముచొప్పున రెండువరముల

నొసఁగెను. నేను సాటిలేని పరాక్రమముగలవాఁడనైనను, తండ్రిమాట ప్రకారము నడుచుకొనఁగోరి, సీతాలక్ష్మణులను దోడ్కొని యిచ్చటి కేతెంచితిని. రాజశ్రేష్ఠుఁడా! నీవును వేగ నేగి, పట్టాభిషేకము సేసికొని, తండ్రిమాటను నిజముచేయుఁడు. భరతా! సకలజనరక్షకుఁడయిన రాజును కైకేయీఋణమునుండి విడిపించుము. ధర్మవేత్తయగు తండ్రిని తల్లిని నానందపఱపుము. ఓ నాయనా! తొల్లి కీర్తిమంతుఁడగు గయుఁడను చక్రవర్తి గయయందు పితృదేవతల నుద్దేశించి జన్నముసేయుచు, "కొమరుఁడు తండ్రిని పుత్తనెడి నరకమునుండి పితృదేవతల నుద్ధరించుట చేతను, తండ్రి పేర నిష్టాపూర్తాదులు గావించి పరలోకమున నున్న వారినిఁ గాపాడుటచేతను బుత్త్రుఁడనఁబడును. గుణవంతులును, విశేషశాస్త్ర జ్ఞానముగలవారు నగు బహు పుత్త్రులు గావలయు నని కోరవలయును. వా రందఱు గయకుఁబోయి శ్రాద్ధముసేయకున్నను, వారిలో నొక్కఁ డైనను గయకుఁ బోయి శ్రాద్ధము నొనరించును." అని యొక గాథం జెప్పెను. రాజనందనా! యిట్లొనర్చియె రాజర్షు లందఱు ప్రఖ్యాతిఁ జెందిరి. ఓ సమర్థుఁడవగు నరశ్రేష్ఠా! నీవును దండ్రి మాట ప్రకారము నడచికొని, తండ్రిని నరకమునుండి యుద్ధరింపుము. వీరుఁడ వగు భరతుఁడా! నీ వయోధ్యకుఁ జనుము. శత్రుఘ్నుని వసిష్ఠాది బ్రాహ్మణోత్తముల నందఱను తోడుసేసికొని, న్యాయమున రాజ్యముఁ బాలించుచు జనులను సంతోషపఱపుము. నేనును జాగుసేయక సీతా లక్ష్మణులతోఁగూడ దండకారణ్యముఁ జొచ్చెదను. భరతా! నీవు జనుల కందఱకు రాజవుగమ్ము. నేను వనమృగములకు రాజరాజ నయ్యెదను. నీ విప్పుడు సంతోషముతోఁ బురశ్రేష్ఠమగు నయోధ్యకుఁ బొమ్ము. నేనును మహానందముతో దండకారణ్యములఁ జొచ్చెదను. భరతా! శ్వేతచ్ఛత్రము నీ నెత్తిని నెండ దగులనీయక చల్లనినీడను గలిగించును. నేనును ఈ యడవులం దుండెడి మహావృక్షములయొక్క దట్టమయిననీడను బొంది హాయిగా నుందును. బుద్ధి కుశలత గల శత్రుఘ్నుఁడు నీకు బాసటయైయుండును. నాకు లక్ష్మణుఁడు ననుఁగుచెలి కాఁడై యుండును. భరతా! పుత్రరత్నములమైన మనము నలువురము

ని త్తెఱఁగున నరేంద్రుని ప్రతిన నెఱవేర్చి యతనిమాట దక్కనట్లు చేయుదము. విచారము నొందకుము." అని చెప్పెను.

## 108-వ సర్గము

### జాబాలి రామునితో అహితము పలుకుట

భరతు ని త్తెఱఁగున నూఱడింపుచుండు ధర్మవేత్త యగు రామునిఁ జూచి, జాబాలియను బ్రాహ్మణోత్తముఁడు న్యాయముఁ దప్పిన మాటలఁ జెప్పఁదొడఁగెను: "ఓరఘువంశోద్భవా! నీవు గొప్ప బుద్ధిగలవాఁడవు, ధైర్యశాలివి. ఇట్టి నీవు నీచునివలెఁ బనికిరాని బుద్ధి గలిగియుండుట లెస్సగాదు. దీనిని మానుము. మనుజుఁడు పుట్టినప్పు డొక్కఁడుగఁ బుట్టుచున్నాఁడు; గిట్టునప్పు డొక్కఁడుగ గిట్టుచున్నాఁడు. ఎవని కెవ్వఁడు చుట్టము? ఒకనికి మఱొక్కనివలనఁ గావలసినది యేమియున్నది? కావున రామా! యెవ్వఁడు "ఈమె నా తల్లి" యని, ఈతఁడు నాతండ్రి" యని మోహము గల్గియున్నాఁడో, వాఁడు వెఱ్ఱివానితో సమానుఁ డని యెఱుఁగవలయును. ఒకనికి నొకఁడు లేఁడు. ఒకానొకఁడు పొరుగూరికిఁ బోవుచుఁ జీకటిపడినప్పు డొక్కచోట నిలుచును. మఱునాటి యుదయమున లేచి, మన మిచ్చట నీ రేయి యుంటిమే యని యా తావుపై మోహ ముంపక యచ్చోటుఁబాసి, దారిసాగి పోవుచుండును. ఇట్లే సంసారమునఁ బుట్టుచుఁ గిట్టుచు నుండు ప్రాణికిఁ దల్లిదండ్రులు, ఇండ్లు వాఁకిండ్లు, ధనధాన్యములు విడిదలల వంటివి. అచ్చట నుండువఱకు వారికిని మానవులకు సంబంధమున్నది గాని యావల నేమియు సంబంధము లేదు. కావున వారిని వదలినపిదప వారిప్రీతికై ప్రలాపము లొనర్చుట వ్యర్థము. నరోత్తముఁడా! నీవు పైతృకమయిన రాజ్యమును వదలి ముండ్లపాతరయు, యిడ్డాఱకము నయి మిగులబాధను గల్గించు దుర్గమారణ్యముల నుండవు. పతివ్రతయగు కాంత తనభర్తను బాసియుండునప్పు డొంటిజడ గలదై, తన ప్రియుని రాకకై వేచియుండునట్లు, అయోధ్యయు నీ రాకకై యెదురు చూచుచున్నది. రాజపుత్రా! సకలసంపత్సమృద్ధమయిన యయోధ్యాపురమునకు మఱలి పట్టాభిషేకము చేసికొని, యుత్తమములయిన భోగముల ననుభవించుచు, దేవేంద్రుఁ డమరావతియందు విహరించుచుండ

మున నయోధ్యాపురమున విహరింపుము. నీకు దశరథుఁ డెవ్వఁడు? దశరథునకు నీ వెవ్వఁడవు? దశరథుఁ డొక్కరాజు; నీ వొక్కరాజవు. నీకును నాతనికి నెట్టిసంబంధమును లేదు. కావున నేఁజెప్పినది చేయుము. తండ్రి జంతువునకు బీజమాత్రకారణము. ఋతుస్నాత యగు తల్లి యొక్క శోణితముతోఁ గలిసిన తండ్రియొక్క వీర్యమే మానవుని యుత్పత్తికిఁ గారణమయియున్నది. అంతమాత్రమునకే తండ్రిమాట గొప్పచేయఁదగదు. ఆ దశరథుఁడు పోయి చేరవలసిన స్థలమునకుఁ బోయి చేరెను. అందఱు ప్రాణులసంగతియు నిట్టిదియే. నీవుమాత్ర మేల లేనిపోని సంబంధ మొక్కటి గల్పించుకొని బాధపడుచున్నావు. కేవ లార్థమునందే, కేవల ధర్మమునందే యాసక్తిగలవారిని జూచి నామనము పరితాపపడును; ఇతరులనుగూర్చి పరితాపపడదు. అట్టివా రీలోకమునఁ గష్ట మనుభవించి పరమునను జెడుదురు. జనులు "అష్టకాశ్రాద్ధమని, ప్రత్యాబ్దిక"మని పితరులంగూర్చి శ్రాద్ధములఁ జేయుదురు. ఇది యూఱక యన్న మయిపోవుటయే కాని, మృతుఁడేమైన వచ్చితినునే? వేఱొక్కఁడు దిన్నయన్నము మృతుఁడయినవాని దేహమునఁ జేరి, వానికిఁ దనివిఁ గల్గించునది నిక్కమైనచో, దేశాంతరమున కేగిన తండ్రికి వానిపుత్రులు శ్రాద్ధమిడినచో నాశ్రాద్ధమునందు భుజించినవారి కడుపునఁబడ్డయన్నము దేశాంతరస్థుఁడైన వాని తండ్రికి దారికూడు గావచ్చునుగదా? యాగములు చేయుము. పాత్రులకు దానము లొసఁగుము. వ్రతము లొనర్పుము. తపస్సు చేయుము. సన్న్యాసము పూనుము." అని బుద్ధికుశలత గలవారు ద్రవ్యార్జనకై యనేక గ్రంథములు ధర్మ శాస్త్రము లని, స్మృతు లని పేర్లుపెట్టి రచించిరి. అవియెల్ల యోచించి, పర మనునది యొక్కటిలేదని తలంపుము. కంటికిఁ గనఁబడు రాజ్య భోగాదుల ననుభవింపుము. ఏ కంటికిఁ గనఁబడని పితృవాక్యపరిపాల నాదిధర్మముల విడువుము. ఓ నృపాత్మజా! భరతుని వేడికోలు నియ్య కొని, సర్వజనసమ్మతమయిన ప్రత్యక్ష మగుదానికంటె నెక్కువ ఫల మొసఁగునది వేఱొక్కటి లేదని నిశ్చయించి, రాజ్యముఁబొంది సకలసుఖ ముల బొందుము." అని జాబాలిమహాముని నాస్తికమతావలంబియై రాముని కధర్మవాక్యమును బోధించెను.

## 109-వ సర్గము

### రాముఁడు జాబాలి మతమును ఖండించుట

సత్యస్వభావులలో మేటియైన శ్రీరాముఁడు జాబాలిమునియొక్క పలుకులు విని యెక్కువ శ్రద్ధగలవాఁ డగుటచేత బుద్ధి చపలత నొందక యమ్మునీంద్రునితో నిట్లనియె:—ఓ మునీంద్రా! నీవు నామేలు గోరి చెప్పినమాట యకృత్యమైనను కృత్యముమాడ్కిఁ దోఁచుచున్నది. హితము గాకపోయినను హితముమాడ్కిఁ గనఁబడుచున్నది. మర్యాద లేనివాఁడు, చెడునడవడిగలవాఁడు, వేదవిరుద్ధమైన యాచారముల బోధించు మతమునందుఁ బ్రవర్తించువాఁడునైన మానవుఁడు పెద్దల నడుమ గౌరవమునొందఁడు. పురుషుఁడు సత్కులప్రసూతుఁడయి నదియు, చెడుకులమునఁ బుట్టినదియు, శూరుఁడయినదియు, బెదరుస్వభావము గలవాఁడయినదియు, ఆచారవంతుఁ డయినదియు, అనాచారవంతుఁ డయినదియు వానినడవడియె తెలుపును. నే నయోగ్యుఁడనై యోగ్యునివలెను, ఆచారహీనుఁడనయి యాచారవంతునివలెను, శుభలక్షణములు లేనివాఁడనయి శుభలక్షణములు గలవానివలెను, చెడునడవడి గలవాఁడనయి మంచినడవడి గలవానివలెనునై సద్ధర్మమును వదలి, వైదికక్రియలును, శాస్త్రవిధులును లేనిదియు, జనులను జెఱుపునదియు నైన యీ యధర్మమును ధర్మమనుబుద్ధితో నంగీకరింతునేని, లోకమున మంచి చెడ్డ లెఱుఁగఁగల జ్ఞానవంతుఁడగు మానవుఁడు, చెడునడతలు గలిగియు మంచివానివలె నటించు నన్ను గౌరవింపఁడుగదా! ఆడినమాట తప్పునట్టి యీ నడవడి గలిగియుందునేని, నే నెవ్వరికి నీతులు గఱపుదును. ఏవిధముగా స్వర్గలోకమును బొందుదును? నే నిప్పు డాడినమాటఁ దప్పుదునేని, యీ జనులందఱుఁ దమ యిచ్ఛలచొప్పున నడుచుకొందురుగదా! రాజు లెట్టి నడతను గలిగియుందురో, జనులు నట్టి నడతల నవలంబింతురుగదా! సత్యమే చక్కనైన శాశ్వత రాజధర్మము గావున రాజ్యము సత్యస్వరూపమై యున్నది. సత్యమునందే లోకములు నిల్చియున్నవి. ఋషులును దేవతలును సత్యమునే గొప్పగా నెంచిరి. ఇహలోకమున సత్యము పలుకువాఁడె యంతమునం దుత్తమలోకములం బొందును. బొంకులాడువానిఁ

జూచి, పామునుజూచి వెఱచునట్లు జనులు వెఱతురు. సత్యమే యీ లోకమున నుత్తమ ధర్మమనియు, స్వర్గప్రాప్తికిఁ బ్రధాన కారణమనియుఁ జెప్పఁబడుచున్నది. సత్యమే లోకమునకుఁ బ్రభువు. సత్యమే యెల్లప్పుడు కలిమి కాశ్రయమైనది. అన్నిటికి సత్యమే మూలాధారము. సత్యమునకంటె మించిన యొక గొప్ప పదవిలేదు. మనము చేయు దానములు, యజించు యాగములు, వేల్చెడు హోమములు, జపించు తపస్సులు, ఆచరించు వ్రతములు, పఠించు వేదములు సత్యమునందే నిలిచి యున్నవి. కావున మానవుఁడు సత్యనిరతుఁడై యుండవలెను. ఒకఁడు లోకమును పాలించును. ఒకఁడు కులమును పాలించును. ఒకఁడు నరకమును పొందును. వేఱొక్కఁడు స్వర్గమునఁ బ్రకాశించుచుండును. అనఁగా, సత్యవంతుఁడును, అసత్యవంతుఁడును వారివారిగుణాను రూపములైన ఫలములను పొందుదురు. ఆడినమాట తప్పనివాఁడను, తప్పక వనవాస మొనరించెద నని శపథముచేసినవాఁడనునైన నేను నిజమయిన మా తండ్రియొక్క యాజ్ఞ నెట్లు చేయకుందును? సత్యసంధుఁడనైన నే నజ్ఞానముచేఁగాని, పేరాసచేఁగాని, మైమఱపుచేఁగాని తొందర పడి సత్యముయొక్క కట్టును దెగఁగొట్టఁజాలను. ఆడినమాట తప్పు వాఁడును, చంచల హృదయుఁడును, కట్టుపాటులేనివాఁడునునైన వాఁడొసంగు హవ్యకవ్యములను వేల్పులుగాని, పితరులుగాని గైకొన రని పెద్దలు సెప్పఁగా వినియుందును. కావున సత్యవ్రతమే పరమాత్మ స్వరూప మని నే నెంచుచున్నాను. కాఁబట్టి సజ్జనులు దాల్చెడు జటావల్కలాజినములు నేను దాల్చుచున్నాను. నీచులు, క్రూరులు, లోభులు, పాపాత్ములు నగువా రవలంబించునట్టి క్షత్రియ ధర్మమును నేను విడిచెదను. ఆ క్షత్రియధర్మమున నధర్మము హెచ్చుగను, ధర్మము తక్కువగను నున్నది. అట్టి ధర్మము నాచరించుట శ్రేయము గాదు. మానవుఁడు పాపకార్యమును మనమున నిట్లు చేయవలసినది యని యెంచుకొని, పిదప దేహముతోఁజేసి, నోటితోఁజేసినది లేదని చెప్పును. కావున మానసిక, కాయిక, వాచికములగు మూఁడుతెఱఁగు లయిన పాపములను చపలుఁడగు మానవుఁడు సంపాదించుకొనును. సత్యముఁ దప్పని పురుషుని కీర్తి, యశస్సు,

సంపద, భూమి యనునవి తమంతటఁ దామే పొందఁగోరుచుండును. అతఁడు స్వర్గమున కేగినను, అవి వానిని విడువవు. కావున సత్యమును దప్పఁగూడదు. ఓ మహామునీ! "ఇది మే లయినది. దీనినిఁ జేయుము" అని శ్రుతి స్మృతి విరుద్ధముగా యుక్తిప్రధానములైన వాక్యములతో నన్నుఁగూర్చి నీవేమి చెప్పితివో, యా యుపదేశము పైకి మంచిదిగాఁ గనఁబడుచున్నను, అది యుక్తము గాదు. నేను తండ్రియెదుట వనవాస మొనర్చెద నని ప్రతిజ్ఞ నేసి, యిప్పు డాతండ్రి మాటను తుంగలోఁద్రొక్కి భరతుని మాట నెట్లు విందును? నేను తండ్రియెదుట, ధైర్యముతో వనవాసము చేసెద నని గట్టిమాట చెప్పితిని. నా పలుకులు విని కైకయు నంతకుమున్ను విచారము మాని, మనమున సుప్పొంగెను. కార్యాకార్య వివక్షణుఁడ నైనందున, నేను "వ్రతోపవాసాది కర్మములవలన నేమి ఫలమున్నది?" ఈ మొదలగు కుత్సితబుద్ధులు మాని, పితృవాక్యపరిపాలనాది సద్ధర్మాచరణమునందు ఫల మున్న దని నమ్మి, యిత్తెఱఁగున వనవాసముచేయుచుఁ బరిశుద్ధుఁడనై, భోజననియమముగలిగి, కంద మూల ఫలపుష్పాదులచే దేవతలం బితరులం దృప్తినొందించుచుఁ బంచేంద్రియముల సంతుష్టిగలవాఁడనై కాలము గడిపెదను. జను లీకర్మభూమియం దుండునంతవఱకు శుభకృత్యములు సల్పుచుండవలయును. అగ్ని వాయు చంద్రులును గర్మభూమియం దుండునప్పుడు సత్కర్మల నాచరించి, తత్ఫలములుగా నగ్నిత్వ, వాయుత్వ, చంద్రత్వములం బొందిరి. దేవేంద్రుఁడు కర్మభూమియం దుండి నూఱు జన్నము లొనర్చి, శతక్రతు వని సార్థకనాముఁడై, స్వర్గలోకాధిపత్యమును బొందెను. మహర్షు లనేకులోర్వరాని తపము లొనర్చి స్వర్గము నొందిరి." అని యిత్తెఱఁగున నుగ్రతేజుఁడగు దశరథనందనుఁడు జాబాలితోఁ జెప్పి, యమ్ముని చెప్పిన "సర్వం మిథ్య" యను నాస్తికోక్తులఁ దలఁచి తలఁచి, కోపము నాఁపుకొనఁజాలక, యాతని మాటలలో నొక్కొక్కదానిని ఖండించుచు మఱల నతనితో నిట్లనియె: "సత్యము, ధర్మము, శౌర్యము, భూతదయ, ఇంపుగా మాటాడుట, దేవబ్రాహ్మణాతిథిపూజ స్వర్గమునకు మార్గములని పెద్దలు చెప్పుదురు. కావుననే బ్రాహ్మణశ్రేష్ఠు లందఱు వేదవేదాంగ

ముల యర్థములను జక్కఁగా నెఱిఁగి, పాత్రుఁగలిగి, జాగ్రత్తతో శాస్త్ర
విహిత విధానముల చొప్పున స్వస్వధర్మములను జరుపుచు నుత్తమ
లోకముఁ బొందఁగోరుదురు. ఇట్టి వేదోక్తకర్మలకు విరుద్ధ మగు బుద్ధి
గలిగి, వైదికుని చాడ్పునఁ గనఁబడుచు, నాస్తికుఁడవై, ధర్మమార్గముఁ
దప్పి యిట్టి దుర్బుద్ధితోఁగూడి నాస్తికత్వమును బోధించెడి నిన్ను దగ్గఱఁ
జేర్చిన నాతండ్రి యెంత పాపకృత్యము చేసెనో? లేకున్న నిట్టి నాస్తికుఁడ
వగు నిన్ను దగ్గఱఁ జేర్చునా? బుద్ధుఁడు దొంగవంటివాఁడు. బుద్ధుఁడే
నాస్తికుఁడని యెఱుఁగుము. కావున నాస్తికుని జనులు దగ్గఱఁ జేర్ప
రాదు. పండితుఁడు నాస్తికునిముఖమునే చూడరాదు. ఓ జాబాలీ!
నీకంటె పూర్వులయిన పెద్దలు పుణ్యకార్యములను జేసి యిహపరములను
రెంటిని సాధించిరి. కావున ద్విజులు శుభకార్యములను, వేల్పులను,
స్వధర్మమును దప్పక చేయుచుందురు. స్వధర్మము లందాసక్తిగలవారును,
సత్పురుషులతోడి చెలిమిచేయువారును, తపోబలముచే వెలుఁగువారును,
దాతలును, జంతుహింస మానినవారును, పాపములేనివారు నైన
మునీంద్రులను జను లందఱు గారవింతురు గాని నీవలె నాస్తికత్వమును
బోధించెడివారి నెవరు లెక్కింతురు? అని సరోషముగాఁ బలుకుచున్న
ధైర్యశాలియు, మహాత్ముఁడు నగు రామునిఁగూర్చి జాబాలిముని సవిన
యముగ సత్యమును ఆస్తికత్వమును బోధించునవియు, సజ్జనసమ్మత
ములునైన వాక్యములతో "రామా! నేను నాస్తికుల మాటలను జెప్ప
లేదు. నేను నాస్తికుఁడను కాను. లే దనుమాట లేనేలేదు. అన్నియు
నున్నవి. అయినను, సమయమునకుఁ దగినట్లు నాస్తికమతము మఱల
నవలంబించితిని. మఱొక్కసమయమున ఆస్తికుఁడ నయ్యెదను. నాకు
సమయానుసారముగా నాస్తికత్వమును, ఆస్తికత్వమును గలుగుచుండును.
ఇప్పుడు నాస్తికత్వము నవలంబింపవలసిన సమయము తటస్థపడినది.
ఇప్పుడు నిన్నెట్లయినను బతిమాలి యడవినుండి మఱలించి యయోధ్య
కుఁ గొనిపోవుటకై యీప్రకారము చెప్పితిని" అని రామునితోఁ
జెప్పెను.

## 110-వ సర్గము.

### వసిష్ఠుఁడు రాముని బతిమాలుట

వసిష్ఠమహాముని జాబాలివచనములకు రాముఁ డలిగెనని యెఱిఁగినవాఁ డయి, రామునిఁ జూచి, "జనులు పుణ్యకర్మములచే స్వర్గమును బొందుదురనియు, పుణ్యములు క్షీణించిన, మరలఁ బుడమిఁ బడుదురనియు జాబాలిముని యెఱుఁగును. అయినను, నిన్నెవ్విధముగా నైన నయోధ్యకుఁ దోడ్కొనిపోవఁగోరి యిట్లు పలికెనుగాని వేఱుగాదు. త్రిలోకాధిపతీ! సృష్టి తొలుత జలమయమై యుండెను. దానినుండి భూమి యుప్పతిల్లినది. అందు బ్రహ్మ స్వయముగా దేవతలతో నుద్భవిల్లెను. అంత నాతఁడు వరాహావతారమెత్తి భూమిని దన ముట్టెతో లేవనెత్తెను. అంతఁ బ్రహ్మయుఁ బండితులగు మరీచి మొదలగు తన పుత్రులను సహాయులనుగాఁ గొని ప్రపంచమునంతయు సృజించెను. పరబ్రహ్మమువలన నిత్యుఁడును, శాశ్వతుఁడును, నాశరహితుఁడునైన సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁ డుద్భవించెను. ఆ బ్రహ్మకు మరీచియు, మరీచికిఁ గశ్యపుఁడును, కశ్యపునకు వివస్వంతుఁడును, వివస్వంతునికి మనువును పుట్టిరి. ఈ వైవస్వతమనువే మొదటి ప్రజాపతి యనంబడును. ఇతనికి ఇక్ష్వాకువు పుట్టెను. మనువు తానీ యయోధ్యాపురమును నిర్మించి, మొదట నీ యిక్ష్వాకుమహారాజున కొసఁగెను. కావున నిక్ష్వాకువే యయోధ్యాపురమునకు మొదటిరాజు. ఆ యిక్ష్వాకువునకు శ్రీమంతుఁడగు కుక్షి యని ప్రసిద్ధుఁడైన నృపాలుఁ డుద్భవించెను. కుక్షికి వికుక్షి పుట్టెను. వికుక్షికి నెక్కువ తేజస్సును, మగటిమియుఁగల బాణుఁడను పుత్రుఁడు జనించెను. బాణునికి నిడుపుచేతులు గలిగి, యెక్కువకీర్తి గలిగి వెలయుచున్న యనరణ్యుఁడు పుట్టెను. సత్పురుషశ్రేష్ఠుఁడగు అనరణ్యుఁ డేలికగా నున్నప్పుడు దొంగయనుపేరే లేదు. వానలు దేశమం దెల్లెడలఁ గురియుచున్నందున దుర్భిక్షమను మాటయే లేకుండెను. ఆ యనరణ్యునికి నిడుదచేతులవాఁడగు పృథుచక్రవర్తి జన్మించెను. ఆ పృథువువలన త్రిశంకు మహారాజు పుట్టెను. ఆ త్రిశంకువుని సత్యవాక్యప్రభావమువలన బొందితోడనే స్వర్గమునకు జనెను. ఆ త్రిశంకువునకుఁ గీర్తిమంతుఁ డగు యువనాశ్వుఁడను కొడు

రుఁడు జన్మించెను. మహాకాంతిగల యువనాశ్వుఁడు దుందు వను రక్క
సుని జంపుటచే దుందుమారుఁ డని విఖ్యాతి కెక్కెను. ఆ యువనాశ్వునికిఁ
గాంతిమంతుఁడగు మాంధాతయు, మాంధాతకు తేజస్వియగు
సుసంధియు జన్మించిరి. సుసంధికి ధ్రువసంధి ప్రసేనజిత్తు లనెడు నిరువురు
కొడుకులు పుట్టిరి. వారిలో ధ్రువసంధికిఁ గీర్తిమంతుఁడైన శత్రుసంహారి
యగు భరతుఁడు జన్మించెను. దీర్ఘ బాహువగు భరతునివలన నసితుఁడు
జనించెను. అయ్యసితునికి హైహయులు, తాలజంఘులు, శూరులగు
శశిబిందువు లనువారు విరోధులైరి. ఆ యసితుఁడు వారందఱితో
యుద్ధముసేసి యోడి యరణ్యమునకుఁ బరుగిడెను. అతఁడు మనోహర
మయిన హిమవంతముఁజేరి వైరాగ్యముచే మౌనవ్రతము దాల్చియుం
డెను. అతని కిరువురు భార్య లుండిరి. వారిరువు రొక్కసమయముననే
గర్భము దాల్చఁగా, వారిలో నొక్కతె తనసవతికి విషము గలిపిన
యన్నముఁ బెట్టెను. ఆ సమయమం దొక్కనాఁడు భృగువంశజుఁడైన
భార్గవచ్యవనుఁడను మునీంద్రుఁడు హిమవంతమున కేతెంచెను. అప్పుఁ
డసితుని భార్యలలో నొక్కతె యగు కాళింది యను నామె యమ్మునీం
ద్రునియొద్దకు వచ్చి మ్రొక్కఁగా, నమ్మునీంద్రుఁ డా కాళింది పుత్రునిఁ
బొందఁగోరుచున్న దని యెఱిఁగినవాఁడై, 'ఓ రాణీ! లోకప్రసిద్ధుఁడును,
ధర్మముఁ దప్పనివాఁడును, మంచి స్వభావముగలవాఁడును, వంశమును
వృద్ధినొందించువాఁడును, శత్రుసంహారియు నగు పుత్రుఁడు పుట్టు"నని
చెప్పెను. అంతట నా కాళింది సంతసమందినదై, మునీంద్రునికిఁ బ్రదక్షి
ణముసేసి, వీడ్కొని, తనయాశ్రమమున కేతెంచి, తామరరేకులం
బోలు కన్నులవాఁడును బ్రహ్మతేజస్సుగలవాఁడునైన పుత్రునిఁ గనెను.
ఆ కాళిందియొక్క గర్భమునుఁ జంపఁ దలఁచి, యామెకు సవతి విషము
పెట్టెనుగాని యమ్ముని వరప్రభావమునం జేసి, యా విషముతోఁ
గూడనే శిశువు పుట్టుటచే సగరుఁ డనుపేరుగలవాఁ డయ్యెను. ఆ సగర
నృపాలుఁడు యాగము లొనర్చి పర్వకాలమున వేగంబుచే గర్జించుచు నీ
లోకపు జనులను వెఱపించుచుండు సముద్రమును ద్రవ్వించెను. ఆ సగ
రుని కసమంజుఁడను నొక్కకుమారుఁడు పుట్టెనని మేము వినియుందుము.
ఆ యసమంజుఁడు దుష్టకార్యములఁ జేయుచున్నందునఁ దండ్రి వానిని

జీవించియుండఁగానే యడవికిఁ దఱిమెను. అయ్యసమంజుని కంశుమంతుఁడను వీర్యశాలి యగుపుత్త్రుఁడు పుట్టెను. ఆ యంశుమంతునికి దిలీపుఁడును, దిలీపునికి భగీరథుఁడును, భగీరథునికి కకుత్థ్సుఁడును పుట్టిరి. కకుత్థ్సుని వలననే యీ వంశస్థులందఱు కాకుత్థ్సులనఁబడిరి. ఆ కకుత్థ్సునికి రఘువు పుట్టెను. ఆతనిచే నందఱు రాఘవు లనఁబడిరి. రఘువునకుఁ దేజముగల యొకపుత్త్రుఁడును పుట్టెను. ఆతఁడు ప్రవృద్ధుఁడనియు, కల్మాషపాదుఁడనియు, పురుషాదుఁ డనియు, సౌదాసుఁ డనియుఁ బుడమిం బ్రసిద్ధి చెందెను. కల్మాషపాదునికి శంఖణుఁడను పుత్త్రుఁడు పుట్టెను. ఆ శంఖణుఁడు దండ్రియగు కల్మాషపాదునితోఁ గయ్యముసేసి, సేనలతోడ మడిసెను. శంఖణునికి శూరుఁడును, గాంతిమంతుఁడు నగు సుదర్శనుఁడు పుట్టెను. ఆ సుదర్శనుని, కగ్నివర్ణుఁడు, కగ్నివర్ణునికి శీఘ్రగుఁడు, శీఘ్రగునికి మరువు, మరువునకుఁ బ్రశుశ్రుకుఁడును బుట్టిరి. ప్రశుశ్రుని కెక్కువ వెలుఁగు గల యంబరీషుఁ డను పుత్త్రుఁడు పుట్టెను. అంబరీషుని కెడతెగని మగటిమిగల నహుషుఁడను పుత్త్రుఁడు జనించెను. నహుషుని కెక్కువ ధర్మచింతగల నాభాగుఁడు జనించెను. నాభాగుని కజసువ్రతు లనెడు నిరువుర కొడుకులు పుట్టిరి. అజుని కొడుకే ధర్మాత్ముఁ డగు దశరథమహారాజు. ఆతనియొక్క దాయభాగము ననుభవించుట కర్హుఁడు జ్యేష్ఠపుత్త్రుఁడునగు రాముఁడను నీ విదిగో యున్నవాఁడవు. రాజు కాఁదగినవాఁడవు నీవే కావున రాజ్యము గైకొని, జనులం బాలింపుము. ఇక్ష్వాకువంశపురాజు లందఱిలో మొదటఁ బుట్టినవాఁడే రాజగుట వాడుక. పెద్దవాఁ డుండఁగ, కనిష్ఠునికి రాజ్యార్హత లేదు కావున జ్యేష్ఠునికే పట్టాభిషేకము గావింపవలయు. ఓ విస్తారకీర్తిగలవాఁడా! నీ తొల్లింటి పెద్దలనాటినుండి వచ్చెడి యాచారమును నీవు విడనాడఁదగదు. ఎక్కువ కల్మియు వైశాల్యముగల రాజ్యముతో నొప్పు భూమండలమును తండ్రివలె నేలుము" అని రామునితోఁ జెప్పెను.

## 111-వ సర్గము

### రాముఁడు వసిష్ఠునికి బదులిడుట

రాజపురోహితుఁ డగు వసిష్ఠమహాముని రాముని కిట్లు చెప్పి యాతనికి న్యాయమున కొప్పినట్లుగా మఱల నిట్లనియె. భూలోకమున

జనించిన ప్రతియొక్కనికిం దల్లి, తండ్రి, యాచార్యుఁడు (మంత్రోప
దేశము చేయువాఁడు) అని ముగ్గురు గురువులు గలరు. పురు
షోత్తమా! తండ్రి యీ పురుషునిఁ బుట్టించుచున్నాఁడు. కావున
నతఁడు గురువన బడును. ఆచార్యుఁడు జ్ఞానము గలిగించుచున్నాఁడు
గావున నతఁడును గురు వనంబడును. పరంతపా! నేను నీ తండ్రికి
గురుండను; నీకును గురుండను. నీవు నామాట విని యట్లు
చేయుదువేని, నీవు సన్మార్గము మీఱినవాఁడవు గానేరవు. ఈ బ్రాహ్మ
ణులును పురజనులును, క్షత్రియులును వైశ్యులును, నీవారలు. వీరి
యెడ దయఁ జూపి, రాజ్యపాలనము నియ్యకొంటివేని, నీవు సత్ప
థముఁ దప్పినవాఁడవు గానేఱవు. ముదుసలియు, ధర్మాచరణపరాయణము
నగు తల్లిమాటను మీఱఁజనదు. ఆమెమాటఁబడి నడచుకొందువేని
నీవు మంచివారిత్రోవను మీఱినవాఁడవు కాకుందువు. న్యాయమును,
శౌర్యమును విడువనివాఁడవగు రాఘవా! భరతుని వేఁడికోలును
మన్నించి, రాజ్యము నంగీకరించితేని, నీ కెట్టి ధర్మలోపమును గలుగ
నేరదు. అని యిట్లు వసిష్ఠుఁ డింపుగాఁ జెప్పిన పలుకులు విని, నరోత్తముఁ
డగు రాముఁడు తన చేరువఁ గూర్చుండియున్న తన గురువును జూచి
యిట్లు బదులు సెప్పఁ దొడఁగెను. "మహామునీ! తల్లి దండ్రులు కొడు
కులు గలుగవలయునని కోరికతో నెన్నియో యుపవాసములు,
నోములు మున్నగునవి చేయుదురు. తల్లియుఁ గొడుకులు పుట్టిన
తర్వాతఁ దమకుఁ గలవి పెట్టియు, జలకమాడించియు, నలుఁగులు
పెట్టియు, నెల్లప్పు డింపుమాటలు పలికియుఁ, బోషించియుఁ జేసిన యుప
కారము లెన్ని యున్నవో, వానికిఁ బ్రత్యుపకారము లెన్ని సేసినను
సాటిగావు. కావున నాకు దశరథుఁడు జనకుఁడు; పోషకుఁడు; రాజును.
కాఁబట్టి నే నతనియెదుట నేమని ప్రతిజ్ఞసేసితినో, యది తిరుగదు."
అని రాముఁడు వసిష్ఠమునీంద్రునితోఁ జెప్పఁగా, వెంటనే యెక్కువ
యౌదార్యముగల భరతుఁడు తన కోర్కె నెఱవేఱమికిఁ గడువగచి,
చేరువనున్న సుమంత్రునిఁ జూచి "సారథీ! శీఘ్రముగా దర్భలు దెచ్చి పఱ
పుము. అన్నగారు నాపైఁ గరుణఁ జూపువఱ కిచ్చటఁ బుడమిపై దర్భల
సెజ్జమీఁదఁ బరుండెదను. అప్పు తీసికొన్నవాఁడు మఱల నీయకున్నచో

నప్పిచ్చిన బ్రాహ్మణుం డప్పుదీసికొన్న వానియింటి కడ్డముగా, నిద్రా
హారములు మాని, మోమును గప్పుకొని యెట్లు పరుండియుండునో
అట్లె నేనును రాముఁ డడవినుండి యయోధ్యకు వచ్చునంతవఱకు
నీయాకుటింటి ముందటఁ బరుండెదను" అని చెప్పఁగా, సుమంత్రుఁడు
రామునిఁ జూచుచు నూరకుండెను. అంతట భరతుఁడు కడు వెత నొంది,
తానే దర్భలఁ దెచ్చి యాపర్ణశాలముందట నుత్తనేలపైఁ బఱచెను.
అప్పు డధికతేజస్వియగు రాజర్షిశ్రేష్ఠుఁడగు రాముఁడు భరతునిం
జూచి, నాయనా! భరతా! నీకు నేనేమి చెఱుపుసేసితినని నీవిట్లు పరుండ
నున్నావు? బ్రాహ్మణులుగదా యప్పుదీసికొన్నవారి యిండ్లవాఁకిళ్ల కడ్డ
ముగా నొకవైపునకే తిరిగి బరుండుదురు. క్షత్రియు లిట్లు వాఁకిళ్ల
కడ్డముగాఁ బరుండి పీడించు టన్యాయ్యముగదా. నరశ్రేష్ఠా! యీ
యాగడంపుఁ బనినిమాని, యిచ్చటనుండి వెంటనే యయోధ్యా
పురమునకుఁ బొమ్ము" అని భరతునితోఁ జెప్పఁగా, భరతుఁ డన్ననో,
యట్లే దర్భలమీఁదఁ గూర్చుండియే యచ్చటఁ గూడియున్న పురజను
లను, గ్రామజనుల నందఱను జూచి, "మీరైన నన్నకుఁ జెప్పరాదా?
ఏల యూరకున్నారు?" అనెను. అంతట నగరమువారును, పల్లెల
వారును భరతునింజూచి, "నాయనా! రాముని గుణము మే మెఱుఁగు
దుము. రాముఁడు మంచిమాట చెప్పుచున్నాఁడు. మహాత్ముఁడగు నీ
రాముఁడును తండ్రిమాటమీఁదనే నిలిచియున్నాఁడు. కాబట్టి మే
మేమి చెప్పియు నితనిని మఱలింపఁజాలకున్నాము" అని చెప్పిరి. రాముఁ
డును వారి పలుకులు విని, "ధర్మదృష్టిగలహితు లిట్లే పలుకుదురు.
భరతా! యోచించి, లేచి కూర్చుండి, నన్నును, నీటిని దాఁకుము" అని
భరతునితోఁ జెప్పెను. అట్లె భరతుఁడు లేచి కూర్చుండి, రాముని
జలమును దాఁకి కూర్చుండి, "బ్రాహ్మణులును, మంత్రులును, జనులంద
ఱును నామాట విందురుగాక! నేను తండ్రిని రాజ్యము గావలెనని
కోరలేదు, తల్లిని "నీ వడుగు"మని ప్రేరింపనులేదు. ధర్మజ్ఞులలో మేటి
యగు పూజ్యుఁడయిన రాముఁ డడవులలో నుండుటకును నేను కోర
లేదు. అట్లవశ్యముగఁ దండ్రిమాటప్రకారము నడువవలసియు, నడ
వులలో నుండవలసియు నున్నట్లయిన నేనే రామునికిఁ బ్రతిగాఁ బదు

నాలుగేం డ్లరణ్యమున నుండెదను" అని చెప్పెను. ధర్మాత్ముఁడగు రాముఁడు తన తమ్ముఁడు యథార్థముగఁ జెప్పినమాటకు నచ్చెరువొంది, పురగ్రామవాసిజనములం జూచి, "తండ్రి బ్రతికియున్నప్పుడు తాను విక్రయించినదియుఁ, గుదువయుంచినదియుఁ, గొన్నదియు మార్చుటకు నాకుఁగాని, భరతునికిఁగాని శక్యముగాదు. వనవాసవిషయమున విసుగు పడి నేను తండ్రిని వంచింపవచ్చునా? నేను వనవాసము నీ కిచ్చి, రాజ్య పాలనము గైకొనుట తండ్రిని వంచించినట్లుకదా యగును. కైకేయి యోచనచేసియే కోరినది. తండ్రియు మంచిపనియే చేసెను. భరతుఁ డోర్పును, గురుభక్తియుఁ గలవాఁడని యెఱుఁగుదు. సత్యసంధుఁడగు మహాధైర్యశాలియయిన భరతుని కిదియంతయుఁ దగియేయున్నది. నేనును బదునాలుగేం డ్లరణ్యవాసమునేసి, మఱలివచ్చి, పట్టాభిషిక్తుఁ డనై యీ ధర్మాత్ముఁడగు తమ్మునితోఁ గూడి మేటిపుడమిఱేఁడ నయ్యెదను. కైకేయి తండ్రిని వరముల నడిగెను. నేను తండ్రి యాజ్ఞ ప్రకారము నడచుకొనెదనని చెప్పితిని. నీవును తండ్రియగు దశరథనృపా లున కసత్యదోషము వాటిల్లకుండున ట్లొనరింపుము" అని భరతునితోఁ జెప్పెను.

## 112-వ సర్గము.

### రాముఁడు భరతునకుఁ దన పాదుకల నొసఁగుట

అచ్చటికి వచ్చియున్న మహర్షులందఱు సాటిలేని తేజస్సుగల యన్నదమ్ముల యాశ్చర్యకరమయిన కూడికనుజూచి మిక్కిలి యాశ్చర్య మొందిరి. అంతర్ధానము నొందియున్న ఋషులును, సిద్ధులును, మహర్షు లును మహాసమర్థులైన రామ భరతులను జూచి, "ధర్మముల నెఱింగిన వారును, ధర్మమునందు విక్రమముగలవారును నైన యీ రామ భరతు లకు జనకుఁడయిన దశరథుఁడుకదా ధన్యుఁడు! వీరి సంభాషణమును విన్నను, నింకను వినవలయు ననియే యపేక్ష వొడముచున్నది." యని యా కాకుత్స్థునుఁబొగడి, రావణవధము మనమునఁగోరినవారయి, రాజ శ్రేష్ఠుఁడగు భరతుంగూర్చి వారందఱు నేకగ్రీవముగా నిట్లనిరి. "ఓ సత్కులప్రసూతుఁడా! గొప్ప పండితుఁడా! మంచి నడవడిగలవాఁడా! పేరువడసినవాఁడా! నీవు తండ్రిని సత్యసంధునిగాఁ జేయఁదలఁతువేని,

రాముని మాట వినుము. ఈ రాముడు పితృవాక్యపరిపాలనరూప మగు ఋణమును తీర్పవలెనని మేము సర్వదా కోరుచుందుము. దశరథుడును, కైకేయి కిచ్చిన వాగ్దత్తమును నెఱవేర్చి స్వర్గతుడయ్యెను." అని గంధర్వులు, రాజర్షులు, మహర్షులును చెప్పి యందఱును తమతమ తావరములకు జనిరి. శుభదర్శనుడగు రాముడును ఋషులు చెప్పిన యా యింపైన మాట విని, సంతసమును, ముఖవికాసమును బొంది యా ఋషుల కందఱకును మ్రొక్కెను. భరతుడును దన మనోరథ మీడేరకుండుటకు వగచి, చేతులు జోడించికొని రామునిఁ గూర్చి మాటలు డగ్గుత్తికచేదొట్రుపడుచుండ వెండియు నిట్లనియె. "ఓ కాకుత్స్థా! పెద్దవానికే పట్టాభిషేకము చేయుట యను రాజధర్మమును, మన వంశాచారమును బరికించి, నాయొక్కయుఁ, దల్లియొక్కయుఁ బ్రార్థనము నెఱవేర్పుము. ఈ కడు గొప్పరాజ్యమును బాలించుటకును, మనయందుఁ బ్రేమగల పురగ్రామవాసి జనులను సంతోషపఱచుటకును నే నొక్కరుండను చాలను. మేఘోదయమును గాఁపు లెదురుచూచునట్లు మన బందుగులును, జోదులును, చెలికాండ్రును, హితులును నీవు వచ్చి రాజ్యము నొందవలెనని నిరీక్షించుచున్నారు. గొప్ప బుద్ధిగలవాఁడా! కకుత్స్థవంశోద్భవా! నా వేఁడికోలు మన్నించి యీ రాజ్యమును నెలకొలుపుము. ఈ రాజ్యమును పాలింప నీవె సమర్థుఁడవు" అని భరతుఁడు సవినయముగా రాముని నింపుగులుకు మాటలచే బ్రార్థించుచు నా రాముని పాదములపైఁ బడెను. రాముఁడును నీలమేఘచ్ఛాయ గలవాఁడును, తామరపూవులంబోలు కన్నులతోఁ గూడినవాఁడును, మదించిన రాయంచల కంఠధ్వనింబోలు కంఠస్వరము గలవాఁడునునైన భరతునిఁ దానే లేవనెత్తి తన తొడమీఁదఁ గూర్చుండఁ బెట్టికొని, "నాయనా! నీ కీ యడకువగల బుద్ధి పుట్టుకతోడ వచ్చినది. నీ వీ బుద్ధిచేతనే యీ పుడమినెల్ల నేలఁగలవు? నిన్నెడఁబాయకుండువారును, నీ మేలు కోరెడివారును, బుద్ధిమంతులు నగు మంత్రులతో నాలోచించి, యెంత గొప్పపనులనైనను జేయుము. చంద్రునివిడిచి వెన్నెల తొలఁగవచ్చును. హిమవత్పర్వతము మంచుఁగురియకనైనఁ బోవచ్చును. సాగరము కట్టదాఁటియైన రావచ్చునుగాని నేను తండ్రి యాజ్ఞాపించిన

కార్యమును జేయక మానను. తల్లికోరికతోనో లేక లోభముతోనో చేసిన యీ కార్యమును నీవు మనమున నుంచకుము. తల్లినివలె నామెను జూచుకొనుము" అని రాముఁడు భరతునితోఁ జెప్పెను. ఇట్లు చెప్పుచుండువాఁడును, సూర్యరశ్మింబోలు కాంతిగలవాఁడును, పాడ్యమి యందలి చంద్రునివలె వర్ధిష్ణువును, బూజసేయఁదగినవాఁడును నైన రామునిఁగూర్చి "అన్నా! స్వర్ణాలంకృతములైన యీ పావుకోళ్లపై నీ యడుగులుపెట్టి యెక్కుము. అవియే అన్నిలోకములకును యోగ క్షేమములను సమకూర్పఁగలవు." అని చెప్పఁగా, నెక్కువ తేజస్సు గలవాఁడయిన పురుషోత్తముఁడగు రాముఁడును పావుకోళ్లపైఁ దన పాదములఁ బెట్టి యెక్కి, వానిపైనుండి దిగి, మహాత్ముఁడగు భరతునికి వాని నొసఁగెను. ఆ భరతుఁడా పావుకోళ్లకు భక్తితోఁ బ్రణమిల్లి, రామునింగూర్చి "రఘునందనా! శత్రుసంహారీ! యీ పదునాలుగుసంవత్సరములును నేనును, జడలను దాల్చి, నార బట్టలఁ గట్టుకొని, కాయలు, దుంపలు, పండ్లు నాహారముగాఁ గల వాఁడనై, రాజ్యభారమెల్ల నీ పావుకోళ్లయందుంచి, పట్టణమునకు వెలుపలనేయుండి, నీరాక కెదురుచూచుచుందును. రఘూత్తమా! పదునాలవయేఁడు నిండిన మఱునాఁడు నీ మోమును నేను జూడనేని, యగ్నిప్రవేశము సేయుదును" అని చెప్పెను. రాముఁడును భరతుని, శత్రుఘ్నుని బ్రేమపూర్వకముగాఁ గౌఁగిలించి, "అట్లే కావించెద" నని శపథముచేసి మరల భరతునిం జూచి, "రఘుసత్తమా! నీ తల్లియగు కైకేయి నేమియుననక కాపాడుము. నామీఁదను, సీతమీఁదను నొట్టిడి చెప్పుచున్నాను" అని చెప్పి కన్నుల నీరుగ్రమ్ముచుండ "నిఁక పోయిర" మ్మని చెప్పెను. ప్రతాపవంతుఁడగు భరతుఁడును జక్కఁగ నలంకరింపఁ బడిన యా పాదుకలను, రామునికిని బ్రదక్షిణము గావించి, యా పావుకోళ్ల నెత్తి మృత్యుంజయమను గజేంద్రముమీఁద నుంచికొని పయనమాయెను. అంత రఘువంశోద్ధారకుఁడగు రాముఁడును హిమవ త్పర్వతము మాడ్కిఁ దనధర్మమునుండి కదలనివాఁడై, గురువులను, మంత్రులను, పురగ్రామవాసిజనములను, తమ్ములను క్రమమున వారి వారికిఁ దగినచొప్పున సంతోషపఱచి యందఱికిని సెల వొసఁగెను.

తల్లులును దుఃఖవేగముచేఁ గొంతడఁచుకొని మాటరానందునఁ బోయి వచ్చెదమనికూడఁ జెప్పఁజాలక పోయిరి. రాముఁడును తల్లుల నందఱిని మ్రొక్కి, విలపించుచుఁ దన యాకుటింటిలోపలికిఁ జొచ్చెను.

## 113-వ సర్గము

### భరతుఁ డయోధ్యకు మఱలుట

అంతట నప్పుడు భరతుఁడును రాముని పావుకోళ్లను దన నెత్తిని నుంచుకొని, శత్రుఘ్నసమేతుఁడై సంతోషముతో రథమెక్కెను. గట్టి నియమముగల వసిష్ఠ, వామదేవ, జాబాలి మహర్షులును మంత్రాలోచన లందు నేర్పరులయిన మంత్రులును ముందుగాఁ బయనమై, తూర్పు మొగముగాఁ దిరిగి, మందాకినీ నదికిని, చిత్రకూటపర్వతమునకుం బ్రదక్షిణము గావించుచుఁ బోయిరి. బుద్ధిమంతుఁడగు భరతుఁడును సేనలతోఁగూడి వచ్చుచుఁ జిత్రకూటమునందలి రమ్యములగు పలు తెఱఁగులైన గైరికాది ధాతువులయొక్క సొంపును దిలకించుచుఁ, జిత్రకూటము వెంబడే వచ్చి, యా చిత్రకూటముయొక్క చేరువనున్న భరద్వాజాశ్రమమును జేరి, రథమునుండి దిగి, యాశ్రమములోపలికిఁ జొచ్చి యమ్మునీంద్రుని పాదముల కెఱఁగెను. అంత భరద్వాజమునీంద్రుఁడును "నాయనా! నీవు తలపెట్టిన కార్యము నెఱవేఱినదా? రామునిఁ జూచి మాటాడితివా?" అని యడుగఁగాఁ, దోఁబుట్టువులందుఁ బ్రేమగల భరతుఁడును భరద్వాజమునీంద్రుని కిట్లనియె. "మునీంద్రా! మే మిక్కడినుండి వెడలి దృఢమయిన శౌర్యముగల యా రామునికడకుఁ జేరితిమి. నేను నాచేతనయినంతఁ బ్రార్థించితిని. గురువగు వసిష్ఠమునీంద్రుఁడును చాలదూరము బోధించె. అయినను రాఘవుఁడు మిగుల సంతసముతో మునీంద్రునిఁ జూచి, "నేను తండ్రిమాటప్రకారము నడచుచు నీ పదునాలుగేం డ్లరణ్యముననే యుందును" అని చెప్పఁగా, మహాబుద్ధిశాలియు, వాక్యవిశారదుఁడునైన మునీంద్రుఁడు మాటలందు నేర్పరియైన రామునిఁజూచి, గొప్ప యర్థగౌరవముగల యీ మాటఁ జెప్పెను. 'ఓ కడు బుద్ధిశాలీ! స్వర్ణభూషితములైన యీ పాదుకలను సంతోషముతో నొసఁగుము. ఈ పావుకోళ్లను నీకుఁ బ్రతినిధులనుగా సింహాసనమునం దుంచి, వాని పేరిట నాజ్ఞలుసేయుచు భరతుఁడు రాజ్య

మేలుచుండును" అని చెప్పఁగా, రాముఁడును దూర్పువైపునకుఁ దిరిగి, యీ పావుకోళ్లపై నెక్కి నిలఁబడి, వానిని బెట్టి రాజ్యము నేలుమని చెప్పిపంపెను. నేను మహాత్ముఁడగు రాముని సెలవుగైకొని యచ్చటి నుండి మరలి యీ పావుకోళ్లను దీసికొని యయోధ్యకే పోవు చున్నాను" అని భరతుఁడు భరద్వాజమునీంద్రునితోఁ జెప్పెను. భరద్వాజుండును, మహాసమర్థుఁడైన భరతునిమాట లాలకించి, నరో త్తమా! శీలవంతులలోపల శ్రేష్ఠుఁడా! ఇదేమియు విపరీతముగాదు. పల్లమునందుఁ బడిన నీ రచ్చటనే యుండునట్లు, జ్యేష్ఠానువర్తన రూప మయిన శ్రేయస్సు నీయందే యుండును. దాని కేమియు హానిలేదు. ధర్మముల నెఱిఁగినవాఁడవు, ధర్మములు నడపుటయం దెక్కువమోహము గలవాఁడవునైన యిట్టి నీవంటి సత్పుత్రుఁ గన్న తండ్రియగు మహా బాహువయిన దశరథుఁడు మృతినొందినను బ్రతికియున్నవాఁడే సుమీ" అని భరతునితోఁ జెప్పెను. అంతట భరతుఁడు సవినయముగాఁ జేతులు జోడించి, మహాత్ముఁడగు మునీంద్రుని పాదముల కెఱఁగి, యా మునీం ద్రునికడ సెలవుగైకొని, యాతనికిఁ బలుమాఱు ప్రదక్షిణముఁ గావించి, మంత్రిసమేతుఁడై యయోధ్యకుఁ బయనమాయెను. భర తుని వెంబడించిన విస్తారమైనసేన వాహనములమీఁదను, బండ్ల మీఁదను, గుఱ్ఱములమీఁదను, ఏనుఁగులమీఁదను నెక్కి, మరలి వచ్చెను. ఇట్లు వారందఱు తరలి, యలలవరుసలచే శోభిల్లు యమునా నదిం దాఁటి మంగళకరమయిననీటితోఁగూడిన గంగానదినిఁ జూచిరి. అంతట భరతుఁడు మంత్రిపురోహితబంధువులతోను సేనలతోను గూడి, మనోహరమగు బలముతో నిండియున్న యా గంగానదిని దాఁటి, యందమైన శృంగిబేరపురముఁ జొచ్చి, మరల నచ్చటినుండి తరలివచ్చి, తండ్రియు నన్నయు లేని యట్టి యయోధ్యాపురముఁ జూచి, మిక్కిలి వెతలపాలయినవాఁడై సుమంత్రునిఁ జూచి, "సారథీ! యీ యయోధ్యాపురము చూచితివా, యిది యెంత కళదప్పి, చప్ప చల్లారి, రూపుసెడియున్నదో! ఇచ్చటి జనులు సంతోషము మాని యెంత దిగులుపడియున్నారో! చూచుము. ఇది యెంతయుఁ గాంతి హీనమైయున్నది" యని చెప్పెను.

## 114-వ సర్గము.

### భరతుఁడయోధ్యను జూచి దుఃఖించుట

కీర్తిశాలియగు భరతుఁడు తన వేగిరంబుగా మిక్కిలి గొప్ప ధ్వని
గల రథముపై నెక్కివచ్చి, జనముల సంచారముగాని గజముల సంచా
రముగాని, లేక, పిల్లులయొక్కయు, గుడ్లగూబలయొక్కయు సంచారము
గలదియుఁ, జీఁకటి క్రమ్మిన కృష్ణపక్ష రాత్రివలె వెలుతురు లేనిదియు,
మొదటఁ గాంతితోఁ గూడినదై, చంద్రునికిఁ బ్రియమైయుండియు నంగా
రకగ్రహముచే నొంటరిగాఁ జిక్కి పీడింపఁబడిన రోహిణివలె నున్నదియుఁ,
గొంచెముగా నున్నందున నెండకుఁ గలఁగిన నీటితోఁగూడినదియు, నెండ
వేఁడిమికి మిక్కిలి తపించిన పక్షులుగలదియు, నశించిపోయిన చేఁపలు,
మొసళ్లు మొదలగు జలజంతువులు గలదియునయి సన్నపాటియున్న
గిరినదివలెనున్నదియు, మొదటఁ బొగలేక బంగారువలెనుండి, పిదప
ద్రవమైన హవిస్సుహోమముచేఁ జల్లాఱినదై యుండు యాగాగ్నిజ్వాల
కైవడిఁ గాంతిలేనిదియు, గొప్పయుద్ధమున శత్రువులచేతఁజిక్కి, కవచ
ములఁ బోఁగొట్టికొని, గజాశ్వములు చచ్చియు, రథములు, వాని టెక్కె
ములు విఱిగియు గొప్పవీరులు చచ్చియుఁ బడియున్న సేనపగిదిఁ దేజము
లేకున్నదియు, మొదట నురుగుతోను, గొప్పధ్వనితోను లేచి, గాలి
మిక్కిలి యణఁగుటవలనఁ బొడవడఁగిన సముద్రపుటలమాడ్కి
నిశ్శబ్దముగనున్నదియు, యాగము ముగిసి యవభృథస్నానమైన పిదప
శ్రౌతవేత్తలగు ఋత్విక్కులు తమతమ యాయుధములు గైకొని
పోయినందునఁ జప్పుడులేకయున్న యజ్ఞవేదికవలె వెలుఁగకున్నదియు,
మందయం దెద్దునుబోఁగొట్టుకొని దిగులుపడి, యొక్కడకక్కడనిలిచి, కసవు
దినక, తమ భర్తను బొందఁ దహతహపడుచుండు నావులగుంపువలె నున్న
దియు, మిక్కిలి నునుపుపై ప్రకాశించుచున్న మంచిజాతిలోఁ బుట్టిన
పద్మరాగాదిమణులులేని క్రొత్త ముత్యాలహారము కైవడినున్నదియుఁ,
బుణ్యము తఱుగుటచేఁ దా నున్న చోఁటిని బాసి, వెలుతురుయొక్క
వ్యాప్తిలేనిదై యాకసమునుండి క్రిందఁబడిన నక్షత్రముమాడ్కిఁ
గాంతిలేనిదియు, వసంత ఋతువునఁ బూలతో వెలయుచు, తుమ్మెదల
ఝుంకారములతోఁగూడియుండి, యా ఋతువు గడచిన పిదప వేసవి

కాలము రాఁగానే కాలుచిచ్చుచే నించుకతగులఁబడి వాడియున్న వనలత వలెఁ బ్రభలేనిదియు, జనసంచారములేనివీథులును, క్రయవిక్రయములు లేని యంగడులును గలిగి చంద్రుఁడును నక్షత్రములు దెలియునట్లు మేఘములచేఁ గ్రమ్మఁబడిన యాకసమువలెఁ దేజోహీనమై యుండు నదియు, వట్టి బయలునందు త్తమపానవస్తువులులేక, పగిలిన బానల తోను, చచ్చిన త్రాగుబోతులతోను గూడి, యలంకారహీనమైయున్న పానభూమివలెఁ దేజరిల్లకుండునదియు, నేలయంతయు బద్దలువాఱి, పల్లమయి, పగిలిన పాత్రలంతటనుగలిగి నీరులేనిదయి విఱిగి పడిపోయిన బద్దలువాసిన చలిపందిరివలెఁ గాంతిలేకయున్నదియు, వింట నెక్కు పెట్టఁబడి, యుద్ధరంగమున బలవంతులగు శత్రురాజుల బాణములచేఁ ద్రుంచఁబడి, వింటినుండి జాఱి క్రిందఁబడి, విరివిగా వ్యాపించియున్న గట్టి యల్లెత్రాటి చందమునఁ దేజోహీనమై యుండునదియు, యుద్ధమున నేర్పరియగు గుఱ్ఱపురౌతుచే నెక్కి యుద్ధముచేయఁబడినతర్వాత, జీని మొదలగు నలంకారములు తీసి విడిచివేయఁబడినదియు, డస్సినదియు నగు నాఁడుగుఱ్ఱపుఁబిల్లవలె నందము దఱిగియుండునదియు, జలము వేడిమి కింకుటచే నల్లాడుచుండు ననేకములగు గొప్ప చేఁపలతోను, తాఁబేళ్లు మున్నగు జలజంతువులతోను గూడి, కలువలులేక, గట్లంతటను విఱిగి కూలిపోయిన నడబావిచందమున పాడువాఱియుండునదియు, దుఃఖముచేఁ జందనాద్యలంకారములు నేసికొనని దుఃఖపీడితుఁడైన మానవునియొక్క దేహమువలె సొంపుసడఱిగియున్నదియు, వాన ముసురుపట్టి కురియుచున్నప్పుడు కాఱుమబ్బులచేఁ గ్రమ్మఁబడిన సూర్యుని యొక్క కాంతివలె నుండునదియునైన యయోధ్యాపురము సొచ్చి, తాను, రథమునఁ గూర్చుండియే, రథముఁ దోలుచున్న సారథింజూచి, "సారథీ! సుమంత్రా! మున యయోధ్యాపురమున నెల్లప్పుడు మిక్కిలి గొప్పవైన దుందుభివాద్యములయు, వంది మాగధుల పాటలయు మ్రోఁత వినఁబడుచుండును. ఇప్పు డది వినఁబడకున్నదిగదా! మద్యముల తావియు, పూవులసువాసనయు, నగురుధూపముల పరిమళము నంతటను వీచుచుండునుగదా! ఇప్పు డదేల వీవకున్నది? రాముఁ డడవికేఁగుటచే నీ యయోధ్యాపురమున శ్రేష్ఠములయిన వాహనములధ్వనులును

గుఱ్ఱముల సకిలింతలును, మదపుటేనుఁగుల ఘీంకారములును, రథముల చప్పుడులును వినరాకున్నవి. రాముఁ డడవికిఁ బోయినపిదపఁ బ్రాయపు వారందఱు మనములందుఁగుంది మైపూఁతలఁ బూసికొనక, నెత్తావి గల పూలమాలికల జుట్టులందుఁ దుఱుముకొనక, యనేక భోగములను విడిచియున్నారుగదా. మానవులు నానావిధములగు పుష్పమాలికలను దాల్చి పురబాహ్య ప్రదేశముల విహరింపఁ బోవకున్నారు. రాము నెడ బాయుటవలనఁ గలిగినదుఃఖముచేఁ బీడింపఁబడిన ప్రజలుగల యీ పట్టణమున నుత్సవములు జరుగకున్నవి. ఈ పురశోభ మాయన్న వెంబడే పోయియుండవలయును. కావుననే యీ పురము కాఱు మబ్బుచే దట్టముగాఁ గ్రమ్మఁబడి జడివానకురియుచున్న శుక్లపక్షరాత్రి వలెఁ గాంతిహీనమై శోభిల్లకున్నది, ఎప్పుడు మాయన్న మహోత్సవము వలెఁ నిచ్చటికి రాఁగలఁడు? ఎప్పు డీ యయోధ్యయం దుండు జనులు వేసవిని మాడుచున్న జనులు మేఘమును జూచి యానందమొందునట్లు వనవాసము ముగించివచ్చిన రామునిఁజూచి తనివినొందఁగలరు? పూర్వము రాజమార్గములలోఁ బ్రాయపువారు మనోహరములగు వేషములఁ దాల్చి, మహాగర్వముతోఁ దలవాల్పక పోవుచుందురు గదా! ఇప్పు డొక్కరును పోవమిచే రాజమార్గములు వెలయకున్నవి" అని యనేకవిధములుగ చెప్పుచు, దశరథనరేంద్రుఁడు లేమిచే సింహము లేని గుహవలె, వెలయకున్న రాజమందిరమునొచ్చి, దేవాసురయుద్ధమున దేవతలోడి పరుగెత్తఁగా, రాహువు సూర్యుని మ్రింగఁగా రేయింబగళ్లు దెలియకున్న దినముపగిదిఁ గళలేక పాడుపడియున్న యా యంతఃపురమునెల్లఁ జూచి, యత్యంత చింతాక్రాంతుఁడై కన్నీరు విడిచెను.

## 115-వ సర్గము.

### పాదుకాపట్టాభిషేకము

తరువాత నియమము దప్పని భరతుఁ డయోధ్యాపురియందలి యంతఃపురమునఁ దల్లులను విడిచి, చింతాకులితమానసుఁడై, వసిష్ఠాదులగు పెద్దల నందఱింజూచి, "నేను నందిగ్రామమునకుఁ బోవుచున్నాను. మీరందఱును నాకు సెలవొసఁగుఁడు. రామ విరహదుఃఖము నచ్చట

నెట్టులో సైరించెదను గాని, ఇచ్చట నున్నచో, నా మనస్సు కుదుటఁ బడదు. నాతండ్రి స్వర్గమునొందెను. నాయన్న యడవులకేఁగెను. మా యన్న వచ్చువఱకు నచ్చటనుండి, యాతనిరాకకై యెదురుచూచుచుండెదను. ఆ రాముఁడే ప్రఖ్యాతిఁజెందిన నృపాలుఁడు. ఆతనితో సాటి యెవ్వరును రారు" అని చెప్పెను. ఆ సమర్థుఁడగు భరతుని మంచిపలుకులు విని, మంత్రులందఱును పురోహితుఁడగు వసిష్ఠుఁడును, భరతు నుద్దేశించి, "భరతా! నీవు తోఁబుట్టువుమీఁది మక్కువగలవాఁడవై చెప్పిన మాట నీకేతగును. ఎల్లప్పుడు చుట్టాలయందు మక్కువయుఁ, దోఁబుట్టువులం దనురాగమునుగల్గి, పెద్దలదారిని బోవునట్టి నీయొక్క యభిమతము నెవఁ డంగీకరింపఁడు" అని తన యభిప్రాయానుగుణముగాఁ జెప్పిన వారి మాటలు విని, భరతుఁడు చిఱునవ్వు మోముగలవాఁడై సారథిని బిలిచి త్వరగాఁ దేరి నాయితపఱచి తెమ్మని, తన తల్లులందఱకు నమస్కరించి శత్రుఘ్నునితోడ నరదమెక్కి, రాముని పాదుకలు నెత్తినఁబెట్టుకొని నందిగ్రామమునకుఁ దఱలెను. వెంటనే గురువగు వసిష్ఠుఁడు మున్నగు బ్రాహ్మణోత్తములందఱును నందిగ్రామమునకుఁ దూర్పుమొగముగాఁ బయనమైపోయిరి. భరతుఁడు పిలువకున్నను, రథ, గజ, తురంగసేనయును, పురవాసులును దఱలిరి. ధర్మాత్ముఁడును, సంపన్నమగు సోదరప్రేమగలవాఁడును నైన యా భరతుఁడు రాముని పావుకోళ్ల నెత్తిని బెట్టుకొని వేగిరముగా నందిగ్రామముఁ జేరి, రథమునుండి డిగ్గి, తన గురువుల జూచి, "మాయన్న యీ రాజ్యమును నాయం దిల్లడపెట్టి, తా నడిగినప్పు డిమ్మని చెప్పెను. అంతవఱకు నీబంగారుపావుకోళ్లు రాజ్యము యొక్క యోగక్షేమముల విచారించుకొనుచుండును. జనులారా! మీరు మాయన్నగారి యీపాదుకలకుఁ దెల్లనిగొడుగు పట్టుఁడు. ఈపాదుకలవలననే రాజ్యమున ధర్మము శాశ్వతముగా నిల్చియున్నది. నాయందుఁ బ్రేమతో నిల్లడపెట్టిన నాయన్నగారి రాజ్యమును, నాతని రాక కెదురుచూచుచుఁ బాలించుచుండెదను. గురువగు రాఘవుఁడు వచ్చినవెంటనే యీ పావుకోళ్ళ నాతని పాదములకుఁదొడిగి, దర్శన మొనర్చి, యీ రాజ్యభార మాతనిపైనుంచి, యతనిని గలిసికొని, "యన్నా! ఇదిగో, నీరాజ్యము నీవు గైకొను"మని యారాఘవునకొప్ప

గించి యీ యన్న చెప్పినప్రకారము నడచుచు, నతనికి శుశ్రూష చేయుచు నుండెదను. ఇత్తెఱంగున రాముఁడు నాయందిల్లడపెట్టిన యీ పాదుకోళ్లను, రాజ్యమును, నయోధ్యాపురము నప్పగించి, నేను కైకేయీమూలమునఁ బడసిన యపవాద పాపమునుండి తప్పించుకొనెదను. ఎప్పుడు రాముఁడు పట్టాభిషిక్తుఁడగునో, యెప్పుడు జనులు రాముని పట్టాభిషేకము చూచి సంతోషపడుదురో, యప్పుడే నాకు రాజ్య పరిపాలనము చేయుచున్నప్పుడున్న దానికంటె నాలుగింత లెక్కువయిన యానందమును, కీర్తియుఁ గలుగును" అని చెప్పి దీనుఁడై విలపించుచు, జడలను దాల్చి, నారబట్టలఁ గట్టుకొని, మునివేషమును దాల్చి, రాముని రాక కెదురుచూచుచు, రాముని మాటయందు నిలిచి, తన ప్రతిజ్ఞ చెల్లించుటయందుఁ బూనికి గలిగి, నందిగ్రామమున సేనలతోఁగూడ నుండి, రాముని పాదుకలకుఁ బట్టాభిషేకమొనర్చి, శాసనముల నన్నిటిని రాముని పాదుకల పేరిటఁ జేయుచు, నెల్లప్పుడు వానికి సేవచేయుచు, రాజ్యపరిపాలనము మంత్రులమూలమున జరిపించుచుండెను. ఏదియైన నొక శాసనము చేయవలసివచ్చినప్పుడును, సామంతరాజులు కానుకలేవి యైనఁ దెచ్చియిచ్చినప్పుడును భరతుఁడు మొదట వానిని పాదుకలకు నివేదించి, పిదపఁ జేయవలసిన కార్యములఁ జేయుచుండెను.

## 116-వ సర్గము

ఋషులు రాక్షసులకు వెఱచి చిత్రకూటాశ్రమము వదలుట

ఆ భరతుఁడు నందిగ్రామమున నట్లు రాజ్యపాలనము సేయుచుండఁగా, రాముఁడును, భరతుఁడు వనము విడిచి యేఁగిన వెంటనే, చిత్రకూటమునఁ దన చేరువనున్న ఋషులందఱు దిగులుపడి, యితరాశ్రమములకుఁ బోఁగోరి యుండుటను దెలిసికొనెను. అప్పుడు మును లందఱు వెఱచి, వికృతపుఁజూపులు చూచియుఁ, గనుబొమలు చిట్లించియు, రామునిఁజూచి యొండొరులు గుసగుసలాడుకొనుచుండిరి. రాముఁడును వారి యరణ్యము వదలి మఱియొక్క యరణ్యమునకుఁ బోవ నెంచుటకుఁ దాను గారణమేమోయని తలఁచినవాఁడై, చేతులు జోడించి, కులపతియగు మునీంద్రునిఁ జూచి, "ఓ మహాత్మా! మునులం దఱు మోములు చిట్లించుచు, మనోభావములు మాఱియున్నారు.

దీనికిఁ గారణమేమి? నే నెదియైన నపరాధము చేసితినా? లేక, మాతమ్ముఁ
డగు లక్ష్మణుఁడు పొరపాటునఁ దన మర్యాదకుఁ దగనిపని చేయఁగా,
మునులు చూడలేదుగదా! లేక, సీత నా శుశ్రూషయే ప్రధానముగా
నెంచినదై, తపస్వులకు శుశ్రూషలు సేయునప్పుడు తగినట్లు నడచుకొన
కున్నదా యేమి?" అని యడిగెను. ఆ మాటలు విని, జ్ఞానవయో
వృద్ధుఁడయిన కులపతియగు మునీంద్రుఁడు వణఁకుచు భూతదయగల
వాఁడగు రామునింగూర్చి "నాయనా! మంచిస్వభావముగలదియు,
మేలైన కార్యములం జేయుటయందే యాసక్తిఁ గలదియునైన సీత
కార్యములపట్ల స్వాభావికముగాఁ జలనము నొందదు. అట్లుండ,
ఋషులవిషయమున నామె యేమఱుపా టెంతమాత్ర మొందదు.
నీ నిమిత్తమే యీ తాపసులకీ యుత్తలంపాటు వాటిల్లినది. దాని
చేతనే యీ ఋషులు రాక్షసులవలన భయపడి యొండొరులు
మాటాడుకొనుచున్నారు. ఇచ్చట గర్వితుఁడును, యుద్ధమునఁ బగతుర
గెల్చినవాఁడును, క్రూరుఁడును, మానిసి దిండియును, దనకంటె మించిన
వాఁడు లేఁడని యహంకారము వహించియున్నవాఁడును, పాపాత్ముఁడు
నైన రావణుని తమ్ముఁడగు ఖరుం డనెడి రాక్షసుఁడు జనస్థానమున
నున్నాఁడు. అతఁడు జనస్థానమునసున్న మునుల పర్ణశాలల నన్నింటిని
బెఱికి పాఱవైచి, వారిని హింసించి తఱిమివైచెను. అంతట ముని
లందఱు వానికి వెఱచి యిచ్చటికే తెంచిరి. నీ వీ యాశ్రమము చొచ్చి
నదిమొదలు ఖరుఁడు మున్నగు రాక్షసులు నిన్నుఁజూచి యోర్వ
లేక, యిచ్చటి మునులకుఁ బలుతెఱఁగులుగా నపకారము చేయు
చున్నారు. కొందఱు రోఁతపుట్టించు భీకరములయిన నానావిధములగు
వికృతక్రూరరూపములు చూపియు, వెఱ్ఱిచూడ్కులు చూచియు ముని
లను బెదరించుచున్నారు. మఱికొందఱు దుష్టరాక్షసు లప్రశస్తము
లయిన యపరిశుద్ధములగు వస్తువులను దెచ్చి మునులపై వేసి ముందు
నిలఁబడి చంపుచున్నారు. మఱికొందఱు దుష్టాత్ములగు రాక్షసు లాయా
మునుల యాశ్రమములందుఁ వారికిఁ దెలియకుండ దాగి, తాపసులను
జంపుచుఁ గ్రీడించుచున్నారు. మునులు హోమము చేయఁబూను
నప్పుడు దుష్ట రాక్షసులు స్రుక్స్రువములను, హోమసాధనములను

పాఱవైచుచున్నారు; హోమకుండములం దుదకము పోసి చల్లార్చుచున్నారు, సమిధలను నుగ్గుచేయుచున్నారు. కావున నీ ఋషులందఱు దుష్టాత్ములగు రాక్షసులచేఁ బీడింపఁబడిన యీ యాశ్రమములను విడిచి యన్యదేశమునకుఁ బోఁగోరి, నన్నిప్పుడు పురికొల్పుచున్నారు. దుష్టాత్ములగు రాక్షసులు కొన్నిదినము లిచ్చట నున్నచో మమ్ముఁ జంపఁబూనుదురు. కావున మే మిప్పుడే యీ యాశ్రమముఁ బాసి యన్యస్థలములకుఁ బోఁగోరుచున్నాము. ఇచ్చటికి బహుదూరమున కందమూలఫలసమృద్ధిగల యొక పురాతన వనమున్నది. అచ్చటికి నేను ఋషిసమూహములతోఁ గూడఁ బోయెదను. ఖరుఁడు నీ విషయమునఁగూడ నిట్లే ప్రవర్తించును. నీకిష్ట మున్నయెడ, నీవును మాతోఁ గూడ రమ్ము. రాఘవా! నీ వెంత సామర్థ్యముగలిగి జాగ్రత్తతో నున్నను, భార్యతో నీ విచట నుండుట దుఃఖమునకు హేతువుగాఁగలదు" అని చెప్పెను. ఇట్లు పలుకుచుఁ, బ్రయాణమునకు సిద్ధుఁడై యున్న కులపతియగు మునీంద్రునికి బదులు మాట చెప్పి పోకుండ నిలుపఁజాలకపోయెను. అంత కులపతియగు మునీశ్వరుఁడు రాముని గారవించి, వీడ్కొని, తన విరహమునకై దిగులుపడవలదని యూరడించి యయ్యాశ్రమము విడిచి పోయెను. రాముఁడు కులపతికిని, ఋషిగణములకును మ్రొక్కి, వనము విడిచి వారు పోవునపుడు వారిని దారి సాగనంపుటకై కొంత దవ్వు వెంబడించి, మిక్కిలి సంతుష్టులయిన యా ఋషుల యనుమతివడసి, యనేక నీతులను వారివలనఁ దెలిసికొని, మఱలి తన యాకుటింటికి వచ్చి చేరెను. ఆ యాశ్రమముననుండిన ఋషులు రామునియందు ఋషులకుండవలసిన గుణము లుండుటచే నతనియెడఁ బ్రేమగలిగి యా రాముననుసరించి యున్నందున, రాముఁ డా వనమును ఋషివిరహితమైనను వేగిరముగా విడిచిపోవుటకు మనమునఁ దలపఁ డాయెను.

## 117-వ సర్గము.

### రాముఁ డత్రిమునీంద్రుని యాశ్రమము చేరుట

అంత మును లందఱు వనాంతరములకుఁ బోఁగానే రాముఁడును భహుదూర మాలోచించి, "ఇచ్చటికి భరతుఁడును, నా తల్లులును,

పట్టణవాసులగు జను లందఱు నేతెంచిరి. ఇచ్చట నున్నయెడల నా మన మున కదే జ్ఞాపకము వచ్చుచుండును. వారి కలవరము నన్నెల్లప్పుడు బహు దుఃఖమున ముంచుచుండును. అదికాక, మహాత్ముఁడగు భరతుని సేన లిచ్చట గుడారములు వేయుటచేతను, గజములయు నేనుఁగు లయు లద్దులచేతను తపోవనమంతయు నపరిశుద్ధమైయున్నది. కావున, మఱొక్క యాశ్రమునకుఁ బోవుదము" అని పెక్కు కారణములచే నచ్చటనుండుట కిష్టపడక సీతను, లక్ష్మణుని దోడ్కొని పయనమై యత్రి మహాముని యాశ్రమము సొచ్చి, త్రికాలజ్ఞుఁడగు నత్రిమహామునికి మ్రొక్కెను. అత్రిమునియు రామునిఁ బుత్రునివలె దగ్గఱకుఁ జేరఁదీసి, తా మా రాముని కతిథి సత్కారము నంతయు బాగుగాఁ గావించి, వెంటనే సీతను లక్ష్మణుని బ్రియవచనములచే గారవించెను. ఆసమయమున నచ్చటికి లోపలినుండి యనసూయాదేవి యేతెంచెను. సర్వభూతదయ గల యత్రిమునీంద్రుఁడా పూజ్యురాలయిన ముదుసలియగు తనపత్ని ననసూయను బిలిచి, సీతారామలక్ష్మణులను జూపెను. అంతట మునిపుంగవుండు సీతం గూర్చి, ఓ కల్యాణీ! యీ యనసూయ మహామహిమగలది; తపస్సు చేయు శీలముగలది; స్వధర్మముఁ దప్పక నడచునది కావున నీమెకు నమస్కృతు లొనరింపుము" అని సీతతోఁ జెప్పి, రాముని నుద్దేశించి, యో పాపరహితుఁడా! పూర్వ మొక్కప్పుడు పదియేం డ్లెడతెగక వానగురియక క్షామము సంభవింపఁగా, నీ యనసూయ ఋషులకెల్లఁ గందమూలఫలములఁ గల్పించియిచ్చినది. గంగానది పాఱునట్లు చేసినది. పదివేలయేండ్లు పెక్కు నియమములు పూని యోర్వరాని తపస్సుచేసినది; కృచ్ఛ్రి చాంద్రాయణాది వ్రతము లొనర్చి దీక్షలుపట్టి, కడపట నవభృథ స్నానమొనర్చినట్టిది; తపోవిఘ్నములను బోఁగొట్టినది. మఱియు నొక ప్పుడు దేవతలకార్యమునిమిత్తము పదిరాత్రు లొక్కరాత్రిగాఁ జేసి నది. ఇట్టి మహాత్మురాలగు ననసూయ నీకుఁ దల్లివంటిది. ఆమెను బూజిం పుము. ఓ రామా! యీ యనసూయ తన శాంత్యాది గుణములచేత ననసూయ యని సార్థకనామము వహించినది. ఈమెకుఁ గోఫ మను

మాటయే లేదు. సర్వభూతములచే నమస్కరింపఁదగినదియుఁ, గీర్తి మతియు, వృద్ధురాలునగు నీ యనసూయకుఁ బూజసేయుమని సీత కానతిమ్ము" అని చెప్పెను. అంత రాఘవుఁ డట్లేయని యత్రిమునితోఁ జెప్పి, ధర్మములనెల్ల నెఱిఁగిన సీతనుగూర్చి, "రాజపుత్రీ! ఈ ఋషిశ్రేష్ఠుఁడు చెప్పిన పలుకులు వింటివిగదా! మన శ్రేయస్సుకై తపస్వినియగు అనసూయకడకు వేగ నేఁగి వందనము లాచరింపుము" అనెను. మైథిలియు శ్రేయస్సుఁగోరి, చెప్పిన రామునిమాట విని, ధర్మముల నెఱిఁగిన యనసూయకుఁ బ్రదక్షిణము గావించి, మాంసాదులు శోషించుటచే ముడుతలుపడుచున్న యొడలును, ముదిమిచేఁ దెల్లనైన శిరోజములును గలదియు, సుడిగాలియందలి యరఁటిచెట్టువోలె నెల్లప్పుడు వణఁకుచున్న మేనితోఁ గూడినదియు, మహిమగలదియుఁ, బతివ్రతయునైన యనసూయకుఁ దన గోత్రప్రవరలు చెప్పుచు నభివాదము చేసెను. అట్లు విదేహరాజపుత్రి దోషరహితురాలయిన యా యనసూయకు మ్రొక్కి, మక్కువతోఁ జేతులు జోడించుకొని, యా మహాదేవిని క్షేమమడిగెను. అంతట ననసూయ ధర్మమార్గమున నడచునదియు, సౌందర్యవతియునగు సీతను జేరఁ దీసి బుజ్జగించుచు "ఓ భామినీ! నీవు ధర్మమును జక్కఁగా నడపుచుందువుగదా! నీవు బంధువులను, సంపదను, గౌరవమును విడిచి యడవులకుఁ బలాత్కారముగా నెట్టఁబడిన రాముని వెంబడించి వచ్చితివిగదా! నీ యదృష్టమే మనవచ్చును! నగరమున నుండినను, అడవిలో నున్నను, చెడ్డవాఁడైనను, మంచివాఁడైనను భర్తనే యే స్త్రీలు ప్రియునిగా నెంచెదరో, వారివే స్వర్గాదిపుణ్యలోకములు. దుష్టస్వభావుఁడైనను, స్వేచ్ఛాప్రకారము నడచుకొనువాఁడైనను, దరిద్రుఁడైనను భర్తనే గొప్పనడత గలస్త్రీలు ముఖ్యదైవమునుగాఁ దలంతురు. ఓ సీతా! నేను సర్వవిధముల నాలోచించితిని, శ్రద్ధతోఁ జేయఁబడిన నాశరహితమగు తపస్సువలె బంధువు లందఱికంటెఁ బెనిమిటి ప్రాణబంధువనియు, నతఁడే స్త్రీలకు రక్షకుఁడనియు నెంచెదను. కొందఱు స్త్రీలు గుణదోషములు పరిగణింపక, మన్మథుని బారికి లోఁబడినవారలై, విటులను వెదకుచుఁ దిరుగుచుందురు, వారి కీ ధర్మసూక్ష్మత తెలియదు.

మైథిలీ, యెవ రట్టి యకార్యములలోఁ జొచ్చి, ధర్మాధర్మపరిజ్ఞానము లేకయున్నారో, వా రిహలోకమున నపకీర్తిని బరలోకమున నధోగతినిఁ బొందుచున్నారు. ఓ సీతా! నీవంటిస్త్రీలు సుగుణవతులై, లోకములోని మంచి చెడ్డలను బరికించి, మంచి ననుసరించినవారలై, ధర్మశ్రద్ధగలవారి చాడ్పుననే స్వర్గలోకమున సంచరింపఁగలుగుదురు. కావున, ఓ సీతా! నీవును పతివ్రతవై పతివ్రతాధర్మముల నవలంబించి, యివ్విధమున నీ ప్రియు నెడఁబాయక, పెనిమిటిచేయు పనులలోఁ బాలుపుచ్చుకొనుచు నుంటివేని, యిహమునఁ గీర్తిని, పరమునఁ బుణ్యలోకములను బొందఁ గల"వని చెప్పెను.

## 118-వ సర్గము

### అనసూయాదేవి సీతకు శాశ్వతాలంకారము నొసఁగుట

సీత యసూయలేని యా యనసూయ చెప్పిన పలుకులు విని, యా పలుకులను గౌరవించి, మెల్లగా నిట్లనెను. "ఓ తల్లీ! తమ రిప్పుడు నాకుఁజెప్పినది యేదియు నొక క్రొత్తవిషయముగాదు. మగువకు మగఁడే దైవమని నే నెఱిఁగియున్నాను. భర్త దురాచారుఁడయినను భార్య యతనియెడఁ గృత్రిమబుద్ధితో నుండఁజనదు. అట్టి మగనివిషయములోనే యట్లుండవలసినప్పుడు, కొనియాడఁదగినగుణములు గలవాఁడు, దయాళువు, పరస్త్రీముఖదర్శనము చేయనివాఁడు, తిరమగు ప్రేమగలవాఁడు, తల్లిదండ్రులమాడ్కిఁ బ్రియుఁడునైన ధర్మాత్ముఁడగు మగనివిషయమున నెట్లుండవలెనో యది చెప్పవలయునా? మహాబలుఁడగు రాముఁడు కౌసల్యయం దెట్లో, యట్లే యితరరాజకాంతలందును, తక్కిన స్త్రీలయెడలను మాతృభక్తి గలిగియున్నవాఁడు. ధర్మవేత్తయుఁ, బితృభక్తిగలవాఁడునగు రాముఁడు తనతండ్రి యనురాగముతో నొక్కతూరి చూచిన స్త్రీలను సైతము తన తల్లులనుగానెంచి, అభిమానము మాని, వారికి శుశ్రూషలు సల్పుచుండును. అట్టి నా ప్రియుని విషయమున నే నెట్లుండవలయునో తమరే చెప్పుఁడు! భయంకరమయి, నిర్మానుష్యమగు కాననమునకు వచ్చునప్పుడు మా యత్త యెన్నియో పాతివ్రత్యధర్మములను నీతులను గఱపినది. ఆమె చెప్పిన మాటల నన్నిటిని

మనమున నుంచుకొంటిని. వివాహసమయమున మాతల్లి యగ్ని యెదుట నేమేమి చెప్పినదో యదియెల్ల నేను మనమున ధరించితిని. ధర్మములు నడచుకొనుమహాత్ములారా! యిప్పుడు తమరుచెప్పిన మాటలచే నాయుపదేశములెల్లఁ శ్రోత్రగాఁ జేయఁబడినవానివలె నొప్పుచున్నవి. ఆఁడుదానికిఁ బతిశుశ్రూషకన్న వేఱుతపస్సులేదు. సావిత్రి భర్తృశుశ్రూషవలననే స్వర్గలోకము నొందెను. అట్టి నడతగల తమరును భర్తృశుశ్రూషచే దివము నొందఁగలరు. స్త్రీలందఱిలోపల శ్రేష్ఠురాలగు రోహిణీదేవియుఁ జంద్రు నెడఁబాసి యొక్కనిముసమైన నుండదుగదా! ఇట్టినడతగల స్త్రీలెందఱో భర్తృశుశ్రూషయే ప్రధానముగాఁజేసి, తమ పుణ్యకర్మఫలముగా దేవలోకమున విహరించుచున్నారు" అని సీత చెప్పెను. అంతట ననసూయాదేవి సీతమాటలను విని, మిక్కిలి యుప్పొంగినదై, సీతను శిరమున మూర్కొని, యామె కానంద మెసఁగఁ జేయుచు "చిఱునవ్వుమోముదానా! నేను వ్రతోపవాసాదులంజేసి, సంపాదించిన తపస్సు విస్తారముగానున్నది. మైథిలీ యీమాటలు నీకుఁ దగినవిగాను మనోహరముగా నున్నవి. నీ మాటలువిని యానంద మొందితిని. నీ వడిగినది యిచ్చెదను కోరు"మని యనఁగా, సీత యనసూయ మాటలు విని, యాశ్చర్యమొంది చిఱునవ్వు నవ్వుచుఁ, దపోబలముతోఁ గూడిన యనసూయం జూచి "యన్నియుఁ జేసితిరి" యని చెప్పెను. అంత ధర్మజ్ఞురాలగు ననసూయాదేవి సీతపలుకులు విని మిక్కిలి ప్రీతి నొంది, "ఓ సీతా! నా సంతోషము సార్థకమగునట్లు నీ కెద్దియైనఁ జేసెదను. ఈ దివ్యమగు పుష్పమాలికను, వస్త్రమును, సొమ్ములను, మైపూఁతను, శ్రేష్ఠమైన పరిమళగంధమును నొసఁగెదను. కైకొనుము. నే నొసఁగెడి యీ పుష్పమాలికాద్యలంకార ద్రవ్యములు నీ యంగములను శోభిల్లఁజేయును. ఈ యలంకార మెప్పటికిని దఱుగక యెప్పుడిదే తీరున నుండును. ఇది నీకుఁ దగియుండును. ఈ పుష్పమాలికలు వాడవు. ఈ మైపూఁత మాయదు. ఈ గంధముయొక్క సువాసన తగ్గదు. ఈ తొడవు లెప్పుడు నిగనిగ మెఱయుచుండును. జానకీ! ఈ మేటి మైపూఁత పూసికొని, లక్ష్మీదేవి యవ్యయుండగు విష్ణువునుంబోలె

నీవును నీ భర్తను సంతోషపెట్టఁగలవు" అని చెప్పఁగా, సీతయు, నన
సూయ ప్రీతితో నొసఁగిన యలంకారద్రవ్యములను గైకొని, చేతులు
జోడించికొని, తపోధనయైన యనసూయను గొల్చుచుండెను. అట్లు
సవినయముగఁ దన్నుఁ గొల్చుచుండు సీతను జూచి, దృఢనియమముగల
యనసూయ "ఓసీతా! కీర్తిమంతుఁడయిన యీ రాముఁడు నిన్ను
స్వయంవరమునఁ బడసె ననఁగా, నేను వినియున్నాను. ఆ స్వయంవర
వృత్తాంతము జరిగినది జరిగినట్లుగా నాకు విస్తరించి చెప్పు మనవుడు,
సీతయు ధర్మరతయైన యనసూయతో "ఆ కథను విస్తరించి చెప్పెద
నాలకింపు" మని యిట్లనియె. "ధర్మముల నెఱిఁగినవాఁడును, శూరుఁడు
నైన మిథిలానాయకుఁడగు జనకనృపాలుఁడు క్షత్రియధర్మమునందు
శ్రద్ధగలిగి, న్యాయమార్గముతోఁ బుడమి నేలుచుండెను. అతఁడు
యజ్ఞముఁ జేయ నుద్దేశించి, యజ్ఞశాలార్థము నాగేటిని చేతఁ బట్టి పుడ
మిని దున్నుచుండఁగా, నేను భూమిని బెకలించికొని పుట్టి యీ జనక
మహారాజునకుఁ గూఁతురనైతిని. ఆ జనకనృపాలుఁడు పిడికిటితో నోష
ధులను జల్లుచుండగా, దుమ్ముతోఁగూడిన యన్ని యంగములుగల
నన్నుఁజూచి, యాశ్చర్యపడి, తాను బిడ్డలు లేని మోహముచేత నన్నుఁ
దనతొడపైఁ గూర్చుండఁబెట్టికొని, "యీ బిడ్డ నా కూఁతు"రని చెప్పి
యది మొదలు నాయెడ మిగుల వాత్సల్యము గలిగియుండెను. అశరీర
వాణి "ఓ నృపాలా! నీవు తలఁచినట్లే యిది యగును. నీ కిది ధర్మముచేతఁ
గూఁతురే". యన్నట్లు వినఁబడెను. అంతట పుణ్యకార్యములు చేయు
వాఁడును, నన్నుఁబడసినపిదప ధర్మాత్ముఁడును, మిథిలానాయకుఁడును
నైన నాతండ్రియగు జనకనృపాలునిసంపదలు మిగులఁ బెంపొందినవి.
ఆయన నన్ను మహానందముతోఁ దన పట్టపుదేవికిఁ దెచ్చియిచ్చెను.
ఆ దేవియు నన్నుఁ దల్లివలెనే యనురాగముచేఁ బెంచెను. నాకుఁ
బ్రాయము వచ్చి పెండ్లి కీడయినతర్వాత నాతండ్రి, సొమ్ము పోఁగొట్టు
కొన్న దరిద్రునివలెఁ దన మనమున నిట్లు చింతింపఁదొడఁగెను. లోక
మున నాఁడుబిడ్డలఁగన్నవాఁడు దేవేంద్రునివంటివాఁడయ్యు, సరి
వారిలోఁ దక్కువవారిలోఁగూడ నవమానము నొందును. నే నెవ్వరి

కీ కన్యనిత్తును? ఎవ్వఁ డీనకన్యకుఁ దగినవాఁడు?" అని యెంతదూర మాలో
చించియు నీకమీఁద బంధువులవలన రాఁబోవు నవమానమును దలఁచి,
చింతాసముద్రమున మునిఁగి, తెప్పలేనివాఁడు సముద్రము దాఁటఁ
జాలనట్టు లాచింతాసముద్రపు దరి నొందఁజాలక, యయోనిజయగు
నన్నెవరి కిచ్చుటకు మనమున నిర్ణయింపఁజాలఁడయ్యెను. అట్లు జనక
నృపాలుఁడు చింతించి చింతించి యెట్టకేలకు నిశ్చయించి, "నా కూఁతురికి
స్వయంవరముచేసెదను" అనునిశ్చయమునకు వచ్చెను. మహాయజ్ఞమున
దేవతలప్రేరణవలన వరుణభగవంతుఁడు శ్రేష్ఠమైనధనుస్సును, తఱుఁగని
బాణములుగల యమ్ములపొదులను మాతండ్రికిఁ బ్రీతితో నొసఁగెను.
ఆధనుస్సు మిక్కిలి బరువైనది గనుక మానవులలో నెవ్వరును దానిని
గదలింపఁజాలరు. నృపాలురు గలలోనైనను దానిని వంపఁజాలరు.
మాతండ్రి యాస్వయంవరమునకు వచ్చిన రాజుల నందఱను జూచి,
"యెవఁ డీ ధనుస్సువంచి యెక్కుపెట్టునో, వానికి నా కన్య నిత్తు"నని
ప్రతిజ్ఞ సేసెను. స్వయంవరమునకు వచ్చిన రాజులందఱు పర్వతము
వలె బరువుగనున్న యావింటిని జూచి, దానిని గదలింపనుగూడ
శక్తిలేక, నమస్కరించి, "యయ్యో యీపని మావలనఁగా" దనుచు
వెడలిపోయిరి. పిదప నెంతయో కాలమునకు రఘువంశోద్భవుఁడును
పరాక్రమశాలియునైన రాముఁడు లక్ష్మణసమేతుఁడై విశ్వామిత్ర
మునీంద్రునితోడ మా తండ్రి చేయు యజ్ఞమున కేతెంచెను. విశ్వా
మిత్రమునీంద్రుఁడు మా తండ్రివలన నతిథిసత్కారము వడసి, యన్న
దమ్ములగు రామలక్ష్మణులను, మాతండ్రికిఁ జూపించి, "వీరు, దశరథుని
పుత్రులు. ధనుస్సును జూడఁగోరి వచ్చిరి, రామునకా దివ్య ధనుస్సును
జూపు"మని చెప్పఁగా, మాతండ్రి రామునకు శ్రేష్ఠమగు ధనుస్సును
జూపెను. వీర్యవంతుఁడైన రాఘవుఁడు నిమిషమాత్రములోపల నా విల్లు
వంచి నారి కట్టి, యెక్కువెట్టెను. అట్లెక్కుపెట్టుచుండ నాధనుస్సు
రెండు తునుకలుగా విఱిగినది. అప్పుడు పిడుగు పుడమిపైఁబడ్డప్పుడు
వలె గొప్పధ్వని గలిగెను. అంతఁ బ్రతిజ్ఞ తప్పనివాఁడగు నాతండ్రి
జలపూర్ణపాత్రమునుబట్టి రామునికి నన్నీయ నిశ్చయించెను.

అట్లు మాతండ్రి నన్నిచ్చుటకుఁగాఁ, దండ్రి యానతి లేకయే నే నీకన్యకను గ్రహింపనని రాముఁడు చెప్పెను. అంతట మాతండ్రి వృద్ధుఁడయిన దశరథనరేంద్రునిఁ బిలిపించి, పరతత్త్వము నెఱిఁగిన రామునికి నన్నిచ్చి పెండ్లిచేసెను. సౌందర్యవతియగు మాచెల్లెలిని నూర్మిళను లక్ష్మణుని కొసఁగెను. ఈ ప్రకారము స్వయంవరమున వీర్యవంతులలో నుత్తముఁడగు రామునిఁ బెండ్లాడి, పతివ్రతనై, భర్తయందుఁ బ్రేమ గలిగియున్నాను" అని సీతాదేవి యనసూయకుఁ దన స్వయంవర వృత్తాంతమును వినిపించెను.

## 119-వ సర్గము.

### రామాదులు దండకారణ్యము సొచ్చుట

ధర్మములనెల్ల నెఱిఁగినదియగునట్టి యనసూయ సీత సెప్పిన గొప్ప కథను విని, యామె సీతను రెండుచేతులతోను గట్టిగాఁ గౌఁగిలించి, శిరసున మూర్కొని, "ఓ సీతా! స్పష్టాక్షరములైన మాటలతో విన నింపుగాఁ జెప్పిన చిత్రమయిన నీ స్వయంవరవృత్తాంతమునంతయుఁ జక్కఁగా వింటిని. శ్రావ్యముగా మాటాడుదానా! నీ కథ నా మనమునకు సంతసము గలిగించుచున్నది. సూర్యుఁడు గ్రుంకుచున్నవాఁడు. రాత్రియు వచ్చినది. పగలెల్లఁ దమయొరకై తిరుగుచుండి, సాయంకాలమయినంతనే తమ గూండ్లకు విశ్రమింపవచ్చిన పక్షులు నిద్రకొఱకు చేసెడి యవ్యక్తమధురములగు కలకలధ్వనులు వినఁబడుచున్నవి. ఈ మునులందఱు నదులందు సాయంకాల స్నానముసేసి, తడిసిన నారబట్టలఁ గట్టుకొని, జలపూరిత పాత్రములు చేతఁబట్టుకొని, గుంపులు గుంపులుగాఁగూడి వచ్చుచున్నారు. ఋషులు సాయంకాలమున శాస్త్రవత్తుగా వేల్చిన యగ్నిహోత్రములనుండి గాలిచే లేచిన పావురపు దేహముచాయవంటి చాయగల హోమధూమము చూపట్టుచున్నది. పలుచని యాకులుగల చిన్నచెట్లు గుబురుగాఁ జేరియున్నవి. బట్టబయలునఁగూడ దిక్కులు దెలియకున్నవి. రాత్రిచరములగు ప్రాణులు వనమునందంతటను దిరుగుచున్నవి. ఆశ్రమమృగములు వెన్నెలందుఁ బరుండుచున్నవి. రాత్రియు నక్షత్రములచే సొప్పారుచున్నది. చంద్రుఁడు

చదలునం దుదయించి, వెన్నెలలం జిమ్ముచు వెలుఁగుచున్నాఁడు. నే ననుజ్ఞ యిచ్చెదను. ఇఁక లేచిపొమ్ము. రామునితోఁగూడ నుండుము. నీ సొంపయిన మాటల కానంద మొందితి. మైథిలీ! నా యెదుటనే యలంకారము చేసికొని, దివ్యాలంకారభూషితురాలవై, నాకుఁ బ్రీతిని గలిగింపుము” అని చెప్పెను. దేవకుమారినింబోలిన సీత యాప్రకార మలంకరించికొని, యామెకు సాష్టాంగ ప్రణామము లాచరించి, రాము నొద్దకుఁబోయెను. వక్తలలో శ్రేష్ఠుఁడయిన రాముఁ డట్లలంకారముచే శోభిల్లుచున్న సీతనుజూచి యనసూయ ప్రీతిపూర్వముగా నొసఁగిన వరమును విని మిక్కిలి యానంద మొందెను. మిథిలరాజకన్యకయగు సీత యనసూయ తనకుఁ బ్రేమతో నొసఁగిన వస్త్రాభరణాదులను జూపి వరదానము మొదలగు సర్వవృత్తాంతమును దెలిపెను. మానవులకు దుర్లభమైన సీతయొక్క సత్కారమును జూచి రాముఁడును, మహారథుఁడగు లక్ష్మణుఁడును పట్టరాని సంతోషము నొందిరి. అంతటఁ బున్నమచందురునిఁ బోలు మోముగలవాఁడయిన రఘునందనుఁడు తపస్సిద్ధిగల యా మునులు చేసెడి యాతిథ్యము గైకొని పావనమైన యా రాత్రి యచ్చటఁ బుచ్చెను. మఱునాటి యుదయమున నరశ్రేష్ఠులగు రామలక్ష్మణు లిరువురును లేచి, నిత్యకృత్యములు దీర్చికొని, యా వనము నందుండెడి మునులఁ జూచి, “మాకు సెలవిండు. మే మితరవనములకుఁ బోయెదము” అని యడుగఁగా, వనమునఁ బుణ్యకార్యములు సేయుచున్న మునులందఱు వారితోఁ దమ యాశ్రమమున రాక్షసులు చేసెడి యుపద్రవములఁ జెప్పఁబూని, “ఓ రాజపుత్రులారా! పలుతెఱఁగులగు రూపములు దాల్చినవారయి, మనుష్యులను దినెడి రక్కసిమూకయును, రక్తముఁ గ్రోలెడి దుష్టమృగములును ఈ మహారణ్యమున నున్నవి. రాఘవా! మునులు మైలపడినప్పుడును, ఏమఱుపాటుతో నున్నప్పుడును వారి నీడ్చికొని తినుచున్నవి. ఇట్లు మమ్ము బాధించుచుండు వానిని వధింపుము. ఇది యిక్కడిఋషులు పండ్లుకోసికొని వచ్చెడు మార్గము. ఈ దారినిబోయి యెవ్వరికిఁ జొరఁ నలవికాని వనముఁ జొచ్చుట మంచిది” ఇట్లని చేతులు జోడించి చెప్పి, దీవనలు సల్పినవార

శైరి: అంత రాముఁడు వారిదీవనలఁ గైకొని, సీతాలక్ష్మణుల వెంటఁ దీసికొని, సూర్యుఁడు మేఘమండలమును జొచ్చినచందమున దండకారణ్యమును బ్రవేశించెను.

శ్రీమద్వాల్మీకిరామాయణమున నయోధ్యాకాండము సమాప్తము.

శ్లో. కాండం ద్వితీయం శృణ్వాత్ యః ప్రోక్తేన నియమేనతు,
సోఽగ్నిసాయుజ్య మాప్నోతి పఠనాద్వాపి శాస్త్రతః.

బ్రహ్మాండపురాణము. 147-వ అధ్యాయము.

తా. ఎవఁడు రామాయణమున రెండవదగు అయోధ్యాకాండమును శాస్త్రోక్త నియమముతోఁ బఠించుచున్నాఁడో, లేక వినుచున్నాఁడో, వాఁ డగ్నిలోకమును బొందును.



చెన్నపురి : 'చంద్రికా' ప్రెస్సున ముద్రితము—1958.

# ఆంధ్ర వచన గ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకే సంపుటము | 9 | 0 |
| డిటో మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము:— | | |
| ,, ఆదిసభాపర్వములు | 5 | 0 |
| ,, అరణ్యపర్వము | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | 5 | 8 |
| ,, శాంతిపర్వము | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణ పర్వము వరకు కలసంపుటము | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, బాలకాండము | 2 | 8 |
| అయోధ్యాకాండము | 5 | 0 |
| అరణ్యకాండము | 2 | 8 |
| కిష్కింధాకాండము | 2 | 8 |
| సుందరకాండము | 3 | 0 |
| యుద్ధకాండము | 7 | 8 |
| ఉత్తరకాండము | 3 | 8 |
| శ్రీ తిలకుగారి సెక్యూరిటీకేసు ఉపన్యాసములు | 0 | 14 |
| భారతరమణీమణులు, 1 భాగము | 1 | 4 |
| డిటో 2 భాగము | 0 | 10 |
| డిటో 3 భాగము | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| నీతిచంద్రిక, శ్రీ చిన్నయసూరిది | 0 | 12 |
| ,, టీకతో | 1 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| పంచతంత్రము, వచనము | 0 | 12 |
| సంగ్రహరామాయణము | 1 | 8 |
| పతివ్రతలచరిత్రలు | 3 | 0 |
| భోజునికథలు | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I-భాగము | 1 | 4 |
| II-భాగము | 1 | 4 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 8 |
| డిటో A. S. P. అయ్యరు | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు | 2 | 0 |
| చార్ దర్వేషుకథలు | 0 | 8 |
| తాతాచార్యులకథలు | 0 | 12 |
| బేతాళునికథలు | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 8 |
| పురాణగాథలు I | 1 | 0 |
| ,, II | 1 | 0 |
| బాజీరాయునిచరిత్ర | 1 | 4 |
| రఘువంశకథ | 0 | 10 |
| విక్రమార్కచరిత్ర, శ్రీ భా. రామమూర్తిశాస్త్రి | 1 | 8 |
| ఈసబునీతికథలు, 1-వ భాగము(అచ్చు) | | |
| డిటో 2-వ భాగము | 1 | 0 |
| పంజాబు అల్లరి, శ్రీ మాలవ్యా | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | 0 | 3 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | 0 | 2 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్రము | 0 | 12 |
| ద్వాదశోపనిషత్తులు తెలుగువచనము | 5 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి-1.